# కాశీ మజిలీ కథలు

**5 & 6వ భాగములు**

(ఒకే సంపుటముగా)

ఇది గోదావరీ తీరస్థితంబగు
రాజమహేంద్రవరంబున నివసించియున్న

## బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితకవిచే

రచించబడినది

సరళ సుందర వచనం

**శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం**

© 2473444

## రోహిణి పబ్లికేషన్స్

పాత కూరగాయల మార్కెట్
మెయిన్‌రోడ్, రాజమండ్రి – 533 101

# కాశీ మజిలీ కథలు

బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితకవి

శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం





ప్రథమ ముద్రణ :

జనవరి, 2005

"పురుషులలో
పుణ్యపురుషులు వేరయా"
అన్నట్లే పుస్తకాలలో కూడా
పుణ్యం - పురుషార్థం కలిగించే
పుస్తకాలు వేరే వుంటాయి.
అటువంటి పుస్తకాల ప్రచురణే
ధ్యేయంగా నడుస్తున్న సంస్థ
మా
రోహిణి పబ్లికేషన్స్

సాధారణ ప్రతి
రూ : 125/-

లైబ్రరీ ప్రతి
రూ: 200/-



ప్రకాశకులు :

**రోహిణి పబ్లికేషన్స్**
మెయిన్‌రోడ్, రాజమండ్రి - 1

ముద్రణ: స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ-3. ఫోన్స్: 2578211, 2572832

# నాటిక - నేడు

**శ్రీ మధిర సుబ్బన్న దీక్షిత కవి** విరచిత **"కాశీమజిలీ కథలు"** చదవని పాఠకులు అరుదుగా వుంటారు. వ్యాకరణ సమ్మతమైన పద్ధతిలో, భావపూర్ణంగా, పఠితలకు పఠనోత్సాహం కలగచేసేటట్లు, పూర్తిగా చదివిన తర్వాత వెంటనే మర్చిపోకుండా గుర్తుండేలా వ్రాయగల సమర్ధుడు శ్రీ సుబ్బన్న దీక్షితులు. ఆనాటి **కాశీమజిలీ కథల** సంపుటాల్లో రచయిత కధాకథన శైలినీ, వ్యాకరణాలంకారశాస్త్ర పాండిత్యాన్నీ కొనియాడుతూ, వాగ్దేవీ నందనులైన శ్రీశ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, శతావధాని శ్రీచెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, శ్రీ మానవల్లి రామకృష్ణ కవి తమ తమ అమూల్య అభిప్రాయాలను తెలియజేసారు.

ఆ రోజుల్లో కావ్య భాషలో రచన చెయ్యగలిగిన వారికే కవిశబ్ద గౌరవం. ఆ విధంగా సంఘంలో కవిగా గౌరవింపబడాలంటే రచయిత తప్పనిసరిగా శబ్దగాంభీర్యాన్ని ఆశ్రయించవలసి వచ్చేది. తత్కారణంగా ఎంత సామాన్యమైన కథని వ్రాయాలన్నా గ్రాంధికాంధ్రాన్ని ఆశ్రయించే వాళ్ళు ఆనాటి రచయితలు.

కాని రోజులు మారాయి, కాలంమారింది, సంఘంపట్ల రచయితల అభిప్రాయం మారింది. ఇప్పుడు అందరు రచయితలూ వాడుక భాషలోనే తమ భావాల్ని వ్యక్త పరుస్తున్నారు. అయితే రచన ఎల్లప్పుడూ అలోచనామృతమేకాని సంగీతంలా ఆపాతమధురం కాదు. రచన మాటల్లో వుండదు. మాటల కూర్పులోనే వుంటుంది అంటారు పేరుమోసిన రచయితలు.

అరటిపండుని సులువుగా నోట్లో వేసుకోవచ్చు. కాని పనసతొనని సాధించుకోవడంలో ఎంతో శ్రమ వుంది. ఇంకా ఆధునికంగా చెప్పాలంటే - పాతకాలంనాటి మోటు నగల్ని చెరిపించి, నాజూకైన నగల్ని చేయించుకున్నట్లే మేంకూడా **కాశీమజిలీ కథల్ని** నేటి కాలపు వాడుక భాషలోనికి పరివర్తన చేసి పెట్టమని **శ్రీఇచ్ఛాపురపు రామచంద్రం** గారిని కోరాం. వారుకూడా ఎంతో ఉత్సాహంగా మా ప్రతిపాదనని అంగీకరించారు. వెనువెంటనే కార్యరంగంలోకిదూకారు. తత్ఫలితమే వాడుక భాషలో **"కాశీమజిలీ కథలు"** మీ ముందుకు వచ్చి నిల్చాయి. మీరు ఏమాత్రం శ్రమపడకుండా ఈ **"కాశీమజిలీ కథల్ని"** అరటి పండు తిన్నంత సులువుగా చదువుకుంటూ సాగిపోతారు.

మహాకవి కాళిదాసు కావ్యాలకు సంజీవనీ..వ్యాఖ్యనం వ్రాసిన మల్లినాథసూరి అంటారు - **"నా మూలం లిఖ్యతేకించిత్త"** ని. తత్సమానంగానే శ్రీ రామచంద్రంగారు కూడా! ఏది ఎలా వున్నా ఏకదేశ వికృత న్యాయాన్ని అనుసరించి ఆనాటి **కాశీమజిలీ కథలే** నేటి ఈ **కాశీమజిలీ కథలు**. రసజ్ఞ పాఠకులైన మీరు మా శ్రమకు పట్టెవర్ధనాలు దిద్దుతారనే మా విశ్వాసమూ, ఆకాంక్షా.

ప్రకాశకులు.

# కథల వెనుక కథ

మిత్రులూ, రోహిణి పబ్లికేషన్స్ అధినేతా, శ్రీ అప్పారావు గారు మధిర సుబ్బన్న దీక్షితకవి విరచిత కాశీ మజిలీ కథలకు నేటి పాఠకులకు తేలికగా అర్థమయ్యే రూపం ఇవ్వవలసిన గురుతర బాధ్యతని నామీద ఉంచినప్పుడు నేను కొంచెం భయపడ్డాను. ఎందుకంటే-స్వతంత్రంగా కథో నవలో రాయడం వేరు, సుప్రసిద్ధ రచనని సరళతరం చేసి తిరుగ రాయడం వేరు-కాశీ మజిలీ కథలలాటి ప్రఖ్యాత రచనను ఆధునిక రూపంలోకి మార్చడం-నా బోటివానికి కత్తిమీద సామే.

భాషాపరంగా క్లిష్టం. రాశిపరంగా చాల పెద్దది. పురాణలు, చరిత్ర, భూగోళం, ఖగోళ శాస్త్రం, వేదాంతం... తత్వం, వైరాగ్యం.. శృంగారం,ప్రేమ కామం...భక్తి... ఎన్నిటిని స్పర్శించారో మధిర సుబ్బన్న దీక్షితకవి తమ రచనలో! అద్భుతమైన కల్పన... అమోఘమైన కథా శిల్పం. ఏ దృష్టితో చూసినా "కాశీ మజిలీ కథలు" అనర్ఘరత్నమే. అలాంటి రచనని ప్రస్తుత పాఠకులకు-వేగంగా కథను పరుగెత్తిస్తూ మూలానికి ద్రోహం జరగకుండా తిరిగి రాయగలనా! అని నేను ఆలోచిస్తున్న సమయంలో....

నా రచనల వెనకే నా జీవితంతో పాటే ఉండే నా నిరంతర సన్నిహితులు శ్రీ జి. రంగబాబుగారు "మీరు రాయగలరు. కచ్చితంగా రాయగలరు." అని ఆత్మవిశ్వాసం కలిగించారు.

" మీకు ఏ పుస్తకాలు ఎప్పుడు తెచ్చియిమ్మంటే అప్పుడే తెచ్చియిచ్చేపూచీనాది. గురువుగారూ! కాశీ మజిలీ కథల తిరుగ రాతకి వేగంగా శ్రీకారం చుట్టండి-"అని ధైర్యం చెప్పి తొందర చేశారు శ్రీ యిమ్మిడి శెట్టి చక్రపాణి (లెక్చరర్) గారు.

" మీరు రాయగలరండీ.....రాస్తారు" అని ఎనభై దాటిన శ్రీగణపతిరాజు చంద్ర శేఖరరాజు (అడ్వకేట్) గారు వెన్నుతట్టి ఆశీర్వదించారు. ఒక్కసారి మానాన్న గారూ, తెలుగు పండితులూ -అయిన కీ.శే. ఇచ్ఛాపురపు వైద్యనాధంగారిని ఒక్కమారు తలుచుకున్నాను. అంతే పన్నెండు భాగాలు పన్నెండు నెలలలో తిరిగి రాయగలిగాను.

ఈ గ్రంథమునకు సరళ సుందర వచనముకు సహకరించిన శ్రీ పానుగంటి కృష్ణరావుగారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

వ్రాశాక అర్థమైంది నేనెంత మంచిపనిచేశానో! ఈ కథలు శ్రద్ధగా చదువుతూ రాయడం వలన ఎన్నెన్ని విషయాలు తెలిశాయని! ఎంతగా కథా కథనకౌశలం అర్థమైందని! కల్పనాచాతుర్యం ఎంతగా చూడగలిగానని !

అంతే కాదు. నాపట్టుదలమీదా, ఓపిక మీదా నాకు విశ్వాసం కలిగించింది ఈ ప్రక్రియ. ఇతరుల రచనలను కూడా నేటి పరితలకు అనుకూలంగాను మార్చగలనని నమ్మకం కలిగించిందీ మహత్తర కార్యం. ఈ రచన వెనుక ఎందరో మహానుభావులున్నారు అందరికీ నా మన: పూర్వక కృతజ్ఞతలు.

ఇట్లు

ఇచ్ఛాపురపు రామచంద్రరావు

# కాశీ మజిలీ కథలు





ఐదవ భాగము

# విషయ సూచిక

## 44 వ మజిలీ నుండి - 52 వ మజిలీ వరకు

ఆరవ భాగము

# విషయ సూచిక

## 53 వ మజిలీ నుండి - 93 వ మజిలీ వరకు

# కాశీ మజిలీ కథలు

## 44. వ మజిలీ

## 5. వ భాగం

### శ్రీ శంకరాచార్య చరిత్రము

క. స్త్రీ విద్యా తీర్థా కా
రావిర్భూతుం బరాత్మ నాత్మం బ్రణతుల్
గావింతు శంకరగురు
శ్రీవిజయము గురుకటాక్షసిద్ధివహింపన్.

మణిసిద్ధుడు, గోపాలుడు మజిలీ చేరారు. కాలకృత్యాలు తీర్చుకునే సరికి – చిదానంద యోగి మణిసిద్ధుడిని చూద్దామని వచ్చాడు. తాను శంకరాచార్య చరిత్రం రచించాలను కుంటున్నాననీ ఆ కథాక్రమ మేమిటనీ అడిగాడు.

వారిద్దరూ అద్వైత జ్ఞానంగురించి మాట్లాడుకున్నారు. అది పూర్తి అయ్యాక మణిసిద్ధుడు శిష్యుడి మొహం చూసి నవ్వుతూ – " మా ప్రసంగం నీకేమైనా బోధపడిందా? చాలా శ్రద్ధగా విన్నావు" అన్నాడు.

"నాకేమీ అర్ధంకాలేదు. తరవాత మీనుంచి తెలుసుకోవచ్చు నని యిక్కడ కూర్చున్నాను. చెప్పండి" అన్నాడు గోపాలుడెంతో వినయంగా.

"కలియుగంలో సన్యాసం స్వీకరింపకూడదని మునులు నిర్థారించారు. కలియుగంలో జన్మించిన శంకరాచార్యులు – సన్యాసం తీసుకోవచ్చని ప్రమాణాలు చూపిస్తూ తిరిగి స్థాపించాడు. శంకరాచార్యులు అద్వైత పరంగా ఎన్నో విషయాలకు భాష్యం చెప్పాడు. మోక్షం

కోరుకునేవారి కవి చాలా యింపుగా ఉంటాయి" అన్నాడు మణిసిద్ధుడు. "స్వామీ! శంకరాచార్యులు పరకాయప్రవేశం చేశారనీ, ఎవరితోనో వాదించారనీ ఒకసారి నాకు టూకీగా చెప్పివదిలేశారు. మీరు చెప్పిన కొంచమే ఎంతో బాగుంది. ఇవాళ మీరు మళ్లీ ఆ మహాత్ముడి పేరు జ్ఞాపకం చేశారు. శంకరాచార్యుల కథంతా చెప్పండి. ఇవాళ నేనెక్కడికీ పోకుండా యిక్కడే కూర్చుంటాను."

"ఎన్నాళ్ళ నుంచో చెప్పాలనే అనుకుంటున్నాను. ఇవాల్టికి వీలుపడింది. నేడు సుదినం. జాగ్రత్తగావిను" అంటూ శంకరాచార్యులికి మదిలో నమస్కరిస్తూ ఆ వృత్తాంతం ప్రారంభించాధు మణిసిద్ధుడు.

**కే**రళదేశంలో – కాలటి అనే అగ్రహారముంది. దాని సమీపంలో పవిత్రమైన 'పూర్ణ' అనే గొప్పనది ప్రవహిస్తూంటుంది. దాని పక్కనే వృషాచలం శిఖరంమీద ఈశ్వరుడు జ్యోతిర్లింగ రూపంలో వెలిశాడు. ఆ దేశపు రాజయిన రాజశేఖరుడికి కలలో కనిపించి, ఆలయ, ప్రాకార, మంటపాలు కట్టించమన్నాడు. అప్పటినుంచీ ఆ అగ్రహారం పుణ్యక్షేత్రమైంది.

అక్కడొక పండితుడూ పరమభక్తుడూ అయిన విద్యాధిరాజుకి కొడుకు పుట్టాడు. అతనికి శివగురువని పేరు పెట్టాడు.

## శివగురుడికథ

తగిన సమయంలో ఉపనయనం చేసి – విద్యాభ్యాసంకోసం ఒక పండితుడి వద్ద శివగురుడిని తండ్రి చేర్చాడు. సూక్ష్మగ్రాహి అయిన ఆబాలుడు కొద్దికాలంలోనే వేదశాస్త్రాలలో అఖండ పాండిత్యం సంపాదించాడు.

ఒకనాడు – గురువతనిని " నీవు ఇక్కడికి వచ్చి చాలా కాలమయింది. ఇంటికి వెళ్ళి నీవారికానందం కలిగించి వివాహం చేసుకుని పితృదేవతలను సంతృప్తి పరచి గృహస్థ జీవితం సాగించు." అని యింటికి పంప బోయాడు. కాని శివగురుడు " వైరాగ్యాన్ని పొందాను.

అందుచేత బ్రహ్మచర్యాశ్రమం నుంచి నేరుగా సన్యాసాశ్రమం స్వీకరిస్తా" నన్నాడు. గురువు ఆశ్చర్యపోయాడు.

దైవికంగా శివగురుడి తండ్రి వచ్చి అతన్నింటికి తీసుకు వెళ్తానన్నాడు. శివగురుడు తన ఉద్దేశం గురించి మళ్ళీ చెప్పాడు. అప్పుడు గురువతని చెవిలో రహస్యంగా ఏదో చెప్పాడు. అతను మారు మాటాడక తండ్రి వెంట వెళ్ళాడు. గురుకులవాసం పూర్తిచేసుకుని వచ్చిన అతన్ని చూసి అందరూ ఎంతో సంతోషించారు.

శివ గురుడిని వేద, సిద్ధాంత, తర్క, వ్యాకరణం మొదలైన శాస్త్రాల్లో పరీక్షించి అతని జ్ఞానానికి చాలా సంతోషించి అతనికి తమ కన్యనిస్తామని ఎందరో విద్యాధిరాజు యింటికి రాసాగారు.

## శివగురుని వివాహం

విద్యాధిరాజు వాళ్ళందరి గురించీ తెలుసుకుని సామాన్య ధనవంతుడే అయినా మంచివాడైన మఖ పండితుడనే విద్వాంసుడి పుత్రికను తమకొడుక్కి చేసుకుందు కంగీ కరించాడు. శుభలగ్నంలో శివగురుడికీ సతికీ వివాహం జరిపించబడింది. పరోపకారమే వ్రతంగా, వేద పఠనమే వినయంగా వారు దాంపత్య జీవితం గడపసాగారు. ఎంతకాలమయినా వారికి సంతానం కలగలేదు. ఒకనాడతను – భార్యతో – "మనకి సగం కాలమై పోయింది. సంతానం మాత్రం కలగలేదు. సంసారం సముద్రమనే నేను వివాహం చేసుకోనన్నాను. కాని ..... గురువు....లోకవిఖ్యాతి కలిగిన, లోకోపకారి అయిన కొడుకు పుడతాడని చెవిలో చెప్పడం వల్ల – నిన్ను పెళ్ళాడాను. రెండింటికీ చెడ్డాను. సంతానం లేని – మననెవరు తలుచుకుంటారు? అన్నాడు. అప్పుడతని భార్య సతి "దీనికింతవిచారించడం దేనికీ? చంద్రశేఖరుడి నాశ్రయిద్దాం. ఫలం దొరుకుతుంది" అంది. తన మాటలకు ప్రమాణంగా – ఆమె ఉపమన్యువు కధ చెప్పసాగింది.

# ఉపమన్యుడి కథ

ఉపమన్యుడనే మునిబాలకుడు ఆడుకుంటూ, పాలుతాగుతున్న కొందరు మునిబాలకులతో తగువాడి – తల్లి వద్దకు వచ్చి..."అమ్మా! నేనాడుకుందామని వెళ్ళాను. కొందరు పిల్లలు తెల్లనివేవో తాగుతున్నారు. నాకూ కొంచెం యిమ్మన్నాను. అందుకు వాళ్ళు నన్ను వెక్కిరించారు. వాటి పేరేమిటమ్మా?" అన్నాడు. అవి – పాలనీ, ఆవులనుంచి వస్తాయనీ ఆమె చెప్పగా "నాకవి తెచ్చివ్వు. నేను తాగాలి" అన్నాడు.

ఆమె తమ దరిద్రానికి విచారిస్తూ పిండిని నీటితో కలిపి యిచ్చింది. అవి పట్టుకుని వాడు మళ్ళీ ఆపిల్లలదగ్గరకి వెళ్ళి – "మీరివ్వకపోతే ఏం? నేనూ తాగుతున్నాను పాలు..." అంటూ తాగుతుంటే వాళ్ళు పరీక్షగా చూసి – " పిండినీళ్ళు తాగుతూ పాలని మమ్మల్ని మాయచేస్తావా! పాలుకూడానా నీ మొహానికి?" అని వెక్కిరించారు.

ఉపమన్యుడు సిగ్గుపడుతూ తల్లిదగ్గరకొచ్చి – "పాలని – పిండిలో నీళ్ళు కలిపిచ్చి, మోసం చేసి, నన్నవమానాల పాలు చేస్తావా? మనం దరిద్రులమా? దరిద్రమంటే ఏమిటి?" అని అడిగాడు. "కావలసినవి ఏమీ లేకపోవడమే దరిద్రం." అందామె. "అది ఎలా పోతుంది?"

"ఈశ్వరుడి నారాధిస్తే దరిద్రం పోతుంది."

"ఈశ్వరుడెక్కడున్నాడు చెప్పు. నేను వెళ్ళి ఆయన్ని ఆశ్రయిస్తాను."

ఆమె గుడిలోని శివలింగాన్ని చూపించింది.

అప్పుడా బాలుడు గుడిలో కెళ్ళి తలుపులు మూసుకొని శివలింగాన్ని రెండుచేతులతోటి పట్టుకుని "మా అమ్మ చెప్పింది; నువ్వు మాత్రం సిరికలవాడివై, మాకేమీ లేకుండా చేయడం నీకు తగునా? పాలులేక నేనెన్ని అవమానాల పాలయ్యానని! నాకు తండ్రి లేకపోవడంవలన నిన్నింతగా బ్రతిమాలుకోవలసివస్తూంది. తండ్రిలేని వాళ్ళందరికీ నువ్వే తండ్రివని మా అమ్మ చెప్పింది. నువ్వు దయకల

వాడివని చెప్పిందే! నీ బుద్ధిమారిపోయిందా? నిజంచెప్పు. నా పట్టుదల నీకు తెలియదు మాటాడవేం?

తెలియదు. ఊరుకుంటే వీడే పోతాడనుకుంటున్నావేమో! అలా వదలను. నీకంటే మొండివాణ్ని నేను – నాకు కోపం తెప్పింపకు" అంటూ మొరపెట్టుకున్నా శివుడు మాట్లాడలేదు.

వెనక్కెళ్తే మునిబాలకులు ఎకసక్కేలాడతారు. ఇతనేమో మాట్లాడడు. తలపగల గొట్టుకోడమే మార్గం – అంటూ చచ్చి పోడానికి సిద్ధమై శివలింగంమీద తలకొట్టుకునేంతలో శివుడు ప్రత్యక్షమై – అతని నెత్తుకుని – నేవొచ్చేలోగానే తొందరపడతావేం? నీకేంకావాలో చెప్పు" అన్నాడు.

"నాకేమీ అక్కర్లేదు. నాకు తండ్రి లేడు కాబట్టి నేను పిలిచినప్పుడల్లా వచ్చి నా పనులు చక్కబెట్టు. మా యింట్లో పాలు సమృద్ధిగా ఉండేటట్లు అనుగ్రహించు" అన్నాడు ఉపమన్యుడు.

శివుడతనికి ఆవరాలిచ్చి అంతర్ధానమయ్యాడు.

అతను తల్లిదగ్గరకు వెళ్ళి జరిగింది చెప్పాడు. ఆమె ఆశ్చర్యపోయి శివుడికి నమస్కారాలు చేసింది. ఉపమన్యుడు శివభక్తుడై మహర్షులలో చేరి లోకప్రసిద్ధి చెందాడు.

అలాటి మహానుభావుడు భక్తులపాలిటి కల్పవృక్షంలా ఉండగా మనం చింతించడమెందుకు? ఈశ్వరుణ్నాశ్రయిద్దాం. తపస్సు చేద్దాం. మనకి తప్పకుండా వరమిస్తాడు." అంది సతి.

శివగురుడు మర్నాడే భార్యతో పూర్ణానదిలో స్నానం చేసి, దీక్ష తీసుకుని, కందమూలాలు తింటూ శివుణ్నారాధించసాగాడు.

వాళ్ళు కొన్నాళ్ళు తీవ్రమైన తపస్సు చేశాక కలలో శివగురుడికి ఈశ్వరుడొక బ్రాహ్మణ వేషంలో కనిపించి– 'నీకేంకావాలి?" అని అడిగాడు.

కలలోనే – "కుమారుడు కావాలి." అన్నాడతను.

అప్పుడు శివుడు – "అల్పాయువు, సుగుణ సంపన్నుడు, లోక విఖ్యాతుడు అయిన కొడుకొకడు కావాలా?, లేక అల్పబుద్ధులు,

దుర్గుణులు, దీర్ఘాయువులు అయిన కొడుకు లెక్కువమంది కావాలా?" అని అడిగాడు.

అల్పాయువైనా సుగుణసంపన్నుడు, లోకవిఖ్యాతుడు అయిన కొడుకొక్కడే కావాలన్నాడు శివగురుడు. శివుడతని కావరమిచ్చాడు. శివగురుడు మేలుకొని తనకల సంగతి భార్యకిచెప్పి, నియమాలు చాలించి బ్రాహ్మణులకు సంతర్పణ చేసి....పరమేశ్వర ప్రసాదం తిన్నారు.

## సతీదేవి గర్భవర్ణన

ఆ ప్రసాదంలోనే శివతేజం ప్రవేశించి - శివగురుని శరీరంలోనూ, అతని భార్య శరీరంలోనూ ప్రవేశించింది. సతి శరీరంలో కొత్త కాంతులు చోటుచేసుకోసాగాయి. పుట్టబోయే బిడ్డ కోసం ఆమె దేహం సన్నద్ధం కావడం ప్రారంభించింది.

## శంకరాచార్యుని అవతార ఘట్టం

సూర్యుడు మొదలయిన గ్రహాలు తమ స్థానాలలో ఉచ్ఛస్థితిలో ఉండగా .... శంకరాచార్యుడు జన్మించాడు. శివగురుడు ఆనందం పట్టలేకపోయాడు. పూర్ణానదీ తీరంలో బ్రాహ్మణులకు అనేక దానాలు చేశాడు. దైవజ్ఞులను జన్మకాల విశేషాలు చెప్పమనగా వారు లగ్నఫలం చూచి అమితాశ్చర్యపోయారు. అతని గొప్పతనాన్ని వర్ణించి వర్ణించి మరీ చెప్పారు. శివగురుడు ఆశిశువు ఆయువు గురించి మాత్రం అడగలేదు.

## శంకరుడి రూపం పుణ్యాంగనలు వర్ణించుట

ఆ బాలుడికి జాతకర్మ జరిపించి - శ్రీశంకరుడని నామకరణం చేశాడు. ఆ ఉత్సవానికి విచ్చేసినవారు - దీపం లేకుండానే ఆ గదిని ప్రకాశింపజేస్తున్న బాలుణ్ని చూసి - అతని కనులు ఆహ్లాదం కలుగ చేస్తున్నాయనీ...అతన్ని చూస్తే కళ్ళుచల్లబడుతున్నాయి కనక శంకరుడనే

పేరు సార్ధకమనీ, అతని శరీరంమీద నెలవంక, నేత్ర చిహ్నం, త్రిశూలాకృతులున్నాయనీ వర్ణించారు. అలాటి అద్భుత లక్షణాలు సామాన్యుల కుండవన్నారు. శంకరుడు ఆరుమాసాలకే మాటలతోపాటు, నడక కూడా నేర్చుకున్నాడు.

## శంకరుడి బాలక్రీడలు

ఏడాదినిండేసరికి శంకరుడు అతి స్పష్టంగా మాట్లాడసాగాడు. ఆ మాటలలో సంస్కారం ఉట్టిపడేది. రెండోఏట సమస్త భాషలూ చదవడం, రాయడం తెలుసుకున్నాడు. మూడో సంవత్సరం నిండేసరికి వినకుండానే స్వయంగా కావ్యనాటక పురాణ గ్రంథాల విశేషాలు గ్రహించాడు. అతని తెలివితేటలకు అందరూ ఆశ్చర్యపడేవారు. ఏకసంధగ్రాహి అయిన శంకరుడు కొద్ది కాలంలోనే అనేక శాస్త్ర విద్యలు గ్రహించి ఉపాధ్యాయులను మించిన వాడిగా ఉండేవాడు.

చిన్నప్పటి నుంచే అతను కుత్సిత మతాలను ఖండిస్తూ తన మతాన్ని ప్రతిపాదించేవాడు.

తండ్రి అతనికి వేద పఠనాధికారం కల్పించడానికి - గ్రహణశక్తిని బట్టే వయసుని పరిగణించి ఉపనయనం చేయాలను కున్నాడు. కాని....అంతలోనే అతను మరణించాడు.

తండ్రి మరణానికి తల్లి శోకిస్తూంటే - శంకరుడామెకు వైరాగ్యం బోధించాడు. ఆమె సహగమనం చెయ్యక కొడుకుని సంరక్షిస్తూ ఒక ఏడాది గడిపింది. బృహస్పతిని మించిన తెలివితేటలు కల శంకరుడు - బాలుడిగానే ఎందరో పండితులను వాదంలో జయించాడు. తల్లి అతనికి ఉపనయనం చేయించింది. అప్పటికే అతను సకల విద్యా పారంగతుడయినా లోకవిరుద్ధం కాకుండా గురుకులవాసం చేస్తూ వేదవేదాంగాలు చదవడం ప్రారంభించాడు.

# శంకరుడి విద్యాభ్యాస విచిత్రం

శంకరునితో కలసి చదువుకునే ఇద్దరు విద్యార్థులిలా మాట్లాడుకోసాగారు.

సుమతి : గుణవర్మా! శంకరుడు చూడడానికి జానెడు లేడు కాని యీ విద్యలన్నీ ఎప్పుడు చదివేశాడో! వాని ముందర నేనెందుకూ పనికి రావడం లేదు. నిన్న కాక మొన్న వేదం ప్రారంభించిన శంకరుడు - నాలో తప్పులుపట్టాడు! సవరించి చక్కగా చెప్పాడు.

గుణవర్మ : అలాటి సామర్థ్యం అతనికెలా వచ్చిందో? ఆశ్చర్యంగా ఉంది.

సుమతి : పూర్వజన్మపుణ్యం ... మరో వింతచెబుతా విను. గురువుగారు మా యిద్దరినీ వేదం ఘనపాఠంలో స్వస్తి చెప్పమన్నారు. అందులో శంకరుడు సరిదిద్దిన తప్పులు నాకేకాదు గురువు గారికి కూడా తెలియవు. అప్పుడతను అర్థంచెప్పి శాస్త్ర దృష్టాంతాలు చూపించి ఒప్పించాడు. శంకరుడు అపర విద్యామూర్తి. అతనిలో దైవ శక్తి ఉంది. కాకపోతే అతని వయసెంత? విద్యేంత?

(అంతలో రామభట్టు అటు వచ్చాడు)

రామభట్టు : నువ్వు శంకరుడి మహిమెరగక అతనితో వాదించావు. అతనికి గురువులు నిమిత్తమాత్రులు. అతని గురించి నాకుముందే తెలుసు.

గుణవర్మ : శంకరుని సహాధ్యాయులమని చెప్పుకోడమే మనకు గొప్ప ప్రతిష్ఠ.

రామభట్టు : నిన్న ఉదయం జరిగిన అద్భుతం విన్నారా? శంకరుడు, సోమవర్మ నిన్న భిక్ష కోసం ఒక బ్రాహ్మణుడింటి కెళ్ళి "భిక్షాందేహి" అని అడిగారట. ఆ బ్రాహ్మణుడు కటికపేద. ఆ యింటి యిల్లాలు బయటికి వచ్చి - మీరు వామన మూర్తుల్లా వచ్చి నన్ను భిక్ష అడిగారు. మీవంటి వారికి భిక్ష పెట్టుకునే భాగ్యం నాకు లభించలేదు. నేను మహాపాపాత్ము రాలిని. మూడురోజులనుంచీ ఉపవాసం చేస్తున్నాం. మొట్టమొదటే మీరీపాడుకొంపకి వచ్చారు. మరో చోట కూడా మీకు

భిక్ష లభించదేమో. ఊరికే వెళ్ళిపోవద్దు. ఈ ఉసిరికాయ మాత్రం ఉంది. తీసుకోండి - అంటూ చాలా విచారించిందామె.

సుమతి : ఈ అగ్రహారంలో ఇంత కటికదరిద్రులున్నారా! ఆమె ఎంత బాధపడిందో! తరవాత?

రామభట్టు : భక్తి పూర్వకంగా ఆమె యిచ్చిన ఆ వుసిరికాయని శంకరుడు తీసుకొని వారి దారిద్ర్యానికి విచారిస్తూ శ్రీమహాలక్ష్మిని వృత్తపద్య రత్నాలతో స్తోత్రం చేయగా ఆమె ప్రత్యక్షమైంది. అతనా మహాదేవిని వేడుకొనగా ఆ యింట్లో లెక్కలేనన్ని బంగారు ఉసిరికాయలు వర్షించింది.

సుమతి : దీన్ని బట్టి అతనెంత దీనదయాళుడో స్పష్టమౌతుంది. ఆ యిల్లాలి పూర్వజన్మసుకృతం కాకపోతే అతనా యింటికి వెళ్తాడా? తరవాత?

రామభట్టు : వానచినుకుల్లా తమింట్లో పడిన బంగారు ఉసిరికాయలను చూసి ఆ యిల్లాలు ఆనందాశ్చర్యాలను పట్టలేక ఆ వృత్తాంతం ఇరుగుపొరుగు వారికి పూసగుచ్చినట్లు చెప్పింది.

సుమతి : బంగారు ఉసిరికాయల్ని నువ్వు చూశావా?

రామభట్టు : సోమవర్మతో ఆమె యీ కథ చెబుతూ అతనికా కాయలు చూపించిందట. అతను రాత్రి నాకీ కథ చెప్పాడు.

సుమతి : మనం కూడా అతన్నాశ్రయించుకుని ఉందాం. శ్రీమహాలక్ష్మి వానిచేతిలో ఉంది. ఎప్పటికేనా దయరాకపోతుందా?

రామభట్టు : అతని అనుగ్రహమే కలిగితే - ఈ స్వల్పసిరి ఏం? శాశ్వత సుఖపథమే కలుగుతుంది కదా.

సుమతి : ఔను. ఇకనుండి అతన్ని సహాధ్యాయుడిగాకాక సాక్షాత్తూ దైవంలాగే భావించుకుందాం.

రామభట్టు : అత నవతారమూర్తే కాకపోతే ఏడేళ్ళ వయసుకే యింత ప్రజ్ఞ కలుగుతుందా? శంకరుడు పదిరోజులలో యింటికి వెళ్తాడట. తల్లినుంచి కబురురాగా అతను తిరిగి కబురంపాడు.

సుమతి : అలా అయితే మనంకూడా అతనితో కలసి వెళ్దాం.

# కాశీ మజిలీ కథలు

## 45. వ మజిలీ

శంకరుడు పూర్వ జన్మల ప్రభావం వల్ల ఏడవ యేడు ముగిసేసరికే గురుకులవాసం చేసి, సర్వవిద్యలందు అసమాన పాండిత్యం సంపాదించి అందరూ పొగడుతూండగా యింటికి వెళ్ళి తల్లికి నమస్కరించాడు.

## శంకరుడి మాతృసేవ

సతీదేవి కొడుకుని దీవించి, తలమీద ముద్దుపెట్టుకుని గారాబం చేస్తూ...విద్యాభ్యాస కాలంలోని విశేషాలడిగింది. అతనామెకు సంతోషం కలిగేలా అన్నీ చెప్పాడు.

మాతృసేవ జనులకత్యంత ప్రధాన కర్తవ్యమని బోధించదాని కతను కొన్నాళ్ళు తల్లిని సేవించాడు. వయసులో చిన్నవాడైనా విద్యామహిమలలో అధికుడైన శంకరుడిని అందరూ గౌరవించేవారు. ఒకనాడు - సతీదేవి మండుటెండలో పూర్ణానదికి వెళ్ళి నీళ్ళు తెస్తూంటే....ఎండకు కాలివున్న యిసకలో ఆమె అడుగులు తొట్రుపడ సాగాయి. అది చూసి కొందరు శంకరుడి వద్దకు పోయి ఆమె యాతనగురించి చెప్పగా - అతను వేగంగా వెళ్ళి తామరాకులు తెచ్చి త్రోవనిండాపరచి తల్లిని వాటిమీద నడిపిస్తూ యిల్లు చేర్చి - విసనకర్రతో గాలివిసిరి ... ఉపచారాలు చేశాడు.

ఆ రాత్రి అతను గంగాస్తోత్రం చేయగా శంకరుడి భక్తికి మెచ్చి ఆ మహానది మర్నాడు ఉదయానికి ఆయింటి దగ్గరగా ప్రవహించ సాగింది. ఊరికి దూరంగా ఉండే నదిని - తల్లివలనే శంకరుడలా మళ్ళించాడని అతని మహిమ నద్భుతంగా చెప్పుకోసాగారు. అలాగ

శంకరుడు గోపాల కృష్ణుడిలా అతీత కార్యాలు చేస్తూండడంవల్ల అతని మహిమలు దేశమంతా వ్యాపించాయి.

## రాజశేఖరుడు శంకరుడి నాశ్రయించుట

అప్పటి ప్రజాపాలకుడైన రాజ శేఖరుడనేరాజు శంకరుని పేరు ప్రఖ్యాతులు విని అతనిని తీసుకురమ్మని తన ప్రధాన మంత్రిని కాలటి అగ్రహారానికి పంపాడు. సుబుద్ధి శంకరునకు – "మహారాజు ఎందరినో జయించినవాడు. తత్త్వజ్ఞానంలో జనకుని అంతటివాడు. రాజసభలో నిరంతరమూ పండితులవాదాలూ ప్రసంగాలూ వింటూ తన్మయం చెందుతాడు. కవితాదురంధరుడు. వారు మీ దర్శనం చేసికొని మీ పాద ధూళిని శిరస్సున దాల్చాలని ఎంతో అభిలషిస్తున్నారు. ఏనుగు నెక్కిరండి" అంటూ ప్రార్ధన చేశాడు.

శంకరుడు చిన్న నవ్వు నవ్వి – "మేము భిక్షాన్నము తింటూ వేదాధ్యయనం చేసుకునే బ్రహ్మచారులం. మేము ద్రవ్యము సంపాదించి ఏం చెయ్యాలి? ఈ తుచ్ఛభోగములందు మాకాసక్తి లేదు. ప్రజలకు తగిన వృత్తులేర్పరచి వర్ణాశ్రమ నియమాలు తప్పకుండా ధర్మంగా రాజుపాలించాలి. ప్రజల సుకృత దుష్కృతాలలో ఆరవవంతు భాగం రాజుకు చెందుతాయి. సప్తవ్యసనాలకూ దూరంగా ఉండే రాజు పరమసుఖం పొందుతాడు. ఇలా రాజుకి చెప్పానని చెప్పు" అన్నాడు.

ప్రధాన మంత్రి సుబుద్ధి వెళ్ళి – రాజుకి శంకరుని సందేశం విన్నవించాడు. రాజు చతురంగ బలాలని వెంట బెట్టుకుని అగ్రహారానికి వెళ్లాడు. శంకరుని మహానుభావత కాశ్చర్యపోతూ ఆ బాలునికనేక సాష్టాంగ నమస్కారాలు చేసి – రాకకు కారణం అడగగా..."మహాత్మా! నేనెంతో కష్టపడి మూడు నాటకాలు రచించాను. గుణ దోషాలు చెబుతారని నా కోరిక" అంటూ వాటిని సంగ్రహంగా చదివి వినిపించాడు. పదివేల దీనారాలతనిముందుంచాడు.

శంకరుడా నాటకాలను మెచ్చుకుని "నీ కోరి కేమిటి?" అని అడిగాడు.

"ఒక పుత్రుడు కలిగేలా దీవించండి." అని మనవి చేశాడు.

"రాజా! నువ్వు తెచ్చిన ధనం మాకక్కరలేదు. దీన్ని అగ్రహార బ్రాహ్మణులకు పంచిపెట్టు. నీకు సుపుత్రుడు కలుగుతాడు" అంటూ శంకరుడతనికి రహస్యంగా ఆవిధానమంతా బోధించాడు.

రాజు యింటికి వెళ్ళి శంకరుడు చెప్పినట్లు పుత్రకామేష్టి చేసి కొడుకును పొందాడు.

## శంకరుని వద్దకు మహర్షులు వచ్చుట

పండితుల సాంగత్యంతో శంకరుడు అనేకవిషయాలు గ్రహిస్తూ, శాస్త్రోక్తంగా భక్తితో తల్లిని సేవిస్తూ కొన్ని రోజులు గడిపాడు. ఒకనాడు అతను శిష్యులతో సంభాషిస్తూంటే – ఉపమన్యుడు, దధీచి, గౌతముడు, అగస్త్యుడు మొదలగు ప్రముఖులు రావడాన్ని దూరంనుంచే చూసి – ఎదురువెళ్ళి స్వాగతం పలికి సపర్యలు చేశాడు.

అప్పుడా మహర్షులు – "మహాత్మా! నువ్వు మతాల నుద్ధరించడానికి అవతరించిన శంకరుడివి. నీ కార్యమును విస్మరించి, మాతృసేవలో మునిగి యిల్లు వదలడంలేదు. ఇకనైనా కర్తవ్యం మరువకు సుమా" అని హెచ్చరించారు.

అదే సమయంలో శంకరుని తల్లి వారి పాదాలకు నమస్కరిస్తూ – "మహాత్ములారా! నేడు మేము కృతార్థులమయ్యాం. అయ్యా! ఈ శిశువు చిన్నతనంలోనే శాస్త్రాలూ అభ్యసించి, అద్భుత కార్యాలు చేయడంతో లోకుల కాశ్చర్యం కలగక మానదు కదా? మీ బోటి మహాత్ములు వచ్చి యీ చిన్న వాడితో మాట్లాడడం మరింత ఆశ్చర్యం కదా. త్రికాల వేత్తలయిన మీరు వీడి పుణ్యమెట్టిదో – నేనర్హురాలినైతే చెప్పండి." అంది.

అప్పుడు కుంభసంభవుడనే ముని "నువ్వూ మీభర్తా పుత్రుడికోసం చంద్రశేఖరుణ్ని ఆరాధించారు కదా. దేవుడు మీ తపస్సుకు మెచ్చి – దుష్టులయిన కొడుకులు నూరుగురు కావాలా, మితమైన ఆయువుకల సర్వోత్కృష్టుడు ఒకడు కావాలా? అని అడగ్గా ఆ

విద్వాంసుడు ఉత్తమ సుతుడొక్కడినే కోరుకున్నాడు. అందుచేత యితను మీ వంశంలో జన్మించాడు" అన్నాడు.

అప్పుడామె ఉలిక్కిపడి – "మహాత్మా! ఈ మాట మాత్రం నా భర్త నాకు చెప్పలేదు. మితాయు వంటే – ఎంత? – వివరించండి" అంది.

సత్యమైనా అప్రియవాక్యం చెప్పకూడదనే నిషేధం ఉన్నా, ఎందుచేతనో ఆ ముని పుంగవుడు "వీనికి శంకరుడు పదహారేళ్ళు ఆయుర్దాయ మిచ్చాడు. కాని......కారణాంతరాలవల్ల మరికొన్ని సంవత్సరాలు జీవిస్తాడు." అని చెప్పి .....మునులతో కలసి – వెళ్ళిపోయాడు.

## శంకరుడు అల్పాయువని విని తల్లి విలపించుట

ఆ మహర్షి మాట వినడంతోటే – సతీదేవి శోకంతో మూర్ఛపోయింది. ఎలాగో తేరుకున్నాక శంకరుడిని కౌగలించుకుని – 'అయ్యో! సకల కళలూ చేరిన నువ్వు అల్పాయువువా! నీ విద్యలన్నీ ఏమైపోవాలి? నేనేం చెయ్యాలి? నీ ముద్దు ముచ్చట్లు చిరకాలం చూసుకుందామను కున్నానే! ఇలాగ కపట వరాలిచ్చి దేముడు ఎందుకు మోసం చేయాలి? ఇది నా పాపఫలం. ముప్పయ్యేళ్ళకే నీకు ఆయువు మూడుతుందా!" అంటూ పరిపరివిధాల దుఃఖించసాగింది.

## శంకరుడు తల్లికి వైరాగ్యోపదేశం చేయుట

తన తల్లి అలా దుఃఖించడం చూసి – శంకరుడు "అమ్మా! ఈ కళేబరం చంచలమైనది. వెనకటి జన్మలో నీకు నాలాటి పుత్రులెందరో జన్మించి ఉంటారు. ఎందరికో తల్లివై ఉంటావు. ఎందరినో పెంచి ఉంటావు. వారందరిలో నేను ఒకడ్ని. ఎందరి కోసం విచారిస్తావు? బాటసారులు పానీయశాలకి వచ్చి పోయేటట్లు సంసారులు వస్తూ పోతూంటారు. నీ దేహమే నీకు అరువు. నాకోసం విచారిస్తావేం? జీవులకు జననంతోనే మరణం కూడి ఉంటుంది. ఎన్నాళ్ళు బతికినా వాంఛలు మిగిలే ఉంటాయి. అన్నాడు.

ఆ మాటలకు తల్లి కొంచెం ధైర్యం తెచ్చుకుని – "దేహాభిమానం ఉన్నంతవరకూ మమత్వం వదలడం కష్టం. సకల లోకం చేతా స్తుతించబడే నీలాటి వాడి విషయంలో వేరే చెప్పడమెందుకు? నువ్వింక గృహస్తుడివై సుపుత్రులని కని కులం ఉద్ధరించు. క్రతువులు చేసి దేవతలను తృప్తి పరచు. నీ తండ్రిని కృతకృత్యుణ్ణి చెయ్యి" అంది.

శంకరుడు నవ్వుతూ – "భ్రమ వలన సంసార మార్గంలో కొట్టుకునే వారికి దుఃఖమే కాని సుఖం కొంచెమైనా ఉండదు. అల్పాయుడివైన నేను పెళ్ళాడి భార్యాపుత్రులని బాధించడం ఎందుకు? కనుక నేను సంన్యాసాశ్రమం స్వీకరించి భవబంధాల నుంచి విముక్తి కోసం ప్రయత్నిస్తాను. అనుజ్ఞ యివ్వు" అన్నాడు. సతీదేవి ఆ మాటలు వినలేనట్లు చెవులు మూసుకుని – "నాయనా! నువ్వు జన్మించినది నన్ను దుఃఖపెట్టడానికా? అల్పాయువువని విని హృదయం పగిలిన నన్ను ఓదార్చే తీరుయిదా? నాకేదారిచూపించి నువ్వు సన్యాసివౌతావు? ముప్ఫయ్యేళ్ళలో పెళ్ళాడి సంతానం కని క్రతువులు చేసిన వారెందరు లేరు? నువ్వు వారిమార్గం అనుసరించు" అంది.

"అమ్మా! నువ్వు నా మీద మమకారం పెంచుకుంటే దుఃఖమే మిగిలి ఉంటుంది. నాకీ ఒంటి జంధ్యమే బరువుగా ఉంది. మరోటి ఎలాధరిస్తాను? నాకు సంసారమందు ఇచ్ఛలేదు. పరలోక సౌఖ్యం చూసుకుంటాను" అని శంకరుడనగా.

ఆమె గొల్లున ఏడుస్తూ, అతని గెడ్డం పట్టుకుని – "నాయనా! నువ్వెంతో దయామయుడివి. ఎందరినో రక్షించావు. నా ముప్పు గడిపి, తరవాత నీ యిష్టంవచ్చినట్లు చేసుకో" అని బతిమాలుకుంది. అప్పటికి అతనేమీ చెప్పలేక – "ఈమెకు ఇహలోకమోహం చాలా బలంగా ఉంది. సంన్యాసాని కనుమతించదు. ఆమె ఆజ్ఞలేకుండా సంన్యాసం స్వీకరించ కూడదు. ఏం చేయాలా..." అని ఉపాయం కోసం ఆలోచిస్తూ కొన్నిరోజులు గడిపాడు.

## శంకరుడు మకరముచే పట్టుకొనబడుట

ఎనిమిదో యేట శంకరుడొకనాటి ప్రాతఃకాలంలో పూర్ణానదిలో స్నానం చేస్తూంటే ఒక మొసలి అతని కాలుపట్టుకుని నీటిలోకి లాగసాగింది. జలస్థంబనాది విద్యలతనికి అనేకం తెలిసినా తనకార్యం సాధించటానికి యిదే అదునని - తనకాలు మొసలిపట్టుకుందని పెద్దకేకవేశాడు. అప్పుడు సతీదేవి గుండెలు బాదుకుంటూ వచ్చింది. నదిలో మునుగుతూ తేలుతూ కొట్టుకుంటున్న కొడుకుని చూసి - "హా! పుత్రా! అయ్యో.... ఎవరేనా మా శంకరుణ్ని రక్షించరూ? మీ పాదాలకు నమస్కరిస్తాను. లోతు నీటిలో దిగవద్దని ఎన్నిసార్లు చెప్పినా విన్నావుకాదు కదా..." అంటూ దుఃఖించిందే తప్ప నీటిలోకి దిగలేక పోయింది.

అప్పుడు శంకరుడు - "అమ్మా! - 'నీవు సన్యాసం తీసుకుంటే నిన్ను విడిచి పెడతాను' - అనే మాట నీటిలోంచి వినపడుతూంది. అది నిజమే కావచ్చు. మరి నువ్వు అంగీకరిస్తావా?" అని అడిగాడు.

'ఓహో! ఐతే ఇదికపటమన్నమాట. ఇలా అడిగితే నేనంగీకరిస్తానని కాబోలు. ఏం చేయాలి?' అని ఆమె సందిగ్ధంలో పడింది. శంకరుడొకసారి మునిగి...మళ్ళీ తేలి.... "తల్లీ! ఇది చివరిమాట. ఇకనిలబడడం శక్యంకాదు. మొసలి పట్టు తీవ్రమైన వేదన కలిగిస్తూంది. సంన్యాసానికో, స్వర్గానికో ఆజ్ఞయివ్వు" అన్నాడు.

ఆ మాటవిని, అతని దైన్యం భరింపలేక, కొడుకు బతికుంటే అంతేచాలని - "పుత్రా! నీకు సంన్యాసానికి ఆజ్ఞయిచ్చాను" అంది. శంకరుడు నీటిలోనే మనసుతో సంన్యసించి, మొసలినుండి తప్పించుకుని, భవబంధ విముక్తునివలె అవలీలగా తీరంచేరి తల్లికి నమస్కరించాడు. అతని సంన్యాస స్వీకారానికి అభిషేకం చేస్తున్నట్లు ఆమె కన్నీరుతో అతని తలతడుపుతూ, "మొసలి కోరలకు నీ శరీరం ఎంత వడిలి పోయిందో! ఇంటికి పద, వైద్యం చేయిస్తాను." అంది.

*శంకరుడు* : జననీ! నీ ఆజ్ఞ చేత నేను మానససన్యాసం స్వీకరించాను. ఇక యింటికి రాను. యతికి కర్తవ్యమేదో నాకు ఉపదేశించు.

తల్లి : నువ్వు యతివైపోతే నా గతేమిటి? నన్ను చూసేవారెవరు?

శంకరుడు : నాతండ్రి ధనం తీసుకోడానికెవరు కర్తలో, వారే నిన్ను రక్షిస్తూంటారు.

తల్లి : మంచి దారే చూపుతున్నావు! జ్ఞాతులు నన్ను రక్షిస్తారా! శంకరా! ఇంత నిర్దయుడివైపోయావేం? రోగం వస్తే ఎవరు చూస్తారు? అపరక్రియలెవరు చేస్తారు?

శంకరుడు : దాయాదులే. అలా చెయ్యకపోతే లోకాపవాదం పొందరా?

తల్లి : లోకులకు వెరచి చేసే దాయాదుల ఉపచారాలు నాకిష్టమవొద్దూ? నీలాటి కొడుకుండికూడా నేనెవరి చేతనో అంతిమ సంస్కారం పొందాలా! ఎంత పాపాత్మురాలిని.

శంకరుడు : అమ్మా! నీకలాటి కోరికుంటే ప్రాణంపోయేవేళ నన్ను తలుచుకో. ఎంత దూరంలో ఉన్నా యోగబలంతో వచ్చి నీ దేహ సంస్కారం చేస్తాను.

తల్లి : అలాటి వరం యివ్వు. సన్యాసి చేయతగనిది కాదని మాత్రం మానెయ్యకుసుమా.

శంకరుడు : అలా అనుకోకు. నీకు వరమిస్తున్నాను. అనాథవైన నిన్ను విడచి వెళ్తున్నాను. దూరంగా ఉన్నా, నీవద్ద ఉన్నప్పటి కంటె నూరురెట్లు ఎక్కువగా పరామర్శిస్తుంటాను.

తల్లి : బిడ్డా! అదేనేను కోరుకునేది. నువ్వెళ్ళిపోతానంటే గుండెలు కొట్టుకుంటున్నాయి. ఇంట్లో ఉండి ఏంచేస్తాను? నువ్వెళ్ళాక నిముషమైనా బతికుంటానా? నన్ను కూడా తీసుకు పో.

శంకరుడు : తల్లీ! మళ్ళీ మోహంలో పడతావేం? అద్వైత తత్త్వం తెలుసుకో. ఎవరి కెవరూ లేరు. తనని తాను రక్షించుకోవాలి. నువ్వు నావెంటరాకూడదు. ఇంటి దగ్గరుండి ఆత్మతత్వం ధ్యానించుకో. మమకారం వదులుకో.

అని వైరాగ్య ప్రవృత్తి కలగజేసి జ్ఞాతులను రప్పించి - యిలా అన్నాడు.

## శంకరుడు తల్లిని జ్ఞాతుల కప్పగించుట

"కన్నతల్లి అని చూడకుండా వదలి విరాగినై వెళ్ళిపోతున్నాను. ఈమెను మీ తల్లిలా చూసుకోండి. నన్ను మరచిపోయేలా ఆదరించండి. నన్ను తలచుకుని కంటతడి పెట్టిందో మీకూ నాకూ కూడా పాపమే. బంధువులారా! నా తల్లి కష్టమెరుగదు. ఏదీ యిమ్మని అడగదు. ఎవరింట్లోనూ తినదు. చాలా మెత్తనిది. ఎలా కాపాడతారో మరి. ధనం, భూమి, పశువులు, యిల్లు సహితంగా అన్నిటితోనూ మా అమ్మను మీ అధీనం చేసి వెళ్తున్నాను. ఇకపై ఆమెభారం మీదే, దాయాదులారా! "అని శంకరుడు, కన్నీరు పెట్టుకుంటున్న తల్లి రెండు చేతులూ పట్టుకుని జ్ఞాతుల కప్పగించాడు.

ఆ సమయానికి ఆ అగ్రహారపు బ్రాహ్మణు లందరూ అక్కడికి వచ్చి ఆమె దైన్యానికి విచారిస్తూ, అతని వైరాగ్యానికి ఆశ్చర్యపోయారు.

అంతలో - "శంకరా! దూరంగా ఉన్న పూర్ణానదిని గోపాలస్వామి ఆలయానికి దగ్గరగా తీసుకురావడం వలన ఆలయం బీటలు వేసింది. ఆ స్వామిని మరోచోట స్థాపించి పొమ్ము." అని వినపడింది.

ఆ మాటలు ఎవరు పలికారో నిశ్చయింపలేక - శంకరుడప్పుడే పోయి ఆ గుడి పగిలి ఉండడం చూసి విచారిస్తూ స్వామిని భుజాలతో మెల్లగా ఎత్తి మరోచోట స్థాపించి, ఆలయ మంటప ప్రాకారాలు కట్టించమని నియమించాడు. తరవాత -

## శంకరుడు గోవింద యతి వద్దకు వెళ్ళుట

శంకరుడు శుభముహూర్తంలో ఉత్తరాభిముఖంగా బయలుదేరి ....వెళ్ళి వెళ్ళి దారిలో అడవులు గ్రామాలు మనుషులు జంతువులను చూస్తూ - ఇంద్రజాలికుని మాయ గా చూస్తూ ఆదృశ్యాన్ని పరమతత్వంగా భావించాడు. కులమతవాదులచేత.....చెడుమార్గంలో నడిపించబడుతున్న శ్రుతి అనే గోవును చక్కని మార్గంలో నడిపించదాని కన్నట్లు దండంధరించి, కాషాయ వస్త్రం కట్టి, నడవసాగాడు. అతను రక్షకుడు

కాకపోతే పాషండులు వైదికులను వేటకుక్కలు లేళ్ళను వలె తరిమి వేయరూ? అలాగ నడిచి నడిచి సాయంకాలానికి నర్మదానదీ తీరంలో ఉన్న గోవింద యతి ఆశ్రమం చేరాడు.

అక్కడ జాతివైరం వదలి – పులులూ గోవులూ, సింహాలూ ఏనుగులూ, పామూ, కప్పా, స్నేహంగా మసలడం చూసి ఆ మహానుభావుడి ప్రభావాల కాశ్చర్యపోతూ నర్మదా నదినుంచి వచ్చే గాలులు ప్రయాణపు బడలికను పోగొడుతూంటే కొంత సేపుండి అక్కడి విశేషాలు చూస్తూ, తత్త్వగోష్ఠి చేస్తున్న కొందరు తాపసులను చూసి నమస్కరించి – "సంసారాగ్నిలో బాధించబడుతూ గోవిందయతి చంద్రుణ్ని ఆశ్రయించడానికి వచ్చాను. వారెక్కడ?" అని అడిగాడు.

"ఇంత చిన్నతనంలోనే విరక్తి చెందడానికి కారణమేమిటి? నువ్వెవరివి? గోవింద యతి దర్శనం కోరే మేము చిరకాలం నుంచి యిక్కడ ఎదురు చూస్తున్నాము. ఈ గుహలో ఉన్నాడని, అంటారు. దీనిని యోగశక్తితో తప్ప ప్రవేశించడానికి శక్యంకాదు. మాకలాటి సామర్థ్యం లేదు. ఐనా .....ఎప్పటికేనా ఆమహాత్ముడు ప్రసన్నుడు కాడా అని యిక్కడ కాలక్షేపం చేస్తున్నాము. మాతో కొంతకాలం సద్గోష్ఠిలో ఉండు. అతనిని చూడడం సామాన్యంగా శక్యంకాదు."

శంకరుడు నవ్వుతూ వారికి జవాబు చెప్పి వారు ఆశ్చర్యంతో చూస్తుండగా, ధృడసమాధి యోగంతో ఆ గుహలో ప్రవేశించి సమాధిలో నిశ్చలంగా ఉన్న గోవింద యతీంద్రుని చూసి, నమస్కరిస్తూ అతన్ని స్తుతించాడు., "మీ నుంచితత్వం గ్రహించాలని వచ్చాను. దయతో బోధించరూ?" అని ప్రార్థించాడు.

ఆ యోగి కళ్ళు తెరచి శంకరుణ్ని చూసి ఆశ్చర్యపడుతూ "నువ్వెవరు?" అని అడిగాడు.

"విశ్వాన్నంతటినీ ఆవరించి ఉన్న పరమ శివుడినే నేను" అన్నాడు శంకరుడు. అందుకతనెంతో సంతోషించి – "నువ్వు సాక్షాత్తూ శంకరుడివే. అతి నిగూఢమైన అద్వైత మార్గపు తీరు తెలుపుట

కవతరించావు రా." అని ఆహ్వానించాడు. తరువాత– "ప్రజ్ఞానం బ్రహ్మ....అహం బ్రహ్మోస్మి...తత్త్వమసి...అయమాత్మా బ్రహ్మ " అనే నాలుగు మంత్రాలతో బ్రహ్మ భావం ఉపదేశించాడు. వ్యాసమహర్షివలన శ్రీశుకుడు, అతనివలన గౌడపాదుడు, అతనిద్వారా గోవిందతీర్థులు – బ్రహ్మసూత్రాలను సంప్రదాయ సిద్ధంగా తెలుసుకున్నారు. గోవిందయతి పాతాళానికి వెళ్ళి అనంతుని ద్వారా గ్రహించిన విద్యలు, యోగములు, మంత్రములు, తంత్రములు, అరువదినాలుగు కళలు కూడా శంకరాచార్యుడికి తేటతెల్లంగా తెలియజేశాడు.

శంకరాచార్యుడు పరమోన్నత స్థానం పొంది ధ్రువుడిలా ప్రకాశిస్తూంటే – తాపసులు కొందరతన్ని చూసి ఆశ్చర్యపోయారు. అతన్ని సాక్షాత్తూ శంకరుడే అనీ, పరమ హంస అనీ చెప్పుకున్నారు. శంకరాచార్యులు వర్షాకాలం గురుశుశ్రూష చేస్తూ అనేక అగ్రహారాలు కల ఆ నర్మదానదీ తీరంలో గడిపాడు.

ఒకనాడు – ప్రళయం వచ్చినట్లే పెద్దవర్షం కురుస్తూ, నర్మదా నది అగ్రహారాలను ముంచెయ్యగా – అందలి స్త్రీ, బాలవృద్ధులు హాహాకారాలు చేస్తూ పుస్తకాలు, యజ్ఞవస్తువులు మొదలైనవి పట్టుకుని గుంపులు గుంపులుగా వచ్చి 'గోవిందయతి ఎక్కడున్నారు?' అంటూ అడిగారు. గుహా ముఖంలో నిలబడి తమకు కలిగిన ఆపదని మొరపెట్టుకున్నా యతి అప్పుడు సమాధిలో ఉండడంవల్ల వారిమొర ఆలకింపలేదు.

కొందరు శంకరుడికి వరదగురించీ అది కలిగించిన బాధ గురించీ వివరించగా అతనొక కుండని మంత్రించి యిచ్చి – "దీనిని నర్మదానదిలో వేగంగా వదలండి" అన్నాడు. వారలాచేయగా – నీరంతా బుడబుడ మంటూ కుండలోకి వెళ్ళిపోయి పరిసరాలన్నీ మునపటిలా నిర్మలమయ్యాయి. అప్పుడు వారు శంకరుణ్ని ఎంతో ప్రశంసించి యిళ్ళకి పోయారు.

గోవిందయతి సమాధినుంచి లేచి – జరిగినదంతా తెలుసుకుని – శంకరుడు యోగసిద్ధుడయ్యాడనీ, అతనికి అసాధ్యమే ఉండదని సంతోషించాడు.

శరదృతువు రాగానే శంకరుణ్ని కాశీపట్నం వెళ్ళి వేదయుక్తమైన తత్త్వపద్ధతి నక్కడ వివరించమన్నాడు. "మునుపు హిమగిరియందు అత్రి మహాముని సత్త్రయాగం చేశాడు. దానిని చూడడానికి తాపసులందరూ వచ్చారు. అక్కడ ఒకనాడు వ్యాసుడు ఉపనిషత్తులకు అర్థం చెబుతూంటే - నేను చేతులు జోడించి - "మహాత్మా! నువ్వు నాలుగు వేదాలూ విభజించావు. భారతం రచించావు. యోగశాస్త్రం చెప్పావు. బ్రహ్మ సూత్రాలు నిర్మించావు. లోకాని కెంతో ఉపకారం చేశావు. కాని ఆ సూత్రాలకు కొందరు తమమతాని కనుగుణంగా విపరీతార్థాలు కల్పిస్తున్నారు. కనుక నువ్వాసూత్రాలకు నిశ్చయమైన అర్థం తేటపడేలా భాష్యం రచించమని నా ప్రార్థన" అన్నాను. వ్యాసుడు నవ్వుతూ - పూర్వమొకప్పుడు కైలాసంలో దేవతలు యీ విషయమే ప్రస్తావించారు. విను, ముందు - నా అంతటివాడు నీకు శిష్యుడు ఔతాడు. అ సర్వజ్ఞుడి చేత మంత్రించబడిన కుంభము నర్మదా నదీ ప్రవాహాన్నంతటినీ క్షణంలో తాగెయ్యగలదు. అదే నీకు గుర్తు. అతను దుష్టమతాలను ఖండిస్తూ నా బ్రహ్మసూత్రాలకు యదార్థమైన భాష్యం చేయగలడు. అతనివల్ల నీ కీర్తి కూడా అన్నిలోకాల్లోనూ వ్యాపిస్తుంది. కైలాసంలో తేలిన విషయమే" అని చెప్పి వ్యాసుడు ఎక్కడికో వెళ్ళిపోయాడు.

శంకరా! ఆ మహర్షి చెప్పిన వన్నీ నీలోకనపడుతున్నాయి. అజ్ఞానంలో కొట్టుకుంటున్న లోకా న్నుద్ధరించు. కాశీకి వెళ్ళి సూత్రభాష్యం రచించు. ఇది దేవసమ్మతము" అంటూ నిర్మలమైన దృష్టితో అతని వేపు చూశాడు.

శంకరుడు కొన్నాళ్ళు ప్రయాణం చేసి కాశీ చేరుకున్నాడు. గంగానదిలో స్నానం చేసి విశ్వనాథుణ్నర్చించి, అన్నపూర్ణను కొలిచి, భైరవాదులను సేవించి, తీర్థాలన్నింటిలోనూ స్నానాలు చేస్తూ కొన్నాళ్ళు కాశీపట్నంలో నివసించాడు.

# సనందుడి ప్రవేశం

**ఆ** సమయంలో ఒక బ్రాహ్మణ బ్రహ్మచారి తేజస్సుతో వెలిగిపోతూ, అద్భుతమైన రూపంతో, వైరాగ్య బుద్ధితో వచ్చి శంకరుడి పాదాలమీదపడి నమస్కరించాడు. శంకరుడడగగా -

"నేను బ్రాహ్మణుణ్ని. కావేరీ నది ప్రవహించే చోళదేశం నా నివాసం. మహాత్ములని దర్శించాలని యిల్లు వదలి తిరిగి తిరిగి ఇక్కడకు వచ్చి నాపూర్వపుణ్యంకొద్దీ నిన్ను చూశాను. జనుల నుద్ధరించగలవని విని నిన్నాశ్రయించడానికి వచ్చాను. కరుణతో నన్ను రక్షించు. నేను సంసారబంధం నుంచి విముక్తికోసం నిన్నాశ్రయిస్తున్నాను. ఈ తెగులు బాపగల వైద్యుడివి నువ్వే" అన్నాడు.

శంకరు డతని భక్తి విశ్వాసాలకు సంతోషించి - ఒకనాడు యధాశాస్త్రంగా బ్రహ్మభావం అతని కుపదేశించి సన్యాస మిప్పించాడు. అతనే - 'శంకరాచార్యుల ప్రధమ శిష్యుడు' అని వాడుకచెందిన సనందనుడు. తరువాత సనందనుడు - అలాగ సంసారసాగరంలో మునగకుండా ఉద్ధరించమని ప్రార్థించిన నామదేవుడు మొదలయిన శిష్యులని తురీయాశ్రమం అనేనావ నెక్కించాడు. అతని కీర్తి నలుదిశలా వ్యాపించింది. ఎందరో జనులతన్ని ఆరాధించి వక్రమార్గంలో నడుస్తున్న తమబుద్ధిని సవ్యం చేసుకున్నారు.

# విశ్వేశ్వరదర్శనం

**ఒ**కనాటి మధ్యాహ్నం ఎండలో శంకరుడు గంగానదికి వెళ్తూంటే - నాలుగు కుక్కలని తాళ్ళకు కట్టి ఆతాళ్ళను ముడివేసి పట్టుకుని తోలుగోచీ పెట్టుకుని, కల్లువాసన కొట్టుకుంటూ, మత్తుతో తూలుతూ, వింతమాటలాడి జనాలని నవ్విస్తూ, - ఒకమాల వాడెదురయ్యాడు. శంకరుడతన్ని అసహ్యించుకుంటూ - "దూరంగా తొలగు. ఆచార సంపన్నులమని ఎరుగవా?" అన్నాడు. అందు కామాలవాడు ఎర్రని

"కళ్ళతో చూస్తూ" - ఆకారానికి గొప్పవాడిలా కనపడుతున్నావు. మాటలు మాత్రం విపరీతంగా ఉన్నాయ్! నన్నెందుకు దూరంగా పొమ్మంటున్నావ్? సత్యజ్ఞాన ఆనంద స్వరూపమైన బ్రహ్మతత్త్వం సర్వాంతర్యామి అని శ్రుతులు చెబుతూంటే నీవెందుకిలా అంటావు? వేదముల అంతాలను చూస్తే నువ్వు యీ విధంగా అనవు, విద్వాంసుడా! నువ్వు దూరంగా పొమ్మంటున్నది ధేహాన్నా? ఐతే - నీ శరీరానికీ నా శరీరానికీ భేద మేముంది? శర్రీరాన్నిచ్చిన వాడినా? బ్రహ్మకు - వీడు బ్రాహ్మణుడనీ, వీడు మాలవాడనీ భేదం లేనే లేదు. సూర్యబింబం గంగలోనూ కల్లులోనూ కూడా ప్రతిఫలించదా? పవిత్రమైన బ్రాహ్మణ శరీరానికీ, పాపిష్టిదయిన ఛండాల శరీరానికీ తేడా లేదా? అని అడుగుతావా? బ్రహ్మ - అన్ని శరీరాల్లోనూ సూత్రంలా ఉండి ఉంటాడు కదా? శరీరాన్ని చూసుకుని నీకు అహంభావం ఎందుకు కలగాలి? అయ్యో! మహామాయావి ఐన పరమేశ్వరుడి ఇంద్రజాలంలో మహానుభావులు కూడా ములుగుతారు కదా!"

శంకరుడు ఆశ్చర్యపోయి "ఆత్మవేత్తవయిన నువ్వు పలికిన దంతా యదార్థమే. నీమాటలచే నీలో ఛండాలత్వం చూడడం వదిలేశాను. ఎవరికి జగమంతా ఆత్మ స్వరూపంగా తోస్తుందో వాడు బ్రాహ్మణుడైనా ఛండాలుడైనా గౌరవనీయుడే. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల యందు ఏ చైతన్యం ఉందో అదే చైతన్యం అన్ని ప్రాణులందూ ప్రకాశిస్తూంది. అదే నేను. అంతకంటె దృశ్యం మరేమీలేదని ఎవరి మనసులో తోచుతూ నిరంతరమూ ఉంటుందో - అతను ఛండాలుడైనా నాకు గురువే. నిన్ను నేను దేహాభిమానంతో కాని, ఆత్మను జయించాలని కానీ తొలగమనలేదు. నువ్వు నేను చెప్పినలాటి వాడివైతే, నాకు గురువువే -" అంటూంటే, ఆ మాలవాడి స్థానంలో జటలు, పాముల అలంకారాలు, అర్ధశరీరం, చంద్రవంక, తోలు - ధరించి, ప్రమధ గణాలు సేవిస్తున్న ఈశ్వరుడు ప్రత్యక్షమయ్యాడు.

శంకరు డతనికి భయభక్తి వినయ విస్మయాలతో సాష్టాంగ నమస్కారం చేసి అతన్ని స్తుతించాడు. అప్పుడు ఈశ్వరుడు "వత్సా!

నిన్ను పరీక్షించాలని వచ్చాను. నీ అద్వైత బుద్ధి గొప్పది. వ్యాసుడిలాగే నువ్వూ అనుగ్రహపాత్రుడివయ్యావు. వేదార్ధముల నెరిగిన వాడివి. గోవింద యతీంద్రుల వలన ధర్మాలన్నీ గ్రహించావు. అన్నిటికీ తగిన వాడివి కలిదోషం వల్ల కొందరు మూఢులు బ్రహ్మ సూత్రాదులకు కపట భాష్యాలు రచించారు. కాబట్టి వేదాలలోని యుక్తి ప్రయుక్తులచేత దుర్మతాలను ఖండించుతూ సూత్రభాష్యం రచించు. అది బ్రహ్మ సభయందు సైతం పూజించబడగలదు. అభినవగుప్త, నీలకంఠ భాస్కర, ప్రభాకర, మండనమిశ్రుడు మొదలయిన పండితులను విద్యావాదంలో ఓడించి వారిని అద్వైత మతావలంబకులని చేస్తావు. నీ శిష్యుల నక్కడక్కడ నిలిపి తరవాత నన్ను కలుసుకుంటావు." అని అంతర్ధానమాయ్యాడు.

శంకరుడు ఆశ్చర్యంతో ఆ వృత్తాంతాన్నే తలుచుకుంటూ, శిష్యులతో గంగానదిలో స్నానం చేసి – "వత్సా! సనందనా! ఈశ్వరుడు సూత్రభాష్యం రచించమని స్వయంగా ఆజ్ఞాపించాడు. వ్యాసుని అభిలాషకూడా అదే అని తెలిసింది. కనుక ఇక భాష్యం రచించాలి. అందుకు బదరికారణ్యం చాలా పవిత్రమైందీ, ఏకాంత ప్రదేశమూ. అక్కడి మహర్షుల సాయంకూడా లభిస్తుంది" అని....ఒక శుభముహూర్తంలో బయలుదేరి – కొన్నాళ్ళు నడిచి బదరికారణ్యం చేరుకున్నాడు.

## భాష్యప్రచారం

**త**నపన్నెండవ యేట శ్రీశంకరాచార్యులు బదరీ వనంలో బ్రహ్మర్షులతో కలసి ఎన్నోసార్లు ఉపనిషత్తుల అర్థాలు విమర్శించి; (ఆకలి, దాహం, విచారం, మోహం, ముసలితనం, మరణం) ఆరు ఊర్ములచేతా ఏడు ధాతువులచేతా, విషయపంచకంచేతా, అంతఃకరణ చతుష్టయంచేతా వ్యక్తమయ్యే శరీరతత్వం తెలియజేయడానికి మధురమైన, గంభీరార్థం కల సూత్ర భాష్యం రచించాడు. అది – అద్వైత తత్వాన్ని తేటతెల్లం చేస్తుంది. దానిలో బ్రహ్మవిద్యని ప్రతిపాదించే – నీచ, కేన, కర, ప్రశ్న, ముడంక, మాండూక్య, తైత్తరీయ, ఛాందోగ్య, బృహదారణ్య మొదలైన ఉపనిషత్తులకీ, మహాభారత సారం అయిన గీతకీ భాష్యాలని రచించాడు. తన శిష్యులకి వాటి అర్థాలు బోధించాడు.

సనందుడికి, సూత్రభాష్యాన్ని ముమ్మారు పఠింపజేసి దాని లోని గూఢార్థాలు వివరించి చెప్పాడు. అందువలన మిగిలిన శిష్యులు తమ గురువు కతనిమీద పక్షపాత మెక్కువ అని విచారించేవారు. అది గ్రహించి - ఒకనాడు సనందుడు గంగకవతలి వడ్డున ఉండగా - "సనందనా! వేగం యిటురా, పనుంది" అనికేకవేశాడు. అతను ఎంతో విశ్వాసంతో గంగానది మీద నడచి రాగా శంకరుడు అతన్ని కౌగలించుకుని ఆవిశేషం అందరికీ చెబుతూ పద్మపాదుడనే పేరుంచాడు. శంకరయతి ఒకనాడు శిష్యులకి పాఠం చెబుతూంటే విరుద్ధమతస్థులు వచ్చి అతనితో వాదించబోయి భంగపడి పలాయనం చిత్తగించారు. అది చూసి వారి శిష్యులు పద్మపాదుడు, వాసుదేవుడు బ్రహ్మసూత్ర భాష్యం చేసిన మేలుని ఎన్నోవిధాల తమలో తాము ప్రశంసించుకున్నారు.

## వ్యాసదర్శనం

ఒకనాడు శంకరయతి గంగాతీరంలో కూర్చుని శిష్యులకు సూత్రభాష్యం పాఠాలు చెబుతూంటే....ఒక వృద్ధ బ్రాహ్మణుడు దండాన్ని ఊతగా చేసుకుని అక్కడికి వచ్చి అతని కెదురుగా నిలబడి - "అయ్యా! నువ్వెవ్వరు? శిష్యుల చేత ఏం చదివిస్తున్నావు?" అని అడిగాడు.

అందుకు శిష్యులే అతనికి సమాధానాలు చెప్పారు. ఆ వృద్ధుడు ఆశ్చర్యం నటిస్తూ - "అయ్యా! మీరు సూత్రభాష్యం రచించారని మీ శిష్యులు చెబుతున్నారు. మీ ప్రజ్ఞాప్రభావాలు అసామాన్యమైనవి. ఏదీ? ఒకసూత్రం చదివి అర్థం చెప్పండి. మీ సామర్థ్యం వింటాను." అన్నాడు. అందుకు శంకరుడు - "అయ్యా! నేను సూత్రార్థాలని బాగా ఎరిగిన వాడినని చెప్పుకోలేను. వేత్తలను గురువులుగా ఎంచి నాకు తెలిసింది చెబుతాను. ఏ సూత్రానికర్థం చెప్పమంటారు?" అని అడిగాడు.

"మూడవఅధ్యాయంలో మొదటి సూత్రం" అన్నాడా వృద్ధుడు.

శంకరుడు చెప్పిన అర్థాన్ని ఎగతాళి చేస్తూ అతను సాంఖ్య, బౌద్ధ, శేషిక దిగంబరుల కల్పనలనూ, వేదసమ్మతము కానివీ చెప్పాడు.

అలాగ ఎన్నో విధాలుగా పరీక్షిస్తున్న ఆ బ్రాహ్మణుడు - వ్యాసుడే అనీ అతని జ్ఞానాన్ని పరీక్షించడానికి వచ్చాడనీ, లేకపోతే అతనితో యిన్ని దినములు వాదించలేడనీ భావించిన పద్మపాదుడు - 'తప్పుతోవలు తొక్కుతూ కూడా ప్రసంగంలోని యుక్తితో తనవాదాన్ని నిలుపు కుంటున్న యితని నెలా గెలవాలో తెలియడం లేదు ఉపాయమేమిటి?" అని అడిగిన శంకరుడికి తన మసులోని మాట చెప్పాడు. "శంకరాచార్య! నీవు శంకరుడివి. అతను నారాయణుడు. మీరు ప్రసంగిస్తూంటే వింటున్నాం. కాని మాకేమీ బోధపడడంలేదు. మీ మహత్యము మీ మహానుభావులకే ఎరుక" అని పద్మపాదు డనగానే - శంకరుడు ఆ బ్రాహ్మణుని వ్యాసునిగా నిశ్చయించి స్తుతించాడు. "నా తప్పులు సవరించి నీ రూపం చూపు" అని ప్రార్థించాడు. వ్యాసుడు నిజరూపంలో సాక్షాత్కరించాడు.

శంకరుడతనికి నమస్కరించి అతని ఘనతనెంతో ప్రశంసించగా - వ్యాసుడు - "యతిసార్వభౌమా! నువ్వూమాలాగే ప్రఖ్యాతుడి వయ్యావు. నీ అఖండ పాండిత్యం తెలుసుకున్నాను. నువ్వు నాకత్యంత ప్రీతిపాత్రుడి వయ్యావు. నువ్వు నా సూత్రాలకు భాష్యం రచించావని విని చూడవచ్చాను. నీ భాష్యం నాకు మెప్పు తెచ్చింది." అన్నాడు.

"మహాత్మా! మీ శిష్యులు జైన, వైశంపాయనాది మహర్షులు లోకాతీతులు. వారిముందు నేనెంత? ఇలాటి దీనుడి మీద దయచూపిన నువ్వెంత కృపామయుడివి. నా సూక్తులలోని తప్పులను సవరించమని వేడుకుంటున్నాను." అని శంకరు డందించగా అతను రెండు చేతులతోనూ స్వీకరించి ఆభాష్యాన్నంతటినీ చక్కగా చూశాడు. "తాతా! శంకరా! బ్రహ్మచర్యంనుంచీ సంన్యసించిన నీకు కాక - ఎన్నో అర్థాలూ, భావాలూ కల నా సూత్రములను వివరించడం యితరులకు శక్యమా? వేదాంత మార్గమును చక్కబరచడానికి అపర శివుడవెన నీకే శక్యం. ఇంతకు పూర్వం ఎందరో పండితులు రచించినా నీ భాష్యంలా ఏదీ నా మనసు కెక్కలేదు. నువ్వు సర్వసమర్థుడివి. వేదాంత విద్యను భూమంతా వ్యాపింపజెయ్యి. భేదించిన విద్వాంసుల నోడించి, అనుబంధ గ్రందాలు రచించు. నీకు విజయ మగుగాక. నేను పోయి వస్తాను "

——— కాశీ మజిలీ కథలు - 5వ భాగం

'స్వామీ! నీ అనుగ్రహం వల్ల అనేక భాష్యాలు రచించాను. శిష్యులకు చెప్పాను. కులమత వాదులని ఓడించాను. ఇక నాకర్తవ్య మేమిటి? కొంచెం సేపు మీరీ మణికర్ణికా క్షేత్రంలో ఉండండి. మీ ముందు ప్రాణాలు వదిలి కైవల్యం చెందుతాను. నాకు కాలం సమీపించింది –" అన్నాడు శంకరుడు.

వ్యాసుడు కొంచెం ఆలోచించి – "శంకరా! అలా చెయ్యొద్దు. అద్వైత విద్యావిరోధులు కొంద రింకా భూమిమీద ఉన్నారు. వారందరినీ జయించడానికి నువ్వు భూమిమీద కొంతకాలం ఉండాలి. లేకపోతే మోక్షేచ్ఛ తల్లిలేని పిల్లవా డవుతుంది. యతివరేణ్యా! ప్రసన్న గంభీరార్ధాలతో ఒప్పుచున్న నీ భాష్యప్రబంధాలు చూడడం వలన కలిగిన ఆనందం నీకు వరమిమ్మని నన్ను ప్రేరేపిస్తూంది. ఈశ్వరాజ్ఞచే నీవింకనూ పదహారేళ్ళు ఆయువు పొందగలవు. నువ్వు రచించిన భాష్యం ఆచంద్రతారార్కం. స్థిరంగా ఉంటుంది. నువ్వీపదహారేళ్ళలోనూ దేశాటనం చేస్తూ – అద్వైత విద్యా వైరులను జయించగలవు." అన్నాడు వ్యాసుడు "పరసవేదిసంపర్కంతో లోహం బంగారమైనట్లు మీ సూత్రాల వలన భాష్యం వన్నె కెక్కుతూంది. నేనెంతో పుణ్యం. చేసుకున్నాను. దేవర ఆజ్ఞ ప్రకారమే కానివ్వండి" అని శంకరుడు వ్యాసుని పాదాలకు నమస్కరించాడు. అతన్ని దీవించి వ్యాసుడంతర్ధానమయ్యాడు.

దిగ్విజయం చేయాలని సంకల్పించి శిష్యులసమేతంగా ఒకశుభముహూర్తంలో కాశీ బయలుదేరి.....కొన్నాళ్ళయ్యాక ప్రయాగ వెళ్ళి ఆ మహాత్మ్యాన్ని అంతఃకరణంతో గోచరింప జేసుకుని – పద్మ పాదుడితో – "వత్సా! ఈ మహాక్షేత్రంలో ఒక్కరోజు నివసించినా యాగాలకంటె అధికఫలం యిస్తుంది కనుకనే ప్రయాగ అని సార్థక నామధేయ అయింది. ఇక్కడ మందాకిని కాళిందీ నదితో కలుస్తూంది చూశావా? దీనిలో మునిగినవారు దివ్య శరీరాలు తాల్చి వ్యాధుల నెరగక పరమసౌఖ్యాలు అనుభవిస్తారని వేదాల్లో చెప్పబడింది" అంటూ అనేక విధాలుగా ఆ స్థల మహత్మ్యం వివరించి త్రివేణికి వెళ్ళి స్నానం చేస్తూ తల్లిని తలచుకుని చల్లగాలులు శరీరానికి హాయి కొలుపుతూంటే శిష్యులతో వినోదకాలక్షేపం చేసి ఆతీరంలోని యిసకమీద విశ్రమించాడు.

# భట్టిపాదుడి కథ

"వేదం ఎక్కువని వాదించి ఎవడు కొండనుంచి భూమికి పడిపోయాడో, బౌద్ధచార్వాక మతాలను దండింప జేశాడో ఆ భట్టపాదుడు గురువుపట్ల చేసిన దోషాన్ని పోగొట్టుకుందు కిప్పుడు అగ్నిలో ప్రవేశిస్తున్నాడు" అని ఎవరో చెప్పకుంటూంటే అదిరిపడి లేచి శంకరుడు శిష్యులతో కూడి అతనెక్కడున్నాడో కనుక్కుంటూ అక్కడికి చేరుకున్నాడు. ఊక కుప్పమీద పడుకుని దానిలోని అగ్నికి వొళ్ళంతా కమలినా ముఖంలోని తేజస్సు తగ్గక, శిష్యులు చుట్టూ ఉండగా కన్నీరు కారుస్తున్న భట్టపాదుణ్ని చూశాడు.

అతను శంకరాచార్యులకూ శిష్యులకూ అతిధి సత్కారాలు చేశాడు. కుశలప్రశ్నలు వేశాక శంకరుడు తన సూత్ర భాష్యాన్ని ఆ పండితుడికి సంక్షిప్తంగా వినిపించాడు. అదివిని ఆ పండితుడెంతో పొగిడి, "ఈ దీక్షే వహింపకపోతే మీ భాష్యానికి మరో భాష్యం రచించి కృతార్థుడిని కాకపోయానా? అలాటి యోగం నాకులేదు. మీవంటి మహాత్ములదర్శనం, విశేషించి యిలాటి సమయంలో - దుర్లభం. సంసారం సాగరంలో మునిగిన వారు దరిచేరడానికి మీలాటి ఉదారుల సాంగత్యంకాక మరోసాధనం ఏముంది? ఎన్నాళ్ళు గానో మిమ్మల్ని చూడాలను కుంటున్నాను. నేటికి నాకోరికతీరింది. నేను వేదానికి కర్మమార్గ నిర్ణయం చేశాను. విషయ సుఖా లనుభవించాను. కానీ కాలాన్ని జయించలేక పోయాను. వేదాలకు స్వతంత్రంకల్పించి ఈశ్వరుణ్ని నిరాకరించాను. గురుద్రోహం చేశాను. ఈ రెండు పాపాలూ పోగొట్టుకుందుకు యిలా అగ్నిప్రవేశం చేస్తున్నాను." అన్నాడు. "ఆవృత్తాంతం చెప్పు" అని శంకరు డడిగాడు.

# భట్టిపాదుని వృత్తాంతం

"నేను పుట్టేవరకూ ప్రపంచమంతా బౌద్ధమతం వ్యాపించి ఉంది. వైదికతంత్రాలు ఆకాశ కుసుమాలే. ఆ పరిస్థితిలో నేను తొందరగా చదువుకుని - వేదమార్గం చక్కజెయ్యాలనీ - అందుకు ఇతరమతాలలోని ఉద్దండులని జయిస్తే తప్ప సాధ్యంకాదనీ గ్రహించాను. కాని వారి మతం తెలుసుకోనిదే వాళ్ళతో మాట్లాడలేనని తెలుసుకుని - నేనా వేషం ధరించి ఒక బౌద్ధమత గురువు వద్దకు వెళ్ళి - "అయ్యా! నేను బౌద్ధమతస్తుడిని. ఆశాస్త్రాలన్నీ నాకు బోధించండి" అని ప్రార్థించాను. అతను నన్ను నమ్మి ఆ మతమర్మాలన్నీ నాకు బోధించాడు.

ఒకనాడు సభలో పక్షపాత బుద్ధికల బౌద్ధుడొకడు - "ఓహో! వేదాలు ప్రత్యక్షప్రమాణ విరుద్ధంగా ఈశ్వరుడెవడో ఉన్నాడని చెబుతున్నాయి. ఉన్నవాడు కనపడక పోతాడా? మొదట కర్మ చేయమని, తరవాత దానితో ఏమీ ప్రయోజనం లేదనీ చెబుతూంది. ఇలాటి పాడు శాస్త్రాన్ని ప్రమాణంగా తీసుకుని జీవహింసలని చేసే వైదికుల నేం చేసినా తప్పులేదు. వాళ్ళ మొహం చూస్తేనే పాపం-" అంటూ నిందిస్తూంటే నాకుకన్నీరాగలేదు. అదిచూసి -

"వీడెవడో వైదికుడిలా ఉన్నాడు. మన మతధర్మాలు గ్రహించాలని వచ్చి ఉంటాడు. వేదనిందని భరించలేక దుఃఖిస్తున్నాడు" అన్నారెవరో. గురువుకి నామీద నమ్మకం పోయి మర్మాలను చెప్పడం మానేయడమేకాక, నిద్రపోతున్న నన్నొక నాడు మేడమీద నుంచి నేలమీదకి పడదోయించాడు. పడుతూండగా, తెలివి వచ్చిన నేను "వేదమే ప్రమాణమైతే దెబ్బతగలక బ్రతుకుతాను" అన్నాను.

సందేహపూర్వకంగా పలకడం వల్ల ఒక కన్ను పోయింది. ఇంకేమీ కాలేదు.

బౌద్ధ మతస్తులతో నిండి ఉన్న సభలో - కోకిల కూత నాధారం చేసుకుని బౌద్ధానికి విరుద్ధంగా పద్యం చదవగా - వారు కోపంతో

అప్పటి కప్పుడు ప్రసంగానికి పూనుకుని చిత్తుగా ఓడిపోయారు. నేనా రాజుకి వేద ప్రభావం బోధించగా అతనది విని ఆశ్చర్యపోయి - "ఏమతస్తుడు కొండశిఖరం మీంచి పడ్డా చెక్కుచెదరడో ఆ మతమే నాకు సమ్మతం" అని పరీక్షపెట్టగా నేనంగీకరించి - ఒక పర్వతమెక్కి వేదపురుషుణ్ని భక్తితో ధ్యానించి, వేదమే ప్రమాణమైతే, దానిలో దైవమే ఉంటే, నాకు కొంచెమైనా దెబ్బతగలదు" అంటూ దూకేశాను. దూది బంతిలా నేలమీపడి దెబ్బ తగలక మిగిలిన నన్ను చూడడాని కెక్కడెక్కడి నుంచో ఎందరో బ్రాహ్మణులు వచ్చారు.

రాజు నన్నుచూసి, వేద ప్రభావాన్ని వెయ్యి విధాల ప్రశంశిస్తూ దుర్మతంలో ఉన్న తనను నిందించుకున్నాడు బౌద్ధులు - "ఇంతమాత్రానికే ఆ మతం అత్యుత్తమం కాబోదు. మంత్ర తంత్రాలతో దేహాన్ని రక్షించుకోవచ్చు" అన్నారు.

"ఐతే - మరొక పరీక్ష పెడతాను." అంటూ రాజు ఒక కుండని చూపి - "దీనిలో ఏముంది?" అని అడిగాడు.
మేమందరమూ "రేపు చెబుతాం." అని యిళ్ళకి పోయాం. పీకల వరకూ నీళ్ళలో ములిగి నేను లోకబాంధవుణ్ని ప్రార్థించగా అతను నాకు కర్తవ్యం బోధించాడు. మర్నాడు రాజడుగగా "భోగశయనుడైన శ్రీవిష్ణువున్నాడు" అని చెప్పాను. అతను తలూపుతూ కుండమూత తీయించి చూడగా శేషశయనుడైన వాసుదేవుని ఆకృతి కనిపించింది. దానితో అతని సందేహాలన్నీ తీరిపోయి శ్రుతుల ప్రమాణమే సాద్గుణ్యమని నిశ్చయించి - బౌద్ధులందరినీ వధించి రమ్మని కింకరులను ఆజ్ఞాపించాడు. వారు బౌద్ధ వన్న వానిని మిగలకుండా చంపారు. అప్పుడు నేను భూమంతా వేదశాఖలు వ్యాపింపజేశాను. మహాత్మా! ఒక్క అక్షరం చెప్పిన వాడేనా గురువే. అలాటిది శాస్త్రాలే చెప్పిన నా గురువుని కులమే మిగలకుండా అంతం చేశాను. ఇంతకంటె పాప మేముంటుంది? బౌద్ధ శాస్త్రాలు చదువుతున్నప్పుడు పరమేశ్వరుని లేనివానిగా నిందించాను. ఈ పాపాలు

పోగొట్టుకుందుకే అగ్ని ప్రవేశం చేస్తున్నాను. నువ్వు అద్వైత మార్గం రక్షించడాని కవతరించిన ఆదిశంకరుడివని ఎరుగుదును. నీభాష్యానికి కొంచెమైనా అర్థం తెల్పే అదృష్టానికి నోచుకోలేక పోయాను. కాని.....యిప్పుడు మాటలతో ఏంప్రయోజనం?"

శంకరుడతన్ని దయగా చూస్తూ - "నువ్వు వేదకర్మవిముఖులగు బౌద్ధులను దండించడాని కవతరించిన షణ్ముఖుడివి. నీకు పాపమేమిటి? సజ్జన ధర్మాలను బోధించడానికి నియమాలు పాటించావు. నా కమండలంలోని జలంతో నిన్ను బ్రతికిస్తాను. సూత్రభాష్యానికి వార్తికము రచిస్తావా?" అని అడిగాడు.

"మహాత్మా! నన్ను బ్రతికించడం నీకే పాటిది? కాని... సంకల్పించిన వ్రతాన్ని జీవితాశతో వదలిపెడితే నిందపడతాను. నన్నునుగ్రహించాలంటే - జన్మతారకమైన బ్రహ్మంఉపదేశించి కృతార్థుణ్ని చెయ్యి. మండనమిశ్రుడి ప్రఖ్యాతి నువ్వువినే ఉంటావు. అతను నా శిష్యుడే కాని నాకంటే ఎక్కువ విద్వాంసుడు. వైదిక కర్మలలో మునిగి ఉన్నాడు. అతనిని జయించు. లోకమంతావశం చేసుకో. అతని భార్య భారతి కూడా సాక్షాత్తు సరస్వతే. ఆమెను మధ్యవర్తినిగా చేసుకుని వాదంలో జయించి నీ భాష్యానికి వార్తికాలు చేయించు. తారకోపదేశం చెయ్యి. కొంచెం సేపిక్కడుండు. నిన్ను చూస్తూ ప్రాణం వదలి కైవల్యం చెందుతాను" అని ప్రార్థించాడు. శంకరుడ తనిమీద దయతో బ్రహ్మం ఉపదేశించి మోహశూన్యుణ్ని చేశాడు. భట్టపాదుని ముక్తి నొందించి శంకరుడు మాహిష్మతీ నగరానికి బయలుదేరాడు."

అని చెప్పి మణిసిద్ధు డప్పటికి కాలాతీత మవడం వల్ల మిగిలిన కథను తరవాత మజిలీలో చెప్పసాగాడు.

# కాశీ మజిలీ కథలు

## 46. వ మజిలీ

ఒకనాడు నారదుడు దేవలోకం నుంచి వస్తూంటే తుంబురు డెదురు పడ్డాడు. అత నడగగా నారదుడు – "మహేశ్వరుడు భూమిమీద శంకరావతార మెత్తాడు." అన్నాడు

**తుంబురుడు** : ఎందుకూ?

**నారదుడు** : విష్ణువు బుద్ధావతారమెత్తి ఆ ధర్మాలని భూమిమీద వ్యాపింప జేశాడని ఎరుగుదువు కదా. త్రిపురదానవకాంతలను వంచించడానికి విష్ణువు బుద్ధుడై అవతరించాడు. ఆ శాస్త్రం చదివి బౌద్ధమతస్థులు వర్ణాశ్రమాలు వదిలేసి, క్రతువులను దూషించసాగారు. క్రతు భోక్తలు హవిర్భాగము లిచ్చే వారు లేకపోడంతో ఆ విషయం శివుడికి తెలిపారు.

**తుంబురుడు** : యజ్ఞాలు, అన్నప్రదాతలు లేకపోతే కష్టమేకదా. తరవాత?

**నారదుడు** : శివుడు కుమార స్వామిని – భట్టపాదుడనే పేరుతో బౌద్ధమతాన్ని ఖండిస్తూ వేదాలనీ, కర్మకాండనీ ఉద్ధరించమని ఆజ్ఞాపించాడు. షణ్ముఖుడు ఆపని నిర్వర్తించాడు. తరవాత పరమేశ్వరుడు దక్షిణదేశంలో – శివగురుడనే బ్రాహ్మణోత్తముడికి పుత్రుడిగా జన్మించి, బాల్యంలోనే సకల విద్యలూ నేర్చి, బ్రహ్మచర్యం నుంచే సన్యసించి గోవిందయతి అనుమతితో వ్యాస సూత్రాలకు అద్వైత భాష్యం రచించి, శిష్య బృందంతో భట్టపాదునికి ముక్తి నొందించి, అతని శిష్యుడూ బ్రహ్మాంశ సంభూతుడూ అయిన మండనమిశ్రుని జయించడానికి వెళ్తున్నాడు.

దుర్వాసుడి శాపంతో – సరస్వతి, ఉభయభారతి అనేపేరుతో అతనికి భార్య అయింది. ఆమె వారికి మధ్యవర్తి. ఇప్పుడు జరగబోయే ఆ పండితుల ప్రసంగాన్ని వినాలనే వెళ్తున్నాను

**తుంబురుడు** : నీకు మంచి భోజనం దొరికిందన్నమాట. సకల లోకానికీ పూజ్యురాలయిన సరస్వతినికూడా శపించాడా దుర్వాసుడు?

**నారదుడు** : అదీ చెప్పాలా?... సరే... సత్యలోకంలో జరిగిన మహాసభలో దేవతా గణాలూ, దిక్పాలురూ మహర్షులూ తమ విద్యాపాటవాలని బ్రహ్మకి చూపుతూంటే దుర్వాసుడు తనకి సామగానం గొప్పదంటూ గట్టిగా ఆ వేదం పఠించసాగాడు. ఒకచోట స్వరం తప్పగా సరస్వతి ఫక్కున నవ్వింది. ఆ అవమానాన్ని సహింపలేక – 'పెద్ద చిన్నలను తారతమ్యం తెలుసుకోక పరిహసించిన నువ్వు భూమ్మీద మనుష్య జాతిలో పుట్టు – ఇంకెప్పుడూ అలా పరిహసించవు' అని శపించాడు.

**తుంబురుడు** : మరి....బ్రహ్మ ఊరకున్నాడా?

**నారదుడు** : లేదు శాపనివృత్తికి దుర్వాసుణ్ని బతిమాలుకున్నాడు. శంకరుని చూసి ప్రసంగించినప్పుడు శాపవిమోచన మౌతుందని దుర్వాసుడు అనుగ్రహించాడు. సరస్వతి – శోణానదీ తీరంలో విష్ణుమిత్రుడనే బ్రాహ్మణునకు ఉభయభారతి అనే పే ుతో పుత్రికగా జన్మించి, మండనమిశ్రుడికి భార్యయై శాపావసానానికి చూస్తూంది. ఇప్పుడు శంకరుడక్కడికి వెళ్తున్నాడు. సంవాదం వినాలని నేనూ పోతున్నాను. ఈ రహస్యం ఎక్కడా చెప్పకు.

శంకరుడు మండనమిశ్రుడి మందిరం ప్రవేశించడానికి శక్యం కాకపోవడంతో శిష్యులనక్కడ ఉండమని యోగశక్తితో ఆకాశమార్గంలో దానిలో ప్రవేశించాడు అప్పుడు – మండన పండితుడు శ్రాద్ధవిధి చేస్తూ వ్యాసుడినీ జైమినినీ భోక్తలుగా నియమించి కాళ్ళు కడుగుతున్నాడు. అందుచేత ఆ యతిని చూసి కోపిస్తూ, దుర్వాక్యము లాడసాగాడు. శంకరుడు వానికి తగిన సమాధానలిచ్చాడు. అప్పుడు వ్యాసుడు, జైమిని – "వత్సా! మండన! తత్త్వవేత్త అయిన అతిథి యింటికి వస్తే అర్చించవలసింది పోయి దుర్భాషలాడతావేం? అతిథిపూజలు చెయ్యి" అని ఆజ్ఞాపించారు.

అప్పుడు శంకరుడు - "నేనన్నంకోరి నీవద్దకురాలేదు. వివాదభిక్షని కోరివచ్చాను. సమర్థుడివైతే అది యిచ్చి పంపు. దానిలో ఓడిన వారు, ఓడనివారికి శిష్యులై ఉండాలని షరతేర్పరచాలి. యతికి నిషిద్ధమైన వాదభిక్ష నీకెందుకు? - అంటావా....ఉపనిషన్మార్గము వెల్లడి చేయడం కంటె నాకు వేరొక కోరికేమీ లేదు. సంసార తాపాన్ని పరిహరించే, పరమానందమిచ్చే ఆ మార్గాన్ని నువ్వు తిరస్కరించావు. నీలాటి వారినందరినీ వాదంలో జయించి భూమంతా ఆరాజమార్గాన్ని ప్రవేశపెడతాను. నువ్వు కూడా పరమోత్తమమైన నామతాన్ని స్వీకరించు. లేదా, వాదానికిరా. అందుకు చాలకపోతే ఓడిపోయానని అంగీకరించు" అన్నాడు గంభీరంగా.

మండను డామాటలు విని ఆశ్చర్యము తోనూ పరాభవంతోనూ ఆత్మగౌరవంతోనూ "ఏమన్నావ్? మండనుని పాండిత్యప్రకర్ష నువ్వెరగవు కాబోలు. సహస్రముఖుడైన అనంతుడినే పరిహసించగల అతని ముందు నువ్వెంత? వేద సమ్మతమైన మతాన్ని వదలి, వ్యాసుడూ నువ్వూ కొత్తగా కల్పించిన మతంలో ప్రవేశించే వాడు కాదు. ఎప్పుడేనా ఒక పండితుడు పుడతాడా, ప్రసంగిస్తానా అని వేడుక పడుతూంటాను. మధ్యవర్తి ఎవరు?" అని వ్యాస జైమినులను మధ్యవర్తులుగా ఉండమని ప్రార్థించాడు. కాని - వారు సరస్వతియే తగినదని వారిద్దరినీ అంగీకరింపజేశారు. మర్నాడు "నేను ఉపనిషత్ అర్థాలను ప్రమాణంగా చేసుకుని వాదిస్తాను. ఓడిపోతే సన్యాసం వదిలి గృహస్థాశ్రమం స్వీకరిస్తాను." అని శంకరుడూ, "నేనోడిపోతే సన్యాసం స్వీకరించి నీ శిష్యుడి నౌతాను" అని మండనుడూ ప్రతిజ్ఞలు చేసి వాదాలు ప్రారంభించారు. అది వినడానికి బ్రహ్మాదిదేవతలు దగ్గరలో విమానాల మీద ఉన్నారు. వారిద్దరి మెడలలోనూ పూల మాలలు వేసి - "ఓడిన వారి మెడలోని మాల వాడిపోతుంది. అదే నిదర్శనం" అంటూ తనపనులు చూసుకోడానికి వెళ్ళిపోయింది ఉభయభారతి. శంకరుడు - మండనమిశ్రుడి ప్రశ్నలన్నింటినీ మృదువైన వాక్యచాతుర్యం తోటీ, శాస్త్ర దృష్టాంతాల తోటీ ఖండిస్తూ, తనమతాన్ని స్థిరపరుస్తూంటే, తన భర్తమెడలోని పూలమాల వాడిపోడం చూసి ఉభయభారతి

ఆశ్చర్యపోతూ - భోజనానికి లెమ్మని - భోజనమయ్యాక యిలా అంది - "ఆర్యా! నువ్వాది శంకరుడివని తెలుసుకున్నాను. నీ దయవల్ల దుర్వాసుడి శాపం తొలిగి కృతార్థురాలినయ్యాను. ఇక సత్యలోకానికి వెళ్తాను." అని ఆమె ప్రయాణమౌతూంటే, ఆమెను కూడా జయించి అద్వైతమును స్థాపించాలనే ఉద్దేశంతో ఆమెను మంత్రంచేత బంధించి - "దేవీ! నువ్వులోక కళ్యాణార్థం అవతరించిన సరస్వతి వని ఎరుగుదును. నేను నీ భక్తుడిని. దయచూడు. మరికొంత కాలమిక్కడ ఉండి వెళ్ళు. లోకహితమౌతుంది" అని ప్రార్థించాడు. మండన పండితుడి అభిప్రాయ మేమిటన్నట్లతని ముఖం చూశాడు.

మండనుడు "ఆర్యా! ఈ కొత్తపరాజయం వల్ల విచారమేమీ లేదు. జైమిని వాక్యాలను పరాభవించాననే నాబాధ. అతనెందుకిలాటి వ్యర్థ సూత్రాలు రచించాడో?" అన్నాడు.

శంకరుడు నవ్వుతూ - "జైమిని యందు అన్యాయం లేదు. అతని అభిప్రాయాన్ని మనమే సరిగా అర్థం చేసుకోలేకపోయాం" అన్నాడు.

"యతిసార్వభౌమా! పండితులకుకూడా తెలియని జైమిని అభిప్రాయం మరేదో - చెప్పు. నువ్వు చెప్పింది సరి అయినదనిపిస్తే అహంకార మమకారాలు వదిలేస్తాను." అని మండను డనగా - శంకరుడు జైమిని వాక్యాలలో గల రహస్య విశేషాలను వివరించాడు. మండనుడు జైమినిని ధ్యానించగా అతను వచ్చి - శంకరుడు చెప్పిన అర్థమే తన హృదయంలోనిదనీ, తాను తనగురువైన వ్యాసమహర్షి సూత్రాలకు విరోధంగా ఒక్కసూత్రం కూడా చెప్పలేదనీ,...సంసార సాగరంలో మునిగిన వారి నుద్ధరించడానికి పరమేశ్వరుడే శంకరుడిగా అవతరించాడనీ చెప్పి అంతర్ధానమయ్యాడు.

అప్పుడు మండనుడు ఎంతో పశ్చాత్తాపపడి...తన కర్తవ్యమేమిటని శంకరుణ్నడుగుతూ అతని పాదాలమీద పడిపోయాడు. అతన్ని శిష్యుడిగా స్వీకరించదలచి - అతని భార్యవేపు శంకరుడు చూశాడు.

# ఉభయ భారతి బాల్యం

ఆ మహాదేవి అతని అభిప్రాయం గ్రహించి – "యతీంద్రుడా! మండనమిశ్రుడు నీశిష్యుడౌతాడని ముందే నాకు తెలుసు. చిన్నతనంలో, నేను మా తల్లి యింట్లో ఉండగా ఒక తాపసోత్తముడు వచ్చాడు. అతనికి మా తల్లి అర్ఘ్యపాదాదు లర్పించింది. "ఈ పసికూన నా కూతురు. దీని అయువెంత? పతి ఎట్టివాడు లభిస్తాడు? పిల్లలెందరు? ధనధాన్యాలు కలిగి ఉంటుందా?" అని అడిగింది.

అప్పుడా తాపసి – "నీపుత్రిక చాలా సౌఖ్యం అనుభవిస్తుంది. వేదమార్గం యితరమతాల చేత కప్పబడుతూంటే దానిని చక్కబరచడానికి మండన పండితుడు ఉదయించాడు. ఈమె అతనికి భార్యయై అనేక యజ్ఞాలు చేసి పుత్ర పౌత్రాది సంపదలతో చిరకాలం సుఖపడుతుంది. అప్పుడు ఉపనిషత్సిద్ధాంతాలను సాధించడానికి శంకరుడు భూమిమీద పుట్టి యతివేషంతో మండనుడితో చాలాసేపు వాదించి అతన్ని జయించి శరణిచ్చి శిష్యుణ్ణి చేసుకుంటాడు –" అని చెప్పి అంతర్ధాన మయ్యాడు.

అతను చెప్పినట్లే అంతా జరిగింది. ఇతను నీకు శిష్యుడు కాకేమౌతాడు? నేనతని సగం శరీరాన్ని కనుక నన్ను కూడా జయిస్తే తప్ప నీది సంపూర్ణ విజయంకాదు. నన్ను కూడా జయించి అతన్ని శిష్యుడిగా చేసుకో. నువ్వు జగదీశ్వరుడివని తెలిసినా నీతో వాదించాలని నాకు ముచ్చటగా ఉంది" అంది ఉభయభారతి.

ఆమె మాటల కానందిస్తూనే – "దేవీ! నీతో వాదించాలని నాకున్నా అది అనుచిత మనిపిస్తూంది. కీర్తివంతులు స్త్రీలతో ప్రసంగించడానికి సమ్మతింపరుకదా" అన్నాడు. అప్పుడామె – "స్వమత ఖండన కావించే వారు స్త్రీ అయినా పురుషుడైనా జయించడానికి ప్రయత్నించవలసిందే. ఇంతకు పూర్వం గార్గి అనే స్త్రీతో యాజ్ఞవల్క్యుడు ప్రసంగించిన విషయం బృహదారణ్య కోపనిషత్ నుంచి చూడు" అంటూ ఉదాహరణలిచ్చే సరికి అతను ఆమెతో ప్రసంగం చేయడానికి అంగీకరించాడు.

# శంకర సరస్వతుల సంవాదం

ఆ సభలో శంకరుడు సరస్వతి ఎవరికి వారే విజయం సాధించాలనే కోరికతో విద్వాంసులకు విస్మయం కలుగజేస్తూ, చాతుర్యంగా పద ప్రయోగాలు చేస్తూ, కాలాన్ని కూడా మరిచి - పదిహేడు రోజులు ఏకధాటిగా ప్రసంగించారు. దేనిలోనూ శంకరుడిని జయించలేక, బాల్యాన్నే సన్యసించిన అతనికి కామశాస్త్రంలో ప్రవేశం ఉండదు కనుక దానిలో అడిగి ఓడించడం కంటె మరోసాధనం లేదని నిశ్చయించుకుంది భారతి.

"యతీంద్రా! మన్మధకళ లెన్ని? వాటి స్వరూపస్థానాలేమిటి? శుక్ల, కృష్ణ పక్షాలందు ఏ మార్పులు చెందుతాయి? స్త్రీ పురుషులలో అవిఎలా ఉంటాయి?" అని అడిగింది.

శంకరుడు కొంచెంసేపు ఆలోచనలో పడ్డాడు. ఈమె - కామశాస్త్రంలో అడిగింది. చెప్పకపోతే అల్పజ్ఞత దోషం వస్తుంది. చెబితే ధర్మలోపం వస్తుంది. ఏం చేయాలి?" అనుకుని సాధ్వీ! నాకొక మాసం గడువివ్వు. అప్పుడు నా మదనశాస్త్ర ప్రవీణత చూద్దువుగాని." అన్నాడు. గడువడగడం ధర్మమే కనక అనుమతించబడింది.

శంకరుడు శిష్యులతో నర్మదా నదీ తీరంలో ఉద్యాన వనంలో ప్రవేశించి అక్కడ ఆ రాత్రి గడిపాడు. మర్నాడు ఉదయం శిష్యులతో కూడ యోగంలో గగనమార్గంలో వెళ్తూ అరణ్యం మధ్యలో రాత్రి వేటకై వచ్చి చనిపోయిన అమరకుడనే రాజునీ, అతని చుట్టూ ఏడుస్తూ కూర్చున్న నూరుగురు భార్యలనీ చూశాడు.

సనందుడితో - "చూశావా! ఇతని భార్యలు సౌందర్య సౌభాగ్యాలతో ప్రకాశిస్తున్నారు. పతి వియోగంతో ఎలా చింతిస్తున్నారో చూడు. హఠాత్తుగా మరణించిన వీని దేహంలో ప్రవేశించి, వారిశోకం ఉపశమింపజేసి వీని పుత్రుని పట్టాభిషిక్తుడ్ని చేసి మళ్ళీ నా శరీరంలో ప్రవేశిస్తాను. అదీకాక ఉభయభారతి ప్రశ్నలకు సమాధానాలు చెప్పి సర్వజ్ఞత్వం నిలుపుకోవాలి కదా?" అన్నాడు.

"సర్వజ్ఞులయిన మీకు తెలియనిది లేదు. అయినా భక్తి నన్ను వాచాలుడిగా చేస్తూంది. పూర్వం మత్స్యేంద్రుడనే మహాత్ముడు ఒకచోట మృతుడైన మహారాజు శరీరంచూసి, గోరక్షుడనే శిష్యుణ్ని తన కళేబరాన్ని కాపాడమని, తా నారాజు శరీరంలో ప్రవేశించి రాజ్యమేల సాగాడు.

అతను సింహాసనం ఎక్కింది మొదలు ఆదేశం చక్కగా ఉండసాగింది. మంత్రులు రాజు తేజస్సు చూసి - పరకాయ విద్యా నిపుణుడైన యోగి ఎవరో ప్రవేశించాడు కాబోలు. లేకపోతే చచ్చినవాడు బతుకుతాడా? - అని అతను తిరిగి తన శరీరంలో ప్రవేశించకుండా వీనిలో నిలపాలని - రూపయౌవన కళావిలాసాలచే పరమ సౌందర్య వతులయిన వారినతని సేవలకు నియోగించారు.

ఆ యోగి వారి వినోదాలలో పడి గతాన్ని మరిచి పోయాడు.

గోరక్షుడు చూసి చూసి ఆ దేహాన్ని దాచి గురువుని వెదుకుతూ పోయి - జరిగినది తెలుసుకుని - ఆ కాంతలకు అంతరంగికుడిగా చేరాడు. ఒకనా డాయోగి పూర్వస్మృతి కలిగి తనస్థితికి పశ్చాత్తాప పడుతూంటే గోరక్షకుడతన్ని సమీపించి తనవృత్తాంతమంతా అతనికి తెలియజేశాడు. అప్పుడతను పూర్వ దేహంలో ప్రవేశించాడు. విషయానురాగ మంత బలమైనది. మంచి చెడులు నీవే ఆలోచింపగలవు. నిరుపమాన నియమాలెక్కడ, గర్హించదగిన కామశాస్త్ర మెక్కడ? భూమిమీద శిథిలమౌతున్న యతి ధర్మం నిలపడానికి కంకణం కట్టుకున్న నీకు తెలియనిదేముంది?"

అతని మాటకు శంకరుడు - నువ్వు సత్యమే చెప్పావు. విషయ వాంఛ అంతటిదే. కాని పరమార్థం చెబుతాను విను. అసంగునకు కామము లెప్పుడూ జనించవు. దీనికి కృష్ణుడే నిదర్శనం. ...అదీకాక అన్ని కోర్కెలకూ మూలం సంకల్పం. అలాటి సంకల్పం నాకు లేదు కదా! కనుక తత్త్వవేత్త పాపములతో నంటడు. సుకృత ఫలము అనుభవింపడు. సనందనా! ఆ శరీరంలో అంగశాస్త్ర పరిశీలన చేయడం దోషంకాదు. విశిష్టమయిన మార్గ పరిపాలన కోసం మరో శరీరాన్ని ఆశ్రయిస్తున్నాను" అని...పాదచారులకు ఎక్కడానికి అసాధ్యమైన ఎత్తయిన శిఖరం మీద దిగి - "ఇక్కడ నా కళేబరం ఉంచి అమరకుని శరీరంలో ప్రవేశించి మదన పాండిత్యం సంపాదించుకువస్తాను. అంతవరకూ మీరీ

గుహలో నా కాయానికి అపాయం కలగకుండా చూడండి" అని తన శరీరంవిడచి, యోగబలంతో లింగశరీరంతో కూడుకుని అమరకుడి శరీరంలో ప్రవేశించాడు.

అతనలా చేరడంతోటే ఆ రాజు కదలసాగాడు. కొంచెం సేపటికి నిద్రలోంచి లేచినట్లు లేచాడు. అతని భార్యల ముఖాలు వికసించాయి. మంత్రులు అందరూ ఎంతో సంతోషంతో భూమి అదిరేలా నినాదాలు చేశారు.

ప్రజలని తెలియక పోయినా సమయోచితంగా సమాధానాలిస్తూ సింహాసనమెక్కి న్యాయంగా పరిపాలించసాగాడు. కాని... అతను పరకాయప్రవేశం చేయబడిన వాడని మంత్రులు అనుమానించి - అతను మళ్ళీ తన శరీరంలోకి పోకుండా కనపడిన శవాన్నల్లా దహించమని కింకరులనాజ్ఞాపించాలను కున్నారు. రహస్య స్థలాలను శవాలకోసం వెదికించాలనుకున్నారు. అంతలో - "తాను చేడియలతో క్రీడా శైలమునకు వెళ్ళి కొన్ని రోజులు వసిస్తాడు కనుక రాజకార్యాలన్నీ మననే చక్కబెట్టుకొమ్మని రాజముద్రిక పంపాడు. అంచేత మనమేం చేసినా రాజుకి చెప్పనక్కర్లేదు" అంటూ వార్త చెప్పాడు మరోమంత్రి.

అమరకుడు నూరుగురు భార్యలతోటీ పట్నానికి దగ్గరలో ఉన్న క్రీడా శైలానికి వెళ్ళి అనంగతంత్రపాండిత్యం తేటపడేలా క్రీడించాడు. శ్రద్ధ, ప్రీతి, రతి, ధృతి, కీర్తి, మనోభవ, విమల, మోదిని, ఘోర, మదనోత్పాదిని, మద, మోహిని, దీసిని, వశకరి, రంజని అనే పదిహేను కళలూ మదవతులలో శుక్లపక్షంలో కాలివేలునుంచి శిరసువరకూ ఎడమభాగంమీదుగా ఎక్కి కృష్ణపక్షమందు దిగుతాయి. కనక ఆ స్థానాలను గుర్తించి అక్కడ చేయవలసిన శృంగార కృత్యాలు చేస్తూ వారిని వివశులను కావిస్తూ వారినెంతో ఆనందింపజేశాడు.

ఆ రాణులు అతను పూర్వంకంటె చాలా భిన్నంగా ఉన్నాడనీ మనుపీ రసజ్ఞత లేదనీ వాళ్ళలో వాళ్ళు అతని శృంగార చాతుర్యం గురించి ఎంతగానో చెప్పుకున్నారు. శ్రీకృష్ణుడే అనుకున్నారు." అని చెప్పి, అప్పటికి వేళవుతూండడంతో కద ఆపి మళ్ళీ మజిలీలో మిగిలిన కథ కొనసాగించాడు, మణిసిద్ధుడు.

# కాశీ మజిలీ కథలు

## 47. వ మజిలీ

శంకరుడు తిరిగి వస్తానన్న కాలం దాటిపోయింది. కొండ గుహలో కళేబరాన్ని కాపలాకాస్తున్న శిష్యులు కంగారు పడసాగారు. ఏం చేయాలి? ఎక్కడ వెదకాలి? అతనిజాడ చెప్పే వారెవరు? వేరొక శరీరంలో ఉండే అతన్ని గుర్తు పట్టడం ఎలా? – అని పద్మపాదుడు విచారిస్తూంటే – వామదేవుడు – మళ్ళీ అతన్ని చూస్తామా? – అని భయపడసాగాడు.

**గుణనిధి** : సజ్జనుల సంసారాగ్నిని చల్లార్చే ఆ మహాత్ముడు మనను పేక్ష చేస్తాడా?

**చిత్సుఖుడు** : గురువర్యా! మీరు వేగంగా రాకపోతే మా శోకాన్ని ఎవరు పోగొడతారు?

**పద్మపాదుడు** : మిత్రులారా! ఊరికే చింతించి ప్రయోజనం లేదు. నేనో ఉపాయం చెబుతాను, వినండి. మనమీ భూమండలమంతటనీ, పర్వత గుహారణ్యాలతో సహా వెదికి, కనపడకపోతే స్వర్గ పాతాళాలు సైతం వెదుకుదాం.

**చిత్రభానుడు** : మరో రూపంలో ఉన్న అతని నెలా గుర్తించగలం?

**పద్మపాదుడు** : రాహువుచే పట్టుకోబడినా తన ప్రకాశగుణంతో చంద్రుడు తెలుసుకోబడేటట్లే ఆ మహాత్ముడి ఉనికిని అతని గుణాలే వెల్లడి చేయగలవు. మన్మథ కళా పాండిత్యం సంపాదించడానికి అతను అకాముడైనా కామినీ జన ప్రియమగు శరీరాన్ని ప్రవేశించి ఉంటాడు. అతనుండే దేశంలో ప్రజలు రోగ, శోకాది బాధలు కలగక తృప్తిగా దర్మం పాటిస్తూ ఉంటారు. వర్షాలు చక్కగా కురుస్తాయి. భూమి సస్యశ్యామలంగా ఉంటుంది. ఇవే గుర్తులు. ఆచార్యుడి శరీరం రక్షిస్తూ గుణనిధి మొదలైన విద్యార్థు లిక్కడుంటారు.

*చిత్రభానుడు*: ఆలస్యమెందుకు? ఇప్పుడే పోదాం, పదండి.

*చిత్సుఖుడు* : అందుకు అందరం సమ్మతించాం.

అలాగ కొందరు శిష్యులు గురువు నన్వేషిస్తూ కొండదిగి - కనపడిన గ్రామంలో విశేషాలు తెలుసుకుంటూ దేశాటనం చెయ్యసాగారు. ఆ దేశం సంపన్నత్వం చూసి ఆశ్చర్యపోతూ చివరకి రాజధాని చేరుకుని ఒక బ్రాహ్మణుని యింట్లో అతిథులు కాగా అతను వారి నాదరించి, భోజనం పెట్టి, వారి నివాసం గురించీ, ఎక్కడికి వెళ్తున్నదీ, అక్కడి కెందుకు వచ్చిందీ అడిగాడు.

వారు - "మాది కాశీదేశం" అంటూ చెప్పి ఆ దేశంపేరూ, రాజుపేరూ, పండితుల పట్ల రాజుకి కల గౌరవమూ, అతనివయస్సు మొదలైన వివరా లడిగారు.

అందుకా బ్రాహ్మణుడు - "ఆర్యులారా! అమరకుడనే రాజు యీ దేశాన్ని పాలిస్తున్నాడు. అతను ధర్మాత్ముడే. ఈ మధ్య ఒక విశేషం జరిగింది. అతనికి వేటంటే చాలా ప్రీతి. తరచుగా వేటకు వెళ్తూంటాడు. కొన్నాళ్ళ క్రిందట ఒక మహారణ్యంలో వేటకువెళ్ళి అర్ధరాత్రి ఒక చెట్టుక్రింద కూర్చుని మృగాల జాడ వెదుకుతూ హఠాత్తుగా భరించలేని శిరోవేదన కలిగి తనవారంతా చూస్తుండగానే మరణించాడు. ఆ వార్త అంతటా వ్యాపించింది.

నూరుగురు భార్యలు, మంత్రులు, దాసదాసీజనం, ఆ మహారణ్యానికి పోయి - నేలమీద పడున్న రాజుని చూసి విలపించసాగారు. అలాగ రెండు రోజులు వారా రాజు కళేబరాన్ని వదలక ఏడుస్తూనే ఉన్నారు. అప్పుడు మంత్రులు రాణుల నూరడిస్తూ - "ఇక శరీరం నిలవదు. ఇతను పుణ్యపురుషుడు. అగ్ని సంస్కారాలు చెయ్యాలి" అని యధాశాస్త్రంగా సంస్కారాలు గావించి అతని శరీరాన్ని చితిమీద కెక్కించారు.

ఆ సమయంలో నేనక్కడే ఉన్నాను. ఆ స్త్రీలు తమని కూడా ఆ చితిలో దహించమని రోదించసాగారు.

అంతలో ఆరాజు శరీరం కదలినట్లుఅనిపించింది. అది చూసి వారు ఏడుపు ఆపి అటే చూస్తూ నిశ్శబ్దంగా నిలుచున్నారు. కొంతసేపటికి అతను ఊపిరి పీల్చి విడుస్తున్నట్లు తోచింది. వారు ఆశ్చర్యంతో - "ఉండండుండండి. మనపుణ్యం బయటపడుతున్నట్లుంది." అంటూ చేతులు చాపి పరీక్షిస్తూంటే అతను నిట్టూర్పు విడిచి ఒత్తిగిల్లాడు. అప్పుడు – "బతికేడు బతికేడు." అనే నినాదాలు అరణ్యమంతా మారుమ్రోగాయి. రాజు నిద్రలోంచి మేలకున్నట్లు లేచికూర్చుని, కళ్ళు నులుముకుంటూ "ఎందుకిలా ఏడుస్తున్నారు?" అని అడిగాడు.

అప్పుడు వారు ప్రాణనాథుని పైపడి జరిగిన వృత్తాంతమంతా చెప్పారు. రాజు వారి నోదార్చి, పరివారంతో కూడా పురానికి వచ్చి యధాప్రకారంగా రాజ్యం చేయసాగాడు. అప్పటినుంచీ అతని తేజస్సు వృద్ధి చెందుతూంది. ప్రజలకు రోగం, శోకం వంటి బాధలు లేవు. ప్రజలు ధర్మ తత్పరులై ప్రవర్తిస్తున్నారు. మా రాజు రాజ్యాన్ని మంత్రుల అధీనం చేసి భార్యలను సంతోష పరచడానికిప్పుడు కేళీ శైలం మీద విహరిస్తున్నాడు. శృంగార లీలాకలాపాలతో...భార్యలతో వేడుక లనుభవిస్తూండబట్టి యిప్పుడు మీవంటివారు ఆయనని దర్శించడానికి సమయం కాదు. సంగీత విద్యాప్రవీణులకు తప్ప యితరులకు అమరకుడు దర్శనమివ్వడం లేదంటున్నారు. ఇదే నాకు తెలిసిన వృత్తాంతం." అని చెప్పి ఊరుకున్నాడు.

ఆ కథ విన్న పద్మపాదాదుల ఆనందానికి అవధులు లేకపోయాయి. "ఆవేళ నాతో ఆపేరే చెప్పినట్లు జ్ఞాపకం. ఆయన మన అయ్యవారే. సందేహం లేదు. స్త్రీలోలుడై ఉన్నాడు" అని ఒకరి కొకరు చెప్పుకుంటూ, వీణలు సంపాదించి, గాయకుల వేషాలు వేసుకున్నారు. గీతాలు పాడుతూ పట్నపు వాసులని రంజింపజేస్తూ క్రమంగా ఆ రాజు దృష్టిలో పడ్డారు.

ఒకనాడు రాజు వారి నాహ్వానించాడు. వారు ఆస్థానానికి వెళ్ళి - ఇరుపక్కలా సుందరీమణులు చామరాలతో విసురుతూంటే, కొందరు సుందరులు సంగీతం పాడుతూంటే, కొందరు వారకాంతలు

శృంగార లీల లభినయిస్తూ నాట్యాలు చేస్తూంటే, భువికి దిగిన మన్మథుడిలా సౌందర్యవంతుడయిన రాజుని దర్శించారు. ఆశృంగారలీలా వినోదాలకి వాళ్ళు ఆశ్చర్యపోతూంటే రాజు వారికి ఉచితాసనాలనుచూపి కూర్చోమన్నాడు. రాజాజ్ఞ కాగా ఆ గాయకులు గాంధర్వ విద్యాకౌశలంతో సభాసదులను సమ్మోహితులను చేశారు.

అప్పుడు ఆ మహారాజుకి అతని వృత్తాంతాన్ని గీతాలతో బోధ పరడచం మొదలు పెట్టారు.

"నీ శరీరాన్ని వదలి, రాజు శరీరంలో ప్రవేశించి గతం విస్మరించావు. నీ కోసం తపించే నీ శిష్యులనే తుమ్మెదలను మరిచి పోయావు. మదనకళా పాండిత్యం నేర్పడానికి మునపటి శరీరం వదిలిన నువు యిక్కడే మోహంలో మునిగి ఉండి పోయావు. శాంతిదాతా! ఆచార మార్గం వదిలి గర్వంలో ఆత్మను కానకుండా ఉన్నావు. మనసు పెట్టి తలుచుకో. నిజం నీకు తెలుస్తుంది. వివేకులు దేనిని గ్రహిస్తారో ఆ తత్వాన్ని నీవే ఎరుగుదువు. ఇంద్రియాలనే గుర్రాలు పలు విధాలుగా పరుగెడుతూంటే వాటిని స్థిరంగా ఉండేటట్లు కట్టి వేసే ధీరుడివి నువ్వు. నువ్వే మోహంలో చిక్కుకోవడం, తగదు. నువ్వు తత్వానివి."

అంటూ వీణానాదంతో కంఠాలను మేళవించి ఆ శిష్యులు మనోహరంగా గానం చేసి సభలోని వారినీ, అమరక మహారాజునీ ఆనంద పరవశులని చేశారు. అమరకు దాగానానికి వివశుడైనట్లు ... ఆ గీతాలలో కల అభిప్రాయానికి హృదయం పశ్చాత్తాపం చెందగా - సింహాసనం చేతి మీదకు శరీరం వాల్చి కళ్ళు మూసేశాడు.

రాజభటులది చూసి, రాజునిద్ర పోతున్నాడనుకుని, శబ్దం చేయవద్దని సభ్యులందరినీ కోరారు. కొంచెం సేపు సభా భవనం బొమ్మలా నిశ్శబ్దంగా ఉండి పోయింది.

రాజు ఎంతసేపటికీ లేవకుండా అలాగే ఉండిపోడం గమనించిన సుందరీమణులు కొందరతని దగ్గరగా పోయి కళ తప్పిన ముఖం చూసి - "అయ్యో! ఇదేమి చిత్రం! ఈ రాజు మళ్ళీ మూర్ఛ పోయినట్లున్నాడు." అని బిగ్గరగా అరవడంతో రాజుగారి భార్యలందరూ

వచ్చి చూసి గుండెలు బాదుకుంటూ – "ఇంకేముంది? ఇతను దక్కడు" అని కొందరూ, "ఆ గండం దాటిందంటే యింతలోనే మళ్ళీ యిలా అయిందేమిటి?" అని మరికొందరూ "మునపటిలా మళ్ళీ బతుకుతాడేమో?" అని కొందరూ, "మనకలాటి అదృష్టం పడుతుందా?" అని మరికొందరూ, "ఎంతలో ఎంత సంతోషం పెట్టాడు! ఈ సుఖం యివ్వక పోయినా యింత విచారం ఉండక పోయే"దని కొందరూ అతన్ని తలుచుకుంటూ గట్టిగా ఏడవ సాగారు.

అంతలో సామంతులూ, మంత్రులూ అక్కడికి వచ్చి, అతని మృతికి ఆశ్చర్యపోతూ, జరిగినదంతా తెలుసుకుని, ఆ గాయకులెక్కడున్నారని కేకవేశారు.

గాయకులు వారి ముందుకు వచ్చారు. మంత్రులడిగిన ప్రశ్నలకు –

"మా కొకదేశమంటూ లేదు. అన్నిదేశాలూ తిరుగుతూంటాం. ఇక్కడికి వచ్చి నాలుగురోజులయింది. రాజుగారి ఆజ్ఞమేరకే లోపలికి వచ్చి, వారి ఆజ్ఞమేరకే గానం చేశాం." అని జవాబులు చెప్పారు. మంత్రులు వారు ముందు పాడిన గీతాలను మళ్ళీ పాడమంటే పాడారు. వాటి అర్థమేమిటని అడిగితే – "మాకు తెలియదు మూలం మాత్రమే పాఠం చేశాం. ఎవరు రచించారో కూడా తెలియదు. మాకు సాహిత్యజ్ఞానం లేదు. మీరు మమ్మల్నెందుకిన్ని ప్రశ్నలు వేస్తున్నారు?" అన్నారు.

"మీరు గాయకులమని మోసపుచ్చి వచ్చి మా రాజుగారి ప్రాణాలు తీశారే!" అన్నారు మంత్రులు. "అయ్యో! మేమేం చేశాం? దూరంనుంచే పాడాము. మా అపరాధమేమయినా ఉందేమో అంతః పురకాంతల నడిగి తెలుసుకొండి." అన్నారు వారు.

"అంతా మాకు తెలుసు. ఎవరినీ అడగక్కర్లేదు. మీ అపరాధం తరవాత విచారిస్తాం. ఆ వేళ వరకూ మా అనుమతిలేకుండా ఎక్కడికీ పోరాదు." అంటూ వాళ్ళకి కాపలాదారులను నియమించి, శాస్త్రప్రకారం రాజుకి అపర సంస్కార కర్మలు చేయించారు.

ఒక ముహూర్తంలో రాజపుత్రులకు పట్టాభిషేకం చేశారు. అప్పటికి - పూర్వం మంత్రులు పంపిన భృత్యులు కొందరు తిరిగివచ్చారు.

"అయ్యా! మేము మీ అనతి ప్రకారం కొండలూ గుట్టలూ అరణ్యాలూ అన్నీ తిరిగాం. నరసింహశైలంలో మాత్రం ఒక వింత కనిపించింది. ఎత్తయిన ఆశిఖరం మీద ఒక గుహముందు కొందరు బాపనయ్యలు జేగురురంగు గుడ్డలు కట్టుకుని నివసిస్తున్నారు. "మీరిక్కడెందుకున్నారు? గుహలోపల చూడాలి అడ్డంలెండి" అన్నాం. వారు లోపలికి పోవద్దని సంజ్ఞ చేశారు. కాని మేము వాళ్ళ మాట లెక్క చెయ్యకుండా లోపలికి వెళ్లాం.

అక్కడొకడు ముసుగుకప్పుకుని పడుకుని ఉన్నాడు. మేము లెమ్మని ఎంత అరచినా లేవలేదు. అప్పుడది శవమని - మీ ఆజ్ఞ చొప్పున మేము దానిని దహించబోతూంటే ఆ బాపనయ్యలు మాతో కలహించి, అతను తమ గురువనీ, యోగనిద్రలో ఉన్నాడనీ, ముట్టుకోకూడదనీ చాలాసేపు ఆటంకం పెట్టారు. కాని - మేము శవాన్ని బాగా పరీక్షించి, అది నిద్రకాదని, ఆ శవాన్ని బలాత్కారంగా పట్టుకుని అక్కడొక చితి ఏర్పాటు చేసి, అగ్ని అంటించాం. అది కాల్చకుండా వాళ్ళెన్నో ప్రయత్నాలు చేశారు కాని వాళ్ళకంటే మేమెక్కువ మంది వుండడంవల్ల ఆఉద్యమాలు కుదరలేదు. అగ్నిప్రజ్వరిల్లి ఆశవం చేతులు మాత్రం అంటుకునేసరికి తటాలున లేచి కూర్చుని చితిమీంచి కిందకురికాడు. మేము భయపడిపారిపోయి దగ్గరలో ఉన్న చెట్టు వెనక దాక్కుని చూడసాగాము

ఆయనను పట్టుకుని వారేదో ప్రసంగం చేశారు. అతను కళ్ళు మూసుకుని శ్లోకాలు చదివేసరికి చేతులు మునపట్లా ఐపోయాయి. ఇంతవరకూ చూసి మేము వచ్చేశాం అతను మహానుభావుడని తోస్తూంది. తెలియక అపరాధం చేశాం

మాలో ఒకడికి యింటికి వచ్చేసరికి కళ్ళు పోయాయి. వారితో ఎక్కువ కలహించి ఆ శవాన్ని పాదంతో తన్నినవాడతను. ఆసాధువును దహించినందుకు మాకేం ముప్పొస్తుందో అని భయపడుతున్నాం" అని చెప్పి వాళ్ళు యింటికి పోయారు.

మంత్రులు తమలో తామేదో ఆలోచించుకున్నారు "ఓహో! అతనే యితను. వీళ్ళు చెప్పిన సమయమూ, రాజుమరణించిన సమయమూ సరిపోయాయి మనం భయపడ్డట్లే జరిగింది. మనం బంధించిన గాయకులకీ ఆ మహానుభావుడికీ మధ్య ఏదో సాంకేతికం ఉన్నట్లుంది. ఏదేమయినా మనం వీరినింక నిర్బంధించ కూడదు. వీళ్ళు మహానుభావులని వారి గీతాలే సాక్ష్యం" అని అప్పటికప్పుడే పద్మపాదుడు మొదలైన వారిని రప్పించి అపరాధం చెప్పుకుని స్వేచ్ఛగా వెళ్ళమన్నారు.

వాళ్ళు నరసింహశైలానికి వెళ్తూంటే - కొందరు శిష్యులెదురు పడి - "మీరింత ఆలస్యం చేశారేం? మనగురువుగారు జీవించారు." అంటూ జరిగినది చెప్పారు అంతేకాకుండా శంకరులు చెప్పిన శ్లోకాలను చదివి వినిపించారు. అందరూ కలసి గురువుగారిని చేరుకున్నారు. తరవాత, శిష్యులతో యోగమార్గాన ఎగిరి మండనమిశ్రుడి మందిరం చేరుకున్నాడు శంకరుడు. మండనమిశ్రు డతని పాదాలపై పడి అతిథిపూజ గావించి - "మహాత్మా! నాయిల్లు, శరీరం, సమస్తమూ నీ అధీనాలు. నేను నీ శిష్యుడిని. కర్తవ్యముపదేశించు" అని ప్రార్థించాడు

శంకరుడి నర్చించి ఉభయభారతి, "మహాత్మా! నువ్వు పరమేశ్వరుడివి. నన్ను సభలో కామశాస్త్ర ప్రసంగంలో ఓడింపక, నేర్చుకునే వాడిలా వ్యవధి కోరడం వెనుక ఉద్దేశం నేను గ్రహించకపోలేదు. నీతో పరాభవించబడి నందుకు మేము సిగ్గుపడము. నువ్వు సర్వేశ్వరుడివి. నువ్వెరగనిదిలేదు నేను సత్యలోకానికి వెళ్తాను అనుజ్ఞ యివ్వు" అంది.

అప్పుడు శంకరుడు - "దేవీ! నిన్ను విధాత పతివ్రతవైన వాగ్దేవతగా ఎరుగుదును. నేను కల్పించిన ఋష్యశృంగాది క్షేత్రములందు నువ్వు ప్రీతివహించి యిష్టార్థాలని ప్రసాదించాలని నాప్రార్థన" అన్నాడు. ఆమె చాలా సంతోషించి బ్రహ్మలోకానికి వెళ్ళిపోయింది.

తను సన్యసించడం వలన విధవకానవసరం లేకుండా ఉభయభారతి అంతర్ధానమైనందుకు మండనుడు సంతోషించి - శాస్త్రోక్తంగా తన ధన కనక వస్తు వాహనాలన్నీ బ్రాహ్మణులకు పంచిపెట్టి ఆశాపాశాలను తెంచుకుని ఆచార్యుడి వద్దకు వెళ్ళాడు.

శంకరు డతనికి సన్యాసమిచ్చి – "తత్త్వమసి" అనే వాక్యాన్ని కుడిచెవిలో ఉపదేశించాడు. ఆ వాక్యానికి సరయిన అర్థం వివరించాడు. నువ్వూ బ్రహ్మవయ్యావు – అంటూ గురుబోధ చేశాడు. అద్వైత తత్త్వాన్ని తేటతెల్లం చేసుకున్న మండనుడు అది మొదలు సురేశ్వరుడనే పేరుతో, శ్రీశంకరాచార్యుణ్ని సేవిస్తూ పద్మపాదుడు మొదలైన శిష్యులతో చేరాడు.

మండనమిశ్రుడికి బ్రహ్మతత్త్వం ఉపదేశించి, ప్రధాన శిష్యుడిగా చేసుకుని, అక్కడి నుంచి శిష్యులతో బయలు దేరి మహారాష్ట్ర దేశానికి వెళ్ళి భాష్యాలను వ్యాపింప జేశాడు. కొన్ని రోజు లక్కడ గడిపి, అక్కడి నుంచి శ్రీశైలం వెళ్ళి పాతాళ గంగలో స్నానం చేసి మల్లికార్జునుని అర్చిస్తూ – శివానందలహరి అనే స్తోత్ర శ్లోకాలతో స్తుతించాడు. అక్కడ అష్టాదశ పీఠాలలో ప్రధానమైన భ్రమరాంబాదేవి వేదాలలో చెప్పబడిన విధానంతో మహాశక్తిగా స్థాపన చేసి, శిష్యులతో కూడి కొన్నాళ్ళున్నాడు. ఒకనాడు శంకరయతీంద్రులు పద్మపాదుడు మొదలైన శిష్యులతో భాష్యాలు ముచ్చటిస్తూంటే విని అక్కడున్న పాశుపతులు, వైష్ణవులు, వీరశైవులు, మాహేశ్వరులూ దాని నాక్షేపించారు. శంకరుని శిష్యులే వారిని పరాజితులని చేయగా, కొంద రతనికి శిష్యులయ్యారు. మరికొందరు కోపం వదలక, వారికి సమాధానం చెప్పలేక అతని మరణం కోసం ఎదురు చూశారు.

## ఉగ్ర భైరవుడి కథ

ఒకనాడు శంకరాచార్యుడు పాతాళగంగానదీ తీరంలో భాష్యరహస్యాలు ఆలోచిస్తూంటే – కాపాలికు డొకడు అవధూత వేషంలో వచ్చి – అతన్ని పరిపరివిధాల ప్రశంసించి – "నేనొకపని మీద నీ వద్దకు వచ్చాను విను.

నే నీశరీరంతోనే కైలాసానికి వెళ్ళి ఈశ్వరుడితో సమంగా విహరించాలన్న అభిలాషతో శతాబ్దాల తరబడి ఈశ్వరుడి గురించి ఉగ్రతపస్సు చేశాను. అతను ప్రత్యక్షమై నా కోరిక తెలుసుకుని – 'నువ్వు అసాధ్యమైన కోరిక కోరినా, నీ వ్రతాలు నన్నాశ్చర్య పరచాయి. కనక

తీర్చక తప్పదు. భూమిమీది సార్వభౌముడి శిరస్సు కాని, సర్వజ్ఞుడైన యతీశ్వరుని శిరస్సు కాని నా నిమిత్తం అగ్నిలో హోమం చేశావో, నీ కార్యం సఫలమౌతుంది–' అంటూనే అంతర్ధానమైపోయాడు. అప్పటినుంచి నేను భూమంతా తిరుగుతున్నాను. సార్వభౌముడి శిరస్సు నాకెలా లభిస్తుంది? సర్వజ్ఞుడైన యతి నా కింతకు ముందు కనపడలేదు. లోక హితానికి సంచరిస్తున్న నిన్నిక్కడ చూడగలిగాను. నా కార్యమిక తీరుతుందని ఉత్సాహపడుతున్నాను. నీ శిరస్సు వల్ల నాకు కార్య లాభం, నీకు శాశ్వత కీర్తి. ఈ దేహం యొక్క అశాశ్వతత్వం ఆలోచించి ఎలాతోస్తే అలా చెయ్యి. నువ్వు విరక్తుడివనీ, దేహాభిమానశూన్యుడివనీ, పరోపకారానికే అవతరించిన వాడివనీ విని యీ సాహసానికి పూనుకున్నాను. దధీచి మొదలగు వారిలా క్షణభంగురమైన తుచ్ఛ శరీరాన్ని వదలి శాశ్వత కీర్తి దేహం దాల్చి పుణ్యలోకాల నలంకరించు. నీ శిరస్సు కంటె నాకేమీ అక్కర్లేదు. తప్పకుండా నీ శిరస్సివ్వు. నీకు నమస్కారం "అని ప్రార్థించాడు.

దయామయుడైన శంకర యతీంద్రుడు తన పాదాల మీద పడిన అతన్ని లేవనెత్తి – "ఆర్యా! నీకోరిక విషయంలో నాకు కొంచెమైనా అసూయలేదు. సంతోషంతో నా శిరస్సు నీకిస్తాను. ఎంత రక్షించినా, కాలం ఆసన్నమయితే యీ శరీరం నశించవలసిందే కాని నిలిచేది కాదు. నా సమాధిని నిర్జన ప్రదేశంలో ఏర్పరచి రహస్యంగా నా శిరస్సు ఖండించి అగ్నిలో వెయ్యి. బహిరంగంగా యీపని చేయడానికి నేను సమ్మతింపను. ఎందుకంటే – నా శిష్యులకి తెలిస్తే యీ పనికెంత మాత్రమూ అంగీకరింపరు" అన్నాడు.

ఆ మాటలకు కాపాలికుడు చాలా సంతోషించి శంకరుడు నియమించిన సంకేతస్థలానికి వచ్చేటట్లు నిశ్చయించి ఎక్కడికో పోయాడు. ఈ రహస్యాన్ని ఎవరికీ తెలియనివ్వక, శిష్యులందరూ వారిపనులమీద ఎక్కడెక్కడికో పోగా, సనందుడు తెలుసుకుంటాడేమో అనే సందేహంతో శంకరుడు నిగూఢంగా ఉండగా – చేతిలో త్రిశూలం, మెడలో కంకాళాల మాల, ఎర్రనికళ్లతో కాపాలికుడు వచ్చాడు.

అతనిని చూచి శంకరుడు ఇంద్రియాలను ఉపసంహరించుకుని, ఆత్మనీ పరమాత్మనీ సంధానం చేసుకుని గడ్డాన్ని మోకాళ్ళమీదుంచి మోచేతులు ముడిచి ముఖం ఎత్తి, కళ్ళు సగం మూసుకుని సమాధిచేత ప్రపంచాన్ని మరచి ఉండగా కాపాలికుడు సంతోషంగా త్రిశూలమెత్తి అతన్ని చంపడానికేమీ సందేహించకుండా కంఠాన్ని నరక బోతూండగా – దైవప్రేరితమయిన బుద్ధి చేత పద్మపాదు డెందుకో అక్కడికి వచ్చాడు.

గురువు శిరస్సు నరకబోతున్న కాపాలికుడిని చూసి తన యిష్టదైవమైన శ్రీనరసింహుని మంత్ర పూర్వకంగా ధ్యానించాడు. అప్పుడు పెద్ద శబ్దం అయింది. ఇదేమిటా అని దేవతలు తల్లడిల్లారు. సముద్రాలు అతలాకుతల మయ్యాయి. పద్మపాదుడు నరసింహరూపుడౌతూ వేగంగా ఉరికి శూలంతో తనగురుణ్ని చంపడానికి సిద్ధమైన ఆ కాపాలికుణ్ని పొట్టచీల్చి చంపేశాడు.

ఆ శబ్దం విని అక్కడున్న శిష్యులందరూ తల్లడిల్లి పోతూ పరుగుపరుగున అక్కడికి వచ్చి, చచ్చిపడున్న కాపాలికుణ్నీ, నరసింహాకృతిలో ఉన్న పద్మపాదుణ్నీ, సమాధిలో ఉన్న గురువునీ చూసి ఆశ్చర్యపోతూంటే, శంకరుడు సమాధిచాలించి, కళ్ళుతెరచి, జరిగినదంతా శిష్యుల ద్వారా తెలుసుకుని పద్మపాదుణ్ని ఆవహించిన ఉన్న నరసింహమూర్తిని అనేక విధాలుగా స్తుతించాడు.

భక్తవత్సలుడైన ఆ దైవం ఆస్తోత్రాలతో శాంతించి, ఉగ్రమూర్తిని ఉపసంహరించుకుని అంతర్ధానమయ్యాడు. శాంతుడై ఉన్న పద్మపాదుణ్ని చూసి శిష్యులందరూ ఆశ్చర్యపడుతూ – "ఆర్యా! నువ్వీ దేవుడినెలా ప్రసన్నం చేసుకున్నావు? ఈకపటాన్నెలా తెలుసుకున్నావు? ఈ దురాత్ముడెవడు?" అని అతని నడిగారు. అప్పుడు పద్మపాదుడిలా చెప్పాడు.

# అహోబల నరసింహుని కథ

నేను పూర్వం ఒకప్పుడు అహోబల శైలానికి వెళ్ళాను. అక్కడ ఒక అరణ్యంలో భక్తవశ్యుడయిన నరసింహమూర్తి గురించి తపస్సు చేయసాగాను. అప్పుడొక రోజు నా దగ్గరకొక కిరాతక కుమారుడు వచ్చి – "అయ్యా! నువ్వెవరు? ఒక్కడివీ ఈ కొండ గుహలో ఎందుకుంటున్నావు? ఏంచేస్తున్నావు?" అని అడిగాడు.

నేను వాడిమాటలు పట్టించుకోక మౌనంగానే పొమ్మని చేతితో సంజ్ఞ చేసాను. వాడు అంతటితో పోకుండా అప్పుడప్పుడు నాకు కనపడుతూ అడుగుతూనే ఉన్నాడు.

ఒకనాడు నేను వాడితో – "ఓరీ! నువ్వు మూఢజాతి వాడివి. పైగా బాలుడివి. నీలాటివాడికి మాలాటి వాళ్ళని పలకరించడం ఉచితంకాదు. విను. ఈ అరణ్యంలో – కంఠం పైనుంచి సింహము, కింద మనిషి రూపు కల స్వామి ఒకరు ఉండాలి. అలాటి వాడి నెక్కడేనా చూస్తే చెప్పు. అతన్ని చూడాలనే యిక్కడున్నాను. అతను నాకు బంధువు. అతన్ని తీసుకురాగలవా?" అని పరిహాసంగా అడిగాను.

అప్పుడు వాడు నవ్వుతూ – "ఓహో! ఈ పనికేనా ఇంతశ్రమ పడుతున్నావ్? మొదట్లోనే చెబితే అప్పుడే తీసుకురాకపోదునా? ఆయన్ని నేనెరుగుదును. తరచుగా మేమిద్దరం కలుసుకుని ఆడుకుంటూంటాం. ఆయన ఉండే చోటు నాకు తెలుసు" అన్నాడు.

నేను వాడి మాటలు నమ్మక – "నువ్వతన్ని సామాన్యుడను కుంటున్నావ్ కాబోలు. నేను చెప్పింది నీకు సరిగా అర్థమైందా? కంఠంవరకూ మనిషీ, శిరస్సు సింహము. అలాటివాడిని నిజంగా చూశావా? నీకెలా కనపడ్డాడు? నిజం చెప్పు" అని రెట్టించాడు.

అందుకువాడు – "అయ్యా! నాతో యిన్ని సార్లు చెప్పక్కర్లేదు. మీమాట నాకర్థమయింది. మీరడిగినవాడు నేనాడుకునే వాడే. సందేహంలేదు. అంతెందుకు? ఇప్పుడేపోయి తీసుకొస్తాను. చూడండి" అంటూ తటాలున లేచి అరణ్యంలోకి వెళ్ళి రెండుగడియలలో ఆ బాలుడు

నరసింహమూర్తిని లతలతో కట్టి భుజంమీద పెట్టుకుని నా వద్దకు తీసుకొచ్చి "ఇతనేనా నీ వడిగిన అతను?" అన్నాడు.

నేను ఆనందాశ్చర్యాలతో శరీరం జలదరించగా - సాష్టాంగ నమస్కారం చేసి, చేతులు జోడించి - "నువ్వెంతో గొప్పదైవానివి - అలాటి నువ్వు ఒక మూఢ బోయ బాలుడికి బందీవయ్యావా! వాడు పూర్వజన్మలో ఏం పుణ్యం చేశాడో?" అన్నాను.

ఆ మహాత్ముడు నవ్వుతూ - "వీడికి నాయందు కల భక్తి విశ్వాసాలు బ్రహ్మాదులకైనా లేవు. ఏకాగ్రచిత్తంతో వీడు నన్ను ఆరాధించాడు. అందువల్లనే నేను వీడికింత వశమయ్యాను. నేను భక్తికి వశమైనట్లు తపో, దాన, యోగాదులకు కాను. నువ్వూ నాభక్తుడి వయ్యావు. అవసరమైనప్పుడు తలచుకో. ప్రసన్నుడినై కోరిక తీరుస్తాను" అని, మాయమయ్యాడు.

అప్పటి నుంచీ అతను నాకు అభీష్టదైవమై పిలిస్తే పలుకుతూ ఉంటాడు. ఇప్పుడు నేనలాగే శత్రువధ చేశాను."

శంకరుడు శ్రీశైలంలో కొన్ని రోజులు గడిపిన తరవాత శిష్యులతో అనేక పుణ్యతీర్థాలు దర్శిస్తూ, గోకర్ణ క్షేత్రానికి వెళ్ళాడు. ఆ దివ్యక్షేత్రంలో మూడు రోజులుండి, మహా కాళనాథుడి నారాధించి, అక్కడికి దగ్గరలో ఉన్న హరిశంకరం అనే దివ్య స్థలానికి వెళ్ళి అద్వైత బుద్ధితో హరిహర స్తుతి చేశాడు. అక్కడ నుంచి మూకాంబికా ప్రదేశానికి వెళ్ళగా -

అక్కడ బ్రాహ్మణ దంపతులు మృతుడైన కుమారుని కళేబరాన్ని ముందుపెట్టుకుని, ఎంతోదీనంగా విలపిస్తూండడం చూసి, కరుణామయుడైన శంకరాచార్యులు సహించలేక తాను వారి కంటే ఎక్కువగా విలపిస్తూంటే, ఆకాశవాణి - "నీలాటి ప్రజ్ఞావంతుడు కూడా యిలా సామాన్యుడిలా విచారించడమేమిటి?" అంది.

అత నామెను పలువిధాలుగా ప్రార్థించాడు. ఆ బ్రాహ్మణ బాలుడు నిద్రలోంచి మేలుకున్నట్లే లేచి కూర్చున్నాడు.

ఆ అద్భుతం చూసినవారు శంకరాచార్యుని మహిమను ఎంతగానో కొనియాడారు. బ్రాహ్మణ దంపతులతన్ని పొగిడి, పుత్రుడితో కూడా యింటికి పోయారు. శంకరుడు మూకాంబను స్తుతించి, అక్కడి నుంచి ఆ ప్రాంతంలోనే ఉన్న శ్రీ బలి అనే అగ్రహారానికి వెళ్ళాడు. అక్కడ వేద పండితులు, అహితాగ్నులు వేలకొద్దీ బ్రాహ్మణులున్నారు. వారు శంకరాచార్యుని గురించి విని ఉన్నారు కనుక అతన్ని సగౌరవంగా ఆదరించి, ఆహ్వానించి, పినాకపాణి ఆలయానికి తీసుకువెళ్తూంటే పురకాంతలతన్ని ఎంతగానో కీర్తించారు.

పినాకపాణి ఆలయంలో – "ఆర్యులారా! ఈ అగ్రహారంలో ఎందరో పండితులుండి ఉండాలి. అద్వైత మార్గ నిరోధకుడైన పండితుడెవరేనా ఉంటే వారితో వాదించి వారి దురూహలు పోగొడతాను" అనగా,

"అయ్యా! ప్రభాకరుడనే పండితు డొకడున్నాడు. అతను కర్మకాండ యందు ఆసక్తి కలిగి అనేక యజ్ఞాలు చేసి దేవతలని తృప్తి పరిచాడు. అతనికి బోలెడంత ఐశ్వర్యం ఉంది. కాని లేకలేక కలిగిన పుత్రుడు పిచ్చి వాడయ్యాడు. కనక ఇప్పుడతనా చింతతో ఏపనికీ పూనుకోడంలేదు" అన్నారు వారు.

అంతలోనే ప్రభాకరుడు కొడుకుతో వచ్చి అతని పాదాలకు నమస్కరించాడు. తనకుమారుడి చేత కూడా అతనికి నమస్కరింపజేశాడు.

## హస్తామలకుడి కథ

**శం**కరు డతన్ని సాదరంగా లేవనెత్తి – "ఎందుకొచ్చారు?" అంటూ వారిరాకకు కారణం అడిగాడు. "ఆర్యా! వీడు నా కుమారుడు. వీడికి పదమూడేళ్ళు దాటాయి. పుట్టినప్పటినుంచీ ఇలాగ ఉన్నాడు. ఎవరితోనూ మాట్లాడడు. ఎవరు పలకరించినా పలకడు. రూపమూ, తేజమూ మాత్రం అద్భుతంగానే ఉన్నాయి. అక్షరాభ్యాసమైనా చెయ్యలేదు. ఇది గ్రహదోషమో పూర్వకర్మ ప్రారబ్ధమో తెలియడంలేదు. ఆడుకుందుకు

వెళ్ళడు. వాళ్ళు వీడిని కొట్టినా కోపగించడు. ఎన్ని వైద్యాలు చేయించినా, రక్షలు కట్టించినా, జపాలు చేయించినా, సిద్ధులకి చూపించినా ప్రయోజనం లేకపోయింది. నీ అద్భుత చర్యలు విన్నాను. నీకటాక్షం వీడిమీద ప్రసరింపజేస్తే వీడి మాంద్యం వదలిపోతుంది. మహాత్మా! వీడిని శిష్యుడిగా అనుగ్రహించు" అంటూ ప్రార్థించాడు.

అప్పుడు శంకరుడా బాలుణ్ని చూస్తూ "డింభకా! నువ్వెవడివి? జడునిలా ఎందుకు ప్రవర్తిస్తున్నావు?" అని అడిగాడు.

"గురువా! నేను జడునికాను." అంటూ ఆసుకవిత్వంగా పన్నెండు శ్లోకాలు రచించి చెప్పాడు.

పరమాత్మ తత్త్వాన్ని తేటతెల్లంగా చేసే యీ శ్లోకాలను హసామేలక శ్లోకాలనీ, వీటిని ఉపదేశంలేకనే రచించడం వల్ల ఆ బ్రాహ్మణ కుమారుడికి హస్తామలకుడనీ పేరు వచ్చింది. అక్షరమైనా తెలియనివాడు అలాశ్లోకాలు రచించడం చూసి అది శంకరాచార్యుడి అనుగ్రహమే అని అందరూ నిశ్చయించారు.

తరవాత శంకరాచార్యుడు ప్రభాకరుని చూసి "నీకుమారుడు నీ దగ్గరుండడాని కర్హుడు కాడు. వీనితో నీకేం ప్రయోజనం? వీడు పూర్వస్మృతిని అభ్యసించడం ద్వారా సర్వమూ తెలుసు. అందుకే లోకంలోని అజ్ఞానాన్ని గురించి చింతిస్తూ జడుని మాదిరి ప్రవర్తించాడు. తన శరీరాన్నే అరువుగా భావించే వీడికి దేనియందూ మమత్వం లేదు. వీడిని నేను తీసుకుపోతాను, పంపు" అన్నాడు.

ప్రభాకరుడు సంతోషించి తనకుమారుణ్ని అతనికి శిష్యుడిగా చేశాడు. శంకరుడతనికి బ్రహ్మ భావముపదేశించి హస్తామలకు డనే పేరు పెట్టి తన ప్రధానశిష్యులలో చేర్చుకున్నాడు.

అక్కడినుంచి – శృంగగిరి అనీ శృంగేరీ అనీ ప్రసిద్ధి కాంచిన పవిత్ర క్షేత్రం చేరుకుని తాను రచించిన భాష్యం మొదలైన గ్రంథాలన్నీ చదివించి వ్యాప్తి చేశాడు. ఆ పుణ్యస్థలంలో శారదాంబను నిలుపుటకు ఉత్సాహం కలిగి – ప్రాసాదం కల్పించి బ్రహ్మాది దేవతలకు కూడా

వందనీయమైన ఆ మహాదేవిని ప్రార్థించాడు. ఆ మఠంలో శారదకు విద్యాపీఠపూజ కావించడానికి తనశిష్యులలో ప్రధానుడైన సురేశ్వరుణ్ని అధ్యక్షుడిగా నియమించాడు. ఆ శారదాంబ మునుపు చేసిన ప్రతిజ్ఞను పాటిస్తూ యిప్పటికీ శృంగేరీ పీఠంలో భక్తుల అభీష్టాలు తీర్చే కల్పవృక్షమై విరాజిల్లుతోంది.

# తోటకాచార్యుడి కథ

**శం**కరాచార్యులు శృంగేరిలో ఉండగా ఒకనాడు బ్రహ్మచారొకడు వచ్చి – "మహాత్మా! నేను మూఢుణ్ని, విద్యా విహీనుణ్ని, పశుప్రాయుణ్ని, నాపేరు ఆనందగిరి అంటారు. విద్య లేనివారెందరినో శిష్యులుగా స్వీకరించి విద్వాంసులను చేశావని నీ ఖ్యాతివిని నిన్ను ఆశ్రయించవచ్చాను. నన్ను శిష్యునిగా అనుగ్రహించి రక్షించు" అని అనేక విధాలుగా ప్రార్థించాడు. శంకరుడు చిరునవ్వు నవ్వుతూ అతన్నంగీకరించాడు.

అది మొదలు ఆ శిష్యుడు, గురువు కూర్చుంటే కూర్చుంటాడు, నిలబడితే నిలబడతాడు, గురుడు నడిస్తే నడుస్తాడు, పడుకుంటే పాదాలొత్తుతాడు. ఛాయలా అతన్ననుసరిస్తూ, భక్తి శ్రద్ధలతో సేవిస్తున్నాడు. శంకరాచార్యు లతన్ని మనసులో ఎంతో మెచ్చుకునేవాడు.

ఒకనా డతను మఠంలో కూర్చుని శిష్యులకు పాఠం చెప్పబోతూ, "ఆబ్రహ్మచారిఎక్కడ?" అని అడిగాడు.

"అతనూ నేనూ శాటీ వస్త్రాలను ఉతకడానికి తుంగభద్రకు వెళ్ళాం. పాఠం చదివేవేళ ఐపోతుందన్న భయంతో నేను నా పనిని తొందరగా చేసుకుని వచ్చాను. వాడు ఉతికిందే ఉతుకుతూ కాలం గడుపుతూ, పాఠం చదవడానికి రమ్మని పిలిస్తే, ఇదుగో అదుగో అని నన్ను కూడా రెండు గడియలు నిలబెట్టేశాడు. వాడికి పనిమీదున్న శ్రద్ధ చదువుమీద ఉండదు" అన్నాడా శిష్యుడు.

శంకరుడు వాడికోసం ఎదురు చూస్తూ పాఠం చెప్పడం రెండు గడియ లాపేశాడు. అప్పటికీ వాడు రాలేదు. పద్మపాదుడు లేచి - "స్వామీ! అతను మందబుద్ధి. ఏమీ తెలియదు. ఊరికే వినడమే కాని గ్రహణశక్తి కొంచెమైనా లేదు. శబ్దాలయినా రావు. అలాటి మూఢుడికి మా పాఠాలు వినడంవలన ప్రయోజన మేముంది? మాకు చెప్పెయ్యండి" అన్నాడు.

శంకరుడు అతని గర్వాన్ని పరిహసించే ఉద్దేశంతో "పద్మపాదా! వాడి సమర్ధత ఏం తెలిసి నువ్వలా అన్నావు? వాడు విద్యలలో మీ అందరికంటే అధికుడు. కవి, వక్త, జ్ఞాని. అంతర్ముఖు డవడం వల్ల వాని మహిమ మీకు తెలియలేదు. వచ్చిన తరవాత పరీక్షించి చూడండి" అంటూండగానే, ఉతికిన బట్టలు భుజంమీద వేసుకుని ఆనందగిరి వచ్చాడు.

అతన్ని చూసి గురువు - "గిరీ! పాఠం చదవాలి. వేగంగారా, బట్టలు తరవాత ఆరవేద్దువుగాని -" అన్నా, వాడు బట్టలు ఆరవేసే అక్కడికి వచ్చాడు.

అప్పుడు శంకరుడు వాడికి మనసుచేత పధ్నాలుగు విద్యలు వచ్చేటట్లు అనుగ్రహించాడు. అప్పుడు వాడు అఖిల విద్యాప్రవీణుడై చేతులు జోడించి శంకరాచార్యుణ్ణి శ్లోకాలతో స్తుతించాడు. అద్వైత మతం ప్రతిపాదించే ఆ వృత్తాలు విని మిగిలిన శిష్యులు తెల్లబోయి చూస్తూ, అది గురువుగారి మహిమ తప్ప మరేదీ కాదని, సిగ్గుపడి ఊరుకున్నారు.

శంకరుడు వాడికి తోటకాచార్యులని పేరుపెట్టి తన ప్రధాన శిష్యులలో చేర్చుకున్నాడు. పద్మపాద, సురేశ్వర, హస్తామలక, తోటకాచార్యులు నలుగురూ ధర్మార్థకామ మోక్షాలనీ, ముక్తి భేదాలనీ, బ్రహ్మ ముఖాలనీ విద్వాంసులు వర్ణిస్తారు. అలాటి శిష్యులతో శంకరుడు శృంగగిరి యందు నివసిస్తూ భాష్యవ్యాపకం చేస్తుండగా, భారతీపీఠస్థుడైన సురేశ్వరుడు శంకరునకు నమస్కరించి "మహాత్మా! మీవల్ల నేను పరమార్థోపదేశం వహించి కృతార్థుడి నయ్యాను. మీరు రచించిన శారీరక సూత్ర భాష్యానికి వార్తికము చేయాలని నాకు ఉత్సాహంగా ఉంది.

నిజానికి, దానిని చూడడానికైనా నాకు సామర్థ్యంలేదు. అయినా మీ కటాక్షంతో యధాశక్తి చేస్తాను. అనుజ్ఞ ఇస్తారా?" అని ప్రార్థించాడు. శంకరుడు తన అంగీకారం తెలిపి - సంతోషం వ్యక్తం చేశాడు.

ఆ విషయం తెలిసి పద్మపాదుడు మొదలైన శిష్యులు గురువుతో రహస్యంగా - "గురువర్యా! తమ భాష్యానికి సురేశ్వరుణ్ని వార్తికం రాయమని ఆనతి యిచ్చినట్లు విన్నాం. దానివలన మనమనోరథం సఫలం కాదు. ఈ సురేశ్వరుడు కర్మే స్వర్గనరకాది ఫలమిస్తుందని వాదిస్తూ యుక్తి చేత పరమేశ్వరుణ్ని నిరాకరించాడు. సురేశ్వరుడు పుట్టింది మొదలు కర్మలయందు ప్రీతి కలిగి - "కర్మలను చేసి స్వర్గాది ఫలములను పొందండి." అని బోధించేవాడు. కనక మీ భాష్యానికి వార్తికం రచించినా కర్మ పరంగానే సూచిస్తాడు. సంన్యాసికదా కర్మపరత్వాన్ని చెబుతాడా? - అంటే, అతను బుద్ధి పూర్వకంగా సంన్యాసాన్ని స్వీకరించినవాడు కాదు. వాదంలో ఓడి ఆ నియమం స్వీకరించాడని మీకూ తెలుసు. కాబట్టి అతనియందు విశ్వాసం ఉంచకూడదు. అతనిచే వార్తికం రచింపజేయడం మంచిది కాదు. మీ శిష్యులలో ప్రధానుడైన పద్మపాదుని సామర్థ్యం మీరెరుగనిదా? అతనే మీ భాష్యానికి టీక రచించాలి. లేదా ఉగ్రమైన తపస్సుతో సరస్వతిని ప్రసన్నురాలిని చేసుకున్న ఆనందగిరి కప్పగించండి." అని - అంటూండగా, పద్మపాదు డక్కడికి వచ్చి - తలవంచుకుని -

"ఆర్యా! మీ కృపవల్ల హస్తామలకుడికి పద్నాలుగు విద్యలూ తెలిశాయి. అతను మీ భాష్యానికి వార్తికం చేయడానికి అర్హుడు కాదా? కర్మ ప్రియుడైన సురేశ్వరునిపై మీకెందు కనుగ్రహం కలగాలి?" అని అడిగాడు.

శంకరాచార్యులు చిరునవ్వు నవ్వుతూ - "వత్సా! పద్మపాదా! హస్తామలకుడు అంతటి వాడేకాని అతనికి ప్రచారం కొంచెమయినా లేదు. బాల్యంలో యితనేమీ చదవలేదు. నేను వీని శిరస్సుమీద చెయ్యివేసి నువ్వెవడివని అడిగాక కదా శ్లోకాలు చదివాడు? దీనికొక కారణముంది" అన్నాడు.

"స్వామీ! ఇతను బోధలేకుండానే యిలాటి ప్రజ్ఞావంతుడెలా అయ్యాడో చెప్పండి" అని అడిగారు.

# హస్తామలకుని పూర్వకథ

"కొన్నేళ్ళకిందట ప్రభాకరుడి భార్య – రెండేళ్ళ వయసుకల కొడుకునెత్తుకుని స్నానం చేయడానికి నదికి వెళ్ళింది. ఆ నది వద్దున సంసార విరక్తుడైన ఓ సిద్ధుడు తపస్సు చేసుకుంటున్నాడు. ఆమె తన కుమారుణ్ని అతని ముందుంచి – "మహాత్మా! నేను స్నానంచేసి వచ్చే దాకా వీణ్ని చూస్తూ ఉండండి. ఎత్తుకునే వారెవళ్లూ లేరు. క్షణంలో వస్తాను. దయార్ద్రహృదయులైన మీకు తెలియని దేముంది?" అని ప్రార్థించింది. అతను అంగీకరించినట్లు తల ఉపాడు.

ఆమె కొడుకుని ముద్దుపెట్టుకుని స్నానంచేయడానికి వెళ్ళింది. దైవవశాత్తూ ఆ బాలుడు అటూ యిటూ తిరుగుతూ యమునా నదిలో పడి ప్రాణాలు వదిలాడు. అప్పుడు అతని సంబంధీకులు గొల్లున ఏడుస్తూ నీటిలోనుంచి బాలుడిని తీసి ఆ సిద్ధుడి ముందు బాలుడి శవాన్ని పడేశారు. అంతలో అతని తల్లి ఆ వార్తవిని వచ్చి గుండెలు బాదుకుంటూ – 'అయ్యో! ఈ సిద్ధుడు ఎంత మోసం చేశాడు! మొదట అంగీకరింపక పోయినా మాకీ ముప్పు వచ్చేది కాదు. ఇంత దయాహీనుడని తెలిస్తే యితని దగ్గర వదలకనే పోదునే. ఈ కాస్సేపటిలోనే ఎంత పుణ్యం సంపాదించుకోవాలనో యితను బాలుణ్ని చూడకుండా ఉపేక్షించాడు. ఇలాటి నిర్దయుడికి తపస్సెలా సిద్ధిస్తుంది? నియమాలెందుకు? సమాధి కాల్చనా? పిల్లాడ్ని చంపిన పాతకం చుట్టుకోదా? నేనేం చేసేది? భర్తకేమని చెప్పేది? ఈ పాడు నదిలో మునగడాని కెందుకు వచ్చాను?' – అంటూ ఏడిచింది.

ఆ మహర్షి ఆ శోకాలాపాలువిని, తన ఉపేక్షకు పశ్చాత్తాపపడి, అపవాదు భరించలేక, సమాధినుంచి బయటపడి, "అయ్యో! వాడికోసం చింతిస్తారేం?" అంటూ బాలుణ్ని పరీక్షిస్తూ "వీడు బతకగలడు. ఒకక్షణం ఉండండి" అంటూ తన శరీరాన్నెక్కడో వదిలేసి, యోగ సామర్థ్యంచేత, పరకాయ ప్రవేశనైపుణ్యం కొద్దీ ఆ బాలుడిలో ప్రవేశించాడు.

అప్పుడా కుర్రవాడు కదలి ఏడవడం చూసి, సిద్ధుడి దయవల్ల బతికాడని సంతోషిస్తూ ఆ తల్లి పుత్రుడినెత్తుకుని యింటికి పోయింది.

ఆ కుర్రవాడు అందరి పిల్లల్లా కాక భిన్నంగా ఉండడం చూసి తండ్రి ఎన్నో ప్రక్రియలు చేయించాడు.

తరవాత కథ మీకు తెలిసిందే కదా? అందుచేతనే ఉపదేశం లేకుండానే హస్తామలకుడు సర్వజ్ఞుడయ్యాడు. ఇతని కన్నీ తెలిసినాబాహ్యప్రవృత్తి లేనివాడు కనుక భాష్యానికి వృత్తి రచించడానికి తగడు. సురేశ్వరుడే అందుకర్హుడు. అతను కాదంటే అతనంతటి వాడు మరొకడు కనిపించడు" అన్నాడు శంకరుడు.

అప్పుడు – "స్వామీ! మీ సెలవైతే పద్మపాదుడు వార్తికం చేయలేడా?" అని శిష్యులు అడిగారు. "అతను బ్రహ్మచర్యం నుంచే సన్యసించినవాడు. బుద్ధిమంతుడు. మీకు వానియందు అనుగ్రహం ఎందుకు కలగలేదు?" అని మరికొంద రడిగారు.

"మీ అందరికీ అలాటి అభిప్రాయం ఉంటే పద్మపాదుడు నా భాష్యంలో ఒక నిబంధం రచిస్తాడు. వార్తికం మాత్రం సురేశ్వరుడే చెయ్యాలి" అని శంకరుడు అంతటితో ఆ ప్రసంగం ముగించాడు.

ఒకనాడు శంకరులు సురేశ్వరుణ్ణి చూసి – "ఆర్యా! నా శిష్యులు నువ్వు వార్తికం చేయడానికి సమ్మతించడం లేదు. నీ సామర్థ్యం తెలిసేటట్లు అధ్యాత్మ తత్త్వం వెల్లడయ్యేలా స్వతంత్రంగా ఒక గ్రంథం రచించి నాకు చూపించు. ఈ శిష్యులకి నమ్మకం కలిగించు" అన్నాడు.

అందుకు కొంచెం కోపం. తెచ్చుకుని సురేశ్వరుడు స్వల్పకాలంలోనే నైష్కర్మ్యసిద్ధి అనే గ్రంథం రచించి గురువుకి చూపగా అతను ఆశ్చర్యపడి దానిని శిష్యులకీ చూపి చాలా ప్రశంసించాడు. ఇప్పటికే యతీశ్వరులా గ్రంథాన్ని ఎక్కువ విశ్వసిస్తారు.

తన గ్రంథం చూసి ఆచార్యులు ఆనందించడంతోటే – సురేశ్వరుడు కోపంగా – "ఈ లోకంలో మత్సర గ్రస్తులు అనేకమంది ఉన్నారు. నేను ఆచార్యవాక్యంతో వార్తికం చేద్దామని ప్రయత్నించ బోతే అనవసరంగా కొందరు విఘ్నం కావించారు. సరే. నేను తప్ప మరెవరు ఆ గ్రంథానికి వార్తికం చేసినా నిలవక నశించును గాక" అని శాపమిచ్చి,

గురువుతో – "గురువర్యా! నేను కీర్తికోసం కాని లాభంకోసం కాని వార్తికం చేయాలనుకోలేదు. గురువాజ్ఞ నుల్లంఘింపరాదని ఆ పనికి పూనుకున్నాను. గృహస్థుడైనా సంసారి అయినా మనస్సే కదా ప్రధానం? నీ చేత వాదంలో ఓడిపోయి సన్యాసాశ్రమం స్వీకరించాను. పూర్వభ్రమలు విడిచాను. అద్వైత మతంలో ఎక్కువ విశ్వాసం కలిగి ఉన్నాను. అయినా నన్ను తెలుసుకోలేక నీ శిష్యులు నన్ను నిరాకరించారు" అంటూంటే శంకరు లతని కోపాగ్నిని చల్లార్చాడు.

"ఆర్యా! నువ్వు తొందరపడి నా సూత్ర భాష్యానికి వార్తికం నిలవకుండా శపించావు. అది దైవ కృతం. అయినా నా మనసుని ఎక్కువ బాధిస్తూంది. ఏం చేస్తాం? సరే. నేను నీ శాఖ అయిన తైత్తరీయోపనిషత్తుకు ద్వితీయ శాఖ అయిన కాణ్వోపనిషత్తుకు భాష్యాలు చేసి ఉన్నాను. ఆ రెండింటికీ నువ్వు వార్తికాలు రచించు. ఆ చంద్రతారార్కం భూమిమీద ప్రకాశించగలవు" అన్నాడు.

విద్వాంసులు మెచ్చేటట్లుగా ఆ వార్తికములను సురేశ్వరుడు రచించి గురుదక్షిణగా సమర్పించాడు. పద్మపాదుడు శారీరక సూత్ర భాష్యానికి టీకను రచించి గురువుకి కానుకగా యిచ్చాడు. దానిలోని పూర్వభాగం పంచపాదిక, ఉత్తరభాగం – వృత్తి అని ప్రఖ్యాతిచెందాయి. తరవాత హస్తామలకుడు మొదలైన శిష్యులు గురువాజ్ఞతో అనేక గ్రంథాలు రచించారు. శిష్యుల చేత అనేక గ్రంధాలు రచింపజేసి శంకరుడు కొన్నాళ్ళు శృంగేరిలో ఉన్నాడు.

హస్తామలకుడు, చిత్సుఖుడు తుంగభద్రకు స్నానానికి వెళ్ళారు.

**చిత్సుఖుడు** : మన ఆచార్యులు యివాళ ఏదోలా ఉన్నారే! పద్మపాదుడు యాత్రకి వెళ్ళాడని కాబోలు.

**హస్తామలకుడు** : ఆయనకి వానియందు ప్రేమెక్కువ. పరదేశయాత్రలో కష్టాలు చెప్పి వారించ బోయారు.

**చిత్సుఖుడు** : గురువచనం కాదని పద్మపాదు డెందుకని వెళ్ళాడో?

**హస్తామలకుడు** : తిరస్కరించికాదు. తీర్ధసేవవలన మనసు నిర్మలం కావడం, సజ్జన సాంగత్యం, పండితవాదం మొదలయిన లాభాలు కలిగి

అనర్థాలు పోతాయని. గురువుగారేం ఉపదేశించారో విను. 'ఒక్కడివీ వెళ్ళకు. ఎక్కువమంది బ్రాహ్మణులున్న వూరిలోనే నివసించు. సజ్జనులతో పరిచయం చేసుకో. తోవలో తెలియకుండా మంచి నీళ్ళు కూడా తాగకు. మారువేషాలలో వచ్చే దొంగలని కనిపెట్టు. ఎదురైన భిక్షకుల నాదరించు. ధ్యానం చేసుకో.'

**చిత్సుఖుడు** : పద్మపాదుడెన్నాళ్ళకి తిరిగొస్తాడో?

**హస్తామలకుడు** : రెండునెలలలోపునే వస్తానన్నాడు. అడుగో. తోటకాచార్యులు స్నానానికి వస్తున్నాడు. గురువు సమాధినుంచి లేచారేమో అడుగుదాం.

***తోటకుడు*** : మీరిక్కడ ఉండిపోయారేం? ఆచార్యులు యోగశక్తితో తల్లిగురించి ఏదో ప్రత్యక్షం చేసుకుని అక్కడికి వెళ్ళాలని ప్రయత్నం చేస్తున్నారు. త్వరగా రండి.

ముగ్గురూ వెళ్ళేసరికి – శంకరాచార్యులు తల్లి ప్రాణంపోయే సమయంలో స్మరింపగా అక్కడికి పోడానికి సిద్ధమౌతూ, తాను వచ్చేదాకా శిష్యులు అక్కడుండేలా నియమించి, యోగశక్తితో ఆకాశమార్గాన ముహూర్తకాలంలో తల్లివద్దకు చేరాడు.

అప్పటికే ఆమె – 'కుమారా! నిన్ను చూడాలని నా ప్రాణాలు బొందెను వదలడంలేదు. ఒక్కసారి వచ్చి కంటపడకూడదూ? నాతో ఎన్నో చెప్పి పోయావు. అవన్నీ మరచి పోయావా? మరణకాలంలో స్మరించినంతనే వచ్చి ఊర్ధ్వ దైహిక క్రియలు కావిస్తానని శపథంలా పలికావే! ఎందుకురావు? హా! పుత్రా!" అంటూ పలవరిస్తున్న తల్లిని చూసి, నిస్సంగుడైనా దయామయుడు కావడంతో కన్నీరు కార్చుతూ, తల్లిని చూస్తూ "అమ్మా! ఇదిగో, నేను వచ్చాను. నీ పుత్రుడు శంకరుణ్ని. ఇక విచారింపకు. నీ కోరికేమిటో చెప్పు. వెంటనే తీరుస్తాను" అంటూ ఆమె పాదాలకు నమస్కరించాడు.

అప్పుడామె అతన్ని కౌగలించుకుని – "నువ్వీ అవస్థలో కుశలంగా వచ్చి నాకు కనిపించావు. ఇంతకంటె నాకు సంతోష

మేముంది? కుమారా! ఈ శరీరాన్నింక భరించలేకపోతున్నాను శాస్త్రప్రకారం దీనిని సంస్కరించి పుణ్యలోకాలు ప్రాప్తింపజెయ్యి" అంది.

సర్వలోకసుఖమైన బ్రహ్మానందం కలిగించే తలపుతో తల్లికి శంకరుడు స్వయం ప్రకాశమైన శుద్ధ నిర్గుణ తత్వం ఉపదేశించాడు. కాని ఆమె - "నాకేమీ తెలియలేదు. ఇలాటి సమయంలో నిర్గుణుని ఎలా మనసుకు పట్టించుకోగలను? మనోహరమైన సగుణతత్వం ఉపదేశించు. ఆనందిస్తాను" అంది.

అప్పుడు శంకరుడు తల్లికి దర్శనమివ్వమని శంకరుణ్ని స్తోత్రం చేశాడు. భుజంగ ప్రయాత వృత్తాలలో స్తుతించబడిన ఈశ్వరు డామెకు ప్రత్యక్షంకాగా - "వీరెవరో నన్ను రమ్మని పిలుస్తున్నారు. కాని వీరి ఆకారాలు తమోగుణం సూచిస్తున్నాయి వీరిని పంపివెయ్యి" అందితల్లి శంకరుడు వారిని భక్తితో ప్రార్థించి అనునయంగా పంపివేసి - మరింత భక్తిగా ప్రార్థించాడు అప్పుడు - శంఖ చక్రములతో సౌందర్యమూర్తి అయిన ఇందిరా రమణుడు ప్రత్యక్షంకాగా "తండ్రీ! ఇప్పుడు శాంతులైన వారెవరో వచ్చి మెరుపులా మెరుస్తున్న రదముమీదికి నన్ను రమ్మని పిలుస్తున్నారు. ఇదంతా నీమహిమే పోయి వస్తాను. వెనకిచ్చిన వరం మరవకుసుమీ" అంటూ ప్రాణం విడిచి, దివ్యదేహం దాల్చి ఆ విమానమెక్కి పరమపద మొందింది.

తల్లికిచ్చిన వరం చెల్లించాలని శంకరుడు అపరకర్మలు చేయదలచి జ్ఞాతి అయిన భట్టారకుని పిలిచి అందుకు తగిన ఏర్పాట్లు చేయమని చెప్పాడు.

ఆ వార్తవిని కాలటి అగ్రహారంలోని బ్రాహ్మణు లందరూ సభచేసి - 'శివగురుని కొడుకు తల్లిని జ్ఞాతుల పాలు చేసి సన్యసించి యిప్పుడామెకు కర్మ చేయదలచి రమ్మన్నాడట. మనం వెళ్ళాలా? మానాలా?" అన్నారు కొందరు.

"సన్యాసికి కర్మచేసే అధికారం ఏ శాస్త్రంలో ఉంది?"

"అతను జగత్పండితుడు కాని సామాన్యుడు కాడు అతనికంటె మనకెక్కువ తెలుసా?"

"కర్మయే పనికిరాదని దేశములో అంతటా వాదించి, తల్లికిప్పుడు కర్మచేయడానికెలా పూనుకున్నాడు? చెప్పేదొకటీ, చేసేదొకటీనా? అన్నాడు సభాపతి.

"మనలోమనం తగవులాడుట మంచిదికాదు. అందరమూ వెళ్ళి అతనితో మాట్లాడి తగినట్లు చేద్దాం."

"మీకేదో దానధర్మాలు దొరుకుతాయనుకుంటున్నారేమో. అతను సన్యాసి. ఎదురు మననే యాచిస్తాడు. మీరు వెళ్ళారో మీకూ మాకూ భోజనాలుండవు. ముందే చెబుతున్నాము "

"అతను మాకు బంధువు. యజ్ఞ భట్టారకుడు మాకు మిత్రుడు అతని ముఖమైనా చూసి వెళ్ళాలి. మీరు మమ్మల్ని వెలివేయించినప్పుడు చూద్దాంలే. మీతో సహపంక్తి లేకపోతే మాకేమీలోటు లేదు మొన్న ఘటశ్రాద్ధం చేయించిన విస్సన్న సోమయాజి నెవరూ ఆక్షేపించలేదేం?"

"ఓహో! మీరిలా స్వతంత్రులై మాట్లాడుతూంటే యిక నా సభాపతిత్వ మెందుకో? నా ఆజ్ఞ లేకుండా శంకరుని యింటికి వెళ్ళండి అప్పుడు చెబుతాను."

" ఈ గ్రామంలో ఉండకుండా చేస్తావు అంతేనా? మరో చోటుకి పోతాం."

"యజ్ఞ భట్టారకుడు వస్తున్నాడు. అతనిని మనం చెప్పినట్లు నడిచేలా చేస్తాను. చూడండి."

**యజ్ఞభట్టారకుడు** : మా శంకరుని తల్లికి అపర సంస్కారం చేయడానికి నిశ్చయించాడు మిమ్మల్నందరినీ తీసుకురమ్మన్నాడు. మా శంకరుని తల్లి నిన్నరాత్రి స్వర్గస్తురాలయిందని తెలుసుకదా.

**సభాపతి** : చెప్పేవాడికి లేకపోతే నీకేనా మతి లేదా? శంకరుడా కర్మ చేయడం!

**భట్టారకుడు** : అతను తల్లికి వరమిచ్చాడట ఎవరేనా వచ్చి అడిగితే సమాధానం చెబుతానంటున్నాడు. ఈ విషయం ఇందాక వీరవర్మ అడిగితే జవాబు చెప్పి అతన్ని ఒప్పించాడే

సభాపతి : భట్టారకా! నువ్వొట్టి వెర్రి వాడివి సుమీ. (అతనితో రహస్యంగా) శంకరుడు మొదట విరక్తితో సన్యసించి తన ఆస్తినంతటినీ తల్లితో కూడ నీ అధీనం గావించి వెళ్ళిపోయాడు కదా. ఇప్పుడా ఆస్తియందు ఆశపుట్టి, దానిని రాబట్టు కుందుకు తల్లికి కర్మ చేయబూనుకున్నాడు. ఈ మర్మం తెలియక నువ్వు మరోలా అనుకుంటున్నావు.

భట్టారకుడు : (ఆలోచించి) ఐతే నేనిప్పుడేం చేయాలి?

సభాపతి : కర్మ చెయ్యనివ్వకు. మేమందరమూ నీకు తోడుగా ఉంటాం. అత నివాళ ఉండి రేపు పోయేవాడు. మనకీ మనకీ విధాయకం. నువ్వేమీ చెయ్యక్కర్లేదు. ఇక్కడే ఉండు. అతనికి నిప్పయినా దొరకనివ్వను. వాహకులు ముందే లేరు. ఏం చేస్తాడో చూద్దాం.

భట్టారకుడు : మా పినతండ్రి పశుపతి నాకోసంవస్తున్నాడు. అతనికి కూడా చెప్పు.

పశుపతి : ఏమిరా భట్టారకా ... ఇంత ఆలస్యం చేశావ్? వాహకులేరీ? శంకరుడు తొందరపడుతున్నాడు.

భట్టారకుడు : శంకరుడు శాస్త్ర దూష్యమైన పని చేస్తున్నాడని గ్రామస్తులు సభచేసి అతన్ని వెలివేశారట. వాహకులెవరూ రారట. మనమేం చేద్దాం?

పశుపతి : శంకరుడికా వెలి! గ్రామస్తులెంత మూర్ఖులు! అగ్నికి చెదలు పడతాయా! వీరికేదో మూడింది.

సభాపతి : వీరికేదియూ మూడలేదు. వారికి మూడబట్టే అకార్యములకు పూనుకోడం.

పశుపతి : ఛీ! నోరుముయ్యి. అతనికి కోపమొస్తే మూడులోకాలనీ భస్మం చేయగలడు.

సభాపతి : ఈ బెదిరింపులకి మేము వెరవము. గ్రామస్తులెవరూరారు. మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి.

పశుపతి : భట్టారకా! నువ్వూరావా?

భట్టారకుడు : బాబూ! తొందరపడకు. గ్రామస్తులంతా ఒకటైతే మనంవెళ్ళి ఏం చేస్తాం?

పశుపతి : ఛీ! నీ జ్ఞాతిత్వం పోనిచ్చుకున్నావు కాదు. అతను మహానుభావుడు. మనందరినీ భస్మం చేయకమానడు. మనం ఆలస్యం చేశామని కుమారపాలితుణ్ని పంపాడు. అడుగో.

యజ్ఞభట్టారకుడు : అతని నక్కడి విశేషాలడిగి పోదాం, ఉండు.

కుమార పాలితుడు : పశుపతి తాతా! నువ్విక్కడ ఆలస్యం చేశావేం? మనఅగ్రహారం పని తీరిందిలే.

పశుపతి : అతను కోపించాడా ఏం? నేనేం చేసేది? గ్రామస్తు లందరూ అతన్ని వెలివేశారట.

కుమార పాలితుడు : ఎంతసేపటికీ మీరెవరూ రాకపోడంతో, ఒక్కడూ తల్లి శవం దగ్గరుండి విసిగిపోయి కోపమొచ్చి, తల్లి కుడిభుజం మధించి అగ్నిపుట్టించి దానిచేత దొడ్డిలో చితి ఏర్పరచి దహించాడు.

పశుపతి : అతని సామర్థ్యమెంతటిదో చూశారా? నేను ముందే చెప్పాను. సన్నికల్లు దాచినంత మాత్రాన పెళ్ళి ఆగిపోతుందా? తరవాత అతను కోపంతో యీ గ్రామస్తులు వేదబాహ్యు లౌతారు, యతులు వీరింట భుజింపరు. వీళ్ళ పెరళ్ళు స్మశానాలౌతాయి అని శపించాడు.

గ్రామస్తులు : ఇదంతా యీ సభాపతి మూలానే వచ్చింది. ఏమీ ఎరగని వాళ్ళని తీసుకొచ్చి సభలు చేయించి యిలా అనమని మమ్మల్ని గంగలో దింపాడు. మేమేకాక మా కులస్తు లందరినీ చెరిపాం. కటకటా! కాలటి అగ్రహారాని కెలాటి ఆపద సంభవించింది. జన్మభూమి అనేనా కనికరించకుండా ఎంత క్రూరంగా శపించాడు! ఇది కాటి అగ్రహారమై పోయింది!

పశుపతి : శాంతుడు కదా అని పీడిస్తే కోపగించ కుండునా? చల్లనిదైనా చందనవృక్షాన్ని అదే పనిగా మధిస్తే అగ్ని పుట్టక

మానుతుందా? తేజశ్శాలురి కృత్యాలు అశాస్త్రీయాలయినా నింద్యములు కాజాలవు.

వాళ్ళు పశ్చాత్తాపపడుతూ యిళ్ళకి పోయారు. శంకరాచార్యులు తల్లికి ముక్తినిచ్చి పద్మపాదుని రాకకోసం చూస్తూ కేరళలో కొన్ని రోజులు కాలక్షేపం చేశాడు.

## పద్మపాదుని తీర్థయాత్ర

పద్మపాదుడు గురువునే ధ్యానిస్తూ సముచితమైన శిష్యబృందంతో యాత్రకు బయలుదేరి, వెళ్ళి వెళ్ళి శ్రీకాళహస్తి చేరాడు.

అక్కడ ఈశ్వరుణ్ని సేవించి, అక్కడినుంచి పుండరీకానికి వెళ్ళాడు. అక్కడ శివుడు తాండవమాడుతున్నప్పుడు ఆ శ్రమకి నివారణగా ప్రార్థించగా గంగవచ్చింది. అందుకే అది శివగంగ అని పిలవబడుతూంది. నాట్యం చేసేటప్పుడు జటాజూటంలోని నీటిబిందువు జారిపడిన కారణంగా పుణ్యతీర్థమై శివగంగ అని వాడుక చెందిందని కొందరంటారు. శివగంగలో మునిగి శివుడి తాండవం చూస్తే మానవులు పాపాలన్నీ నశించి ముక్తి పొందుతారు. పద్మపాదుడు శివగంగలో మునిగి శివుడినారాధించి తాండవాన్ని చూసి పరమానందపడి తరవాత శ్రీరంగం వెళ్ళాడు.

శ్రీరంగనాథుడ్ని కొన్నాళ్ళు ఆరాధించి, దక్షిణ యాత్రలన్నీ చేసి పద్మపాదు డొకనాడు దారిలో తారసిల్లిన మేనమామ యింటికి వెళ్ళాడు. అతను పరమానందభరితుడై పద్మపాదునకు శిష్యులతో సహా నానావిధా లయిన ఉపచారాలూ చేసి అతనికి సంతోషం కలగజేశాడు. ఆ వార్తవిని అక్కడున్న బంధువు లందరూ వచ్చి ప్రేమ పూర్వకంగా అతన్ని కౌగలించుకున్నారు.

"మహాత్మా! అధ్యాత్మ తత్వ వేత్తలయిన మీవంటివారు పరోపకారానికే తీర్థయాత్రలు చేస్తూంటారు. అంతే తప్ప ఆ యాత్రల

వల్ల మీకేమీ ప్రయోజనం ఉండదు. తీర్థాలే మీ పాదరేణువులు సోకి పవిత్రాలవుతూంటాయి. మీ దర్శన భాగ్యం వలన పాపాలు పోగొట్టుకుని సుఖంగా ఉండాలని మీరు కొన్నిదినాలు యిక్కడుండ వలసిందిగా ప్రార్థిస్తున్నాం" అన్నారు.

అందుకు పద్మపాదుడు "ఆకలిదప్పికలతో బాధపడుతూ అవి తీర్చే పుణ్యాత్ముడు ఎక్కడున్నాడని వెదికే అతిథులను ఆదరించి తృప్తి పరిచే గృహస్థుడిని ఎంత పొగిడినా చాలదు. స్నానం చేసి అగ్ని పరిచర్యలు వేళలందు చేస్తూ కౌపీనం ధరించి వేదం జపిస్తూ దండం పట్టుకుని విద్యానిధి అయిన బ్రహ్మచారి జఠరాగ్ని ప్రజ్వరిల్లు తూండగా, ఆకలితో భిక్షను కోరుతూ ఎవరి యింటికి వెళ్తాడో ఆ గృహస్థుడెంత అధికుడో! భూమిమీద ఎవరి ఆహారం వలన తాపసజనం తపస్సు చేసుకోగలుగుతున్నారో, ఆ తపోఫలం ఆ అన్నదాతను చేరుతుందని వేదాలు చెబుతున్నాయి, విన్నాం కదా. గృహస్తుడు చల్లగా ఉండడం వల్లనే కదా తాపసుల తపస్సు సాగుతోంది! అందుచేత గృహస్థుడు అందరికంటే అధికుడు. అన్నం అంటూ యింటికి చేరిన అతిథిని పూజించినవారికి దానివలన కోటియాగాల ఫలంకంటె అధికంగా వస్తుంది." అంటూ గృహస్థ ధర్మాలను కొనియాడుతూ నీతిమార్గం ఉపదేశించి సాదరంగా పంపాడు.

మేనమామ చేత అర్చించబడి అతని యింట్లో భిక్ష చేశాడు. అప్పుడు శిష్యుడి చేతిలో ఉన్న గ్రంథాన్ని చూసి – "ఇదేమిటి?" అని అడిగాడు.

"ఇది శంకరాచార్య కృతమయిన సూత్రమునకు టీక. నాచే రచింపబడింది. విను." అని అంతా మేనమామకి చదివి వినిపించాడు. అతని ప్రబంధ నిర్మాణ నైపుణ్యానికి వింతపడుతూ, మతాంతరుల ఖండనలను నిరుత్తరంగా చేసే ఆ రచనకు – ప్రభాకరశిష్యు డగుటవలన స్వమత తిరస్కారం వలన కలిగిన మత్సరాన్ని బయట పడనీయకుండా, మాతులుడు మందహాసంచేసి ఎంతో ప్రశంసించాడు. ఆ కపటం తెలియని పద్మపాదుడు ప్రయాణ సమయంలో ఆపుస్తకా న్మాతని చేతులలో ఉంచి – "ఆర్యా! నాకు దీనియందు జీవితమునందు కన్న ఎక్కువ ప్రీతి. మార్గమధ్యంలో ఏమైనా ఔతుందేమో అని సందేహించి దీనిని

నీకప్పగిస్తున్నాను. నేను తిరిగివచ్చేవరకూ దీనిని భద్రంగా కాపాడు. నీకంటె నాకు పరమాప్తుడు లేడుకదా" అని పలుమార్లు చెప్పి శిష్యులతో కూడా రామేశ్వరం వెళ్ళాడు.

మాతులుడు ఆలోచనలో పడ్డాడు. "ఆహా! ఇప్పుడీ పుస్తకం నాచేతిలో పడింది. దీనిని రూపుమాపితే గురువుగారి మతం రక్షించిన వాడి నౌతాను. దీనిలోని మతఖండనలకి జవాబు ఎవరూ చెప్పలేరు. విశ్వాసఘాతక పాతకం వస్తే రానీ. దీనిని నిర్మూలించడమే కర్తవ్యం. దీనిని దగ్ధం చేసేస్తాను. స్వపక్షనాశనం కంటె గృహనాశనమే శ్రేయం. అలా ఐతే పద్మపాదుడికి నిందించడాని కవకాశముండదు" అని భావించి ఒకరాత్రి తనయింటికి నిప్పంటించుకుని "నాయిల్లు కాలిపోతూంది –" అంటూ పెద్ద కంఠంతో అరిచాడు.

పెద్ద పెద్ద చప్పుళ్ళతో, పొగలు కమ్ముతూ ఆ మందిరం దగ్ధమౌతూంటే గ్రామస్తులు వేగంగా వచ్చి ఎంతో ప్రయత్నించారు కానీ ప్రయోజనం లేకపోయింది. బూడిదగా మిగిలిన ఆ యింటిని చూసి – ఆ బ్రాహ్మణుడు, "ఇల్లు నాశనమైందని నాకు విచారంలేదు. కాని, పద్మపాదుడు నాకో పుస్తకం యిచ్చాడు. అది దగ్ధమైపోయిందనే చింతిస్తున్నాను" అంటూ పదిమందీ వినేలా శోకిస్తూ, జనులూ బంధువులూ ఎంతగానో ఊరడించగా ఎలాగో దుఃఖంమానుకున్నట్లు నటించాడు.

పద్మపాదుడు యాత్ర చేసుకుని కొన్ని రోజులకు మాతులుడి దగ్గరకు వచ్చాడు. అప్పుడతన్ని కౌగలించుకుని, "ఆర్యా! దేముడేం చేశాడో చూశావా? నాకు నీ మొహం చూడడానికే సిగ్గేస్తూంది. నువ్వు ప్రాణప్రదంగా నా కప్పగించిన పుస్తకాన్ని తిరిగి నీ చేతిలో పెట్టడానికి నాకు భాగ్యం లేకపోయింది. గృహం దగ్ధమైన విచారం కంటె ఈ విచారమే నన్నెక్కువగా బాధిస్తూంది. కాని ఏం చేయగలను? నిరంతరమూ నిన్నే తలచుకుంటూ కృశిస్తున్నాను" అంటూ బుడిబుడి దుఃఖం నటిస్తూంటే, అతన్ని వారించి పద్మపాదుడు.

"మామా! గతానికి విచారించడం సాధువుల ధర్మంకాదు. పోనియ్. దైవికంగా జరిగిన దానికి నువ్వేం చేస్తావు? పుస్తకం పోతే మాత్రం నా బుద్ధి ఎక్కడికి పోతుంది? కొన్ని రోజులిక్కడ ఉండి మళ్ళీ ఆ

గ్రంధం రచిస్తాను. చూడు." అంటూ అప్పటికప్పుడే గంటం చేత బూని గ్రందరచన ప్రారంభించాడు.

అప్పుడు మాతలుడు – "అయ్యో! నేను చేసిన ప్రయత్నమంతా వ్యర్థమై పోయింది. ఇతను మళ్ళీ గ్రంధరచన చేసేస్తున్నాడు. దీనికి అంతరాయం కలిగించడం ఎలా?" అని బాగా ఆలోచించి అతని భోజనంలో బుద్ధిమాంద్యం కలగజేసే విషం కలిపాడు. అది తినిన పద్మపాదుడు మందబుద్ధి అయి గ్రంథరచన చేయలేక విచారించసాగాడు.

ఆ సమయంలో శంకరుని శిష్యులు కొందరు ఆకస్మికంగా అక్కడికి వచ్చారు. పద్మపాదుడు వారిని చాలా ఆనందంగా కౌగలించుకుని – "మిత్రులారా! మీరెక్కడి నుంచి వస్తున్నారు? మన గురువు లెక్కదున్నారు? విశేషాలేమిటి?" అని అడిగాడు.

"ఆర్యా! నువ్వు వెళ్ళిన కొన్ని రోజులకి గురువు తల్లికి ప్రాణావసాన సమయం ఆసన్నమయిందని ఎరిగి మమ్మల్ని వదిలి శృంగగిరినుంచి యోగశక్తితో యింటికి వెళ్ళారు. అప్పటినుంచీ మాకు ఆ మహాత్ముని పాదసేవలేదు. మేమూ నీలాగే తీర్థయాత్రలు చేస్తున్నాం. ఆ మహాత్ముడు కేరళదేశంలో మహాసురేశ్వరుడి ఆలయంలో ఉన్నారని ఒక బ్రాహ్మణుడు చెప్పాడు. అక్కడికి వెళ్ళుతున్నాం. దైవికంగా నువ్విక్కడ కనపడ్డావు. పోదాం, రా" అన్నారు వారు. పద్మపాదుడు సంతోషిస్తూ వారితో బయలుదేరాడు.

వారంతా కలసి కొన్నాళ్ళకు మహాసురేశ్వరుని ఆలయంలో శంకరులని కలుసుకున్నారు. గురువు వారందరినీ పేరు పేరునా కుశల మడిగాడు. పద్మపాదుడు దీనవదనంతో జరిగింది వివరించాడు. "ప్రభాకరశిష్యుడైన అతనివలన నేను మోసపోయాను. మునపటి ఊహాలేవీ స్ఫురింపవు. నీ దాసుడి కిలాటి అవమానం ఎందుకు కలగాలి? నీ పాద పద్మాలను దర్శించుకున్నాను. కనుక నా చింత తొలగిపోతుంది" అన్న పద్మపాదుణ్ని ఊరడిస్తూ శంకరాచార్యులు,

"వత్సా! పద్మపాదా! దైవాన్ని మీరగల వారెవరూ లేరు. ఈ విషయం నాకు మునుపే తెలుసు. సురేశ్వరునితో కూడా చెప్పాను. కానియ్. పూర్వం శృంగగిరియందు నువ్వు నా దగ్గర చదివిన పంచపాది

నాకు జ్ఞాపకం ఉంది. అదంతా చదువుతాను. రాసుకో" అన్నాడు. పద్మపాదుడు ఎంతో సంతోషంగా అదంతా రాసుకున్నాడు. ఆనందం పట్టలేక గంతులు వేస్తూ ఆనంద బాష్పాలు కార్చుతూ, ఆడుతూ, పాడుతూ తన సంతోషాన్ని పలువిధాలుగా ప్రకటించుకున్నాడు.

ఆ వార్త దేశమంతటా వ్యాపించింది. కేరళాధీశ్వరుడైన రాజశేఖరుడు వెంటనే అక్కడికి వచ్చి కోటిమణులచే చేయబడిన తన కిరీటాన్ని శంకరుడి పాదాలకు నీరాజన మిచ్చాడు. శంకరుడతన్ని గుర్తుపట్టి, "రాజా! భద్రమేనా? నువ్వు రచించిన నాటకాలు వ్యాప్తి చెందుతున్నాయా? ఇక్కడి కెందుకు వచ్చావ్?" అని అడిగాడు.

అందుకు రాజశేఖరుడు నుదుటమీద చెయ్యి పెట్టుకుని - "మహాత్మా! నీ దయవలన ఏ కొరతా లేదు. కాని, నాచే రచించబడిన మూడునాటకాలూ ప్రమాదవశాన దగ్ధమయ్యాయి. వాటిని మళ్ళీ రచించగల బుద్ధి పాటవం లేదు. అవి నాశమైన దుఃఖం నన్ను బాధిస్తూంది. మీ రానాడు విన్నారు కదా? ప్రథమ శిష్యునకు పంచపాది ననుగ్రహించారని లోకమంతా చెప్పుకుంటూంది. కరుణా మయుడివై, నన్ను కృతిచేత కృతకృత్యుణ్ణి చెయ్యమని వేడుకుంటున్నాను." అని ప్రార్థించాడు.

ఆ యతి చంద్రుడు మందహాసం ఛిందిస్తూ ఆ మూడు నాటకాలనీ మొదటినుంచి చివరివరకూ ఏకరువు పెట్టాడు.

ఆశ్చర్యంతోనూ ఆనందంతోనూ ఆ రాజు వాటిని రాసుకుని - "మహాత్మా! నువ్వు అవతార శరీరుడివి. నీ ప్రభావాన్ని చెప్పడం మా బోంట్లకు శక్యంకాదు. నీకు నేను సేవకుడిని. పనులకు నియోగించు" అని ప్రార్థించాడు.

అప్పుడు శంకరుడు "రాజా! నువ్వు నాకు చెయ్యవలసిందేమీ లేదు. కాలటి అగ్రహారవాసులను బ్రాహ్మణులని ద్విజకర్మలకు తగరని శపించాను. నా శాపం మన్నించి నువ్వు కూడా వారికలా విధించు. పాపమతులను కనికరింపరాదు." అని ఆజ్ఞాపించాడు.

"అలాగే" అని ఆరాజు అతని పాదాలకి నమస్కరించి, అతని అనుజ్ఞ తీసుకుని తనవూరు వెళ్ళిపోయాడు.

# కాశీ మజిలీ కథలు

## 48. వ మజిలీ

### పరమోల్లాసము

శ్రీ శంకరయతి సార్వభౌముడు, పద్మపాద, హస్తామలక, సమిత్పాణి, చిద్విలాస, జ్ఞానకంద, విష్ణుగుప్త, శుద్ధకీర్తి, భానుమరీచి, కృష్ణదర్శన, బుద్ధివృద్ధి, విరించిపాద, శుద్ధాంతానంద గిరి, మొదలయిన ప్రముఖ శిష్యులు వేలమంది కీర్తించు చుండగా – సుధన్వుండనే రాజు చతురంగ బలాలతో తోడురాగా ఒక శుభముహూర్తంలో దిగ్విజయం చేయడానికి బయలుదేరి, ప్రమధులతో కూడిన ఈ శ్వరుడిలా ప్రకాశిస్తూ ఒకనాడు మధ్యార్జునం అనే శివక్షేత్రానికి వెళ్ళి అక్కడున్న ద్వైత మతస్థులందరినీ కర్కశమైన యుక్తులతో పరాజితులను గావించేడు. వారిలో ఒక వృద్ధుడు లేచి –

"స్వామీ! నీతో మేము వాదింప జాలము. నువ్వు సకల శాస్త్ర పారంగతుడివి. వాది పండితుడు కానంత మాత్రాన మతం గొప్పతనం తగ్గుతుందా? భేదం ప్రత్యక్షంగా కనపడుతూంటే అభేద వాదాన్నె వరంగీకరిస్తారు? దీని కేదైనా దైవనిదర్శనం చూబిస్తే నమ్ముతాం" అన్నాడు.

శంకరుడు వారందరినీ మధ్యార్జున స్వామి ఆలయానికి తీసుకువెళ్ళి స్వామి ఎదుట నిలబడి చేతులు జోడించి – "స్వామీ! ద్వైతాద్వైతమతముల తారతమ్యం వివరించడానికి నువ్వే సమర్థుడివి. నిజం తెలియ జేసి మా సందేహం పోగొట్టు" అన్నాడు. అప్పుడు ఆ లింగం పైనుంచి ఒకదివ్య పురుషుడు ఆవిర్భవించి – "సత్యం అద్వైతం" అని ముమ్మారుపలికి అంతర్ధానమయ్యాడు. ఆ వచనాలు విని ద్వైతులందరూ ఆశ్చర్యపోయి అద్వైతం సర్వోత్కృష్టమైనదని ఒప్పుకుని శంకరుని శిష్యులై అతని వెంట తిరగసాగారు.

———————— కాశీ మజిలీ కథలు – 5వ భాగం

అక్కడినుంచి ప్రయాణం చేసి ఆ యతిచంద్రుడు రామేశ్వరం వెళ్ళి సేతువులో స్నానంచేసి రామనాథుణ్ని అర్చించి తక్కిన తీర్థాలన్నిటినీ సేవించి అద్వైత మత విరోధులను నిరోధించడానికి రెండు మాసా లక్కడ నివసించాడు.

## శాక్త మత ఖండన

ఒకనాడు తులాభవానీ మందిరంలో నివసించే శాక్త మతస్తులు గుమిగూడి తమలో యిలా మాట్లాడుకోసాగారు.

*భవానీసేవకులు* : లక్ష్మీ భక్తులారా! మనవూరు శంకరుడనే సన్యాసి ఆర్భాటంతో రావడం మనమతాలని నిర్మూలించడానికట. విన్నారా?

*లక్ష్మీ సేవకులు* : విన్నాం. పొద్దుట అతని శిష్యుడొకడు వచ్చి – 'అద్వైత మతమొక్కటే ముక్తికి హేతువు. తక్కినవన్నీ వ్యర్థమే" అని బీరాలు పలికి పోయాడట.

*భవానీసేవకులు* : ఇప్పుడు మనమందరమూ కలసి అతనితో వాదించకపోతే శాక్తేయమతం అధోగతి పాలయి పోగలదు సుమండీ.

*లక్ష్మీ సేవకులు* : ఔను. అతను సామాన్యుడు కాడు. మనలో మనకి భేదాలుండొచ్చు. కాని కలసి శత్రువును పరాభవించడమే మేలు.

*భవానీసేవకులు* : వామాచారులు మాలోనివారే. సారస్వతులకే చెప్పాలి. వారూ మాటలోనే వస్తున్నారు. రండి. బాలయతి ఎవడో మనమతం ఖండించడానికి వచ్చాడట.

*సారస్వతులు* : చిరకాలంనుంచీ ప్రబలి ఉన్న మనమతాన్ని ఇతనా ఖండించేవాడు!

*భవానీసేవకులు* : అతను లోక సామాన్యుడు కాడు. మనమంతా కలసి వానితో వాదించాలి.

*సారస్వతులు* : అది మంచిదే.

భవానీసేవకులు : మన మేదేవతని ప్రధానంగా చేసుకుని వాదించాలో ముందు నిశ్చయించండి.

లక్ష్మీసేవకులు : లక్ష్మిని ప్రధానదేవతగా వాదిస్తే తప్పకుండా గెలుస్తాం.

భవానీసేవకులు : ఆదిశక్తి, పార్వతి కాని లక్ష్మికాదు. కనుక పార్వతికే జగత్కారణత్వం.

సారస్వతులు : మీకు వాదంలో గెలవాలని ఉంటే సరస్వతిని ముఖ్యదేవతగా చెప్పి వాదించండి.

లక్ష్మీసేవకులు : సరస్వతికి జగత్కారణత్వంలేదు.

సారస్వతులు : లక్ష్మికి మాత్రం ఉందా?

భవానీసేవకులు : లక్ష్మి సరస్వతు లిద్దరికీ ప్రధానత్వంలేదు. మీ దారిని మీరు పొండి. మా కర్మం మాది.

అంటూండగా శంకరులు వచ్చారు.

శంకరులు : మీరెవరు?

భవానీసేవకులు : శాక్తమతస్తులం.

శంకరులు : నాలుగుతెగలుగా నిలబడ్డారేం?

భవానీసేవకులు : మా మతం నాలుగు భేదాలుగా ఉందని

శంకరులు : మీ మత ప్రవృత్తి ఎలాటిది?

భవానీసేవకులు : ఆదిశక్తియే భవాని సర్వకార్యములకూ జనని, ఆ మాయా ప్రభావంలోనే జగత్తు జనించింది. ఆ ప్రభావం అగోచరం. మేము ఆమె పాదసేవకులమై ముక్తి పొందుతున్నాం. ఆ పాదచిహ్నాలను కంఠంలోనూ భుజాలయందు ధరిస్తాం. ఇదేమా మతం.

శంకరులు : మీ పక్కన - వారెవరు? వారి మత స్వభావమేమిటి?

లక్ష్మీసేవకులు : స్వామీ! మేము లక్ష్మీసేవకులం. మహాలక్ష్మి ఆదిప్రకృతి అని వేదాలలో ఉంది కదా. పద్మాక్షమాలచే అలంకరింపబడి,

కుంకుమ మొఖాన్నలుముకొనుచూ బాహువుల పద్మాంకాలు వెలిస్తే మహాలక్ష్మిని సేవించే భక్తులకు మోక్షం అరిచేతులో ఉంటుందని మా సిద్ధాంతం.

*శంకరులు* : తరువాత వారెవరు?

**సారస్వతులు** : అయ్యా! మేము సరస్వతీ సేవకులం. వేదం నిత్యమవడం వల్ల ఆ స్వరూపిణి అయిన శారద కూడా నిత్యమౌతుంది. సరస్వతియే పరాత్పరురాలు. ఆమె జగత్కర్త్రి శారదయే ప్రధానశక్తి. ఆమెనారాధిస్తూ ఆ చిహ్నాలు దాల్చి మేము ముక్తులం ఔతున్నాం.

*శంకరులు* : మీలోమీకిలా పరస్పర భేదాలున్నాయ్. లోకమంతా యిలాగే ఉంది. వినండి. తాల్వాది సంగమం వలన జనించిన వేదానికి నిత్యత్వమెలా సిద్ధిస్తుంది? వేదం పరమ పురుషుడి వ్యాసములని చెప్పబడింది. ఏదిపుడుతుందో అదిలయం ఔతుంది. అదీకాక వేదం సాంగంగా నశిస్తుందని రవి మహర్షులతో చెప్పినట్లు సూర్యసిద్ధాంతంలో ఉంది. చతుర్ముఖుడికే నాశనం కలుగుతూంటే అతని ముఖం నుంచి పుట్టిన శారద నిత్య ఎలా ఔతుంది? లక్ష్మి, భవాని, సరస్వతి కూడా ప్రధాన దేవతలు కారు. జ్ఞానులకు బ్రహ్మతో ఐక్యం చెప్పబడింది. బ్రాహ్మణుడే బ్రహ్మౌతాడు. కనుక మీరందరూ భేద బుద్ధిని విడిచి అద్వైతం అవలంబించండి. ముక్తులౌతారు.

అంటూ అద్వైత జ్ఞానమంతా ఉపదేశించాడు. వారిలో వామాచారులు తప్ప అందరూ పరమానందంతో వారి శిష్యులయ్యారు.

**వామాచారులు (నిలుచుని)** : సన్యాసీ! నువ్వు గొప్ప ప్రజ్ఞావంతుడివి. ఏదో నాలుగు మాయమంత్రాలు చెప్పి వీళ్ళందరినీ శిష్యులుగా చేసుకున్నావు. అద్వైతమంటూ మోసం చేశావు. ఏ శక్తిలేక పరమేశ్వరుడు గడ్డిపోచనయినా కదల్పలేడో ఆ ఆదిశక్తే స్వతంత్రురాలు. అలాటి శక్తి సేవకులమయిన మాకు ముక్తి కలగదని చెప్పడం నీ అజ్ఞానం.' శక్తిసేవా పరతంత్రుల కేదీ నిషిద్ధంలేదు. త్రిగుణాతీతమైన మార్గమందు సంచరించు వారికి విధినిషేధాలు లేవు" అని చెప్పే భృగుమహర్షుల ప్రవృత్తే మాకు

ప్రమాణం. మత్స్య, మాంస, మద్య, ముద్ర, మైధునం అనే మకార పంచకాన్ని మేము సేవించవచ్చు. నువ్వు కూడా మా ఆచారం స్వీకరించి సుఖించు' అన్నారు.

శంకరుడు : మూఢులారా! భృగువుమొదలైన మహర్షుల ప్రవృత్తే ప్రమాణమని చెప్పారు, వారికున్న చిత్త శుద్ధి మీకుందా? అగస్త్యుడు సముద్రాన్ని తాగేశాడు. భృగువు విష్ణుని మించాడు. అలాటి సామర్థ్యం లేకపోయినా విధినిషేధాలు లేవని చెబుతారా!

అనాత్మ కెప్పుడూ సత్యత్వం లేదు. అనిత్య ప్రకృతి యొక్క ఉపాసన సత్యమయిన ముక్తినెలా యివ్వగలదు? నైవేద్యనెపంతో మద్యమాంసాలు భుజించే మీకు బ్రాహ్మణ్యంలేదు. ముక్తి కలుగుతుందా? ప్రాయశ్చిత్తం చేస్తేకాని మీతో మాట్లడనేకూడదు.

అంటూ యుక్తిగా వారిని క్షణంలో ఓడించి శంకరుడు వారిని కూడా తన శిష్యులుగా చేసుకున్నాడు. అలాగ శాక్త మతఖండనంగా వించాక, తనశిష్యులు తీసుకు వచ్చిన ఆ ప్రాంతపు శైవమతస్థులతో వాదించాడు.

## పాషండ మత ఖండనం

శైవులు : వ్యక్తావ్యక్త స్వరూపుడైన రుద్రుని అర్చించిన వారికి మోక్షం కరతలామలకమని మునుపు శివుడు దుర్వాసుని కానతిచ్చాడు. ఆ శివుని సేవించే మేము శైవమతస్థులం. శివసేవాపరాయణులకు కర్మతో పనిలేదు. మహేశ్వరుడే మోక్షదాత. అతన్ని ఆరాధించడం ముక్తి కారణం. ఆ చిహ్నాం ధరించడం సాయుజ్యప్రదం. ఇదే మా మతసిద్ధాంతం.

శంకరుడు : శివుడు సర్వోత్కృష్టుడు, జగత్కారణము కావచ్చు. అతనిసేవ వలన ముక్తి రావచ్చు. కాని ముక్తి అంటే ఏమిటో మీకు తెలియడం లేదు. అదీకాక దేహమంతా శూలం మొదలయిన చిహ్నాలతో కాల్చుకుంటున్నారు. సర్వదేవమయమయిన బ్రాహ్మణ దేహాన్ని తపింపజేయడం పాపకారణం. వ్యాధి లేకుండా విప్రశరీరాన్ని కాల్చకూడదు.

బ్రాహ్మణ శరీరంమీద వాతలు చూస్తే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి కనక మీమతం శ్రుతి సమ్మతం కాదు.

శైవులు : అంటే శివుని పూజించమని చెప్పే గ్రంథాలన్నీ బూటకాలేనా?

శంకరుడు : మీకు ధర్మరహస్యాలు తెలియవు. కేవలం భక్తి శుద్ధకైవల్య మివ్వదు. భక్తి జ్ఞాన వైరాగ్యాలు బ్రాహ్మణుడు కలిగి ఉండాలి. అజ్ఞానం పోవడమేముక్తి. సగుణోపాసనతో అజ్ఞానం పోదు. తత్వజ్ఞానం లేక మోక్షం దొరకదు. లోకమంతా కర్మ బద్ధమై ఉంది. జ్ఞానం సిద్ధించే వరకూ కర్మని వదలకూడదు. గురువు కరుణతో అద్వైత బోధ కలిగి ముక్తుడౌతాడు. అద్వైత జ్ఞానమే పునరావృత్తిరహితమైన ముక్తినిస్తుంది. చిహ్నధారణ మానండి.

అంటూ తత్వం ఉపదేశించి వారిని తనమతంవేపు ఆకర్షించుకున్నాడు. కాని....వారిలో లింగధారులు ఈర్ష్యతో వారిని నిందిస్తూ శంకరుడి కెదురుగా నిలబడి వాదించసాగారు.

లింగధారులు : బ్రాహ్మణ్యంకంటె వైష్ణవమతము, దానికంటె శైవమతమూ గొప్పవని నారదుడితో బ్రహ్మ చెప్పాడు. శివుడు సర్వాధి కుడనడాని కనేక నిదర్శనాలున్నాయి. ఈ శ్రుతి విను (చదివి) దీనివలన శరీరతాపం చెందితే కాని మోక్షం చెందనేరదని స్థిరపడుతూంది. అందుకే త్రిశూలాది చిహ్నలచే అంకితమైనవారికి ముక్తి కలగుతుందని మా మతం.

శంకరుడు : మీకు విద్యా గంధం లేక జ్ఞాన సూక్ష్మం తెలియడం లేదు. శివు దుత్తముడనీ, విష్ణువతని దాసుడనీ నిందిస్తూంటారు. అదే మూఢత. శివవిష్ణు శబ్దాలు పరమాత్మయొక్క సగుణరూపవాచకాలు. పశువుల్లా కాల్చుకుంటే మోక్షం సిద్ధిస్తుందా? - (అంటూ శ్లోకాలు చదివి) ఈ ప్రమాణాల వల్ల చిహ్నధారణం నింద్యమని బృహన్నారదీయంలో చెప్పబడింది.

ఈశ్వరారాధనము వద్దనడంలేదు. విభూతి, రుద్రాక్షలూ ధరించవలసిందే.

లింగధారులు : త్రిపురాసుర సంహార కాలంలో రుద్రుడు శూలం మొదలైన ఆయుధాలు ధరించినట్లు పురాణాలలో ఉందికదా! మేము సేవకులం కనక ఆ ఆయుధాలను చిహ్నాలుగా ధరిస్తే తప్పేమిటి?

శంకరుడు : రాజు ఛత్రచామరాలు ధరించాడని సేవకులు కూడా ధరిస్తే ఎలా ఉంటుంది? ప్రయోజనం ఉండదు సరికదా పాదిత్యం కూడా రాగలదు. పామర బుద్ధి వదలి, ముక్తి జ్ఞానం కంటె వేరొక సాధనం లేదని నమ్మి అద్వైత జ్ఞాన మార్గం అవలంబించండి.

అంటూ ఆ విధమంతా ఉపదేశించి వారిని తన శిష్యులుగా చేసుకున్నాడు. శంకరుడు అలా రెండు నెలలు రామేశ్వరంలో ఉండి అక్కడినుంచి అనంతశయనం వెళ్ళాడు.

## వైష్ణవ మత ఖండనం

శంకరుడు అనంతశయనంలో అనంత పద్మనాభ స్వామిని ఆరాధించి నెలరోజులు ఉన్నాడు. అక్కడి వైష్ణవులు ఒకనాడు అతనితో వాదించడానికి వచ్చారు.

విష్ణుశర్మ : భక్తులు, భాగవతులు, వైష్ణవులు, పాంచరాత్రులు, వైఖానసులు, కర్మహీనులు - అని వైష్ణవులారు విధాలు. మేము - భక్తులం. అనంత పదకమలధ్యానమే మాకు రక్షకము. ధ్యానించుటయే జ్ఞానం. అతని ఉపాసనే క్రియ. ఇదే మా మతం.

శంకరుడు : క్రియ అంటే ఉపాసన అని చెప్పడం మూర్ఖత్వం. బ్రాహ్మణుడు - జన్మచే శూద్రుడై కర్మచేత ద్విజుడవుతున్నాడు. విప్రుడు నిత్యమూ సంధ్య నుపాసించాలి. విష్ణుసేవ బ్రాహ్మణకర్మ అని చెప్పడం అపాండిత్యం. వేదవిహితమైనదే కర్మ. యతులకు సైతం దేవతార్చన మొదలైన కర్మలు విధించబడి ఉన్నాయి. మీరు కర్మ భ్రష్టులయ్యారు కనక ప్రాయశ్చిత్తం చేసుకుంటే కాని మీతో సంభాషించరాదు.

అని బోదించి క్షణంలో వారిని నిరుత్తరులని చేశాడు. తరవాత భాగవతులు ముందుకొచ్చారు.

*భాగవతులు* : సర్వవేదాలందూ, సర్వతీర్థాలందూ ఏ పుణ్యం ఉందో విష్ణువుని స్తుతించడం వలన ఆ పుణ్యం రాగలదు - అను వచనాన్ని అనుసరించి రాత్రింపవళ్ళు హరికీర్తన చేస్తూ శంఖచక్రాది చిహ్నాలు, తులసిమాలలు, ఊర్ధ్వ పుండ్రాలు ధరిస్తూ నివసిస్తాం. ముక్తి - మా హస్తమందుంది. దీనిలో ఏం లోపాలెంచుతావు?

*శంకరుడు* : చక్రాది చిహ్నాలు శాస్త్ర దూష్యా లవడంవల్ల మీ మతం దూషణీయం. అవాంగ్మానస గోచరుడైన భగవంతుని మీరెలా స్తుతించగలరు? ఈ చిహ్నాలు దాల్చడం కంటె లోహచక్రాదులు ధరిస్తే విష్ణువులా ఉంటారు. విష్ణు శిలతో వొళ్ళంతా కాల్పించుకొండి. మీరు విష్ణుభక్తులు కారు. పాషండులు. ఫలా స్నీశ్వరుడి కర్పిస్తూ విహితకర్మ చేయండి, శుద్ధులౌతారు. తరవాత అద్వైత గురువు నాశ్రయించండి. అతని ఉపదేశం వలన ముక్తులౌతారు. మోక్షంకంటె మరోదారిలేదు.

అంటూ వారందరినీ అద్వైత జ్ఞానబోధతో శంకరుడు తన శిష్యులని చేసుకున్నాడు. అప్పుడు శారంగపాణి అనే వైష్ణవుడు లేచి - "స్వామీ! మేము ఎల్లప్పుడూ నమో నారాయణాయ అనే మంత్రం జపిస్తాం. శంఖచక్రాల వలన రక్షించబడి సంసారం వదలి వైకుంఠపదం పొందుతాం. చక్రాంకితాలకు శాస్త్రదృష్టాంతాలు లేవన్నారు. కాని... (అనిశ్లోకం చదివి) ఈ శ్లోకం ప్రమాణం కాదా? ఇలాటి వైష్ణవులు లోకాన్ని పవిత్రం చేస్తారని చెప్పబడలేదా?

శంకరుడు నవ్వుతూ - "ఓహో! వైష్ణవోత్తమా! నువ్వు చదివిన శ్లోకం శ్రుతి సమ్మతమైనది కాదు. శ్రుతి వ్యతిరేకమైన దానిని మేమంగీకరించం. బ్రాహ్మణుడే మోక్షాన్ని పొందుతున్నాడు. మోక్షానికి బోధయేకారణం అని శ్రుతులు బోధిస్తున్నాయి. పరమాత్మకి నామరూపాలు లేవంటూంటే శంఖచక్రాది ధారణ విరుద్ధం కాదా? మందబుద్ధుల కోసమే భగవంతుడికి నామరూప అలంకారాలు కల్పించ బడ్డాయి. బ్రహ్మోహం

బ్రహ్మమస్మి అని ఎప్పుడూ ధ్యానించండి. భేదబుద్ధి వదిలితే జీవుడే ఈశ్వరుడని తోస్తుంది. దానితో సంసారం నశిస్తుంది. చిహ్నాధారణం నిషేధమని బృహన్నారదీయం మొదలైన మహాగ్రంధాలలో వ్రాయబడి ఉంది. అవి ధరించి హరితో సమానులం అనుకోడం మనోరాజ్యం వంటిదే – అంటూ ఎన్నో దృష్టాంతాలు చూబించి, ఆత్మబోధ చేసి శంకరుడు అతన్ని శిష్యుడిగా చేసుకున్నాడు.

తరవాత మాధవుడనే వైష్ణవుడు స్వమతస్థులచే శంకరుని ముందుకుతోయబడి – వణుకుతూ – "మేము పాంచరాత్రులము. భగవత్ప్రతిష్టకు మా ఆగమమే మూలమైనది. కావున మా ఆచారం బ్రాహ్మణులు స్వీకరిస్తే చక్కగా ఉంటుందని మా మతం.

శంకరుడు : వేద విరుద్ధం కాకపోతే మీ ఆగమం మంచిదే. గాయత్రి వలన కాని బ్రాహ్మణ్యం సిద్ధింపదు. గాయత్రీ శూన్యులవడం చేత మీరు బ్రాహ్మణులు కారు. బ్రాహ్మణ్యహీనమైన వైష్ణవత్వం పతనంగా చెప్పబడింది. పతితుడివైన నీతో మాలాటి వారు మాట్లాడకూడదు. నువ్వు జీవన్మృతుడి వయ్యావు.

మాదవుడు : స్వామీ! చిహ్నాధారణంవల్ల వైకుంఠం వచ్చునని మా పాంచరాత్ర ఆగమంలో ఉంది. మా ఆగమమే మాకు ప్రమాణం.

శంకరుడు : వేద విరుద్ధం కానిచో ఆగమాలలో చెప్పబడిన ఆచారం గ్రహించదగినదే. పాంచరాత్రాగమము వేదవిర్ధుమైనది. అతీంద్రియార్ధాలను తెలియ జెయ్యడానికి శ్రుతియే సమర్ధమైనది. బ్రాహ్మణ్యసిద్ధి కోసం వేద విహితాచారాలను స్వీకరించి పవిత్రుడివి అవు.

సర్వభూతాలలోనూ తననీ, తనలో సర్వభూతాలనీ ఎవడు చూస్తాడో వాడే ముక్తుడు. పాషండధర్మాలు వదలి అద్వైత జ్ఞానం సంపాదించుకో, ముక్తుడి వౌతావు.

అని ఉపదేశించడంతో మాధవాచార్యులు సంతోషించి స్వకుల గ్రామ దేశస్తులతో సహా శంకరుని పాదాలమీదపడి అతని అనుగ్రహానికి పాత్రుడయ్యాడు.

తరవాత వైఖానస మతాచారుడైన వ్యాసదాసు డనే వైష్ణవుడు శంకరుడిముందుకొచ్చి – "యతీంద్రా! బ్రహ్మదేవుడేనా మామతం నిరాకరించలేడు. వేదసమ్మతం అని పలుమార్లంటున్నావు కదా. (శ్లోకంచదివి) నారాయణుని వల్ల బ్రహ్మ, రుద్రుడు జన్మించారని యీ శ్రుతుల వల్ల తేలింది కదా. కనక అత నందరికంటే అధికుడు. మే మతని సేవకులం కనక మా వైఖానసమతం శృతి సమ్మతమైనదని తెలిసింది. శంఖచక్ర పవిత్రాంగుడు, ఊర్ధ్వపుండ్ర విరాజమానుడు పూజ్యుడని మామత సిద్ధాంతం. (అంటూంటే)

*శంకరుడు* : వ్యాసదాసా! మీకు పాలకు డెవరనే దానిమీద వివాదం లేదు. నువ్వు విష్ణుభక్తుడివైతే అతని ప్రీతికోసం కర్మలు చెయ్యి. కాని తప్త చక్రాదులు ధరింపకు. అదే వేదవిరుద్ధం.

*వ్యాసదాసు* : దీనికి ప్రమాణం లేకపోలేదు పూర్వం దత్తాత్రేయ మహర్షి పంచముద్రలు దాల్చి ఉన్నట్లు పురాణాలలో చెప్పబడింది. మోక్ష కాములయిన మేము ఆ మార్గమే అనుసరిస్తున్నాం. చక్రధారణం చేసుకోకపోతే వైష్ణవత్వానికే హానివస్తుంది.

*శంకరుడు* : చాలు చాలు. నీ వివేకా న్నేమనాలి? ముద్రలవలన ప్రయోజనం లేదని పిల్లవాళ్ళకి కూడా తెలుసు. దత్తాత్రేయ మహాయోగి ముద్రలు దాల్చిన ట్లే పురాణంలోనూ చూడలేదు ప్రహ్లాద నారదాది భక్తులకు చక్రాంకన మెవరు చేశారు? మూఢబుద్ధిని వదిలి పాషండ ధర్మాలు మాని – "బ్రహ్మోస్మి" అని ధ్యానించుకుని మోక్షం పొందు.

అంటూ అతన్ని అద్వైత మతం అవలంబించే వాడిగా చేశాడు.

అప్పుడు వామతీర్థుడనే వైష్ణవుడు వచ్చి – "యతిశేఖరా! నీ చాతుర్యం కొనియాడతగినదే. క్షణంలో వీళ్ళందరినీ విధేయులని చేసుకున్నావు. మా మతాన్ని శేషుడేనా కదల్చలేడు.

"సర్వం విష్ణుమయం జగత్" అనే వాక్యం మా గురువు శిష్యుడికి బోధిస్తూ – "స్వామీ నా శిష్యుడు నీ పాదారవిందాలను నమ్మి ఉన్నాడు. ఏ కర్మనీ ఎరగడు. వానికి నీ సాయుజ్యం ఇవ్వు." అని

కోరుతూంటాడు. భగవంతుడు అలా ప్రార్ధించబడి మా మతస్తులని ముక్తులని చేస్తాడు. మాకు కర్మేలేదు కనక పునర్జన్మ కలగదు. సన్యాసివైన నువ్వుకూడా మా మతం అంగీకరించాలి" అన్నాడు.

అందుకు శంకరుడు, "బాలకా! నువ్వు సత్యం పలికావు. కర్మ భ్రష్టుడివైన నువ్వు నిస్సందేహంగా జీవన్ముక్తుడివే. నింద్యానింద్య విహీనుడివై పిశాచంలా వర్తిస్తున్నావు. వేదోక్త కర్మలను చేస్తూ ఆఫలం యీశ్వరార్పణ చేయడం జ్ఞానుల మార్గం. ఫలం కోరి కర్మ చేయడం కర్మమార్గం. రెండూ వదలిన నువ్వు రాజు దండనకు పాత్రుడివి.

తన వర్ణ ధర్మాలను వదలక శత్రుమిత్ర పక్షాలను సమంగా చూస్తూ దేనిపలమూ కోరక నిర్మలమైన బుద్ధి కలవాడు వైష్ణవోత్తముడని చెప్పబడుతున్నాడు. శృతి స్మృతులు భగవంతుని ఆజ్ఞలు. వాటికి ద్రోహం చేసినవాడు తన భక్తుడైనా నరకంలో పడతాడని విష్ణువే చెప్పి ఉన్నాడు. కనుక వేదోక్త కర్మ విడవకూడదు. బ్రాహ్మణులకు అగ్నియే దేముడు. బ్రహ్మచారులకు సైతం అగ్నిసేవ విధి ఐ ఉంది. అలాటి కర్మను విడచిన మీరు పతితు లయ్యారు."

అని పలకడంతోనే వామతీర్థుడు రక్షించమంటూ ఆ యతి పాదాలమీదపడి వేడుకున్నాడు. అలాగ వైష్ణవులందరినీ శిష్యులని చేసుకుని శంకరాచార్యు లక్కడి నుంచి బయలుదేరి సుబ్రహ్మణ్యం అనే క్షేత్రానికి వెళ్ళారు.

అక్కడ కుమార ధార అనే నదిలో స్నానం చేస్తూ శేషస్వరూపుడైన షణ్ముఖుడ్ని ఆరాధిస్తూ ఐదురోజులు నివసించారు. ఒకనా డతను ఆలయంలో కూర్చొని ఉండగా ఆ ప్రాంతంలోని బ్రాహ్మణులు కొందరువచ్చి అతనితేజస్సుకి ఆశ్చర్యపోతూ, నమస్కరించి – "స్వామీ! మీరు సర్వమతాలనీ ఖండిస్తూ అద్వైతమొక్కటే శ్రేష్ఠమని చెబుతున్నారు. మీతో వాదించి మా మత ప్రాబల్యం నిలపడానికి వచ్చాం. మేము చతుర్ముఖ మతస్థులం. ( అని శ్లోకం చదివి) బ్రహ్మ – లోకాలను సృష్టించి అందు ఆత్మస్వరూపంలో ప్రవేశించి, శ్రుతులచే కొనియాడబడుతూ

శివవిష్ణువులను భుజములుగా చేసుకుని ప్రకాశిస్తూంటాడు. మేం మా మహాత్ముని భక్తులం, జ్ఞాననిష్ఠులం, కృతార్థులమై ముక్తిని పొందుతాం" అన్నాడు.

అందుకు శంకరుడు "బ్రహ్మాది దేవతలను జనింపజేసిన ఆ పరమాత్మ ఒక్కడే నిత్యుడు. అతనిని తెలుసుకోవాలి. అందుకు అద్వైత బోధయే మార్గం. వేదాంతవాక్యాలు సతతము వింటూండాలి. చతుర్ముఖ చిహ్నధారణం నింద్యం. దానివలన ముక్తి లభింపదు." అనియుక్తిగా పలికి వారిని శిష్యులుగా చేసుకున్నాడు.

తరవాత వహ్నిమతస్థులు కొందరు వచ్చారు. "స్వామీ! మేము వహ్ని సేవకులం. (శ్రుతులు చదివి) బ్రాహ్మణులకీ, దేవతలకీ కూడా అగ్నియే ముఖ్యమనడాని కిదే ప్రమాణం. (మరో శ్రుతి ఉదహరించి) దీనిద్వారా విప్రులందరూ అగ్నినారాధించాలని విధింపబడుతోంది. అగ్నియే సర్వోత్తముడు దీని నెలా కాదంటారు?"

అందుకు శంకరులు – "అగ్ని దేవతలకు సమానుడని చెప్పబడుతోంది. అంతేకాక అగ్ని – పరిచారకుడై, దేవతలకు హవిర్భాగాన్ని తీసుకు పోయి యిస్తూంటాడు. మీరు అగ్నిపరంగా కర్మలను చేయండి. శ్రద్ధ మాత్రం అద్వైత జ్ఞానమం దుంచాలి. లేకపోతే మోక్షంలేదు." అని వారిని శిష్యులుగా చేసుకున్నాడు.

తరవాత సూర్యోపాసకులు అతని ఎదటకు వచ్చి నమస్కరించి – "యతీంద్రా! మేము సౌర మతస్థులం. సూర్యుడు త్రిమూర్తి స్వరూపమని వేదాలు చెప్పాయి. సృష్టి స్థితి లయాలకు అతనే కారకుడు. అతనే ప్రత్యక్ష దైవం. "ఘృణి స్సూర్య ఆదిత్యః" అనే మంత్రం ఎప్పుడూ జపిస్తూంటాం. మా మతం ఆరు విధాలు. కొందరు బ్రహ్మ స్వరూపుడగు ఉదయ భాస్కరుణ్ణీ, కొందరు శివ స్వరూపుడగు ఆకాశ మధ్య భాస్కరుణ్ణీ, మరికొందరు విష్ణు స్వరూపుడగు అస్తమయ భాస్కరుణ్ణీ కొలుస్తారు. కొందరు మూడు కాలాలందూ రవి బింబాన్ని సేవిస్తూంటారు. కొందరు మండలేక్షణ వ్రతధారులై తన్మండల మధ్యస్థితి చూస్తూ భజిస్తారు. వారు

రవి బింబాన్ని చూసి తప్ప భుజింపరు. కొందరు లోహంతో భుజ వక్షస్థలాలమీద సూర్యమండల చిహ్నాలు వేయించుకుని ఉపాసిస్తారు. ఆరుగురు మతస్తులూ మూల మంత్రాన్నే జపిస్తూంటారు. ఆ మండల మధ్యవర్తి అయిన పురుషుడు పరమాత్మ అని శ్రుతులు ఘోషిస్తున్నాయి. పురుష సూక్తంలో భానుడే ప్రధానుడని నిరూపించబడి ఉంది. బ్రహ్మాది దేవతలు సూర్యుడి వలన కలుగుతున్నారు. కనక మోక్షం కోరేవారు సూర్యుడి నారాధించాలి. ఇదే మా మతం" అన్నారు.

"భాస్కర భక్తులారా. మీరు చెప్పిన ప్రమాణాలే మీమతాన్ని పూర్వపక్షం చేస్తున్నాయి. చంద్రమా మనసో జాతః చక్షు స్సూర్యో అజాయత - అని పురుష సూక్తం. పరమ పురుషుని చక్షుస్సు వలన సూర్యుడు జనించాడు. ఏది పుడుతుందో, అది తప్పకుండా లయ మౌతుందని తర్కశాస్త్రం. అందుచేత అనిత్య వస్తువులకు బ్రహ్మత్వం ఎలా చెబుతారు?" అంటూ - "జ్యోతిశ్శాస్త్రంలో కూడా రవికి అనిత్యతే చెప్పబడింది కనక - యిలాటి రవికి జగత్కారణత్వం చెప్పే మీ విద్యామహిమ సందేహించ దగినది. మూఢ బుద్ధి నుంచి విముక్తులవండి" అంటూ వాళ్ళని శిష్యులుగా చేసుకున్నాడు.

ఆ విధంగా జగద్గురువు చతుర్ముఖ వహ్ని సౌరమతస్థులను మూడువేలమందిని అద్వైత మతావలంబకులుగా చేసి, వారిలో కొందరు శంఖాలూదుతూ, కొందరు గంట వాయిస్తూ, కొందరు తాళాలు మోగిస్తూ, కొందరు వింజామరలు వీచుతూ, కొందరు ఛత్రం పట్టి సేవిస్తూంటే అక్కడినుంచి వాయువ్యదిశగా వెళ్ళి అక్కడ తిరుగుతూ గణపతి ఆశ్రమమైన గణపరం అనే వూరు చేరాడు. కౌముదీ నదిలో స్నానం చేసి, గణపతి నారాధిస్తూ శిష్యులతో అక్కడొక నెల నివసించాడు. శిష్యులంతా కలసి గురువును పీఠంమీద కూర్చోబెట్టి పలువిధాలుగా అతన్ని భజనచేశారు.

# గాణపత్య మతం

ఆ సమయంలో పట్టణ వాసులయిన బ్రాహ్మణులా వింత చూసి ఆక్షేపిస్తూ - "అయ్యా! ఇంతవరకూ మీ స్తుతి వాక్యాలు విన్నాం. అవాంగ్మానస గోచరమైన, అద్వితీయమైన బ్రహ్మాన్ని అజ్ఞాని ఎలా తెలుసుకోగలడు? మీ మతం మేలైనది కాదు. శుభాలు కావాలంటే మా మతంలో చేరండి. మాది గాణపత్యమతం. ఇది ఆరు విధాలు. దేవతలందరూ దీనినే పొగుడుతారు. గణపతియే జగత్కారణుడు. ఆయన మాయ చేతనే బ్రహ్మాదులు సృష్టించబడ్డారు. అందుకే అతనికి ప్రారంభ పూజ్యత కలిగింది" అని ఉపన్యసించేసరికి, శంకరాచార్యులు -

"మూర్ఖులారా! వినండి. గణపతి రుద్రసుతుడు. మీ మాటలంగీకరించబడవు" అన్నాడు. "స్వామీ! చిహ్నం లేనివాడు గణపతి సన్నిధికి పోవుటకు యోగ్యుడు కాడు. మీ కలాటి చిహ్నామేమీలేదు. కనుక దేవసన్నిధిలో ఉండకూడదు" అన్నారు.

"పాషండులారా! బ్రాహ్మణకులంలో పుట్టినవాడు శిఖ, యజ్ఞోపవీతం దాల్చి వేదోక్తాలయిన కర్మలు చేస్తూండాలి. వేద పురాణాలలో నిందించబడిన చిహ్నాలు దాల్చిన మీరెలా బ్రాహ్మణు లౌతారు? చిహ్నం ధరించడంవల్ల ఏమీ ప్రయోజనం లేదు. వేదోక్తమైన పరమాత్మని తెలుసుకోండి. ముక్తులౌతారు. పంచపూజా పరాయణులైతే మీ అభీష్టం తీరగలదు. దానిలో గణపతి ఉన్నాడు" అంటూ వాళ్ళని శిష్యులుగా చేసుకున్నాడు.

హరిద్రా గణపతి మతవాది వచ్చి "హరిద్రాగణపతియే జగత్కారకుడు. బ్రహ్మాదులాయన అంశలోనే జన్మించారు. మీరు ఆ మహాత్ముని సేవిస్తే కృతార్థులౌతారు. తుండపుగుర్తులను లోహంతో భుజాలమీద వేయించుకుంటే ముక్తి రాకుండా ఉంటుందా?" అన్నాడు.

"తుండాకారమైన లోహంతో కాల్చుకుంటే నీకు తప్పకుండా మోక్షమొస్తుంది. అందరూ గణపతిని ఉపాసించవలసిందే. అందుకేమీ

ఆక్షేపణ లేదు. కాని చిహ్నాధారణ కడు దూష్యం. అందువల్ల బ్రాహ్మణ్యహాని ఔతుంది" అని నచ్చ జెప్పి వారిని స్వమత ప్రవర్తకులని చేశాడు.

అప్పుడు ఉచ్ఛిష్ట గణపతి ఉపాసకుడు జగద్గురుని కెదురుగా వచ్చి – "మా మతానికి మహాగణపతి, హరిద్రాగణపతి, ఉచ్ఛిష్టగణపతి, నవనీత గణపతి, సువర్ణగణపతి, సంతాన గణపతి అని ఆరు విధాలయిన అధిదేవతలు ప్రఖ్యాతులై ఉన్నారు. మొదటి యిరువురినీ మాయతో మీరు శిష్యులని చేసుకున్నారు. నేను ఉచ్ఛిష్ట గణపతి ఉపాసకుణ్ని. నామతం నిరాకరించడం నీకే కాదు, నిన్ను సృష్టించిన బ్రహ్మకైనా తరం కాదు విను –

చతుర్భుజాలు, త్రినయనాలు, పాశం, అంకుశం, గద, తుండం మొదలైన వాటితో ఉండే గణపతిని మేము ఆరాధిస్తాం. ఫాలభాగంలో కుంకుమ దాల్చడం మామతాచారం. ఇష్టమొచ్చిన కర్మలు చేసినా మాకు దోషం లేదు. మా మతంలో స్త్రీ పురుష జాతులు రెండే తప్ప ఇతర జాతి భేదములు లేవు. స్త్రీ పురుష సంయోగం వలన దోషం రాదు. ప్రతివనితా యిష్టమైన వాడితో భోగించవచ్చు. దీనికి వీడేపతి అని దేవుడు నిర్ణయించాడా? స్త్రీ పురుష సంయోగం వలన కలిగే ఆనందమే ముక్తి అని మా మతసిద్ధాంతం. ఆ ఆనంద స్వరూపుడే గణపతి. బ్రహ్మాదులు అలా పుట్టిన వారే. పాపం, పుణ్యం ఒకటే. ఇంత సుఖమైన మతం మరొకటి లేదు. సుఖపడాలంటే మా మతం తీసుకోవాలి. ఇదే ముక్తిప్రదం" అన్నాడు.

"మూర్ఖా! నీ మతం ముక్తి ప్రదమని నువ్వే చెప్పుకోవాలి. కల్లుతాగకూడదు, పరదారల కూడ కూడదు అని శ్రుతులు చెబుతూంటే వీటివల్ల ముక్తి కలుగుతుందని చెబుతున్నావు! ఏమి నీ పాండిత్యం! అకర్మణా అనుశ్రుతిని తత్వవేది అయిన యతికి చెప్పబడింది కాని నీ బోటులకు కాదు. పాపాత్ములు, నరకార్హులు. నువ్వు పతితుడివి. నీకు ప్రాయశ్చిత్తం చేస్తాం. పంచపూజా పరాయణుడివి అవు. ఆ జపాది మంత్రాలు జపించు. ముక్తిడివౌతావు." అని అతనికి తత్వోపదేశం చేసి

వారి మతస్తులందరినీ శిష్యులు చేసుకున్నాడు. అలాగే తక్కినమూడు మతాల వారూ కూడా ఆచార్యుడితో ఎక్కువగా వాదించినా వారి యుక్తి ప్రహరణాలచే కొట్టబడి శిష్యులై సేవించారు. శంకరాచార్యులు క్రమంగా శాక్తశైవ, వైష్ణవ, సౌర, గాణపత్యమతాలను ఖండించి వారందరూ శిష్యులై సేవిస్తూ తోడురాగా కాంచీపురానికి చేరుకున్నారు.

అక్కడ ఒక మాసం నివసించి శంకర ప్రతిష్టా పూర్వంగా శివకాంచి అను పట్నం కట్టించి అసేవకు బ్రాహ్మణులను రప్పించి శుద్ధ అద్వైత బోధ చేసి అక్కడ ఉంచాడు.

ఒకనాడు తామ్రపర్ణీ తీరంనుంచి కొందరు బ్రాహ్మణులరుదెంచి గురువరుని పాదాలకు నమస్కరించి – "స్వామీ! ఈ లోకంలో దేహాదులకు భేదం ప్రత్యక్షంగా కనపడుతూంది. ఆయా దేవతలను ఉపాసించడం వల్ల పరలోకంలో సైతం ఆ భేదమే నిజమైనట్లు తోస్తూంది. అభేదవాదనకు నిదర్శనమేమిటని అడిగారు. అందుకు శంకరులు – "పరమార్ధ తత్వం తెలియక పోవడంతో మీరలా భావించారు. వినండి (అని శ్లోకం చదిది) అను ప్రమాణం వలన జగత్కర్త అయిన పరమాత్మే జీవరూపంలో ప్రపంచంలో ప్రవేశించాడని తెలుస్తూంది కదా. దేవతలెందరు? ముగ్గురా? మూడువేలా? అని అనేకత్వం భావించి అంతర్భాగక్రమంలో ఒక్కడే దేవుడని నిశ్చయించబడింది. మొదట బ్రహ్మకే అనేకత్వం చూపబడింది. మీరు కూడా జీవాత్మ పరమాత్మ భేదాన్నీ, దేవతాభేదాన్నీ వదలి, శుద్ధా ద్వైత బ్రహ్మోపాసన చేయండి. ముక్తులవుతారు" –అని యుక్తి యుక్తంగా ఉపదేశించగా వారందరూ అద్వైత జ్ఞానం పొందారు.

ఆ విధంగా శంకరులు నానా దేశాల నుండీ వచ్చిన బ్రాహ్మణులకు అద్వైత జ్ఞానబోధ చేసి కృతార్థులను గావించి అక్కడనుంచి వేంకటాచలానికి వెళ్ళి వేంకటేశ్వరుని ఆరాధించి తరవాత విదర్భ రాజధానికి వెళ్ళి ఆ పట్నంలో కొన్నాళ్ళు ఉన్నారు.

# కాశీ మజిలీ కథలు

## 49. వ మజిలీ

### క్రకచుడి కథ

**ఒ**క చేతిలో మానవకపాలం. ఇంకో చేత్తో పెద్ద త్రిశూలం పట్టుకుని చితాభస్మం వొళ్ళంతా పూసుకుని పెద్ద జడతో ఉంటాడు కాపాలిక ప్రభువైన క్రకచుడు.

కర్ణాటక దేశంలో – సభలో ... తన ఆప్తులైన కాపాలికులతో ఇలా సంభాషించ సాగాడు.

**క్రకచుడు** : మిత్రమా! విద్యుజ్జిహ్వా! శంకరుడనే దాంబిక సన్యాసి కొత్తమతం ఒకటి కల్పించి అన్నిమతాలను పరిహసిస్తూ శిష్యజంఝూటంతో రామేశ్వరం మొదలైన క్షేత్రాలు తిరుగుతున్నాడని విన్నాం కదా.

**విద్యుజ్జిహ్వుడు** : వింటమే కాదు. వానిమీద దండెత్తడానికి మనమిత్రులయిన క్షపణ జైన బౌద్ధ ఆది మతస్తులకు వార్త పంపి వాళ్ళందరినీ రప్పించాం కూడా. వాళ్ళంతా అతనితో ఎప్పుడెప్పుడు యుద్ధమా అని ఉగ్రూతలూగుతున్నారు.

**క్రకచుడు** : ఆ మాయావి వృత్తాంతం తెలుసుకు రమ్మని పంపామే, కౌక్షేయకుడు తిరిగొచ్చాడా?

**కౌక్షేయకుడు** : వచ్చాను స్వామీ! దేవరకాక ఆ సన్యాసిని పరాభవించగలవాడు యీ భూమ్మీద మరొకడు లేడు. వాడి ప్రభుత్వం నిరాటంకంగా సాగుతూంది. నేను వాడ్డిని కాంచీపురంలో కలుసుకున్నాను. ఆ సన్యాసి బ్రాహ్మణ సభలో ఉపన్యసిస్తుంటే అతని తేజస్సు

దుర్నిరీక్ష్యమై ఉంది. అతనక్కడ హరిహరులకి అద్భుతమైన ఆలయ ప్రాకార మంటపాలు కట్టించి ఎందరో బ్రాహ్మణులను అక్కడ ఉంచాడు. తరువాత వేంకటాచలానికి వచ్చి మూడు రోజులుండి తరవాత విదర్భరాజధాని చేరారు.

**క్రకచుడు** · మేకపిల్ల పులి ఉన్న పొద దగ్గరకే వస్తూందన్న మాట. తరవాత?

**కౌక్షేయుడు** : ఆ యతి శేఖరుడు సపరివారంగా రాజుచేత అర్చితుడై ఆ దేశ ప్రజలకు సంతోషం కలగజేస్తూ అక్కడ పదిరోజులున్నాడు. అప్పుడు దేవర గొప్పతనం శంకరుడి చెవినపడి మనదేశానికి రావాలని ప్రయాణమౌతూంటే - అతన్ని వలదంటూ విదర్భరాజు - 'భైరవ తంత్ర వాదులు - పాపాత్ములు, క్రూరులు, దుర్మార్గాలు చేసేవారు భయంకర ఆకారులు, వేదాలని దూషించేవారు. వారు యితరుల కీర్తిని సహించలేరు మీరక్కడికి వెళ్ళకండి' అన్నాడు.

**క్రకచుడు** : ఏమీ! విదర్భరాజు మనలని క్రూరులు గానూ తేజోరహితులుగానూ వర్ణించి వాడిని ఉత్తముడిగా పొగిడాడా? సరే, భైరవతంత్ర ప్రభావం తెలిశాక అలా అనడులే. తరవాత?

**కౌక్షేయకుడు** : శంకరసన్యాసి ఆ మాటలు విని - అక్కడున్న సుధన్వుడనే రాజు మొహం చూశాడు. అతను వారి సహాయకుడు కాబోలు. అప్పుడు సుధన్వుడు - భయమెందుకు? నేను నీ భక్తుణ్ణీ, సేవకుణ్ణీ. వాళ్ళ శవాలు గెద్దలకు ఆహారమయ్యేలా నేనా కాపాలికుల గుంపులను చంపేస్తాను - అన్నాడు.

**క్రకచుడు** : ఎంతకండ కావరం! కానియ్. వాడి రక్తంరుచి భైరవుడు చూస్తాళ్ళే. తరువాత.

**కౌక్షేయకుడు** : ఆ రాజు మాటకి యతీంద్రుడు మందహాసం చేస్తూ - కాపాలికులని జయించడానికి కర్ణాటక దేశానికి ప్రయాణం కట్టండని శిష్యులకు చెప్పాడు. వారు చాలాదూరం వచ్చే వరకూ నేను

ఉన్నాను. పదివేలమంది బ్రాహ్మణులతోనూ చతురంగబల సమేతుడైన సుధన్వుడనే రాజుతోనూ కలసి ఆ సన్యాసి మనదేశానికి వస్తున్నాడు. అతన్ని సామాన్యుడిగా తలచకండి సుమా.

విద్యుజ్జిహ్వుడు : ఆ బ్రాహ్మణుల ఆయువులు మూడేయి కాబోలు పాపం, వాళ్ళు మనతో విద్యావాదాలు చేయాలని వస్తున్నారు. సంగరహితులతో మనంచేసేది సంగరమా, ప్రసంగమా?

క్రకచుడు : వారు సంగరహితు లంటున్నావు కదా? ప్రసంగా లెందుకు? యుద్ధమే చేద్దాం. మన కాపాలికు లందరినీ సిద్ధం కమ్మను వాళ్ళ శిరస్సులతో భైరవుని తృప్తి పరుద్దాం.

శంకరాచార్యులు కాపాలికులుండే కర్ణాటక దేశానికి వచ్చి ఒక దేవాలయంలో నివసించి ఆ దేశస్థులని అద్వైత మతావలంబకులని చేయడానికి బోధిస్తుంటే, సుధన్వుడి చేత ప్రేరేపించబడిన శంకరాచార్య శిష్యుడొకడు క్రకచుని వద్దకు వెళ్ళి ఆచార్యులను పొగిడి - వాదించాలనుంటే రమ్మన్నాడు.

అతను శంకరుని వద్దకు వచ్చి "పురుషాధమా! నువ్వు కపట మత మొకటి కల్పించి లోకులను వంచిస్తున్నావని విని నీ గర్వం అణచడానికి నీ దగ్గరకు రావాలను కుంటూంటే మిడతలా నువ్వే వచ్చావు. నువ్వు బూడిద రాసుకోడం మాకు సమ్మతమే. కాని మానవ కపాలానికి బదులు మట్టి పాత్రని ఎందుకు పట్టుకున్నావు? రక్తంతో భైరవుడి నారాధింపక నీకు మోక్షం లభిస్తుందా?" అంటూంటే సుధన్వు డతన్ని దూరంగా తోయించేశాడు.

దానితో అవమానం చెందిన క్రకచుడు కోపంతో ఆ బ్రాహ్మణులందరినీ వధించి రమ్మని కాపాలికుల నాజ్ఞాపించాడు. కాపాలికులకీ సుధన్వుడికీ యుద్ధం జరగసాగింది. ఆ కింకరులు పెడుతున్న బాధలకి బ్రాహ్మణులందరూ శంకరాచార్యుల పాదాలని శరణుచేరడమూ, అతను హుంకరిచంగా అగ్ని శిఖలు రేగి కాపాలికు లందరినీ భస్మం చేయడమూ జరిగాయి.

అది చూసిన క్రకచుడు శంకరుని సమీపించి – "వంచకుడా! దీనికి ఫలం అనుభవిస్తావు" అంటూ కళ్ళు మూసుకుని భైరవుణ్ణి ధ్యానించాడు. అతని చేతిలోని కపాలంలోకి మద్యం నిండింది. అతను దానిలో సగం తాగి – మళ్ళీ భైరవుణ్ని ప్రార్థించాడు. కపాలంలోంచి నిప్పులు కక్కుతూ, శూలం పట్టుకుని అట్టహాసం చేస్తూ, భయంకరంగా భైరవుడు ప్రత్యక్షమయ్యాడు.

క్రకచుడు నుదుట చేతులానించి – "స్వామీ! నీ భక్తులకు ద్రోహం చేస్తున్న యీ నీచుణ్ని అంతరింపజెయ్యి." అంటూ శంకరుడి మీద ప్రయోగించాడు.

అప్పుడు భైరవుడు – "క్రూరాత్మా! నా ఆత్మస్వరూపుడైన శంకరుడికే ద్రోహం తలపెడతావా! నీపాపం నిన్నే తింటుంది" అంటూ అతని శిరస్సే నరికి నాట్యంచేయడం మొదలు పెట్టాడు.

శంకరుడతన్ని అనేకవిధాలుగా ప్రశంసిస్తూ – "స్వామీ! సంహార భైరవా! వేదశాస్త్రాలలో చెప్పబడిన కర్మ బ్రాహ్మణులకు కర్తవ్యం. అలాటి కర్మ చెయ్యడం వల్ల ధర్మం అభివృద్ధి చెందుతుందని నా అభిప్రాయం. ధర్మంవల్ల పాపం నాశనమౌతుంది. అందువల్ల మనసు శుద్ధి అవుతుంది. మనశ్శుద్ధి వల్ల ఆత్మ సాక్షాత్కారం ఔతుంది" అంటూ బ్రాహ్మణులకు ఉపదేశిస్తూంటే నీ భక్తుడు ఆక్షేపిస్తూ – "కర్మవల్ల ప్రయోజనం లేదనీ, జాతులతో నిమిత్తం లేదనీ, పాషండ ధర్మాలని ఆ సభలో చెప్పాడు. అప్పుడు నా శిష్యులు వానిని దూరంగా నెట్టేశారు. అతను కోపించి నిన్ను మంత్ర బద్ధుణ్ని చేసి రప్పించాడు ..." అన్నాడు.

భైరవుడు అతన్ని ప్రశంసిస్తూ – "శంకరా! నువ్వు సర్వజ్ఞుడివి. పూజ్యుడివి. వేదార్థాలను నీకంటె ఎరిగిన వారెవరూ లేరు. నువ్వు చెప్పిన ఉపన్యాసం నాకేకాదు, త్రిలోకాలకీ సమ్మతమై ఉంది. ఈ కాపాలికు లందరినీ బ్రాహ్మణాచార తత్పరులని చెయ్యి. వాళ్ళకి నేను మంత్ర బద్ధుడినవడం వల్ల ప్రత్యక్ష మయ్యాను కాని ధర్మంచేతకాదు సుమీ" అని అంతర్ధానమయ్యాడు.

ఆ మాటలు విని ప్రముఖ కాపాలికులు ఆశ్చర్యపోతూ శంకరాచార్యుల పాదాల మీదపడి – "మహాత్మా! మూఢులమైన మమ్మల్ని రక్షించు. కరుణార్ద్ర హృదయా! మాకు నిష్కృతి కావించు" అని ప్రార్థించేసరికి శంకరుడు వారి నందరినీ బ్రాహ్మణాచార తత్పరులను చెయ్యమని పద్మపాదుడు మొదలైన శిష్యుల కాజ్ఞాపించాడు.

## కాపాలిక మతం

అప్పుడొక వృద్ధకాపాలికుడు వచ్చి – "స్వామీ! మమ్మల్ని బలవంతంగా మతభ్రష్టులని చెయ్యడం మీకు ఉచితంకాదు. మాకు తగిన సమాధానం చెప్పి ఒప్పించాలి. మీ శిష్యులు మమ్మల్ని నోరెత్తనివ్వడం లేదు. నా ఉపన్యాసం ముగిసేవరకూ నన్నాటంకపరచవద్దని మీ శిష్యులకి చెప్పండి" అని కోరాడు. శంకరు డంగీకరించాడు.

"సర్వదేహాలూ భౌతికవికారాలే. కనక మనుషులలో జాతిభేదం, బ్రాహ్మణజాతి ఎక్కువ, మే మంగీకరించం. శరీరాన్ని చూసి జాతిని నిర్ణయించలేము కదా? స్త్రీపురుషజాతులే సత్యం. దేని సంసర్గం వలన ఎక్కువ సంతోషం కలుగుతుందో ఆ స్త్రీ జాతి పురుషజాతి కంటె గొప్పది. దీనితో కూడవచ్చును, దీనితో కూడరాదు – అనే భేదవాదం మా మతంలో లేదు. సంతోషంకోసం చేసే దేహాల సంయోగం వల్ల జీవి కేం అనర్థం? స్త్రీ పురుష సంయోగంకంటే మోక్షం మరొకటుందా? జీవుడి తృప్తే మోక్షం. సర్వజనులకూ సులభసాధ్యమైన యిలాటి ముక్తి మామతంలోకాక మరే మతంలోనూ లేదు" అంటూ ఉపన్యసించాడు కాపాలికుడు.

"ఓహో! మీకు వెలది (స్త్రీ) యూ మద్యమూ నిషేధాలు కావు. నువ్వు నీయిష్టం వచ్చినట్లు సంచరించు. మేము బ్రాహ్మణులను దండించి అయినా సరే మంచి బుద్ధికలవారిగా చేయాలని కంకణం కట్టుకున్నాం. నువ్వు సంభాషించడానికి కూడా అర్హుడివికావు" అని శంకరు లంటూండగానే అతని శిష్యులు వాడిని దూరంగా గెంటేశారు.

# చార్వాకాది మతఖండనం

**ఆ** సమయంలో చార్వాక, సౌగత, క్షపణకులు ఒకచోట సభచేసి మాట్లాడుకోసాగారు.

చార్వాకుడు :- సౌగతా! ప్రపంచం ఎంతగా మూర్ఖజనమయం అయి పోయింది! ఆత్మదేహం కంటె అతీతమైనదని చెప్పే ఈ సన్యాసినే ప్రజలు సేవిస్తున్నారు!

*సౌగతుడు* : మూఢులు కనుకనే - శరీరం స్నానం వల్ల శుద్ధి అవుతుందనే వీడి అసత్యాలను మెచ్చుకుంటున్నారు!

క్షపణకుడు : ఆ వంచకుడికి దైవబలం ఉంది. లేకపోతే కాపాలిక కులనాయకుడైన క్రకచుని ఎదుటపడి ఎవరేనా బతకడమే!

*జైనుడు* : క్రకచుడిచే పిలవబడిన భైరవుడు అతన్నే సంహరించాడు. ఎంతవిచిత్రం!

*బౌద్ధులు* . మంత్ర బలంలో సన్యాసి క్రకచుడి కంటె అధికుడు కావచ్చు. మనం అతని ఎదుటకి వెళ్ళి అడుగుదాం. శంకరుడు పరమశాంతుడట. మనమాటలకు జవాబు చెప్పకపోడు.

*జైనులు* : వాని శిష్యులు కడుక్రూరులు. వృద్ధకాపాలికులను కొట్టి దూరంగా తరిమేశారు.

*బౌద్ధులు* : ఏదో ఉపాయంతో మనం వారి బారిన పడకుండా, వాదించి రావాలి.

*జైనులు* :. చార్వాకుడు మాటకారి కనక అతన్ని ప్రసంగించ మందాం.

వాళ్ళు శంకరుని వద్దకు చేరుకున్నారు. అతను వారి వాదాన్ని వినిపించమన్నాడు.

చార్వాకుడు : మరణానంతరం ముక్తి కలుగుతుందని మీరు చెప్పేది సత్యంకాదు. దేహాన్ని విడవడమే జీవుడికి ముక్తి. సముద్రంలో కలసిన

నది మళ్ళీ వెనక్కిరాదు. మృతి చెందిన వారిని శ్రాద్ధాది కర్మలతో తృప్తి పొందించడం, ఆరిపోయిన దీపానికి చమురు పొయ్యడమే! స్వర్గనరకాలు ఎక్కడో ఉన్నాయనేదీ బూటకమే. సుఖదుఃఖానుభూతి యీ లోకంలోనే ఉంది. దీనిని కాదని పరోక్ష కల్పన చేస్తూ లోకులని వంచిచండం దౌష్ట్యం..."

"నీ మతం శ్రుతి బాహ్యమయిన దవడం వలన మన్నింప దగింది కాదు. ఆత్మస్వరూపుడైన జీవుడు దేహానికి భిన్నుడై పరమాత్మ అనబడతాడు. శ్రుతి ప్రమాణాన్ని నువ్వు నమ్మనంటే నీమాట లెందుకునమ్మాలి? పిండప్రదానాలతో పితరులు పుణ్యలోకం పొందుతారని పురాణాలలో చెప్పబడింది. జీవుడు మరణం అనంతరం లింగశరీరాన్నా శ్రయించి పక్షిలా తిరుగుతాడని శ్రుతి సిద్ధాంతం" అంటూ అతనికి బోధించగా చార్వాకుడు అతని వేష భాషలు వదిలి పుస్తకాలు మోసే పని చేస్తానని అత న్నాశ్రయించాడు.

తరవాత సౌగత మతస్థుడైన పీనకాయుడు – "స్వామీ! మూఢభావంతో కర్మశీలురు స్నానాదులచేత శరీరాన్ని కష్ట పెట్టుకుంటూ ఉంటారు. దేహాంతంలో ఏమీలేదు. అందుచేత అప్పయినా చేసి ఎప్పుడూ దేహపుష్టి చేసుకోవాలి. నియమాలతో దేహాన్ని బాధించకూడదు. కర్మ బూటకం..." అంటూంటే –

శంకరాచార్యులు "అందుకేకాబోలు శరీరాన్ని యింత బలిపించావు. నీమతం చాలా విపరీతం. అజ్ఞానం వదులు" అన్నాడు.

"అయ్యా! మహర్షి అయిన సుగతుడు భూమిని చూసి ఆశ్చర్యపోతూ బ్రాహ్మణోపాసన తత్పరుడై అందరికీ – 'అహింసా పరమోధర్మః అని ఎప్పుడూ స్మరించు కుంటూ ఉండాలి. అహింసే పుణ్యకర్మ. భూతదయే సర్వధర్మాలు. అహింసవల్లనే ముక్తిని పొందుతారు." అని చెప్పారు. ఆ మాటలే నమ్మి, జీవహింసకు వెరచుతూ నియమంగా ప్రవర్తిస్తున్నాను. వైదికులు యాగాలలో పశుహింస చేస్తారు. అది మహాపాపం. మామతమే పరమధర్మ సాధనం" అన్నాడు పీనకాయుడు.

"నీకు ధర్మ సూక్ష్మంతెలియదు. యాగాలలో హింస పరమధర్మం అని వేదంలోనే చెప్పబడింది. పూర్వాచారాలని వదలి వేదనింద చేసేవారు నరకాన్ని పొందుతారని మనువు చెప్పాడు. బ్రాహ్మణాది వర్ణములు వేదంలో చెప్పబడిన ఆచారాలు చేయవలసిందే" అని అతన్ని ఒప్పించాడు. అతను శంకరుల పాదుకలను మోస్తూ తిరిగాడు.

తరవాత...గోచీమాత్రమే ధరించి కొలయంత్రం ఒక చేత్తోనూ, నేసే యంత్రం ఒక చేత్తోనూ పట్టుకుని వచ్చి "నా మతము చాలా విచిత్రమైనదీ, మంగళప్రదమైనదీ. సూర్యుణ్ని యీరెండు యంత్రాలతోనూ కట్టివేసి సమయజ్ఞానంతో త్రిలోకాలకీ శుభాశుభఫలితాలు చెప్పగలను. 'కాలమే పరమాత్మ' – అని మా మత సిద్ధాంతం" అన్నాడు, అతను.

"నువ్వు కాలవేదివని నాకు తెలుసు. నువ్వు నన్ను ఆశ్రయించి ఉండు. సమయమొచ్చినప్పుడు పరీక్షిస్తాను" అని అతను వాడిని ఆజ్ఞాపించాడు.

అంతలో ... వొంటినిండా మలం పూసుకుని, భయంకర వేషంతో పిశాచంలా జైనుడు వచ్చి – "స్వామీ! జినదేవుడు సమస్త ప్రాణుల హృదయాలలోనూ ఉంటూ దేహాంతంలో జీవుణ్ని పరిశుద్ధం చేసి ముక్తుణ్ణి చేస్తాడు. మలపిండ సదృశమైన దేహం స్నానం వల్ల శుద్ధ మయ్యేదికాదు. జినదేవుని కరుణవల్ల మాత్రమే శుద్ధమౌతుంది. ఇదీ మా మతం" అన్నాడు.

"జైనుడా! జీవుడికి మూడు దేహాలుంటాయి. అవిక్రమంగా లయమైన తరవాత జీవుడు సచ్చిదానంద స్వరూపు డౌతాడు. నేను ఈశ్వరునికంటె భిన్నుడిననడం అజ్ఞానం" అంటూ అద్వైత జ్ఞానం బోధించి తన శిష్యులకే శిష్యుడిగా చేశాడు.

అప్పుడు శబలుడనే బౌద్ధుడు – "శంకరా! నీ బోధవల్ల ప్రయోజనం లేదు. నువ్వు ప్రత్యక్షఫలం వదిలి కడుదూరమైన

అదృష్టఫలాన్ని కోరుతున్నావు. మా మతంలో హృదయ ప్రేరకుడై సుఖాత్ముయై జీవుడు నిత్య విముక్త డౌతున్నాడు. నేనే కర్తను, నేనే పరమానందస్వరూపుడినని తలుస్తూ ఎంతకాలం యీ దేహక్రీడ యిష్టమౌతుందో అంతకాలం క్రీడిస్తూ తరవాత శరీరం విడచి పోతాడు. అదే ముక్తి అని మామత సిద్ధాంతం." అన్నాడు.

"బౌద్ధుడా! అన్నమయ దేహపాతం మాత్రానే ముక్తి అని చెప్పడం అవివేకమూ, ప్రమాణశూన్యమూ కూడా. జ్ఞానం వల్ల కాని మోక్షం సిద్ధించదని వేదం చెబుతోంది. కనక పరమాత్మని తెలుసుకుని ముక్తుడివి అవు కల్పితమైన జీవిత భ్రాంతిని వదిలి సచ్చిదానంద స్వరూపంగా తెలుసుకో. మూఢభావం వదిలి స్వస్థుడివై అద్వైత జ్ఞానం సంపాదించుకో" అని శంకరాచార్యుడు బోధించగా ఆ బౌద్ధుడు అతని శిష్యుడయ్యాడు.

కర్ణాటక దేశంలో ఉన్న కాపాలిక, చార్వాక, జైన ఆది మతాలను ఖండించి అక్కడినుంచి శిష్యులతో సహా అనుమల్లమనే పట్నానికి వెళ్ళారు. అక్కడ, మల్లారి అనే పేరుతో ఉన్న దేవతలను పూజిస్తూ ప్రజలు కుక్కలను సేవిస్తారు. గవ్వలపేరులు మెడలలో వేసుకుంటారు. మూడు కాలాలలోనూ నాట్యవాద్యాలతో మాల్లారి నర్చిస్తూ అతనే ముక్తి ప్రదుడని వాదిస్తారు.

శంకరాచార్యులు ఇరవైరోజు లక్కడ ఉండి వాళ్ళమతాన్ని ఖండించి, ప్రాయశ్చిత్తంచేసి, వారిని సన్మార్గంలో పెట్టారు.

తరవాత మీరుంధ అనే గ్రామానికి వెళ్ళి, విచిత్ర గోపురంతో విష్వక్సేనుని ఆలయం కట్టించి దానికి తూర్పుగా పానీయశాలను నిర్మించి ఆ స్వామిని సేవించాడు. అక్కడేకల విష్వక్సేన మతస్థులకు బోధలు చేసి పాషండ చిహ్నాలు తీసివేయించి తన శిష్యులుగా చేసుకున్నాడు.

అక్కడనుండి మాగధ పట్నం వెళ్ళి అక్కడ ఇంద్ర కుబేర మతస్థుల అజ్ఞానం పోగొట్టి పంచపూజా పరాయణులని చేసి - అక్కడినుంచి యమ ప్రస్థపురం వెళ్ళాడు. అక్కడ ఒక మాసం నివసించి

అక్కడి పరమతస్థులని పాదాక్రాంతులని చేసుకుని అక్కడి నుంచి ప్రయాగకు వెళ్ళి వాయువరణ మతస్థులని విధేయులని చేసికొని త్రివేణీ తీర్థసేవ చేయసాగాడు.

అక్కడొక రోజు శూన్యవాది ఒకడు శంకరాచార్యుడి ఎదుటకు వచ్చి - "స్వామీ! నేను నిరాలంబన నామధేయుడిని. మా తండ్రిపేరు క్లుప్తుడు. నే నిప్పుడు వస్తుంటే దారిలో ఎండమావి జలంలో స్నానంచేసి ఆకాశ కుసుమాల మాలికలు చుట్టుకుని కుందేటికొమ్ము విల్లుధరించి గొడ్రాలి కొడుకొకడు ఎదురుపడ్డాడు. వాడిని చూసి సంతోషించి దేవభావంతో నమస్కరించి అప్పుడే తమ దర్శనానికి వచ్చాను వాడెవడో చెప్పండి" అన్నాడు.

"శూన్యవాదీ! నీఉద్దేశం నేను గ్రహించాను. శూన్యం అవడం వల్ల నీ మతం నింద్యమైనది. బ్రహ్మం శూన్యం కాదని శ్రుతి చెప్పడం లేదా? మూఢత్వం వదలి అద్వైత విద్యను గ్రహించు" అన్నాడు శంకరుడు.

"సర్వభూతాలలో ఆకాశమే శ్రేష్ఠమైనది. ఆ చిహ్నం కలదవడం వల్ల ఆకాశానికి బ్రహ్మత్వం చెబుతున్నాం. మా మతం నింద్యమైంది ఎలా ఔతుంది?" అని శూన్యవాది అడిగాడు. శంకరాచార్యు డతనికి వివరణ యిచ్చాడు. అప్పుడతను బ్రహ్మోపదేశం చేసి కృతార్థుడిని చెయ్యమని - శంకరుని శిష్యుడయ్యాడు.

ఆ విధంగా అన్యమతస్తుల నెందరినో కృతార్థులని చేసి - పడమటి సముద్రతీరంలోని గోకర్ణక్షేత్రానికి వెళ్ళాడు.

# కాశీ మజిలీ కథలు

## 50. వ మజిలీ

### నీలకంఠుడి కథ

గోకర్ణ క్షేత్రంలో మహాకాళనాథుడ్ని సేవించి ఆ ఆలయంలో ఉండగా – హరదత్తుడనేవాడు నీలకంఠుడనే తన గురువు వద్దకు వచ్చి – "ఆర్యా! నువ్వు వ్యాససూత్రాలకి శైవపరంగా భాష్యం చేశావు. ఇప్పుడు శంకరుడనే సన్యాసి మండనుడు వంటి ప్రౌఢపండితులను జయించి శిష్యులుగా చేసుకుని, వాళ్ళతో కలసి, దిగ్విజయం చేస్తూ, నిన్ను జయించాలని మహాకాళుడి ఆలయంలో నివసిస్తున్నాడట. అతని శిష్యుడొకడు వచ్చి వాదానికి రప్పించమని నాకు చెప్పాడు. శంకరుడి శిష్యులే లోకాతీతులట" అన్నాడు.

నీలకంఠుడు రుద్రాక్షమాలలు ధరించి, కోపంతో బయలు దేరాడు. రెండవ శివుడిలా ప్రకాశిస్తున్న శంకరుణ్ని చూసి ఆశ్చర్యపోతూ వాదానికి సిద్ధపడుతూంటే –

సురేశ్వరుడు తన గురువుతో – "స్వామీ! మీరు విశ్రమించండి. ఈ నీలకంఠుడ్ని నేనే క్షణంలో పరాభవించి పంపగలను" అన్నాడు.

నీలకంఠుడు కోపగించి – "సన్యాసితో వాదించి నువ్వు ఓడడమేకాక భార్యని కూడా సభ కెక్కించి గెలవలేక దాసుడివై బలవంతంగా సన్యాసివై అతని వెంట తిరుగుతున్న నువ్వు సంభాషణకి అర్హుడివి కావు ఫో" అని ఆక్షేపించాడు.

శంకరుడు "నీలకంఠా! నీకు సురేశ్వరుడి ప్రజ్ఞ తెలియక తూలనాడావు. సరే. నువ్వు వ్యాససూత్రాలకి శివపరంగా భాష్యం చేశావట. ఏదీ, .....చదువు. అభినందిస్తాం" అన్నారు.

నీలకంఠుడు ప్రతిపాదించిన విషయాలను అతి సులభంగా ఖండించి - తన భాష్యాన్ని సురేశ్వరుడి వద్ద పాఠం చదువుకోమన్నాడు. నీలకంఠుడు ఆ భాష్యం విని సిగ్గుతో తలవంచుకుని, శంకరాచార్యుడి పాదాలను శరణువేడాడు. అది తెలిసిన అద్వైతమత విరోధులు-ఉదయనుడు మొదలైన వారు ఎక్కడికో పారిపోయారు.

సౌరాష్ట్రదేశంలో పర్యటించి, ద్వారవతీపురానికి వెళ్ళి - పాంచరాత్రులనే వైష్ణవ మతస్థులతో వాదించాడు. ఈ విధంగా ఎందరినో అద్వైత బోధ చేత ఉద్ధరించినందున షణ్మతోద్ధారకుడని బిరుదు వచ్చింది.

ఉజ్జయినీ నగరంలో కాళీశ్వరుని ఆలయంలో విశ్రమించి పద్మపాదుడితో - "మనరాక భట్టభాస్కరుడికి తెలియ జేసిరా. అతను ప్రౌఢవాది" అన్నాడు. పద్మపాదుడు శంకరుని గొప్పతనం ఎంత చెప్పినా వినకుండా వాదానికి వచ్చాడు. శంకరుడు, భట్టభాస్కరుడు - ఒకరి మతాన్ని ఒకరు ఖండిస్తూ, యుక్తులతో...మూడు రోజుల పాటు అహోరాత్రాలూ వాదించారు. చివరికి శంకరు డతన్ని జయించి అతనితోపాటు అతనివా రందరినీ తన శిష్యులని చేసుకున్నాడు. అక్కడి నుంచి నైమిశారణ్యం వెళ్ళి తాపసులకు సంతోషం కలగజేశాడు. దరద భరత శూరసేన కురు పాంచాల దేశాలలోని పండితుల నోడించి తన భాష్యాన్ని ప్రచారం చేస్తూ శ్రీహర్షుడి వద్దకు వెళ్ళాడు. ఆ గర్విష్టిని ఓడించి, కామరూప దేశాలకు వెళ్ళి అభినవగుప్తుడనే పండితుణ్ని వాదానికి పిలిచాడు.

అభినవగుప్తుడు శంకరుని సామర్థ్యం చక్కగా తెలిసినవాడు. అందుచేత కపటంతో అతనికి శిష్యుడై - తన మంత్ర శక్తితో అతని ప్రాణాలు తియ్యాలని పన్నాగం పన్నాడు. ఆ దురాత్ముడి కపటం గ్రహించని శంకరుడు అతన్ని శిష్యుడిగా అంగీకరించి, వెంట బెట్టుకుని అంగవంగకోసలాది దేశాలను దర్శించి గౌడదేశానికి వెళ్ళాడు. మురారి మిశ్ర, ధర్మగుప్త, మిశ్రోదయన మొదలైన పండితులని ఉద్దండ వాదంలో జయించాడు.

శంకరుడు భూమండలమంతా తిరుగుతూ తన మతాన్ని వ్యాపింపజేస్తూంటే ఆ వైభవాన్ని చూడలేక - రహస్యంగా ఆభిచారిక హోమం చేయించి, మాన్పడానికి వీలులేని భగందరరోగం కలిగేలా ప్రయోగం చేసి అభినవగుప్తుడు ఎక్కడికో పోయాడు.

మర్నాటి నుంచే ఆ వ్యాధి శంకరుణ్ని పీడించ సాగింది. ఆయన వస్త్రాలను ఉదికే పద్మపాదుడు ఆ విషయం అందరికీ చెప్పాడు. దానిని లెక్క చెయ్యకుండా ఉన్న గురువుని ప్రార్థించి శిష్యులు, ఎందరో రాజవైద్యులు చికిత్స చేసినా ప్రయోజనం లేక పోయింది.

బాధ ఎక్కువ కావడంతో ఆచార్యుడు అన్ని బాధలనూ పోగొట్టే పురుహరుణ్ని ప్రార్థించాడు. అతను అశ్వినీ దేవతల నాయన వద్దకు పంపాడు. వారు రోగనిదానం చేసి - "ఈ వ్యాధి శాక్తిక ప్రయోగం వల్ల వచ్చింది. చికిత్సకు సాధ్యపడదు. ప్రతిప్రయోగమే వైద్యం" అని చెప్పి వెళ్ళిపోయారు. పద్మపాదుడు కోపంతో - "నా గురువుని యిలా రోగ పీడుతుణ్ని చేసిన పాపాత్ముణ్ని యిప్పుడే అంతమొందిస్తాను." అంటూ అప్పుడే నియమం దాల్చి అభీష్ట దైవం అయిన నరసింహదేవుని మంత్రాలతో ఆరాధించాడు. దాని ఫలితంగా మర్నాడే అభినవ గుప్తుడు ఆరోగంచేతనే చనిపోయాడు. శంకరాచార్యులు స్వస్థత చెందారు. మహాత్ముల కపకారం చేసిన వాడు చెడిపోక తప్పదు కదా.

## గౌడపాదముని దర్శనం

**ఒ**కనాడు శంకరాచార్యులు గంగానదీ తీరంలో కూర్చుని చల్లగాలిలో ఆత్మధ్యానం చేస్తూంటే - గౌడపాదముని అక్కడికి వచ్చాడు. ఆచార్యుడు లేచి భక్తి పూర్వకంగా అతని పాదాలకు నమస్కరించి ఎదురుగా నిలబడ్డాడు. అతను కుశలప్రశ్నలు వేయగా - "మీ కటాక్షం ఉండగా ఏది సిద్ధింపకుండా ఉంటుంది" అంటూ వినయంగా స్తుతించాడు. గౌడపాదుడు శంకరుడు రచించిన గ్రంథాలను వినిపించమన్నాడు.

శంకరుడు మాండూక్యభాష్యాలు రెండు వినిపించగా అతనెంతో సంతోషించి వరం కోరుకోమన్నాడు.

"నామన స్సెప్పుడూ పరతత్వ చింతనంలో ఆసక్తి కలిగి ఉండేలా అనుగ్రహించు" అని కోరాడు.

మర్నాడు ప్రాతఃకాలంలో గంగానదిలో స్నానం చేసి ధ్యానంలో ఉండగా, పద్మపాదుడు - "ఎవరో చెప్పకుంటూంటే విన్నాను. కాశ్మీర దేశంలో శారదాపీఠమొకటి ఉండట ఆ మందిరానికి నాలుగు వాకిళ్ళట. దక్షిణద్వారం ఎప్పుడూ మూయబడి ఉంటుందట. సర్వజ్ఞుడు కానివాడు ఆపీఠం వద్దకు చేరలేడట. అక్కడ ఎందరో కుమత వాదులుండి, వచ్చిన వారిని పరీక్షిస్తారట. ఆ పీఠం అధిరోహించడానికి మీరే సమర్థులు. దానితో మీ దిగ్విజయ యాత్ర పరిపూర్ణమౌతుంది" అన్నాడు. శంకరుడు బయలు దేరాడు.

శంకరుడు శారదా మందిరం దక్షిణ ద్వారానికి వెళ్ళి ప్రవేశించబోతూంటే - అక్కడి వారు అడ్డంవచ్చి - "నువ్వెవడివి? సర్వజ్ఞుడివైతే యీ తలుపు తెరచి వెళ్ళు" అన్నారు. వారడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పి తనసర్వజ్ఞతను నిరూపించుకున్నాడు. కాణాదులు, గౌడ మతస్థులు నైతకాలు, సాంఖ్యులు, బౌద్ధులు ... మొదలైన వారందరి చేతా మెప్పులు పొందాడు. ఆత్మశుద్ధి కలవాడని అంబకూడా ప్రశంసించింది. తన గొప్పతనంకోసం కాక తన మతం ఆధిక్యత కోసం సర్వజ్ఞపీఠం అధిరోహించాడు. తరవాత బదరికారణ్యానికి వెళ్ళాడు. భూమండలమంతా తిరిగి, కులమతవాదులందరినీ జయించి, నాలుగు దిక్కులా ప్రముఖ మఠంలో శిష్యులను నిలిపారు.

అప్పుడు విష్ణువు, శివుడు, బ్రహ్మ మొదలైన సమస్త దేవతలూ, ప్రమథగణాలూ, సిద్ధులూ వచ్చి "శంకరా! నువ్వు చేయవలసిన పనులింకేమీ లేవు. నువ్వు జన్మించిన కారణాలు ముగిశాయి. నీ పూర్వరూపంలో నీ లోకానికి రా" అని ప్రార్థించారు. శంకరుడంగీక రించగానే అతని వృషభం. అతని పక్క నిలుచుంది. శంకరుడు తనలోకానికి వెళ్ళిపోయాడు" అని చెప్పి - మణిసిద్ధుడు వేళదాటి పోతూండటంతో తరవాత మజిలీకి చేరుకున్నాడు.

# కాశీ మజిలీ కథలు

## 51. వ మజిలీ

### మహాశక్తి కథ

మణిసిద్ధుడు గోపాలుడికి శంకరాచార్యుడి చరిత్ర చెప్పి - "ఆ మహాత్ముడి గురించి గ్రంథస్థం కాకపోయినా చెప్పుకునేకథా విశేషాలు కొన్ని ఉన్నాయి. విను" అని చెప్పసాగాడు.

"శంకరాచార్యుడు శాక్తమత ఖండనం కావించిన కొన్ని రోజులకి శిష్యులతో ఒక అరణ్యమార్గంలో వెళ్తున్నాడు. అప్పుడు వారికి ఆయాసం తీరేటట్లు గాలివీచసాగింది. ఆ గాలి క్రమంగా పెద్దదై... పెనుగాలిగా మారి, చెట్లను విరుస్తూ, శిష్యులనే కాక శంకరుణ్ని కూడా ఎగరేసుకుపోయింది. శిష్యులు "హా! శంకరా!" అంటూ గాలికి కొట్టుకుపోసాగారు.

శంకరుడిని ఒకచోట బురదనేలలో వదిలింది. అతను మొలవరకూ బురదలో దిగబడి. ఎంత ప్రయత్నించినా పైకి రాలేకపోయాడు. లోపలికి కూరుకు పోసాగాడు. ప్రాణాలు నిలవడం కష్టంగా తోచింది. ఎవరికేనా తెలియక అపచారం చేశానా అని ఆలోచిస్తూంటే - నూరేళ్ళ వయసు కలిగి ముడుతలు పడిన శరీరంతో, తెల్లబడిన వెంట్రుకలతో, వింతశోభతో, నుదుటిమీద కుంకుమ బొట్టు ధరించి దండం పట్టుకుని ఒక వృద్ధురాలు - "అయ్యా! దారితెలియక యిక్కడ చిక్కులు పడుతున్నాను. సన్మార్గం చూపెడతారా?" అని అడిగింది.

"నేనూ దారితెలియకే ఈ బురదలో చిక్కుకున్నాను. నీ దండం కొంచెం ఊతయిస్తే బయటకి రాగలనేమో అని ఆశ కలుగుతూంది..." అన్నాడు శంకరుడు.

"నీ మాటలు చిత్రంగా ఉన్నాయి. నేను దండం అందించినంత మాత్రనే లేని శక్తి ఎలా వస్తుంది? మాలాటి వారున్నా లేనివారిలోనే మీలెక్క కదా? –" అని ఆమె అనగా శంకరుడామె నాదిశక్తిగా తెలుసుకుని – "నువ్వు లేవని వాదించినందుకు ఈశిక్ష విధించావు కాబోలు" అన్నాడు. "నువ్వు లోకులందరినీ కృతార్థులని చేస్తున్నావు. నీకు నా ప్రభావం తెలియజేయడానికే యిలాటి మాయ కల్పించాను. హరిహరాదులు కూడా మాయలో పడి నా ప్రభావం తెలుసుకోలేదు. దీనికొక పూర్వగాథ బెబుతాను, విను." అంటూ...

## త్రిమూర్తుల కలహం

పూర్వం నారదు డొకనాడు బ్రహ్మలోకానికి పోయాడు. బ్రహ్మ – "విశేషా లేమిటి?" అని అడిగాడు.

అందుకు నారదుడు – "నిన్న స్వర్గంలో ఒక సభ జరిగింది. దానిలో త్రిమూర్తుల తారతమ్యం గురించి వివాదం వచ్చింది. అది చెబుతాను. తండ్రి అవమానం కొడుకుది కాదా? అక్కడ ఉండవలసిన వారంతా ఉన్నారు. ఎంతసేపూ హరిహరుల గురించే తప్ప నీ ప్రసంగం రాకపోడంతో హరిహరుల కంటే నువ్వే అధికుడి వన్నాను నేను. ఆ మాటలకు వాళ్ళందరూ ఫక్కున నవ్వారు.

నేను అవమానంతో అక్కడేమీ మాట్లాడక ఆ సభ ముగియ కుండానే – ఏమైనా విశేషముందేమో అని నీ దగ్గరకు వచ్చాను" అన్నాడు.

"నారదా! దేవతల సభలో నన్ను అధముడిగా లెక్కించారా! అతి పరిచయంవలన కలిగిన అనర్థమిది. నువ్వు మళ్ళీ వెళ్ళి నేనే అధికుడిననీ, నా సామర్థ్యం చూడాలని వుంటే చూబిస్తాననీ చెప్పిరా. నేను సృష్టి చెయ్యకపోతే హరిహరులేం చేస్తారో చూస్తాను – " అనగా –

నారదుడు "ఆ మధ్య వైకుంఠానికి వెళ్ళినప్పుడు మా గోష్టిలో నీ ప్రస్తావన తెచ్చి, యివే మాటలు చెప్పాను. అప్పుడు విష్ణువు - పెదవి విరిచి - "వాడికేం తెలుసు-" అన్నాడు అతిశయంగా. నా మనసు కష్టపడినా ఏమంటే ఏం నేరమో అని భయపడ్డాను. నువ్వు దేవతలలో అధికుడివే కాని వాళ్ళతో సమానుడివికావని వారి ఉద్దేశం. పంతం చెల్లించు కోదలుచుకుంటే విష్ణువు మీద చూబించు." అన్నాడు.

"నువ్వు మళ్ళీ వైకుంఠం వెళ్ళి నీ మాటలకు బ్రహ్మ చాలా చింతిస్తున్నాడనీ, తేల్చుకునే అభిప్రాయం ఉంటే అలాగే అనీ చెప్పు". అని నారదుణ్ని పంపాడు.

విష్ణువు మందహాసంతో అతన్నాహ్వానించి - విశేషాలడగగా "హరి, హర, బ్రహ్మలలో ఎవ రధికులని మునులకీ దేవతలకీ సంవాదం జరిగింది.

మును లంతా శివు డెక్కువన్నారు. దేవతలు మీరే అధికులన్నారు. మునులతో దేవతలు వాదింపలేకపోయారు " అన్నాడు నారదుడు. "మునులు నా దగ్గరకి రాకపోతారా" అన్నాడువిష్ణువు. "అయ్యా! జగత్కారకులయిన త్రిమూర్తుల ప్రభావం తెలుసుకోడం మాలాటి వారి తరమా! మునుల పట్ల మీరు, దేవతల పట్ల శివుడూ మీ యిద్దరి యందూ బ్రహ్మ కోపగిస్తే మా బతుకు లెలా సాగుతాయి? ఇప్పటికే బ్రహ్మ మీ యిద్దరి కంటే అధికుడినని వాదించి గెలుస్తానని ప్రతిజ్ఞ చేసాడు. వేదాలన్నీ తనపరంగానే ఉన్నాయట."

విష్ణువు కోపగించి - "నా నాభికమలంనుంచి పుట్టి, కర్తవ్యం తెలియక చింతిస్తూంటే పుత్ర వాత్సల్యంతో సృష్టి క్రియా సామర్థ్యం కలగ జేశాను. ఆ మాట మరచి నాకంటె తా నధికుడని అంటే నువ్వెలా ఊరుకున్నావు? బ్రహ్మతో - నీయందు కల పుత్ర వాత్సల్యం నిన్ను కాపాడుతూంది. నా పరాక్రమం చూడాలనుకుంటే చెప్పు. అని పలుకు.' అన్నాడు.

"మీ భక్తుడినైన నేను ఊరుకోలేకనే దేవతలను వాదానికి పురికొల్పాను. కాని వాళ్ళు నా భక్తి విశ్వాసాలు గ్రహింపలేకపోయారు."

నారాయణుడు పీఠం దిగి చక్రం గిర్రున తిప్పుతూ – "నారదా! నేను విశ్వరూపం దాల్చి విజృంభిస్తున్నాను. పధ్నాలుగు లోకాలతో పాటూ శివుణ్ని కూడా రూపు మాపుతాను. నా చక్రాన్ని కాసుకునే వాడెవడో చూస్తాను" అంటూంటే –

లక్ష్మీదేవి వచ్చి అతనికి నమస్కరించి – "శాంతస్వభావం కల మీరలా అంటే ఎవరు నిలవగలరు? మునులన్న మాటకి శివుడిపై కోపగించడమేమిటి? అదీకాక నారదుడికి కలహమే భోజనం. ఇతని మాట లెంత నిజమో విచారించాలి. శివుడు మిమ్మల్ని దిరించి వస్తే అప్పుడేం చేసినా బాగుంటుంది" అని శాంత పరచింది.

"నారదా! నీ మాటలను కొంత పరీక్షించ వలసి ఉంది. అది నిజమేనా?" అడిగాడు విష్ణువు.

"స్వామీ! మీ ముందు నేను అబద్ధాలాడతానా? బ్రహ్మ అన్న మాటలన్నీ చెబితే కొండేల వాడంటారనే వెల్లడించలేదు. ఈ మహాదేవి చెప్పినట్లు మీ జోలికి రాని శివుడిపై కోపగించడం ఉచితం కాదు. నేను రహస్యంగా వెళ్ళి ఆయన ఉద్దేశం కనుక్కుని వస్తాను. అప్పుడు చేయవలసింది చేద్దురుగాని" అని నారదుడు కైలాసం వెళ్ళాడు.

పార్వతీ పరమేశ్వరు లా కైలాస శిఖరం మీద వినోద కథా కాలక్షేపం చేస్తూండగా నారదుని రాక తెలిసింది.

"నారదుడు మహర్షి అయినా కలహప్రియుడు. మేరు పర్వతానికీ వింధ్య పర్వతానికీ తగవు పెట్టి లోకాలనే తల్లడిల్ల జేశాడు. అయినా మీరందరూ అతన్ని ఎందుకు గౌరవిస్తారు?" అని పార్వతి అడిగింది. శివుడు నవ్వుతూ – "నారదుడు త్రికాలవేది. జరగబోయేది తెలిసే అలాటి కలహాలు పెడుతూంటాడు. అతనికి కామక్రోధాదులు లేవు" అంటూంటే నారదుణ్ని సిద్ధులు ప్రవేశపెట్టేరు.

"మునీంద్రా! విశేషాలేమిటి?" అడిగాడు శివుడు.

"అలా నిజం చెప్పినందుకే వారికి కోపం వచ్చింది. విష్ణువు కింత కోపముందని ఎరుగను. లక్ష్మీదేవి అడ్డుపడక పోతే లోకాలీపాటికి భస్మమై ఉండేవి. మీకు నిజం చెప్పడమెందుకు, లోక సంక్షోభం చెయ్యడమెందుకు? మీ దర్శనమయింది. చాలు. నన్ను పోనివ్వండి."

" నీవార్త నాకు కోపం కలిగిస్తే కలిగించనీ, నీకేం? యదార్థం చెప్పు."

నారదుడు దేవ సభ గురించీ, అక్కడి వాదం గురించీ చెప్పాడు. "మీ యిద్దరికంటే విరించి అల్పుడని అందరూ తేల్చారు. బ్రహ్మర్షులు, యోగులు మీ రధికులంటే, భోగులు, దేవతలు విష్ణువధికుడన్నారు. బ్రహ్మవద్దకు నేను వెళ్ళగా, అతను నన్నడగడంతో దేవసభవాదం చెప్పాను. మీ యిద్దరికంటే తానధికుడని బ్రహ్మమీకు చెప్పమన్నాడు. నేను వైకుంఠానికి వెళ్ళగా విష్ణువు నన్నువొత్తిడి చేసి దేవ సభవిశేషాలు చెప్పించుకున్నాడు. విష్ణువుకి బ్రహ్మమీద అంతకోపం రాలేదు కానీ మీరెక్కువ అని పలికిన మునుల మీద వచ్చిన కోపం అంతా యింతాకాదు. మునులను చంపుతాననీ, లోకాలను భస్మంచేసేస్తాననీ చక్రం తిప్పుతూ తమమీద రోషం పూనాడు. లక్ష్మీదేవి వారించి ఉండకపోతే ఆ చక్రధార యీపాటికి మీ త్రిశూలాన్ని తాకేదే."

"నే నధికుడినని పలికినంత మాత్రానే విష్ణువుకి కోపం వచ్చిందా! నాశాంతమే అతనికింత గర్వం పెంచింది. ఏం మాట్లాడాడో చెప్పు. నా రుద్రావతార చరిత్ర మరచిపోయినట్లున్నాడు" అని ఈశ్వరు డనేసరికి – "తానెక్కువవాడనీ, మీరు తక్కువ వారనీ విష్ణువునకు గట్టి అభిప్రాయముంది. మీ బలాలు మీరు ఆలోచించు కొనవలసినవే" అని నారదుడు రోషమెక్కించాడు.

"ఔరా! నారాయణుడంతటి వీరుడయ్యాడా! నామీదకే చక్రం ప్రయోగించబోతాడా! మూడోకన్ను తెరిచి క్షణంలో అతనికి కొడుకు

దారి చూబిస్తాను. నా శిరస్సు, పాదాలు తెలుసుకోలేక ఎంతతిరిగారో ఆ బ్రహ్మ విష్ణువులు! సరే. విష్ణువుని యుద్ధానికి రమ్మను. మాప్రభావాలు దేవతలకీ మునులకీ తెలుస్తాయి" అన్నాడు శివుడు ఉగ్రంగా.

అప్పుడు పార్వతి "ఇతని మాటలు నమ్మి నారాయణుడిమీద అలుగుతారేం? ఇతను పోరులు కల్పించువాడు. నారాయణుడు దూరదృష్టి కలవాడూ, శాంతస్వభావుడూ" అని అతన్ని శాంతింపజేసింది.

"నారదా! నువ్వెళ్ళి ముప్ఫయి మూడుకోట్ల వేల్పులనీ, ఇంద్రాది దిక్పాలురనీ, మునులనీ, బ్రహ్మనీ, విష్ణువునీ యిక్కడికి తీసుకురా. మళ్ళీ సభ చేయిద్దాం. ఆసభలో మేమే ప్రసంగిస్తాం. ప్రధానత్వం నిశ్చయిస్తారు" అని శివు డనేసరికి నారదుడు ఆనందంగా శలవు తీసుకున్నాడు.

"అక్కడేం జరిగింది?" అంటూ విష్ణువు నారదుణ్ని ఒత్తిడి చేశాడు. "కేశవా! సిద్ధుల వలన అంతవరకూ జరిగినది తెలిసిన చంద్రశేఖరుడు నన్ను చూసి "దామోదరుడు నామీదకి చక్రం ప్రయోగించడానికి సిద్ధమయ్యాడట కదా? తానునన్ను కాపాడుతున్నానని చెప్పాడట నీకు? నిజమేనా?" అని అడిగాడు. నేను నివ్వెరపడి "వాసుదేవుడు మీకాప్తుడేకదా. శాంత స్వభావం వహించండి" అని చెప్పినా వినకుండా రుద్రరూపం దాల్చి త్రిశూలం గిరగిర తిప్పసాగాడు. పార్వతి అతనికోపం చల్లార్చింది. దేవతలను, మునులను, దిక్పాలురనీ తనవద్దకు తీసుకు రమ్మన్నాడు.

మీరెందుకు వస్తారు. అతనే మీ వద్దకు రావచ్చుకదా? - ఈ మాటలు అక్కడే చెప్పాలనుకున్నా పెద్దవారితో పలకరాదని మీ వద్దకు వచ్చాను. తరవాత మీచిత్తం" అన్నాడు నారదుడు.

అప్పుడు బ్రహ్మ - "మంచిసందేశమే తీసుకొచ్చావు. పరోక్షంలో ప్రగల్భాలు పలికినట్లు సమక్షంలో సాగవు. మా ప్రతాపం కళ్ళారా చూస్తారు, అందర్నీ తీసుకురా" అన్నాడు.

"సభ ఎక్కడ జరుగుతుందని చెప్పాలి. మీరు కైలాసాని కొస్తారా? ఈ పట్టణ భూములే ఆ కొండకంటె ఎంతో నయం అని నా ఉద్దేశం."

"ఔను. మనం అతని దగ్గర కెందుకు పోవాలి? వొస్తే అతనిక్కడికి రావాలి. లేదా ముగ్గురికీ సంబంధించని స్థలంలో సభ జరగాలి. ఆ మాట శివుడికి చెప్పు" అన్నాడు విష్ణువు.

శివుడు నారదుడు రావడం చూసి – "చతుర్భుజుడికి నా సందేశం చెప్పావా? రావడానికి అంగీకరించాడా?" అని అడిగాడు.

"స్వామీ! ఇప్పుడు మునపటి బ్రహ్మ, వెనకటి విష్ణువు అనుకున్నారా? కారు. వారి అభిప్రాయాలు చాలా మారిపోయాయి. శివుడు ఆజ్ఞాపిస్తే రావడానికి మేము కింకరులమా? – అన్నారు. అప్పుడు నేనొక ఉపాయం చెప్పాను. ' మూడు లోకాలలోనూ కాక మేరు పర్వతం మీద సభ జరిపించ" మన్నాను. అందుకు మీరు సమ్మతించవలసిందే. ఇప్పుడేమీ అడక్కండి" అని నారదుడు స్వర్గానికి పోయి పురూహూతునిచే అర్చించబడి – "దేవేంద్రా! ఇప్పుడు సావకాశంగా మాట్లాడడానికి వీలులేదు. త్రిమూర్తుల మధ్య అలవిమాలిన కలహాలు వచ్చాయి. మేరు పర్వతం మీద ముగ్గురూ ప్రసంగాలు చేస్తారట. సభాభవనాన్ని అద్భుతంగా అలంకరించమని వారు మీకు చెప్పమన్నారు. దేవతలు మునులు, దిక్పాలురు, సిద్ధుల్లు, సాధ్యులు అందరితోనూ వచ్చి నువ్వక్కడ ఉండాలి. నేటికి నాలుగవనాటికి అందరూ అక్కడికి వస్తారు." అని చెప్పి నారదుడెక్కడికో వెళ్ళిపోయాడు."

అని చెప్పి ఆ మహాశక్తి శంకరాచార్యుడికి తరవాత వృత్తాంతం చెప్పింది.

గోపాలా! మనమది తరవాత మజిలీలో చెప్పుకుందాం. వేళదాటుతూంది" అన్నాడు మణిసిద్ధుడు.

# కాశీ మజిలీ కథలు

## 52. వ మజిలీ

సత్యలోకంలో సరస్వతి వీణాగానంతో కాలక్షేపం చేస్తూంటే – సఖురాలు ఆమె వద్దకు వచ్చి – "అమ్మా! అయ్యగారు ఎందుకో పడుకుని ఉన్నారు. కారణం తెలియదు. దేవర సృష్టి క్రియావిముఖులైతే లోకానికి కీడు. మీరు వేగంవెళ్ళి చూడండి" అంది.

"వారు పగటి వేళ పడుకొనరే! మేరు శిఖరం మీద జరిగిన సభకు వెళ్ళివచ్చిన అలసట వల్ల విశ్రమిస్తున్నారేమో. విశేషాలు తెలుసు కుందామనుకుంటే కోపంగా ఉన్నారు" ఆ సభలో అవమానం జరగలేదు కద – అనుకుంటూ వెళ్ళి కోపకారణాన్ని నైపుణ్యంగా అడిగింది. కాని – బ్రహ్మ మాట్లాడలేదు.

లక్ష్మీదేవి వద్దకు వెళ్తే తెలుస్తుందని వైకుంఠానికి వెళ్తే అక్కడ విష్ణువు కోపగృహంలో పడుకున్నాడని తెలిసింది. లక్ష్మీదేవి అక్కడుందనీ, యీమె రాక వింటే ఆమె వొస్తుందనీ అంతఃపురకాంతలు చెప్పారు. లక్ష్మీదేవి వచ్చింది కాని ఆమెకూ ఏమీ తెలియదని అనడంతో ఇద్దరూ కలసి పార్వతి వద్దకు వెళ్ళారు.

శివుడు కూడా గుహలో పడుకున్నాడని ఆమె ద్వారా విని – ఇదంతా నారద మహర్షి నిర్వాకమే అని – నందీశ్వరుడి ద్వారా విషయం తెలుసుకుందామని అతన్ని రప్పించారు.

అత నా సభావిశేషాలు చెప్పసాగాడు. "త్రిమూర్తులు, దిక్పాలురు, దేవతలు, మునులు అందరూ సభాభవనంలోకి విచ్చేసి ఉన్నారు. సభాభవనంలో రత్నపీఠం ఒకటీ, దాని దిగువన మూడు పీఠాలూ అమర్చబడ్డాయి. నారదుడు సభలో నిలబడి – అందరినీ ఉద్దేశించి – "త్రిమూర్తులలో ఎవరు అధికులని మీకు సందేహం కలగవచ్చు. అది మీ కిప్పుడు తీరుతుంది" అని, త్రిమూర్తులవేపు తిరిగి – "మహాత్ములారా! మీలో ప్రధాను డెవరో వారు ఆ రత్నపీఠం మీద

కూర్చోండి. అదే అగ్రసింహాసనం. మీలోఎవరు అధికులో తెలియని లోకులు చాలా కాలం నుంచి సందేహపడుతున్నారు. ఆ భ్రాంతి వదిలించండి " అని కూర్చున్నాడు. అప్పుడు

రాక్షసులూ, భూతబేతాళులూ, ప్రమధులూ – "మహేశ్వర శబ్దం నీకు కాక ఎవరికుంది? నువ్వే ఆ పీఠం అలంకరించు" అని శివుణ్ని పురికొల్పారు.

"విష్ణుడు సర్వోత్తముడని శ్రుతులు ఘోషిస్తున్నాయి ఈ పీఠం అధిరోహించడానికి మీరే అర్హులు" అన్నారు విష్ణు పక్షపాతులు. బ్రహ్మపక్షపాతులయిన రాక్షసులు – "ఆ సింహాసనాన్ని ఎక్కితే శివు డెక్కాలి. అంతేకాని ఈ కపటుడి నెక్కనివ్వం" అంటూ వాళ్ళు బ్రహ్మని ఎక్కమని ప్రోత్సహించారు.

త్రిమూర్తులు ముగ్గురికీ సంవాదం జరిగింది.

శివుడు : ఇదిగో, నేను పీఠమెక్కుతున్నాను. ఎవడు వద్దంటాడో చూస్తాను.

విష్ణువు : నా ఆజ్ఞలేకుండా ఎక్కగలవా? నాకంటె నువ్వేం అధికుడివి? నేను చేసిన ఉపచారాలు మరిచిపోయావా? విను. శాంబరి వాడిని ఛంపకుండా ఉంటే నువ్వు భస్మాసురుడి చేతిలో చచ్చేవాడివే.

శివుడు : బృందకోసం పిచ్చెక్కిన నీకు నేను విభూతి యివ్వకపోతే అప్పుడే చచ్చేవాడివి.

విష్ణువు : బాణు న్నెందుకు కాపాడలేకపోయావో....

శివుడు : బలి చక్రవర్తివాకిలి కాపుగా ఉండి – రావణుడిని చూసి ఎందుకు పారిపోయావో.

విష్ణువు : సముద్రంలో మునిగిపోతున్న కొండ నెందుకు నిలపలేకపోయావు?

శివుడు : గరళాన్ని భరించలేక కొండకింద ఎందుకు దాగున్నావో?

విష్ణువు : అవసరం తీరాక ఏమేనా అనొచ్చు. నేను అవతారలెత్తి రాక్షసులను చంపి ధర్మం నిలపకపోతే నీ ప్రజ్ఞ ఏమయ్యేది? రక్షించినదానికి ఫలమిదా?

శివుడు : వీరభటుల విజయాలు ప్రభువులకే చెందుతాయి.

విష్ణువు : ఔరా! నా అవతార చరిత్ర అంతా నీ దాసత్వమా! ఎంతమాట అన్నావు!

(వాళ్ళిద్దరూ అలా ఒకరితో ఒకరు వాదించుకుంటూంటే)

నారదుడు : తండ్రీ! నువ్వు మాట్లాడవేం?

బ్రహ్మ : అంతమాత్రాన నా ఆధిక్యత తగ్గిపోతుందా?

నారదుడు : ఈ చతుర్ముఖు డేదో చెబుతున్నాడు. విన్నారా హరిహరులూ? మీయిద్దరికంటే తానే అధికుడట. పీఠం తానే ఎక్కాలట.

విష్ణువు : ఈ భూతపతి కంటె వాని తక్కువేమిటి?

శివుడు : ఈ వాసవారజుడికంటే బ్రహ్మే,అధికుడు.

నారదుడు : శివుని కంటె బ్రహ్మకు ఒక్కమొహమే తక్కువ. విష్ణువు కంటె నాలుగు చేతులెక్కువ.

బ్రహ్మ : ముఖాలతోటీ చేతులతోటీ పనేమిటి? నేను సృష్టి చేయకపోతే ఏంచేస్తారో చూస్తాను.

విష్ణు : పరమేష్టీ! నువ్వూ శివుడిలాగే మాట్లాడుతున్నావు.

శివుడు : నాగోటి చివర నీశిరస్సును ఖండించినప్పుడే నీ ప్రభావం తెల్లమైంది బ్రహ్మ!

బ్రహ్మ : ఆ కపాలమేకదా నీకింత అన్నం పెడుతూంది?

విష్ణువు : బిచ్చమెత్తుకుందుకు నీకపాలం లేకుంటే మరో చిప్ప ఏదీ దొరకదా ఏం?

శివుడు : బిచ్చమిడిన వాడినే అణగ దొక్కిన కృతఘ్నుల ఆక్షేపణలకు జవాబివ్వక్కర్లేదు.

నారదుడు : నిజమే.

బ్రహ్మ : నే నధముడినని కదా మీ ఉద్దేశం? నేను సృష్టించను. చూద్దురుగాని.

విష్ణువు : నేను రక్షింపనిచో నీ సృష్టితో పనేమిటి? నువ్వు సృష్టించినా నేను రక్షించను.

శివుడు : నేను లయము చేయడంవల్ల కదా సృష్టి స్థితుల కవకాశం. నాపనినేను చెయ్యను. మీరేం చేస్తారో చూస్తాను.

అని ముగ్గురూ కోపంగా వెళ్ళిపోయారు. వారికా పోట్లాట పెట్టిన నారదుడు ఏదారిన పోయాడో ఎవరికీ తెలియదు. సభ్యులూ ఎక్కడివారక్కడికి పోయారు."

అని నందీశ్వరుడు చెప్పాడు. అంతలో ఇంద్రాణి అక్కడికి వచ్చి లక్ష్మి సరస్వతులు సంభాషిస్తూంటే ఏదో ధ్యానిస్తున్న కాత్యాయనీ మహాదేవిని చూసి నమస్కరించింది. వారందరినీ ఆహ్వానించి పార్వతి వారిరాకకి కారణం అడిగింది. అందుకు శచీదేవి త్రిమూర్తుల కలహం గురించి చెప్పి – "దేవీ! ఇదేం మాయోకాని, పధ్నాలుగు లోకాలలోనూ చీమనుంచి బ్రహ్మదాకా పురుషజాతి అంతా వృద్ధి క్షయాలు లేక బలహీనమై కదలక పడుంది. స్త్రీ జాతి మాత్రం ఎప్పటిలాగే ఉంది. కారణం తెలుసుకుని యీ ప్రళయం వారించ" మని ఇంద్రాణి శర్వాణిని ప్రార్థిస్తూంటే –

అంతరిక్షం నుంచి కన్నులకు మిరుమిట్లు కొల్పుతూ కాంతివంతమైన ఒకవిమానం అక్కడికి వచ్చి దిగింది. దానిలోంచి స్త్రీలు దిగి – "మేము త్రిమూర్తులకు జనని అయిన ఆది శక్తికి పరిచారికలం. వారిప్పుడు ప్రధానత్వం గురించి కలహించి నియమిత కార్యాలు మానివేసి లోకాలకు పీడ కలిగిస్తున్నారని విని ఆదిశక్తి వారిని తనవద్దకు తీసుకురమ్మని యీ విమాన మిచ్చి మమ్మల్ని పంపింది. ఈ వార్త మీ భర్తలకు చెప్పండి" అన్నారు.

పార్వతి, లక్ష్మి, సరస్వతులు ఒకరిమొహం ఒకరు చూసుకుని – "ఓహో! ఇది చాలా విచిత్రంగా ఉంది. మన భర్తలకు తల్లి ఉందని ఎప్పుడూ వినలేదే! ఇలాటి పుత్రులను కన్న ఆ అమ్మ సామర్థ్యం స్తోత్రం చేయదగినదే. ఇది చాలా విచిత్రంగా ఉంది మరో శివుడూ వాళ్ళవద్దకు వచ్చి నమస్కరించి పోయారు. "వారెవరూ" అని అనేకకోటి బ్రహ్మాండాలలో వీరు ఒక బ్రహ్మాండాన్ని పాలిస్తున్నారట! ఆ దేవి వీరిని మందలించటానికి పిలుస్తూంది. ఈ సారి వీళ్ళు గర్వాలు వదులుతారు" అనుకున్నారు.

అప్పుడు హరిహరబ్రహ్మలు ముగ్గురూ విమానం దగ్గర కలుసుకుని – "మనమిప్పుడు చాలా ప్రమాదంలో పడ్డాం. ఆ కొండెగాడి మాటలు విని కలహించుకున్నాం. పోన్లెండి దీనివల్ల మనకొక విశేషం తెలుస్తోంది. మనకి తల్లి ఉన్నట్లే ఎరుగం. ఆమె ఎక్కడుందో తెలుసుకోడం అవసరమే" అనుకుంటూ వైరం మరచి స్నేహంగా ముగ్గురూ ఆ విమానం ఎక్కారు.

అది క్షణంలో అనేక సహస్రయోజనాలు ఊర్ధ్వలోకంలోకి పోయింది. అక్కడ మరో బ్రహ్మ, మరోవిష్ణువు, మరోశివుడూ వాళ్ళవద్దకు వచ్చి నమస్కరించి పోయారు.

"వారెవరూ" అని శక్తి దూతికలనడగ్గా – "అయ్యా! మనమిప్పుడు మీ బ్రహ్మాండం దాటి మరో బ్రహ్మాండంలోకి వచ్చాం. వారు దీనిని పాలించే త్రిమూర్తులు" అని చెప్పారు. అంతలో మరో బ్రహ్మాండం చేరింది విమానం. అక్కడ మరొక త్రిమూర్తులు వచ్చి వాళ్ళతో మాట్లాడి వెళ్ళారు.

అప్పుడువారు, "ఆహా! మనవే యీ లోకాలకెల్లా ప్రధానులమని గర్వపడి ఒకరినొకరం ఆక్షేపించుకున్నాం. ఇవన్నీ చూశాక మనం క్రిమికీటకాలకంటె అధములమని తోస్తూంది. మనలాటివారు కోటాను కోట్లమందున్నారు. మనగొప్పతన మేముంది?" అనుకుంటూంటే ఆ విమానం అత్యంత వేగంగా పోతూ బ్రహ్మవిష్ణుమహేశ్వరులు కాయల గుత్తుల్లా వాళ్ళకి కనపడసాగారు. తమలాటివారిని కోటానుకోట్లమందిని చూసేసరికి మతులు పోయి తమని తావే మరిచిపోయి పలవరించసాగారు.

ఆ విమానం శతకోటి బ్రహ్మండాలు దాటి ఆ మహాదేవి ఉన్న లోకానికి పోయింది. ఆ లోకం తేజంతో కళ్ళు మిరుమిట్లు కొల్పుతూంది. ఆ కాంతికి అశ్చర్యపోతూ త్రిమూర్తు లా మహాశక్తిని సిగ్గుపడుతూ ప్రార్థించారు. స్వాభిమానంవదలి సిగ్గుతో తలవంచుకున్న వారి పట్ల ఆ మహాశక్తి, కనికరించి, తేజం ఉపసంహరించుకుని నిజరూపం చూపింది.

అప్పుడు వా రామె పాదాలమీదపడి – "తల్లీ! అజ్ఞానంతో మేమే లోకప్రధానులమని గర్వించి లోకపీడ చేశాం. బుద్ధొచ్చింది. ఈ తప్పుసైరించు. తనయుల తప్పులను తల్లిలెక్కచేయ్యదుకదా. రక్షించు, రక్షించు –" అంటూ ప్రార్థించి – "మా కోపం వల్ల నీ పాదదర్శనం అయింది. ఇందుకు సంతోషిస్తున్నాం. మాకు యింతకాలం దర్శనమెందుక్విలేదో తెలియజెప్పవా?" అని వేడుకున్నారు.

అందుకు మహాదేవి, "బిడ్డలారా! మీవంటివారు కోటాను కోట్లమంది నా పాలనలో ఉన్నారు. అవసరం వొస్తే కాని నేనెవరికీ కనపడను. మీరిప్పుడు తగవులాడుకుని పనులు మానేశారని తెలిసి – మందలించడానికి రప్పించాను. మరెప్పుడూ యిలాటి పెడతోవలు పట్టకండి, వెళ్ళండి." అని అంతర్ధానమైంది.

త్రిమూర్తులు దేవీ ప్రభావాన్ని వెయ్యి విధాలుగా కొనియాడుతూ ఆమె ప్రసాదం వల్ల అధికప్రభావ సంపన్నులై త్రుటిలో తమనివాసాలకు చేరి, గర్వంవదిలి ఎప్పటిలా లోకపాలన చేయసాగారు.

"శంకరా! అలాటి ఆదిశక్తి ప్రభావం ఎరగక, నువ్వు శక్తిలేదన్నావు. నీ ప్రవృత్తి తెలిసిన దాన్ని కనుక నీకు బోధించాలని వచ్చాను. ఆ మహాశక్తిగా భావించి నన్ను పూజించు" అనగా శంకరుడు చాలా సంతోషించి, చేతులు జోడించి, "అంబా! నువ్వేలేవని వాదింపలేదు. శాక్తేయులు చేసే దురాచారాలనే ఖండించాను. ఇదే నానేరం. నువ్వు ఆత్మస్వరూపిణి వని తెలుసుకున్నాను. నన్ను కృతకృత్యుని చేశావు." అంటూ స్తోత్రం చేశాడు. ఆ దేవి అతనికి అనేక విద్యలను యిచ్చి అంతర్ధాన మయింది.

అప్పటినుంచీ శంకరుడు శక్తియందు భక్తివిశ్వాసాలు కలిగి భూమిమీద ప్రసిద్ధి చెందిన శ్రీశైలం మొదలైన ప్రదేశాలలో దశపీఠాలలో శక్తి స్థాపన చేసి కృతార్థుడయ్యాడు"

అని మణిసిద్ధుడు గోపాలుడికి చెప్పాడు. అప్పుడతను మరొకకథ కూడా చెప్పసాగాడు.

# ఈడిగి కాపుల కథ

శంకరాచార్యులు మండన మిశ్రుణ్ని జయించడానికి 'మాహిష్మతీ నగరానికి వెళ్ళి అక్కడ చీమ దూరడానికయినా వీలులేని అతని మందిరంలో ప్రవేశింపలేక చింతిస్తూ పురం బయట ఉద్యాన వనంలో తిరుగుతూ - "అయ్యో! మండనుడు యతులను రానివ్వకుండా తలుపులు మూసుకుని ఉన్నాడు. ఇంటి ప్రహారీ చాలా ఎత్తుగా ఉంది. లోపలికెలా వెళ్ళాలో తెలియడంలేదు" అనుకుంటూంటే -

దగ్గరలో ఒక యీడిగవాడు ఈతచెట్టు కెదురుగా నిలుచుని ఏదో అన్నాడు. అప్పుడా చెట్టు శిరస్సు నేలకి తగిలేలా వంగింది. అతను దానికి తగిలించి ఉన్న కుండలలోని కల్లుతీసుకుని మళ్ళీ కాళీకుండలని చెట్టుకి తగిలించి - ఏదో ఉచ్చరించాడు. అప్పుడా చెట్టు మళ్ళీ తిన్నగా నిలుచుంది. అక్కడున్న చెట్లన్నిటినుంచీ ఆ యీడిగవాడు అలాగే కల్లు గీయసాగాడు.

ఆ వింతచూసి శంకరాచార్యులు చాలా ఆశ్చర్యపోతూ - 'సృష్టిలో ఎన్ని విశేషాలయినా ఉన్నాయి. వీనివలన యీ విద్యగ్రహించానో నాకు మండనమిశ్రుడి యింటిలో ప్రవేశించడం సులభమౌతుంది' అనుకుని అతని వద్దకు వెళ్ళి అతని వివరాలతో పాటు, "నువ్వీవిద్య ఎవరివలన సంపాదించావు? నిన్ను చూస్తూంటే నాకెంతో సంతోషంగా ఉంది." అని అడిగాడు.

వాడు తనకాపరం మాహిష్మతీ పురమనీ, తనతండ్రి ఆవిద్య నేర్పాడనీ చెప్పాడు. "మేమిలా చేస్తున్నట్లు ఎవరూ గ్రహించలేరు. మీరే గ్రహించారు. అందువల్ల మీరు మహానుభావులని తెలుస్తూంది" అన్నాడు. "నీకీ విద్య వల్ల శ్రమతగ్గడం తప్ప మరేలాభమూ లేదు కదా. నాకీ విద్య నేర్పు. నేను నీకు బంగారం చేసే యోగం చెబుతాను. దానివల్ల నీకు చాలా లాభం ఉంటుంది."

"మహాత్మా! ఈవిద్యను పుత్రులకు కాక యితరులకు చెప్పకూడదని మా తండ్రి ప్రమాణం చేయించుకున్నాడు. ఈ విద్యని మీకిస్తే యిక మాకులం నిలవదు. మీరిచ్చే విద్య వల్ల కులవృత్తితో

పనిలేనంత భాగ్యం కలిగితే మీకీ విద్య యిస్తాను. లేకపోతే రెండింటికీ చెడిన రేవడినౌతాను. అదీకాక అంత విలువకల విద్యనిచ్చి అల్పవిద్యగ్రహించడం వల్ల మీకేం లాభం? ఆలోచించుకోండి" అన్నాడు వాడు.

"మాకు భాగ్యంతో పనిలేదు. వైరాగ్యంతో తిరుగుతూంటాం. లోకోపకారానికై పాటు పడతాం. నేనిచ్చే విద్యవల్ల నువ్వు నిత్యమూ కావలసినంత బంగారం చేసుకోవచ్చు. ఇక నీకీ నీచవృత్తితో పనే ఉండదు." అని శంకరు డనడంతో ఆ యీడిగవాడు అంగీకరించి శంకరుడికి తనవిద్య చెప్పాడు.

అప్పుడు శంకరుడు మండనుడి గృహానికి పోయి ప్రహరీ చుట్టూ తిరిగి గోడపక్కనున్న కొబ్బరిచెట్లను మంత్రించి అవి వంగాక వాటిపైనుంచి లోపలికి ప్రవేశించాడు.

ఆ యీడిగవాడు శంకరుడి ద్వారా సువర్ణ యోగ విద్యను గ్రహించి అనంతమైన బంగారాన్ని తయారుచేసి కాసులుగా మార్చి లోకంలో వ్యాపింపజేశాడు. వాటినే యీడిగ కాసు లంటారు. శంకరాచార్యులుకి మండనుని ప్రహరి దాటడం శక్యంకాలేదని చెప్పడం హాస్యాస్పదమే. కాని.....అల్పులవద్ద నుంచయినా విద్యావిశేషం గ్రహించాలని చెప్పడానికే వారు అలా చేసి ఉంటారు.

నాస్తికులతో వాదించేటప్పుడు, వారు దైవం కలడని నిదర్శనం చూపమంటే సహస్రస్థంభ మంటపంలో నిలుచుని స్థంభాలకు తగలకుండా తాడిచెట్టును గిరగిర తిప్పడం......మరోచోట కాచిన సీసాన్ని పాలలా త్రాగడం.....కొండమీంచి చెక్కుచెదరకుండా దూకడం వంటి అద్భుత కృత్యాలు చేశాడు.

ఈ విధంగా భూమ్మీద దుర్మతాలన్నిటినీ ఖండించి ప్రజలందరినీ సన్మార్గంలో పెట్టిన శ్రీశంకరాచార్యులు ముప్పయి రెండేళ్ళు పూర్తవడంతోనే అద్వైత తత్వబోధం చెయ్యడానికి శిష్యులను నియమించి.... మళ్ళీ వెండికొండకు వెళ్ళిపోయాడు."

అని మణిసిద్ధుడు గోపాలుడికి శ్రీశంకరుల చరిత్ర చెప్పాడు. గోపాలుడు అద్వైత జ్ఞాన సాధన చేయాలనుకున్నాడు.

# కాశీ మజిలీ కథలు

## ఉత్తర ఖండానుబంధం

## కాదంబరి - శూద్రక మహారాజు కథ

కృతయుగంలో - సారవేత్రవతీ నదీ తీరంలో ... విదిశ అనే పట్నాన్ని రాజధానిగా చేసుకుని శూద్రకుడనే రాజు - మరో అర్జునుడిలా భూమండలాన్నంతా ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించేవాడు. అతను సర్వశాస్త్రాలకీ, కళలకీ నిలయంగా, రసికులుకీ, విలుకాండ్రకీ ఆశ్రయంగా పేరుపొందాడు.

శూద్రకుడు చాలా అందమైనవాడు. సుందరీమణుల సంగీత నృత్యాలతో, శాస్త్ర చర్చలతో, చిత్రరచనతో, పెంపుడు జంతువులతో కాలంగడుపుతూ, రాజ్యపాలనలో మునిగితేలుతూ - స్త్రీని తేలికగా చూస్తూ, సంతానం కోసమయినా పెళ్ళి చేసుకోమని మంత్రు లెంత చెప్పినా వినకుండా యౌవనమంతా అవివాహితుడిగానే గడిపాడు, ఒకరోజు ఆ రాజు సభచేస్తూంటే - భయంకరమైన వేషంలో ఒక దూతవచ్చి రాజుకి మొక్కి - "దేవా! దక్షిణ దేశం నుంచి మాతంగ కన్య ఒకతె పంజరంలో చిలకను తీసుకు వచ్చింది. ఆమె అందం యింత అని చెప్పడానికి వీల్లేదు. అంత చక్కనిది.

ఆమె మీకు - 'భూమిమీద కల అత్యంత శ్రేష్టమయిన వస్తువు మీవద్దనే ఉండాలి. ఈ పక్షి అత్యంత ఆశ్చర్యకరమైనది. దీనిని మీ పాదాల వద్ద చేర్చాలని వచ్చాను. మీ దర్శన భాగ్యం అనుగ్రహించండి' అని విన్నపం చేసి - ద్వారం వద్ద ఎదురుచూస్తోంది" అంది.

ఆ మాటలు రాజులో కుతూహలం రేకెత్తించాయి. ఆమెను తక్షణం ప్రవేశపెట్టమన్నాడు.

ఆ దూత వెళ్ళి - ఆమెను తీసుకు వచ్చింది.

ముసలితనం వల్ల తలపండినా....శ్రమించి జీవనం చేస్తూండడం వలన శరీరం బింకంగానే ఉన్న ఒక వృద్ధ మాతంగుడు తెల్లని వస్త్రాలు ధరించి ముందు నడుస్తూండగా, ఒక బోయ పిల్లవాడు చిలుక పంజరం పట్టుకుని తోడురాగా...మోకాళ్ళ వరకూ మేలి ముసుగు వేసుకున్నా, ఇంద్రనీలంలా ప్రకాశిస్తున్న" శరీరంతో, అపరమోహినీ దేవిలా వచ్చిందా మాతంగకన్య.

రాజు ఆమెనుచూసి – 'అయ్యో ఇంత సౌందర్యాన్ని సరయిన చోటున కాక మరొకచోట ఎందుకు సృష్టించాడు బ్రహ్మ? ఈ అందగత్తెను నీచకులంలో ఎందుకు పుట్టించాడు? ఇంతమనోహరమైన ఆకారం కలిగినా ... బోయజాతిలో జన్మించిన యీామె ... రాక్షస సంపదలా, ముట్టుకుందుకూ అనుభవించేందుకూ అనర్హమౌతూందే' అని మనసులో విచారించాడు. రాజు అలా ఆలోచిస్తూండగా –

ఆ మాతంగకన్య అతని దగ్గరకు వచ్చి కొంచెం వంగి నమస్కరించింది. ఆ వృద్ధ మాతంగుడు పంజరంలోని చిలకను చేతితో సవరించి రాజుకి చూబిస్తూ... "దేవా! ఈ చిలుకకి సకలశాస్త్రాలూ తెలుసు. రాజనీతి, పురాణాలలో జ్ఞానముంది. ఇది గ్రంథాలు చదవడమేకాక స్వయంగా రచించగలదు. వీణ, వేణువు మొదలైన వాద్యాల సంగీతా న్నిది నిగ్గుతేల్చగలదు. చిత్రరచన, జూదం, గజ, తురగ, స్త్రీ లక్షణ జ్ఞానం – దీనికి మెండుగా ఉన్నాయి. ప్రణయ కలహంతో ఉన్నవారిని దగ్గరచేర్చగలదు. వెయ్యి మాటలెందుకు? దీనికి తెలియనివి లేవు. ఈ చిలుకపేరు వైశంపాయనం. రత్నాలకు సముద్రమే ఆలవాలం. ఇది మీవద్దనే ఉండదగినదని తీసుకువచ్చాం. దయతో స్వీకరించండి." అని పంజరాన్ని రాజు పాదాల ముందుంచాడు.

అప్పుడు ... ఆ చిలుక, రాజు కెదురుగా నిలబడి – కుడికాలు ఎత్తి, – అతిస్పష్టమయిన ఉచ్చారణతో ఒక పద్యం చదివింది. ఆ చిలక పలుకులకు రాజు ఆశ్చర్యం, ఆనందం పొంది వృద్ధ మంత్రిని చూసి – "ఈ చిలక పలుకులెంత స్పష్టంగా, మధురంగా ఉన్నాయో చూశారా? స్వరాలు సుస్పష్టంగా ఉండడం ఒక చిత్రమైతే, సందర్భానుసారంగా – చక్కగా పద్యం చదవడం మరింత అద్భుతం!" అన్నాడు.

కుమారపాలితు డను ఆ మంత్రి నవ్వుతూ - "దేవా! ఇదీ చిత్రమే? చిలుకలు, కోకిలలు వంటి కొన్ని జాతుల పక్షులు - మనుషులు నేర్పినట్లు మాట్లాడడం మీకు తెలిసిందే కదా! పూర్వం - చిలకలు కూడా మనుషుల్లాగే మాట్లాడేవి. అగ్నిదేవుడి శాపం వల్ల వాటి మాటలు అస్పష్టాలయ్యాయి" అన్నాడు. అత నలా అంటూండగానే - మధ్యాహ్న మైందన్న సూచనగా శంఖనాదం వినిపించింది.

రాజు సింహాసనం నుంచి లేచిపోయాడు. సభ్యులు వెళ్ళిపోడాని కనుమతి యిచ్చి లోపలికి తీసుకుపోయి ఆ మాతంగకన్యతో - "మేము వచ్చేదాకా ఇక్కడే ఉండు." అని చెప్పి చిలుకకు స్నానపాన భోజనాల ఏర్పాటు చేయమని తాను తన మందిరానికి వెళ్ళాడు. నిత్య క్రియా కలాపాల అనంతరం - భోజనం చేశాక - విశ్రమ మంటపంలో శయ్యమీద కూర్చుని తాంబూలం సేవిస్తూ అప్తులు వినోదకథలు చెబుతూండగా వైశంపాయనమును తీసుకురమ్మని దూత నాజ్ఞాపించాడు. అది వెళ్ళి - చిలక పంజరాన్ని తెచ్చి అతని ముందుంచింది. అప్పుడు రాజు దానిని చూస్తూ -

"పక్షిరాజా! భోజనం నచ్చిందా?" అని అడిగాడు.

"దేవా! చక్కని జంబూ ఫలాలు తిన్నాను. అతి చక్కని గింజలు తిన్నాను. ద్రాక్షపళ్ళ మాధుర్యం ఈ జన్మలో మరచిపోలేను. ఉసిరికాయల పస చెప్పశక్యం కాదు. మీ వారు నాకందించినవన్నీ అమృతంలాగే ఉన్నాయి" అం దా చిలుక ఎంతగానో పొగుడుతూ.

"సరే. అదలా ఉంచు. నువ్వెక్కడ పుట్టావు? నీ తల్లి తండ్రు లెవరు? నీకు వేదశాస్త్రాలూ, ఇతర విద్యా విశేషాలూ ఎలా వచ్చాయి? పూర్వ జన్మ సుకృతమా? లేక వరప్రభావమా? లేక... చిలక రూపంలో తిరుగుతున్న ఎవరో దివ్యుడివా? నీ వయ సెంత? ఇంతకు ముందు ఎక్కడుండేదానివి? నువ్వీ పంజరంలో ఎందుకు చిక్కుకున్నావు? మాతంగ కన్య చేతిలో ఎందుకు పడ్డావు? నీవృత్తాంతం తెలిసికోవాలని చాలా కుతూహలంగా ఉంది. చెబుతావా?" అని అడిగాడు రాజు.

చిలుక ఒకసారి కళ్ళు మూసుకుని మనసులో కొంచెంసేపు ధ్యానించుకుంది. తరవాత అది తనకథ చెప్పసాగింది.

# చిలుక కథ

"దేవా! నా కథ చాలా పెద్దది. మీరు ఉత్సాహంగా ఉన్నారని చెబుతున్నాను.

వింధ్యారణ్యంలో - దండకారణ్యముంది. అక్కడ ప్రసిద్ధి చెందిన పంచవటీ తీరానికి దగ్గరలో పంపాసరోవరం. దాని ఎడమ భాగంలో - ఏడు తాడిచెట్ల పక్కగా ఒక బూరుగు వృక్ష ముండేది. అది చాలా ముసలిచెట్టు. దాని మొదలు చాలా పెద్దది. దానికొమ్మ లెంతో విశాలంగా వ్యాపించి దాని చివరలు మేఘాలకంటే పైకి పోయి ... అది చాలా ప్రసిద్ధి చెందింది. పర్వతాలలో మేరు పర్వతమంత గొప్పదా వృక్షం.

ఆ వృక్షాన్నెవరూ ఎక్కలేరని, తమ కపాయం రాదని, దేశదేశాలనుంచీ చిలకల గుంపులు అక్కడికి వచ్చి ఆ పెద్ద వృక్షం మీద గూళ్ళు కట్టుకుని నివసించేవి. ఆ చెట్టు తొర్రలలో ఒక దానిలో మా తండ్రి కూడా ఒక గూడు కట్టుకుని భార్యతో సుఖంగా జీవించేవాడు. అతని ముసలితనంలో - విధివశాత్తూ నేను జన్మించాను. నేను పుట్టిన క్షణమే నా తల్లి - ప్రసవరోగంతో కన్నుమూసింది.

భార్యపోయిన విచారంలో ఉన్నా, ఆ దుఃఖాన్ని దిగమింగుకుని, - నా తండ్రి నాకే కొరతా రానివ్వకుండా ఎంతో ప్రేమగా పెంచసాగాడు. అతను చాలా ముసిలి వాడై పోవడం వల్ల, కృశించిన రెక్కలతో ఎగరలేక ఎగరలేక ఎగురుతూ వణుకుతూ బలహీనమైన ముక్కుతో, కిందపడిన పళ్ళనూ, గింజలనూ ఏరితెచ్చి, నాకిచ్చి, నేను తినగా మిగిలినవి తాను తింటూ, సగం కడుపునింపుకుంటూ కాలం గడపసాగాడు. ఇలా ఉండగా

ఒకనాడు, సూర్యోదయానికి కొంచెం ముందుగా, కొన్ని చిలుకలు మేతకి వెళ్ళగా.. కొన్ని చిలుకలు పిల్లలతో గూళ్ళలో ఉండగా.. అడవి నిశ్శబ్దంగా ఉంది. నన్ను నా తండ్రి రెక్కల్లో పెట్టుకుని ముద్దాడుతున్నాడు. నాకింకా రెక్కలు రాలేదు కనుక నాకతని రెక్కలలో యిమడడం ఆనందంగా ఉంది. అలాటి సమయంలో ... హఠాత్తుగా ...గుహలలో ఉన్న సింహాలు కూడా దద్దరిల్లేలా, పులులూ మొదలయిన

క్రూర మృగాలు భయంతో పరిగెత్తేలా ...గంగా ప్రవాహధ్వనిలా ... 'ఇలారండి ఇక్కడ ఏనుగు లుంటాయి ఇటురండి, యిక్కడ చమరీమృగా లుంటాయి అక్కడ లేళ్ళుంటాయి ... వేటకుక్కలని వదలండి. బాణాలు సిద్ధం చేయండి ... కొట్టండి. పట్టండి..' అంటూ వేటగాళ్ళ అరుపులు వినిపించాయి.

చిన్నవాడినయిన నేను, చెవులు బద్దలయ్యే ఆ ధ్వనులకు భయపడుతూ, వొణుకుతూ, మా తండ్రి రెక్కలలో మరింతగా ఒదిగిపోయాను. అరణ్యమంతా భయంతో పరుగెడుతూ క్రూర జంతువులు అరుస్తున్న అరుపులతో అల్లకల్లోలమై పోయింది. కొంతసేపటికి మళ్ళీ నిశ్శబ్దమైపోయింది. అదేమిటో అని నేను చిన్నతనం కొద్దీ మా తండ్రి రెక్కల సందునుంచి బయటకొచ్చి, మెడజాపి – ఆ అలజడి వచ్చిన వేపు చూశాను.

ఎందరో బోయవాళ్ళు సైన్యంలా నా ఎదురుగా వస్తూ కనిపించారు. వారి శరీరపు నలుపుకి పరిసరాలే నల్లగా అయిపోతున్నాయి. ఎర్రనికళ్ళు, విశాలమైన వక్షస్సు, పూసలదండలతో అలంకరించ బడిన మెడలు, – వీటితో చాలా ధృడంగా ఉన్నారు. వారిలో మోహినీదేవి తమ్ముడనిపించేంత అందంగాఉన్న వానిని చూశాను. అతని పేరు మాతంగుడని – వారిమాటల నుంచి గ్రహించాను.

అతను యౌవనంలో ఉన్నాడు. అతన్ని చూసేసరికి – 'ఇతని జీవితం మోహం. చరిత్ర – సాధుజనులు మెచ్చనిది. ఆహారం – మాంసం. మద్యపానం చేయడమే పండగ, దినచర్య జీవహింస. చెరపట్టిన ఉత్తమ స్త్రీలే భార్యలు. సహవాసానికి మృగాలు. పశురక్తంతో దేవతార్చన. మాంసంతో బలికర్మ. ఇతనికి శాంతి పేరయినా తెలియదు. క్షమకి కడుదూరం. ఇలాటివాడికి కరు ణెలా కలుగుతుంది? వివేక మెప్పటికేనా జనిస్తుందా?' అని నాలో ఆలోచనలు కలిగాయి. అంతలో అతను ఆయాసం తీర్చుకుందుకా బూరుగుచెట్టు నీడకొచ్చి అనుచరులమర్చిన ఆకుల ఆసనంమీద కూర్చున్నాడు. ఒక శబరుడు దగ్గరలోని చెరువు వద్దకు వెళ్ళి – తామరాకుతో నీరు, తామరతూళ్ళు తెచ్చి అందించాడు.

మాతంగుడు వాటిని స్వీకరించి కొంతసేపు విశ్రమించాక ఎక్కడికో వెళ్ళిపోయాడు.

వారందరూ వెళ్ళినా ... ఒక వృద్ధుడు మాత్రం మాంసం దొరక్క ఆకలితో ఆ చెట్టు మొదలునే కూర్చుని - కొంచెంసేపయ్యాక - ఎర్రని కళ్ళెత్తి ఆ చెట్టుపైకి చూసి దాని నెక్కడానికి నిశ్చయించుకున్నట్లు కనిపించాడు. ఆ బోయ చూపులతోటే - చిలక పిల్లల ప్రాణాలప్పటితో సరి అని తేలిపోయింది. దయలేనివారికి చేయరాని పనేముంటుంది?

అతను నిచ్చెన మెట్లెక్కినట్లే చెట్టెక్కి - ఎగిరీ ఎగరలేని పిల్లలను, ఎగరలేని వాటినీ, రెక్కలు రాని వాటినీ, - చెట్టునుంచి పూలు కోసినట్లందుకుని, ప్రాణాలు తీసి, కిందకు పడెయ్యసాగాడు. మాతండ్రి - రానున్న ప్రమాదం గ్రహించి, నన్నెలా కాపాడాలో తెలియక, రెక్కల సందులో నన్ను యిముడ్చుకున్నాడు.

ఆ పాపాత్ముడు మేమున్న కొమ్మమీద కెక్కి మాతొర్రలోకి తన దండాన్ని తోసి, మా తండ్రిని గట్టిగా పట్టి, పైకి తీసి, పీక నులిమి, ప్రాణాలు తీసి, నేలమీద పడేశాడు. రెక్కల సందులో ఉన్ననన్ను తను చూడలేదు. నేను మా తండ్రితో నేలమీద పడ్డాను. కాని ఆకుల పోగుమీద పడడం వల్ల నాకు కొంచెమైనా దెబ్బ తగల్లేదు. ఆ కిరాతకుడు చెట్టు దిగేలోగానే, చిన్న పిల్లవాడినవడం వల్ల తండ్రి చావుని పట్టించుకోక, రెక్కలు విదిలించుకుంటూ మెల్లమెల్లగా ఎగురుతూ - దగ్గరలో ఉన్న తామలపాకు లతనుచేరి, దట్టమైన దాని ఆకుల నడుమ నక్కి ఆ రంగులో కలసిపోయాను.

ఆ కిరాతుడు మా చెట్టుమీదుండే పక్షులన్నిటినీ చంపి పట్టుకు పోయాడు. ఆకుకదిలినా వాడే ఏమో అని భయపడుతూ, తండ్రి చనిపోయిన దుఃఖంలో విచారిస్తూ - చాలాదాహం వేస్తుండడంతో, నీళ్ళుండే తావుకి మెల్లగా ఎగరసాగాను. రెక్కలతో ఎగరలేక, పాదాలతో నడుస్తూ, పడుతూ, లేస్తూ - 'ఆహా! ఎలాటి అవస్థలో అయినా ప్రాణులకు జీవితంమీద వైరాగ్యం కలుగదు కదా! ప్రాణం కంటె ప్రియమైనది మరేమీ ఉండదేమో. నేనంటే ప్రాణంపెట్టే తండ్రి చనిపోయినా నాకు జీవితాశ

వదలడంలేదంటే నా హృదయం ఎంత కఠినమైనదో! నా తల్లి పోయింది మొదలు అతను నన్నెంత కష్టపడి పెంచాడు! అతని ప్రేమంతటినీ గడియలో మరచిపోయాను.

అటు తండ్రి చనిపోయినా, ఇటు – దాహం నన్ను బాధిస్తూంది! అబ్బ! ఎంత ఎండగా ఉంది! తాళలేక పోతున్నాను. కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. విధి ఎంత కఠినం! నాకు మరణమైనా ప్రసాదించదే...' అనుకుంటూ చచ్చీచెడీ నీళ్ళకోసం పోతున్నాను.

ఆ ప్రాంతంలోనే జాబాలి అనే మహర్షి ఆశ్రమ ముంది. అతనికొడుకు హరీతకుడు. అతను సకల విద్యా పారంగతుడు. తన సాటివారితో పంపా సరస్సుకి స్నానానికి వెళ్తూ – దాహంతో నోరు తెరుచుకుని వొగరుస్తూ పడున్న నన్నతను చూశాడు. సత్పురుషుల హృదయాలు కరుణామయాలు కదా. అతను తన మిత్రుడితో – "మిత్రమా! అటు చూడు. ఆ చిలుకపిల్ల తలవాల్చేసింది. దాహంతో కాబోలు గొంతుతెరచుకుని ఉంది. దాని ప్రాణాలు కాపాడితే ఎంతోపుణ్యమొస్తుంది" అంటూ నన్ను తన మృదువైన చేతులతో తీసి పట్టుకుని....దండకమండలాలు సవరించుకుని....ఎక్కడివో జల బిందువులు కొన్నిటిని నా నోట్లో పోశాడు.

అప్పటికి నా దాహం కొంత తీరింది. శరీరంలోని తాపం తగ్గింది. ఒంట్లోకి శక్తి వచ్చింది. అతను నన్నొక చెట్టు నీడలో ఉంచి స్నానం, నిత్యక్రియలు నిర్వర్తించుకుని.. నీటిలో నుంచి బయటకువచ్చి, నన్నొక చేతితో పట్టుకుని ఆశ్రమానికి తీసుకువెళ్ళాడు.

అక్కడ జాబాలి మహర్షి నిష్ఠలో ఉన్నాడు. అతన్ని చూసి – 'ఆహా! ఈ ముని ఆకారం శాంతంగా ఉన్నా మెరుపుతీగెలా ఎలా మెరిసిపోతోంది! వీరి ముఖం చూస్తేనే చాలు ఎలాటి పాపాలయినా మాసిపోతాయి. సకలవిద్యలూ వీరి వదనంలో తాండవ మాడుతున్నాయి. ముసలితనాని కెంత ధైర్యం! ఈ మహానుభావుడి జటాజూటం కూడా తెలుపుచేసేసింది. ఇలాటి మహాత్ముల దర్శనం కలిగినా, వారి పేరు పలికినా ఎంత సుకృతం వస్తుందో వీరి తపోమహిమ చేతనే యిక్కడ

మృగములు జాతివైరం మరచి సంచరిస్తున్నాయి" అని నేను వారి గొప్పతనాన్ని మనసులో ప్రశంసిస్తూంటే –

నన్ను హారీతకుడు ఒక చెట్టు మొదలులో ఉంచి – తండ్రికి నమస్కరించి ఒక మూల కూర్చున్నాడు. అప్పుడక్కడి మునులు నన్ను చూసి – "దీనినెక్కడి నుంచి తెచ్చావు? అని అతని నడిగారు. అతను – "స్నానానికి పంపాసరస్సుకి వెళ్తూంటే ఎండవేడికి నోరు తెరుచుకుని వొగర్చుతూ నాకీ చిలక పిల్ల కనిపించింది. దానిమీద దయకలిగి సరస్సుకి తీసుకుపోయి నీరు తాగించి అదిసేదతీరాక యిక్కడికి తీసుకొచ్చాను. రెక్కలొచ్చేవరకూ యిక్కడొక తొర్రలో ఉంచి, నేనూ తక్కిన ముని కుమారులూ దీనిని పోషిస్తాం. రెక్కలు రాగానే దా నిష్టమొచ్చిన చోటుకి ఎగిరిపోతుంది. ఇది నా అభిప్రాయం" అన్నాడు.

జాబాలి కొంచెం కుతూహలంగా, నన్ను పవిత్రం చేసేవాడిలా చూసి, తలూపుతూ, అంతలోనే మళ్ళీ ఆలోచిస్తూ..."తాను చేసుకున్న అవినయానికి ఫలం అనుభవిస్తున్నాడు" అన్నాడు. తన తపఃప్రభావం వల్ల దివ్యదృష్టితో త్రికాలాలనూ చూడగలిగిన ఆ మహానుభావుడే అలా అనేసరికి మునులు ఆశ్చర్యపడి –

"మహాత్మా! ఇది పూర్వజన్మంలో ఎవరు? ఏం చేయడం వల్ల యీ జన్మెత్తింది? దీనిపేరేమిటి? – వినాలని మాకు ఉత్సాహంగా ఉంది" అన్నారు.

"మునులారా! దీని చరిత్రం చాలా వింతయింది. మనకి స్నానసమయమైంది. నిత్యానుష్ఠానాలు తీర్చుకుని – ఫలహారం చేసి రండి. రాత్రి సావకాశంగా చెబుతాను." అన్నాడు జాబాలి.

వా రాయన వద్ద శలవు తీసుకుని వెళ్ళారు. ఆ రాత్రి – వెన్నెలలో ...చల్లగాలులు వీస్తూండగా...జాబాలి రెండో పరమేశ్వరుడిలా ప్రకాశిస్తూ, మునులు చుట్టూ కూర్చుని ఉండగా, జలపాదు డనే శిష్యుడు నన్ను వారి ముందుకు తీసుకెళ్ళి ... వారికి నమస్కరించాడు. "వీరందరూ యీ చిలక వృత్తాంతం వినడానికి చాలా కుతూహలపడుతున్నారు" అన్నాడు అప్పుడు జాబాలి ఇలా చెప్పసాగాడు.

# తారాపీడుని కథ

ఉజ్జయిని అనే నగర ముంది. చక్కని మేడలతో అందంగా ఉండే దానికి రాజు తారా పీడుడు అతను చాలాధర్మంగా పరిపాలిస్తూ ఎంతోకీర్తి సంపాదించుకున్నాడు. అతని వద్ద శుకనాశుడు అనే మంత్రి ఉండేవాడు. అతను సకల కళానిపుణుడు. బ్రాహ్మణుడైనా క్షత్రియ విద్యలలో కూడా ఆరితేరిన వాడు.

ఆ రాజు గారి పట్టమహిషి విలాసవతి. రాజు చంద్రుడు, ఆమె వెన్నెల - అన్నట్లుండేవారు. ఆమె అంటే రాజు కెంతో ప్రీతి. తారాపీడుడు భూమండలమంతా జయించాడు. యౌవనంలో అతను అన్ని సుఖాలూ అనుభవించాడు.

ఒకనా దతను విలాసవతి భవనానికి వెళ్ళాడు. అప్పటికామె ఎంతో చింతిస్తూ.. దీనమైన ముఖంతో మౌనంగా కూర్చుని, కన్నీళ్ళు మాటి మాటికీ తుడుచుకుంటూంది. దాసీలు చుట్టూ కూర్చుండగా - విచారంలో మునిగి ఉంది. భర్తరాక తెలుసుకుని - ఆహ్వానించింది.

రాజు ఆమెను తొడపై కూర్చోబెట్టుకుని - కన్నీళ్ళు తుడుస్తూ - "దేవీ! ఎందుకిలా విచారిస్తున్నావ్? అలంకరణ కూడా చేసుకోలేదు. ఎందుకు నీ కీవిరక్తి? నేను నీకేదయినా యిష్టం లేని పని చేశానా? చెప్పు, రాజ్యమూ, నా జీవితమూ నీ అధీనమే. నీ విచారానికి కారణం వేగంగా చెప్పు" అని బతిమాలాడు.

రాణీగారి దాసి మెల్లగా రాజుతో యిలా చెప్పింది. "దేవిగారికి ఏ కొరతాలేదు. మహారాజు గారితో సంగమము వ్యర్థమూ విఫలమూ ఔతూందని దేవి చింతిస్తూ ఉండగానే చాలాకాలం గతించి పోయింది. ఇవాళ శివరాత్రి. శివుడి నారాధించడానికి దేవాలయానికి వెళ్ళారు. అక్కడొకచోట మహాభారతం చదువుతూంటే కొంతసేపు కూర్చుని విన్నారు. సుతులు లేనివారికి గతులు లేవనీ, పున్నామ నరకమును పుత్రులు కాని తప్పించలేరనీ చెప్పడం విని - ఇంటికి వచ్చింది మొదలు ఆ విషయమే

తలుచుకుంటూ మేమెంత బతిమాలినా భోజనం చేయక, మాట్లాడకుండా ... యిలా దుఃఖిస్తున్నారు. ఇదీ విషయం."

దాసి మకరిక చెప్పిన విషయం విని రాజు ఏదో ఆలోచిస్తూ ఒక నిట్టూర్పు విడిచి – "దేవీ! ఊరుకో. దైవం చేయవలసిన దాని గురించి మనమేం చెయ్యగలం? దేవతలకి మనమీద దయలేకపోయింది. కిందటి జన్మలో పుణ్యం చేయలేదు. ఇకమీదట మనుషులు చేయగలిగిన మంచి పనులన్నీ చేద్దాం. గురుభక్తి, దేవీపూజలు, మునిజన సపర్యలు చక్కగా చెయ్యి. వారెలాటి వరాలయినా ఇవ్వగలరు. దశరథుడు - విభండకనందనుడి నారాధించే కదా రామలక్ష్మణభరతశతృఘ్నులను – వృద్ధుడయినా సరే పొందగలిగాడు? మునులను సేవిస్తే ఊరికే పోదు.

నీకు చెప్పుకోలేక పోయాను తప్ప రాత్రింపగళ్ళు నన్ను మాత్రం సంతాన లేమి బాధ పెట్టడం లేదూ? రాజ్యం, జన్మ వ్యర్థమనిపిస్తాయి. బ్రహ్మగారి అనుగ్రహంలేదు మనకి. దుఃఖం మాను. ధైర్యం తెచ్చుకో. బుద్ధిని ధర్మకార్యాల యందు నిమగ్నం చెయ్యి" అంటూ మృదువుగా ఆమెను ఓదార్చి అతను తన నివాసానికి వెళ్ళిపోయాడు.

అప్పటినుంచి అమె దేవతారాధనలూ, బ్రాహ్మణపూజలూ మొదలైనవాటిని చేస్తూ, పుత్రులు కలుగుతారని ఎవరు ఏ వ్రతం చెప్పినా వెంటనే చేసేది. ఆ వ్రతం ఎంత కష్టమైనా, ఎలాటి నియమాలున్నా నిష్ఠగా చేసేది. స్నానాలు, దానాలు చేయసాగేది. ప్రశ్నలు చెప్పేవారి నడిగేది. సంతాన ప్రాప్తికోసం వృద్ధులు చెప్పిన రహస్య క్రియలు చేసేది. తనకి వచ్చే కలల ఫలితాలను అడిగి తెలుసుకునేది. ఆమె అలా చేస్తుండగా -

ఒకనాడు తెల్లవారు జామున తారాపీడునకు ఒక కల వచ్చింది. ఆ కలలో చంద్రుడు విలాసవతిలో ప్రవేశిస్తున్నట్లు చూశాడు. సంతోషం పట్టలేక – అప్పటికప్పుడే శుకనాశుడిని రప్పించి ఆ వృత్తాంతం చెప్పాడు.

మంత్రి చాలా సంతోషిస్తూ – "దేవా! తొందరలోనే మన ప్రజల కోరిక తీరగలదు. కొద్ది కాలంలోనే మీరు పుత్రుడి ముఖం చూస్తారు. నా ధర్మపత్ని మనోరమ యందు, దివ్య వస్త్రాలలో ఉన్న ఒక

బ్రాహ్మణుడు వెయ్యి రేకుల పద్మాన్ని ఉంచినట్లు నాకూ నిన్నరాత్రే కలవచ్చింది. ఇవి శుభశకునాలు. సంతానం సత్వరమే కలుగుతుంది –" అన్నాడు. రాజు అతని చెయ్యి పట్టుకుని అంతఃపురానికి తీసుకువెళ్ళి – యిద్దరి స్వప్నాలూ విలాసవతికి చెప్పి ఎంతో సంతోషం కలిగించాడు.

కొన్నిరోజులలోనే విలాసవతి గర్భం దాల్చింది. కులవర్ధన అనే దాసి – శుకనాశుడితో ముచ్చటిస్తున్న రాజు చెవిలో ఆ శుభవార్త వేసింది. అది వినడమే తడవుగా అతని శరీరం పులకరించింది. ముఖం సంతోషంతో నిండిపోయి వెలిగిపోతూంటే –

"మనకు వచ్చిన కలలు నిజమయ్యాయా? చెప్పండి. నా మనసు ఆత్రతగా ఉంది –" అన్నాడు మంత్రి. రాజు – దాదిచెప్పిన వార్త అతనికి వెల్లడించాడు. ఇద్దరూ చాలా ఆనందంగా అంతఃపురానికి బయలు దేరారు. ఆ వార్తనిజమే అని ధ్రువం చేసుకున్నాడు.

కాలక్రమంలో రాజుగారి భార్య శుభదినాన అందమైన బాలుడిని ప్రసవించింది. అంతఃపురంలో హడావిడి అంతాయింతా కాదు. మంగళగీతాలు, తూర్యనాదాలు. ఒకటేమిటి? ఎన్నెన్నో. ఆ నగరంలోనేకాక దేశం మొత్తం మీదే ఉత్సవం చేసుకున్నారు ప్రజలు.

తారాపీడుడు మంత్రితో కలసి – కొడుకును చూడడానికి ప్రసూతి మందిరానికి వెళ్ళి మొదట నీటినీ తరవాత అగ్నినీ ముట్టుకుని – విలాసవతి పక్కలో దీపంలా ప్రకాశిస్తున్న పిల్లవాడిని – కళ్ళతో తాగేస్తున్నట్లుగానే చూసి – తనని సార్ధకుడిగా భావించుకుని సంతోషించాడు.

అప్పుడు శుకనాశుడు ఆ బాలుడి అవయవాలన్నీ నిశితంగా గమనించి – "దేవా! చూడండి గర్భపీడనం వల్ల అవయవాలు స్ఫుటంకాకపోయినా – చక్రవర్తి చిహ్నాలు కనపడుతూనే ఉన్నాయి" అంటూ ఆ చిహ్నాలని వర్ణించసాగాడు.

అంతలో అక్కడికి ఒక పురుషుడు వేగంగా వచ్చి – రాజుకి మొక్కి – "దేవా! విజయు మగుగాక. మంత్రిగారైన శుకనాశునికి

పరశురాముడిలాటి పుత్రుణ్ని యిప్పుడే వారి భార్య మనోరమ ప్రసవించింది–" అని చెప్పాడు. ఆ వార్తకు రాజు చాలా సంతోషించి – "మిత్రమా! శుకనాసా! కళ్యాణ పరంపర" అంటూ ఆ వార్త తెచ్చినవానికి అపరిమితమైన పారితోషికమిచ్చి – మంత్రితో కలసి తాను కూడా వారి యింటికి వెళ్ళి ఆ బాలుణ్ని కన్నులారా చూశాడు.

స్వప్నంలో చంద్రుడు కనిపించాడు కనక రాజు తన కొడుక్కి చంద్రాపీడుడని పేరు పెట్టగా, శుకనాసనుడు తన కొడుక్కి వైశంపాయనుడని నామకరణం చేశాడు.

పిల్లలకు వయసు వచ్చాక – ఆ నగరానికి దగ్గరలో మనోహరమయిన విద్యామందిరం కట్టించి సకల విద్యా పారంగతులయిన ఉపాధ్యాయులను అనేక మందిని నియమించాడు. చంద్రాపీడుడితోపాటు వైశంపాయనుడు కూడా విద్యను అభ్యసించసాగాడు.

పదవాక్య ప్రమాణాలు, శబ్దశాస్త్రం, అర్ధశాస్త్రం, అభినయశాస్త్రం మొదలయిన వానిలోనూ గజ, తురగాల పరీక్షలో, రత్న పరీక్షలో, తంత్రంలో, కావ్యనాటకాలలో, అన్ని లిపులలో, సర్వభాషలలో, గ్రంథరచన, శిల్పం మొదలయిన అన్ని కళలలో, శృంగారరసం, అలంకారాలలో వారికి అద్భుతమైన పాండిత్యం అలవడింది.

రాజపుత్రుడికి చిన్నతనంలోనే అందరూ ఆశ్చర్యపోయేలా అపరిమితమైన బలం ఉండేది. ఎదురు పడిన ఏనుగుని అతను చెవులు పట్టుకు వంచినా, సింహాలని చేతితో పట్టినా – అవి కదలలేక నిలబడిపోయేవి. తాడిచెట్టును ఒక్కవేటుతో నరికేవాడు. బాణంవేశాడో పర్వతమైనా చిల్లుపడవలసిందే. పదిమంది మోయలేని ఇనుప దండాన్ని అతను అవలీలగా గిరగిర తిప్పేవాడు. ఈ మహాశక్తులలో తప్ప తక్కిన విద్యలలో వైశంపాయనుడు చంద్రాపీడునికి సమానుడే. వాళ్ళిద్దరూ ఒకేచోట పెరగడం వల్ల రాజకుమారుడికి వైశంపాయనుడు రెండవ హృదయమే ఐపోయాడు. ఒకరిని విడచి మరొకరు నిముషమైనా ఉండరు. వాళ్ళకు యౌవనం వచ్చింది. సకల విద్యలూ పూర్తయిన సమయమూ వచ్చింది. అదితెలిసి చంద్రాపీడుడు చాలా ఆనందిస్తూ వారిని తీసుకు

రమ్మని సేనాపతిని ఆజ్ఞాపించాడు. అతను విద్యాగృహానికి వెళ్ళి, చంద్రాపీడునికి నమస్కరించి – "నువ్వు సకల విద్యలందూ ఆరితేరావని తెలిసి మీ తండ్రి ఎంతో సంతోషంగా ఉన్నాడు. నిన్ను చూడాలని ఉవ్విళ్ళూరుతున్నాడు. మీరు విద్యాభ్యాసం ప్రారంభించి పదిసంవత్సరాలయింది. మీరు ఆరవయేట ప్రారంభించారు. మీ తల్లులు మిమ్మల్ని చూడాలని చాలా ఆరాటపడుతున్నారు. యౌవన సుఖంతోపాటు రాజభోగాల నుభవించు. రాజులను గౌరవిస్తూ బ్రాహ్మణులని పూజించు. ప్రజలను పరిపాలించు. ఇదుగో... ఈ గుర్రమెక్కిరా. ఇది చాలా గొప్పగుర్రం. ఇది సముద్రంలో పుట్టిందనీ, చాలా వేగంకలదనీ, పారశీకపురాజు మీ తండ్రికి కానుకగా పంపాడు. దీనికి మంచి చిహ్నాలున్నాయన్నారు. చూడండి" అన్నాడు.

రాజుకుమారుడూ, వైశంపాయనుడూ దానిని పరీక్షించి, ఆశ్చర్యపోయి – "ఇదినిజంగా అత్యద్భుత మయిన అశ్వమే" అన్నారు. రాజకుమారుడు ఆ గుర్రమెక్కగానే అది సకిలించింది. అదే శుభశకునమని – వైశంపాయనుడు మరొక గుర్రమెక్కిరాగా రాజమార్గం మీద వెళ్ళసాగారు.

రాజకుమారుడు వస్తున్నాడన్న వార్త తెలిసి వారకాంతలు అతన్ని చూడడానికి మేడలమీదకి చేరిపోయారు. కుతూహలంగా చూస్తున్న వారు – రాజకుమారుడి సౌందర్యానికి చాలా ఆకర్షించబడ్డారు. అతన్ని భర్తగా పొందే స్త్రీ అదృష్టమే అదృష్టం. అని కన్యలనుకుంటే – అటువంటి సుందరుని కన్నతల్లి ధన్యురాలని కొందరు ప్రశంసించారు. వాటన్నిటినీ వినీవిననట్లుండి – ఆస్థానానికి దగ్గరున్న ద్వారం వద్ద గుర్రం దిగి – వైశంపాయనుని చేయి పట్టుకుని ముందుకు నడచి సభా మంటపం చేరుకుని – తండ్రికి వినయంగా నమస్కరించాడు.

కొడుకుని చూసేసరికి రాజుకి ఆనంద బాష్పాలు కురిశాయి. శరీరం పులకరిస్తూండగా అతన్ని కౌగలించుకున్నాడు. తరవాత వైశంపాయనుణ్ని కూడా కౌగలించుకున్నాడు.

"వత్సా! మీ తల్లి నిన్ను చూడాలని ఆత్రతపడుతోంది. వేగంగా వెళ్ళు" అన్నాడు. చంద్రాపీడుడు వైశంపాయనుడితో కలిసి తల్లి అంతః

పురానికి వెళ్ళి - ఆమెకు నమస్కరించాడు. ఆమె అతని తలమీద ముద్దుపెట్టుకుని ఆనందబాష్పాలతో అతని శిరస్సును తడిపేసింది. వైశంపాయనుడిని కూడా ఆదరించింది. "నాయనా! చంద్రాపీడా! నిన్ను యింతకాలం చూడకుండా ఎలా ఉన్నానో! ఏమైతేనేం, సమస్త విద్యలూ నేర్చిన వాడిగా నిన్ను చూడగలుగుతున్నాను. విద్య ముగిసినట్లే కనక వివాహితుడివైతే చూడాలని ఉంది" అంది.

చంద్రాపీడుడు సిగ్గుతో తల వంచుకున్నాడు. తల్లి ఆజ్ఞ తీసుకుని వైశంపాయనుడితో శుకనాశుడి భవనానికి వెళ్ళాడు. కొంచెం ఎడంగా నిలబడి అతనికి నమస్కరించాడు. అతను వారిద్దరినీ ఆలింగనం చేసుకున్నాడు. ఇద్దరూ ఆసనాలమీద కూర్చున్నాక - సామంత రాజులు పీఠాలు వదలి కిందను కూర్చున్నారు. అప్పుడు శుకనాశు డిలా అన్నాడు.

"తండ్రీ! చంద్రాపీడా! విద్యలు సమాప్తమయ్యాయి. యౌవనం వచ్చింది. ఇప్పటికి మారాజుకి ఫలప్రాప్తి అయింది. నీవంటి ఉత్తమ పుత్రుడు పుట్టిన మీ తండ్రి ఎంతో పుణ్యాత్ముడు. ఈ దేశప్రజలు ధన్యులు. ఈ భూభారాన్ని తండ్రితో కలసి వహించు."

అతనే స్వయంగా వారిద్దరికీ సత్కారాలు చేశాడు. రాజపుత్రు డతని అనుమతి తీసుకుని వైశంపాయనుడితో కలసి మంత్రిపత్ని అయిన మనోరమ వద్దకు వెళ్ళి ఆమె దీవెనలను పొంది - తరవాత, తమకోసం కొత్తగా నిర్మించబడిన మేడకు వెళ్ళిపోయాడు. మహావైభవంగా ఆ గృహంలో ప్రవేశించి - వైశంపాయనుడితో కొన్ని రోజులు వేడుకగా గడిపాడు.

ఒకనాడు - కైలాసుడనే కంచుకి, పత్రలేఖ అనే ఆమెను వెంట బెట్టుకుని అక్కడికి వచ్చాడు. ఆమె చాలా అద్భుత సౌందర్యవతి. వారిని చూసి రాజకుమారుడు ఆశ్చర్యంతో "నీవెవడివి? ఈ బాలిక నెందుకు తీసుకువచ్చావ్? అని ప్రశ్నించాడు. అప్పుడు వాడు "కుమారా! విలాసవతీ మహాదేవిగారు తమ కిలా ఆజ్ఞాపిస్తున్నారు. ఈ చిన్నది

కులూతేశ్వరుని కూతురు. దీనిపేరు చిత్రలేఖ. మీా తండ్రిగారు దిగ్విజయం చేస్తూ కులూత రాజధానిని జయించి - మిగిలిన కొందరితోపాటు ఈమెను కూడా తీసుకు వచ్చి అంతఃపుర పరిచారికలతో ఉంచారు.

నే నీ బాలిక వృత్తాంతం విని జాలిపడి రాజపుత్రిక అని గౌరవిస్తూ పుత్రికలాగే పెంచాను. ఇప్పుడీ మెను నీకు తాంబూలాలివ్వడం వంటి సేవలకు ఉంటుందని పంపుతున్నాను. ఈమెను సామాన్య పరిచారికలా చూడకూడదు. బాలికను లాగ లాలించాలి. శిష్యురాలిలా, స్నేహితుడిలా, మంచి పనులకే వినియోగించాలి. పెంచిన ప్రేమవల్ల దీనిమీద నాకెంతో యిష్టం. రాజకుమార్తె కనుక గౌరవించ దగినది. కొద్దిరోజుల్లో దీని సుగుణసంపద నీకే అర్థమౌతుంది. దీని గురించి నీకు తెలియదు కనక ఇంతలా చెబుతున్నాను" అని చెప్పి ఊరుకున్నాడు. అప్పుడా బాలిక అతనికి నమస్కరించింది. అత నావె వేపు రెప్పవాల్చకుండా చూశాడు. "కైలాసా! అమ్మగారు చెప్పినట్లే చేస్తానని చెప్పు వెళ్ళు" అని అతన్ని పంపేశాడు.

అది మొదలు - చంద్రాపీడుడు నిద్రిస్తున్నా, మేలుకొని ఉన్నా, తిరుగుతున్నా, కూర్చున్నా - అతనిని వదలక నీడలా అనుసరిస్తూ ఆమె అతన్ని సేవించసాగింది. చంద్రాపీడుడు కూడా చిత్రలేఖని చూసింది మొదలు ఆమె మీద ప్రీతిని పెంచుకుంటూ, హృదయంతో సమానంగా చూసుకుంటూ మంచిపనులు మాత్రమే చెప్పేవాడు.

అలా కొన్ని రోజులు గడిచాక - రాజు తన కొడుకుకి పట్టాభిషేకం చేయడానికి ఏర్పాట్లు ప్రారంభించాడు. చంద్రాపీడుడు శుకనాశుడి దర్శనంకోసం వెళ్ళగా అతను రాజనీతి నుపదేశించాడు.

# రాజనీతి

"తండ్రీ! చంద్రాపీడా! సమస్త శాస్త్రాలూ అభ్యసించిన నీకు మేము ప్రత్యేకంగా ఉపదేశించవలసినది ఏమీలేదు. యౌవనం శరీరానికి స్వభావంతో వస్తుంది. యౌవన తమం - సూర్యకాంతి చేత కాని, దీపం వెలుగువల్ల కాని, రత్నకాంతులచే కాని పోయేది కాదు. ఐశ్వర్యమదం కూడా అలాటిదే. దేనివలనాపోదు. దర్పదాహం సామాన్యంగా తీరేది కాదు. విషయవాంఛ - మంత్రబలంతో పోయేది కాదు. పుట్టుకతోనే రాచరికం, అనుపమానసౌందర్యం, యౌవనం - ఒక్కొక్కటీ ఛాలు అవినయాన్ని రెచ్చగొట్టడానికి. అలాటిది మూడు యిప్పుడు నీలో ఉన్నాయి. ఇక చెప్పేదేముంది?

యౌవనారంభంలో -బుద్ధి కలుషితం కాక మానదు. తరచుగా మునుల దృష్టి - రాగంతో కూడుకుని ఉంటుంది. నీవంటివారే ఉపదేశానికి అర్హులు. రాజులకుపదేశించే వారుండడం అరుదు. రాజులమాటలే జనులు ప్రతిధ్వనిలా పలుకుతారు.

ధనమదులు గురువుల ఉపదేశాలను వినరు. ధనం చేసే మాయలెన్నో. రాజ్యలక్ష్మి విద్యావంతుడిని చూడనివ్వదు. గుణవంతుణ్ని దగ్గరకు రానివ్వదు. మంచివాడిని పిచ్చివాడినివలె వేళాకోళం చేస్తుంది. పుణ్యాత్ములను దరికి చేరనివ్వదు.

రాజ్యసంపద అతి చంచలమయినది. దానిని చూసుకుని గర్విస్తూ ఇంద్రియ సుఖములచేత వివశత్వం పొందుతారు. బంధువులను గుర్తెరగరు. గుడ్డివాళ్ళలా - ఎదుటివాళ్ళని చూడలేరు.

విపరీతమయిన స్తోత్ర వాక్యలను విని నిజమనుకునేవాడు అందరికీ హాస్యాస్పదుడు అవుతాడు.

కుమారా! నువ్వెప్పుడూ యిలాటి బలహీనతలకు నీ మనసులో చోటివ్వకు. వంచకులను దగ్గరకు రానివ్వకు. సాధువులను తిరస్కరించకు. పరిచారకులకు చను వివ్వకు. కృత్రిమమైన మాటలు వినకు. రాగం, లోభం మొదలయిన వాటిని హృదయానికి అంట నివ్వకు. రాజ్యలక్ష్మి

– ఉన్నత వంశంవాడినైనా, పండితుడినయినా, ధీరుడి నయినా దుర్నీతి పాలు చేయగలదు. అందుకే నీ కింతగా చెప్పాను. అదీకాక నీ హృదయం యిప్పటివరకూ స్వచ్ఛంగా ఉంది. నువ్వింకా యౌవ నారంభంలోనే ఉన్నావు. అందుచేత – స్వచ్ఛమైన మనసుకి చేసే ఉపదేశం చక్కని ప్రభావం చూపగలదని – చెప్పాను.

రాజ్యభారం వహించు. ప్రజలను దయతో పరిపాలించు."

చంద్రాపీడుడు ఆ ఉపదేశం విని శుకనాశుడి మాటలకు మనసు ప్రక్షాళన జరిగినట్లే అవగా, హృదయం పరిశుద్ధమై కొంతసేపు ఆలోచనలో ఉండి...అతని అనుమతిని తీసుకుని తన భవనానికి వెళ్ళాడు.

శుభముహూర్తంలో – తారాపీడుడు నాలుగు సముద్రాల జలాలూ తెప్పించి, బ్రాహ్మణు లాశీర్వదిస్తూండగా చంద్రాపీడుణ్ని పట్టభద్రుడిని చేశాడు. పట్టాభిషిక్తుడైన చంద్రాపీడుణ్ని చూసి ప్రజలందరూ ఎంతో సంతోషించారు.

సింహాసన మెక్కిన కొన్ని రోజులకే చంద్రాపీడుడు తండ్రి అనుమతి పొంది, శుకనాశుని శాసనం ప్రకారం చతురంగ బలాలనూ వెంటబెట్టుకుని, వైశంపాయనుడు తోడురాగా, పత్రలేఖతో కూడా దిగ్విజయ యాత్రకు బయలుదేరాడు.

తూర్పు, దక్షిణ, పడమర, ఉత్తర దిక్కులు నాలుగూ తిరిగి, దుర్మార్గులను శిక్షిస్తూ, శరణాగతులను రక్షిస్తూ, రాజపుత్రుల కభిషేకం చేయిస్తూ, రత్నములు మొదలగు బహుమతులను స్వీకరిస్తూ, పన్నులు వసూలు చేస్తూ. ఆ ప్రదేశాలలో విజయ చిహ్నాలు స్థాపిస్తూ ...శాసనాలు లిఖిస్తూ...బ్రాహ్మణులని పూజిస్తూ...మునులకు ఆశ్రమాలు కట్టిస్తూ... తన పరాక్రమాన్ని వెల్లడిస్తూ....కీర్తిని వ్యాపింప జేసుకుంటూ... భూమండలం అంతా తిరిగి...విజయస్థంభాలు నాటి...తన పురానికి వస్తూ – ఒకనాడు, కైలాస సమీపంలో తిరిగే హేమజటులనే కిరాతకులకు నివాసస్థానమైన సువర్ణపురాన్ని జయించి – గ్రహించాడు.

ఆ పట్నం తూర్పు సముద్రాని కతిదగ్గరలో ఉంది. చాలా రోజులుగా భూమండలం తిరుగుతూ అలసి పోయిన తన సేనలకు విశ్రాంతి కలిగించాలని – రాజపుత్రు డానగరంలో కొన్నాళ్ళుండి పోయాడు.

# కిన్నర జంట కథ

చంద్రాపీడుడు ఒకనాడు ప్రాతఃకాలంలో ఇంద్రాయుధ మనే తన గుర్రాన్నెక్కి ఆ ప్రాంతంలోని అరణ్యానికి పోయి అక్కడ తిరుగుతూ ఒకచోట – పర్వత శిఖరం నుంచి దిగుతున్న కిన్నర జంటని చూశాడు. వాటిని పట్టుకోవాలని – తన గుర్రాన్ని మెల్లగా వాటి దగ్గరకు పోనిచ్చాడు. కిన్నర మిధునం – అపూర్వమైనది. వీటిదర్శనం అతనికెంతో సంతోషం కలిగించింది. ఎప్పుడూ చూడని మనిషిని చూడడంతో ఆ కిన్నరజంట భయపడి కాలికొద్దీ పరుగెత్తసాగింది. చంద్రాపీడుడు కూడా – గుర్రాన్ని మడమలతో కొడుతూ తనసేనని వదలి వేగంగా ఆ జంట వెంట వెళ్ళసాగాడు. వాటివెంట ఒక్కడే చాలాదూరం వెళ్ళిపోయాడు. ఆ కిన్నర జంట చిక్కినట్లే చిక్కి.....చిక్కకుండా పరుగెత్త సాగింది. అతను చూస్తూండగానే పర్వత శిఖరం ఎక్కింది.

అంతవరకూ ఒక్కడూ వచ్చి....గుర్రం వెళ్ళడానికి తోవ సరిగాలేక ... నడుస్తున్న అశ్వాన్ని ఆపి అలసటతో శరీరమంతా చెమటలు కమ్ముతూంటే – అతను తనలో తాను –

"అయ్యో! చిన్నపిల్లాడిలా నే నీకిన్నర జంట వెంట పరుగెత్తి వచ్చి అనవసరంగా శ్రమపడ్డాను. ఇది దొరికినా నాకేం ప్రయోజన ముంది? ఉపయోగంలేని పనిమీద నాకెందు కంత ఆసక్తి కలిగింది? దీనివెనుక ఎంత దూరం వచ్చాను! తలుచుకుంటే – నాకే నవ్వొస్తూంది. ఇక్కడికి నా బలగం ఎంత దూరంలో ఉందో తెలియదు. నా గుర్రం నిముషంలోనే చాలా దూరం పరుగెత్త గలిగేది. కిన్నర మిధునం మీదే దృష్టి పెట్టేసి – అతివేగంగా వచ్చేశాను. అందువల్ల ఇప్పు డే దారిని వెనక్కి పోవాలో తెలియదు. ఈ అరణ్యంలో నాకు దారి చెప్పే వారెవరూ ఎంత ప్రయత్నించినా కనపడడంలేదు. ఇది దేవభూమిలా ఉంది. కనక మనుష్య సంచారం ఉండదు. సరే ఇది ఉత్తరదేశం కాబట్టి దక్షిణంగా పోయి చూస్తాను. ఎవరేనా సరే తాను చేసిన కర్మయొక్క ఫలం అనుభవించి తీరాలి కదా?" అనుకుంటూ గుర్రాన్ని దక్షిణ దిక్కుగా మరలించాడు.

అలా మరల్చి - ' అయ్యో! ఇప్పుడు సూర్యుడు నడినెత్తిమీది కొచ్చాడు. ఈ గుర్రం చాలా అలసిపోయింది. దీనికి మేత, నీరు అందించి, నేను కూడా నీరు తాగి కాస్త అలసట తీర్చుకున్నాక అప్పుడు పోతాను.' అనుకుని - ఒకచోట నీటిపక్షులెగురుతూ ఉండడం చూసి...అటువేపు వెళ్ళాడు. వెళ్ళగా వెళ్ళగా అక్క డొక సరస్సు కనిపించింది. ఆ చెరువునీ, పరిసరాలనీ చూడడంతోటే అలసట తీరిపోయేంత అద్భుతంగా ఉన్నాయి. ఆ సౌందర్యానికి ముగ్ధుడై - 'ఆహా'! కిన్నర జంట ననుసరించడం నిష్ఫలమైనా యీ సరోవర సందర్శనం వల్ల సఫలమయినట్లే అనిపిస్తోంది. కళ్ళున్నందుకు చూడతగిన వస్తువుని నేడు చూశాను. ఇది అత్యంత రమణీయం. దీనిని చూసేకాబోలు భగవంతుడైన వాసుదేవుడు జలశయనాన్ని వదలడంలేదు' అని ఎన్నో విధాలుగా ఆ తటాకాన్ని ప్రశంసించాడు.

తరవాత అతనందులోకి దిగి ... గుర్రానికి నీరు పట్టి...ఒక చెట్టు మొదలుకి దానిని కట్టి, తానే కొంత గడ్డిని పెరికితెచ్చి దానికి వేశాడు. అతను కూడా ఆ నీరు తాగి పరిసర సౌందర్యాన్ని తృప్తిమేరకూ ఆస్వాదించి, ఒక రాతిపలకమీద తామర పూలతో కల ఆకులనూ తూళ్ళనూ దిండుగా పరచి దానిమీద తలపెట్టుకుని - ఉత్తరీయం పరచి కూర్చున్నాడు. కొంతసేపు అలా కూర్చున్నాక - గుర్రం గడ్డిమేయడం మాని చెవులు రిక్కించుకుని చూడడం గమనించి ఏమా అనుకునేసరికి అతని చెవులకు వీణానాదం పోలిన దేవతా సంగీతం వినపడింది.

ఇలాటి ప్రదేశంలో...మానవ సంచారమే లేని యిటువంటి చోట అలాటి సంగీతానికి కారణం ఏమిటా అని అతను అటువేపు దృష్టి సారించాడు. కాని...ఏమీ కనిపించలేదు. దానితో అతను గుర్రమెక్కి ఆదిశగా బయలుదేరాడు.

అడవిలేళ్ళు దారిచూపుతున్నట్లు ముందు వెళ్తూండగా వాటిని అనుసరించి అతను ఆ తటాకపు పడమటి వొడ్డున పోసాగాడు. వెళ్ళగా వెళ్ళగా ఉత్తర తీరమందు ఒక మంటపం కనిపించింది. దాని మధ్య తామరపూలచే అర్చించబడిన స్ఫటిక లింగం ఒకటి ప్రకాశిస్తూ

కనిపించింది. దానికి దక్షిణ భాగంలో ఒకస్త్రీ ఉంది. ఆమె బ్రహ్మాసనం వేసుకుని ఉంది. శరీరకాంతి వెన్నెల్లా తెల్లగా ఉంది. శిరసుమీద జటాజూటం ముడివేసుకుంది. ఆమె కుడిచేతిలో దంతపు వీణ ఉంది. గంధర్వదేవతలా ఆమె పాడుతూంది.

ఆమెను చూసి, చంద్రాపీడుడు గుర్రందిగి – దానినొక చెట్టుకి కట్టివేసి...శరీరం పులకరిస్తుండగా ఆ మహాలింగం వద్దకు వెళ్ళి నమస్కరిస్తూ...ఆమెను రెప్పవేయకుండా చూస్తూ, ఆమె అందానికి ఆశ్చర్యపోతూ....'జంతువులకు కూడా అప్రయత్నంగానే కొన్ని వింతలు కనిపిస్తుంటాయి. నేను – వేటకని బయలుదేరాను. కిన్నర జంట, దేవతలు విహరించే చోటూ కనిపించాయి. నీటికోసం వెదుకుతూంటే సరోవరం కనిపించింది. అక్కడ విశ్రాంతి తీసుకుంటూంటే, మానవులకు దర్శనం దుర్లభమయిన ఈమె కనిపించింది! ఈమె దేవతాస్త్రీ అని ఆకారమే చెబుతూంది. మానవస్త్రీకి ఇంత సౌందర్యమూ సంగీతమూ ఉండవు. ఈమె అంతర్ధానం చెందకపోతే – ఆమె ఎవరో? ఆమె పేరేమిటో? ఇంత చిన్న వయసులోనే యిలాగ వ్రతం ఎందుకు పట్టిందో? – అడుగుతాను, అనుకుంటూ మంటపంలో మరోస్తంభం మాటున ఆమె సంగీతం ముగించడం కోసం ఎదురు చూడసాగాడు.

కొంతసేపటిలో ఆమె గీతం ముగించి ఆ మహాలింగానికి ప్రదక్షిణం చేస్తూ – ఒకమూల ఒదిగి ఉన్న ఆ రాజకుమారుణ్ని చూసి – "అతిధికి స్వాగతం. ఈ మహానుభావు డీచోటు కెందుకు వచ్చాడో? అతిథి సత్కార మందుకుందుకు లేచి నాతో రావలసి ఉన్నదికదా?" అంది.

ఆ మాటలకే అతను ఆమె తనను అనుగ్రహించినట్లు భావించుకుని, భక్తితో నమస్కరిస్తూ – "భగవతీ! మీ ఆజ్ఞప్రకారమే నడచుకుంటాను" అంటూ శిష్యుడిలా వినయం ప్రదర్శిస్తూ ఆమెతోపాటు నడవసాగాడు. 'మేలే. నన్ను చూసి ఈమె అంతర్ధానమైపోలేదు. తపస్వులకే దుర్లభమయిన దివ్యరూపం కలిగిన ఈమెకు నాయందు ఎలా దాక్షిణ్యం కలుగుతుందో అలా మెలగుతాను. అడిగితే ఈమె తన వృత్తాంతం

చెప్పేటట్లే కనిపిస్తూంది. సమయం చూసి అడుగుతాను-” అనుకున్నాడు తన మనసులో.

చెట్ల నీడలవల్ల పగలు కూడా చీకటిలాగే అనిపించే ఆ మార్గంలో నూరడుగులు నడిచేసరికి ఒక గుహ కనిపించింది. ఆమె అతనిని గుహ ముందు రాయిమీద కూర్చోమని కనుసైగలతో సూచించి - వీణనొక చోటపెట్టి ఆకుతో నీరు తెచ్చి యిచ్చింది.

అందుకు - “భగవతీ! ఇంత ఆదరం అక్కర్లేదు. నీ కటాక్షమే నా పాపాలన్నిటినీ కడిగివేసింది. ఈ శిష్యుణ్ణి అనుగ్రహించు” అన్నాడు. అయినా ఆమె వదలకుండా అతనికి అతిథి సత్కారం చేసింది. అప్పుడు మరొక శిలమీద కూర్చుని అతని రాకకు కారణం అడిగింది. అతను తన వృత్తాంతమంతా చెప్పాడు. అదివిని ఆమె భిక్షా పాత్ర పట్టుకుని చెట్లవద్దకు వెళ్ళి పడిన పండ్లతో దానిని నింపి అతని ముందు ఉంచింది. ‘వృక్షాలుకూడా వినమ్రంగా యీామెకోసం ఫలాలను రాల్చాయి! తపోబలం అంతటిదికాబోలు’ అని ఆశ్చర్యపోతూ ఆ ఫలాలను తిని, ఆమె అందించిన నీరు తాగి ఆమె కూడా ఫలహారం చేసి వచ్చేవరకూ ఏకాంతంగా కూర్చున్నాడు.

ఆమె వచ్చి ఒక శిలమీద కూర్చున్నాక - అత నామె దగ్గరగా వెళ్ళి వినయంగా - “భగవతీ! భగవంతుడి అనుగ్రహం వలన కలిగిన సంతోషంలో - నిన్ను ప్రశ్నించా లనిపిస్తూంది. నిన్ను చూసింది మొదలు నాలో కుతూహలం రేకెత్తుతూనే ఉంది. నీ జన్మవలన ఏ కులము పావనమైంది? ఇంత చిన్న వయసులో యిలాటి కఠిన వ్రతం ఎందుకు పట్టావు? సురలోక సౌఖ్యములు వదిలిపెట్టి ఈ అడవిలో ఒంటరిగా ఎందుకు నివసిస్తున్నావు? ఇలాటి విచిత్రం నేను ఎప్పుడూ చూడలేదు. నీ వృత్తాంతం చెప్పి నా సందేహాన్ని తీర్చమని ప్రార్థిస్తున్నాను - ” అన్నాడు.

ఆ మాటలల కామె కొంతసేపు ఆలోచనలో పడింది. తరవాత నిట్టూర్పులు వదిలింది. కళ్ళల్లోంచి నీటిబిందువులు జారిపడుతూ ఆమె వస్త్రాన్ని తడపసాగాయి. ఆమె వెక్కి వెక్కి ఏడవసాగింది.

అకారణంగా దుఃఖిస్తున్న ఆమెను చూసి – 'సుఖదుఃఖముల ప్రవృత్తి అతిబలమైనది. శరీర ధర్మం కలవారిని తాపం అంటకమానదు. ఇలాటివారు చిన్న కారణానికి దుఃఖించరు. అందుచేత ఈమె దుఃఖానికి కారణం తెలుసుకోవాలనే కుతూహలం నాలో మరింత పెరుగుతూంది' అనుకున్నాడు. ఆమె దుఃఖానికి కారణం తనే అని భయపడుతూ లేచి ...దోసిలితో నీరు తెచ్చి – ముఖం కడుక్కోమని ఆమె కందించాడు.

ఆమె ఆ నీటితో కళ్ళు కడుక్కుని – వస్త్రంతో తడిని అద్దుకుని... నిట్టూర్పులు విడుస్తూ – "రాజపుత్రా! నేను మంద భాగ్యురాలిని. నా వృత్తాంతం వలన నీకేం లాబ ముంటుంది? అయినా – అడిగావు కనుక చెబుతాను. విను" అంటూ ఆమె తన కథ చెప్పసాగింది.

## మహాశ్వేత కథ

"రాజకుమారా! దక్షుడి ప్రసిద్ధి నీకు తెలిసే ఉంటుంది. అతనికి మని, అరిష్ట అని యిద్దరు పుత్రికలు జన్మించారు. వారిలో – మనికి చిత్రరథుడను కొడుకు పుట్టాడు. ఆ చిత్రరథుడు సమస్త గంధర్వులకూ అధినాయకుడై ఇంద్రుడితో స్నేహం సంపాదించాడు. ఈశ్వరుడి ప్రసాదం వల్ల చైత్రరథం అనే పేరుతో మనోహరమైన యీ ఉద్యానవనాన్నీ, అచ్ఛోదమనే యీ సరస్సునీ నిర్మించాడు.

అరిష్ట కొడుకు హంసుడు. ద్వితీయ గంధర్వకులానికి ప్రభువై గౌరి అనే కన్యకను వివాహం చేసుకుని దానితో సుఖంగా సంసారం చేసుకోసాగాడు. ఆ దంపతులకు నేనొక్కతెనే సంతానాన్ని. అంతవరకూ సంతానం లేని నా తండ్రి – నేను పుట్టినందుకు చాలా సంతోషించి, జాతక కర్మలు చేయించి, నాకు మహాశ్వేత అని పేరు పెట్టాడు. నా చిన్నతనం చాలా ఆనందంగా గడిచింది.

కాలక్రమంలో నాలో యౌవనం పొడ చూపింది. ఒక వసంత కాలంలో తల్లితో కలసి, స్నానం చేయడానికి నేనీ సరోవరానికి వచ్చాను.

ఇక్కడి రాతిపలకల మీద రాయబడిన దేవతలకు నమస్కరిస్తూ యీ అత్యంత సుందరమైన ప్రదేశంలో నా స్నేహితురాలితో విహరించసాగాను.

ఆ సమయంలో – మునుపెప్పుడూ నే నెరుగని ఒక పరిమళం నా ముక్కుకి సోకింది. ఆ అద్భుత, అపూర్వ సుగంధం నాకెలా సోకిందా అని ఆలోచిస్తూ – కళ్ళుమూసుకుని ఆ పరిమళాన్ని ఆఘ్రాణించి ఆ సువాసన ఎక్కడి నుంచి వస్తూందో చూద్దామని తలనటూ యిటూ తిప్పుతూ కొన్ని అడుగులు నడిచి, నాలుగు మూలలూ పరికించి చూశాను.

అప్పుడొకచోట ఒక మునికుమారుణ్ని చూశాను. అతను – చంద్రుడిలా చక్కగా ఉన్నాడు. తపస్సు చేసే మన్మదుడిలా ఉన్నాడు. కాషాయ వస్త్రాలు ధరించి, చేతిలో దండకమండలాలు పట్టుకుని నుదుటి మీద విభూతి రేఖలతో, మొలకు దర్భల మొలతాడుతో, మూర్తీభవించిన బ్రహ్మాచర్యంలా ఉన్నాడు. అతను అంతే వయసుకల తాపసకుమారుడితో స్నానానికి వెళ్తున్నాడు. అతని రూపం నాకు కన్నుల పండగ చేసింది. అతని చెవికి – కృత్తికానక్షత్రంలాటి పూలగుత్తి ఉంది. అది అమృత బిందువులని స్రవిస్తూంది.

దానిని చూశాక – నాకు చక్కని సౌరభా న్నందించింది యీ గుత్తిలోని పూవులే – అని నిశ్చయించుకున్నాను. ఆ మునికుమారుణ్ని చూస్తూ – 'మన్మధుడికంటే, చంద్రుడికంటే అందరికంటే కూడా యితనెంత అందంగా ఉన్నాడు! తపస్సుతో కష్టపెడుతున్నా ఎంత లావణ్యంగా ఉం దతని శరీరం!' అనుకుంటూండగా మన్మధుడు నన్ను వశం చేసుకున్నాడు.

నిట్టూర్పులతో ఏదో ఆలోచిస్తూ.. నీ హృదయంలో నా కవకాశమిమ్మని ప్రాధేయపడ్డాను. అంతలోనే తెలివి తెచ్చుని –'ఇదేమిటి? నాకు కులస్త్రీ విరుద్ధమైన బుద్ధి పుట్టింది. ఇది నిందించదగినది' అనుకుని కూడా – మనసుని మరల్చుకోలేక, మూర్ఛవచ్చిన దానిలా అవయవాలు కదల్చలేక, స్థంబించిపోయి అలాగే నిలబడ్డాను. అప్పటి నా అవస్థ చెప్పడానికి శక్యంకాదు. అంతకుమును పెన్నడూ నాకలా అవలేదు. అతని అత్యంత సుందరమైన రూపమో, నామనస్సో, యౌవనమో, మన్మధుడి ప్రభావమో, అనురాగమో ... దేనివల్లనో కాని అలాటి అవస్థకి

నేనెప్పుడూ లోనుకాలేదు. అలా చాలాసేపు చూసి చిట్టచివరకు మనసుని ధృఢపరచుకున్నాను.

అప్పుడు అతని హృదయంలో నిలవడాని కవకాశ మివ్వాలని కాబోలు - నానుండి నిట్టూర్పులు వెలువడ్డాయి. నా హృదయంలోని అభిలాషను తెలపడానికేమో నాగుండెలు గగుర్పొడిచాయి. శరీరం స్వేదమయ మయింది. మదనుడి శరాలకు భయపడి కాబోలు, మేను వణక సాగింది. అప్పుడు - 'అయ్యయ్యో. సురతానికి వ్యతిరేకి, మహానుభావుడు అయిన ఈ మునికుమారుడి పట్ల అనురాగం కలిగించాడేం మన్మదుడు? అనురాగం యోగ్యతను విచారింపదు. స్త్రీ హృదయం మూడమైనది. సామాన్యులు పొగిడే మన్మధ విలాసాలెక్కడ? తపో మహాత్యమెక్కడ? మన్మద వికారానికి లోనైన నన్ను చూచి యితను మనసులో ఏమనుకుంటాడో? అది తెలిసికూడా యీ వికారా న్నణచుకోలేక పోతున్నాను. ఇది నా తప్పుకాదు అతని రూపంలోనే అలాటి మహిమ ఉంది. ఇతను నా వికారములను చూడకముందే వెళ్ళి పోవడం మంచిది. లేకపోతే . ఆ ప్రియములైన నా మదన వికారాలను చూసి శాపమిస్తాడేమో. మునులు యిలాటి అగౌరవాన్ని సహింపరు కదా." అని వెళ్ళిపోడానికి నిశ్చయించుకున్నాను.

కాని అతని సుందరమైన ఆకారానికి సంకెలలా తగులుకున్నట్లు - కదలలేక - "మునులు పూజనీయులు కదా నమస్కరించి వెళ్తాను అందులో తప్పేముంది?' అనుకుని అతనికి దగ్గరగా వెళ్ళి, ముఖం చూస్తూ, పాదాలకు నమస్కరించాను.

బలవంతుడైన మన్మదుడు, నా వికారాలను చూసిన ఆ ముని కుమారుడి హృదయాన్ని కూడా గాలి, దీపాన్ని చంచలం చేసినట్లు చేశాడు యౌవనం హద్దులేనిది కదా. అతనికి రోమాంచ మయినది. నా దగ్గర కొచ్చే అతని హృదయానికి దారిచూపుతున్నట్లు అతనినుంచి నిట్టూర్పులు బయలు వెడలాయి. చేతిలోని జపమాలిక జారి నేలపై పడింది

నేనతని వికారమును చూసి, నా హృదయంలో మదనావేశం రెట్టించగా చెందిన అవస్థ చెప్పలేను. 'మన్మధుడే అన్ని శృంగార విశేషాలూ నేర్పే ఉపాధ్యాయుడు. లేకపోతే – శృంగార చేష్టలందు ప్రవేశింపని బుద్ధికల యీ మునికుమారుడి దృష్టి యింత మనోహరంగా ఎందు కుంటుందీ?' అనుకున్నాను. అతని హృదయంలోని కోరిక అంతటినీ అతని చూపులే చెబుతున్నాయని భావిస్తూ – అతని సహచరుడైన రెండవ మునికుమారుడి వద్దకు పోయి – ప్రణామం చేసి – యిలా అన్నాను. "ఆర్యా! ఈ మునికుమారుడి పేరేమిటి? ఎవరి కుమారుడు? ఈయన కర్ణాభరణంగా దరించిన పూలగుత్తి ఏ పొదలో పుట్టింది? దీనివాసన పీల్చి నప్పటినుంచీ నా హృదయాని కెంతయినా సంతోషంగా ఉంది. ఇలాటి ఫువ్వులి నే నెప్పుడూ చూడలేదు."

అతను చిరుమందహాసం చేస్తూ – "బాలా! నీప్రశ్నవల్ల ఉపయోగ మేమిటి? కుతుహలంగా ఉంటే చెబుతా విను" అన్నాడు.

## పుండరీకుడి కథ

దేవలోకంలో శ్వేతకేతుడనే మహాముని ఉండేవాడు. అతనిరూపం ముల్లోకాలలోనూ అత్యంత సుందర మయినది. అత నొకనాడు దేవతార్చనకు పూలు కోయడానికి మందాకినీ నదికి వెళ్ళాడు. ఆ నదిలో తామరపూలు కోస్తున్న ఆ మునిపుంగవుణ్ని చూసేసరికి పద్మాలయ ఆయిన లక్ష్మీదేవికి చిత్తం చలించింది. దర్శన మాత్రాన్నే రతిసుఖం అనుభవించిన ఆమెకు పీరంగా ఉండే పద్మంలో కుమారుడు కలిగాడు. అతన్నెత్తుకుని – "దేవా! ఇతను నీ కుమారుడు తీసుకో" అంటూ ఆమె శ్వేతకేతుడి కిచ్చింది.

ఆ ముని ఆ శిశువుకి తగిన కృత్యములన్నీ నిర్వర్తించి – పద్మంలో పుట్టాడు కనుక పుండరీకుడని పేరుపెట్టి సమస్త విద్యలూ నేర్పించాడు. అలాగ శ్వేతకేతుడికి జన్మించిన పుత్రుడే యితను. ఆ

పూలగుత్తి పాలసముద్రంలోని పారిజాత చెట్టుకి పుట్టింది. అది యితని చెవి నెలా అలంకరించిందో అదికూడా చెబుతాను, విను.

ఈ రోజు చతుర్దశి అని యితనూ నేనూ దేవలోకంనుంచి, కైలాసంలో ఉండే శితికంఠుడిని ఆరాధించడానికి నందనవనం మీదుగా పోతున్నాం. ఆ నందనవన లక్ష్మి యీ పారిజాత పూలగుత్తిని చేతిలో పట్టుకుని వచ్చి - యితనికి మొక్కుతూ - "ఆర్యా! ముల్లోకాలకూ సుందరమైన నీ రూపానికి యిది అర్హమైనది. దీనిని కర్ణాభరణంలా ధరించు. పారిజాతం జన్మ సార్ధకం ఔతుంది" అంది.

ఆమె పొగడ్తలకి యితను సిగ్గుపడి కళ్ళుమూసుకుని ఆమె మాటలు వినకుండా నడవసాగాడు.

ఆ దేవి ఈ పూలగుత్తిని పట్టుకుని - పట్టు వదలకుండా వెంట వొస్తూంటే - నేను - "మిత్రుడా! ఇందులో తప్పేముంది? దేవి అనుగ్రహిస్తే కాదనడ మవదూ? తీసుకో." అని, అతని కిష్టంలేకపోయినా నేను పుచ్చుకుని బలవంతంగా శ్రవణాభరణంగా అలంకరించాను. ఇదే దీని కథ" అని ఊరుకున్నాడు.

అప్పుడు పుండరీకుడు చిరునవ్వుతో నన్నుచూసి - "నీకా ప్రశ్నలతో పనేమిటి? కావాలంటే యీ పూలగుత్తిని తీసుకో" అంటూ తన చెవిలోని ఆ పూలగుత్తిని నా చెవిలో పెట్టాడు. ఆ సందర్భంగా అతని కరస్పర్శ లభించి ఆ పూలగుత్తి నా రెండో హృదయంలా తోచింది. నా చెక్కిళ్ళు తగిలిన స్పర్శ సుఖంలో అతను వణుకుతూ చేతిలోంచి జరిపడిన జపమాలికను సైతం సిగ్గులో గుర్తించలేకపోయాడు.

నేనా జపమాలికను నేలమీద పడకుండా అందుకుని - అతని కంఠ స్పర్శగా భావించుకుందామని - విలాసంగా కంఠా భరణంలా దానిని నా మెడలో వేసుకున్నాను.

అప్పుడు - గొడుగు పట్టుకున్న స్త్రీ, ఛత్రగ్రాహిణి నా వద్దకు వచ్చి "రాజపుత్రీ! మీ తల్లి స్నానం చేసింది. ఇంటికి వెళ్ళిపోయే సమయం అయింది అంది. కాబట్టి వేగంగా స్నానం చెయ్యి" అంది.

ఆ మాటవిని ... నా కిష్టంలేకున్నా ఎంతో ప్రయత్నించి అతని ందనుంచి దృష్టి మరల్చుకుని గుండె మూలుగుతూండగా నేను స్నానానికి ళ్ళి పోయాను.

తరువాత .... రెండవముని కుమారుడు – ధైర్యం కోల్పోయిన ుండరీకుణ్ని చూస్తూ – ముఖంలో కొంచెం కోపం కనిపిస్తూండగా – మిత్రుడా! పుండరీకా! క్షుద్ర జనులు తొక్కిన యీ మార్గం నీకు తగినది ాదు. సాధువులు ధైర్యవంతులు కదా. సామాన్యుడిలా – వివశమైన ునసుని అరికట్టవేం? ఎన్నడూ లేనిది నీకు ఇంద్రియ చాపల్యం కలిగిందే! ధైర్యము, అదుపు, ప్రశాంతి, బ్రహ్మచర్య నియమము, యౌవన శాసనత్వము, ఇంద్రియ పరాఙ్ముఖత మొదలయిన నీ సుగుణాలన్నీ ఎక్కడికి పోయాయి? విద్యను నీట కలిపావు. వివేకం నిరర్ధకమయింది. అయ్యో! చేతినుంచి జారిపడిన జపమాలికను కూడా గమనించలేక పోయావు! ఏమి మోహం! ఒకవేళ ప్రమాదవశాత్తూ బుద్ధి చంచలమయినా వివేకంతో మరల్చుకోరాదా? పిచ్చి వాడిలా ప్రవర్తిస్తున్నావేం?" అన్నాడు.

పుండరీకుడు కొంచెం విచారిస్తూ – "కపింజలా! నన్ను మరోలా భావింపకు. నేను అలాటి వాడిని కాను. దుష్టురాలయిన ఆమె నా జపమాలికని గ్రహించిన అపరాధాన్ని విస్మరించాననుకుంటున్నావా? చూడు" అంటూ కృత్రిమ కోపం తెచ్చుకుని, కనుబొమ్మలు ముడివేసి, పెదవి కరుస్తూ – నా దగ్గరకు వచ్చాడు.

"చపలురాలా! నా జపమాలిక నాకివ్వక ఎక్కడికి పోతావు? ఇచ్చి మరీ కదులు" అన్నాడు. నేను నా మెడలోంచి ఒంటిపేట ముత్యాల పేరును తీసి – "ఆర్యా! ఇదిగో మీ మాలిక స్వీకరించండి" అని ఇచ్చాను. నా ముఖం చూస్తూ హృదయం పోగొట్టుకున్న అతని చేతిలో ఆ మాలనుంచి, చెమటితో స్నానమయినా, మళ్ళీ స్నానం చేయడానికి తటాకానికి పోయాను.

స్నానం చేసి ... వెళ్ళలేక వెళ్ళలేక భారంగా నా తల్లితో కదిలి ఎలాగో యిల్లుచేరి అంతఃపురంలో ప్రవేశించి అతన్ని స్మరిస్తూ –

విరహంలో మునిగి - 'అయ్యో! అక్కడే ఉండక నేను ఇంటి కెందుకు వచ్చాను? ఆ.......రాలేదు. నేనక్కడే ఉన్నాను. కాదు....ఇది గృహమే. కలేమో. కళ్ళు తెరచుకునే ఉన్నాయే! కల ఎలావస్తుందో? ఇది రాత్రా? పగలా? ఈ తాపం - రోగమేమో? నేనిప్పుడెక్కడున్నాను? ఎక్కడికి పోతాను? ఎవరితో చెప్పుకుంటాను? ఈ బాధకి ప్రతీకారమేమిటి?" అంటూ పిచ్చి దానిలా పలవరిస్తూ ... అంతఃపురంలోకి యితరులు రాకుండా నియమించి - ఒక కిటికీ దగ్గర కూర్చుని. ఆ దిక్కునే గొప్పదానిగా తలుస్తూ...అటునుంచి గాలి వచ్చినా మనోహరంగా భావించుకుంటూ క్షణమొక యుగంలా గడపసాగాను.

అంతలో తాంబూలమందించే తరళిక వచ్చి నా అవస్థ అంతా చూసి విచారిస్తూ- "రాజపుత్రీ! ఆ తటాకంలో స్నానంచేసి -' నన్ను పలకరించకుండా నువ్వు ముందుగా యింటికి వచ్చేశావు కదా. నువ్వొచ్చేశాక ఒక విశేషం జరిగింది. విను.

దివ్యమయిన ఆకారాలతో మనకిద్దరు మునికుమారులు అచ్ఛోదన సరస్సు ఒడ్డున కనిపించారు. ఔనా?

వారిలో నీకు పుష్పమంజరిని యిచ్చిన అతను రెండవ వానికి కనపడకుండా, విరబూసిన లతలచాటు నుంచి రహస్యంగా నావద్దకు వచ్చాడు. "బాలికా! ఇప్పు డిక్కడ స్నానం చేసిన కన్యక ఎవని కూతురు? పేరేమిటి? ఎక్కడికి పోయింది?" అని అడిగాడు.

నేను వినయంతో - "ఆర్యా! ఈ చిన్నది హంసుడనే గంధర్వరాజు కూతురు. దీనిపేరు మహాశ్వేత. ఇప్పుడు తన నివాస స్థానమైన హేమకూటమనే పర్వతానికి పోయింది" అని చెప్పాను.

నా మాట విని అతను కొంచెంసేపు ఊరుకుని ఏదో ఆలోచించుకుని.... రెప్పవాల్పకుండా నన్ను చూస్తూ - "నువ్వు చిన్నదానివయినా నీ గౌరవాన్నీ యోగ్యతనీ నీరూపం వెల్లడి చేస్తోంది. నిన్నొక టడుగుతాను, కాదనకుండా చేస్తావా?" అని ప్రాధేయపడుతున్నట్లే - మెల్లగా అడిగాడు.

నేను - "ఆర్యా! మీరలా మాట్లాడదానికి నేనెంతటిదానిని? త్రిలోకాలకీ పూజనీయులైన మీలాటి మహాత్ములు మా పూర్వపుణ్యం కొద్దీ కాకపోతే మాలాటి వారి మీద దృష్టయినా ప్రసరింపజేయరు. ఆజ్ఞాపించండి. ఈ దాసురాలు చేయవలసిన పనేమిటో దయచేసి చెప్పండి నమ్మకంగా చేసి మీ అనుగ్రహానికి నోచుకుంటాను" అన్నాను వినయంగా నమస్కరిస్తూ.

అప్పుడతను నన్ను స్నేహితురాలిగా మన్నించి, దగ్గరలో ఉన్న లేత తమలపాకును కోసి, రాతిమీద రసంతీసి - తన ఉత్తరీయంలో ముక్క చించి, దానిమీద ఆ రసంతో రాసి "నువ్వీ ఉత్తరం తీసుకెళ్ళి ఆ రాజకుమార్తె ఏకాంతంగా ఉన్నప్పుడివ్వు." అంటూ దానిని నా కిచ్చాడు. నేను దానిని పదిలంగా తెచ్చాను. ఇదిగో, చూడు" అంటూ తాంబూలం పెట్టిలోంచి తీసి అందించింది.

ఆ మాటలకే ఎంతో ఆనందం కలిగిన నేనా లేఖ నందుకుని ఆ అక్షరాలను చూసి - కళ్ళ కద్దుకున్నాను దానిలో చక్కని పద్యం రాయబడి ఉంది. నన్నతను ప్రేమిస్తున్నట్లు వ్రాసిన ఆ పద్యం చదివి - త్రిలోకాలనూ పొందినట్లే ఆనందించాను దానిని బుగ్గలకీ పెదవులకీ అంటించుకున్నాను. అతని గురించి తరళికను అడిగాను. అత నేంచేశాడో చెప్పమన్నాను.

నిన్నెలా చూశాడు? ఏం చెప్పాడు? నీతో ఎంతసే పున్నాడు? - అంటూ అడిగాను. ఎలాగో ఆ పగలు గడిపాను.

సూర్యుడస్తమించాక. ఛత్రగ్రాహిణి వచ్చి - "రాజపుత్రీ! మునికుమారులలో ఒకరు వచ్చి, ద్వారం వద్ద నిలబడి జపమాలిక నడగడానికి వచ్చా మంటున్నారు. ప్రవేశానికి అనుమతిస్తారా?" అని అడిగింది.

నే నతని నామమే జపిస్తూ. .అతనే వచ్చి ఉంటాడనుకుంటూ వేగంగా తీసుకురా" అన్నాను

అది వెళ్ళి - మునికుమారుడి స్నేహితుడైన కపింజలుడిని తీసుకువచ్చింది. అతను విచారంగా ఉన్నట్లు కనిపించాడు అప్పుడు నేను లేచి, నమస్కరించి స్వయంగా పీఠం తెచ్చి వేశాను. అతను వొద్దంటున్నా బలవంతంగా అతని పాదాలు కడిగి తుడిచాను. అతనికి దగ్గరగా కూర్చున్నాను.

అతను కొంచెంసేపు అలా కూర్చుని.. ఏదో చెప్పదలుచుకుని ... నా దగ్గరగా ఉన్న తరళిక మీదకి దృష్టి సారించాడు. అతని అభిప్రాయం గ్రహించి - "దేవా. ఇది నా శరీరం లాటిది చెప్పదలుచుకున్నది మీరు నిస్సంశయంగా చెప్పవచ్చు" అన్నాను.

అప్పుడు అతను "రాజపుత్రీ. ఏమని చెప్పేది? సిగ్గుతో నాకు మాట పెగలడం లేదు కందమూలాలు తింటూ ప్రశాంతంగా అడవులలో తిరిగే మునిజన మెక్కడ? మన్మధ విలాసము లెక్కడ? అంతా విపరీతంగానే ఉంది. దైవ మేం చేయడానికి సంకల్పించాడో చూడు. నా సందేశం చెప్పడం కంటె మరో ఉపాయం కనపడడం లేదు.

ప్రాణత్యాగం చేసయినా మిత్రుణ్ణి రక్షించాలంటారు. విను. నీముందు నేనతనిని అలా నిష్టురాలాడి, అక్కడ ఉండక మరోచోటుకి పోయాను. తరవాత నువ్వు వెళ్ళిపోయావు. ఇతనేం చేస్తున్నాడో చూద్దామని నేను మళ్ళీ వొచ్చి కొమ్మల సందులోంచి చూశాను. అక్క డెక్కడా అతను కనపడలేదు. మే మిద్దరం పుట్టాక ఒక్క క్షణమేనా ఒకరినొకరం వదిలి ఉండలేదు. అందుచేత నా హృదయం తడబాటు పడుతూంటే - 'అయ్యో.' నా మిత్రుడు మన్మధవికారంలో ఆమెవెంట పోయి - తిరిగి నావద్దకు రావడానికి సిగ్గుపడుతున్నాడేమో లేకపోతే కోపంతో నన్ను వదిలి ఎక్కడికేనా పోయాడా? ఏమైపోయాడో?" అని కీడు శంకిస్తూ, చెట్లూ, పుట్టలూ, లతలూ, పొదలూ అన్నీ వెదికాను.

ఒక చెరువు వొడ్డున లతకింద, బొమ్మలా కదలకుండా ...యోగంలో ఉన్నవాడిలా ..మన్మధశాప భయంతో అణిగి ..కళ్ళనుంచి నీరు కారుతూంటే - నిట్టూర్పులు విడుస్తూ. .ఎడమ చేతిలో చెక్కిలి ఉంచుకుని . పిచ్చివాడిలా .. పరధ్యానంగా ఉన్న పుండరీకుడు కనిపించాడు.

అతని ఆకారమూ అవస్థా చూసి – 'మన్మథుడి దెంత వేగం! నిముషంలో యితని నింత అవస్థపాలు చేశాడు! అతని జ్ఞానమంతా ఒక్కమారుగా వ్యర్థమయింది. ఎంత చిత్రం! చిన్నప్పటి నుండీ ఎంతో ధీరుడిగా ఉండేవాడు. మనసును చలింపనివ్వక మాలాటి వారికి నీతులు చెప్పేవాడు. అతని తపఃప్రభావాన్నంతటినీ మన్మథుడు మంట కలప గలిగాడు! ఇది యౌవన మహిమ! కానియ్" అనుకుంటూ నేను మెల్లగా అతని వద్దకు చేరి ఆ రాతి పలక మీద వెనుకగా కూర్చుని – "మిత్రమా! పుండరీకా! ఇలా ఉన్నావేం?" అని అడిగాను.

అప్పు డతను ఎలాగో కళ్ళు తెరచి – నన్ను చూసి నిట్టూర్చుతూ, సిగ్గు పడుతూ పొడి పొడి మాటలలో – "కపింజలా! అంతా తెలిసీ యిలా అడిగితే నేనేం చెబుతాను?" అన్నాడు మెల్లగా.

అతని స్థితి చూసి – మరల్చలేమని తెలిసి పోయినా, మిత్రుణ్ని సన్మార్గంలో పెట్టడం ఉచితం కనక నాశక్తి కొద్దీ చెప్పి చూద్దామను కున్నాను. మెల్లగా యిలా అన్నాను.

"పుండరీకా! నీ సంగతి తెలియబట్టే యిలా అడుగుతున్నాను. నువ్వు అవలంబిస్తున్న మార్గం గురువులు చెప్పినదా? శాస్త్రాలలో ఉందా? నియమమా? ముక్తి ప్రాప్తికి కారణమా? మనసులో అయినా ఆలోచించ దగినదా? చెప్పు. అజ్ఞానిలా, మన్మథుడిని హరించిన వానిచేత పరిహాసం పొందడం తెలుసుకోవేం? నీకు ఇంద్రియ సుఖాలపట్ల అభిలాష ఎలా కలిగింది? జ్ఞానం తెచ్చుకోవేం? మనసుని నిగ్రహించవేం? ఇంద్రియాలను జయించవేం? ఈ మన్మథుడేపాటివాడు? ధైర్యంగా వాడిని ఓడించు."

నే నలా అంటూండగానే – "కపింజలా! మాటలతో ప్రయోజన మేముంది? మన్మథుడి బారిన పడని వాడు ఎన్ని మాటలేనా చెప్పొచ్చు. ఉపదేశించ బడడానికి సమయాన్ని దాటిపోయాను. జ్ఞానం నిలుపుకొనే శక్తిని కోల్పోయాను. నీ మాటలు నేను వినవలసినదే. కాని నా మనోవికారాన్ని మరలించుకోలేకపోతున్నాను. మదనతాపంతో నా శరీరావయవాలు అన్నీ ఉడికి పోతున్నాయి. దీని కేదయినా ఉపాయం చెప్పు. నీ ప్రియమిత్రుణ్ని బతికించుకో." అని ఊరుకున్నాడు.

నే నెన్ని నీతులూ శాస్త్రాలూ చెప్పినా అతని చెవికి ఎక్కలేదు. ఇక ఉపదేశాలతో లాభంలేదని నేనా చెరువులోకి దిగి తామరతూళ్ళూ తామరాకులూ, తామరపూలూ కోసుకువచ్చి ఆ ప్రాంతంలో ఉన్న లతామంటపంలోని రాతి పలక మీద పక్కలా పరచి, అతన్ని దాని మీద పడుకోబెట్టి, చందనపు పూత పూసి, అరటాకుతో విసరుతూ – 'వివిధ విలాసాలకు నిలయమయిన గంధర్వరాజపుత్రిక ఎక్కడ? ఇత నెక్కడ? ఈ ఆపదను ఎలా గట్టెక్కించగలను? ఏం చేయాలి? అహ...ఆలోచనల కేమీలేదు. ఇతనిని ఆమెతో కూర్చితే తప్ప బతకడు. తపస్వులకు ఇది తగదని ఊరుకున్నానో ఇతను చనిపోతాడు. ఏం చేసయినా స్నేహితుడి ప్రాణం దక్కించడం ప్రథమ కర్తవ్యం. కనుక ఇప్పుడు నే నామె దగ్గరికి పోవడమే ఉచితం. పోయి ... ఇతని అవస్థంతా ఆమెకు చెబుతాను.' అని నిశ్చయించుకుని కూడా అతనికి చెప్పకుండా అక్కడినుంచి బయలుదేరి నీ వద్దకు వచ్చాను. ఇప్పుడు ఏం చేయాలో ఆలోచించు" అని ఊరుకున్నాడు".

ఆ మాటలు నాకు అమృతం లాగే తోచాయి. ఆనందబాష్పాలు చిమ్ముతూంటే – సిగ్గుతో తలవాల్చుకున్నాను. పాపం, మన్మథుడు నన్నులాగే అతన్నీ బాధిస్తున్నా డన్నమాట! మంచిపనే చేస్తున్నాడు. ఇప్పుడు కపింజలుడి కేం చెప్పాలి? ఏం చెయ్యాలి? అని అనేకవిధాలుగా ఆలోచిస్తూంటే – అదే క్షణంలో దాసివచ్చి – "రాజపుత్రీ! నీకు అస్వస్థతగా ఉందని విని నిన్ను చూడ్డానికి మీ అమ్మగారు వస్తున్నారు" అని కబురు తెచ్చింది.

ఆ మాటవిని కపింజలుడు ఎవ రెవరో వస్తారని సంకోచించి – "రాజపుత్రీ! సూర్యాస్తమయం ఔతూంది. నేను వెళ్ళొస్తాను. నా మిత్రుడి ప్రాణాలు రక్షించమని నీకు దణ్ణంపెడుతున్నాను. చేయవలసిందేదో చెయ్యి" అని – జవాబు కోసం కూడా చూడకుండా వెళ్ళిపోయాడు.

నా తల్లి వచ్చి కొంతసేపుండి వెళ్ళిపోయింది. ఆమె ఏం మాట్లాడిందో, ఏం చేసిందో నాకు తెలియదు.

అంతలో సాయంకాల మయింది."తరళికా! నీకంతా తెలుసు. కపింజలుడు చెప్పింది బాగా ఆలోచించి నేను చేయవలసింది చెప్పు. ఇతర కన్యలలా నేను సిగ్గువదలి, ప్రజల విమర్శలను లెక్కచెయ్యక, తండ్రి అనుమతి పొందక అక్కడికి పోయి పుండరీకుణ్ని కలుసుకుంటే అధర్మ మౌతుంది. ధర్మానికి భయపడి నేను వెళ్ళకపోతే చనిపోతాను. నామీద ఆశపెంచుకున్న పుండరీకుడు కూడా ప్రాణత్యాగం చేస్తాడు. అందువల్ల పాప మొస్తుంది. రెండింటిలోనూ ఏది నయమో నిర్ణయించు" అని నేను అంటూండగానే చంద్రోదయ మయింది. ఆ వెన్నెల కూడా నిప్పులవర్షంలా అనిపించి నేను మూర్ఛ పోయాను.

తరళిక ఎన్నిసార్లు పిలిచినా పలక్కపోడంతో నాకు శైత్యోపచారాలు చేసింది. నాకు కొంచెం తెలివి వొచ్చింది.

"దేవీ! నువ్విక సిగ్గుపడి లాభం లేదు. ధర్మానికి వెరిస్తే ప్రమాదం రాకపోదు. నా యందు దయుంచి పుండరీకాక్షుడున్న చోటికి పోదాం రా. అతను నిన్ను కౌగలించుకుంటే కాని నీ శరీరంలోని వేడి తగ్గదు" అంది తరళిక వినయంగా.

" ఈ చందుద్రే ప్రాణాలు తీసేస్తూంటే ఆ మన్మథుడి మాట వేరే చెప్పడ మెందుకు? అలాగే పోదాంలే. అతన్ని సంతోష పెడతాను" అంటూ ఎట్టకేలకు ఆమెను పట్టుకుని బయలుదేరాను.

ఆ సమయంలో నాకుడి కన్నదరింది. "అయ్యో! దైవం యిలాటి సూచన చేస్తున్నాడేమిటి? ఏం జరిపించ దలుచుకున్నాడు? - అని శంకిస్తూనే - యితర దాసీలకు తెలియకుండా - తాంబూలాలు, సుగంధ ద్రవ్యాలు పట్టుకుని పారిజాత గుత్తి ధరించి, తరళిక వెంటరాగా ఆ మేడ నుంచి వచ్చి రహస్య మార్గంలో అచ్ఛోద సరస్సు దగ్గరున్న అడివికి వస్తున్నాను. నాకేమీ భయం కలగలేదు. ప్రియుడికోసం ఒంటరిగా బయలు దేరేవారికి మన్మథుడే సాయంగా ఉంటాడు కాబోలు. నాకంటే ముందుగా నా హృదయం పరుగెత్తసాగింది.

నేను తరళికను చూస్తూ - "ఈ మన్మథుడు నన్నులాగే పుండరీకుణ్ని కూడా నాకెదురుగా తీసుకురాడు కదా?" అన్నాను.

అది నవ్వుతూ - "నువ్వు ముద్దరాలివి సుమీ!" అంది. మే మక్కడికి చేరాము. ఆ సరోవరపు పడమటి వొడ్డు దూరం అవడం వల్ల - అస్పష్టంగా ఒక పురుష రోదన వినిపించింది. ఆ ధ్వని విన్నంతనే నా హృదయం తడబడింది. "తరళికా! ఇదేమిటి?" అంటూ నా శరీరం వొణుకుతూంటే - చాలా వేగంగా అటువేపు వెళ్ళాం. ఆ సమయంలో నిశ్శబ్దంగా ఉండడం వల్ల ఆ మాటలు యీసారి స్పష్టంగానే వినిపించసాగాయి.

"హా! పుండరీకా! హా ప్రాణమిత్రా! నీ కెలాటి ఉపద్రవం సంభవించింది! నీతిమాలిన మహాశ్వేతవలనే కదా! కటకటా! శ్వేతకేతుడి కెంత ముంచుకొచ్చింది! ధర్మమా! నిన్నిక ఎవరు స్వీకరిస్తారు? తపస్సా! నిన్నిక ఎవ రాచరిస్తారు? సరస్వతీ! విధవ వయ్యావే. సత్యం అనా ధయిందే. అయ్యో! మిత్రమా! నన్ను చూడవేం? నిన్ను విడచి ఒక్క క్షణమయినా ఉండలేనే. నన్ను విడచిపోడం నీకు న్యాయమా? ఒక్కసారి మాట్లాడు. ఇక నేనెక్కడికి పోవాలి? ఎవరితో తిరిగేది? నా తోటి స్నేహమంతా ఎక్కడి పోయింది? ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడేవాడివే. ఆ ప్రజ్ఞంతా ఏమైపోయింది. అయ్యో! హా" అంటూ కపింజలుడు విలపిస్తున్నట్లు వినిపించింది.

అప్పుడు నాకు ప్రాణాలు పోయినట్లే అనిపించింది. ఎంతో ప్రయత్నించి నడుస్తున్నా మిట్ట పల్లాలు తెలుసుకోలేక అడుగులు తడబడుతూంటే - ఎవరో బలాత్కారంగా తీసుకు పోతున్నట్లు ఎలాగో ఆ ప్రదేశం చేరుకుని - మణిశిలాఫలకం మీద, పూలశయ్యపై దీర్ఘనిద్రలో మునిగి, మన్మథ వ్యధని సహింపలేక నిశ్చేతనుడై సుఖిస్తున్నట్లు, ప్రాణాలు పోయినా తేజస్సు కోల్పోని పుండరీకుణ్ని - మహా పాపాత్మురాలినైన నేను చూశాను.

కపింజలుడు నన్ను చూసి రెట్టించిన శోకంతో, అతనికంఠాన్ని కౌగలించుకుని మరింత ఎక్కువగా ఏడవసాగాడు. నేను మూర్ఛపోడంవల్ల - ఏమయ్యానో ఎరగను. నా ప్రాణా లెందుకు పోలేదో?

కొంతసేపటికి నాకు తెలివి వచ్చింది. అప్పుడు నా శరీరం అగ్నిలో పడినట్లు - భరించలేని విచారంతో నేలమీద పడి కొట్టుకోడం చూశాను. ఇదేమి ఉపద్రవం, యిలా సంభవించిందని పెద్ద కంఠంతో "హా అంబ! హా! తండ్రీ! హా! సఖులారా! హా! నాథా! నన్నొంటరిగా విడిచి ఎక్కడికి పోయావో చెప్పు. నీకోసం ఎలాటి అవస్థ పడ్డానో తరళిక నడుగు. ఒక్కరోజే వెయ్యి యుగాలుగా గడిపాను.

ఒకసారి మాట్లాడు. ప్రేమచూబించు. నా కోరిక తీర్చు. నేను నీ భక్తురాలిని, ప్రియురాలిని, బాలని, అనాథని, మదన పీడితురాలిని. ఇలాటి నా మీద దయలేదా? నేనేం నేరం చేశాను? అయ్యో! నావల్ల ఎలాటి అవస్థ పొందావు? నా కీబ్రహ్మహత్యాపాతకం ఎలా పోతుంది? నేను మహా పాపాత్మురాలిని. ఇలాటి నిన్ను వదిలి యింటికి పోయాను. ఇంకనాకు తల్లితండ్రులతో ప్రయోజన మేముంది? బంధువు లెందుకు? దైవమా! నన్ననుగ్రహించు. తల్లీ! భూదేవీ! లోకానుగ్రహకారిణీ! నీకే నామీద దయలేదా!" అని విలపిస్తూ - అతని శరీరంమీద పడి చెక్కిళ్ళు ముట్టుకుంటూ, జటముడి సవరిస్తూ, ముఖం ముద్దు పెట్టుకుంటూ' కంఠం కౌగలించుకుంటూ, "అయ్యా! ఇతన్ని బతికించండి" అని కపింజలుడి పాదాలమీద పడుతూ, తరళికను పట్టుకుంటూ ఎంతగానో దుఃఖించాను.

అదొక అవస్థ. నానోటి నుంచి ఏ మాటలు వస్తున్నాయో నాకే తెలియదు. జలయంత్రాలలోంచిలా నా కళ్ళలోంచి నీళ్ళు చిమ్ముతున్నాయి. మూర్ఛపోయాను.

ఉద్వేగంతో ఆమె అనుభవించిన అవస్థ తలుచుకుంటేనే శరీరం వొణుకుతూంది, వింటున్న అతనికి. పడిపోతున్న ఆమెను చంద్రాపీడుడు చేతులతో పట్టుకున్నాడు పడిపోకుండా.

మహాశ్వేత కళ్ళు తెరిచింది.

"నా వల్ల నువ్వు మళ్ళీ పడుతున్న విచారం నాకు తాపం కలిగించింది. ఇంకేమీ చెప్పకు నేను వినలేకపోతున్నాను. గతించినవైనా

అప్తుల దుఃఖాలు వింటూంటే అంత వేదనా కలుగుతుంది. అతి ప్రయత్నంతో నిలబెట్టుకున్న నీ ప్రాణాలకు మళ్ళీ క్షోభ కలిగించకు" అన్నాడు చంద్రాపీడుడు.

"రాజపుత్రా! అంతదారుణమైన శోకంలోనే వదలని ప్రాణాలు యిప్పుడెందుకు నన్ను వదులుతాయి. పాపాత్మురాలినయిన నాకు యముడు కూడా భయపడుతున్నాడేమో. నేను కఠినాత్మురాలిని. సిగ్గులేని దానిని. అనుభవించిన దానిని చెప్పడం ఏం కష్టం? ....తరవాత జరిగినది విను" అంటూ మళ్ళీ తనకథ చెప్పసాగింది.

అలాగ పరిపరివిధాల దుఃఖించి...తరళికని చూసి – "ఇక జీవితమెందుకు? చింతెందుకు? అగ్నిలో పడి ప్రాణేశ్వరుణ్ని కలుసుకుంటాను– అన్నాను" అంది మహాశ్వేత.

ఆ సమయంలో – అంతరిక్షంనుంచి చంద్రమండలంనుంచి తెల్లని ఉత్తరీయం వేలాడుతూండగా, మనోహరమైన అలంకారాలలో, మహాపురుష లక్షణాలతో, ఒక దివ్య పురుషుడు, తన దేహపు తెల్లని కాంతి ప్రపంచమంతా వ్యాపిస్తూండగా అక్కడికి వచ్చి అతి చల్లని తనవేళ్ళతోనూ, బలమైన భుజాలతోనూ – విగత జీవిఅయి పడున్న పుండరీకుడి శరీరం ఎత్తుతూ – నన్నుద్దేశించి –గంభీరస్వరంలో –

"మహాశ్వేతా! నువ్విప్పుడు ప్రాణత్యాగం చెయ్యొద్దు. నీ కితనితో మళ్ళీ సమాగమం ఔతుంది" అని తండ్రిలా ఓదార్చి, అతను పుండరీకుడి శరీరంతో సహా ఆకాశమార్గాని కెగిరి వెళ్ళిపోసాగాడు.

అప్పుడు నేను – భయఆశ్చర్యాలతో – తల పైకెత్తి చూస్తూ – "ఇదేం అద్భుతం? చెప్పు" అని కపింజలుడి నడిగాను.

అతను నాకు జవాబు చెప్పకుండా తొందరగా లేచి, కోపంగా.. "యమా! దురాత్మా! నా మిత్రుడి నెక్కడికి తీసుకు పోతున్నావ్?" అంటూ ఉత్తరీయం నడుముకి బిగించి – అతన్ని దాటుకుంటూ ఆకాశంలోకి ఎగిరాడు. మేము చూస్తూండగానే వాళ్ళు నక్షత్రమండలంలో ప్రవేశించి మాకు కనపడకుండా అతర్ధానమై పోయేరు.

ప్రియుడి మరణంతో పాటు స్నేహితుడి అంతర్ధానం నా హృదయాన్ని మరింత శోకమయం చేసింది. ఏం చేయాలోతోచక - తరళిక వేపు చూస్తూ - "నాకేమీ అర్థం కావడం లేదు నీకేమేనా తెలిస్తే చెప్పు. ఇదంతా ఏమిటి?" అని అడిగాను. అది -

"దేవీ! పాపాత్మురాలినైన నాకేమీ అర్థం కావడంలేదు ఐనా ఆ దివ్యపురుషుడు నిన్ను తండ్రిలా ఓదార్చడం వింతగా ఉంది అతనికి అబద్ధమాడవలసిన అగత్యమేమీ లేదు. కనుక నువ్విప్పుడు ప్రాణత్యాగ యత్నాన్ని విరమించి మరలడమే ఉత్తమం. ఆ దివ్యపురుషుడి వెంట కపింజలుడుకూడా వెళ్ళాడు కదా. అతను తిరిగి వచ్చేవరకూ అయినా ప్రాణాలతో ఉండు. మరణానికేం తొందర? తరవాత చూసుకోవచ్చు" అంటూ నా పాదాల మీద పడింది.

ఎవరికేనా జీవితాశ అతి గట్టిది. కనక నే నామె చెప్పినట్లే చేయదలచి, కపింజలుడి రాకను కోరుకుంటూ దారుణమయిన ఆ రాత్రిని తరళిక సాయంతో వెయ్యి యుగాలంత భారంగా వెళ్ళదీశాను.

మర్నాడు ఉదయమే ఆ సరస్సులో స్నానం చేసి, పుండరీకుడికి ప్రీతి కలిగేటట్లు అతని కమండలమూ, వస్త్రమూ, జపమాలికా దరించి - సంసారం నిస్సారమనీ, శోకం నివారింప లేనిదనీ, దైవం కరినుడనీ, సుఖాలు అనిత్యములనీ నిశ్చయించుకుని - తల్లి తండ్రులని లెక్కచేయక, బంధువర్గాన్ని నిరసించి, స్నేహితులని వదిలి, ఇంద్రియ సుఖాలను త్యజించి, మనసుని నిగ్రహించుకుంటూ, బ్రహ్మచర్యవ్రతం స్వీకరించి - భక్త జనవత్సలుడైన యీ దేవుని ఆరాధించసాగాను.

నా వృత్తాంతం విని, నాతండ్రి బంధువు లందరితోనూ వచ్చి - నన్నింటికి రమ్మని ఎంతేనా బతిమాలాడు. కాని నా మనసు మరలలేదు. పుత్రికా వాత్సల్యం కొద్దీ అతను నాకోసం చాలాసేపు చూసి - చివరకి, నిరాశతో దుఃఖిస్తూ యింటికి వెళ్ళిపోయాడు.

అప్పటినుంచీ - నే నీ ప్రాంతంలో ఆ మహాత్ముడికి కన్నీటితోనే కృతజ్ఞత చూబించుకుంటూ అతని గుణగణాలను జపించుకుంటూ, ఎన్నో

విదాలయిన నియమాలతో శరీరాన్ని కృశింపజేసుకుంటూ, తరళకతో కలసి యీ గుహలో నివసిస్తున్నాను ఆ బ్రహ్మహత్యా పాతకురాలిని నేనే ఇదే నా వృత్తాంతం" అని చెప్పి మహాశ్వేత వస్త్రం అంచుతో ముఖం కప్పుకుని, వేగంగా ఉబుకుతున్న కన్నీటిని తుడుచుకుంటూ బిగ్గరగా ఏడవసాగింది

ఆ వృత్తాంతమంతా విన్న చంద్రాపీడుడు - కృతజ్ఞత, సంతోషం కలగగా - "భగవతీ! సాధారణంగా మానవులు స్నేహానికి సమానమైన పనిచేయలేక వ్యర్థమైన కన్నీటితోనే, స్నేహాన్ని ప్రకటించు కుంటారు అలా కాకుండా నువ్వు పుండరీకుడి పట్ల నీ స్నేహాన్నీ ప్రేమనీ క్రియారూపంలో వెల్లడించుకుంటూ కూడా నిన్ను నువ్వు నిందించు కుంటావేం? అతనికోసం అష్టైశ్వర్యాలనీ తృణప్రాయంగా త్యాగం చేశావు. తల్లి తండ్రులని వదులుకున్నావు. స్త్రీలెవరూ పాటించలేని అతి కఠోర నియమాలు పాటిస్తూ శరీరాన్ని బాధ పెట్టుకుంటున్నావు.

అంతేకాకుండా ఎంతో ప్రయత్నం చేతకానీ ఆత్మ క్లేశములలో ఉండదు. మరణ మనేది పండితులు కాని వారు తలపెట్టవలసినది. తండ్రికాని, తల్లికాని, భర్తకాని, మిత్రుడు కాని మృతి చెందేటప్పుడు తానుకూడా చనిపోడం కంటె అవివేకం లేదు. అందువలన వారికేమైనా ఉపకారం జరుగుతుందా? చనిపోయిన వారినీ తిరిగి తీసుకొస్తుందా? పరలోక సౌఖ్యమిస్తుందా? కనపడతారా? ఏమీ జరగదు, సరికదా ఆత్మహత్యా పాతకం మాత్రం వేధించి వదులుతుంది

బతికుంటే - విధులచే ఉపకృతి చేయవచ్చు. రతీదేవి వృత్తాంతమే ఇందుకు సాక్షి తనప్రియుడై మన్మథుడు శివుడి చూపుల మంటలో దగ్ధమైనా, ఆమె మరణించక మరోరీతిలో ఆమె తన ప్రియుడిని పొందుతూంది ఎందరో స్త్రీలు - ప్రియులు మరణించినా ప్రాణాలు వదలక, జీవించి ఉండి సుఖా లనుభవించడం నువ్వు వినలేదూ? అదీకాక.. దివ్యపురుషుడిచేత స్వయంగానే పునస్సమాగమాన్ని సూచించే మాట చెప్పబడింది కదా? అది వృధా ఎందు కౌతుంది?

ఆ మహానుభావుడు నిస్సంశయంగా దేవలోకంనుంచి తిరిగి రాగలడు. మహాత్ముల ప్రభావం అమోఘం. పరలోకానికి వెళ్ళి కూడా తిరిగి వచ్చిన వారి చరిత్రలు మనం పురాణాలలో ఎన్నో వింటున్నాం. పుండరీకుడు కూడా అలాగే రావచ్చు. రాకపోయినా ఏం చేయగలం? ఎవరిని నిందిస్తాం? విధి అత్యంత బలీయమైనది. ఆత్మని నిందించుకోకూడదు. ఒక జన్మలో సమాగమం, సహస్ర జన్మలలో విరహం కలుగుతుంటాయి. సంసారమే – ధీరులు కాని దాటరానిది" అంటూ అత నామెను మృదువయిన మాటలతో ఓదార్చి, మళ్ళీ మంచినీరు తెచ్చి బలాత్కారంగా ఆమెచేత కన్నీటి ముఖాన్ని కడిగించాడు. అంతలో – మహా శ్వేతవృత్తాంతాన్ని విని శోకించిన వాడిలా సూర్యుడు అస్తమించాడు.

అని చెప్పి, మణిసిద్ధుడు – "గోపా! ఇప్పుడు వేళ దాటిపోయింది. తరువాతికథ చాల పెద్దది. కనక ముందరి మజిలీలో చెబుతాను. ఇప్పుడు వెళ్ళి కట్టెలు తీసుకురా, వంట చేసుకుని తిందాం" అన్నాడు.

వంటచేసి, భోజనాలు ముగించుకుని...ఆ యతీశ్వరుడి వెనక కావడి మోస్తుంటే కూడా గోపాలుడిలో ఎన్నో సందేహాలే. మహాశ్వేతని పుండరీకుడు మళ్ళీ కలుసుకుంటాడా? తరవాత చంద్రాపీడు డేం చేశాడు? ఎక్కడికి పోయాడు? ఏం జరిగింది? – అని వాడు గురువు నడక్కుండా ఉండలేకపోయాడు. వా డెన్నివిధాల అడిగినా – గురువు మౌనం వదలక చేతి సంజ్ఞతో వారిస్తూ – తరవాత మజిలీ చేరాకనే – తరవాత కథ చెప్పసాగాడు. గోపాలు డెంతో ఆసక్తిగా చెవు లప్పగించి వినసాగాడు.

# కాదంబరి కథ

"అలాగ - సాయంకాల మయిపోదంతో - మహాశ్వేత మెల్లగా లేచి, కమండలంలోని జలాలతో పాదాలు కడుక్కుని, మలిసంజ నుపాసించి, శిలాతల్పంమీద కూర్చుంది. చంద్రాపీడుడు కూడా సంధ్యా ప్రణామములు చేసి, మరో రాతిమీద శయ్య ఏర్పరచుకుని కూర్చుని, ఆమె వృత్తాంతాన్నే పలుమార్లు తలుచుకుంటూ, మన్మథ ప్రభావానికి ఆశ్చర్యపోతూ....

"భగవతీ! నీ పరిచారిక తరళిక ఎక్కడికి పోయింది?" అని అడిగాడు. అందుకామె... "చెబుతాను, వినండి. గంధర్వకుల నాయకుడైన చిత్రరదుని ప్రసిద్ధి గురించి మీరు వినే ఉంటారు. అతనికి కాదంబరి అనే కూతు రుంది. ఆమె నాకు రెండో హృదయం లాటిది. చిన్నప్పటి నుంచీ మేము కలిసే ఉండేవాళ్ళం. కలిసే విద్య లభ్యసించాం. ఆమె నా గతివిని చాలా దుఃఖిస్తూ- 'నా స్నేహితురాలైన మహాశ్వేత అలా దుః ఖంలో ఉండగా నేనెంత మాత్రమూ వివాహం చేసుకోను. ఒకవేళ మా తండ్రి నాకు బలవంతంగా పెళ్ళి చేయబోయాడో, ఉరి పోసుకుని చచ్చిపోతాను' అని స్నేహితుల ముందు శపధం చేసింది.

ఆ నోటా యీనోటా చిత్రరధుడా విషయం విని చాలా విచారిస్తూ - ఒకే సంతానం కలవా దవడం వల్ల ఆమెను మందలింపలేక, మరో ఉపాయం తట్టక, క్షీరోదుడనే దూతను నా వద్దకు పంపి - "మహాశ్వేతా! నీ చెలి కాదంబరి సంపూర్ణ యౌవనం వచ్చినా వివాహ మాడనని మూర్ఖం చేస్తోంది. ఎవరెంత చెప్పినా వినడం లేదు. దాని మనసు మరల్చగలిగినవారు నీకంటె మరొకరు లేరు. ఎలాగేనా నువ్వు ఆ కష్టాన్ని తొలగించాలి" అని వార్త అందజేశాడు.

నేనది విని, పెద్దవారి మాట మీద గౌరవం చేతా, స్నేహితురాలి పట్ల మక్కువ చేతా - "అయ్యో! కాదంబరీ! అసలే దుఃఖిస్తున్న నన్ను మరింత దుఃఖ పెడుతున్నావేమిటి? నాకు సంతోషం కలిగించాలనే ఉద్దేశం నీకుంటే - తండ్రి చెప్పిన విధంగా నడుచుకో. ఇదే నా యిష్టం.

– అని నా మాటగా చెప్పమని – తరళికను క్షీరోదుని వెంట యివాళే పంపాను. అది వెళ్ళిన కొంచెం సేపటికే తమరు దయచేశారు " అని చెప్పి ఊరుకుంది.

అంతలో చంద్రుడు ఉదయించాడు. మహాశ్వేత నిద్ర పోయింది. చంద్రాపీడుడు 'అయ్యో! ఇప్పుడు వైశంపాయను డేం చేస్తున్నాడో? రాజపుత్రులే మంటారో...' అని మనసులో అనుకుంటూ, తనుకూడా నిద్రపోయాడు.

ప్రభాత సమయంలో మహాశ్వేత, చంద్రాపీడుడు మేలుకుని కాలకృత్యాలు తీర్చుకున్నారు. అప్పుడు మనోహరమైన వేషంతో – కేయూరకు డనే గంధర్వ కుమారుడితో తరళిక అక్కడికి వచ్చింది. అక్కడ కూర్చున్న రాజపుత్రుడిని చూసి, అతనిని పరీక్షగా పట్టి పట్టి చూసి తలూపి...మహాశ్వేత వద్దకు నడిచింది. ఆమెకు నమస్కరించి జపమయ్యే వరకూ దగ్గరలో కూర్చుంది.

మహాశ్వేత జపం ముగించి, తరళికను చూసి – " కాదంబరి సుఖంగా ఉందా? నా మాటలు చెప్పావా? ఏమంది? ఒప్పుకుందా?" అని అడిగింది.

ఆమె వినయంగా తలవంచి – "రాజపుత్రీ! నేను వెళ్ళి ఆమెను చూశాను. కాదంబరి క్షేమంగానే ఉంది. నీ సందేశ మంతా వినిపించాను. కన్నీరు కార్చుతూ, కేయూరకు డనే తన వీణావాహకుడి కేదో చెప్పి ఇక్కడికి పంపింది. అంతా అతనే చెబుతాడు" అంది.

అప్పుడు కేయూరకుడు లేచి మహాశ్వేతకి నమస్కరించి – "దేవీ! మారాజపుత్రి నీ కిలా విన్నవించమని నన్ను పంపింది. మిత్రులారా! ఇప్పుడు తరళిక చెప్పిన మాటలన్నీ విన్నాను. నా మనస్సును పరీక్షించడానికా? స్నేహం వదిలెయ్యడానికా? ఇంట్లో ఉండిపోయిన అపరాధాన్ని ఆక్షేపించడానికా? కోపమా?.... .ఎందుకోకాని నువ్వు ఇలాటి వార్త పంపడం నాకు చాలా బాధగా ఉంది స్నేహితురాలు విచారంతో అడవులలో తిరుగుతూ వ్రతాలతో కృశించి పోతూంటే నేను

సుఖమెలా అనుభవించ గలను? ఉదాసీనత ఎలా పాటించగలను? సంసారమేమి రుచిస్తుంది? నవ్వు కూడా రాదే!

ని న్నిలాటి అవస్థకు గురిచేసిన క్రూరుడైన మన్మథుణ్ని నేనెలా ఆదరిస్తాను? పద్మాలు సూర్యు దస్తమించడంతోనే విధవ లౌతూంటే వాటి సహవాసంతో చక్రవాక యువతి కూడా సమాగమ సుఖం వదిలి పెడుతూందే! నీ మీది ప్రేమతో – స్వతంత్రించాను. పెద్దవారి మాట తిరస్కరించాను, లోకోపవాదం లెక్కచెయ్యడం మానేశాను, స్త్రీలకు అత్యవసరమైన సిగ్గుని వదిలాను. ఇప్పుడు తిరిగి ఎలా స్వీకరించగలను? నీకు నమస్కరిస్తున్నాను. నన్ను నుగ్రహించు. నా జీవితంతోనే నువ్వు అడవిలోకి వచ్చావు. ఈ విషయంలో నన్నెప్పుడూ మందలించకు. ఇలా అన్నానని కోపగించకు. నా మనసు మరలదు – అని చెప్పి కేయూరకుడు ఊరుకున్నాడు.

అతని మాటలకు మహాశ్వేత కొంచెం ఆలోచించి, తలూపుతూ...'సరే..కానియ్. కేయూరకా! నువ్వు వెళ్ళు. నేను వచ్చి చూస్తాలే" అని అతన్ని పంపివేసి, చంద్రాపీడుడివేపు తిరిగి – "రాజపుత్రా! కింపురుష రాజధాని అయిన హేమకూటానికి యిప్పుడు పోవలసి ఉంది. అది యిక్కడికి దగ్గరే. అదృష్టవశాత్తూ నీకు పట్టణ విశేషాలు చూడాలనే వేడుక ఉంటే చూసి వద్దువు గాని, రా. కాదంబరిని చిత్తవిభ్రమం నుంచి బయటపడేసేందుకు ఒకరోజు ఉండి వెళ్ళొచ్చు. అకారణంగా బంధువయిన నిన్ను చూసింది మొదలు నా హృదయ పరితాపం కొంచెం తగ్గింది. సజ్జనసమాగమం శోకాన్ని పోగొడుతుంది. మీ వంటివారు పరుల సుఖం గురించి ఆలోచిస్తారు కదా" అంది.

"భగవతీ! నిన్ను చూసిందగ్గరనుంచీ నాకూ మనసులో ఏదో ఉత్సాహం కలుగుతోంది. నన్ను కర్తవ్యానికి వినియోగించడంలో శంక లేమీ పెట్టుకోకు. నన్ను పైవాడిగా తలపకు." అంటూ చంద్రాపీడుడు హేమకూటం ప్రయాణ మవడానికి అంగీకారం తెలిపాడు.

ఒక శుభముహూర్తంలో చంద్రాపీడుడితో బయలుదేరి మహాశ్వేత హేమకూట రాజధానికి వెళ్ళింది బంగారు తోరణాలు కట్టిన

గదులను ఏడింటిని దాటి కాదంబరి అంతఃపుర ద్వారం చేరింది ఆమెను చూడగానే తొందరపడుతూ దూరంనుంచే దాసీజనం స్వాగతం పలుకుతూ దారి చూపారు. ఆ అద్భుత సౌందర్యరాశులను చూసి రాజపుత్రుడు స్వప్నమేమో అనుకుంటూ ఆమెవెంట నడవసాగాడు. అక్కడున్న గంధర్వ కన్యలు చేస్తూన్న వినోదాలు చూస్తూ మహాశ్వేత వెంట మరికొంత దూరం వెళ్ళాక – కాదంబరికి సన్నిహితులయిన లవలిక, సాగరిక, మకరిక, రజనిక, నిపుణిక, ఉత్పలిక, కలతిక, కేసరిక, కదళిక, లవంగిక, మధురికల వినోద సంభాషణలు వినిపించాయి వారందరూ అత్యంత సుందరీ మణులు వారిలో కల్లా చక్కనిదైన గంధర్వకుల చక్రవర్తి కూతురైన కాదంబరిని చూసేసరికి చంద్రాపీడుడి హృదయం ఎలా ఉందో వర్ణ నాతీతమే కాదంబరి కూడా అతన్ని చూసి ఆశ్చర్యంతో శరీరం గగుర్పాటు చెందగా – ఎలాగో అడుగులు వేసి, మహాశ్వేత కెదురు వచ్చి కౌగలించుకుంది. మహాశ్వేత కూడా కాదంబరిని కౌగలించుకుని –

"ఇతను తారాపీడుడనే భూలోకచక్రవర్తి కుమారుడు చంద్రాపీడుడు. విజయయాత్ర సందర్భంగా యిక్కడి కొచ్చాడు. ఎందుకో యితన్ని చూడడంతో బంధువులా అనిపించాడు. ఇతని సరళస్వభావం న న్నాకర్షించింది. నాలాగే నువ్వుకూడా మానవుల గురించి గమనించ గలవని యితని నిక్కడికి తీసుకువచ్చాను. నీగురించి యితనికి చాలా చెప్పాను కనుక కొత్తవాడని సిగ్గుపడకు నాతో ఎలా ఉంటావో, యితనితోనూ అలాగే ఉండు. ఇతను మనకి పరమ మిత్రుడు నమ్మదగినవాడు." అని చెప్పగానే చంద్రాపీడుడు కాదంబరికి నమస్కారం చేశాడు. ఆమె అతన్ని సత్కరించమని దాసీలకు సంజ్ఞ చేసింది.

"సఖీ! కాదంబరీ! క్షేమంగా ఉన్నావా?" అని మహాశ్వేత అడిగేసరికి – "ప్రియసఖి నానా బాధలూ పడుతూంటే ఎలా సుఖంగా ఉండగలను?" అంటూనే కాదంబరి చంద్రపీడుని వేపు దృష్టులు సారించకుండా ఉండలేకపోయింది

మహాశ్వేత – "సఖీ! మన మందరమూ కొత్త చుట్టమయిన యీ రాజకుమారుడిని ఆరాధించాలి. కనక నువ్వే అతనికి తాంబూల మివ్వు" అంది

అందుకు కాదంబరి – "సఖీ. పరిచయంలేకపోవడం వల్ల ఇవ్వడానికి నాకు సిగ్గవుతోంది. నువ్వు తీసుకుని ఇవ్వు" అంది, తలవంచుకుని మెల్లగా

"అలాకాదు నువ్వేయివ్వు" అని మహాశ్వేత ఆమెను వారించి .. బలవంతం చేసింది. అప్పు డామె శరీరం వణుకుతూంటే తాంబూలం అందించడానికి చెయ్యి జాచింది. చంద్రపీడుడు కూడా ఆమెవేళ్ళ అందాన్నిచూస్తూ చెయ్యి జాపి అందుకోబోయాడు. ఆ క్షణంలో రసాలన్నీ ఆమెలో ప్రవేశించాయి. "మన్మధునిచేత యీ దాసజనంనీక్విబడుతూంది. స్వీకరించు. న న్నర్పించుకోడాని కిది మొదలు. నా జీవితం నీ చేతిలో ఉంటుంది" అని కాదంబరిచేత చెప్పిస్తున్నట్లు మహాశ్వేత ఆమెచేత అతనికి తాంబూల మిప్పించింది. తాంబూల మిచ్చాక చేయి తీసుకుంటూ, మన్మథావస్థలో, చేతిలోంచి జారిపడిన రత్నకంకణాన్ని కాదంబరి గమనించనేలేదు.

మరో తాంబూలం కాదంబరి అతనిచేత మహాశ్వేత కిప్పించబోయేంతలో –ఒకచిలుక వారివద్దకు వచ్చి, తనని తరుము కూంటు వచ్చిన మరో చిలకని చూబిస్తూ – "కాదంబరీ. నన్ను బాదిస్తున్న అతి దుర్నీతి పరుడైన యీ పక్షి నెందుకు వారింపవు? వీనిచే పరాభవించబడుతున్న నన్ను పట్టించుకోకపోతే నీ పాదాల దగ్గరే ప్రాణా లొదిలేస్తాను సుమీ!" అంది. కాదంబరి నవ్వి ఊరుకుంది.

మహాశ్వేత ఆశ్చర్యపోతూ ఆ చిలుకేమంటూందని అడిగింది. మదనలేఖ – "దేవీ! ఈ చిలకను కాళింది అని పేరు పెట్టి మా రాజపుత్రికే పెంచింది. పరిహాసమనే పేరుకల ఆ చిలకతో స్వయంగా పెళ్ళి చేసి భార్యా భర్తలని పిలుస్తుంది ఇవాళ ఉదయం ఆ చిలక తాంబూలం అందించే తమాలికతో ఏదో మాట్లాడుతూండగా యిది చూసిందట. అప్పటినుండీ కాళింది ఆ చిలకని చూడదు, మాటాడదు, చేరనివ్వదు. మేమెంత బతిమాలినా ప్రసన్నురాలు కావడంలేదు. ఇదే దీనికథ" అంది.

చంద్రాపీడుడది విని నవ్వుమాని "ఔనౌను. ఈ వార్త మేము విన్నాం. కాదంబరీదేవికి తాంబూల మందించే తమాలికను వరించి

పరిహాసమనే చిలక విరహవేదన చెందుతూందని జనులు చిత్రంగా చెప్పుకుంటున్నారు. ఈ వృత్తాంతం రాజకులం అంతటకీ తెలుసు. సిగ్గు మాలిన యీ తమాలిక మూలంగా భార్యని వదలడం ఆచారం కాదు. అదలా ఉండనివ్వండి. చపలురాలయిన యీ దుష్టదాసిని కాదంబరి ఎందుకు మందలింపదు? పెళ్ళిచేసేటప్పుడు ఎన్నో బుద్ధులు చెప్పినా అవి నిలచి ఉండవనా?

స్త్రీలకు సవతిని మించిన కోపకారణ ముండదు కదా? ఇలాటి పరాభవాల్లో స్త్రీలు విషమేనా తింటారు, అగ్నిలో అయినా పడతారు. ఈ చిలక గట్టిదే. అలాటి పని చెయ్యలేదు. మన మిప్పుడే చిలకచేత దానిని క్షమాపణ కోరిద్దాం. బతిమాలిద్దాం. అప్పుడు ప్రసన్నురాలై భర్తను క్షమిస్తుంది. లేకపోతే దీనిదే తప్పుగా భావించి వదిలేద్దాం. పరాభవించి విడిచిన దీని నెవరు గౌరవిస్తారు? ఎవరు పోషిస్తారు? ఇదే దీనికి ప్రాయశ్చిత్తం" అన్నాడు.

ఆ సరదా మాటలకు కాదంబరి పరిచారికు లందరూ నవ్వుకున్నారు.

కాని ... ఆ చిలుక అతని మాటలు విని – "ధూర్తా! రాజపుత్రా! ఈ శారిక రాజకుల సంపర్కంవల్ల తెలివైన దయింది. నువ్వుకాని మరెవరు కాని దీనిని భయపెట్టలేరు. ఈ వక్రోక్తులూ, పరిహాసాలూ దీనిముందు పనికిరావు." అని యింకా ఏదేదో అనబోతూంటే కంచుకి వచ్చి, "మహాశ్వేతా! చిత్రరథుడూ, భార్య మదిరా మహాదేవీ నీరాక విని చాలా ఆనందిస్తున్నారు. నీతో మాట్లాడాలని ముచ్చట పడుతూ నిన్ను తొందరగా తీసుకురమ్మన్నారు" అన్నాడు.

అప్పుడు మహాశ్వేత – "కాదంబరీ! నేను నీ తల్లి తండ్రులని చూడడానికి వెళ్తున్నాను. నేనొచ్చే వరకూ చంద్రాపీడుడు ఎక్కడ ఉండాలి?" అని కాదంబరి నడిగింది.

'స్త్రీల హృదయంలో' అని మనసులో అనుకుని, "నన్నడుగు తావేం? చూసింది మొదలు శరీరానికీ, భవనానికీ, వైభవానికీ, ఇతనే

అధిపతి అని తలుస్తున్నాను. సఖీ! హృదయంలోకాని, ఈయన కిష్టమైన మరెక్కడయినా కాని ఉండవచ్చును" అంది కాదంబరి.

"అలా అయితే, ఈ భవనానినికి దగ్గరలో ప్రమదావనం లోని క్రీడా పర్వతం మీద కట్టబడిన మాణిక్య భవనంలో ఉంచు" అని మహాశ్వేత గంధర్వ సార్వభౌముడి వద్దకు బయలుదేరింది.

కాదంబరి అందరినీ విడిచి ఒక్కతే మేడెక్కి పక్కమీద పడుకుని – 'అయ్యో!' మోహాంధకారంలో ఎలాటిపని చేశాను! అతనికి కనపడకూడదని కొంచెమైనా శంకించ నయినా లేదు. లోకు లేమనుకుంటారో అని కాని, పెద్దల పట్ల గౌరవం కాని, ఆలోచించకుండా – మహాశ్వేత దుఃఖంలో ఉందన్న ఆలోచనకాని ఏమీలేకుండా నేను చేసిన తప్పుపని – అందరికీ అతి సులుగా అర్థమైపోతుంది.

నే నిప్పుడు భ్రష్టురాలినయ్యాను. మరణమే మంచిది. బతకడం సిగ్గుచేటు. ఇది విని నా తల్లి తండ్రు లేమంటారో? ఏం చెయ్యాలి? నా ఇంద్రియ చాపల్యం ఎవరికి చెప్పుకోవాలి? అయ్యో! సఖులముందు పెళ్ళాడనని శపథం చేసి, అలాగని కేయూరకుని ద్వారా మహాశ్వేతకి కూడా తెలియ జేశానే. చంద్రాపీడుని చూసేసరికి అదికూడా జ్ఞాపకం రాలేదు. ఈ చంద్రాపీడుని మహాశ్వేత నాదగ్గర కెందుకు తీసుకురావాలి? అత నెవరు? ఎప్పుడేనా చూశానా? విన్నానా? తలచానా?

అతన్ని చూడడంతోటే నా ఇంద్రియాలన్నీ ధనమిచ్చి కొనుకున్నట్లు అతని వశమైపోయాయ్! ఆ చపలుడితో నాకేం పని?" అని కొంతసేపు తనలో తాననుకుని, అంతలో, మన్మథుడిచేత – 'బాణాలతో నిన్ను జయిస్తాను చూడు' అని భయపెట్టబడినట్లు – మళ్ళీ చంద్రాపీడుని ముఖం జ్ఞాపకం తెచ్చుకుని, ప్రేమావేశంలో పరవశిస్తూ, లేచి కిటికీ దగ్గర కూర్చుని క్రీడాపర్వతం వేపే చూడసాగింది.

చంద్రాపీడుడు ఆ మణిమందిరంలో ప్రవేశించి – మంచంమీద శరీరం వాల్చి, గంధర్వకన్యలు సంగీతం పాడుతూండగా, మనసు డోలాయమానం ఔతూంటే – 'ఆహా! ఈ గంధర్వరాజపుత్రిక విలాసాలు అద్భుతం. నేనడగకుండానే మన్మధుడు నాకీ వైభవం కలగజేశాడు. ఆమె

క్రీగంటి చూపులతో నన్ను చూడడం ...... మన్మధ ప్రభావమే కదా? నే నామె వేపు చూసినప్పుడు - చిరునవ్వుతో - నా చూపుల నామె మీద పరచుకుంది. నాకు తాంబూల మిచ్చి అలసిపోయినట్లు తమలపాకుతో వీచుకుంది. ఇదంతా గమనిస్తే ఆమె నామీద అనురాగం కలిగిట్లే ఉంది. సందేహం లేదు.

అయ్యో! నాలో ఎంత ఆశ కలిగింది! యౌవనమదం వివేకాన్ని హరిస్తుంది. యౌవనుల దృష్టి చిన్నదానిని కూడా పెద్దగా చూస్తుంది. లేనిదానిని కూడా చూస్తుంది. అనవసరంగా నేను తలబద్దలు కొట్టుకోడం ఎందుకూ? ఆమెకు వాస్తవంగా నా పట్ల అనురాగమే కలిగితే మన్మధుడే చెబుతాడు - అనుకుంటూ, కొంతసేపు సంగీత విద్యా వినోదాలతో గడిపి అంతలో లేచి ఉద్యానవన సౌందర్యం చూద్దామని క్రీడాపర్వతం ఎక్కేడు.

కాదంబరి అతణ్ని చూసి - "మహాశ్వేత ఇంకా రాలేదా? వస్తూందేమో చూస్తాను." అని మేడమీదకి వెళ్ళింది. అక్కడ ఎంతసేపుందో ఆమెకే తెలియదు. మహాశ్వేత వచ్చిందని దాసి చెప్పగానే ఆమె మేడదిగింది.

చంద్రాపీడుడు పర్వత మెక్కి యిష్టదైవాలను ఆరాధించి మణిమందిరంలోనే ఆహారం తీసుకున్నాడు. తూర్పుభాగంలోని లతా మంటపం కింద సంగీత గృహం పక్కనున్న మాణిక్య శిల మీద కూర్చుని తాంబూలం వేసుకుంటూ అక్కడి విశేషాలు చూస్తూండగా - ఆకాశంనిండా అమృతం పూయబడ్డట్లు తెల్లని కాంతి అతనికి కనిపించి ఆశ్చర్యం కలిగించింది. చంద్రుడు పగలే ఉదయించాడా? ఆకాశ గంగ భూమికి దిగుతోందా? అని ఆలోచిస్తూ అటు చూశాడు.

తారాహారం పట్టుకుని మదనరేఖ తరళికతో కలసి - కేయూరకుడు ముందు నడవగా - వొస్తూంది. ఆ తెల్లని కాంతికి కారణం ఆమెచేతిలో ఉన్న రత్నహారమని గ్రహించాడు. దూరంనుంచే వారికి నమస్కరించాడు. తనకి నమస్కరిస్తున్న మదనరేఖను ఆ మాణిక్యశిలమీద

కూర్చుండ జేశాడు. ఆమె కొద్దిసేపు కూర్చుని, అంతలో లేచి – అతనికి గంధంపూసి, పట్టుబట్టలు కట్టించి యితర అలంకారాలు చేయించి –

"రాజకుమారా! నీ సౌకుమార్యం అందరికీ ప్రీతి కలిగిస్తూంది. మనోహరమయిన ఆకారం కల మిమ్మల్నే కన్యక జీవిత భాగస్వామిగా కోరుకోకుండా ఉంటుంది? మధుర స్వభావం కల మీతో మైత్రి నందరూ కోరుకుంటారు. చూడగానే నమ్మకం కలిగించే మీ అనునయమే మాలాటి వాళ్ళకి మీతో మాట్లాడ గలగడానికి అవకాశం యిస్తూంది. హృదయాన్నే మీకు అర్పించిన మా దేవి ఈ రూపంగా తన ప్రణయాన్ని తెలుపుతూంది. అంతే తప్ప వైభవ చిహ్నంగా కాదు. ఈ వస్తువు లిస్తూ మా కాదంబరి మీకు తక్కువ చేశాననే సిగ్గుపడుతోంది.

ఈ హారంలో కల ప్రధానమణి సముద్రమధన కాలంలో పుట్టింది. దీనిని సముద్రుడు తన యింటికి వచ్చిన వరుణుడికి కానుకగా యిచ్చాడు. దీనికి సాటి మరొకటి లేదు. వరుణుడు దీనిని ఒకానొక సమయంలో చిత్రరథుడికి ఇచ్చాడు. అతను కాదంబరికిచ్చాడు. ఆమె – మీ రూపానికి తగినదని మీకు పంపింది. మీలాటి వారు ఇతరులు యిచ్చిన ఆభరణాలు ధరింపరు. కాని కాదంబరికి ప్రియంకలిగేలా మీరు దీనిని ధరించాలని కోరుతున్నాను. ఇది తప్పయితే – మహాశ్వేతని నిందించండి. ఎందుకంటే – ఆమె యిలా చేయమని తరళికని కూడా యిచ్చి పంపింది."

అంటూ మదనలేఖ ఆ హారాన్ని అతని వక్షస్థలం మీద అలంకరించింది.

అప్పుడు చంద్రాపీడుడు ఆమె మాటల కాశ్చర్యపోతూ – "తరుణీమణీ! నువ్వు మంచి నిపుణురాలివి కదా. జవాబుకి అవకాశం లేకుండా ఉపన్యసించావు. ముగ్ధరాలా! దీనిని స్వీకరించడానికీ మానడానికీ మే మెవరం? ఆ కథ ఎప్పుడో ముగిసింది. సౌజన్యమూర్తు లయిన మీ గుణాలు నన్నెప్పుడో కొనేశాయి. ఎంతో దాక్షిణ్యం కల కాదంబరి సుగుణాలు ఎవరిని వశం చేసుకోవు? మీ కిష్టమైన కార్యాలకు నన్ను వినియోగించుకొండి –" అన్నాడు చంద్రపీడుడు.

వాళ్ళు చాలాసేపు ఆమె గురించే చెప్పుకున్నారు. మదనరేఖని పంపి అతను మళ్ళీ క్రీడాపర్వతం మీదకు వెళ్ళిపోయాడు.

మదనరేఖ ద్వారా అక్కడ జరిగింది తెలుసుకున్న కాదంబరి – తమాలికను వెంటపెట్టుకుని మళ్ళీ మేడ ఎక్కి, చంద్రుడిలా కనిపిస్తున్న అతన్ని చూస్తూ రకరకాల విలాసాలతో అతని మనసు హరించింది. కౌగలించుకోమని సైగ చేస్తున్నట్లు వస్త్రం సవరించుకుంది. వక్షాన్ని రెండు చేతులతోనూ కప్పుకుంది. పువ్వులు ఎగరేసింది. అలా సాయంకాలం వరకూ గడిపింది.

చంద్రాపీడుడు పండువెన్నెలలో ముక్తా మంటపంలో ఉండి వెన్నెల సౌందర్యాన్ని ఆస్వాదిస్తూంటే – కేయూరకుడు వచ్చి – "రాజపుత్రా! కాదంబరి మీ దర్శనం చేయడానికి వస్తూంది" అని విన్నవించాడు. అత నాశ్చర్యంతో చూస్తూంటే – సాక్షాత్తూ చంద్రోదయ దేవతలా, కాదంబరి మదనలేఖ చెయ్యి పట్టుకుని మెల్లగా వచ్చి – కింద కూర్చుంది. "వద్దు, వద్దు" అని మదనలేఖ బతిమాలుతున్నా వినకుండా చంద్రాపీడుడు తాను కూర్చున్న వేదిక నుంచి దిగి ఆమె కూర్చున్న ప్రదేశంలోనే కూర్చుని మెల్లగా యిలా అన్నాడు

"దేవీ! దృష్టికే సంతోషించే దాసుడికి సంభాషణా ప్రసాదం అక్కరలేదు. అలాటి అనుగ్రహమే లభిస్తే యిక చెప్పేదేముంది? నీ కిలాటి దయ కలగడానికి నాలో సుగుణం ఉన్నట్లు కనిపించదు. కొత్త సేవకుణ్ని కూడా యిలా చూసే నీ సుజనత్వం ఎంతైనా ప్రశంసించ దగింది. నీ గౌరవమే కానుకగా కోరుకుంటూ వచ్చిన మేము, యీ శరీరం, జీవితం, ఇంద్రియాలు నీ అధీనాలే" అని చంద్రాపీడుడు వినయంగా అంటూంటే –

మదనరేఖ అతని మాటల కడ్డుపడి – "రాజపుత్రా! నీ వన్నది నిజమే. కాని కాదంబరి విచారమూ సిగ్గూ పడుతూంది. ఎందుకిలా మాట్లాడతావు? ఈమెను సందేహాలలో ముంచుతున్నావు కదా ఆ... మీ తండ్రి తారాపీడు డెలాటివాడు? విలాసవతి ఎలాటిది? మీ రాజధాని

ఉజ్జయిని ఇక్కడి కెంతదూరం? మీదేశం ఎలా ఉంటుంది?" అని అడిగింది.

అతను తగిన సమాధానాలు చెప్పి వారికి సంతోషం కలిగించాడు. కాదంబరి కొంతసే పక్కడ ఉండి, కేయూరకుణ్ని చంద్రాపీడుడి వద్ద వదలి తన నివాసానికి వెళ్ళిపోయింది.

కేయూరకుడు పాదాలొత్తుతూంటే చంద్రాపీడుడు కాదంబరి రూపగుణ విశేషాలూ, మహాశ్వేత నిష్కారణ వాత్సల్యమూ, మదనలేఖ సౌజన్యమూ, గంధర్వరాజ్య వైభవమూ, కింపురుషదేశ రమ్యత్వమూ ఆలోచించుకుంటూ ఆ శిలాశయ్యమీద సుఖంగా నిద్రపోయాడు.

మర్నాడు ఉదయం మేలుకుని కాలకృత్యాలు తీర్చుకుని కేయూరకుడితో – "నువ్వు వెళ్ళి మహాశ్వేత ఎక్కడుందో, కాదంబరి ఏంచేస్తూందో చూచిరా." అని పంపించాడు.

అతను వెళ్ళి వేగంగా తిరిగొచ్చి – "దేవా! తెల్లని విభూతి రేఖలు నుదుటి మీద ప్రకాశిస్తూ, జపమాల తిప్పుతూ, పరివ్రాజకులూ తపస్వులూ దేవతాస్తుతి శ్లోకాలు చదువుతూ చుట్టూ కూర్చుని ఉండగా మహాశ్వేత కాదంబరితో ముచ్చటిస్తూంది" అని చెప్పాడు.

అప్పు డతను దారిచూపుతూంటే, చంద్రాపీడుడు అంతఃపుర విశేషాలు చూస్తూ మెల్లగా మహాశ్వేత వద్దకు వెళ్ళి నమస్కరిస్తూ కూర్చున్నాడు. చెక్కిళ్ళు మెరిసేలా నవ్వుతూ ఆమె ముఖం చూశాడు. అప్పు డామె కాదంబరితో –

"సఖీ ! చంద్రకాంతమణుల వంటి నీకంటి చూపులతో ఆర్ద్రమయిన హృదయంతో చంద్రాపీడుడు వెళ్ళాలని నిశ్చయించుకున్నా ఏమీ మాట్లాడలేకపోతున్నాడు. ఇతని వృత్తాంతం తెలియక రాజవంశం తొట్రుపాటు పడుతూ ఉంటుంది. దూరమందున్నా పద్మినికీ సూర్యుడికీ లాగ మీ యిరువురికీ ఈ ప్రేమ స్థిరమై ఉండక మానదు. ఇతను వెళ్ళడానికి అనుజ్ఞ యివ్వు" అంది.

అందుకు కాదంబరి - "చెలీ! ఇతనికి తన అంతరాత్మలాగే పరిజనంకూడా స్వాధీనమై ఉండగా అందు కవరోధమే ముంటుంది? అలాగే వెళ్ళొచ్చు" అంటూగంధర్వ కుమారులని పిలిచి అతనిని అతనిచోటుకు చేర్చమని ఆజ్ఞాపించింది.

కాదంబరి తప్ప మిగిలిన అంతఃపురకాంతలందరూ అతని గుణ గౌరవాలచే ఆకర్షింపబడి పరవశులై ద్వారంవరకూ అతనిని సాగ నంపారు. కేయూరకునిచే ఏర్పాటు చేయబడిన ఇంద్రాయుధమనే గుర్రమెక్కి గంధర్వకుమారులతో నడుస్తూంటే అతనికి తన హృదయంలోనే కాక అన్ని దిక్కులా కాదంబరే కనిపించింది. అతని మనస్సంతా ఆమెనిండి - పోవద్దంటూ వెనక్కి లాగుతూ, ముందుకెళ్లకుండా అడ్డంపడుతూన్నట్లు అనిపించింది. అతను క్రమంగా - మహాశ్వేత ఆశ్రమం మీదుగా అచ్ఛోద సరస్సుకి చేరుకుని - అక్కడినుంచి ఇంద్రాయుధపురం ద్వారా తనసేన విడిసిన చోటచేరి - గంధర్వకుమారులను వెనక్కి పంపి వేశాడు.

తనని చూసి మొక్కుతున్న రాజులని మన్నిస్తూ...ఎదురొచ్చిన వైశంపాయనుణ్ని కౌగలించుకుని, పత్రలేఖను పలకరించి, లోపలి భవనానికి పోయాడు. అక్కడ ఏకాంతంగా - పత్రలేఖ వింటూండగా వైశంపాయనుడితో తాను చూసివచ్చిన విశేషాలన్నీ చెబుతూ, ఆ కథలతోనే ఆ రాత్రిని సుఖంగా వెళ్ళించాడు.

మర్నాడు ఉదయం సభాభవనంలో కూర్చున్నా కాదంబరినే ధ్యానించసాగాడు. అంతలో - ద్వారపాలకుడి వెంటవస్తున్న కేయూరకుణ్ని చూశాడు. అతను దూరంనుంచే నమస్కరిస్తూంటే - చంద్రాపీడుడు "ఓహో! గంధర్వ పుత్రా! రా" అంటూ చేతులు చాచి గాఢంగా కౌగలించుకుని - "కాదంబరీ, ఆమె పరివారమూ సుఖంగా ఉన్నారా? మహాశ్వేత క్షేమమేనా?" అని అడిగాడు.

"దేవా! అందరూ బాగానే ఉన్నారు. కాదంబరి దేవరవారికి నమస్కారాలు చెప్పమంది. మహాశ్వేత కుశల పూర్వక నమస్కారాలు చెప్పింది. మదనలేఖ, తమాలిక మీకు పాదాభివందనాలు తెలపమన్నారు. మహాశ్వేత మీకు యిలా తెలపమని చెప్పింది.

'నువ్వెవరి కనులకు కనపడతావో వారు ధన్యులు. నీ సమక్షంలో వెన్నెలలోలా ఎలా చల్లగా ఉంటుందో, నువ్వు దూరమైతే అంతవేడిగా ఉంటుంది. నువ్వు వదిలేశాక ఈ గంధర్వరాజనగరం ఉత్సవం జరిగిన మర్నాటిలా ఉంది. సకలసంగ పరిత్యాగినైన నాకే నిన్ను చూడాలని మనసు కోరుకుంటూంది. అదీకాక నీమదన విలాసాలు తలుచుకుంటూ కాదంబరి అస్వస్థత చెందింది. కనుక నువ్వు మళ్ళీ దర్శనమిచ్చి ఆమెను గౌరవించాలని కోరుతున్నాను. ఇలాటి సందేశం ఉచితం కాకపోయినా, నీ సౌజన్యమే మమ్మల్ని ప్రోత్సహించింది. కాదంబరి నీ కర్పించిన హారాన్ని తల్పంమీద మరచిపోయావు. ఇదుగో, దానిని పంపుతున్నాను. స్వీకరించు –" అంటూ కేయూరకుడు తామరాకు దొన్నెను అతనిముందు విప్పి, దానిలో ఉంచబడిన ఆకులు, పోకలు, కర్పూరం, కస్తూరి, చందనం మొదలైనవి తీసి రాజకుమారుడి నర్పించాడు.

చంద్రాపీడుడు – "ఆహా! నాభాగ్యం. కాదంబరి నన్నెంతగానో గౌరవిస్తూంది. ఇదంతా మహాశ్వేత యొక్క పాదసేవ వలన కలిగిన ఫలమే" అనుకుంటూ – ఎడమచేతితో కేయూరకుని భుజం పట్టుకుని రాజు లందరినీ వదలి మెల్లగా గంధమాదనమను ఏనుగును చూడడానికి వెళ్ళాడు. అక్కడ కొంచెం సేపుండి గుర్రాలశాలకు పోయి అక్కడి గుర్రాలను పరీక్షిస్తూ ఇంద్రాయుధం వెనుకభాగంలోని ముసుగు కొంచెం జారి ఉండగా దానిని సవరించి దానికళ్ళకు అడ్డంగా వేలాడుతున్న వెంట్రుకలను ఎగదువ్వి ఆ మందిరం స్థంభానికి చేరబడి –

"కేయూరకా! నేను వచ్చాక ఆ అంతఃపురంలో ఏం జరిగింది? కాదంబరి ఆ రోజెలా గడిపింది? మహాశ్వేత ఏం చేసింది? నా గురించి అంతఃపురకాంతలు ఏం చెప్పుకున్నారు? అన్నీ వివరంగా తెలియజెయ్యి" అన్నాడు.

"దేవా! వినండి. మీరు వెళ్ళగానే కాదంబరి మేడ ఎక్కి – గుర్రం లేపుతున్న ధూళితో నిండిన మీ మార్గం చూస్తూ, మదనలేఖ భుజంమీద తలపెట్టుకుని చాలాసేపు ఆ దిక్కునే చూసింది. తరవాత

అతికష్టంమీద మేడదిగి ఆస్థానమంటపంలో క్షణకాలం ఉండి, మీరు నివసించిన క్రీడాపర్వతానికి వెళ్ళింది.

అక్కడి దాసీ జనం "రాజకుమారుడు" ఈ లతా మంటపంలో చలువ రాతిమీద కూర్చున్నాడు." 'ఈ శిలమీద స్నానం చేశాడు', 'ఇక్కడ దైవాన్ని ఆరాధించాడు', ఇక్కడే భోజనం చేశాడు 'ఇక్కడే నిద్రపోయాడు' అంటూ చెబుతూంటే అవన్నీ చూస్తూ ఆ పగలంతా గడిపింది. సాయంకాలం మహాశ్వేత బలవంతం చేయగా అక్కడ భోజనం చేసింది. అంతలో చంద్రోదయ మయింది. చంద్రకిరణాలకి చెక్కిళ్ళ మీద చేతు లడ్డంపెట్టుకుని, కళ్ళుమూసుకుని ఏదోధ్యానించి అంతలో లేచివెళ్ళి శయ్యాగృహంలో పడుకుంది.

అది మొదలు ప్రబలమయిన శిరోవేదన, జ్వరం బాధించగా ఎలాగో ఆ రాత్రి గడిపింది. ఇవాళ ఉదయం మీక్షేమం తెలుసుకుందుకు వస్తువుల నిచ్చి మీ వద్దకు పంపింది. ఇవే అక్కడి వార్తలు." అని చెప్పాడు. రాజకుమారుడు తొందరగా వెళ్ళదలుచుకుని 'గుర్రం గుర్రం అని కేకలు వేశాడు. అశ్వరక్షకుడు జీనుకట్టి ఇంద్రాయుధాన్ని తెచ్చి ఎదురుగా తెచ్చి ఉంచాడు. పత్రలేఖని వెనక కూర్చుండబెట్టుకుని వైశంపాయనునకు బాధ్యత అప్పగించి, వేగంగా హేమకూట నగరం వేపు ప్రయాణించ సాగాడు. కేయూరకుడు అతనితో పాటే రాసాగాడు. కాదంబరి భవన ద్వారంలో గుర్రందిగి, పత్రలేఖ వెంటవస్తూంటే – లోపలికి పోతూ ఎదురుగా వస్తున్న గంధర్వ కుమారుణ్ని కాదంబ రెక్కడుందని అడిగాడు.

అతను – "క్రీడాపర్వతం కింద భాగంలో హిమగృహంలో ఉంది" అని చెప్పాడు. కేయూరకుడు ముందునడుస్తూ మార్గం చూపుతూంటే ప్రమదావనం మధ్యనుంచి పోతూ – సూర్యకిరణాలు అక్కడి అరిటాకులవల్ల పచ్చగా అవడాన్ని వింతగా చూసి, తామరపూల రేకులతో కప్పబడిన హిమసదనం చేరుకున్నాడు. అక్కడ విపరీతమైన విరహవేదనకు లోనయిన కాదంబరిని చూశాడు. అతనికంటే ముందుగా చంద్రాపీడుడి రాక నామెకు తెలపగా – ఆ దాసీజనంతో – "ఆ! ఏమీ! నిజంగా అతను వచ్చాడా! మీరు చూశారా? ఎంతదూరంలో ఉన్నాడు?"

అని ఆమె ఆత్రంగా అడిగింది. అంతలోనే అతను కన్నులకు కనపడి, అతనిమీద చూపులు ప్రసరించి, కొంగుసవరించుకుని పూలశయ్యనుంచి లేచింది.

చంద్రాపీడుడు మహాశ్వేతకూ కాదంబరికీ నమస్కరించాడు. వారికి పీఠాలువేసి కేయూరకుడు – "దేవీ! ఈమె పేరు పత్రలేఖ. రాజకుమారుడికి తాంబూలం అందిస్తుంది" అని ఆమెను పరిచయం చేశాడు. కాదంబరి ఆమెను చూసి, "మానవస్త్రీల యందు బ్రహ్మ కెంత పక్షపాతం! ఎంత అందంగా ఉంది!" అని ఆశ్చర్యపోతూ, తనకి నమస్కరిస్తున్న ఆమెను రమ్మని ఆదరంగా పిలుస్తూ దగ్గర కూర్చోబెట్టుకుని ఆమెచేతులు తనచేతులలోకి తీసుకుంది.

చంద్రాపీడుడు అలాటి అవస్థలో ఉన్న కాదంబరిని చూసి – "అయ్యో! నా హృదయ మింత మొద్దుబారిం దేం? ఇప్పుడు కూడా సందేహమే చెందుతూంది. కానియ్.. నేర్పుగా అడిగి తెలుసుకుంటాను" అని మనసులో అనుకుని –

"దేవీ! ఈ తీవ్రమైన వ్యాధి నీ కెలా కలిగింది? నీ పరితాపం చూసి నిజం చెబుతున్నాను. నీకంటె నన్నెక్కువ బాధిస్తూంది. వెయ్యిమాట లెందుకు? శరీర మిచ్చేనా నిన్ను స్వస్థురాలిగా చేయదలుచుకున్నాను. ఇందుకు నా హృదయం తొందర పడుతోంది." అంటూ శ్లేషార్థంతో మాట్లాడాడు.

కాదంబరి అతని మాటలలోని గూఢార్థాన్ని గ్రహించినా ఏమీ జవాబు చెప్పక ఎటో తిరిగి మందహాసం చేసింది.

అప్పుడు మదనలేఖ – "రాజకుమారా! ఏం చెప్పను? ఈ సుందరి బాధ చెప్పడానికి వీలులేక పోతోంది. తామరపూవుకి వెన్నెల కూడా ఎండగానే ఉంటుంది కదా. చిగుళ్ళతో చేసిన విసినకఱ్ఱతో గాలి విసురుకుంటున్న యీమె మనసులోని బాధ నెందుకు తెలుసుకోలేక పోతున్నావు? ఈమెకు ధైర్యమే ప్రాణరక్ష కాగలదు –" అని జవాబు చెప్పింది. ఆమె అతని మాటలకు తగినట్లుగానే జవాబు చెప్పిందనుకుంది కాదంబరి.

చంద్రాపీడుడు ఆ మాటలలో ద్వంద్వార్థ ముండడం వలన - తన హృదయంలోని సందేహం తీరకుండానే మిగిలిపోయి పరిపరి విధాలుగా ఆలోచనలు చేస్తూ - తియ్యని మాటలతోనూ కదలతోనూ మహాశ్వేతతో కూడా కొంత కాలక్షేపం చేసి అతి ప్రయత్నంతో ఆమెను వదిలి స్కంధావారం బయలుదేరబోయాడు.

సరిగ్గా గుర్రమెక్కుతూంటే కేయూరకుడు వచ్చి - "దేవా! మదనలేఖ యిలా విన్నవించుకుంటూంది.

చూడగానే ప్రీతికలిగిన చిత్రలేఖ నిక్కడ ఉంచివెళ్ళమంటూంది కాదంబరి. తరవాత పంపుతుంది. మరి - మీ చిత్తమేమిటి?"

"కేయూరకా! మా పత్రలేఖ ధన్యురాలు. దేవీప్రసాదానికి పాత్రురా లౌతూంది. అలాగే ఉంచుకొమ్మను" అంటూ రాజపుత్రు డామెను వదిలి గుర్రమెక్కి అతి వేగంగా పోయాడు.

అప్పటికే తండ్రి దగ్గరనుండి వచ్చి ఉన్న లేఖావాహకుణ్ని చూసి - "మహారాజు కుశలంగానే ఉన్నారా! అమ్మ క్షేమమేనా? దేశం సుఖంగానే ఉందా?" అని అడిగాడు.

వాడు వినమ్రంగా - "చిత్తం చిత్తం" అంటూ తన చేతిలోని రెండుఉత్తరాలు

రాజకుమారుడి కందించాడు. అతను వానిని తెరిచి చదవసాగాడు.

తారాపీడ మహారాజు చంద్రాపీడుడి శిరస్సును ముద్దు పెట్టుకుంటూ రాయునది. "ప్రజలు సుఖంగానే ఉన్నారు. నువ్వు దిగ్విజయయాత్రకు వెళ్ళి చాలాకాలమయింది. నిన్ను చూడాలని మా హృదయం ఆరాటపడుతూంది. నీ తల్లీ, అంతఃపురకాంతలూ కూడా నీకోసం బెంగపడుతున్నారు. ఈ ఉత్తరం చదవడమేమిటి, కొంచెమైనా జాగుచెయ్యక వెంటనే ప్రయాణమై రావాలి."

శుకనాసుడు రాసిన ఉత్తరంలో కూడా అదే వుంది. వైశంపాయనుడికి కూడా అలాటి అర్థమొచ్చే ఉత్తరాలేవచ్చాయి. అవి

అతను చూపించాడు. అప్పుడు చంద్రాపీడుడు చాలా తొందరపడుతూ వెంటనే ప్రయాణ భేరిమ్రోగించమని ఆజ్ఞాపించాడు. మేఘనాధుడనే సేనాధిపతిని - "నువ్విక్కడ ఉండు. ఇక్కడికి చిత్రలేఖని కేయూరకుడు తీసుకొస్తాడు. దానిని తీసుకుని నువ్వింటికిరా" అని నియమించాడు.

'నీ ఉపకారాలన్నీ మరచి, నీ వాత్సల్యం లెక్కచెయ్యక - నేను వెళ్ళవలసి వస్తోంది. నన్నెంతో దయగా చూశావు. నా గుణాలను ఎంతగానో చెప్పిన మహా శ్వేతనిప్పుడు ఎత్తి పొడుస్తావు కాబోలు. నేను చాలా సిగ్గుపడుతున్నాను. కాని ఏం చేయగలను? తండ్రి ఆజ్ఞ ఎక్కువది కదా? ఇప్పుడు నేను ఉజ్జయిని వెళ్తున్నాను. ఈ కృతఘ్నుడి నప్పుడప్పుడేనా తలుచుకో. బతికుంటే ఎప్పటికేనా మళ్ళీ దేవి పాదాలు ముఖములను చూసి ఆనందిస్తాను. మహాశ్వేత పాదపద్మాలకు మొక్కుతున్నాను. మదనలేఖ క్షేమం అడుగుతున్నాను. తమాలికను కౌగలించు కుంటున్నాను" అంటూ ఉత్తరం రాసి దానిని కేయూరకుని ద్వారా కాదంబరి కందింపమని మేఘనాథుడికి చెప్పాడు.

వైశంపాయనుని సేనతో రమ్మని నియోగించి, తాను వేగంగా ఇంద్రాయుధం ఎక్కి కొన్ని దినాలకు ఉజ్జయిని చేరుకున్నాడు.

ఆకస్మికంగా అతను రావడంతో పౌరులు ఆశ్చర్యానందాలతో ఎదురు వచ్చి నమస్కరించారు. అతను రాచనగరిలో ప్రవేశించాడు. ద్వారపాలకు లా వార్తను రాజుకి వెంటనే తెలియజేశారు. తారాపీడుడు పట్టరాని సంతోషంతో కొంతదూరం ఎదురు వచ్చాడు. చంద్రాపీడుడు దూరంనుంచే తండ్రిని చూసి గుర్రందిగి అతనికి పాదాభివందనం చేశాడు. పుత్రుణ్ని లేవనెత్తి కౌగలించుకుని అప్పుడే విలాసవతి భవనానికి తీసుకు వెళ్ళాడు.

తల్లి అతన్ని చూసి ఎంతో సంతోషిస్తూ దృష్టి దోషాలు తొలగించే కార్యాలు చేసి అతని దిగ్విజయ యాత్ర కథలడుగుతూ చాలాసేపు తన వద్ద ఉంచుకుంది. తరవాత చంద్రాపీడుడు శుకనాశుడి యింటికి వెళ్ళి వైశంపాయనుడు సేనతో వస్తున్నాడని చెప్పి మనోరమకు

ప్రీతి కలిగించి తనదైన కుమార భవనానికి వెళ్ళిపోయాడు. కాదంబరి వియోగ చింతవలన ఆ మనోహరమైన భవనం అతనికి శూన్యంలా తోచింది. ఆ వియోగ పరితాపంతో కొన్నాళ్ళు గడిపి - ఒకనాడు మేఘనాధుడితో పత్రలేఖ హేమకూటం నుంచి రావడం దూరం నుంచి చూసి - మొహం వికసించగా - దానిని ఆదరించి - "కాదంబరీ, మహాశ్వేతలు సుఖంగానే ఉన్నారు కదా?" అని అడిగాడు. ఆమె వారి క్షేమం చెప్పి, కాదంబరి అతని క్షేమం అడిగిందని చెప్పింది.

అత నామె చెయ్యి పట్టుకుని తన మందిరానికి తీసుకు వెళ్ళి మాణిక్యశిలా మంటపం మీద కూర్చోబెట్టి - "పత్రలేఖా! నేను వచ్చాక అక్కడ జరిగిన విశేషా లేమిటి? నువ్వక్కడ ఎన్నాళ్ళు ఉన్నావ్? ఆమె నిన్నెలా చూసుకుంది? మీ మాటలలో ఏమేం వచ్చాయి? కాదంబరి నా గురించి ఎప్పుడేనా తలుచుకుందా?" అంటూ ప్రశ్నలు వేశాడు.

ఆమె - "వినండి..ఆనాడు ఉదయం మీరు వెళ్ళారు కదా. మీరు వెళ్ళిన కొంతసేపటికి కాదంబరి పరిజనులను వదలి, నన్ను మాణిక్య సోపానాలచే ప్రకాశించే ప్రమదావనంలోని వేదికమీద తన పక్కగా కూర్చోబెట్టింది.

ఏదో చెప్పాలని - నా ముఖంవేపు రెప్పవెయ్యకుండా చూసింది.

ఆమె అభిప్రాయం గ్రహించి - "అయ్యో! సఖీ! భయపడతావేం? నన్నుపరాయిదానిగా తలచకు. ఏంచెప్పదలుచుకున్నా చెప్పు" అన్నాను నేను. ఆమె కాలిబొటనవేలితో నేలమీద రాస్తూ, అటూయిటూ చూస్తూ, చెప్పదలుచుకున్నా సిగ్గువల్ల కంఠంపెగలక, ఊరుకుని, తలవంచుకుని కన్నీరు కార్చసాగింది.

"మగువా! నీకిది తగునా? కారణమేమిటో చెప్పు. ఊరికే కన్నీరు పెడతావేం?" అని నేను చాలాసార్లు అడగగా - అతి ప్రయత్నంతో కన్నీళ్ళు తుడుచుకుంది. చెప్పవలసిన దానిని గోటి చివరలతో మొగిలి రేకుల మీద రాసి అంతలోనే చించేసి, తలెత్తి మాటిమాటికీ నన్ను చూస్తూ ఇలా అంది.

"సఖీ! పత్రలేఖా! నిన్ను చూసింది మొదలు అందరికంటే నీలోనే నాకెక్కువ విశ్వాసం కలిగింది. ఎందుకోమరి. నాకు జరిగిన పరాభవం ఎవరితో చెప్పుకునేది? నా దుఃఖం పంచుకునే దెవరు? నా ప్రాణసంకటం చెప్పుకుందుకు నీకన్న నాకు ఆప్తులు కనపడలేదు. నా సంతాపమంతా నీకు చెప్పుకుని జీవితం చాలిస్తాను. నిష్కళంకమైన కులమును కళంకపరచి సామాన్య కన్య వలె నాలాటిది చిత్త చాంచల్యం పొందగినదా? చంద్రాపీడుని కారణంగా అనాధలా, నీచురాలిలా బలవంతంగా నిందితురాలి నౌతున్నాను. గొప్పవారి కిలా చేయడం తగునా? పరిచయానికి ఫలం ఇదా? సుకుమారమైన నా మనస్సు నతడు ఖిలా పరాభవించవచ్చునా? నా హృదయం దహించుకు పోతూంది. ఇంక నేను బతకలేను. మరోజన్మలో కూడా నీ స్నేహం కోరుకుంటున్నాను. నీలాటి స్నేహితురాలు నాకు లేదు. ప్రాణాన్ని త్యాగం చేసి నా కళంకాన్ని కడుక్కుంటాను" అని ఊరుకుంది.

నాకేమీ తెలియక పోవడం వల్ల నేను చాలా భయపడుతూ, విచారంగా – "దేవీ! చంద్రాపీడు డేమి తప్పు చేశాడు? నీ మనసుని ఎలా కష్టపెట్టాడు? వినాలని సిద్ధంగా ఉన్నాను. తొందరగా చెప్పు. విన్నాక – మొదటి నేను శరీరం వదిలాక, తరవాత నువ్వు శరీరం వదులుదువుగాని." అన్నాను.

అప్పుడామె – "ఆధూర్తుడు కలలోకి వచ్చి చిలకలతో రహస్యసందేశాలు పంపుతున్నాడు. నిజంగా అనురాగమున్నవాడిలా నా పాదాలకు లత్తుక పూస్తాడు. చెక్కిళ్ళ స్వేదబిందువులని గాలి విసిరి పోగొడతాడు. ఒంటరిగా తిరుగుతూంటే బిగిగా కౌగలించుకుంటాడు. వక్షం మీద చిత్రరచన చేస్తాడు. పత్రలేఖా! అతన్ని నేనెలా పట్టుకోగలను?" అంటూంటే –

ఈమె చంద్రాపీడుని గురించి మన్మధుడి చేత గాఢంగా ఆకర్షించబడింది, ఈ పంచదార బొమ్మవలన అతను కూడా మన్మధుడి బారిన పడ్డాడు – అని మనసులో అనుకుని – "యువతీ! నీ విషయం తెలుసుకున్నాను. కోపాన్ని విడిచిపెట్టు. కామం అనే అపరాధానికి మా

చంద్రాపీడుని నిందింపకు. ఈ చేష్టలన్నీ మన్మథుడివే కాని మా దేవరవి కావు" అన్నాను

ఆమె చాలా సంతోషంతో తలెత్తి "కాముడంటే ఎవడు? అతని రూప మెలాటిది? వాడిచేష్ట లేమిటి?" చెప్పమన్నట్లు చూసింది.

"తరుణీ! వాడికి రూపంలేదు. శరీరం లేకుండనే దహించగలడు. మంటలేకుండానే తాపం ఎత్తించగలడు. పొగలేకుండానే కన్నీరు పుట్టిస్తాడు. అలాటి భూతం ముల్లోకాలలోనూ లేదు. వాడిబారిన పడితే ఎంత ధైర్యం కలవారినయినా వేధించి తీరతాడు. అతనిచేత ఆవహించబడిన స్త్రీలకు ఆకాశమంతా ప్రియుడి ముఖంలాగే కనిపిస్తుంది. భూమంతా అతనే కనిపిస్తాడు. వాడి చర్యలు చాలా విపరీతంగా ఉంటాయి" అన్నాను నేను.

"పత్రలేఖా! నువ్విప్పుడెలా చెప్పావో, అలాగే వేధిస్తున్నాడు మన్మథుడు. నువ్వు నాకు ప్రాణంలాటి దానివి. నేనిప్పుడేం చేయ్యాలో చెప్పు. ఇంతకు ముందు యిలాటిది నేనెరగను అందుకే - ఎవరికీ చెప్పుకోలేని కష్టంపడడం కంటె చనిపోడమే మేలని నాకు తోచింది.

"వద్దు దేవీ! వద్దు. అకారణమరణంతో నీకేంపని? ఆరాధించకుండానే ప్రసన్నుడయ్యే మన్మథుడే నీ కార్యం చక్కబెడతాడు. నీ మనసులోని ఆలోచన అనర్థమైనది కాదు. స్వయంవరం పద్ధతిలో ఎందరు స్త్రీలు పతిని వరించలేదు? మరణప్రయత్నం మాను. నీ పాదాల మీద ఒట్టు. నన్ను పంపు. వేగంగా పోయి నేతన్ని తీసుకువస్తాను." అన్నాను.

"పత్రలేఖా! నీ ప్రీతి నేనెరుగుదును. మృదువైన ప్రకృతి కల కన్యకకు ప్రగల్భాలు రావు. ఇప్పుడు నేనేం చెప్పాలో తెలియడం లేదు. చంద్రాపీడున కేం చెప్పమనాలి?

"నువ్వునాకు అతిప్రియుడివీ - అందామంటే పునరుక్తి దోషం. నాకు నీయందు అనురాగం ఎక్కువ అందామంటే వేశ్యమాటలా ఉంటుంది. 'నువ్వు లేకుండా నేను జీవించను' - అందామంటే అనుభవానికి విరుద్ధం. 'నన్ను బలాత్కరంగా వశపరచుకున్నావు" అంటే

ఆరోపణ. 'తప్పకుండా రావాలి' అంటే గర్వం. 'నేనే వస్తున్నాను' అనాలంటే స్త్రీ చాపల్యం. 'నా మరణంలో నాకు నీయందు కల ప్రీతిని గ్రహించగలవు అనడం భావ్యమేమో."

*(ఇంతవరకూ కాదంబరి పూర్వభాగం. ఇంతవరకే బాణుని కవిత్వం. ఇంతవరకూ రచించి బాణకవి స్వర్గస్తుడయ్యాడు. తరవాత - చివరవరకూ అతని కుమారుడు రచించాడు)*

"కనక ఏమందామన్నా దోషమే కనపడుతూంది. ఆవేళ క్రీడాపర్వతంపై సరస్సు వొడ్డున శిలా పట్నంలో హిమగృహంలోని పూలశయ్య మీద పడుకుని ఆ రాజకుమారుని చేత చూడబడ్డాను. రెండుసార్లు వచ్చి నా అవస్థంతా చూసికూడా ఉపేక్షించి వెళ్ళిపోయాడు. ప్రియసఖీ! నీకేం చెప్పేది? కూర్చున్నా, తిరుగుతున్నా, నిద్రపోతున్నా, మేలుకుని ఉన్నా, రాత్రిం పగళ్ళు క్రీడాపర్వతంలోని అతనే కనపడుతున్నాడు. ఆ మాటే నీకు చెబుతున్నాను. ఇకచాలు" అని శోకంతో తలను భుజాలమీదకు వొంచి మూర్ఛపోయిన దానిలా ఊరుకుందామె.

నేనా మాటలు విని - "ఆహా! వియోగులు జీవించడం కష్టం కదా. సంకల్పమయుడైన ప్రియుడు కులస్త్రీలని బాధిస్తాడు." అనుకుంటూంటే సూర్యాస్తమయమైంది. అప్పుడు ఎందరో బాలికలు వచ్చి వింతవింత దీపాలు వెలిగించారు.

నే నామెను చూసి - "దేవీ! దుఃఖింపకు. నేను వేగం వెళ్ళి అ రాజకుమారుణ్ని తీసుకు వస్తాను" అన్నాను. నా మాటలలో మీపేరు రావడంవలన పాముకరచినవాడు మంత్రానికి కళ్ళు తెరచినట్లు ఆమె కళ్ళు తెరచి నన్ను చూసి, "ఎవరక్కడ?" అని దాసీజనాన్ని పిలిచింది. "ఏమి ఆజ్ఞ?" అంటూ వాళ్ళు అక్కడికి పరుగెత్తుకొచ్చారు. వాళ్ళని చూస్తూ...మాణిక్యశిల మీద కూర్చుని ఆమె నాతో-

"పత్రలేఖా! ఇది ఊరికే చెప్పడంకాదు. నీరాకకోసం చూస్తూ ప్రాణాలు నిలబెట్టుకుని ఉంటాను. వేగంగా కార్యం సాధించుకురా" అంటూ హారం నా మెడలోవేసి, తాంబూలం అభరణాలు అవీ యిచ్చి నన్ను పంపించింది" అని విన్నవించి పత్రలేఖ మళ్ళీ యిలా చెప్పింది.

"దేవా! నూతనంగా లభించిన కాదంబరి ప్రసాదం వలన కలిగిన స్థితి వలన దుఃఖిస్తూ నేను తమకు విన్నపం చేసుకుంటున్నాను. అలాటి స్థితిలో ఉన్న కాదంబరిని ఉపేక్షించడం మీకూ న్యాయం కాదు. దయార్ద్రహృదయులైన మీరు తగనిపనే చేశారు."

చంద్రాపీడుడు కొంచెం ఆలోచించి కళ్ళల్లోకి నీరు చిమ్మగా, మనసు వ్యాకులం చెందగా, పెద్ద కంఠంతో – "పత్రలేఖా! నేనేం చేసేది? మన్మథుడామెలో కలిగించిన వికారాలని నాకు స్పష్టంగా చెప్పలేదామె. దేవతాస్త్రీలకది సహజమైన అనురాగమేమో అని సందేహిస్తూ ఆమెను విరహాగ్నిలో పడవేసి నేను నీచేత యిలా నిందించ బడుతున్నాను. నాకీ మనోవ్యామోహం కలగడం శాపదోషమేమో అని ఆలోచించాను కానీ ఆమె స్పష్టంగా మదన చిహ్నాలు ప్రదర్శిస్తూంటే నెందుకు తెలుసుకోలేక పోయాను? నా బుద్ధి పనిచేయక పోయింది. మన్మదుడి విశేషాలు అతి సూక్ష్మంగా ఉంటాయి కనక తెలుసుకోడం కష్టం. అవి వేరే కారణాల వల్ల కూడా పుట్టొచ్చు.

చిరకాలం నుంచీ తన కంఠమందున్న రత్నహారం ఊరికే నా మెడలో వేస్తుందా? అప్పుడేనా కాదంబరి ప్రేమను తెలుసుకోకూడదా? హిమగృహంలోని కథ నీకు తెలిసిందే కదా? అప్పుడేనా ప్రణయ కోపంవల్ల కాబోలు శ్లేషగానే పలికింది కానీ, తనమనసుని తేటతెల్లం చేసింది కాదు. అదంతా ఆమె దోషమే కాని నా నేరంకాదు. పత్రలేఖా! ఇప్పుడు గతానికి విచారించి ప్రయోజనం లేదు. నా హృదయం ఆమెకు తెలిసేలా ప్రవర్తిస్తాను" అంటూండగానే – ప్రతీహారి వచ్చి, కబురందించాడు.

"దేవా! విలాసవతీ మహాదేవి పత్రలేఖతో కూడా మిమ్మల్ని రమ్మని ఆజ్ఞాపిస్తూంది. పత్రలేఖ దేశాంతరం నుంచి వచ్చిందని విన్నదట. వేగంగా రండి."

చంద్రాపీడుడు – "అయ్యో! నా జీవితం సందేహపు ఊయలెక్కి అటూ యిటూ ఊగుతూంది. నాతల్లి నన్ను తనివితీరా చూడలేదు. ఇంతలో పత్రలేఖ చెప్పిన కాదంబరి అవస్థ. మాతృసేవ, గంధర్వ రాజపుత్రిక అనురాగం దేనిని వదలాలి? దేనిని గ్రహించాలి?

అనుకుంటూనే చిత్రలేఖ చెయ్యి పట్టుకుని తనతల్లి దగ్గరకు తీసుకుపోయాడు.

విలాసవతి వారిని గౌరవించి – "మీరు రోజూ ఒకసారి వచ్చి కనిపిస్తూ ఉండండి. లేకపోతే నేను సహించలేను" అంటూ ఆ రోజంతా తన దగ్గరుంచుకుని వారిని పంపింది. అది మొదలు చంద్రాపీడుడు కాదంబరీ వియోగవేదనలో శుష్కించి పోతూ భారంగా కాలం గడపసాగాడు.

ఒకనాడు పత్రలేఖ వెంటరాగా ఉద్యాన వనానికి వెళ్ళి విహరిస్తూంటే – కొంతదూరంలో విచిత్ర గమనంతో గుర్రాన్ని నడుపుతూ వస్తున్న ఒక రౌతు కనిపించాడు. ఎవరో చూసిరమ్మని సేవకుని పంపి, "పత్రలేఖా! అతను కేయూరకుడిలా ఉన్నాడు చూడు" అని అంటూండగానే అత నక్కడికి వచ్చి గుర్రం దిగి రాజపుత్రుడికి నమస్కరించాడు.

చంద్రాపీడుడు ఆనందంగా అతనిని కౌగలించుకుని – "కేయూరకా! నీరాకవలననే కాదంబరి క్షేమంగా ఉందని తెలుస్తూంది. విశ్రాంతి తీసుకున్నాక నువ్వొచ్చిన కారణం తెలుపుదువుగాని." అంటూ వారిద్దరితోనూ ఏనుగెక్కి తనభవనానికి వెళ్ళిపోయాడు.

లోపలి కెవరినీ రానివ్వొద్దని ద్వారపాలకుడిని నియమించి, వాళ్ళిద్దరితోనూ లోపలికి పోయి – "గంధర్వపుత్రా! కాదంబరి, మహాశ్వేత, మదనలేఖల సందేశమేమిటో చెప్పు" అన్నాడు, కూర్చున్నాక.

"రాజపుత్రా! అక్కడి విశేషాలు విను. పత్రలేఖను తీసుకొచ్చి మేఘనాథుడి కప్పగించి, వెనక్కిపోయి, దేవరయొక్క ఉజ్జయినీ ప్రయాణ వృత్తాంతం చెప్పి మీ ఉత్తరం అందించాను. మహాశ్వేత అది చదివి ఏదో ఆలోచించుకుని నిట్టూర్పు విడిచి విచారంతో లేచి తపస్సు చేసుకుందుకు మళ్ళీ తన ఆశ్రమానికి వెళ్ళిపోయింది.

కాదంబరి కూడా ఈవార్తవిని నెత్తిబాదుకుంటూ మూర్ఛపోయి, అంతలో తెలివి తెచ్చుకుంది. మహాశ్వేత వెళ్ళిపోయిన విషయం తెలియక, తలూపుతూ– "కేయూరకా! ఈ సంగతి చెప్పు." అని– మదనలేఖతో – "చూసావా! చంద్రాపీడు డెలాటిపనిచేశాడో! ఇలాటి వాడెక్కడైనా

ఉంటాడా?" అని ఒక్కతే ఏకాంత గృహానికి పోయి మంచంమీద పడుకుని ముసుగేసుకుని మదనలేఖ తో సైతం మాట్లాడక పరితాపంతోనే ఆ రోజంతా గడిపింది.

మరునాడు ఉదయం నేనామె వద్దకు వెళ్లాను. "ఆహా! మీలాంటి ఆప్తులు కలిగి ఉన్నా నేనిలాంటి కష్టాలు పడుతున్నాను" అంటూ ఆక్షేపిస్తున్నట్లు పలికి నీరు నిండిన కళ్లతో నన్ను చూసింది." ఆచూపుల నుంచే ఆమె హృదయంలోని అభిప్రాయం గ్రహించి ఆమెతో చెప్పకుండానే దేవర వారిని చూడాలని వచ్చాను. మీకోసం కాదంబరి పడే బాధ చెప్పడానికి వీల్లేదు. ఆమె హృదయం అతి మృదువయినా బాధలు పడీ పడీ రాయై పోయిందేమో. లేకపోతే యిన్ని కష్టాలుపడ్డా అమె మనసు నశించదేం?అలాటి బాధలతో కూడా ప్రాణాలు నిలుపుకుని ఉంది. స్త్రీలకు మనోహరుని సమాగమం మీదుండే ఆశ అనంతం కాబోలు.

రాజకుమారా! ఆమె ఆరాటం నేనేం చెప్పేది? దేనితో పోల్చేది? ఆమెతాపం మధ్యాహ్నపు ఎండకంటే కూడ తీవ్రంగా ఉంది. పక్కగా వేసిన పద్మపత్రాలు యిట్టే మాడి మసయిపోతున్నాయి. మీపేరు తలచినంతలో ఆమె శరీరమంతా కవచంలా రోమాంచం ఏర్పడుతుంది. ఆమె అవస్థంతా చెప్పాలంటే పదిరోజులు పడుతుంది."

ఆ మాటలకు చంద్రాపీడుడు "కేయూరకా! చాలు చాలు ఇంక చెప్పకు. వినలేక పోతున్నాను" అంటూ మూర్ఛ ఆవేశింపగా కాదంబరిని ధ్యానించుకుంటున్నవాడిలా కొంతసేపు వొళ్లెరగక అంతలో తెలివి తెచ్చుకుని గద్గదిక స్వరంతో యిలా అన్నాడు.

"కేయూరకా! పత్రలేఖ వల్లనే కాదంబరి సంతాపమంతా తెలిసింది. నేనేం చేసేది? నా గురించి ఆమె యిన్ని చిక్కులెందుకు పడాలి? ఆమెకు మదనలేఖ రెండో హృదయం కదా? ఆమె ద్వారా అయినా తనమనసు తెలిపి ఉండొచ్చుకదా? అయ్యో! నిష్కారణంగా ఆమె మదనునివలన బాధించబడుతూంది. ఇది అమె ప్రారబ్ధమే. కాకపోతే – నేను అశ్వంవల్ల దేవభూమికి వెళ్ళడ మేమిటి? పోయినా మహాశ్వేత నెలా చూస్తాను? చూసినా హేమకూటాని కెలా వెళ్తాను? వెళ్ళినా కాదంబరి

నెందుకు చూస్తాను? చూసినా యింతవరకూ ఎలా వస్తాను? ఇదంతా మన్మథుడి కపటమే తప్ప మరొకటి కాదు. కనక వేగంగా వెళ్ళి ఆమె నోదార్చే ప్రయత్నంచేయాలి" అంటూండగానే సూర్యాస్తమయం కాసాగింది.

అప్పుడు చంద్రాపీడుడు కేయూరకుడితో తన మేడమీదకు పోయి చంద్రకాంతశిలా తల్పం మీద పడుకుని ... అతను పాదసేవ చేస్తూండగా – "కేయూరకా! మనం వెళ్ళేవరకూ కాదంబరి ప్రాణాలతో ఉంటుందా? మదనలేఖ ఓదార్చుతూంటుంది. మహాశ్వేత ధైర్యం చెప్పకుండా ఉంటుందా? అందమైన ఆమె ముఖాన్ని నేను మళ్ళీ చూడగలుగుతానా?" అని అడిగాడు.

కేయూరకుడు – "దేవా! ధైర్యంగా ఉండండి. భయపడకండి. వేగంగా వెళ్ళే ప్రయత్నం చెయ్యండి" అన్నాడు.

'అయ్యో! ఇప్పుడు నేను తల్లితండ్రులకి చెప్పపోతే, వాళ్ళు నాకోసం భూమంతా గాలించేస్తారు. అలాటివారిని కష్టపెట్టడం శ్రేయస్కరం కాదు. వెళ్ళకపోతే కాదంబరి ప్రాణత్యాగం చేస్తుంది. రెండు విధాలా ప్రమాదమే ఎదురౌతూంది. ఏం చెయ్యాలి? ఎవరితో చెప్పాలి? ప్రాణంలో ప్రాణమైన వైశంపాయనుడు కూడా దగ్గరలో లేడు" అని మనసులో చింతిస్తూ ఆ రాత్రి గడిపాడు.

మర్నాడు ఉదయం అతను లేచేసరికి సైన్యం సమీపానికి వచ్చిందన్న వార్త తెలిసింది. అందుకు చంద్రాపీడుడు ఎంతో సంతోషిస్తూ – "కేయూరకా! మనకార్యం సిద్ధించినట్లే అనుకో నా ప్రాణమిత్రుడు వైశంపాయనుడు వస్తున్నాడు" అన్నాడు.

"దేవా! వైశంపాయనుడు వచ్చేవరకూ తమరు ఉండవలసిందే. అక్కడి సంగతులు చెప్పానుకదా కనక నన్ను ముందు పంపించండి మీ విషయం ఆమెకు చెప్పి జీవించి ఉండేలా చూస్తాను. మీ వార్తే ఆమె ప్రాణం నిలబెడుతుంది" అన్నాడు కేయూరకుడు.

చంద్రాపీడుడు పత్రలేఖను చూసి – "మేఘనాథుడెక్కడ!" అన్నాడు. అంతలోనే అతను వచ్చాడు.

పుండరీకుడతనితో – "మునుపు నువ్వు పత్రలేఖని ఎక్కడినుంచి తీసుకువచ్చావో, మళ్ళీ ఆమె నక్కడికి తీసుకుపోయి ఉండు. కేయూరకుడితో కలసి ముందుగా పో. నేను వైశంపాయనుడితో మాట్లాడి వస్తాను. నేనే నీచేత కాదంబరికి సందేశం పంపుతున్నాను. 'సిగ్గుభారంతో న్నిన్నాయాస పెడుతున్నాను" అని నా మాటగా ఆమెకు చెప్పు. మిగిలిన విషయాలన్నీ పత్రలేఖ చెబుతుంది." అంటూ ఏదోశంకతో ఉబుకుతున్న కన్నీటి నాపలేక – తనపాదాలకు నమస్కరిస్తున్న పత్రలేఖ వేపు చూస్తూ – చేతులు జోడించి – "పత్రలేఖా. ఈ నమస్కారంతో కాదంబరికి – 'తొలిచూపులోనే అనుగ్రహించిన ఆమెను నమస్కరించకుండా వదలివచ్చిన కృతఘ్నుడిని. నాలో ఏ సుగుణం చూపి నన్ను పరిగ్రహించమని ప్రార్థించేది? ఆమె మాత్రం ఎలా అంగీకరిస్తుంది? అమె హృదయం అపహరించలేదనా? ఆమె అవస్థను ఉపేక్షించలేదనా? ఎన్నోసార్లు ఆమె పాదసేవ చేశాననా? నాకు సుగుణాలు లేకపోయినా ఆమె సుగుణాలే నన్నంగీకరించాలని నా ఆశ. సిగ్గులేకుండా నే నామె ముఖం మళ్ళీ చూడడాని కామె సుగుణాలే కారణం.

ఇటుపైన నా రాక వ్యర్థంకాదు. లోకం శూన్యంకాదు. అలాగ దేవి మనసును స్థిరపరచుకుందుకు ప్రయత్నం చెయ్యాలి "అని చెప్పు" అని అంతలోనే – "సఖీ! పత్రలేఖా! నువ్వు నా వియోగ బాధవలన దారిలో ఆరోగ్యాన్ని ఉపేక్షించకు సుమీ! వేళకి తింటూ, తెలియని దారులందు వెళ్ళక జాగ్రత్తగా బస చెయ్యి ఏంచేసేది? నీకంటే కాదంబరి ప్రాణా లెక్కువని నిన్ను ఒంటరిగా పంపుతున్నాను నా ప్రాణాలు నీచేతిలో ఉన్నాయి. కనక నీ ప్రాణాలు జాగ్రత్త" అంటూ ఆమెను కౌగలించుకుని కేయూరకుడి కప్పగించి – "మళ్ళీ మహాశ్వేత ఆశ్రమంలో కలుసుకుందాం" అని వారిని పంపించాడు.

వారు వెళ్ళాక – 'వీరు వేగంగా వెళ్తారా? దారిలో ఏ అంతరాయమూ రాదుకద? ఎన్నాళ్ళకి అక్కడికి వెళ్ళి కాదంబరి నూరడిస్తారు?' అని ఆలోచించాడు సైన్యం ఎంతదూరంలో ఉందో తెలుసుకుని రమ్మని దూతనిపంపి, వైశంపాయనుడిని ఎదురేగి తీసుకురావడానికి పంపమని అడగడానికి చంద్రాపీడుడు తండ్రి వద్దకు వెళ్ళాడు.

తారాపీడుడు దూరం నుంచే అతన్ని చూసి – "రా!" అంటూ కౌగలించుకుని, దగ్గర కూర్చోబెట్టుకుని శరీరం నిమురుతూ – ముఖ్యమంత్రితో యిలా అన్నాడు. "ఆర్యా! శుకనాస! చంద్రాపీడుని చూశావా? ఇతనికి యౌవనం పొడ చూపింది. పెళ్ళీడు వచ్చింది. తగిన రాజకన్యని చూసి పెళ్ళి చెయ్యాలి" అన్నాడు.

"ఔను దేవరా! మీ ఆలోచన సరైనదే. విద్యలన్నీ గ్రహించాడు. దిగ్విజయం చేసి ప్రజలకు ఉత్సాహం కలిగించాడు. ఇక మిగిలింది వివాహమేకదా. దానిగురించి తప్పకుండా ఆలోచించాలి." అన్నాడు మంత్రి.

చంద్రాపీడుడు తలవంచుకుని – "వీళ్ళ సంభాషణ కాదంబరితో సమాగమానికి అపశ్రుతిలా ఉందే!" అనుకున్నాడు. అంతలో వైశంపాయనుడి ప్రస్తావనరాగా – అతనికి ఎదురు వెళ్ళడానికి అనుజ్ఞను శుకనాసుడి ద్వారా తండ్రికి తెలియపరిచాడు. తారాపీడుడు పుత్రుడికి ఆమోదం తెలిపాడు.

చంద్రాపీడుడు ఆ రాత్రి ఎలాగో గడిపి ప్రాతః కాలములోనే లేచి, తగిన పరివారంతో, ఇంద్రాయుధం ఎక్కి అతివేగంగా సేనకి ఎదురు వెళ్ళాడు. సేనని చేరగానే – గుర్రంమీదనుంచే "వైశంపాయను డెక్కడ ఉన్నాడు?" అని అడిగాడు. ఆ మాటవిని – కొందరు పనితొందరలో చంద్రాపీడున్ని గుర్తుపట్టక – కన్నీరు పెట్టుకుంటూ, "ఇంకెక్కడి వైశంపాయనుడు? అతని నెందు కడుగుతారు?" అన్నారు.

ఆ మాటలకు అతని గుండె ఝుల్లుమంది." పాపులారా! అలా అంటారేం? "అంటూ, మరొకరినడగక, వారివేపుచూడక, ఏమీ మాట్లాడక, వినక, ఎవరినీ పిలవక – 'హా! ఇప్పుడు నేనెక్కడున్నాను? ఎక్కడి కొచ్చాను? ఎందు కొచ్చాను? ఎక్కడికి పోవాలి? ఏంచేయాలి?" అని ఆలోచిస్తూ – గుడ్డివాడిలా, మూర్ఖుడిలా అక్కడ తిరగసాగాడు.

అప్పుడు – గుర్రాన్ని బట్టి గుర్తుపట్టి రాజకుమారులు – చంద్రాపీడుని పిలుస్తూ తొందరగా అతన్ని పట్టుకున్నారు. అతను వారిని – "వైశంపాయను డెక్కడున్నాడు?" అని గద్గద స్వరంలో అడిగాడు.

వారు - "దేవా! అంతా నివేదిస్తాం గుర్రందిగి యీ చెట్టు నీడలో విశ్రమించండి." అన్నారు దీనంగా. వారి ముఖాలనిబట్టి కొంత అర్థం చేసుకుని - అపరాధం చేసిన వాడిలా తలవంచుకుని - మెల్లగా అడిగాడు.

"నేను పోయిన తరవాత దారిలో యుద్ధం జరిగిందా? లేక తొందరగా ప్రాణాలు తీసే వ్యాధి వచ్చిందా? పిడుగుపడ్డట్లు వైశంపాయనుడి కింత ఉపద్రవం ఎలా వచ్చింది? వేగంగా చెప్పండి."

వాళ్ళు చెవులు మూసుకుని "శివశివా! అలా అంటారేం? వైశంపాయనుడు జీవించే ఉన్నాడు. ఇంకా నూరేళ్ళు బ్రతుకుతాడు" అనగా, రాజకుమారుడు ఆనంద సాగరంలో మునిగి, వారిని కౌగలించుకుని మళ్ళీ యిలా అన్నాడు.

"వైశంపాయనుడు బతికుంటే నా ఆజ్ఞమీరి మరోచోటుకి పోయేవాడు కాదుకదా అని అలా అన్నాను. అతనిప్పు డెక్కడికి పోయాడు? ఇక్కడి కెందుకు రాడు? అతనిని వదిలి మీరెందుకు వచ్చేశారు? వినేవరకూ నామనసు నిలవదు. తొందరగా చెప్పండి."

వారతనికి నమస్కరించి - చెప్పసాగారు.

## వైశంపాయనుడి కథ

"దేవా! వినుము. వైశంపాయనుడితో కలసి మీరు మెల్లగా రండి" అని మాకు చెప్పి మీరు వెళ్ళిపోయారు కదా? ఆవేళ మేము వాహనాలని సిద్ధంచేసుకుని మర్నాడు ఉదయం ప్రయాణ భేరిని కొట్టించాం. అంతలో వైశంపాయనుడు వచ్చి వారించి "ఈ ప్రాంతంలో అచ్ఛోద మనే పుణ్యసరస్సుంది. దానిలో స్నానం చేసి, శివుడిని అర్చించి రేపు పోదాం. ఈ పుణ్యభూమికి మళ్ళీ వస్తామా?" అని - కాలినడకనే తానా సరస్సుకి వెళ్ళిపోయాడు.

ఆ ప్రదేశమంతా రమణీయంగా ఉండడం వల్ల అన్నీ చూస్తూ, అక్కడక్కడ తిరుగుతూంటే ఆ తటాక ప్రాంతంలో మణిశిలా మంటపం

కనిపించింది. దానిని – చిరకాలానికి కనపడిన సోదరుడిలా, మిత్రుడిలా అత్యంత ప్రియంగా రెప్పవాల్చకుండా చూస్తూ, నిలబడి పోయి, నిర్వికార హృదయుడై ఏదో ధ్యానిస్తూ ముఖం దించుకుని దానిలో కూర్చున్నాడు.

మే మతన్నిచూసి – ఆ సౌందర్యంచూసి అలా ఐపోయాడనుకుని కొంతసేపు ఎదురుచూశాం. కాని – ఎప్పటికీ రాకపోడంతో మే మతని వద్దకు వెళ్ళి – "ఆర్యా! వేళదాటి పోతూంది. స్నానం చెయ్యండి. సైనికులు మీరాక కోసం చూస్తున్నారు. ఈ ప్రదేశం ఎంతసేపు చూసినా చూడాలనే ఉంటుంది. ఆలస్యం చెయ్యకండి" అన్నాం.

అయినా అతను కదలను లేదు, మాకు జవాబు చెప్పనూ లేదు. మేము మళ్ళీ మళ్ళీ తొందర పెట్టడంతో – మమ్మల్ని చూడకుండానే – "నేను రాను. మీరిక్కడ ఉండకూడదు. అతను వెళ్ళి చాలాసేపయింది. వేగంగా పొండి" అన్నాడు.

"అకారణంగా వైరాగ్యం చెందాడే!" అనుకుంటూ బతిమాలి, బెదిరించీ, నిష్ఠురాలాడీ 'నీకీ మెహం తగదు వేగంరా. నిన్ను వదిలి వెళ్తే చంద్రాపీడుడు మమ్మల్ని దండిస్తాడు." అని చెప్పాం.

ఎలా అయితేనేం అతను అదోలా నవ్వుతూ – "ఇప్పుడు నాకేమీ తెలియడం లేదు. మీరు మాటిమాటికీ నన్ను రమ్మని వేధిస్తున్నారు. నేను చంద్రాపీడుని వదిలి ఎప్పుడేనా ఉన్నానా? నా కంతా తెలుస్తూంది. కాని నేనేమీ చెయ్యలేక పోతున్నాను. ఇక్కడ స్థాపించబడి పోయినట్లు నా శరీరం కదలడం లేదు. కనుక రావడానికి నేను అసమర్థుడిని. నన్నొకవేళ బలాత్కారంగా తీసుకుపోదామను కుంటున్నారేమో, నా శరీరంలో ప్రాణాలు నిలవవు. మీరు పోయి యావజ్జీవమూ చంద్రాపీడుని ముఖ దర్శన సౌఖ్యం పొందండి. నాకు అలాటి సుఖం లేకుండా దైవం విడతీశాడు" అన్నాడు.

మే మది కపటమనుకుని – "ఇలా అంటారేం? చంద్రాపీడుని వద్దకు రారా?" అని ఎన్నోసార్లు రెట్టించాం. "అయ్యో! మీరు ఊరికే నన్ను నిర్బంధిస్తారేం? చంద్రాపీడుని మీద ఒట్టు. నిజంగా నాకేమీ

తెలియడంలేదు. నేను రావడానికి సమర్థుడిని కాను. కారణం తెలియదు. అంతా చూస్తూనే అడుగుతారేం? పొండి పొండి" అని - కొంచెంసేపు ఊరుకుని, అక్కడ లతలు పొదలు మధ్య తిరుగుతూ ఆ దేవాలయంలో ఏదో మరచిపోయినట్లు వెదుకుతూ ఇతర దృష్టిలేక తిరగసాగాడు.

మేము పొదలమాటునుంచి రెండు ఝాములతని చేష్టలు కనిపెట్టి మళ్ళీ అతని వద్దకు వెళ్ళి రమ్మన్నాం. అందుకు వైశంపాయనుడు, "అయ్యో! నన్ను యిలావేపుకు తింటారేం? నాకు నా జీవితంకంటె చంద్రాపీడుడి ప్రాణాలే ప్రియం కదా. ఇంకా ఎందుకు బతిమాలతారు పొండి" అని స్నానం చేసి, కందమూలాలు తిని వనవాసం స్వీకరించాడు. మేము ఆశ్చర్యపోతూ మూడురోజులు ఎదురుచూసినా అతని బుద్ధి మారలేదు. అప్పుడు నిరాశచెంది కొందరిని అతనికి కా పుంచి మేము బయలుదేరి వచ్చాం" అని చెప్పారు. ఆ మాటలు విని చంద్రాపీడుడుకి ఆశ్చర్యమూ బాధా కూడా కలిగాయి.

'అయ్యో! వైశంపాయను డింతలోనే వైరాగ్యం ఎందుకు చెందేడు? తారాపీడుడు అతన్ని కూడా నన్నులాగే చూసుకుంటాడే. ప్రజలకు సైతం నామీదకంటె అతనిమీదే అభిమానం ఎక్కువ. శుకనాసుడుకాని, మనోరమకాని అతన్ని ఏ విషయంలోనూ మందలించి ఎరుగరు. సన్యాసానికిది వయసు కాదు. గార్హస్త్య జీవితంలోకే ప్రవేశింపలేదు. ఏమిటిది?" అనుకుని - వేగంగా అక్కడికి పోవాలని, తల్లితండ్రులకు చెప్పడానికి తను పట్నం వచ్చాడు.

ఊరిలో ప్రజలందరూ వైశంపాయనుడి వృత్తాంతం చెప్పుకునే వారే. ' ఈ వార్త నాకంటె ముందే పట్నంలోకి వచ్చింది. అయితే మా తండ్రి గారికీ తెలిసే ఉంటుంది. వైశంపాయనుడి గురించి పైవాళ్ళే యింత విచారిస్తూంటే తల్లితండ్రులకెలా ఉంటుందో? నన్నేమని శంకిస్తారో?' అనుకుంటూ పురద్వారం దగ్గర గుర్రం దిగి ఆస్థానానికి వెళ్తూంటే, తనతల్లీతండ్రీ శుకనాసుడి యింట్లో ఉన్నారని తెలిసింది. అతను అక్కడికి పోతూంటే - అతనికి దగ్గరలోనుంచి - "హా! వైశంపాయనా! హా! వైశంపాయనా! నా వొడిలో ఉండవలసిన నువ్వు

అడవిలో ఒంటిగా ఎలా ఉన్నావ్? నీకు శయ్యఎవరు వేస్తున్నారు? నీకు వేళకి ఆహారం ఎవరు పెడుతున్నారు? నువ్వురాగానే పెళ్ళి చేద్దామనుకున్నాను. కాని – దురదృష్టవంతు రాలినయిన నాకు అంత అదృష్ట మెలా పడుతుంది? నన్నూ మీ తండ్రినీ నువ్వున్న చోటుకి తీసుకుపో. నిన్ను వదిలి నిముషమేనా ఉండలేము. చంద్రాపీడుణ్ని విడచి క్షణమైనా ఉండేవాడివి కావే? ఆ స్నేహమంతా ఏమైపోయింది? వైరాగ్యం పూనడానికి కారణ మేమిటి? అయ్యో! పుత్రా! నేనేం చెయ్యాలి" అంటూ విలపిస్తున్న మనోరమ కంఠాని కతను మూర్ఛపోయి అంతలో తెప్పరిల్లి తండ్రిదగ్గరకు వెళ్ళి అతన్ని చూడడానికి సిగ్గుపడి నమస్కరించి, తలవంచుకుని దూరంగా కూర్చున్నాడు.

"వత్సా! చంద్రాపీడా! నీకు వైశంపాయనుడి యందు జీవితంకంటే ఎక్కువ ప్రీతి అని ఎరుగుదును. కాని, అతని వృత్తాంతం విన్నది మొదలు నా మనసులో నీమీద అనుమానం కలుగుతూంది" అనే సరికి –

అతని మాటల నాక్షేపిస్తూ – శుకనాసుడు – "చంద్రాపీడు డలాంటి దోషం చేస్తాడని తలచకూడదు. అతని సుగుణాలు తెలిసికూడా మిత్రఘాతకుడని సూచిస్తారేం? ఆలోచిస్తే వైశంపాయనుడే దుర్జనుడు. పుత్రులను కనేది వంశవృద్ధి కోసం. తండ్రి అనుమతి తీసుకోకుండా వైరాగ్యం ఎలా తీసుకుంటానని ఆలోచించాడు కాదు. అంత స్వతంత్రమా! వాడు పెంచిన చిలకలా తాను దేవరచేత పోషించబడిన విషయం మరచి వెళ్ళిపోయాడు. ఆ పాపాత్ముడి జన్మ మనకు శోకానికే కారణభూత మయింది" అని కన్నీరు పెట్టుకున్నాడు.

"ఆర్యా! ఊరడిల్లు. నీకు మేము బోధించే వాళ్ళమా? ఎంత వివేకి అయినా దుఃఖాతిశయంలో చిత్త చాంచల్యం చెందక మానదు. వైశంపాయనుడి గురించి కోపంలో పలికిన మాటలు వినడానికి నాకు బాధగా ఉంది. అతనిమీద కోపం విడువు. వాడు చాలా గుణవంతుడు. అకారణంగా అతన్ని నిందించ కూడదు. చంద్రాపీడుణ్ని పంపి అతన్ని వేగంగా ఇక్కడికి రప్పించి – అలాగ ఎందుకు వైరాగ్యం చెందాడో

తెలుసుకుందాం. అప్పుడు న్యాయమేదో దానిని ఆచరిద్దాం" అన్నాడు తారాపీడుడు. అందుకు -

"దేవా! నీకు వైశంపాయనుడి మీద మక్కువతో అలా అంటున్నావు. నీ ఔదార్య మలాటిది. కాని యువరాజుని విడిచి ఉండడం కష్టం" అన్న మాటవిని - తండ్రి మాట హృదయంలో బాణంలా నాటగా కన్నీరు కారుస్తూ - శుకనాసుడి వద్దకు చేరి "ఆర్యా! వైశంపాయనుడి విషయంలో నా దోష మేమీలేదని చెప్పకపోయినా నాకు తెలుసు. అయినా మా తండ్రిగారికి అనుమానం తోచిందని చెప్పారు కదా? లోకులు కూడా అలాగే భావిస్తారు. అసత్యమైన లోకాపవాదం భరించడం కష్టం. దీనికి ప్రాయశ్చిత్తంగా వైశంపాయనుడిని తీసుకు రాడానికి నన్ను నియోగించండి. మరొకవిధంగా నాకు నిష్కృతి కలగదు. గుర్రం మీద వెళ్తాను. వెళ్ళడానికి అనుమ తివ్వండి నేను వెళ్ళి నా ప్రియమిత్రుణ్ణి తీసుకు వస్తాను అతను రాకపోతే నేనూ అక్కడే ఉండిపోతాను" అన్నాడు చంద్రాపీడుడు.

"దేవా! యువరాజు వెళ్ళడానికి అనుమతి కోరుతున్నాడు. మీ సెల వేమిటి?" అని మంత్రి రాజు నడిగాడు. అప్పుడు తారాపీడుడు "మన మొకటి తలిస్తే దైవం మరొకటి తలిచాడు. కానివ్వండి. వైశంపాయనుణ్ణి యువరాజు తప్పక తీసుకురావలసిందే. అతన్ని విడచి ఇతను క్షణమైనా ఉండలేడు. అతన్ని తీసుకురావడానికి కుమారుణ్ణే కాదు విలాసవతి నయినా పంపుతాను" అని - దైవజ్ఞుల నప్పటికప్పుడే రప్పించి ప్రయాణాని కప్పుడే ముహూర్తం నిశ్చయించి - చంద్రాపీడునితో - "నీ వీవార్త తల్లికి చెప్పి వేగంగా వెళ్ళు" అని శుకనాసుడితో తన భవనానికి వెళ్ళి పోయాడు.

చంద్రాపీడుడు తల్లి వద్దకు పోయి నమస్కరించి, ఆమె దగ్గరలో కూర్చుని చాలా విచారిస్తున్న మనోరమతో - "తల్లీ! చింతింపకు. వైశంపాయనుడిని తీసుకు రాడానికి మా తండ్రి అనుజ్ఞ యిచ్చాడు. నేను వెళ్ళి తొందరలోనే అతన్ని తీసుకొస్తాను. నువ్వుకూడా అనుమతిస్తే - వెళ్తాను" అన్నాడు.

"వత్సా! నా కతనియందుకంటె నీ మీదే మక్కువ ఎక్కువ. నువ్వు వెళ్ళిపోతే ఎవరిని చూసి దైర్యంగా ఉండగలను? నువ్వు పోవద్దు. దైవానుగ్రహం కలిగిన నాడు వాడే వస్తాడు. లేదా మరెవరినేనా పంపండి" అన్ని మనోరమ మాటలకి –

"సఖీ! మనిద్దరికీ వారిద్దరి మీదా సమాన ప్రేమే ఉంది. వానిని చూడకుండా నేను మాత్రం ఉండగలనా? వద్దనకు. మనం వద్దన్నా చంద్రాపీడుడు ఆగడు. అనుజ్ఞయివ్వు" అని విలాసవతి ఎన్నోవిధాల చెప్పగా ఎలాగో మనోరమ సమ్మతించింది. అప్పటికి సాయంకాల మయింది

రాత్రి భోజనం చేసి తల్పంమీద పడుకుని చంద్రాపీడుడు – "ముందుగా అచ్ఛోద సరస్సుకు పోయి, వెనక నుంచి వెళ్ళి వైశంపాయనుడిని పీక పట్టుకుని – యింక నువ్వెక్కడికి పోగలవంటాను. అతను నామాట తీసెయ్యలేక నాతో వస్తాడు కదా. తరవాత నేను మహాశ్వేత ఆశ్రమానికి వెళ్ళి అక్కడ పరిచారకులనుంచి ఆమెతో కలసి హేమకూటానికి వెళ్తాను నన్ను చూసి కాదంబరి సేవకులు నమస్కారాలు పెడుతూ అటూయిటూ తిరుగుతూండగా, కాదంబరి ఉన్న చోటుకి వెళ్తాను అప్పటికే నా రాక తెలిసిన కాదంబరి తటాలున పూలశయ్య మీంచి లేచి ఆత్రంగా అలంకారాలు సవరించుకుని సిగ్గుతో తలవంచుకుని నిలబడుతుంది ఆమెను చూసి – కనులకు పండగ చేసుకుంటాను.

తరవాత మదనలేఖనీ, కేయూరకుణ్నీ యధారీతి గౌరవించి, సాహసించి వివాహ ప్రయత్నం చేయడానికి చిత్రరధుడికి వార్త పంపుతాను.

ఆమెను శుభముహూర్తంలో పెళ్ళాడి, స్నేహితులు తొలగగా, పుష్పశయ్యమీద నా సమీపంలో కూర్చున్న కాదంబరిని గాఢంగా సందిటలోకి తీసుకుని కౌగలించుకుని ఎడమచేతిని కేశపాశమందుంచి కుడిచేతితో బుగ్గలు పుణుకుతూ.. చెక్కిళ్ళు ముద్దు పెట్టుకుంటూ అధరామృతం పానం చేస్తాను.

దానితో - మదన తాపంతో కృశించి ఉన్న అవయవాలు సంతోషంతో వికసిస్తాయి. ఆమెతో మదనాగ్నిని ఆర్పే సుఖా లనుభవిస్తాను రమ్యమయిన ప్రదేశాలలో విహరిస్తూ సుఖిస్తూ యౌవనానికి తృప్తి కలగజేస్తాను అలాగ కాదంబరికి సంతోషం కలగజేసి - మదనలేఖని వైశంపాయనుడికి పెళ్ళి చేస్తాను' అని ఊహించుకుంటూ ఆ రాత్రి నిద్రపట్టక - ఉదయానే లేచాడు.

తగిన పరివారాన్ని తీసుకుని, ఇంద్రాయుధం ఎక్కి పురం వదలి, అచ్ఛోద సరస్సు తీరానికి వెళ్తూంటే కొంచెం దూరంలోనే మేఘనాదుడెదురయ్యాడు. చంద్రాపీడుడు అతి ఆత్రంగా - "మేఘనాధా! అచ్ఛోద సరస్సుతీరంలో నీకు వైశంపాయనుడు కనిపించాడా? మాట్లాడావా? ఏమన్నాడు? ఇప్పటికేనా పశ్చాత్తాపం చెంది యింటికి రావాలనుకుంటున్నాడా? నా గురించి ఏమేనా అడిగాడా? అతనికి తల్లితండ్రులు జ్ఞాపక మున్నారా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు

"దేవా. దేవర - ఇదుగో, నేను వైశంపాయనుడితో మాట్లాడి నీవెనకన వస్తానని చెప్పారు కదా. మే మలా పోయి ఎంతసేపు చూసినా మీరు రాలేదు. అప్పుడు పత్రలేఖా, కేయూరకుడూ నాతో - 'వర్షాకాలం కావడంచేత చంద్రాపీడుణ్ని తల్లితండ్రులు రానిచ్చి ఉండరు. నువ్విక్కడ ఒక్కడివీ ఉండడ మెందుకు? ఇంటికిపో - అన్నారు. వాళ్ళు హేమకూటానికి వెళ్ళిపోయారు. నేను మరికొన్ని రోజులుండి యింటికి తిరిగి వస్తున్నాను. అంతే తప్ప వైశంపాయనుడి వార్త నాకేమీ తెలియదు. అత నచ్ఛోద సరస్సుకి పోవడమే నాకు తెలియదు" అన్నాడు మేఘనాధుడు.

"సరే! ఈ పాటికి పత్రలేఖ హేమకూటం చేరి ఉంటుందో లేదో చెప్పగలవా?" అని అడిగాడు చంద్రాపీడుడు.

"దేవా! దైవికమైన అంతరాయం ఏదీ కలగకుండా ఉంటే - ఈ పాటికి హేమకూటం చేరి ఉంటుందనే నా అభిప్రాయం. పత్రలేఖ ఆలస్యం చేసేది కాదు." అన్నాడు మేఘనాదుడు.

చంద్రాపీడుడు ఆ సమాధానానికి సంతోషిస్తూ, అతనితో, వైశంపాయనుణ్ని చూసే వేడుకతో అచ్ఛోద సరస్సు చేరుకుని - గుర్రపు రౌతులతో యిలా చెప్పాడు.

"వైశంపాయనుడు వైరాగ్యం పూని యీ వనంలో ఎక్కడో ఉంటాడు. మనని చూస్తే పారిపోతాడు. కాబట్టి మీరందరూ గుర్రాల మీంచే పొదలూ లతలూ మొదలైన ప్రదేశాలూ జాగ్రత్తగా చూడండి"

చంద్రాపీడుడు కూడా చాలా జాగ్రత్తగా వెదికాడు కానీ ఎక్కడా అతని గుర్తులు కనిపించలేదు

అప్పుడతను ఎన్నో విధాలుగా విచారించి - వైశంపాయనుడి వార్త మహాశ్వేత కేమైనా  తెలుసునేమో? కాదంబరి విశేషాలు కూడా తెలుస్తాయి" అనుకుని - గుర్రాల వాళ్ళని ఆ ఆశ్రమానికి కొంచెం దూరంలో ఉండమని - తాను ఇంద్రాయుధం ఎక్కి మహాశ్వేత ఆశ్రమానికి పోయి, గుహముందు దిగి.. సన్నని వస్త్రాలు ధరించి లోపలికి వెళ్ళాడు.

"అక్కడ ..తరళికని పట్టుకుని ఏకధారగా రోదిస్తున్న మహాశ్వేతను చూసి ఆశ్చర్యపోతూ...కాదంబరి కేదయినా జరగరానిది జరిగిందేమో అని భయపడుతూ, మెల్లగా దగ్గరకి వెళ్ళి - "తరళికా! ఈమె యిలా ఉందేం?" అని అడిగాడు.

తరళిక ఏమీ చెప్పకుండా మహాశ్వేత ముఖం చూసింది అప్పుడామె మెల్లగా శోకాన్నణుచుకుని, గద్గదస్వరంతో - "రాజకుమారా! సిగ్గులేని యీ పాపాత్మురాలు చెబుతూంది, వినండి. కేయూరకుడిద్వారా మీరు ఉజ్జయినీ వెళ్ళిన వార్తవిని, మనసు చింతించింది  మదిరా, చిత్రరధుల మనోరధం తీర్చలేకపోయాను. కాదంబరి కోరిక సఫలం చేయలేకపోయాను  రాజకుమారుడి కోరిక తీరిందికాదు  నేను వచ్చి చేసిందేమిటి? - అని సిగ్గుపడుతూ, కాదంబరితో స్నేహపాశాన్ని తెంపుకుని, మళ్ళీ తపస్సు చేసుకుందుకు ఈ ఆశ్రమానికి వచ్చాను. ఇక్కడ మిమ్మల్నే పోలి ఉన్న ఒకబ్రాహ్మణ కుమారుడు కనిపించాడు అత నేదో వెదుకుతున్నట్లు శూన్యహృదయుడై ఉన్నాడు.

అతను మెల్లగా నా వద్దకు వచ్చాడు. నన్నెప్పుడో ఎరిగినవాడిలా రెప్పవాల్చకుండా చూస్తూ -

"లోకంలో తమ జన్మకూ, వయసుకీ, రూపానికీ తగినట్లు ప్రవరిస్తే నిందాపాత్రులు అవరు. నువ్వు అలా కాకుండా తగని ప్రయత్నం చేస్తున్నావేం? తపస్సుతో నీ శరీరా న్నిలా కృశింప జేసుకుంటున్నావేం?" అంటూ ఏమోమో చెప్పాడు.

పుండరీకుడి కథ జరిగింది మొదలు నేను ఉత్సాహం కోల్పోయి ఉన్నాను. కనుక అతని మాటలు విని - "ను వ్వెవరివి? నీ పేరేమిటి? నీ వృత్తాంత మేమిటి? నాతో యిలా మాట్లాడు తున్నా వెందుకని? " అని అడగకుండానే అక్కడినుంచి లేచి, సమీపంలో పూలుకోస్తున్న తరళికను చేరుకుని -

"ఈ యువకు డెవరే? ఆకారం చూస్తే బ్రాహ్మణ కుమారుడిలా తోస్తూంది. నన్ను చూడగానే వీడి మనసులో వెర్రి చేష్టలు పుడుతు న్నట్లున్నాయి. వీడు మళ్ళీ యిక్కడికి రాకుండా చెయ్యి. అంటి పెట్టుకుని తిరుగుతున్నాడు. వొద్దన్నా మళ్ళీ వొచ్చాడంటే శాస్తి పొందగలడు-" అన్నాను.

అది అతనితో తగినట్లు చెప్పింది. కాని మన్మధ వికారం ఆవరించిన అతని మనసు మరలలేదు.

కొన్నాళ్ళు గడిచాయి. ఒకనాటి రాత్రి ప్రపంచమంతా వెన్నెలతో నిండి ఉంది. నే నీశిలాతలంమీద శయనించి, మెల్ల మెల్లగా చల్లగాలులు వీస్తుంటే పుండరీకుడి వృత్తాంతమే తలపోసుకుంటూ, నిద్రపట్టక, చంద్రబింబాన్నే చూస్తూ ఉన్నాను.

అప్పుడా బ్రాహ్మణ కుమారుడు మదనావేశంతో మెల్లగా అడుగులు వేస్తూ నా దగ్గరకి వచ్చాడు. అతన్ని చూడగానే నాకు భయమేసింది. 'అయ్యో! పెద్ద ఆపద సంభవించిందే. వీడు నన్ను ముట్టుకున్నాడో ప్రాణాలు వదలవలసిందే కదా. పుండరీకుడికోసం యిన్నాళ్ళు ఎదురు చూసింది వృధా అయిపోతుందే' అని ఆలోచిస్తూంటే అతను నాకు మరింత దగ్గరగా వొచ్చి - "ఇందుముఖీ! మన్మధుడితో కూడి చంద్రుడు నన్నిప్పుడు చంపడానికి ప్రయత్నిస్తున్నాడు. అందుకని

నిన్ను శరణు జొచ్చాను. నన్ను రక్షించు. శరణాగతులను రక్షించడం తపస్వుల ధర్మమే కదా? నువ్విప్పుడు నన్ను రక్షించక పోయావో నీకు బ్రహ్మహత్యా పాతకం రాగలదు" అన్నాడు.

ఆ మాటలకు నాలో కోపం ఉవ్వెత్తున లేవగా - భస్మం చేసేదానిలా వానిని చూస్తూ, ఆవహించిన కోపంతో ఒళ్ళు మరచి, "ఓరి పాపాత్ముడా! నన్నిలా అంటే, నీతల పిడుగు పడ్డట్లు నూరు ముక్క లవలేదేం? నీ నోరు పడిపో లేదేం! నువ్వింకా ఎలా బతికున్నావు? మూఢుడా! ఇలాటి కామప్రవృత్తి కలిగిన నువ్వు పశువుగా కాక యిలా ఎలా పుట్టావు? సమయమూ సందర్భమూ ఎరుగకుండా విధిచేత పలికించ బడిన చిలకలా పలికించబడ్డావు. చిలకగా అయినా పుట్టక పోయావేం? అప్పుడు నన్ను కామించి ఉండే వాడివి కాదు కదా''అంటూ చంద్రమండలం వేపు చూసి-

"దేవా! లోకపాలకుడా! నేను పుండరీకుడిని చూసింది మొదలు, యితర దృష్టి లేక అతనినే ధ్యానించుచున్న దానినైతే - వీడు నా మాట చేత హీనజాతియందు పుట్టుగాక" అన్నాను.

అప్పు డతను నాశాపం వల్లనో మదనతాపం వల్లనో, పాపవినాశం వల్లనో నరకబడిన చెట్టులా నేలమీద పడిపోయాడు. అతనలా ప్రాణాలు పోగొట్టుకోడంతో అతని పరిజనం పెద్ద కంఠంతో రోదించారు. ఆ ఆక్రందనల మూలంగానే అతను మీ మిత్రుడని తెలిసింది"అని మహాశ్వేత తలవంచుకుని ఏడవసాగింది.

ఆ మాటలకు చంద్రాపీడుడు కళ్ళు మూసుకుని - భగవతీ! కాదంబరితో నన్ను కూర్చడానికి నువ్వు తగిన ప్రయత్నం చేశావు. కాని - అదృష్టహీనుడి నయిన నా కలాటి యోగ్యత లేనప్పుడు నువ్వేం చెయ్యగలవు? వొచ్చే జన్మలో అయినా కాదంబరి నాకు లభించేటట్లు అనుగ్రహించు" అంటూనే హృదయం పగిలిపోగా, నిలబడే ప్రాణాలు వదిలాడు.

స్నేహితుడి మరణవార్తను వినడంతోటే హృదయం పగిలి చనిపోయిన చంద్రాపీడుని చూసి - తరళిక, మహాశ్వేతను వదిలి అతనిని పట్టుకుని, "అయ్యో! సఖీ! ఇంకా సిగ్గేమిటే? ఇతను ప్రాణాలు వదలినట్లు తోస్తూంది. మెడ వేలాడేశాడు. శ్వాస ఆడుతున్నట్లు లేదు కళ్ళు మూతలు పడిపోయాయి హా! చంద్రాపీడా. కాదంబరీప్రియా! ఈమెను వదలి ఎక్కడికి పోయావు? ఆ ప్రేమంతా ఏమయింది?" అని ఏడుస్తూంటే - మహాశ్వేత అతని మొహంచూసి, వివర్ణం అవడం గమనించి, గాఢమైన శోకంలో చేష్టలు తప్పి పడి ఉంది

అప్పు డతని పరిజనం అది తెలుసుకుని - మహాశ్వేతను నిందిస్తూ, గట్టిగా - "హా! రాజకుమారా! హా. వైశంపాయనా! హా! తారాపీడ! హా! శుకనాస. హా! విలాసవతీ! హా. మనోరమా! మీ కెలాటి ఆపద సంభవించింది! కటకటా! ప్రజ లెంత భాగ్యహీనులు. భూమి అనాధ అయిందికదా " అంటూ అనేక విధాలుగా విలపించారు

అతని గుర్రం దీనంగా సకిలిస్తూ మాటిమాటికీ చంద్రాపీడుని ముఖంచూస్తూ ఇసకరేణువు లెగురుతూంటే, విచారాన్ని సూచిస్తూ చిందులు తొక్కసాగింది."

అంతవరకూ చెప్పి - ఆపాదు మణిసిద్ధుడు. "పై మజిలీ చేరాక మిగిలిన కథ చెబుతాను" అన్నాడు గోపాలుడితో.

# కాశీ మజిలీ కథలు

గోపా! విను హేమకూటంలో కాదంబరి పత్రలేఖ ద్వారా చంద్రాపీడుని రాక గురించి విని ఎంతో సంతోషిస్తూ ..తల్లి తండ్రుల కేదో వంక చెప్పి, అందంగా అలంకరించుకుని పరిచారికలు సుగంధ ద్రవ్యాలు పట్టుకుని రాగా, కేయూరకుడు తోవచూపుతూంటే, పత్రలేఖని పట్టుకుని నడుస్తూ...మదనలేఖతో -

"ఈ పత్రలేఖ చెప్పిన మాటలు విన్నావా? అతని విషయంలో నేను అశ్రద్ధ చేశానట! నా అవస్థంతా చూసికూడా హిమగృహంలో నైపుణ్యంగా పలికిన అతని వక్రభాషణలు నీకు జ్ఞాపకం లేవా? నువ్వుకూడా అతని మాటలకి తగినట్లే జవాబు చెప్పావు అలాటివాడు నన్నిప్పుడు విమర్శిస్తాడా? ప్రయాణం సంగతి తలపెట్టకుండా తనకోసం నేను అలమటించిపోతున్నానని అనుకుంటున్నాడేమో. నే నతన్ని చూసి ఏమీ మాట్లాడను. పాదాలమీద పడినా అనుగ్రహించను. మదనలేఖా! నువ్వప్పుడు నా కేమీ చెప్పొద్దు సుమా. చాలాచిక్కులు పెట్టాక అప్పుడు మాట్లాడతాను" అంటూ అతని గురించిన మాటలే చెప్పుకుంటూ.. విచారమనేదిలేకుండా, చంద్రాపీడుణ్ని చూడడానికి చాలా తొందర పడుతూ మహాశ్వేత ఆశ్రమానికి వచ్చారు.

అక్కడ - విగత జీవుడై పడున్న చంద్రాపీడుణ్ని చూసి కాదంబరి, "హా! ఇదేమిటి?" అంటూ మూర్ఛపోయి కూలబడిపోతూంటే ఆమె పడిపోకుండా మదనలేఖ తటాలున పట్టుకుంది పత్రలేఖ కాదంబరి చెయ్యి వదిలేసి ఆవేశంతో వొళ్ళు తెలియక నేలకొరిగిపోయింది.

కాదంబరి కొంతసేపటికి తెప్పరిల్లి - ఏమీ తెలియక..ఊపిరి తీసుకోడం కూడా మరిచిపోయి, రెప్పవాల్చకుండా, నిశ్చలమైన దృష్టితో

అతని మొహమే చూస్తూ, బొమ్మలా, కదలకుండా అలాగే నిలచి ఉండడం చూసి, మదనలేఖ ఆమె పాదాలమీద పడి – "సఖీ! శోకం విడువు. నీ హృదయం యింత విచారాన్ని భరింపలేక బద్దలయి పోగలదు సుమీ. ఇతను చైతన్యం కోల్పోయి పరలోకాని కేగినట్లు కనిపిస్తూంది. ఇంక ఇతని గురించి చింతించడ మెందుకు? ఇంటికి పోయి తల్లితండ్రులకు ఆనందం కలగజెయ్యి. నిన్ను చూడకుండా వారు నిముషమేనా ఉండలేరు" అంది.

ఆ మాటలకు కాదంబరి నవ్వి –

"ఓసి వెర్రిదానా! నా హృదయం మృదువా! వజ్రం కంటే కఠినమైంది. కాకపోతే ఈపాటికే పగిలిపోదా? ఐనా – జీవించే వారికి కదా తల్లితండ్రులూ, బంధువులూ, పరిజనమూ? నాకిక వారితో పనేమిటి? స్వర్గానికి వెళ్ళిన యితనికి అమంగళ మని నేను ఏడవను కూడ ఏడవను, పాదాలననుసరించి పోతాను. అందరినీ లెక్కచెయ్యక, మహాశ్వేతను గురించి చేసిన శపథాన్ని సైతం వదిలిపెట్టి ఎవరిగురించి ప్రయత్నించానో అతను నాకోసం ప్రాణాలు విడిచాక, నాప్రాణాల నెలా నిలుపుకునేది? నా కిప్పుడు మరణమే మంచిది. నా మీద నీకు కనికరం ఉంటే నేను చెప్పినట్లు చెయ్యడానికి ప్రయత్నించు.

నేను లేని నా భవనం చూసినా నా వాళ్ళు విచారింపకుండా మునపటిలా ఉంటేనే నాకు ప్రీతి. మాధవీలతకు వివాహం చేయి. పడకటింట్లో తలవేపు వేలాడదీసిన కామపటాన్ని ముక్కలు ముక్కలు చేసెయ్యి. నేను ముద్దుగా పెంచిన లేడి పిల్లలను తపోవనంలో వదిలిపెట్టు. నా క్రీడాపర్వతాన్ని ఒక మహాతపస్వికి ఆశ్రమంగా సమర్పించు. చిలకలని స్వేచ్ఛగా విడిచిపెట్టు. నా అలంకారాలను బ్రాహ్మణ కాంతల కివ్వు. నావీణ నువ్వు తీసుకుని పాడుకో. మిగిలిన వస్తువులని నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి. అశోకవృక్షం యిప్పు డిప్పుడే చిగురిస్తూంది. దానిని ముట్టుకోకూడదు సుమీ. లతా కుసుమాలని దేవతార్చనకే వినియోగించాలి. నా పాదచారయిన హంసని రక్షించు.

ప్రాణసఖీ! పరలోకం పోయిన నాకు నువ్వే జలాదులు యిస్తూండు. నేనితని కంఠం కౌగలించుకుని ప్రాణాలు వదులుతాను" అంటూ, ఆ ప్రాంతంలోనే నిశ్చేష్టగా మిగిలిన మహాశ్వేతను కౌగలించుకుని

"ప్రియసఖీ! ప్రియుడు మళ్ళీ వొస్తాడని నువ్వు మరణంకంటె ఎక్కువైన కష్టాలను అనుభవిస్తూ, ఆశతో ఉన్నావు. కాని, నాకలాటి ఆశ ఉంచుకునే అవసరం కూడా లేదుకదా. కనుక నా మరణానికి అనుజ్ఞ యివ్వు. మరుజన్మలో కూడా నీ స్నేహం లభించాలని కోరుకుంటున్నాను. నా తప్పులు మన్నించు" అంటూ, లేచి, పూలతోనూ చిగుళ్ళతోనూ చంద్రాపీడుని పాదాలను పూజించి, చేతులతో తనతొడ మీద ఉంచుకుని కూర్చుంది.

ఆ స్పర్శతో - అతని శరీరం నుంచి అద్భుతమైన తేజం బయటపడి ఆ ప్రాంతమంతటనీ మంచుతో నింపి....అంతరిక్షంలో కలసి.. అశరీరవాణిలా యిలా పలికింది.

"కాదంబరీ! చింతింపకు. చంద్రాపీడుడు శాపదోషం వల్ల ప్రాణాలు విడిచాడు. వీని శరీరాన్ని వదలకుండా కాపాడుతూ ఉండు. శాపం ముగియగానే ఈతను మళ్ళీ జీవిస్తాడు. అందుచేత యితని శరీరానికి అగ్నిసంస్కారం చేయవద్దు. నీ కరస్పర్శ వలన అతని శరీర కాంతి అలాగే ఉంటుంది."

అందరూ తలలెత్తి రెప్పలు వాల్చకుండా ఆకాశాన్నే చూడసాగారు. పత్రలేఖ, వాతావరణంలోని చల్లదనానికి తెప్పరిల్లి లేచి...ఆవేశించిన దానిలా పరుగెత్తి ఇంద్రాయుధం కళ్ళెం పట్టుకుని - "చంద్రాపీడుడు లేనప్పుడు మనమెందుకు?" అంటూ ఆ గుర్రాన్ని లాక్కుపోయి, దానితోకూడా అచ్ఛోద సరస్సులోకి దుమికివేసింది. వెంటనే. ఆ సరస్సులోంచి తాపసకుమారుడొకడు బయటకు వచ్చి, దూరంనుంచిచూస్తూ మహాశ్వేత వద్దకు వెళ్ళి గద్గద స్వరంతో గంధర్వ రాజపుత్రీ! నన్నెరుగుదువా?" అని అడిగాడు.

అప్పుడామె, ఒకవేపు శోకంతోనూ, మరోవేపు ఆనందంతోనూ తొందరగాలేచి, అతనికి నమస్కరించి "దేవా! కపింజలా! పాపాత్మురాలినైన నేను ఇలా సిగ్గులేకుండా, పుండరీకుడు స్వర్గానికి వెళ్ళిపోయినా, బతికి ఉన్నాను. అత నెక్కడికి పోయాడు? ఎక్క డున్నాడు? నువ్వెప్పుడేనా చూశావా? అతన్ని వదిలి నువ్వొక్కడివే వచ్చావేం?" అని అడిగింది.

చంద్రాపీడుని పరిజనం అతని చుట్టూ చేరి వింతగా చూడసాగింది. అప్పుడు - కపింజలు డామెతో యిలా అన్నాడు.

# కపింజలుడి కథ

"గంధర్వరాజపుత్రీ! విను.

'నువ్వలా శోకసముద్రంలో మునిగి ఉండగా గగనవాణిని అనుసరించి నేనెగిరాను కదా. అతను నాకు జవాబు చెప్పకుండానే ఆకాశమార్గంలో పోయి పోయి క్రమంగా చంద్రలోకం చేరి - అక్కడ మహోశయం అనే పేరు కల సభలో ఉన్న మంచం మీద పుండరీకుడి శరీరాన్ని పడవేసి -

"కపింజలా! చంద్రుణ్ని. నేను లోకోపకారం కోసం ఉదయించి ప్రకాశిస్తూంటే, నీ మిత్రుడు పుండరీకుడు కామాపరాధం వల్ల శరీరం వదులుతూ - నన్ను చూసి - 'హంతకా! నీవల్ల నేను ప్రియాసంగమ సుఖం అనుభవించకుండానే ప్రాణాలు వదులుతున్నాను. కనక నువ్వుకూడా యిలాగే కర్మభూమి అయిన భారతదేశంలో జన్మిస్తూ, జన్మ జన్మకూ అనురాగం కలిగి ఉంటూ ప్రియసమాగమ సుఖం అనుభవింపక తీవ్రమయిన విరహవేదనను అనుభవించి మరణిస్తూ ఉంటావు" అని శపించాడు.

అప్పుడు నేను - 'అయ్యో! అపరాధ మేమీ లేకుండానే నన్నిలా శపించావేమిటి?' అని కోపంతో - "నాలాటి కష్టాలే నువ్వుకూడా

అనుభవిస్తావు." అని తిరిగి శపించాను. కాని...అంతలోనే కోపం అణుచుకుని వివేకం తెచ్చుకుంటూ – 'మహాశ్వేత నా కిరణాల వల్ల పుట్టిన అప్సరకులంలో పుట్టిన గౌరికి జన్మించింది. అందుచేత నాకు ఆప్తురాలు. ఆ మహాశ్వేత వరించిన యీ ముని కుమారుడు సైతమూ బంధువే అవుతాడు. నిష్కారణంగా శపించానే. కానియ్..జన్మజన్మకు అన్నాను కనుక రెండు జన్మము లెత్తిన చాలు. నాతో కూడా యితను మర్త్యలోకంలో రెండుసార్లు జన్మిస్తాడు" అని తలుస్తూ ఇలా అన్నాను.

పూర్వం అతని శరీరం గ్రహించి, అశరీరవాణిచే మహాశ్వేత నూరడించి యిక్కడికి వచ్చాను. ఇది పుండరీకుని శరీరం. శాపాంతం వరకూ యిక్కడే ఉంటుంది. నువ్వు పోయి ఈ వృత్తాంతం శ్వేతకేతుడికి చెప్పు. ఆ మహానుభావుడు ఏదేనా ప్రతిక్రియ చేయగలడు. – అని చెప్పి నన్ను వదిలాడు.

అప్పుడు నేను మిత్ర శోకంలో అంధుడిలా దేవలోకంలో పరుగెడుతూ, చూడకుండా ఒక వైమానికుణ్ని దాటాను. అందు కతను కోపించి నావేపు చురచురచూస్తూ – "దురాత్మా! తపోబల గర్వితుడా! మిక్కిలి విశాలమయిన ఆకాశంలో కూడా గుర్రంలా నన్ను దాటావు. నీకెక్కడా చోటు దొరకలేదు కాబోలు. కానియ్. నీకు అలా దాటడం సరదాగా ఉన్నట్లుంది. నువ్వు గుర్రమై భూలోకంలో జన్మించు" అని శపించాడు.

నేను కన్నీరు పెట్టుకుని, నమస్కరించి, "దేవా! నేను మిత్రశోకంలో నిన్ను దాటాను కాని తిరస్కార భావంతో కాదు. అనుగ్రహించి శాపం ఉపసంహరించండి" అని వేడుకున్నాను.

అతను – "ఆర్యా! నాశాపం తిప్పనలవికాదు. నువ్వు గుర్రానివై ఎవరిని మోస్తావో అతని మరణంతో స్నానం చేస్తే చాలు ముక్తుడివౌతావు. ఇదే నేను చేయగలిగిన ఉపకారం" అన్నాడు

"దేవా! అలా ఐతే నేనొక మనవి చేసుకుంటున్నాను. శాపదోషంవల్ల నా మిత్రు డిప్పుడు చంద్రుడితో కూడా భూమిమీద

పుట్టవలసిఉంది. కనుక తమరు దివ్యదృష్టితో చూసి, అశ్వజన్మలో కూడా అతనితో కలసి కాలం గడిపేటట్లు అనుగ్రహించండి. ఇదే నా కోరిక" అన్నాను. అతను కొంచెం ఆలోచించి ఇలా అన్నాడు.

"భూమిమీద ఉజ్జయినీ నగరంలో సంతానం కోసం తపస్సు చేస్తున్న తారాపీడుడికి పుత్రుడై చంద్రాపీడుడు జన్మిస్తాడు. నీ మిత్రుడు పుండరీకుడు కూడా తారాపీడుని అమాత్యుడైన శుకనాశుడికి జన్మిస్తాడు. కనుక నువ్వారాజపుత్రుని అశ్వంగా జన్మించు. నీ మీదిప్రేమకొద్దీ ఇంత ఆలోచించాను. పో." అనగానే నేను కిందకి చూసి సముద్రంలో పడి గుర్రమై పుట్టాను. ఆ జన్మలో కూడా నాకు జాతిజ్ఞానం ఉంది. కనుక అశ్వముఖ మిధునం కనపడడంతోటే వెంటపడి యీ భూమికి తీసుకువచ్చాను. చంద్రాపీడుడు చంద్రుని అవతారం పూర్వజన్మలోని అనురాగం వల్ల నిన్ను అభిలషించి నీ శాపాగ్నిలో దగ్ధుడైన వైశంపాయనుడే పుండరీకుడు" అని ఊరుకున్నాడు.

ఆ మాటవిని – మహాశ్వేత, "హా! దేవ! హా! పుండరీక! నువ్వు మరో లోకంపోయినా నిన్నే స్మరించుకుంటున్నాను. ఈ రాక్షసితో నీకేం ప్రయోజనం ఉంది నేను వినాశం కోసమే పుట్టాను కాబోలు. నేను లేకపోతే యీ ఆపదే రాకపోను. ఇప్పుడు నేనేం చేసేది? ఎవరితో చెప్పుకునేది? ఎవరు రక్షిస్తారు? – అని అనేకవిధాల విలపిస్తూ, తలబాదుకుంటూ నేలమీద పడిపోడం చూసి కపింజలుడు–

"గంధర్వరాజపుత్రీ! నువ్విలానిందించుకుంటావేం? నీలో తప్పేముంది? మళ్ళీ ఇప్పుడు దుఃఖించవలసిన అవసరమేముంది. మీ యిద్దరూ శాపాంతంలో భర్తలతో కలుసుకుంటారు. అశరీరవాణిని మీరు విన్నారు కదా. అంతవరకూ తపస్సు చేసుకోండి. దానివలన అన్నికార్యాలూ చక్కబడతాయి చింతింపకండి." అని ఓదార్చాడు. ఆ మాటలకు వారి మనసులు సంతసం చెందాయి.

అప్పుడు కాదంబరి కపింజలుడిని – "మహాత్మా! నువ్వూ పత్రలేఖా ఒక్కసారే సరస్సులో పడ్డారు కదా. ఆమె ఏమైంది?" అని అడిగింది.

"దేవీ! నీటిలో పడ్డాక ఏం జరిగిందో నాకు తెలియదు. నేనిప్పుడు త్రికాలవేది అయిన శ్వేతకేతుని వద్దకు పోయి చంద్రాపీడుని ఆత్మ ఎక్కడుందో, పుండరీకుడి అవతారమైన వైశంపాయను డే మయ్యాడో, పత్రలేఖ ఎక్కడికి పోయిందో అడిగి తెలుసుకుని వస్తాను" అంటూనే ఆకాశమార్గంలో వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిపోయాక కాదంబరి మహాశ్వేతని చూస్తూ - "ప్రియసఖీ! మనిద్దరికీ సమానశోకం కలగజేసిన భగవంతుడు నన్నిప్పుడు నిలబెట్టాడు. నువ్వు నాకు నెచ్చెలివయ్యావు. నేనిప్పుడు మరణించినా దుఃఖం వల్లకాదు. నువ్విప్పుడు నాకు ఉపదేశింపదగి ఉన్నావు. నేనిప్పుడేం చెయ్యాలి? నువ్వు ఆలోచించి కర్తవ్యం ఉపదేశించు-" అంది.

"ఈ విషయంలో చెప్పడానికీ వినడానికీ ఏముంది? కపింజలుడు పుండరీకుని వృత్తాంతం గురించి స్పష్టంగా చెప్పాడు కదా? నువ్వు మాత్రం ఏం చేస్తావు? చంద్రాపీడుని శరీరమును నీతొడయందు ఉంచుకుని, విడవకుండా, వినాశనమవకుండా అర్చిస్తూ ఉండు. కర్ర, రాళ్ళలో కల అదృశ్య దేవతలను సేవించడంకంటె ప్రత్యక్ష దైవమైన యీ చంద్రాపీడుని శరీరాన్ని పూజించడమే మేలు. అలా చెయ్యి. ఎప్పటికేనా ఏ దేవుడి కేనా అనుగ్రహం కలగకపోతుందా?" అంది మహాశ్వేత.

కాదంబరి లేచి - తరళికా, మదనలేఖల సాయంతో చంద్రాపీడుని శరీరాన్ని మెల్లగా ఎత్తి - ఎండ, వాన, చలి దోషాలుండని ఒక రాతి పలకమీద ఉంచింది. శృంగారవేషం వదలి, స్నానం చేసి, పరిశుద్ధమైన తెల్లని వస్త్రం ధరించి, మాటిమాటికీ కన్నీరు కారుస్తూ, మన్మధసేవకై మునుపు తెచ్చిన పూలు, గంధం, అంగరాగం మొదలయిన వాని చేతనే చంద్రాపీడు నర్చిస్తూ, నియమం పాటిస్తూ మూర్తీభవించిన శోకదేవతలా చింతిస్తూ, మరణం కంటె కష్టతరమైన అవస్థ అనుభవిస్తూ, ఆహారం తినకుండా, అతని పాదాలు తొడమీద పెట్టుకుని ఎలాగో ఆ పగలు గడిపింది.

మరునాడు ఉదయం – చంద్రాపీడుని శరీరం నూతన తేజంతో వెలుగుతూ ఉండడం చూసి ఆశ్చర్యపోతూ కాదంబరి మదనలేఖతో –"ఇతని మేనికాంతి ఎంతవింతగా ఉందో చూశావా? ప్రేమవల్ల నాకు అలా అనిపిస్తూందేమో. నువ్వు కూడా విమర్శగా చూడు" అంది.

"రాజపుత్రీ! ఇందులో పరీక్షించవలసిన దేముంది? చైతన్య మొక్కటే తక్కువ కాని మామూలుగానే ఉన్నాడు. దీనివల్ల కపింజలుడు చెప్పిన మాట యదార్థమని స్పష్టమౌతూంది. లేకపోతే మృతి చెందిన వాడు యిలా ఉండడం ఎక్కడేనా చూశామా? ఇది శాప దోషమే తప్ప మరేదీ కాదు" అని మదనలేఖ ఆమెను ఊరడించింది.

కాదంబరి ప్రతిరోజూ త్రికాలములందూ చంద్రాపీడుని శరీరాన్ని దేవతావిగ్రహాన్ని లాగ పూజిస్తూ శాపం తీరే కాలం కోసం ఎదురు చూడసాగింది.

కొన్ని రోజులకి చారులవల్ల ఆ వృత్తాంతమంతా తెలుసుకున్న తారాపీడుడు చాలా ఆరాటపడుతూ, మనోరమ శుకనాసులు వెంటరాగా, విలాసవతితో కలసి తగిన పరివారంతో ఆశ్రమానికి వచ్చి అక్కడ చంద్రాపీడుని అవస్థ చూసి చాలా విచారించి, శాపవృత్తాంతం తెలిసినవాడు కనక, ఎట్టకేలకు శుకనాసుడి చేత బోధించబడి వైరాగ్యం వహించాడు. రాజ్యభారం మంత్రుల మీదుంచి భార్యతో ఆ ప్రాంతమందున్న అడవిలో మునిలా కాలక్షేపం చేయసాగాడు."

అని చెప్పి ... జాబాలి ఫక్కున నవ్వాడు. హారీతుడు మొదలగు ప్రముఖులగు మునులతో, "మునులారా! ఆ కథ ఎంత వింతగా ఉందో విన్నారా? చెప్పవలసినది పక్కనుంచి చాలా దూరం చెప్పుకుపోయాను" అని – ఒకసారాగి మళ్ళీ చెప్పసాగాడు.

"ఆ పుండరీకుడు కామంతో నిండిన మనసుతో తాను చేసిన అవినయ దోషానికి, దివ్యలోకానికి చెడి, భూమిమీద శుకనాసుడి కొడుకు వైశంపాయనుడిగా జన్మించాడు. మళ్ళీ అతను మహాశ్వేతచే శపించబడి యిలా చిలకగా జన్మించాడు" అని చెప్పేసరికి నాకు నిద్రలోంచి

మేలుకున్నట్లు జాతిస్మరణకలిగి పూర్వజన్మలోని విద్యలన్నీ స్ఫురించాయి. చిలకరూపంలో ఉన్నా, మనుషులలా స్పష్టంగా మాట్లాడడం, వస్తుజ్ఞానం, విద్యలు ఉపదేశించే కౌశలం, లభించాయి. ఎక్కువ మాటలెందుకు? శరీరం ఒక్కటి తప్ప తక్కిన చర్యలన్నీ మనుషులలాగే చేయగల సామర్థ్యం కలిగింది. అలాటి జ్ఞానం కలిగి, నా వృత్తాంతం వినడం వలన కలిగిన సిగ్గుచేత కొంచెం సేపూరుకుని...తలవంచుకుని జాబాలితో ఇలా అన్నాను.

"దేవా! నీ అనుగ్రహం వల్ల నా పూర్వ వృత్తాంతమంతా స్ఫురణకి వచ్చింది. అప్తులను స్మరించుకున్నాను. నా మరణం గురించి విన్నంతనే హృదయం పగిలి చైతన్యం వదలిన చంద్రాపీడుడు తరవాత జన్మలో ఏ శరీరం దాల్చాడు? దయచేసి చెప్పండి. అతన్ని కలుసుకోగలిగితే ఎక్కడైనా నాకు సంతోషమే."

అపుడా మహర్షి కళ్ళెర్రజేసి నన్ను చూస్తూ - "దురాత్మా! ఇంకా నీ చిత్త చాంచల్యం వదలడం లేదే! దాని మూలంగానే కదా యిలాటి అవస్థ అనుభవిస్తున్నావు. నీకింకా రెక్కలయినా పూర్తిగారాలేదే. తొందరపడతావేం? ఎగరడానికి సామర్థ్యం వచ్చినప్పుడు అడుగు. చెబుతాను" అన్నాడు.

అప్పుడు హారీతకుడు - "తాతా! ఇతను మునిజాతిలో జన్మించినా జీవితాన్నే వదిలేంతగా మదన వేదన ఎందుకు పొందాడు? దివ్యలోక సంభూతిడికి అల్పాయువు కలగడం ఏమిటి? ఆశ్చర్యంగా ఉంది. చెప్పవూ?" అని అడిగాడు.

"వత్సా! ఇతను కామరాగ మోహ మయమూ, అల్పసారమూ అయిన స్త్రీ వీర్యంవలన పుట్టడం వల్ల అలా అయ్యాడు. అల్పసారమైన స్త్రీ వీర్యం వలన పుట్టినది - గర్భంలోనే చనిపోతుంది. చచ్చి అయినా పుడుతుంది. లేదా జీవించి పుట్టినా దీర్ఘకాలం బతకదని ఆయుర్వేదంలో స్పష్టంగా చెప్పబడి ఉండగా దీనికంత ఆశ్చర్యమెందుకు? ఆ దోషంవల్లనే యితను కామపీడితుడై మదనజ్వరం వల్ల వేగంగా చనిపోయాడు. శాపం తీరగానే దీర్ఘాయుష్మంతు డౌతాడు" అన్నాడు జాబాలి.

అప్పుడు నేను "మహాత్మా! నేను పాపాత్ముడినై యిలా జన్మించాను. నీ అనుగ్రహం వల్ల నాకు మాట మాత్రం వచ్చింది. పూర్వజ్ఞానం కలిగింది. ఏ సుకృతం వల్ల నాకీ రూపం పోతుంది? ఆయువెలా వర్ధిల్లుతుంది? నేనేం చేయాలి? దయతో చెప్పు" అని ప్రార్ధించాను.

జాబాలి దిక్కులు చూసి – "అయ్యో! ఈ కధ మూలంగా తెల్లరిపోయింది. అనుష్ఠానవేళ దాటిపోయింది" అంటూ గోష్ఠి చాలించి లేవడంతో, ముని లందరూ ఆ కథని ఆస్వాదించడంలో, చేయదగిన కృత్యాలు మరచి, ఆశ్చర్యపోతూ, తమ తమ నివాసాలకు వెళ్ళిపోయారు. హరీతకుడు నన్ను మెల్లగా చేతి మీది కెక్కించుకుని పర్ణశాలలోని ఒక గట్టుమీ దుంచి తానుస్నానం చేయడానికి వెళ్ళాడు.

అప్పుడు నేను మనసులో 'అయ్యో! ఎంతో పుణ్యం చేసుకుంటేనే కాని మానవ జన్మలభించదు అందులోనూ సకలజాతులలోనూ విశిష్టమైన బ్రాహ్మణ్యం మరీదుర్లభం. వారిలోనూ మునిత్వం అతి విశిష్టమైంది. దివ్యలోక నివాసం అంతకంటే గొప్పది. అలాటి ఉన్నత పదం నుంచి స్వదోషమూలంగా పక్షి జాతిలో పుట్టాను. అయ్యో! ఎంత మోసం వచ్చింది! ఛీ! ఇక నాకీ జీవితంతో పనేముంది? ఎలాగేనా సరే యీ శరీరం వదిలాలి' అని నిశ్చయించుకున్నాను.

అంతలో హరీతకుడు వచ్చి – "అన్నా! వైశంపాయనా! నీ పుణ్యం మంచిది. నీ తండ్రి వద్దనుంచి కపింజలుడు నిన్ను వెదుక్కుంటూ యిప్పు డిక్కడికి వచ్చాడు" అని చెప్పడంతో...నేను అత్యంత సంతోషంతో రెక్కలు వచ్చిన దానిలా ఎగరబోయి – ఎక్కడున్నాడని అడిగాను.

"మా తండ్రి వద్ద ఉండి మాట్లాడుతున్నాడు" అన్నా డతను. "ఆర్యా! అతన్ని చూడాలని నా హృదయం చాలా తపించి పోతూంది. నన్ను వేగంగా వాని వద్దకు తీసుకెళ్ళు" అని నేను ప్రార్థిస్తూండగానే కపింజలుడు గగన మార్గాన మునుపటి రూపంతో నా దగ్గరకి వచ్చాడు.

అతన్ని చూసి నేను కన్నీరు కారుస్తూ – ఎదురు వెళ్ళడానికి ప్రయత్నించాను. కాని రెక్కలురాని కారణం వల్ల నా శరీరం కదలలేదు.

అప్పుడు - "మిత్రమా! కపింజలా! నీరాకచూసి ఎదురువచ్చి చేతులు జాచి గాఢంగా కౌగలించుకుని చేయిపట్టుకుని పీఠంమీద కూర్చో బెట్టడానికీ, నీకు మార్గాయాసం తీర్చడానికీ నాకు యోగ్యత లేకపోయింది కదా!" అని విచారిస్తున్న నన్ను కపింజలుడు రెండు చేతులతోనూ ఎత్తి పట్టుకుని, వక్షంమీద ఉంచుకుని, పెద్ద కంఠంతో దుఃఖించాడు.

అతనిని ఊరడిస్తూ "కపింజలా! ఎన్నోక్లేశాలు చుట్టుముట్టిన నాకు శోకం కలుగుతుంది కాని, నువ్వు విలపించడ మేమిటి? సామాన్యుడిలా విచారింపక, కూర్చుని చెప్పు మా తండ్రి కుశలంగా ఉన్నాడా? నన్నెప్పుడేనా తలచుకుంటాడా? ఈ వృత్తాంతం విని ఏమన్నాడు? కోపగించాడా?" అని అడిగిన నన్ను తన తొడమీద ఉంచుకుని - హరీతకు డిచ్చిన ఉదకంతో మొహం కడుక్కుని -

"మిత్రుడా! మీ తండ్రి కుశలంగానే ఉన్నాడు. మన వృత్తాంతమంతా దివ్యదృష్టితో చూసి ప్రతిక్రియ కోసం ప్రయత్నిస్తున్నాడు. అంతలో నేను తురగత్వమును విడచి ఆయన వద్దకుపోయాను. దూరం నుంచే నన్ను చూసి కన్నీరు పెట్టుకుని, భయపడుతున్న నన్ను చేరదీసి ఆదరిస్తూ -

"వత్సా! కపింజలా! విచారింపకు. ఈ తప్పు నాదికాని, మీదికాదు. పుండరీకుడు పుట్టినప్పుడే వానికిట్టి దోషముందని తెలిసినా పొరపాటున ఆయుష్కరమగు కర్మ నిర్వహించాను కాదు. ఇప్పుడు అన్నీ చేశాను. కొద్ది దినాలలో ఈ కష్టాలన్నీ తొలగి పోతాయి. అంతవరకూ నువ్వు నా దగ్గర ఉండు" అని ఆజ్ఞాపించాడు. అప్పుడు

"తాతా! నీకు నా మీద దయ ఉంటే నా మిత్రుడు ఎక్కడున్నాడో అక్కడికి పోవడానికి అనుమతి యివ్వు. వాడిని చూడాలని నాకు చాలా ఆత్రంగా ఉంది" అని అడిగాడు.

"వాడిప్పుడు చిలకగా పుట్టి ఉన్నాడు. నువ్వు వెళ్ళినా వాడిని తెలుసుకోలేవు. వాడూ నిన్నూ తెలుసుకోలేడు. కొన్నాళ్ళు పోనీ" అన్నాడు. నేనక్కడే ఉండిపోయాను. ఇవాళ ఉదయం నన్ను పిలిచి, "వత్సా!

కపింజలా! నీ మిత్రు డిప్పుడు మహానుభావుడైన జాబాలి ఆశ్రమంలో ఉన్నాడు. వారి అనుగ్రహంవల్ల వాడి కిప్పుడు పూర్వ జన్మ స్మృతి కలిగింది. కనక నువ్విప్పుడు వాడిని చూడడానికి వెళ్ళు. కర్మ పరిపక్వమయ్యేదాకా ఆ మహాత్ముడి ఆశ్రమం వదలొద్దని నా మాటగా చెప్పు- అని ఉపదేశించాడు. నీ తల్లి నీ దుఃఖం విని పరితపిస్తూ నీ విముక్తి కోసం ఆ మునికి పరిచర్య చేస్తూంది. ఆమెకూడా నీకు ఇదే చెప్పమంది."

అంటూ ఎంతో విచారించాడు. అప్పుడు నే నతన్ని చూస్తూ - "మిత్రమా! ఎందుకు విచారిస్తావ్? నేను మందభాగ్యుణ్ని. నా మూలంగా నువ్వు గుర్రమై పుట్టి అనేక కష్టాలు అనుభవించావు. ఇనపకళ్ళెం తగులుతూ నోటినుంచి రక్తం కారుతూంటే ఆ బాధ ఎలా భరించావో! సుకుమారుడి వైన నువ్వు శరీరం వాల్చక ఎప్పుడూ నిలబడే ఎలా ఉన్నావో?" అంటూ అతనితో-పూర్వ జన్మ వృత్తాంతం మాట్లాడుతూ కొన్ని క్షణాల పాటు నా దుఃఖం మరచిపోయి ఆనందించాను.

అంతలో మధ్యాహ్న సమయమయింది. హారీతకుడు, కపింజలుడు నాకు ఆహారం అందించి తాము కూడా భోజనం కానిచ్చారు. "మిత్రమా! మీ తండ్రి నన్ను నీకీ వార్త చెప్పి వెంటనే అక్కడికి రమ్మని ఆజ్ఞాపించాడు. నేనిక వెళ్తాను. కర్మపరిపాకం అయ్యేవరకూ నువ్వీ మహర్షి పాదాలను వదలకూడదు సుమీ" అన్నాడు కపింజలుడు. నేను విచారం నిండిన హృదయంతో - "కపింజలా! ఇలాటి అవస్థలో ఉన్న నేను తల్లి తండ్రుల కేమని సందేశం పంపుతాను? అంతా నీకే తెలుసు" అన్నాను.

నన్నక్కడినుంచి కదలనివ్వవద్దని హారీతకుడికి పదేపదే చెప్పి అప్పగించి, నన్ను మళ్ళీ మళ్ళీ మరోమారు కౌగలించుకుని, మునికుమారు లందరూ ఆశ్చర్యంతో చూస్తూంటే ఆకాశంలో కెగిరి కపింజలుడు అంతర్ధానమైపోయాడు. అతను మాయమయ్యేక హారీతకుడు నన్ను ఊరడిస్తూ, స్వయంగా నాకాహారం పెడుతూ నాకేలోటూ లేకుండా చూసుకోసాగాడు.

కొన్ని రోజులకి నాకు రెక్కలు వచ్చాయి. కొంచెం ఎగరడానికి సామర్థ్యం రాగానే - "నా మిత్రుడు చంద్రాపీడుణ్ని, మహాశ్వేతనీ

చూడాలని మనసు తహతహలాడిపోతూంది. నేనక్కడికి పోయి నివసించాలి' అనిపించింది. ఒకనాడు పొద్దున్నే విహారానికి బయలు దేరినట్లు బయలుదేరి ఉత్తర దిక్కుగా ఎగిరిపోయాను.

కొద్దిరోజులకిందటే ఎగరడం నేర్చుకున్నాను. అందుచేత కొంచెందూరం ఎగిరే సరికే నాకు అలసట వచ్చింది. దాహంతో నాలుక ఎండిపోయింది. ఎగశ్వాస వొస్తూ, రెక్కలాడించడానికి వీలులేక పోతోంది. కళ్ళు తిరగసాగాయి. ఎక్కడ పడిపోతానో అని భయపడుతూనే ఎలాగో దగ్గరలో ఉన్న సరస్సు వొడ్డున కల నేరేడు చెట్టు మీదకుఅతి కష్టంగా చేరుకున్నాను.

కొంతసేపటికి గమనాయాసం కొంచెం తగ్గింది. మెల్లగా చెట్టు దిగాను. దాని చల్లని నీడలో సేదతీరాను. దగ్గరనున్న చెరువులోని నీరు తృప్తిగా తాగాను. ఫలాలు తిని ఆకలి తీర్చుకున్నాను. చెట్టు మొదలునే కూర్చుని నాకు తెలియకుండానే నిద్రలోకి జారిపోయాను. మేలుకుని చూసేసరికి దారాలతో బంధించబడి ఉన్నాను. నా ఎదురుగా మాసిన బట్టలలో, క్రూరమైన రూపంతో, ఎర్రని కన్నులతో ఒక మనిషి ఉన్నాడు.

వాడిని చూడగానే నాకు జీవితం మీద నిరాశ కలిగింది. అయినా కొంచెం ధైర్యం తెచ్చుకుని - "నువ్వెవరివి? నన్నెందు కిలా బంధించావ్? మాంసం కోసమైతే నిద్రలోనే నన్ను చంపి ఉండవలసింది. నిరపరాధి నయిన నాతో నీకేం పని? సరదాగా పట్టుకున్నా నంటావా? తీరిపోయిందికదా? ఇక వదిలెయ్. మిత్రులని చూడడానికి నేను చాలా దూరం పోవాలి. ఆలస్యాన్ని నా హృదయం భరింప లేదు. నీకు తెలియని ధర్మాలుంటాయా? అని ప్రార్థించాను.

అప్పుడతను - "మహాత్మా! నేను జాతిచే ఛండాలుణ్ని. క్రూరకర్ముడిని. విలాసానికో, మాంసానికో నిన్ను కట్టలేదు. ఇక్కడికి దగ్గరలో మాలపల్లెలో నా అధికారి ఉన్నాడు. అతని కూతురు చిన్నవయసులో ఉంది. ఆమెకు - జాబాలి అనే మహర్షి ఆశ్రమంలో మాటలు నేర్చిన చిలక ఉందని ఎవరో చెప్పారు. అది విని ఆమె చాలా

వేడుకపడుతూ నిన్ను పట్టుకుని తీసుకురాడానికి చాలా రోజుల కిందటే ఎందరినో నియమించింది. నా పుణ్యం కొద్దీ నువ్వు నాకు దొరికావు. నిన్నామె దగ్గరకి తీసుకు పోతాను. నీ బంధాలు విడిపించడాని కామే సమర్ధురాలు" అన్నాడు.

ఆ మాటలు నానెత్తిమీద పిడుగుల్లాగే పడ్డాయి. 'అయ్యో. నాకర్మ విపాకం కదు దారుణమైంది. మహాలక్ష్మికి పుట్టి, శ్వేతకేతు మహామునిచేత పెంచబడి, దివ్యలోక అశ్రమాలలో నివసించే నేను - ప్రవేశింప దగని మాలపల్లెకి వెళ్ళాలా! ఛండాలురితో కలసి ఉండాలా! వారు పెట్టే ఆహారం తినాలా! వారికి ఆటవస్తువునవాలా! అయ్యో! దురాత్మా! నీ జన్మ కదు నింద్యమైనది కదా. మొదటే నువ్వు పుట్టకపోతే యీ కష్టాలు లేకపోవును కదా.

తల్లీ. లోకమాతా! నన్నీ నరకంలో పడకుండా కాపాడలేవా? తండ్రీ! నన్నీ ఆపదనుంచి బయట పడేయ్ కపింజలా. వేగంగా వచ్చి నన్ను రక్షింపక పోతే వొచ్చే జన్మలో కూడా నన్ను కలుసుకోలేవు సుమా.' అంటూ విలపిస్తూ - మళ్ళీ అతన్ని యిలా ప్రార్ధించాను.

"చంద్రముఖా! నాకు జాతి స్మృతి ఉంది. నే నొక మునికుమారుణ్ని. ఈ సంకటం నుంచి నన్ను రక్షిస్తే నీకూ పుణ్య మొస్తుంది నన్ను పట్టుకున్నట్లు ఎవరూ చూడలేదు. కనక వదిలేసినా నీకు ప్రమాద మేమీరాదు. కనుక కరుణించి నన్ను వదులు" అని పాదాలమీదపడ్డాను.

వాడు ఫక్కున నవ్వాడు. "ఓరీ! మోహాంధుడా! శుభాశుభ కర్మలకు సాక్షులగు పంచభూతాలూ నీ శరీరంలోనే లేవా? అవి చూడవా? అకార్యానికి నేనంగీకరింపను. స్వామి అజ్ఞచే నిన్ను పట్టుకున్నాను. వదులుటకు వీలులేదు." అంటూ నన్ను పట్టుకుని పట్నం వేపు పోసాగాడు నేను మౌనంగా ఉండి పోయి, విచారిస్తూ ప్రాణాలు వదలడానికి నిశ్చయించుకున్నాను.

ఆ మాలపల్లె నరకంకంటే కూడా జుగుప్సాకరంగా ఉంది. కుక్కలు, పందులు, బురద గుంటలు, దెబ్బలాడుకుంటున్న కోళ్ళు,

దుర్వాసనలు అక్కడ తాండవం చేస్తున్నాయి. ఆ ఛండాల కన్యక నన్ను దూరంనుంచే చూసి జాలిపడి వదిలెయ్యమంటుందా? అహ. వట్టిది. అవి ఆ జాతికి తగని పని. సరే...కానియ్..నా కర్మ యిలా ఉంది. నేను నిముషమైనా యిక్కడ ఉండలేను – అనుకుంటూండగానే, వాడు నన్నామె వద్దకు తీసుకుపోయి "తల్లీ! ఇదుగో నువ్వు చెప్పిన చిలకని తెచ్చాను, చూడు" అంటూ నన్ను చూపాడు.

ఆమె చాలా సంతోషించి "మంచిపనిచేశావు." అంటూ వాడిని మెచ్చుకుని, నన్ను రెండు చేతులతోనూ తీసుకుని – "పుత్రా! ఇన్నాళ్ళకి దొరికావు. ఇం కెక్కడికి పోగలవు? నీ కామచార దోషమంతా పోగొడతాను, చూడు" అంది.

అప్పుడొక ఛండాల బాలకుడు పరుగెత్తుకెళ్ళి ఆవుచర్మంతో కప్పబడి కంపుకొడుతున్న కర్ర పంజరం ఒకటితెచ్చి ఆమె ముందుంచాడు. ఆమె నన్ను అందులోకి తీసి ... దీనిలో ఉండు. కదలకు" అంటూ పంజరం తలుపు బిగించింది.

అప్పుడు నేను 'ఎంత ఆపదలో చిక్కుకున్నాను! ఈమెకు నమస్కరించి నా అవస్థంతా చెప్పుకుని – వదలమని బతిమాలుకునేదా? సరిసరి..నేను మాట్లాడతాననేకదా యిలా పట్టించి తెచ్చింది? నా బంధనం ఆమె కేమి బాధ? నే నేమైనా ఆమెకు బంధువునా? – మౌనంగా ఉండడమే మంచిది. కాని..దీనివలన మరింత నష్టం జరుగుతుందేమో. ఏదేమైనా ఈ ఛండాలురితో మాట్లాడడం అనుచితం. మాట్లాడని మూగచిలక నా కెందుకని ఆమె విసుగెత్తయినా వదిలెయ్యవచ్చు. మాట్లాడితే మాత్రం వదలదు" అని నిశ్చయించుకున్నాను.

ఆమె పలికినా, బెదిరించినా, కొట్టినా, పొడిచినా ఏమీ మాట్లాడకుండా ఛీత్కారం చేసి ఊరు కోసాగాను. తిండి, నీరు అందించినా ముట్టకుండా ఉపవాసం ఉన్నాను. మర్నాడు ఆమె స్వయంగా ఫలాలు, జలాలు తెచ్చినా నేను ముట్టలేదు.

అప్పుడామె – "ఆకలి, దాహంచే పీడించ బడుతున్నప్పుడు పక్షులూ పశువులూ ఎలాటి ఆహారమైనా తింటాయి. నువ్వు పక్షి జాతికి

చెందినదానివి. నీకు వివక్షదేనికీ? జాతి స్మృతి కలిగి నేనిచ్చిన భోజనం ముట్టడం లేదా? అలా ఐతే నీకా నియమం అక్కర్లేదు. అత్యుత్తమమైన తాపస జాతిలో పుట్టినా పక్షిజాతిలో జన్మించవలసిన పాపకర్మ చేశావు కదా? ఇప్పుడు విచారించి ఏం లాభం? మొదటే యీ వివేచన ఉంటే యీ ముప్పు రాకనే పోయేది. జాతికి తగిన అహారం తినడం దోషం కాబోదు. గొప్పవారు కూడా ఆపత్కాలంలో భక్షింపదగని వాటిని తిని ప్రాణాలు నిలుపు కుంటారు. నీ మాట చెప్పడ మెందుకు? ఛండాలపు అంశ కలిగిన వేమీ నీకు తీసుకురాలేదు. ఈ పళ్ళు తినొచ్చు. ఊరికే ఎందుకు ఆకలి, దాహంతో బాధపడతావు? ముని జనులకు కూడా ఉచితమైన యీ పళ్ళనెందుకు తినవు? ఈ నీరెందుకు తాగవు?" అంది.

ఛండాల జాతికి తగని ఆమె మాటలకు చాలా ఆశ్చర్యపోతూ, జుగుప్సని వదిలి, ఆకలీ దాహం తీర్చుకోడానికి వాటి నంగీకరించాను కానీ మౌనం మాత్రం వదల్లేదు. అలా కొంతకాలం జరిగింది.

ఒకనాడు నేను నిద్రలేచి చూసేసరికి ఆ కర్రపంజరంలో కాక యీ బంగారు పంజరంలో ఉన్నాను. ఆ కన్య దివ్యరూపంతో ప్రకాశించింది. దేవర చూసే ఉన్నారు కదా? ఆ మాలపల్లి దేవ నగరమై భాసిస్తూంటే చూసి, నేను విచారం వదలి, ఆశ్యర్యపడుతూ – "ఇదేమిటి?" అని మౌనం విడచి ఆమె నడుగుదామనుకుంటూంటే యీమె ఇక్కడికి తీసుకువచ్చింది.

మహారాజా! ఈమె ఎవరో...ఎందు కిలా ఛండాల రూపంలో ఉందో...నన్నెదుకు పట్టించిందో....ఇక్కడి కెందుకు తీసుకు వచ్చిందో నాకేమీ తెలియడం లేదు. మీలాగే నేను కూడా ఆ కథ వినడానికి కుతూహలంగా ఉన్నాను" అంది చిలక.

ఆ కథంతా విన్న మహారాజు – ఆ వృత్తాంతం వినాలని చాలా ఆత్రత పడుతూ, వాకిట్లో ఉన్న మాతంగ కన్యని తీసుకు రమ్మని ప్రతీహారి నాజ్ఞాపించాడు. అది పోయి ఆమెను తీసుకువచ్చింది. ఆమె భూమికి తగలకుండానే నిలబడి, రాజుకంటె ఎక్కువ తేజస్సుతో వెలుగుతూ – ఆ రాజును పరాభవిస్తూన్నట్లే అతిస్ఫుటంగా –

"రాజా! రోహిణీ నాథా! తారా రమణా! ఆనంద చంద్రా! ఈ దుష్టుడు తనదీ మీదీ వృత్తాంతం మీకు వినిపించాడు కదా? జాబాలి ఆశ్రమం విడవ వద్దని తండ్రిచే ఆజ్ఞాపించబడినా, దాని నుల్లంఘించి కామరాగంలో అంధుడై మహాశ్వేత వద్దకు పయనమయిన సంగతి మీకు తెలిసిందే.

నే నీ దురాత్ముడి కన్న తల్లిని. ఇతను వధువు కోసం వెళ్తూండడం దివ్యదృష్టితో గమనించిన శ్వేతకేతుడు నన్ను పిలచి – "నీ పుత్రుడింకా అధోగతి పొందుతున్నట్లు తోస్తూంది. పశ్చాత్తాపంతో కాని వాడి మనసు ఉపశాంతి పొందదు. నువ్వు వెళ్ళి వాడికి కర్మ పరిపక్వ మయ్యేదాకా ఒక చోట కట్టిపెట్టి బాధ కలిగేలా చెయ్యి." అన్నాడు. వేగంగా వెళ్ళమన్నాడు. అప్పుడు నేనే యీ కల్పనంతా చేశాను. నువ్వే ఆ చంద్రాపీడుడివి, ఈ చిలకే ఆ వైశంపాయనుడు. వీళ్ళిద్దరూ శాపాలు తీరడంతో సమంగా సుఖపడగలరని వీనిని నీ వద్దకు తీసుకువచ్చాను. ఇప్పుడు వీళ్ళుపుట్టుక, వృద్ధాప్యం, మరణం మొదలైన దుఃఖాలతో కూడిన శరీరాలను వదలి సుఖపడగలరు – అంటూ ఆ మాతంగ కన్య అందెలు ఘల్లుమని శబ్దంచేసేలా పాదాలతో నేలను తట్టి, అంతరిక్షాని కెగిరి అదృశ్యమైపోయింది.

ఆ రాజుకి ఆమె మాటలతో జాతి స్మరణ కలిగి – కాదంబరిని తలుచుకుంటూ, క్రమంగా కాదంబరీ వియోగాన్ని తలుచుకుంటూ కృశించి, మన్మథ బాధతో చివరకి మరణించాడు. ఆ చిలకకి కూడా శాపం ముగియడంతో అతనితో పాటు మరణించింది.

అక్కడ – కాదంబరి వసంతకాలంలో కామోత్సవం చేసి – వాడుక ప్రకారం చంద్రాపీడుని శరీరాన్ని అర్చించి కంఠం కౌగలించు కుంది. శరీరంలోకి ప్రాణం చేరిన చంద్రాపీడుడు మెల్లగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు పొందాడు. కళ్ళు విడివడ్డాయి. ముఖం పద్మంలా వికసించింది. నిద్రలేచినట్లు లేచి, కాదంబరిని చూసి ఆమె మెడ కౌగలించుకుని, మౌణుకుతూ, కళ్ళు మూసుకుని, తొట్రుపడుతున్న ఆమెకు మనోహరమైన స్వరంతో ఆనందం కలగజేస్తూ – "కాదంబరీ! భయపడకు.

నీ స్పర్శతో నేను జీవించాను. నువ్వు అమృతకులమైన అప్సరజాతిలో జన్మించిన దానివి కదా. శాపదోషంవల్ల మనకిన్నాళ్ళూ వియోగం కలిగింది. ఇప్పుడు నే నా విరహ దుఃఖ ప్రమాదమైన శూద్రకరాజు శరీరాన్ని వదిలాను. ఇక నీకు సుఖం కలుగుతుంది. నీ ప్రియసఖి మహాశ్వేత ప్రియుడు సైతం నాతో శాపవిముక్తి చెందాడు. ఆమెకూడా సుఖపడుతుంది" అంటూండగానే -

నాక లోకం నుంచి కపింజలుడి భుజం మీద చేయి వేసి....మహాశ్వేత మొదట అతన్ని చూసిన రూపంలో.....పుండరీకు డక్కడికి వచ్చాడు. దూరంనుంచే అతన్ని చూసిన కాదంబరి చంద్రాపీడుని గుండెలమీంచి లేచి అతివేగంగా వెళ్ళి మహాశ్వేతను కౌగలించుకుని వారిరాక గురించి చెప్పింది. అంతలో - పుండరీకుడు చంద్రాదాపీడుని వద్దకు వచ్చి గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు.

చంద్రాపీడుడు ... "మిత్రమా! పూర్వజన్మ సంబంధంలో నువ్వు నాకు అల్లుడి వయ్యావు. ఎలాగైనా మనం తరవాత జన్మలోని సంబంధమే సాగించాలి. కనుక మనది మైత్రే" అంటూంటే -

కేయూరకుడా వార్తను చిత్రరథుడికీ హంసుడికీ తెలియ జెయ్యడానికి హేమకూటం వెళ్ళాడు. మదనలేఖ వేగంగా పోయి తాపసిగా మృత్యుంజయ జపం చేస్తున్న తారాపీడుని పాదాల మీదపడి, చంద్రాపీడుడు జీవించిన విషయం చెప్పింది

ఆ మాట విని తారాపీడుడు విలాసవతితో కలసి చాలా ఆనందంగా, ఆత్రంగా లేచి, శుకనాసుడు తోడురాగా మదనలేఖ వెంటవున్న కొడుకుని చూసి ఆనందబాష్పాలు కళ్ళల్లో నిండగా, అంతులేని ఆనందంతో కొడుకుని కౌగలించుకున్నాడు. తల్లి అతన్ని చూసి వివశురై పోయింది.

అప్పుడు - చంద్రాపీడుడు తల్లి తండ్రులకి నమస్కరిస్తూ - శుకనాసుడికి కూడా నమస్కరించి, అతని ఆశీర్వాదం అందుకుని - ఆర్యా! వీడే వైశంపాయనుడు చూడు." అని పుండరీకుణ్ని చూపించాడు.

అప్పుడే కపింజలుడు రాగా శుకనాశునికిలా చెప్పాడు. "ఆర్యా! శ్వేతకేతుడు మీ కిలా చెప్పమన్నాడు. ఈ పుండరీకుడు నాచేత

పెంచబడ్డాడన్న మాటేకాని, నీకే కొడుకు. వీడికి నీమీదే ప్రేమ. కనుక వీనిని వైశంపాయనుడిగానే భావించి అవినయ కార్యములను చెయ్యనివ్వకు. వీడు నీవాడే. పరుడని తలచకు. అందుకే శాపాంతంలో నీ దగ్గరకి పంపాను. అదీకాక నా సాత్విక తేజం యిప్పుడింత కంటె ఉత్తమలోకానికి పోతూంది.

అది విని శుకనాసుడు, వినయంగా ఉన్న పుండరీకుడి వస్త్రం పట్టుకుని – కపింజలుడితో "కపింజలా! సర్వజ్ఞుడైన శ్వేత కేతు డిలాటి వార్త పంపడ మెందుకు? స్నేహంలో యిలాటి మాటలు సంతోషం కలిగిస్తాయా? అందరికీ ఆ మహానుభావుడి ఆశ్రయమే కావాలి" అన్నాడు. అలాగ పూర్వ జన్మలను తలుచుకుంటూ వాళ్ళు ఆ రోజు గడిపారు.

మర్నాడు. గంధర్వకులనాయకులగు చిత్రరథ, హంసులు భార్యలతో కలసి, సపరివార సమేతంగా అక్కడికి వచ్చి అల్లుళ్ళనీ, కూతుళ్ళనీ చూసి ఎంతో సంతోషిస్తూ తారాపీడ శుకనాసులతో మాట్లాడుతూ కొంతకాలక్షేపం చేశారు. అప్పుడు చిత్రరథుడు తారాపీడుని చూసి – "ఆర్యా! ఎంతో వైభవం కల భవనా లుండగా ఈ అరణ్యంలో ఉండడ మెందుకు? హేమకూటానికి పోదాం, రండి" అని ఆహ్వానించగా

గంధర్వరాజా! ఎక్కడ అత్యధిక సుఖం కలుగుతుందో అదే భవనం. ఇంత సుఖం నే నెక్కడా పొందలేదు. అదీకాక నాకు అన్ని సుఖాలూ యీ అల్లుడి యందే సంక్రమించాయి. నా కిక అరణ్యమే శరణ్యం. వధువుతో కూడా అతనినే తీసుకెళ్ళు." అని తారాపీడుడనగా – చిత్రరథుడు అంగీకరించి, తారాపీడుని అనుమతి పొంది చంద్రాపీడుడు మొదలయిన వారితో హేమకూటానికి వెళ్ళిపోయాడు. అక్కడ – శుభముహూర్తంలో చిత్రరథుడు కాదంబరిని చంద్రాపీడుడి కిచ్చి ఘనంగా వివాహం జరిపించాడు.

హంసుడు కూడా అలాగే మహాశ్వేతను పుండరీకుడి కిచ్చి పెళ్ళి చేశాడు. చంద్రాపీడుడు, పుండరీకుడు ఆ స్త్రీలనూ, గంధర్వ రాజ్యాలనూ స్వీకరించి – భార్యలతో సుఖిస్తూ తమ నాశ్రయించుకున్న మన్మథుడికి తృప్తి కలిగించారు.

ఒకనాడు కాదంబరి చంద్రాపీడునితో మాట్లాడుతూ – "మన మందరమూ మరణించి మళ్ళీ బతికి ఒకరి నొకరం కలుసుకున్నాం. కాని – పత్రలేఖ సరస్సులో పడి తిరిగి రాలేదు. ఆమె వృత్తాంత మేమిటి?" అని అడిగింది.

అందుకతను – "ప్రేయసీ! నా భార్యఅయిన రోహిణే పత్రలేఖ. నేను పుండరీకుడిచే శపించబడి భూమిమీద జన్మించడం చూసి నన్ను వదలలేక నా సేవకై నాకంటె ముందుగానే భూమిమీద పుట్టింది. మునుపు నాకూ తెలియదు. కాని యిప్పుడు శాపం తొలగి పోయింది కనుక అంతా స్ఫురిస్తోంది" అని చెప్పాడు.

చంద్రాపీడుడు పుండరీకునితో కూడి కొన్ని దినాలు ఉజ్జయినిలోనూ, కొన్ని రోజులు హేమకూటంలోనూ, కొన్నాళ్ళు చంద్రలోకంలోనూ, కొన్నాళ్ళు లక్ష్మీసరస్సులోనూ నివసిస్తూ దివ్యభోగా లనుభవించ సాగాడు.

"గోపా! నువ్వు చూసిన చిత్రఫలకంలోని ఆకృతులు వీరివే. కాషాయ వస్త్రం కట్టుకుని గుహా ప్రాంతంలో నిలబడినది – మహాశ్వేత. చంద్రాపీడుని విగ్రహా న్నర్చిస్తున్నది కాదంబరి. అది మదనలేఖ. అది తరళిక" అంటూ వివరించి చెప్పాడు మణిసిద్ధుడు. గోపకుమారు డా కథకు చాలా సంతోషించి – అయ్యవారికి అనేక నమస్కారాలు చేస్తూ ఆ కథను మళ్ళీ మళ్ళీ తలుచుకోసాడు.

కాదంబరికథ ఎవరికేనా పరవశం కలిగిస్తుంది. బాణకవిచేత కొంతభాగమూ, అతని కొడుకుచేత మిగిలిన భాగమూ రచించబడింది. ఇది నా అనువాదం. కథా సంగ్రహం తప్పకుండా అనువదించి – నీ కర్పిస్తున్నాను – అంటూ కవిగారూ ఈశ్వరుడి అంకితం చేశారు.

*(5వ భాగం సమాప్తం)*

# కాశీమజిలీ కథలు

## 53. వ మజిలీ

## 6. వ భాగం

ఆ మజిలీలో గోపాలుడికే విశేషాలూ కనపడలేదు. అందుచేత తాము బస చేసిన మఠం గోడల మీది రాతలను చదవడం మొదలు పెట్టాడు. ఒకచోట 'పెళ్ళాడనని భీష్మించుకు కూర్చున్న ముగ్ధ ముగ్గురు మగళ్ళని కోరుకుంది. స్త్రీల మాటలు నీటిమీద రాతలు. గాలిలో దీపాలు' అని అర్థం వచ్చే పద్యం కనిపించింది. ఆ కథేమిటో చెప్పమని అయ్యవారినడిగాడు. మణిసిద్ధుడు ఆ కథ ఇలా, చెప్పసాగాడు.

## స్వయం ప్రభ కథ

గిరిదుర్గ మనే పట్నాన్ని ఇంద్రమిత్రుడనే రాజు పాలిస్తున్నాడు. అతని భార్య మనోహారిణి. వారికి సంతానం కలగక దానాలూ ధర్మాలూ యాగాలూ ఎన్నో చేశారు. అప్పటికీ పిల్లలు కలగక పోడంతో – రాజు విసిగిపోయి – పుణ్యకార్యాలు చేసేవారిని శిక్షిస్తానన్నాడు. అలాగ శాసనం కూడా చేయించాడు.

కొంతకాల మయ్యాక ఒకనాడు పరిచారిక రాణితో – "దేవీ! మనపట్నానికి దగ్గరలో రత్నకూటమనే పర్వతం ఉంది దానిమీద దేవతలు విహరిస్తారని వాడుక ఉంది. అందుకు నిదర్శనంగా ఆ కొండ దిగువన స్వయంప్రభాదేవి ఆలయం ఉందట. అక్కడ ఒకరాత్రి దంపతులు ఉండి జాగారం చేస్తే ఆ దేవి వారికోరిక తీరుస్తుందట. నేనా అర్చకులను రప్పించాను. ప్రవేశ పెట్టమంటారా?" అని అడిగింది.

"పుష్కరిణీ! నీకీ వెర్రి యింకా పోలేదా! నాకీ జన్మకి సంతానం కలగదు. నియమాలంటే రాజుగారికెంత కోపం వస్తుందో నీకు తెలియదా? సంతతి కలుగుతుందంటే మనం చెప్పినవన్నీ చేసి అలసి పోయారు మరి. అర్చకుల కేదోయిచ్చి పంపెయ్యి."

"దేవీ! నువ్వన్నది నిజమే. కాని ఎప్పు డేం జరుగుతుందో ఎవరు చెప్పగలరు? అర్చకులేం చెబుతారో విందాం. పోయే దేముంది?" అని – రాణి ఏమీ అనక పోడంతో పరిచారిక వారిని రప్పించింది.

ఆ అర్చకులు వికృతరూపులు. వారి భాష ఆటవిక భాష. రాణి పరిచారికనే వారితో మాట్లాడమంది. ఆమె మాట్లాడి – "దేవీ! మీదంపతు లొకరాత్రి ఆ గుడిలో జాగరం చేస్తే మీ కోరిక తప్పక తీరగలదట." అంది.

రాణి తన భర్తనెంతో బతిమాలి అందు కంగీకరింప జేసింది. ఆ దేవి శక్తి ఎటువంటిదో కాని, వారు నియమం పాటించిన నెలకే రాణి గర్భం దాల్చింది. రాజు ఆ దేవతకు చక్కని గుడి కట్టించి – పుత్రోదయం కోసం ఎదురు చూడసాగాడు. కాని అతనికి పుత్రిక జన్మించింది. స్వయంప్రభ అనే పేరు పెట్టి చక్కగా పెంచుతూ, హేమ అనే బాలికను సఖురాలిగా చేసి, గురువులను నియోగించి శాస్త్రాలు మొదలయిన వాటిలో ప్రవేశం కల్పించారు.

ఒకనాడు హేమ – "అక్కా! నువ్వెప్పుడూ స్వయంప్రభాదేవి చరిత్రే చదువుతూంటావని గురువులు కోపగిస్తున్నారు. చదవవలసినవి ఎన్నో ఉన్నాయి కదా?" అంది.

స్వయంప్రభ : కావ్యనాటక, అలంకార గ్రంధాలు చదివాం. శాస్త్రాలను చదివాం. పురాణాలు విన్నాం. ఎన్ని చదివితే ఏమిటి, వైరాగ్య ప్రవృత్తి కలగాలి కదా?

హేమ : ఎన్నేళ్ళు చదివినా... వాటి కంతెక్కడ? ఆ రస మాధుర్యం అమృతమే

స్వయంప్రభ : ఆయువు చంచలం. యౌవనం అల్పం. బ్రహ్మచింతన చేయండి అని చదువుకున్నాం.

హేమ : నీకీ వైరాగ్య మేమిటి? అది ముసిలి వాళ్ళకి కావలసింది. నీకు కాదు.

స్వయం ప్రభ : నీతో నిజం చెప్పేస్తున్నాను. ఆ స్వయంప్రభాదేవిలా దివ్యాశ్రమం ఒకటి ఏర్పచుకుని, యోగినీ వేషంతో తపస్సు చేసుకోవాలని నా అభిలాష.

అంతలో ఒక పరిచారిక వచ్చి – "అయ్యగారు, అమ్మగారు క్రీడాసౌధంలో ఉన్నారు. మిమ్మల్ని వేగంగా తీసుకు రమ్మన్నారు" అని కబురు తెచ్చింది. యువరాణి హేమతో కలసి ఫెళ్ళింది. వారు స్వయం ప్రభని ప్రేమగా పలకరించి "ఎలా చదువుకుంటున్నారు?" అని అడిగారు. తరవాత – "నీ సఖురాలి కే రాజకుమారు డనుకూలుడో చూడు – " అంటూ హేమముందు నూరుగురు రాజకుమారుల చిత్రపటాలు నిలబెట్టించారు. వారి చిత్రాలూ, చరిత్రలూ బాగా పరిశీలించి ఎవరూ ఆమెకు తగరని నిస్సందేహంగా చెప్పింది. అప్పుడు రాజు మరికొన్ని పటాలు తెప్పించి – "వీరందరూ రాజవంశంవారే కాని రాజ్యాధికారం లేని వారు" అన్నాడు. హేమ వాటిలో ఒకదానికి గుర్తు పెట్టింది.

రాజు ఆక్షేపిస్తూ – "అతను భూరిశ్రవు డనే రాజుకి నాలుగో కొడుకు. ఎప్పటికీ రాజ్యాధికారం రాదు. సంపద లేని వాడికి నా కూతురు నివ్వను. అది సామాన్యురాలిలా కష్టాలు పడలేదు. సంపద లేనివాడు రూపవంతుడయినా, పండితుడైనా రాణించడు" అన్నాడు.

ఆ మాటలు జరుగుతూంటే స్వయంప్రభ కళ్ళు మూసుకుని ఏదో ఆలోచిస్తూంది. ఆమె అభిప్రాయం అడిగినా చెప్పకపోడంతో – రాజు తన భార్యను తెలుసుకోమని చెప్పి వెళ్ళిపోయాడు. తల్లి స్వయంప్రభను బతిమాలినా, లాలించినా బెదిరించినా ఏం చేసినా ఆమె నోరు విప్పలేదు. అప్పుడు హేమ – రాణితో ఏదో చెప్పబోతే స్వయంప్రభ కళ్ళెర్రజేసి – "నాకేం పెళ్ళి?" అంటూ చివాలున లేచి వెళ్ళిపోయింది.

అప్పుడు హేమ రాణితో – "అమ్మా! స్వయం ప్రభ పెళ్ళంటేనే యిష్టపడడంలేదు. స్వయంప్రభా దేవిలా ఒక ఆశ్రమం కట్టించుకుని

యోగిని వేషంలో తపస్సు చేసుకోవాలని అభిలాషట. ఆ మాట ఎన్నోసార్లు నాకు చెప్పింది" అంది. ఆమె తరవాత చూద్దాంలే అనేసింది,

హేమ ఆ చిత్రపటాలలోని ఒక సుందరుని గురించి విశేషంగా చెప్పగా, స్వయం ప్రభ – "నాకు భోగములలో యిచ్ఛలేదు. కావాలంటే నువ్వు పెళ్ళి చేసుకో" అంది. అందుకు హేమ – "నీ వేదాంతం చక్కని వాడు ఎదురుపడేవరకే. ఏ పురాణంలోనూ ఏ స్త్రీ కూడా పెళ్ళాడనని నియమం పట్టలేదు. నీ యిష్టదైవం స్వయంప్రభ మాత్రం – తనకి తగినవాడు దొరకలేదని కాని పరతత్త్వజ్ఞానంతో బ్రహ్మచారిణిగా ఉండిపోయిందా? వివాహం చేసుకున్న దమయంతి, చంద్రమతి, సీతాదేవులకు వచ్చిన ప్రభావం మహర్షులకి వచ్చిందా? నీకెందు కీ వెర్రి-నియమం? నామాట విని, నేను చెప్పిన రాజకుమారుణ్ని పెళ్ళాడి పతివ్రతగా ఉత్తమ కీర్తి సంపాదించు. వైరాగ్యాని కిది సమయం కాదు" అని బోధించబోయింది. అప్పుడు స్వయంప్రభ

**ఉ. ఆయువు వీచిచంచలము యౌవన మల్పదినోచితంచుప**
**ష్పాయుధ కేళిజన్యసుఖ మస్థిర మర్థము వాంఛవోలె సా**
**పాయము భోగము ల్నెఱుపు లట్లభవాబ్ధి లంఘనో**
**పాయము బ్రహ్మచింతనము బాయక సేయుదు సజనోత్తముల్.**

– "రోగాలూ ముసలితనం శరీరాన్ని లొంగదీసేసుకోక ముందే, మరణం రాక ముందే, ముక్తికి ప్రయత్నం చేసుకోవాలి" అనే అర్థం వచ్చే పద్యం ఒకటి చదివి, "ఆ నీతి పద్యం మరచి పోయావా?" అని ఆక్షేపించింది. హేమ అప్పటి కాప్రసంగం ఆపేసింది.

అంతవరకూ చెప్పి – "గోపాలా! వేళదాటి పోకుండా తరవాతి మజిలీకి బయలుదేరాలి" అన్నాడు మణిసిద్ధుడు. గోపాలు దతనితో బయలుదేరాడు

తరువాత మజిలీలో మణిసిద్ధుడు స్వయంప్రభకథ చెప్పనారంభించాడు.

# కాశీమజిలీ కథలు

## 54. వ మజిలీ

### వీణావతి కథ

"తరతరాలనుంచీ నువ్వు మా యింటి దైవంలా పూజించ బడుతున్నావు. నీ వల్లనే మా వంశం వారంతా సంగీతవిశారదులని పేరు పొందారు. అయ్యో! నేటితో నీరుణం తీరిపోయిందా!" అంటూ విరిగిన ఒక వీణను ముందుపెట్టుకుని వీణావతి అనే ఆమె గిరిదుర్గపట్నంలో ఒక యింట్లో కన్నీరు కారుస్తూ విలపిస్తూంది.

అంతలో ఆమె తల్లి వచ్చి – ఎంత విచారించినా ప్రయోజన మేమిటి? ఊరుకో. రాజుగారు నిన్ను ఓదార్చడానికి వస్తున్నారు" అంది. లీలావతి మాటలు పూర్తికాకుండానే రాజువచ్చి..."వీణా వతివినువ్వేనా! నీ వీణనేనా మ్రా స్వయంప్రభ విరగ కొట్టిందట? అసలేం జరిగింది?" అంటూ అడిగాడు.

"దేవా! మీ అనుజ్ఞతో హేమ అనే ఆమె నన్ను ఉద్యాన వనసౌధంలోకి తీసుకెళ్ళింది. రాకుమార్తె స్వయంప్రభకి నా గురించి చెప్పి – "దీని సంగీతం విని మనం ఆనందించాలని నాన్నగారు పంపారు'– అంది. ఆమె కొంచెం ఆలోచించి అలాగే అంది. ఇప్పుడే వస్తాం అంటూ హేమ రాకుమారిని తీసుకు వెళ్ళి – అంతలోనే వచ్చింది. రాకుమారి నన్ను చూసి "నీకు పెళ్ళయిందా?" అని అడిగింది.

"దేవీ! నేను పెళ్ళాడలేదు. మా కులంలో చాలామంది పెళ్ళాడరు" అన్నాను. అప్పు డామె హేమ వేపు తిరిగి – "స్త్రీలలో పెళ్ళాడని వారే ఉండ రన్నావు! పెళ్ళి చేసుకోకపోతే కులంలో వెలివేస్తా రన్నావు?"

అని ఆక్షేపించి, నావేపు చూసి – "ఈ హేమ నన్ను పెళ్ళాడమని తెగ బలవంతం చేస్తూంది. నీ కద చెప్పిదానికి బుద్ధి తెప్పించు. నీకు మంచి పారితోషికం యిస్తాను" అంది.

హేమ ఫక్కున నవ్వింది. నావేపు చూసి పాడమని సంజ్ఞ చేసింది. నేను శృంగార మనోహరాలయిన శ్లోకాలు చదివి కృతు లాలపించ బోతూంటే – "భక్తి రసమైన కీర్తనలు కాక బూతు పాటలు పాడతావా! ఆడదానివే... పెళ్ళికాని దానివే. నిన్నేం చేస్తే తప్పుంది?" అంటూ నా వీణను కాలితో ఒక తొక్కు తొక్కింది ప్రభాదేవి. వెంటనే చరచరా అక్కడ నుంచి వెళ్ళిపోయింది.

నా వీణకుదండం విరిగిపోయింది. దానితో నా మనసు వికలమై పోయింది. నాతో రహస్యంగా హేమ శృంగారగీతాలు పాడమందనే నేనవి పాడాను. అది నాతప్పా?" అని దుఃఖించింది వీణావతి.

రాజు జరిగిన దానికి చాలా విచారిస్తూ..."విలపించకు. వీణలకేం, పదివేల వీణలు సంపాదించు కోవచ్చు. నా కూతురి మనసు మారలేదు. ఎంత చెప్పినా వైరాగ్యం వదలదు. అందుకే నిన్నక్కడికి పంపడం జరిగింది. నీ వీణకు తగిన మూల్యంయిప్పిస్తానులే" అని గుర్రమెక్కి యింటికి వెళ్ళిపోయాడు.

వీణావతి – "రాజు గారు మనవీణలాటిది అంగడిలో దొరుకుతుం దనుకుంటున్నారు. దీని గొప్పతనం వారికేం తెలుసు? జరిగింది చాలు. మరొక వూరికి పోదాం" అంది తల్లితో. అంతలోనే ఒక పరిచారక వచ్చి వీణావతిని స్వయంప్రభాదేవి తీసుకు రమ్మన్నా రంది. "నీకు మంచి పారితోషికం యిస్తారు. వీణ విరగకొట్టినందుకు పశ్చాత్తాప పడుతూందటగా.. వెళ్ళు" అని తొందరపెట్టి లీలావతి ఆమెను పరిచారికతో ఉద్యానవన సౌధానికి పంపింది.

ఆమె వెళ్ళేసరికి స్వయంప్రభ హేమతో మాట్లాడుతూంది. హేమ వీణావతి నాహ్వానించి "తాత్కాలిక కోపంలో నీ వీణ

విరగగొట్టినందుకు మా దేవి చాలా విచారిస్తూంది. నువ్వు ప్రాణంలా చూసుకొనే వీణ అని తెలిసి మరీబాధ పడుతూంది. నువ్వెన్నో సభలకు వెళ్తూంటావు. మా రాజకుమార్తె యిలాటిదని ఎక్కడా అనకు సుమీ! ఆమె సుగుణాలు నీకు పూర్తిగా తెలియక పోవడం వల్ల యింత చెప్పవలసి వస్తూంది. పోయిన నీ వీణను తిరిగి తీసుకురాలేం..." అంటూంటే –

స్వయంప్రభ – "ఇకచాలులే" అంటూ తన మెడలోని రత్నహారం ఒకటి తీసి హేమకిచ్చింది.

"వీణావతీ! దీని విలువ యింత అని చెప్పలేం. నీ జీవితంలో యిలాటి పారితోషికం పొందలేవు. మా పెద్దలకు తెలియకుండా యీ వూరు వదలిపొండి" అంటూ హేమ ఆ హారాన్ని ఆమె మెడలో వేసింది.

వీణావతి యింటికి వచ్చి ఆహారాన్ని తల్లికి చూపింది. ఆ రాత్రే వాళ్ళిద్దరూ ఊరువిడిచి మరోదేశం వెళ్ళిపోయారు. వీణావతి ప్రసిద్ధి చెందిన గాయనీమణి కావడం వల్ల ఎన్నో రాజధానులలో పాడుతూ కానుక లందుకుంటున్నా తనకి సరిపడిన వీణ దొరకలేదనే చింతమాత్రం ఆమెను వదలటంలేదు.

ఆమె ఒకసారి కాళీగుప్తం అనే పట్నం చేరి తల్లితో సహా ఒక సత్రంలో బసచేసింది. అక్కడి చిత్రశాలలో ఒకచోట వీణవాయిస్తున్న నిండు యౌవన పురుషుణ్ని చిత్రంలో చూసి – "అమ్మా! ఈ బొమ్మలోని వీణ అచ్చు నా వీణలాగే ఉంది. ఇంత సుందరు డయిన పురుషుడు నిజంగా ఉంటాడా!" అంది. రాజభటుడి నొకనిని ఆ చిత్రఫలకం గురించి భోగట్టా అడగగా – "మా రాజు గారి నాలుగో కుమారుడు సహదేవుని చిత్రపటం యిది. ఎవరు రాశారో మాత్రం నాకు తెలియదు" అన్నాడు.

వీణావతి తనతల్లి లీలావతిని సహదేవుని వద్దకు పంపింది. ఆమె అతనికి వీణావతికి లభించిన బిరుదు పత్రాలు చూపించి, ఒక సంగీత సభ ఏర్పాటు చేయవలసిందిగా ప్రార్థించింది. అతనా రాత్రే సభ ఏర్పాటు చేస్తానన్నాడు. లీలావతి యింటికొచ్చి ఆ రాకుమారుడు

చిత్రంలో కంటె వెయ్యిరెట్లు అందంగా ఉన్నాడు. అతను మంచి వైణికుడే కాక వీణలను చేయగల డటకూడా. నీకు వీణలేదని చింత అక్కర్లేదు. తన వీణమీద పాడినవారికి ఘనంగా పారితోషికం యిస్తానని అతను ఇదివరకే ప్రకటించాడట" అంటూ వివరించింది.

రాత్రి....సభకు వెళ్ళిన వీణావతి - తన ముందుంచబడిన వీణని చూసి - తన వీణని చూసే దీనిని తయారుచేశారా!- అని మనసుల్లోనే అనుకుంది. ముందుగా తన విరిగిన వీణకు నమస్కరించి... తరవాత ఆ వీణమీద అద్భుతంగా గానం చేసింది. ఆ గంధర్వ గానాన్ని రాజకుమారుడు ఎంతగానో ప్రశంసించాడు.

"మీవంటి వారు నా గానాన్ని కొనియాడడంతో నేను ధన్యురాలి నయ్యాను. ఇటువంటి వీణను నే నెక్కడా చూడలేదు. ఎంతటి ప్రజ్ఞావంతుల కయినా తగిన సాదనా లుండాలి కదా? ఏడు తరాలనుంచీ ఉంటున్న మా యింటి వీణ యీ మధ్యే భగ్నమైంది" అందామె. అప్పటికే అతనిదృష్టి పూలగుత్తిలా మెరుస్తూ సభాభవనాన్ని చిత్రరగా ప్రకాశింప జేస్తున్న - ఆమె మెడలోని రత్నహారం మీద కేంద్రీకృతమైంది అత నామెను ఆవిరిగిన వీణ వృత్తాంతమూ, ఆమె వృత్తాంతమూ సవివరంగా అడిగాడు

"మా కాపరం ఉజ్జయినీ నగరం. విక్రమార్కుని కాలంలో హేమావతి అనే వేశ్యారత్నం ఆ మహారాజుకి అత్యంత యిష్టురాలట. అతడే ఆ వీణను దేవలోకం నుంచి తెచ్చి ఆమెగాన విద్యను మెచ్చుకుని బహుమతిగాయిచ్చాడట. ఆమె మా అమ్మమ్మకి అమ్మమ్మ. ఈ వీణమీదే పాడుతూ ఆమె ఎంతో ప్రఖ్యాతి పొందింది తరవాత తరాలవారికీ వైణికులుగా మంచి ప్రఖ్యాతి వచ్చింది. వీణావతి అనే బిరుదు నా గానంవల్ల వచ్చిందే.

ఆ మధ్య గిరిదుర్గమనే పట్నం వెళ్ళాను. ఆ రాజు ఇంద్రమిత్రుడు. అతని కూతురు స్వయంప్రభసౌందర్యం వర్ణనాతీతం" అంటూ ఆమె అందాన్ని ఎంతగానో పొగిడింది.

"ఆమెకు పెళ్ళయిందా?" అని అడిగాడు రాజకుమారుడు.

"ఆమె చాలా చిన్నతనంలోనే ఎందుకో విరక్తి చెంది ఎప్పటికీ పెళ్ళాడనని నియమం పట్టింది. శృంగారాన్ని ఏవగించుకుంటుంది. ఆమె మనసు మరలించమని, శృంగార గీతాలు పాడమని నన్నామె వద్దకు పంపారు రాజుగారు.

అప్పుడే ఆమె నా వీణను కోపంతో ముక్కలు చేసింది. తర్వాత అందుకు పశ్చాత్తాపపడి ఆమె యీ మణిహారాన్ని నాకు కానుకగా యిచ్చింది" అని వీణావతి చెబుతూండగానే అతను స్వయంప్రభమీద మోహం పెంచేసుకున్నాడు.

"ఏదీ నీ వీణ నిటివ్వు" అని తీసుకుని, బాగాపరిశీలించి – "దీనిని మునపటిలాగే పలికిస్తాను. ఏం పారితోషికమిస్తావ్?" అని అడిగాడు.

"దీనివలన నాకు దొరికిన బహుమానం మీకు సమర్పించుకుని జీవితాంతమూ మీకు దాసురాలినై మీ పాదసేవ చేసుకుంటాను" అంది వీణావతి.

మర్నాడు ఆమె వెళ్ళేసరికి అతనా వీణను సిద్ధంచేసి ఎన్నెన్నో రాగాలు పలికిస్తున్నాడు. రంగులు మెరుస్తున్న ఆ వీణను చూసి వీణావతి ఆనందం పట్టలేక దాన్ని కౌగలించుకుని, తీగెలు సవరించి, ఎంతో సంతృప్తి చెంది – తన మెడలోని మణిహారం తీసి అతని కిస్తూ – "వీణ పాడినప్పుడల్లా మొదట మీ పేరే తలుచుకుంటాను" అంది.

"ఊరికే అలా అన్నాను కాని క్షత్రియులు పరుల వద్ద కానుకలు తీసుకుంటారా? ఆ రాజపుత్రిక నీకిచ్చిన కానుకను నాకిస్తే అది తప్పవుతుంది" అన్నా డతను.

"ఆర్యా! మీరిది తీసుకోకపోతే యిద్దరినీ అసత్యదోషం అంటుతుంది" అని ఆమె బలవంతం చేయసాగింది.

అప్పు డొకామె మధ్యవర్తిగా – "క్షత్రియుడు వేశ్యనుంచి కానుక తీసుకోరాదు. వేశ్య కూడా తనకు తగని ఔదార్యం ప్రదర్శించ కూడదు. ఈ హారాన్ని కొనడానికి తగినంత ధనం అతని వద్ద లేదు. అందుచేత – అతను తనదగ్గరున్న ధనమంతా యిచ్చేస్తాడు. నువ్వు రత్నహారం యివ్వు. అది ఉభయులకూ మంచిది" అంది. సహదేవుడు తండ్రి యిచ్చిన పదివేల నిష్కములనూ ఆమె కిచ్చి ఆ రత్నహారాన్ని తీసుకున్నాడు.

వీణావతి నుంచి జరిగింది విని – లీలావతి – "దుష్టురాలా! ఆ .ముష్టి వీణకోసం ఎంతో అమూల్యమైన రత్నహరాన్నిచ్చేస్తావా! అమూల్యమైన రత్నహారాన్ని చేజార్చుకున్నావా? నువ్వతని వద్దకు పోయి – మా అమ్మ ఒప్పుకోడం లేదని చెప్పి ఆ హారాన్ని తిరిగి తెచ్చెయ్. లేకపోతే నిన్ను చంపి నేనూ చస్తాను" అంది గొల్లున అరుస్తూ.

వీణావతి నవ్వుతూ – "నే నాలోచించకుండానే అలా చేశా ననుకుంటున్నావా? కోట్లకొద్దీ విలువచేసే ఆ రత్నహారాన్ని రాజపుత్రిక పెద్దవారికి తెలియకుండా నాకు యిచ్చింది. ఆ విషయం మహారాజుకి తెలిస్తే మనలని పట్టుకుంటారు. ఈ పాటికే భటులని పంపారేమో. ఆసంగతి ఆలోచించు. హారం తెచ్చెయ్యమంటె తెచ్చేస్తాను." అంది. "ఈమాటా నిజమే." అని మారుపలకకుండా ఊరుకుంది వేశ్యమాత.

# కాశీమజిలీ కథలు

## 55. వ మజిలీ

"లోకు లెంత అన్యాయంగా మాట్లాడ గలరు! ఏ పాపమూ ఎరుగని మా అన్నమీద ఎంత నిందవేశారు!" అనుకుంటూ సావిత్రి సహదేవుడి నివాసానికి వెళ్ళింది. అక్కడ పడుకున్న అతన్ని చూసి "ఏమిటి అకారణంగా పడుకున్నావు? తండ్రిగా రన్నమాట నీవరకూ వచ్చిందా?" అని అడిగింది.

అతను చివాలున లేచి "తండ్రిగారు న్నన్నే మన్నారు? చెప్పు" అని ఆత్రంగా అడిగాడు.

"మొన్న నువ్వు రత్నహారం తీసుకుని పదివేల నిష్కములా వేశ్య కిచ్చావు కదా. నిన్ను వేశ్యాలోలుడని జనం నిందించడం తండ్రిగారికి తెలిసి నన్ను పిలిచి – 'చక్కని కన్యకను తెచ్చి పెళ్ళి చేస్తామంటే వొద్దని యిలాంటి తుచ్ఛపు పని చెయ్యొచ్చునా! నువ్వు వాడిని చాలా మెచ్చుకుంటావని నీకు చెబుతున్నాను' అన్నారు. 'వీణావతి కంత ధనమివ్వడానికి కారణం వేరు' అని నే నదంతా చెప్పాను. మనతల్లి – 'పెళ్ళి చేయకుండా యిన్నా ళ్ళుంచడం తప్పుమనదే' అంది.

"ప్రయత్నాలు చేసి చేసి విసిగి కదా విరమించాను" అన్నాడు తండ్రి.

"అతనికి అనుకూలవతి అయిన కన్య దొరికితే నేనతన్ని పెళ్ళికి ఒప్పిస్తానుఅని మాటిచ్చివచ్చాను. అన్నా! ఊరికే నిందలు పడకపోతే... హాయిగా పెళ్ళి చేసుకోరాదూ?" అంది.

"సహోదరీ! నాకు చేసిన ఉపకారానికి సంతోషిస్తున్నాను. నా పెళ్ళికి నువ్వు పెద్దవయ్యావు. అది చెల్లించుకో. వీణావతి చెప్పిన

స్వయంప్రభ వృత్తాంతం విన్నావు కదా? నేను కోరుకునే గుణా లీమెలో ఉన్నాయి. ఆమెను నాకిచ్చి పెళ్ళి చెయ్యి. నీకంటె ఆంతరంగికులు నా కెవరు?" అని సహదేవుడు తన అభీష్టా న్నామెకు తెలియ పరచాడు.

సావిత్రి నవ్వుతూ – "అన్నా! నీ సంకల్పం ఆనాడే గ్రహించాను. స్వయంప్రభే నీ కనుకూలవతి. ముందుగా నువ్వక్కడికి వెళ్ళి ఆమె చేష్టలన్నీ తెలుసుకో. ఆమె ఎంత వైరాగ్యవతి అయినా ఆమె నిన్ను వరించేటట్లు నేను చేస్తాను. నా బుద్ధి బలం ఏపాటిదో చూద్దువుగాని –" అంది.

స్త్రీలోలురను చూసి పరిహసించే నాకే యీ లాలస కలిగింది. విరహం పెరిగి పోతూంది. ఎంత త్వరగా ఆమెను నా దరికి చేర్చుతావో. నిజంగా నువ్విది సాధించ గలవా?" అంటూ పిచ్చివాడిలా మాట్లాడా డతను. అతను చేయవలసినవి చెప్పి ఆమె అతన్ని ఓదార్చింది.

# కాశీమజిలీ కథలు

## 56. వ మజిలీ

### స్వయంప్రభ విరక్తి కథ

"స్వయం ప్రభ చేసిన పని విన్నావా? వీణావతి అనే వేశ్య శృంగార గీతాలు పాడిందని ఆమె వీణ విరక్కొట్టిందట? దానికి పెళ్ళంటే యింత విముఖతయితే ఎలా?" అన్నాడు ఇంద్రమిత్రుడు తన భార్యతో.

"మీరు విచారించకండి. చిన్నతనం వదల్లేదని యిన్నాళ్ళూ ఊరుకున్నాను. గట్టిగా చెబితే విన కేంచేస్తుంది?" అని భర్తకు చెప్పి మరునా డామె ఉద్యానవన సౌధానికి వెళ్ళింది రాణి. అక్కడ తన కూతురు హేమకు వైరాగ్యోపన్యాసం యిస్తూంటే చాటుగా వుండి వింది.

తరవాత – "అమ్మా! సంతానంకోసం నేనూ మీ తండ్రీ పడిన పాట్లు చెప్పనలవికాదు. చివరకు స్వయంప్రభాదేవి అనుగ్రహంవల్ల నువ్వు పుట్టావు. నీకు మంచి వరుణ్ని తేవాలని మేము ఉవ్విళ్ళూరుతుంటే, నువ్వేవెూ వీణావతి వీణ విరక్కొట్టావట. పెళ్ళిమాట ఎత్తితే తిడుతున్నావట? ఎవరు చెప్పారు నీకీ వైరాగ్యమార్గం?...." అని కళ్ళు తుడుచుకుంటూ అడిగింది.

హేమ ఎత్తి పొడవగా స్వయంప్రభ తన తల్లితో – "అమ్మా! విషయాసక్తులకు యీ ప్రపంచం ఎంతో రుచిగా కనపడుతుంది. కాని – నిజానికి అంతా అసహ్యామే. ఎముకలు, పేగులు, రక్తమాంసాలు, మలమూత్రాలే కదా మానవ శరీరం? పిల్లలకి తల్లి తండ్రులే శత్రువులు. పుట్టినప్పటి నుంచీ వాళ్ళకి జ్ఞానం ఉపదేశించక సంసార కూపంలో

తోస్తారు. అం తెందుకు? నీ సంగతే చూసుకో. ఎంతో సామ్రాజ్య సంపద ఉన్నా సంతతి కోసం కొన్నాళ్ళు చింతించావు. తరవాత నా గురించి క్లేశం. తల్లీ! నీకు పదివేల నమస్కారాలు. నాకు పెళ్ళీ, సంసారమూ ఏమీ వద్దు.

ఈ ఉద్యానవనాన్నే తపోవనం చేసుకుని స్వయంప్రభా దేవిలా తపస్సు చేసుకుంటాను. అనుగ్రహించు" అంది విరక్తిగా.

తల్లి ఎన్ని విధాలబోధించినా స్వయంప్రభ తన మాట వదలలేదు. అప్పుడు – " నీ మెడలోని రత్నహార మేదీ? విరక్తితో అదికూడా తీసిపారేశావా? నీ మీద ప్రేమతో – మీ తండ్రిగారికి తెలియకుండా ముద్రికా పేటికనుంచి తీసి నీ మెడలో వేశాను. నీకక్కర లేకపోతే యిచ్చెయ్. తీసుకుపోతాను" అందిరాణి.

హేమ మెల్లగా అడిగింది. "దేవీ! ఆహారం అంత విలువైనదనా ముద్రికాపేటికలో పెట్టారు?"

"కాదు. ఆహారాని కేదో మహత్మ్యం ఉందట. ఏదో చెప్పారు కాని ఇప్పుడు జ్ఞాపకం లేదు. ఎక్కడ పెట్టారో తొందరగా తెండి."

"మీ దగ్గర దాచడ మెందుకు? స్వయంప్రభ ఆమెవీణ విరిచినందుకు పారితోషికంగా వీణావతి కిచ్చింది – " అంటూ హేమ ఆ వృత్తాంత మంతా రాణికి వివరంగా చెప్పింది.

రాణి ఆందోళనగా తన నివాసానికి వెళ్ళేసరికి – "ఏం చేసుకొచ్చావు? అమ్మాయిని పెళ్ళికొప్పించావా?" అంటూ అడిగాడు రాజు.

"ఆ మాట అటుంచండి. ఒకనాడు మీకు చెప్పకుండా ముద్రికాపేటిక నుంచి రత్నహారాన్ని తీసి అమ్మాయి మెడలో వేశాను. దాని నది వీణావతికి పరిహారంగా యిచ్చేసిందట. ఆ హారానికేదో మహాత్మ్యం ఉందని మీరు చెప్పినట్లు గుర్తు .." అని ఆమె అంటూండగానే అతను హాహా కారం చేసి మూర్ఛపోయాడు.

ఆమె అతనికి పరిచారాలు చేసి సేద తీర్చగా – "అతి రహస్య వస్తువని తెలిసీ ఎందుకు పైకి తీశావు బుద్ధిలేనిదానా! అయ్యో! నా సామ్రాజ్యం పరాధీన మయ్యే యోగం తటస్థించింది. ఈ రత్నమాల ఎవరి అధీనంలో ఉంటుందో వారు ఆరుమాసాలలోగా యీ రాజ్యాని కధీశు లౌతారు. అందుకే దానిని ప్రాణంలా చూసుకున్నాను." అని చెప్పి రాజు సభకి పోయి, ఆ రహస్యం చెప్పకుండా వేరొక నెపం చెప్పి – "పెద్దవా రెరుగకుండా స్వయంప్రభను మభ్యపెట్టి వీణావతి రత్నహారా న్నెత్తుకు పోయిందని మంత్రులకు చెప్పి వాళ్ళని పట్టి తేవడానికి ఎందరో భటులను నాలుగు దిక్కులకీ పంపించాడు"

అని ఆగి – తరవాత కథను మణిసిద్ధుడు తరవాత మజిలీలో చెప్పాడు.

# కాశీమజిలీ కథలు

## 57. వ మజిలీ

"సఖీ! చాలా విలువ కలదనే అనుకున్నాం కాని జాగ్రత్తగా ఆలోచించలేకపోయాం. ఆ హారం ఎవరి దగ్గరుంటుందో వారే యీ దేశాన్ని పాలిస్తారట. మనం ఎంతో ప్రమాదకరమైన పనిచేశాం ఈ రాజ్యమిక ఆరుమాసాలయ్యాక భోగంది పాలిస్తుందని పుర ప్రజలు చెప్పుకుంటున్నారు. అంతఃపురంలో ఏకాంతంలో అనుకున్నమాట బయట కెలా పొక్కిందో తెలియదు. దీనికి ఏం చేయాలో తోచడం లేదు" అని చెప్పి హేమ చాలా విచారించసాగింది.

అందుకు స్వయంప్రభ – "కాలగతి నెవరు అతిక్రమించగలరు? పోయేదాన్ని మనం ఆపగలమా? పోనీ అదీ మంచిదే. వైరాగ్యంతో తపస్సు చేసుకోవచ్చు" అంటూంటే – ఒక పరిచారిక వచ్చి హేమను రాజపత్ని రమ్మంటూందని కబురు తెచ్చింది.

హేమ వెళ్ళి వచ్చి ఆ విశేషాలు స్వయంప్రభకు చెప్పసాగింది. "నీమీద మీ తల్లి తండ్రుల కెంత ప్రేమో! నీవల్ల అలాటి ఉపద్రవం జరిగిందని నువ్వెక్కడ బాధపడి పోతావో అని నిన్ను ఓదార్చమని నాకు చెప్పారు. రాజ్యం పోయే పని చేసినా నీమీద వారికి కోపం లేదు! అన్నట్లు..ఈ వూరికి దగ్గరలోకల రత్నగిరి పాదంలో వెలసిన స్వయంప్రభాదేవి ఆలయాని కెవరో యోగివచ్చి ఉన్నాడట. అతను అత్యద్భుత ప్రతిభ కలవాడట.

అయ్యగారు కొద్దిమంది పరిజనంతో రహస్యంగా ఆ యోగి దర్శనానికి వెళ్ళగా దర్శనమ్వికుండానే వీరు వచ్చిన పనంతా చెప్పి – "నీ రాజ్యాని కేమీ భంగముండదు. హారం వచ్చి నీ కూతురి మెడలో పడగలదు" అని చెప్పి ఓదార్చాడట. అది మీ తండ్రిగారు మీ అమ్మగారికి చెప్పారట. నీకూ చెప్పమన్నారు. ఆ తపస్వి చాలా సత్యవంతుడట."

యోగులు, తాపసులు, అవధూతలూ అంటే ఆసక్తి కల స్వయంప్రభ - "ఆ యోగి వరుడి చరిత్రను మనం తెలుసుకోవాలి. నువ్వు ఒంటరిగా వెళ్ళి అతని వివరాలు తెసుకునిరా." అని ఎంతగానో బతిమాలింది. హేమ నవ్వుతూ - "నీధైర్యమే ధైర్యం. రాజ్యం పోతుందంటే భయపడవు. యోగుల చరిత్రలు తెలుసుకోమంటావు. ఆయనతో మనకేంపని?" అంది.

"మహాత్ముల దర్శనం ఊరికేపోదు. వెళ్ళిరా" అని స్వయం ప్రభ ఆమెను ప్రాధేయపడి ఆ యోగి వద్దకు పంపింది. ఆమెతిరిగి వచ్చి యిలా చెప్పసాగింది.

## అద్వైత శివానంద యోగి కథ

"సఖీ! నువ్విచ్చిన పూలు పట్టుకుని ఉదయం ఆ కొండకి వెళ్ళాను. అమ్మవారి కళ్యాణమండపం మధ్య కూర్చుని ఆ యోగి జపం చేసుకుంటున్నాడు. ఆయన పక్క ఒక యోగిని కూర్చుని తావళం తిప్పుతూంది. ఆ మహాత్ముడి సౌందర్యం మాటలకంద నంత గొప్పది." "అతని ప్రభావం చెప్పక అందం వర్ణిస్తావేం?" అని స్వయంప్రభ కసురుకుంది." నేను మెల్లగా వెళ్ళి అతనికి సమీపంలో కూర్చున్నాను. ఆ యోగిని మధ్య మధ్య కళ్ళు తెరుస్తూ - "నువ్వెవరివి? ఎందుకు వచ్చావు?" అని అడిగింది. నే నామెకు నమస్కరించి జవాబు చెప్పేంతలో ఆ తాపసకుమారుడు కలవరేకులలాంటి తనకళ్ళు తెరిచి "నువ్వు స్వయంప్రభ సఖురాలవి కావూ? నీపేరు హేమకాదూ?" అన్నాడు. ఆయనకు నమస్కరించి "స్వామీ! మీకు తెలియని దేముంది? త్రికాల వేదులు." అన్నాను.

అప్పుడాయన శిష్యురాలు "స్వామీ! మీరు తపోవిఘ్నం సహించి యీ స్త్రీతో మాట్లాడడం చాలా వింతగా ఉంది-" అంది.

ఆ జడధారి "సహోదరీ! ఆ రాజపుత్రిక చిత్తశుద్ధి ఎంత గొప్పదనుకున్నావ్. ఆ వైరాగ్యమూ వేదాంత శ్రవణాసక్తీ, శాంతమూ

మహర్షులకయినా ఉండవు. అదంతా అంతర్దృష్టితో చూసే యింత మాట్లాడాను-" అని, నన్ను పొమ్మని అతను మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు

ఆ యోగిని నాచేయి పట్టుకుని దూరంగా తీసుకుపోయి, "నీ సఖురాలి పుణ్యం గొప్పది. ఇల్లు వాకిలి వదిలి తనతో తిరుగుతున్న నాతో కూడా యిలా మాట్లాడడియన. నా కామెతో స్నేహం చెయ్యాలని ఉంది సద్గోష్ఠి, సజ్జన సహవాసము ముక్తి కారణాలు కదా" అంది

అప్పుడు నేను నీ వృత్తాంతం చెప్పాను. "దేవీ! పరిచయం స్వల్పమైనా నీ ఔదార్యం ఎన్నదగినది. నువ్వూ నా సఖురాలిలాగే చిన్నదానివి. అతి చక్కని దానివి. ఈ తాపసకుమారుడు మన్మదుడిలా ఉన్నాడు. చక్రవర్తి లక్షణాలున్నాయి. ఇంత చిన్నతనంలోనే మునివృత్తి పూనడం చిత్రమే. మీ వృత్తాంతం వినే అర్హత నాకుంటే దయచేసి చెప్పు" అని ప్రార్థించాను.

"వేరే చెప్పడాని కేముంది? నాది మీ సఖురాలి కథలాటిదే. ఈ గురువు పేరు అద్వైత శివానందయోగి. గొప్పకులం వాడనడంలో సందేహం ఏమీ లేదు. ఇతనికి చిన్నప్పుడే శంకరుడు ప్రత్యక్షమై మంత్రోపదేశం చేశాడట. అందువలన విరక్తుడై లోకోపకారార్థం తిరుగుతున్నాడు. లోకులవలన యితను విరాగంతో తపస్సు చేస్తున్నాడని విని, నేనప్పటికే వైరాగ్యం అవలంబించదలచు కున్నాను కనుక, గురువు నన్వేషిస్తున్నాను కనుక, బంధువులని వదిలి యితని పాదాలమీద పడి ఆశ్రయం వేడాను. అతను అంతర్దృష్టితో నా బుద్ధిని కనుక్కుని నాసేవల కంగీకరించి మంత్రోపదేశం చేశాడు. ఆనాటినుంచి సోదరుడిగా, తండ్రిగా చూసుకుంటూ ఈయన వెంట లోకం తిరుగుతున్నాను. ఎందరో శిష్యురాళ్ళగా చేరతామని వచ్చినా ఎవరినీ అంగీకరించలేదు. ఇతని చెంత స్త్రీప్రసంగం కొంచెమయినా పనికిరాదు. నీకంటె కూడా నీ సఖురాలు యోగికి నచ్చినట్టుంది. ఇదే మా వృత్తాంతం" అందామె.

"దేవీ! అతని ఘనచరిత్ర తెలిసింది కదా" ఆ మాటలు విన్న స్వయంప్రభ చాలా ఆనందంతో "సఖీ! తపో మహిమ తెలిసిందా? ఎంతటి సార్వభౌముడైనా అతని కాలిగోటికి సరిపోతాడా? ఆ యోగిని ఎంత పుణ్యాత్మురాలో! ఆ మహానుభావుడి సేవ చేసి తరిస్తూంది. ఆమె

నాతో స్నేహం చేస్తానంది కదా. ఇక్కడికి రమ్మనలేదేం? అతను నా సేవల నంగీకరించే విషయం అడగలేదేం?" అని ఆక్షేపించింది.

అందుకు హేమ – "నేనంత తెలివితక్కువ దాననా? ఆమెను మనింటికి రమ్మనడం కంటె మనమే ఆమె వద్దకు వెళ్ళి దర్శనం చేసుకోడం ఉచితం. ఆ యోగి వరుడు నిన్నంతగా మెచ్చుకున్నాడు, నీ శుశ్రూష కెందు కంగీకరింపడు? నీ సుగుణాలన్నీ చూసినట్లే వర్ణించాడు.." అంది.

"మనం ఒకసారి ఆ మహాత్మున్ని దర్శించుకురావాలి. ఏదేనా ఉపాయం చెప్పు. దేవత, ముని దర్శనాలకు వాహనా లెక్కిపోరాదు. ఆ కొండ ఎంతదూరం? మనం వెళ్ళామని తెలిసి పెద్దలు మందలిస్తారా?" అని అడిగింది స్వయంప్రభ.

"పెద్దలకి చెప్పకుండా వెళ్ళకూడదు. ఆ కొండ కొంచెం దూరమే" అని హేమ చెప్పినా వినలేదు స్వయంప్రభ. మహాత్ముల దర్శనానికి వెళ్ళేటప్పుడు పెద్దల ఆజ్ఞ అక్కర్లేదంది. హేమని పొగిడి మర్నాడు తామిద్దరూ ఆ యెగి వద్దకు వెళ్ళడానికి ఒప్పించింది.

వాళ్ళు అక్కడికి వెళ్ళే సరికి యోగిని ఒక్కతే మంటపంలో జపం చేసుకుంటూంది. ఆమెను చూసి స్వయంప్రభ ఆశ్చర్యపోయింది. ఆ యోగిని రాకుమారి నాదరంగా చేతిమీద ముద్దుపెట్టుకుని – "రాచపుత్రికవైనా నీ వైరాగ్యం ఎవరికీ లేదు" అంటూ పొగడుతూవుంటే అతివినయంగా "ఈ మహాత్ముని పాదసేవ చేయుచున్న నీకంటె ధన్యులెవరు? నన్ను శిష్యురాలిగా చేసుకుని సంసార సాగరం నుంచి లేవనెత్తు" అంటూ స్వయంప్రభ ఆమె పాదాలమీద పడింది.

"నిన్నూ నన్నూ రక్షించేవాడు వేరే ఉన్నాడు. అతని పాదాలాశ్రయిద్దువుగాని. అతను స్త్రీల పొందు బొత్తిగా సహింపడు. అయినా నీ గుణాల వల్ల నీ సేవ నామోదిస్తాడు. వారితో సమయం చూసి మాట్లాడాలి. నీ అభిలాష ఏమిటి?" అని యోగిని ఆమె నడిగింది.

"స్వయంప్రభాదేవిలా ఒక ఆశ్రమం నిర్మించుకుని తపస్సు చేసుకోవాలనీ, తుచ్ఛభోగాలకి దూరంగా ఉండాలనీ నా కోరిక. కానీ, నా తల్లితండ్రులు నాకు పెళ్ళిచేసి నా వల్ల కలిగే సంతానాన్ని చూసి

సంతోషాన్ని పొందా లనుకుంటున్నారు. ఆడదానికి పెళ్ళాడనిచో పరంలేదని బోధింపజేస్తున్నారు అందుచేత నామనస్సు సందేహంలో కొట్టుకుంటూంది ఈ మహాత్ముడిద్వారా ఆ సందేహం తీర్చుకుని, పరమార్ధం ఉపదేశించుకుని శిష్యురాలిగా చేర్చుకోబడాలని కోరుకుంటున్నాను"

ఆ యోగిని నవ్వుతూ – "నువ్వడిగిన ప్రశ్న గురించేయిది వర కాయనకూ నాకూ సంవాదం జరిగింది. అదివింటే నీ సందేహం తీరుతుంది.

'ఎంత విరక్తి కలదయినా, జ్ఞాని అయినా, ప్రజ్ఞావతి అయినా స్త్రీ వివాహ మాడక తప్పదు అవివాహిత అయిన ఆడది లోకాంతంలో బాధపడుతుందని ధర్మశాస్త్రం' అంటూ సెలవిచ్చారు వారు. అందుకు నేను – "మహాత్మా! ఆడది భర్తని వరించిన పిమ్మట అతని ఆజ్ఞకి లోబడి ఉండాలి. అతను కామాసక్తి ప్రదర్శిస్తే ఆమె ఏం చేయగలదు. సంసారంలో పడ్డాక మమత్వం బాధింపక వదలదే. దీనిని బట్టి చూస్తే స్త్రీ ముక్తి చెందలేదనే కదా .." అన్నాను.

"మంచి ప్రశ్న వేశావు. దానికి వారు ఏం సమాధాన మిచ్చారు?" ఆత్రంగా అడిగింది స్వయంప్రభ.

అందుకాయోగిని "వారిలా అన్నారు...స్త్రీలు కామ విముఖులవడమే అరుదు. అలా అయితే, విరక్తుడైన వాడినే వరించి పతివ్రత అయి ముక్తి పొంద గలదు. విరక్తుడు వివాహం చేసుకుంటాడా? అంటావేమో. పరోపకారం కోసం పరిణయమాడడం మహర్షులకు వాడుకగానే ఉంది అగస్త్యుడు, మొదలయిన మునులు అందుకే వివాహ మాడారు. కామాసక్తితో కాదు – అంటూ చెప్పి నన్ను మరేమీ మాట్లాడకుండా చేశారు వారికంటె మన కెక్కువ తెలుసా? వారి మాటకు ఒప్పుకుని, అలాటి ఉత్తముడి కోసం వెదుకుతున్నాను నేను. నువ్వడిగితే నీకూ అదే జవాబు చెబుతారు, యువతి పతివ్రత అయి ముక్తి పొందుతుందని ఉండు. గురువుగారు లేచేవేళయింది, చూసివస్తాను" అని లేచి అటువెళ్ళిందామె. అప్పుడు స్వయంప్రభ హేమతో –

"ఈమెమాటలు విన్నావుకదా? ఈతపస్వి నన్ను కూడా పెళ్ళిచేసుకోమంటా దేమిటి? అయ్యో!.....ఆడదానిగా పుట్టడం ఎంతపాపమో!" అంది నిట్టూర్చుతూ.

"ఎందుకంత విచారిస్తావు? ఆయన నిన్ను పెండ్లాడమని నిర్బంధిస్తే - నాకు విరక్తు డెవరూ దొరకడు. నీవే నన్ను భార్యగా స్వీకరించు -' అని ప్రార్థించు. ఏమంటాడో చూద్దాం" అంది హేమ.

"చాలు చాలు. అలాటి మాటంటే అప్పుడే శపిస్తాడు. తాపసులు ముక్కోపులని తెలియదా?. ఆ యోగిని ఏదో పట్టుకువస్తూంది. నువ్వు అవతలకి పో" అని హేమనవతలికి పంపేసింది స్వయంప్రభ.

"రాజపుత్రీ! ఈ హారం ఎవరిదో చెప్పుకో" అంటూ వచ్చి యోగిని దానినామె కిచ్చింది. స్వయంప్రభ ఆశ్చర్యపోయి ..."హేమా! ఇటురా. ఇదుగో మన హారం. ఈ మహాత్ముడు తెప్పించాడు. ఎంతవింత. దేవీ! ఇదెలా వచ్చింది? అసలేం జరిగింది? నువ్వేం చెప్పావ్? ఆయనే మన్నాడు?" అంటూ ఆ యోగిని మీద ప్రశ్నల వర్షమే కురిపించింది.

"రాజపుత్రీ! తపస్సుకి సాధ్యం కానిది ఉంటుందా? నువ్వు రావడం, మనమాటలు, అన్నీ ఆయన దివ్యదృష్టితో చూశారు పెళ్ళి విషయం నేను చెప్పిందే నిక్కం. వేరే మళ్ళీ ఏమీ చెప్పక్కర్లేదు.! అన్నారు - నేనడగకుండానే. ఈ మణిహారం నాకిచ్చి అంతలో కళ్ళుమూసు కున్నారు. కొంచెంసేపయినా ఆయన కాలం వృథా చెయ్యడు కదా." అందా యోగిని.

ఆ యోగి ప్రభావానికి అత్యంత ఆశ్చర్యంతో.. "ఆ మహాత్ముని దర్శనం చేయించవూ?" అని స్వయంప్రభ ఆమెను ప్రార్థించింది. చాలాసేపటి కామె అంగీకరించి, స్వయంప్రభ చేయి పట్టుకుని కోవెలలోకి తీసుకెళ్లి అతని ఎదురుగా నిలబెట్టి - "స్వామీ! ఈమె మీ దాసురాలు. మిమ్మల్ని సేవించాలని కోరికతో వచ్చింది. మీ కటాక్ష వీక్షణం ప్రసరింప జేసి పవిత్రురాలిని చేయండి." అంది.

అతని తేజస్సుకి ఆశ్చర్యపోతూ ఆమె అతని పాదాలమీద పడింది. అత నామెను చూసి.. ఆమె చేతిని పట్టుకుని లేవదీసి మృదువుగా ముద్దు పెట్టుకున్నాడు. ఆ యోగిని "మనమింక యిక్కడ ఉండకూడదు"

అంటూ ఆమెను యివతలకు తీసుకొచ్చి- "ఆహా! ఏమి నీ అదృష్టం! ఎవరినీ కన్నెత్తయినా చూడని యీ మహాత్ముడు నిన్ను లేవనెత్తి నీ చేతిని ముద్దు పెట్టుకున్నాడు! ఇదే నీకు శుభసూచకం. ఇక నువ్వింటికి వెళ్ళు. ప్రసాదమిచ్చి హేమను తరవాత పంపుతాను. ఈ మణిహారాన్ని రేపు నీకు పంపుతాను -" అంటూ ఆమె కెంతో సంతోషం కలిగించింది. స్వయంప్రభ ఆనందంగా యింటికి వెళ్ళిపోయింది.

ఆ సాయంకాలం హేమ ఆమెను కలుసుకుంది. "అక్కడ విశేషాలేమిటి?" అని స్వయంప్రభ ఆత్రంగా అడిగింది.

"నువ్వు వెళ్ళిపోయాక వాళ్ళిద్దరూ ఆ గుడిలో కూర్చుని చాలా సేపు ఏదో మాట్లాడుకున్నారు." "ప్రసాద మిచ్చి నన్ను పంపుతారా?" అని నే నడిగాను.

"పోదువు గానిలే. ఇంతవరకూ నీ సఖురాలి పెళ్ళిగురించే ప్రస్తావించాను. ఆమె పెళ్ళి చేసుకోక తప్పదన్నాడు. మీలాటి విరాగులని తప్ప స్వయంప్రభ అంగీకరింపదు. మీ లాటి వారు ఆమెకు ఎలా దొరుకుతారు? ఇంతకు మునుపు మీరు పరోపకారులయిన మహర్షులు భార్యని స్వీకరిస్తారని చెప్పారు కదా ఇప్పు డీమె మిమ్మల్ని వరిస్తానంటే తప్పా? పెళ్ళయ్యాక అన్ని మంత్రాలూ ఉపదేశించవచ్చు, పార్వతికి పరమేశ్వరుడు తారకమంత్రం ఉపదేశించినట్లు అని అడిగాను. నా కేమీ జవాబివ్వక అవతలికి పొమ్మని సంజ్ఞ చేశారు నేను వచ్చేశాను."

"అమ్మా! నీ కాయనవద్ద చనువు కనుక అలా అడగ గలిగావు. నీ సఖురాలిమీద ఎంతో దయచూపావు. ఆ మహాత్ముడు అంగీకరిస్తే స్వయంప్రభకూడా లోపాముద్ర మొదలైన పతివ్రతా సంఘంలో చేరుతుంది కదా. మునికుమారుడు ఎంతో అందమైనవాడు. నీ మనసులో పుట్టిన సంకల్పం భగవంతుడు సఫలం చెయ్యాలి" అన్నాను. ఆమె - నీ అభీష్టం తెలుసుకు రమ్మంది. అందుకు నేను - "అమ్మా! మా సఖురాలు నీ ఆజ్ఞ దాటదు. నిస్సంగుల నయితే ఆమె కాదనదు" అన్నాను.

"హేమా! ఆ మహాత్ముడు మాట తిరగడు. దీనులమొర ఆలకిస్తాడు ఇద్దరూ విరక్తులే. నే నాయన నెలాగో ఒప్పిస్తాను. నువ్వెళ్ళి నీ సఖురాలిని తీసుకురా. గాంధర్వ వివాహం చేద్దాం' అని లోపలికి వెళ్ళిపోయింది. ఇక తక్షణ కర్తవ్యం నీదే" అంది హేమ.

స్వయంప్రభ కొంచెం సేపు కళ్ళు మూసుకుని - "ఇది ఉచితమేనా?" అని అడిగింది. "అతనంగీకరిస్తాడా, లేదా అని ఆలోచింపక - ఉచితమా అని అడుగుతున్నావా! ఆ మహానుభావుడు నిన్ను చేపడితే నీ అంతటిది ఏ లోకంలో అయినా ఉంటుందా? అప్పుడే నీ నియమాలకు ఫలం. నువ్వు ధన్యురాలివి అవడం" అని బోధించింది హేమ.

"సరే. అతను విరక్తుడు కనక తుచ్ఛ భోగా లాశింపడు. నాకు కన్యాత్వం విమోచన మౌతుంది. నా తల్లి తండ్రులకి నన్ను చక్రవర్తి కివ్వాలని కోరిక కనుక వారిందు కంగీకరింపరు. అందుచేత యిది రహస్యంగానే జరగాలి. ప్రయత్నాలు మొదలు పెట్టు" అంది స్వయంప్రభ. హేమ ఎంతో సంతోషిస్తూ "గాంధర్వానికి ప్రత్యేకవిధు లేమీ ఉండవు. ఒకరినొకరు వరించుకోడమే. రేపు మనం రహస్యంగా వెళ్దాం. అతను వెంటనే నీ పాణిగ్రహణం చేసి కన్నెరికం వదుల్చుతాడు" అంది. స్వయంప్రభకి కలిగిన సందేహాలు తీర్చింది.

సూర్యోదయం కాకముందే ఆమెను తయారుచేసి కోవెలకు తీసుకు వెళ్ళింది. పెళ్ళి కూతురి వేషంలో ఉన్న ఆమె చేత నమస్కారా లందుకుని...దీవించి ఆ యోగిని ఆమెను మంటపంలో కూర్చోబెట్టి -వెళ్ళి యోగిని తీసుకు వచ్చింది. అతనెన్ని విధాలుగా నిరాకరిస్తున్నా బతిమాలుతూ..అతనన్న మాట లతనికి గుర్తు చేస్తూ ఎలాగో మంటపంలోకి తీసుకు వచ్చింది. అతను వేగంగా పోయి తపస్సు చేసుకోవాలంటూంటే - ఇటుహేమ, అటు ఆ యోగిని పూనుకొని వారిచేత కార్యక్రమాలు జరిపించారు. స్వయంప్రభచేత ఒకపూలమా లతని మెడలోనూ, అతని చేత రత్నహారా న్నామె మెడలోనూ వేయించా రా పెళ్ళి పెద్దలు. తలంబ్రాలు పోయించారు. ఒకరిచెంగు ఒకరికి ముడి వేశారు. ఈ తంతు ముగిసాక ముని తపస్సు చేసుకోవాలని కోవెలలోకి వెళ్ళిపోయాడు.

స్వయంప్రభ తనూ యింటికి వెళ్తాననగా - "వివాహదీక్షలో వధూవరులు మూడురాత్రులు ఒకస్థలంలో ఉండాలి" అని - హేమ ఆమె నక్కడనే ఉంచి తానుమాత్రం సౌధానికి పోయింది.

అప్పటికి వేళయిపోతూందని తరువాయి కథను మణిసిద్ధుడు పై మజిలీలో చెబుతా ననగా గోపాలుడు అతని ననుసరించాడు.

# కాశీమజిలీ కథలు

## 58. వ మజిలీ

"మేమేం నేరం చేశాం? మమ్మల్నెందు కిలా బందించి తీసుకు పోతున్నారు? రాజపుత్రిక పారితోషికం యివ్వగా తీసుకున్నాం. అప్పుడే సహదేవుడనే రాజకుమారుడి కమ్మేశాం ఇప్పు డాహారాన్ని తెమ్మంటే ఎలా తేగలం? అవి మణులో గాజుపూసలో మాకేం తెలుసు?" అని వేడుకుంటున్నా రాజభటులు లీలావతినీ, వీణావతినీ గిరిదుర్గానికి తీసుకువచ్చారు.

అప్పటికి యింద్రమిత్రుడు ఊళ్ళోలేకపోడంతో వారిని వెంటనే విచారించడానికి వీలుకాక నిర్బంధంలో ఉంచారు. వీణావతి - రాజకుమార్తెను కలుసుకుని వస్తానని భటుల వద్ద అనుమతి తీసుకుని ఉద్యానవనానికి వెళ్ళింది. మునుపు ఆమెతో పరిచయమయిన పరిచారిక - స్వయంప్రభ హేమతో మాట్లాడుతూందనీ, నిరీక్షించమనీ చెప్పి వెళ్ళింది.

తలుపులు మూసుకుని రాజపుత్రిక హేమతో - "ఏం చెప్పేది నీతో? చెప్పడానికి నాకు నోరు రావడం లేదు. నా నియమాలన్నీ గంగపా లయ్యాయయి. నువ్వెళ్ళిపోయాక నేనా యోగినివెంట తిరగసాగాను. మంచి మాటలు చెబుతూ సంతోషంగా కాలక్షేపం కలిగిస్తూ నన్ను అలంకరించింది. అన్నం పెట్టింది. చీకటి పడబోతూంటే - "నువ్వూ ముని పుత్రుడూ మూడు రాత్రులు ఏకశయ్య మీద శయనించాలి. ఆయన సేవ చేయడానికి నీకిది చక్కని అవకాశం. మంచివిశేషాలు వినగలుగుతావు" అంటూ తా నేర్పరచిన పూలపాన్పుమీద కూర్చో బెట్టింది రూపానికి యోగిని అయినా ఆమె విలాసాలను మరచి పోలేదు.నా చేతిని అతని చేతిలో ఉంచి -

"స్వామీ! ఈమె పరమార్థ విశేషాలు తెలుసుకుందుకే మిమ్మల్ని భర్తగా స్వీకరించింది." అని అవతలకి తొలగి పోయింది ఇక నాకు కాళ్ళు చేతులూ ఆడలేదు. శరీరం వణకసాగింది వొళ్ళు చెమటలు పోసింది

"అలా బిడియపడతావేం? ఇటువచ్చికూర్చో" అని నవ్వుతూ – "నీ చరిత్రంతా అంతర్దృష్టితో తెలుసుకున్నాను. నువ్వు చాలా పవిత్రురాలివి. అందుకే మా యోగిని నిర్బందిస్తే నిన్ను తరింపజేయడానికి ఈ పెళ్ళి చేసుకున్నాను. నువ్వు స్వయంప్రభాదేవికంటే ఎక్కువ మహిమ సంపాదిస్తావు. మాట్లాడు. నీకేం కావాలో చెప్పు." అంటూ నా వీపుమీద చెయ్యి వేసి నన్ను తనకి దగ్గరగా తీసుకున్నాడు. పురుష సంపర్కానికి ఉలికి పడినా భర్త అని జ్ఞాపకం వచ్చి సమాధాన పడ్డాను.

అతను నా మెడలో చేయిపెట్టి రత్నహారం సవరిస్తూ –

"దీని కోసమే నీ తండ్రి చాలా పరితపించాడు. దీనిని నేను తెప్పించనిచో యీ రాజ్యం వేశ్యాధీనం ఐపోతుందన్నాడు. ఇదే మనకి బంధుత్వం కలిపింది." అంటూ నా చేతుల్ని ముద్దు పెట్టుకున్నాడు. మెల్లగా మెల్లగా నన్ను కౌగిలిలోకి తీసుకుని జడను నిమరసాగాడు.

ఏం చేస్తే ఏం కోపమొస్తుందో అని నేను ప్రాణా లుగ్గబట్టుకుని ఎప్పుడు అతను వదులుతాడా అని ఎదురు చూడసాగాను. అతనది గ్రహించినట్లు – కౌగిలి వదిలి. "పోనీలే! నీ మనసు షురోలా ఉంది. పొద్దు పోయింది. ఇలా వచ్చి పడుకో" అని అతని శయ్యమీద మీద అర్ధ భాగ మిచ్చాడు.

కాని నేను ఆ శయ్యను వదలి దూరంగా పడుకున్నాను. అతను చూపిన మన్మథ వికారాలను తలుచుకుంటూ వాటిపరమార్థాలు అర్థం కాక..కళ్ళు తెరచుకునే ఉన్నాను. కొంతసేపటికి అతను నా పక్కకి వచ్చి – నా ముఖంలోకి చూసి – ముట్టుకోకుండానే ఎన్నో కామవికారాల్ని అలవోకగా ప్రదర్శించాడు.

తెల్లవారగానే ఆ యోగిని నా వద్దకు వచ్చి – "రాత్రి తత్వ రహస్యాలేమైనా తెలుసుకున్నావా?" అని అడిగింది. "అమ్మా! తత్వవిశేషాలు తెలుసుకునే దాన్నయితే ఆడపుట్టుక ఎందుకు పుడతాను? ఆ మహాత్ముణ్ని చెరపడానికే మీరు నన్నిక్కడ పడుకోబెట్టారు. నా వల్ల అతని మనసు వికారం చెందింది" అని నేను విచారిస్తూంటే – ఆ యోగిని నవ్వుతూ –

" ఏమిటో అనుకున్నాను దీనికేనా ఇంత పశ్చాత్తాప పడిపోతున్నావు? అతనికి తెలియక అలా వికారం చెందా డనుకుంటున్నావా! అవన్నీ మన భ్రమలంతే. శ్రీకృష్ణుడి చర్యలు తెలియవూ? శంకరుడికి కళంకమంటిందా? మహాత్ముల చేష్టలు అద్భుతంగా ఉంటాయి. వాళ్ళు చెప్పినట్లు నడుచుకోడమే తప్ప ఏమీ ఎదురు చెప్పకూడదు. స్త్రీ ప్రశంసనే సహింపన్ని వాడు నీ పక్కలో చేరినందుకు సంతోషించాలి కాని చింతిస్తావా? ఈ రాత్రి అతను చెప్పినట్లు నడుచుకో" అని బోదించి న న్నూరడించింది

జాణ అయిన యోగిని పగలంతా అలా బోధించి, రాత్రి మమ్మల్ని శయ్య మీదకు చేర్చి తాను అతవలకి పోయింది. ఆ మహాయోగి భోగుడై నిముషమయినా నిలవలేక మోహావేశంతో నన్ను గాఢంగా కౌగలించుకున్నాడు. ఇక తరవాత చెప్పవలసిన దేముంది? మన్మధుడిని కృతార్థుడిని చేశాడు. మర్నాడు పగలు తపస్సు జోలికేపోక నా చుట్టూనే తిరిగాడు రాత్రి కావడమేమిటి. మళ్ళీ యధా విధే. ఇంద్రియా లతని స్వాధీనం తప్పాయి. అలాటి మహాత్ముణ్ని విటుడిలా మార్చాను. ఎంత పాపాత్మురాలినో! అతని చేష్టలు రుషికృత్యాల్లా కనిపించలేదు. ఆ యోగినీ, నువ్వూ కలసి పెళ్ళని చెప్పి నన్ను మోసం చేశారు నన్ను భ్రష్టురాలిని చేసి సంసార సముద్రంలో ముంచేశారు నా కథ వింటే అందరూ నవ్వుతారు. ఇలాటి పాపం చేసి బతకడం కంటె చావడమే మేలు" అంటూ ఆమె ఏడవసాగింది

ఆమె కోపం కొంత చల్లారే వరకూ ఉండి, అప్పుడు హేమ - "నువ్వు కోపగిస్తే నే నేమీ చెప్పలేను కానీ మణిహారం తిరిగి నీకు యివ్వడమే అతను మహానుభావుడని నిరూపించింది. వ్యాసమహర్షి వంటివాడే రాజు భార్యలతో క్రీడించాడు. దానివల్ల అతని గొప్పతనం ఏం తగ్గిపోయింది? ఇది నీ ప్రఖ్యాతికే మూలకం మీ వాళ్ళు సంతోషిస్తారే తప్ప కోపగించరు" అంటూ ఆమెను ఊరడించింది.

అంతవరకూ ద్వారం వద్ద వేచి ఉన్న పరిచారిక "వీణావతి మీదర్శనంకోరి ద్వారం దగ్గర ఎదురు చూస్తూంది. పంపించేదా?" అని

అడిగింది. వీణావతి వచ్చి నమస్కరించి, రాజభటులు తమను నిర్బంధించిన విషయం మొరపెట్టుకుంది. హేమ ఆలోచించి - "విచారించకు. నీ వీణ బాగుపడింది కదా? నువ్వా మణిహారాన్ని మాకిచ్చేసినట్లు ఉత్తరం వ్రాసిస్తాం" అంటూ పత్రం రాసి యిచ్చింది. అప్పుడు స్వయంప్రభ హేమను పోయి వారా కొండ దగ్గర ఏం చేస్తున్నారో చూసి రమ్మంది. ఆమె వెళ్ళి వచ్చి - "అక్కడ వారెవరూ లేరు. వస్తువులు కూడా లేవు" అంది ఆశ్చర్యపోతూ.

"నాలాగే ఆ మహానుభావుడు కూడా పశ్చాత్తాపపడి ఇక్కడుంటే మనసుకి వికారం కలగవచ్చునని ఎక్కడికో వెళ్ళిపోయి ఉంటాడు. పోనీలే. నా కన్నెరికం వదిలింది కదా. మా తల్లితండ్రులు నన్ను పెళ్ళిచేసుకోమంటే అప్పుడు ఈ విషయం చెప్పొచ్చు. మంచిముహూర్తం తెలుసుకురా. నేను యోగిని వేషం ధరించి యిక్కడే తపస్సు చేసుకుంటాను" అంది స్వయంప్రభ వైరాగ్యభావంతో. "తపస్సుకి తొందరేముంది? అతను యతో, భూపతో తేల్చుకోవాలి. ఎలాగేనా నువ్వు అదృష్టవంతురాలివే లే" అని హేమ ఆమె మనసు మళ్ళించింది.

# కాశీమజిలీ కథలు

## 59వ మజిలీ

"వచ్చేది వద్దన్నా రాక మానదు. రానిది ఎంత ప్రయత్నించినా రాదు దేనికైనా విచారించి ప్రయోజనం లేదు. ఇది గ్రహింపకే యిన్నాళ్ళూ దుఃఖించాను. అయినా నా రాజ్యం అన్యాక్రాంతం ఐపోలేదుకదా? ఆ యతీశ్వరుడు అభయమిచ్చాడు కదా?" అని ఆలోచిస్తూ ఇంద్రమిత్రుడు గుర్రంమీద రత్నగిరి మీదుగా తన పట్నం వస్తున్నాడు.

అప్పుడిద్దరు భటులు వేగంగా పరుగెత్తుకుంటూ వచ్చి, నమస్కరించి – "దేవా! ఆ రత్నహారం రాజపుత్రిక మెడలో వచ్చి పడింది. మంత్రి వర్యులు మీకిది తెలియజేయమన్నారు." అన్నారు.

రాజు అపరిమిత ఆనందంతో ఆ మంచి మాటను మళ్ళీ చెప్పించుకున్నాడు. అప్పుడువారు ... "ఆ హారాంగనలను ఉజ్జయినిలో పట్టుకుని రత్నహారం గురించి అడగ్గా అప్పటికే అమ్మేశామని బొంకారు. వారిమాటలు వినకుండా సంకెళ్ళు వేసి మన పట్నం తెచ్చాం. ఆదేం చిత్రమో ..మేమెంత బతిమాలినా, దండించినా గుట్టు చెప్పని వారు – ఎలా తెచ్చారో మరి, రాచకుమార్తె కిచ్చేశారు. హారం ముట్టినట్లూ, వారిని దండింపవద్దనీ కూడా రాశారట ఇదుగో ఆ పత్రిక" అని అందించారు

అతనది చదివి – 'ఓహో! ఆ మహానుభావుడు చెప్పినట్లే జరిగింది ఎలాగూ తోవే వెళ్ళి కృతజ్ఞతలు తెలుపుకుందాం' అనుకుని – చూసి రమ్మని భటులని పంపాడు. వాళ్ళు వెళ్ళి వచ్చి – "దేవా! ఆ యోగి యోగినితో కూడా మంటపంలో కూర్చుని జపం చేసుకుంటున్నాడు. మీ రాక గురించి చెప్పగా సంతోషంతో రావచ్చునని సెలవిచ్చాడు." అని చెప్పారు.

రాజు పాదచారి అయి ఒక్కడే అక్కడికి వెళ్ళి ఆ యోగి పాదాలకు నమస్కరించారు. ఆ యోగి అతన్ని లేవనెత్తి .. "రాజా! నీ భక్తికి సంతోషించాను. నువ్వొచ్చిన కార్యం చెప్పు" అన్నాడు.

"స్వామీ! నాకే కోరికా లేదు. ఇంతకు ముందు మీ దర్శనాకి వచ్చాను. అప్పుడు నేనేమీ చెప్పకుండానే మీరన్నీ సెలవిచ్చారు. అలాగే జరిగింది. అది మీకు చెప్పాలని వచ్చాను. ఈ దాసుడి యందు ఎప్పుడూ దయచూబిస్తూ ఉండండి" అని ప్రార్థించాడు.

"మేమంతా తెలిసే చెప్పాము. నువ్వు యింటికి, పోయి సుఖంగా ఉండు" అన్నాడు యోగి అప్పుడు రాజు రత్నాలతో కూర్చబడిన రుద్రాక్షమాల నొకదానిని అతని మెడలో వేసి శలవు తీసుకున్నాడు.

అంతలో ఎదురు వచ్చిన మంత్రులతో కలసి తనపురం వెళ్ళి భార్యనివాసానికి చేరుకున్నాడు. ఆమెకు తాను పడిన కష్టాలన్నీ చెప్పి ... "హారం దొరికాక అమ్మాయి వద్దకు వెళ్ళేవా? ఎలా దొరికిందని చెప్పింది? పెళ్ళి మాట ఏమి టంటూంది?" అని అడిగాడు.

అందు కామె "ఇప్పుడా రత్నహారం దానిమెడలోనే ఉంది. వీణావతే తెచ్చియిచ్చిందని చెప్పింది. పెళ్ళి విషయంలో దాని మనసు కొంచెం మెత్తబడినట్లే అనిపిస్తూంది. ఎందుకంటే ... అదివింటూండగా – హేమ! నీ స్నేహితురాలికి నువ్వు ఎన్నిక చేసిన రాజపుత్రుడికే యిచ్చి వివాహం చేయడానికి నిశ్చయించాం – అన్నాను. హేమ స్వయంప్రభ ముఖం చూసింది. అది కొంచెం సిగ్గుపడుతూ –

'మీ నిర్బంధం వల్ల నేను కన్నెరికం వదుల్చుకున్నాను" అంది. వేళాకోళంగా అందని హేమముఖం చూశాను. అది దాని మొహం చూసి ఏదో అంది. నేను తిరిగి వచ్చేశాను. పెళ్ళాడ కేం చేస్తుంది? భూరిశ్రవుని కొడుకు సహదేవుడికే యిస్తునట్లు శుభలేఖలు రాయించండి" అంది. రాజు సిద్ధాంతులను రప్పించి, ముహూర్తం పెట్టించి. బ్రాహ్మణులచేత శుభలేఖలను భూరిశ్రవుడికి పంపి – పట్నమంతా అలంకరించమని ఆజ్ఞ యిచ్చాడు.

ఉద్యానవనంలో – స్వయంప్రభ ఒక గద్దె మీద కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తూంది. హేమ ఆమె పక్కన నిలబడి ఏదో చెబుతూంది. రాజపుత్రిక కబు రందుకుని వచ్చిన రాజపత్ని ఆమెని చూసి అదిరిపడుతూ

– "ఎందు కిలా విచారిస్తున్నావ్?" అని అడిగింది. ఆమె ఎన్ని విదాల అడిగినా దుఃఖమే తప్ప స్వయంప్రభ నోట మాటలేదు.

అప్పుడు రాజపత్ని హేమ నడిగింది. అందుకు హేమ "స్వయంప్రభ స్వతంత్రించి చేసిన పనికి చింతిస్తూంది" అంది.

రాణి : ఏమిటాపని?

హేమ : మొన్నమీతో మనవి చేసినదే. మీరు పరిహాసమని తీసేశారు కాని ఆ మాట నిజమే.

రాణి : ఏమీ! నా బిడ్డ భర్తను వరించిందా.

హేమ : దుష్యంతుడు శకుంతలని వరించినట్లే గాంధర్వ విధానంలో వరించింది.

రాణి : అలాటి వాడు లభించాడా?

హేమ : అంతకంటే అధికుడే. ఇంతవరకూ మీకు చెప్పలేదనే పశ్చాత్తాప పడుతున్నాం. అతని పేరు అద్వైత శివానంద యోగి.

రాణి : ఔరా! చక్రవర్తి కడుపున పుట్టిన నా కూతురు చివరికి సన్యాసిని వరించిందా! అయ్యో!

హేమ : సన్యాసని తీసెయ్యకండి. మన్మథుని మించిన రూపవంతుడు. మీరు చూడలేదు మరి.

రాణి : అది మొదటి నుంచీ సన్యాసుల్లో కలుస్తాననే అంటూంది. ఆ మాటే నిజం చేసింది. పోనియ్.

హేమ . మీకు మనవడు పుట్టే లక్షణాలు కనపడుతున్నాయి. అందుకే యీమె విచారిస్తూంది.

ఆ మాట వినడంతోటే రాణి సంతోషమూ విచారమూ కూడా కలిపి ఫక్కున నవ్వింది. "అయ్యో! వెర్రిదానా! నీ పనులకి నవ్వొస్తూందే! లోకం నిన్ను చూసి నవ్వుతుందే."

స్వయంప్రభకూడా పెద్ద కంఠంతో ఏడవసాగింది. రాణి ఆమె దుఃఖించడం చూడలేక "ఫరవాలేదులే. మాటవరస కలా అన్నాను కాని నీకేం లోటు? అగస్త్యుణ్ని పెళ్ళాడిన లోపాముద్రలా ఆ మహర్షితో

సుఖపడుదువు గాని. గర్భవతి వయ్యావు. కులం ఉద్ధరిస్తావు. ఇంకేంకావాలి? మీ నాన్నగారూ కోపించరులే. అల్లుణ్ని తెచ్చి యింట్లో పెట్టుకుందాం" అంటూ ఆమె కళ్ళు తుడిచి ఊరడించింది. "హేమా! ఈ పనికి నువ్వు సహకరించి ఉంటావు. ఆతపస్వి కొండ దగ్గర ఉండడం ఎందుకూ? ఇంటికి తీసుకురా. రాజభోగా లనుభవిస్తాడు." అంది.

''అమ్మా! ఆ మహర్షి ఆ మర్నాడే యిక్కడి నుంచి ఎక్కడికోపోయాడు" అంది హేమ.

"అబద్ధాలాడతావేం? ఈ మధ్య రాజుగారు రెండుసార్లు అక్కడికి పోయి చూసి వచ్చారు. రుద్రాక్షమాల కూడా యిచ్చారు కానుకగా. మళ్ళీ చూసిరా" అని ఆమె అంతఃపురానికి వెళ్ళిపోయింది. ఆమె కోసమే ఎదురు చూస్తున్న ఇంద్రమిత్రుడు – "భూరిశ్రవుడు చాలా సంతోషిస్తూ మనం చెప్పిన ముహూర్తానికి వస్తామని రాశాడు. ఇక మనం పెళ్ళిపనులు మొదలుపెట్టాలి" అన్నాడు. రాణి దుఃఖిస్తూ జరిగిన దంతా చెప్పి తమ దురదృష్టానికి మళ్ళీ విచారించింది. అది విని రాజు అయోమయంలో పడిపోయి – "కర్మ ఎలా లాగితే అలా పోవలసిందే. మనం మానవులం ఏం చేయగలం? ఆ యోగి మహానుభావుడని సంతోషిద్దాం. మనవడు పుడతాడని మురిసిపోదాం" అంటూంటే –

"భూరిశ్రవుడికి శుభలేఖ పంపేశాం కదా. అతని కేం చెప్పాలి? ఈ అపకీర్తి జీవితాంతమూ వదలదు" అంది రాణి. "ప్రస్తుతం ముహూర్తం ఆపినట్లు తెలియజేద్దాం" అని అలారాయించి పంపాడు. "నాథా! ఆ యోగి పూర్వజన్మలో ఎక్కువ పుణ్యం చేసుకో బట్టే మనమ్మాయి వరించింది. మీరు వెళ్ళి అతన్ని యింటికి తీసుకురండి. లేకపోతే సాటివారు పరిహసిస్తారు" అని చెప్పిందామె.

రాజు కేం చేయాలో తోచక మర్నాడు పరివారం తోనూ మేళతాళాలతోనూ వెళ్ళి ఆ యతికి నమస్కరించి – "స్వామీ! మిమ్మల్ని నా కూతురు భర్తగా వరించిందట. మీరిక్కడుండడం ఎందుకు? నగరంలోకి రండి. ఉద్యానవనమే తపోవనం కాగలదు" అన్నాడు. అతను తక్షణం లేచి అధికవైభవంతో పల్లకీ ఎక్కి పురప్రవేశం చేశాడు.

మిగిలిన కథను మణిసిద్ధుడు తరవాత మజిలీలో చెప్పసాగాడు.

# కాశీమజిలీ కథలు

## 60. వ మజిలీ

**చా**వడిలో కూర్చుని సహదేవుడు వసుమిత్రుడనే స్నేహితుడితో మాట్లాడుతూంటే – "రాజపుత్రా! మీ సహోదరి సావిత్రి మిమ్మల్ని రమ్మంది. వేగం రండి." అని పరిచారిక కబురు తెచ్చి వెళ్ళింది అతను చెల్లెలు వద్దకు వెళ్ళాడు. ఆమె అతన్ని – "తలచిన కార్యం నెరవేరిందా?" అని అడిగింది. "నీ ఆలోచన ప్రకారం ఒక్కడినే అక్కడికి వెళ్ళి స్వయంప్రభ గురించి తెలుసుకుంటూ కొన్నాళ్ళక్కడ ఉన్నాను ఆమె వీణావతి వీణ విరగ్గొట్టడంతో అందరూ ఆమె యిక పెళ్ళాడదు, సన్యాసుల్లో కలసి పోతుందని నిశ్చయించుకున్నారు ఆమె చేష్టలూ అలాగే ఉండేవి. నా కామె దర్శనం కాకపోడంతో నేను లేఖ పంపాను. నువ్వు శారికను పంపి కర్తవ్యం బోధించావు. దైవికంగా నా స్నేహితుడు వసుమిత్రుడు తారసిల్లి నాకు సహకరించసాగాడు.

నేను యోగి వేషమూ, శారిక యోగిని వేషమూ ధరించి స్వయంప్రభాదేవి ఆలయంలో ఉన్నాం. వసుమిత్రుడెప్పటి కప్పుడు పట్నంలోని విశేషాలు మా కందించేవాడు.

దైవం మాకు అనుకూలించాడు. వీణావతి నుంచి తీసుకున్న రత్నహారం మాకెంతో పనికొచ్చింది. శారిక పన్నిన వ్యూహంలో పడిన స్వయం ప్రభ కొద్ది రోజులలోనే నన్ను పెళ్ళాడింది. మూడు రోజులు మా దగ్గరే ఉంది. అంతలో రాజకింకరులు వీణావతిని పట్టుకుని వచ్చారు. ఆమె యింటికి వెళ్ళగానే మేము వేషాలు తీసివేసి యిక్కడికి వచ్చాం" అని చెప్పాడు. "అన్నా! మరో విశేషం జరిగింది విను. ఇంద్రమిత్రుడు తన కూతురు స్వయంప్రభని నీకిచ్చి వివాహం చేయడానికి ముహూర్తం నిర్ణయించి పత్రిక పంపాడు అంగీకరించామని రాయమని తండ్రి గారిని ప్రోత్సహించాను ప్రస్తుతం ముహూర్తం నిలిపినట్లు బదులు వచ్చింది.

కారణమేమిటో తెలియదు. యతివేషం ధరించి వెళ్ళావని వారికి తెలియలేదు కద?"

"తెలియదు. వేరేఏదయినా కారణం ఉండొచ్చు. మేము వచ్చేశాక అక్కడివిశేషాలు తెలుసుకురమ్మని వసుమిత్రుని స్నేహితుణ్ని అక్కడుంచాం. అతను వొస్తే అన్ని వివరాలూ తెలుస్తాయి." అన్నాడు వసుదేవుడు.

వాళ్ళు మాట్లాడు తూండగానే ఒక పరిచారిక వచ్చి - "రాజపుత్రా! మీ వసుమిత్రునికి మిత్రుడట. వాకిట్లో నిలబడి ఉన్నాడు" అంది. చెల్లెలిని లోపలికి పంపించి అతన్ని తీసుకురమ్మని దాసికి చెప్పాడు.

## కపట శివానంద యోగి కథ

వసుమిత్రుడూ అతని మిత్రుడూ కలిసిలోపలికి వచ్చారు. ఆ మిత్రుడు - "దేవా! తాడితన్నే వాడి తల తన్నేవా డుంటాడనే వాడుక నిజమైంది. రాజపుత్రికను మనం వంచిస్తే మనలను వంచించే వాడొకడు తయారయ్యాడు. మీరు వెళ్ళిన మర్నాడే. మనగుట్టు తెలుసుకున్నవాడు కాబోలు. మీలాగే యతివేషం వేసుకుని, ఒక ఆడదానికి యోగిని వేషం వేసి ఆ మండపంలో జపం చేసుకుంటున్నట్లు నటించసాగాడు. మీరు మళ్ళీ వచ్చేశారా అని భ్రాంతి పడి దగ్గరగా వెళ్ళి చూశాను. ఆ జటలు, వల్కలాలు మనం పారవేసినవే అవడం వల్ల వాళ్ళు డాంబికులే అని నిశ్చయించుకుని ఆ ప్రాంతమందే తిరగసాగాను. వారు మీ లాగే సామాన్యుల పట్ల మౌనవ్రతమే అవలంబించారు.

కొన్ని రోజులకి మహారాజు దైవికంగా రత్నహారం దొరికిందన్న వార్తవిని సంతోషిస్తూ ఆ కపటయోగి వద్దకొచ్చి కృతజ్ఞతా సూచకంగా రత్నాలు కలిపికూర్చిన రుద్రాక్షమాల యిచ్చాడు. తరవాత అతను కూతురికి వివాహప్రయత్నం గావించి మీ తండ్రిగారికి శుభలేఖలు

పంపాడు. అంతలో ఆ రాజుకి స్వయంప్రభ గాంధర్వవిధిని యతి కుమారుణ్ని పెళ్ళాడినట్లూ, గర్భవతి అయినట్లూ తెలిసి - ప్రస్తుతం తరలి రావద్దని యిక్కడికి ఉత్తరం రాసి - ఆ మాయావే తన అల్లుడని నిశ్చయించుకుని వానిని పల్లకీ ఎక్కించి అంతఃపురానికి తీసుకుపోయాడు.

మర్నాడు పురప్రజ లందరికీ తెలిసేలా ఆ టక్కరిని భద్రగజం మీద ఊరేగించసాగారు. అతని అలంకారాలు, దేవుడి కిచ్చినట్లు ప్రజలు మంగళ హారతులు ఇవ్వడం చూడలేక పరుగెత్తుకొచ్చాను. దేవా! మనం నాటిన వృక్షం అతనికి ఫలమిస్తూంది. ఆలస్యమైతే వాడే అల్లుడిగా స్థిరపడిపోతాడు. ఏదోలా ప్రతీకారం చేసి వాడిని తొలగించి ఆ వైభవం మీ రనుభవించాలి" అంటూ ఆకథంతా చెప్పాడు.

సహదేవుడి కేమీ తోచక కలవరపడుతూ అదంతా చెల్లెలికి చెప్పాడు. ఆమె చాలా తెలివయినదవడం వల్ల - "అన్నా! మించి పోయిందేమీ లేదు. తొందరపడకు. స్వయంప్రభ గర్భవతి అని విన్నాం. ఆమె ధృడ సంకల్పం కలది. హేమ కూడా బుద్ధి మంతురాలు. ఆలోచించకుండా తొందర పడేవాళ్ళు కారు. ఒక ఉత్తరం నేను చెప్పినట్లు రాసిపంపు. కార్యం సఫలమౌతుంది" అంటూ ఏం రాయాలో ఏం చేయాలో, చెప్పింది.

అతను వెంటనే ఉత్తరం రాసి వసుమిత్రుడి మిత్రుని కిచ్చి పంపాడు. అతనికి - దైవికంగా ఎక్కడికో బండిలో వెళ్తున్న హేమ కనిపించింది. అతనా ఉత్తరాన్ని చాక చక్యంగా ఆ బండిలో పడవేశాడు. హేమ ఆ చీటి విప్పి చదివింది.

" ప్రేయసీ! నువ్వు గర్భవతి వయ్యావు. సమయానికి నే నక్కడ ఉండలేక పోయాను. కొత్త ప్రయోగాలు తెలుసుకుందుకు హిమవత్పర్వత ప్రాంతంలో ఉన్న మా గురువు దగ్గరకి వెళ్తున్నాను. తొందరలోనే రాగలను. నీ కుమారుడి నెత్తుకుని దీవించి ముద్దాడుతాను. ఆ బాలుడే నీ తండ్రి రాజ్యాని కధికారి. మనం ఆ తపోవనానికి వెళ్దాం విచారించకు.

అద్వైత శివానందయోగి.

హేమ అది చదివి చాలా ఆశ్చర్యపోతూ – "ఈ చీటీ యిచ్చిన వారెవరు?" అని అడిగింది. అప్పుడతను – "నేను. నేను." అన్నాడు.

"నీ కీ ఉత్తరం ఎవ రిచ్చారు?" అని ఆమె అడగగా – "అమ్మా! కొన్ని రోజులకిందట రత్నకూటగిరి ప్రాంతానికి వెళ్ళాను. అక్కడ స్వయంప్రభాదేవి కోవెలలో తపస్సు చేసుకుంటున్న యోగి అమ్మగారితో కూడా ఎక్కడికో పయనమై – శకునంగా ఎదురైన నన్ను చూసి నా వివరాలడిగి – నాకు రాజపుత్రిక స్వయంప్రభ, ఆమె సఖురాలు హేమ తెలుసునని – "యీ ఉత్తరం హేమకందించాలి. జాగ్రత్తగా యిస్తే నిన్ను వృద్ధి పొందేటట్లు దీవిస్తాను – అన్నారు. తప్పకుండా యిస్తాను. నన్ను దీవించడంటూ ఉత్తరం తీసుకున్నాను. వారు ఉత్తరదిశగా పోయారు. అప్పటినుంచీ మీకోసం తిరిగి తిరిగి విసిగి పోయాను. ఇవాళ నా పుణ్యం కొద్దీ కనిపించారు" అన్నాడు.

"మంచిది. నీకు పారితోషికం యిప్పిస్తాను. నువ్వు నాతోరా" అని బండిని వెనక్కి తిప్పించి రాజకుమార్తె వద్దకు వెళ్ళింది. ఆమెని చూసి, "ఇంతలోనే వచ్చేశావేం? ఆ యోగిని చూసి రమ్మన్నాను కదా. శకునం కుదరలేదా?" అని అడిగింది స్వయంప్రభ.

"వింతలు కనపడుతున్నాయి. ఈ ఉత్తరం చదువు" అని దానినందించింది హేమ. అది చదివి, ఆశ్చర్యపడుతూ – "మరి ఆ ఊరేగిం పేమిటి? నువ్వు వేగంగా పోయి అతన్ని చూసిరా, అంతా తెలుస్తుంది" అంది.

హేమ రాజభవనానికి వెళ్ళగా, రాజపత్ని – "తన భర్తని చూసిరమ్మని స్వయంప్రభ పంపింది కాబోలు. అతని రూపాన్ని తెగపొగిడావే! చాలుచాలు. సామాన్యులలో హీనుడు. ఆ గదిలో ఉన్నాడు చూసిపో" అంది కొంచెం నిష్ఠూరంగా.

హేమ ఏమీ మాట్లాడకుండా మెల్లగా ఆ యోగి ఉన్న గదిలోకి పోయి – "స్వయం ప్రభ సఖురాలు హేమ – తమ దర్శనానికి వచ్చిందని చెప్పు" అని పరిచారికకు చెప్పింది. ఆమె వెళ్ళి అనుమతి తెచ్చింది.

హేమ లోపలికి పోయి అతనికి నమస్కరించింది. అతను కనులు తెరవకుండా జపమాలని తిప్పుతూంటే ఆమె అతని ముఖాన్ని పట్టి పట్టి చూసి ఆ యోగికాదని నిశ్చయించుకుంది. అంతలో అతను కళ్ళు తెరచి హేమని కూర్చోమని కనుసైగ చేశాడు.

అప్పుడు హేమ – "స్వామీ! నన్ను మరచి పోయారా? నాపేరు హేమ. రాజకుమార్తె గురించి కోవెల వెనక నాతో చాలాసేపు మాట్లాడారు. జ్ఞాపకముందా?" అంది.

"ఆ...ఆ...ఔను మాట్లాడేను."

"మీ రూపంచాలా మారిందే! ఈ యోగిని నన్నెరగనట్లు ఊరుకుందేం? మునుపు నా ముందు మౌనముద్ర వదలి మాట్లాడింది కదా?'

"మేము నీ సఖురాలి గురించి సంసార ప్రసంగంలో దిగవలసి వచ్చింది. అందువల్ల జ్ఞానవాసన తగ్గి, లోకవాసన పెరిగింది. తేజం తగ్గడాని కదే కారణం. అందరితోనూ మాట్లాడుతూంటే తపస్సుకి అంతరాయమని మౌనముద్రను ఎక్కువ చేశాం."

"స్వామీ! మీరు మా సఖురాలి నిమిత్తం సంసారంలో దిగామన్నారు. అది అబద్ధం. మీ వల్లనే మా సఖి సంసారంలో దిగింది." అంది పరిహాసంగా.

"మీరు ప్రౌఢలు, నాగరికులు. మీతో సమానంగా మేము సమాధానం చెప్పగలమా?"

"మా ప్రౌఢిమను రేపు మా ఉద్యానవనంలో ప్రవేశించినప్పుడు చూస్తారు" అని తిరిగి వచ్చి స్వయంప్రభతో – "సఖీ! మనని వంచించడాని కెవడో మాయావి యిలా వేషం వేసుకొచ్చాడు మన మిప్పుడీ యోగి ఆ యోగికాదని చెప్పినా నమ్మించడం కష్టం. అయ్యగారికి కోపం వస్తుంది. వంచకులను వంచనతోనే జయించాలి. ఇప్పు డేమీ మాట్లాడొద్దు" అంటూ ప్రణాళిక చెప్పగా – "నీకు తోచినట్లు చెయ్యి "అంది స్వయంప్రభ.

రెండురోజు లయ్యాక ఆ యోగిని పల్లకీ ఎక్కించి ఉద్యాన వనంలోకి తీసుకువచ్చారు. హేమ ఎదురుగా వచ్చి ఒక యింటిలోకి

తీసుకు పోయి అదే వరుడిగది అని చెప్పింది. దానిలో పులిచర్మాలు, దర్భాసనాలు, కమండలాలు మొదలైనవి చాలా ఉన్నాయి. ఒకమూల యినప చిక్కంతో చేయబడిన మంచం మీద పులి తోలుంది అదే శయ్య అని చెప్పారు.

"స్వామీ! ఇవాళ నూతన శయనోత్సవం చేయవలసి ఉంది. మిమ్మల్నీ మా రాజకుమార్తెనూ ఏకశయ్యమీద కూర్చోబెట్టి మా పరిచారికలు వేడుకలు చేస్తారు. మీరు కోపగించరు కద?"

రాజపుత్రిక తన శయ్యకు వస్తే చాలు అన్న సంతోషంతో - ఆ యోగి - "మేము మాత్రం వట్టి ఛాందసు లనుకుంటున్నావా? నవరసాలూ ఎరిగిన వారమే. మీ యిష్టమొచ్చిన వేడుకలు చెయ్యండి" అన్నాడు.

అప్పు డొకదాసీ కన్యను అలంకరించి తెచ్చి మంచంమీద కూర్చుండ బెట్టారు. గంధం పూయించాక ఒక ధూర్తురాలు - "బావగారూ! మీ జడలు అంటించు కున్నట్లున్నాయ్!" అంటూ జడలు గట్టిగా లాగింది అవి ఊడివచ్చాయి. మరొకామె గడ్డం పీకింది. ఒకతె ముళ్ళు గుచ్చింది. మరొకతె అతని మీద వేడినీళ్ళు జల్లింది. ఒకతె ఉమ్మింది. అవన్నీ వేడుకలు కాబోలని కొంతసేపు సహించినా, అవి శ్రుతి మించడంతో అతను భరించలేక "నిలవలేను. రక్షించండి...నన్ను పోనీండి.." అంటూ మంచం దిగి అటూ యిటూ పరుగెత్తసాగాడు.

అప్పుడు హేమ - "ఇక ఊరుకోండి. అయ్యగారికి హాస్య రసం తెలియదు. కోపం చేస్తున్నారు" అంటూ వారికి చెప్పి - "స్వామీ! మీరు త్రికాల నేత్రులు కదా! నే డిలా జరుగుతుందని తెలియదా? చేయవలసిన వింకా చాలా ఉన్నాయి. వాటి నెలా తట్టుకుంటారు?" అని అడిగింది.

"అబ్బా! ఈ దెబ్బల కెవడూ తాళలేడు. నాకు రాజపుత్రిక అక్కర్లేదు. నా దారిన నన్ను పోనివ్వండి" అని బతిమాలా డాయోగి.

"మా రాజపుత్రికని పెళ్ళాడి, విడచిపోతానంటే ఒప్పుకుంటామా? ఆగు" అని అదిలించారు. ఆ రాత్రి అతనికి కాళరాత్రే అయింది.

అంతవరకూ చెప్పి ఆపేశాడు మణిసిద్ధుడు.

# కాశీమజిలీ కథలు

## 61. వ మజిలీ

"స్వయం ప్రభాదేవివరంవలన పుట్టి కూడా మనమ్మాయి ఇన్ని నిందలు పడుతూం దేమిటి? పెళ్ళి చేసుకోనంది. తరవాత సన్యాసిని పెళ్ళాడానంది. ఆ మాటనమ్మి ఆ జోగిని తీసుకొస్తే తాను వరించిన వాడు కాదంటూంది. భూరిశ్రవుని కుమారుడికి దీనినిస్తామని శుభలేఖ పంపాం. దీనిని చూసి మాట్లాడుతుందని అతను తన అమ్మాయిని పంపుతున్నాడని ఉత్తరం వచ్చింది. ఇప్పుడేం చెయ్యాలి. ఇందుకే - స్త్రీకి స్వతంత్రం యివ్వకూడదంటారు" అని విచారిస్తున్న భర్తని -

"దానికర్మ అలా ఉంది కనుక మీ రిలా నిందిస్తున్నారు. అది ఏ పాపమూ ఎరగదు. అది వరించిన మహర్షి అత్యంత రూపవంతుడని హేమమొదటే చెప్పింది. మధ్యలో యీ జోగి ఎక్కడి నుంచి వచ్చాడో? ఇది తెలుసుకోకుండా దానిని నిందిస్తున్నారు. స్వయంప్రభ భోగాలకి ఆశపడేది కాదు. భూరిశ్రవుడి కూతురుని స్వయంప్రభ దగ్గరకే పంపుదాం. జరిగింది తెలుసుకుని వచ్చిన దారిన పోతుంది" అని ఓదార్చింది రాణి.

సావిత్రి - స్వయంప్రభ ఉద్యానవనంలో కలుసుకున్నారు. ఒకరి నొకరు ఎంతో అభిమానంగా పలకరించుకుని గౌరవించుకున్నారు అప్పుడు హేమ స్వయంప్రభ గురించి అంతా వెల్లడించి - "ఈమె మహర్షిపత్ని కనక మీకు వంద్యురాలు" అంది

ఆ మాటలు వినీవిననట్లు నటించి - సావిత్రి తన సోదరుడి రూప, విద్యా విశేషాల గురించే కాక వైరాగ్య ప్రవృత్తి గురించి కూడా విశేషించి చెప్పి - "సన్యాసులలో కలసి హిమవత్పర్వత ప్రాంతాలకు పోయివచ్చాడు.

మా నాన్నగారు మీ తండ్రిగారు పంపిన శుభలేఖ చూసి, సంతోషించి - "పెళ్ళి చేసుకుంటావా?" అని అడిగితే అతను - " నా కిదివరకే పెళ్ళయింది. నా భార్య ఎక్కడో ఉంది" అన్నాడు. అది వేదాంతమని - మా త్రండిగారు వానికి బలవంతంగా పెళ్ళి చేయదలచుకున్నారు. నీ గుణాలూ వాడిగుణాలూ సరిపోతాయనడానికే యింతగా చెబుతున్నాను. మీ తండ్రితో చెప్పి వేగంగా ముహూర్తం పెట్టించు" అంది.

ఆ మాటలకు వారిద్దరూ ముఖాలు చూసుకున్నారు.

"మీకేమైనా సందేహాలుంటే సంకోచించకండి. అడగండి" అంది సావిత్రి వారిని ప్రోత్సహిస్తూ.

అందుకు హేమ - "మరేమీ లేదు. మా రాజపుత్రిక వరించిన యోగి మీ అన్నగారేమో అని సందేహం కలుగుతూంది" అంది మెల్లగా. "భగవంతుడు విచిత్ర సంఘటనలు కూరుస్తాడు. అద్వైత శివానంద యోగి అని పేరు పెట్టుకునే మా అన్న దేశాటనం చేశాడు. ఆ ... అర్థమయింది.. 'నీకు స్వయంప్రభ అనే రాజపుత్రికను పెళ్ళి చేయడానికి నిశ్చయించాం' అని మా తండ్రిగా రనగా - 'నేనిది వరకే పెళ్ళాడాను' అన్నాడు. అప్పుడు మాకేమీ అర్థం కాలేదు. ఇదన్నమాట సంగతి" అంది సావిత్రి ఆనందంగా. హేమ కూడా తన సంతోషం ప్రకటించి - కొత్తయోగి గురించి చెప్పి - "మీ అన్నగారి నిక్కడికి రప్పించు" అని సావిత్రిని కోరింది.

అప్పుడు సావిత్రి ఆమెను ఉద్యానవనం చూబించమని తీసుకు వెళ్ళి తమ వృత్తాంతాన్ని చెప్పీ చెప్పకుండా చెప్పింది. అని విని హేమ ఆశ్చర్యానందాలతో..."ఔరా! మీ అన్న ఎంత వ్యూహం పన్నాడు! అలా కాకపోతే మా స్వయంప్రభ పరమేశ్వరుడు చెప్పినా పెళ్ళి చేసుకునేదికాదు. ఆహా! ఆ యోగిని ఎంత చక్కగా నటించింది. సరే...కాని ఈ రహస్యం ఎవరికీ చెప్పకు" అంది.

ఇద్దరూ స్వయంప్రభ వద్దకు వెళ్ళారు. హేమ యుక్తిగా - స్వయంప్రభ వరించినది సహదేవుడినే - అని చెప్పింది.

అదే సమయంలో - హేమ ఆ వార్త రాజపత్నికి చెప్పడానికి వెళ్ళేసరికి - రాజు తన భార్యతో - "దేవీ! మనం ఎన్ని నిందలు పడుతున్నామో! స్వయంప్రభ చరిత్ర లోకానికి పరిహాసమై పోయింది. కవీశ్వరులు - పద్యాలు కదుతున్నారు. నిన్న నేను వీధిలో వెళ్తూంటే ఒక కుర్రవాడు -

**పెండ్లి యాడననుచు భీష్మించి కొని యున్న**
**ముగుద గోరుకొనియె ముగురు మగల**
**నెలతుకల వ్రతంబు నీటిపై చే వ్రాలు**
**గాలి వెలుగు దీప కళిక సూవె**

- అని పద్యం చదువు తున్నాడు. రాజులందరూ సభలో నన్ను చూసి నవ్వుతున్నారు. సహదేవుడు ఎంతో చక్కని వాడట. అతన్ని అల్లుడిగా పొందే భాగ్యం లేకపోయింది. ఆ కపట యోగి వృత్తాంతం తెలుసుకుందుకు గూఢచారులని నియమించాను. స్వయంప్రభని లోకులు ఎన్నో విధాలుగా నిందిస్తున్నారు. ఏమిటీ బాధా పరంపరలు! వీటినుంచి గట్టెక్కిస్తే ఆ దేవికి ఎన్నో ఉత్సవాలు చేయిస్తాను. లేకపోతే వొట్టి పాషాణమే అనుకుంటాను" అంటూంటే - హేమ అతని కెదురుగా వచ్చి, "మహారాజా! ఆ దేవి నేమీ నిందించకండి. మీ చింతలన్నీ తొలిగి పోయాయి వెదకబోయిన తీగె కాలికే తగిలింది. దైవ సంకల్పం..." అంటూ సహదేవుడు చేసిన కృత్యాలూ, సావిత్రి మాటలూ వివరంగా చెప్పింది. ఆ విషయాలన్నీ విని రాజు, భార్య ఆనంద సాగరంలో మునిగి తేలసాగారు.

అక్కడితో కథ ఆపి మణిసిద్ధుడు మరుసటి మజిలీకి బయలుదేరాడు

# కాశీమజిలీ కథలు

## 62. వ మజిలీ

"మీనాక్షీ! ఇటురా. ఏం పనిచేశావే! తరతరాల నుంచీ దివాణాన్ని ఆశ్రయించుకుని ఉన్నాం కదా. అంతఃపురంలోని రహస్యాలు వెల్లడి చెయ్యొచ్చా? మన బతుకులకే ముప్పొచ్చింది. మాధవస్వామి అర్చకుడు శ్రీనివాసాచార్యుడి అల్లుడట. వాడెవడు? వాడితో నీకు పరిచయం ఎప్పుడైంది? అందులో నిజమేమిటి?" అని నిలదీస్తున్న తల్లి మాటలకు భయపడుతూ ఆ దాసీ పుత్రిక –

"అమ్మా! నా మీద పడిన నేర మేమిటి? అర్చకుడి అల్లుడి మాట ఎందుకు వచ్చింది?" అని అడిగింది.

"నీ కేమీ తెలియదా? మొన్న ఏనుగు మీద ఊరేగివచ్చిన యోగి రాజపుత్రిక వరించిన యోగి కాడట. సహదేవుడనే రాజపుత్రుడు వైరాగ్యంతో యోగి అయితే అతన్ని వరించిందట రాజపుత్రిక. అతను యిప్పుడే వచ్చి తానే భర్తనని చెప్పాడట. అప్పుడు ఇద్దరు యోగులకీ తగువు కలిగింది. స్వయంప్రభ గుర్తులన్నీ తెలుసుకుని సహదేవుణ్నే వరించినట్లు చెప్పింది.

అప్పుడు రాజభటులా కపట యోగిని నిజం చెప్పమని దండించారు. దెబ్బలకు తాళలేక అతను – "నేను మాధవస్వామి అర్చకుడి అల్లుడిని. నా కాపరం కంచి. మీనాక్షి అనే దాసీపుత్రిక ప్రేరణ వల్ల యీ వేషం వేశాను" అని చెప్పాడు.

నిన్ను కూడా పట్టి తీసుకు రమ్మని రాజు కింకరులకు చెప్పాడట. ముందుగా తెలుసుకుని వచ్చాను. నిజం చెప్పు" అని గద్దించింది తల్లి. అందుకు మీనాక్షి యిలా చెప్పింది.

# చక్రపాణి కథ

"ఒకనాడు నేను మాధవస్వామి ఆలయంలో పువ్వులు కోస్తున్నాను. ఆ అర్చకుని అల్లుడు చక్రపాణి అత్తవారింటికి వచ్చాడట. నన్ను చూసి మదనవికారాలు ప్రకటించాడు. భాగ్యవంతు డనుకుని నేనూ సరసా లాడడం మొదలు పెట్టాను. క్రమంగా యిద్దరి మనసులూ కలిశాయి తనువులూ ఏకమయ్యాయి.అతను నాకు కానుకలిస్తూండేవాడు. ఒకనాడు -

"నేను పనిచేస్తున్నది స్వయంప్రభ ఉద్యానవనంలో" అని చెప్పగా అతనా దివ్యసౌందర్యవతిని చూపమని రోజూ వేధించసాగాడు ఆ తోటలో ఏది ఎంత రహస్యంగా జరిగినా మాకు తెలియకుండా ఉండదు ఆ యోగిని స్వయంప్రభ భర్తగా వరించడం, అత నెక్కడికో వెళ్ళిపోవడం తెలిసి - "నువ్వు ఆ యోగి వేషం వేసుకుని అక్కడ కూర్చుంటే రాజపుత్రిక దర్శనం కావచ్చు" అన్నాను పరిహాసంగా.

అతను ఆ విషయం గురించి గుచ్చి గుచ్చి అడిగేసరికి స్త్రీస్వభావం వల్ల గుట్టంతా విప్పి చెప్పేశాను. తరవాత అతనా వేషం వేసుకుని అక్కడ కూర్చున్నాడు. దీనిలోనా నేరమేముంది?"

ఆమె తల్లి తలబాదుకుంటూ - "దారి చూపావు. మిగిలింది అతను పూర్తి చేశాడు. జరిగిన దానికేమీ చెయ్యలేం. నువ్వేమీ ఒప్పుకోకు. చక్రపాణి ఎవడో నాకు తెలియదనెయ్యి. అబద్ధమాడు ... అంటూండగానే రాజభటులు వచ్చి మీనాక్షితో కూడా దానిని న్యాయస్థానానికి తీసుకు పోయారు.

కొలువులో పురోహితులు, సామంతులు మొదలైన వారితో కూర్చుని ఇంద్రమిత్రుడు సహదేవుడితో ఏదో మాట్లాడుతున్నాడు. ఒకవేపు చక్రపాణి నిలబడి ఉన్నాడు. అతను మీనాక్షిని చూసి - "ఓసీ! నన్నీ యోగివేషం వేసుకుని కూర్చోమని ఉపాయం చెప్పింది నువ్వుకాదా?" అని అడిగాడు.

ఆమె అతని ముఖం ఎగాదిగా చూసి – "కల్లు తాగావా? నీ మొహం నే నెప్పుడేనా చూశానా? చాలుచాలు" అంది కళ్ళెర్రజేస్తూ.

చక్రపాణి తెల్లబోయి "ఎంత మోసకత్తెవే. నువ్వు చెప్పందే నాకా ఉద్యావనంలోని రహస్యా లెలా తెలుస్తాయ్? రాజపుత్రిక ఆ యోగిని వరించినట్లే నాకు తెలియదు. ఇలా బోదించి, ఏమీ ఎరగనంటే ఆ పాపం ఊరికే పోతుందా? నన్నెరగ నన్నావు కదా. నీ యింట్లో నా వస్తువు లెన్ని ఉన్నాయో చూబిస్తాను." అనే సరికి మీనాక్షి తెల్లబోయింది.

దానితో ఆ వ్యూహమంతా అదే పన్నిందని సభ్యులు నిశ్చయించారు.

సరిగ్గా అదే సమయంలో స్వయంప్రభకు కొడుకు పుట్టాడని వార్త వచ్చింది. ఆ ఆనందంలో – చక్రపాణి, మీనాక్షి అపరాధులని తేలినా శిక్షింపకుండా వదిలివేసి అందరూ ఉద్యావనానికి వెళ్ళారు.

చందమామలా వెలిగిపోతున్న మనవడిని చూసి ఇంద్రమిత్రుడు ఆనందంలో దేశమంతటా వేడుకలు చెయ్య మన్నాడు. తరవాత సహదేవుడే ఆ బాలుడికి దేవదత్తుడని పేరు పెట్టాడు. ఇంద్రమిత్రుడు తన రాజ్యాన్ని అప్పుడే సహదేవుడి అధీనం చేసి పట్టభద్రుణ్ని చేశాడు. సహదేవుడు తన వారినందరినీ రప్పించి, తండ్రి అనుమతితో తన చెల్లెలిని వసుమిత్రుడి కిచ్చి వివాహం చేసి అతనిని తన మంత్రిగా చేసుకుని రాజ్యాన్ని సమర్ధవంతంగా పాలించసాగాడు.

గోపా! ఈ పద్యాన్ని స్వయంప్రభ గురించి అప్పటి వారెవరో రాశారు. స్వయంప్రభ – మొదట పెళ్ళాడనంది. కాని యోగి, సహదేవుడు, చక్రపాణి – ముగ్గురూ మగలుగా తేలారు" అని తెలిపి – మణిసిద్ధుడు శిష్యుడితో కలసి మర్నాడు తరవాత మజిలీ చేరాడు.

# కాశీమజిలీ కథలు

## 63. వ మజిలీ

గురువుగారూ! ఇక్కడ విచిత్రా లేమీ కనపడలేదు. కాని ... యీ వూరి తూర్పుదిక్కున ఒక ఉద్యానవన ముంది. దానిలో లతలూ మొక్కలూ పొదలూ ఎన్నో ఉన్నాయి. కాని అన్నీ నాలుగేసే నాటబడ్డాయి. దీని వెనక కథేమైనా ఉంటే చెప్పండి" అన్నాడు గోపాలుడు.

మణిసిద్ధుడు నవ్వి – "దానివెనక గొప్ప చమత్కారమైన కథ ఉంది. విను" అంటూ మొదలు పెట్టాడు.

## శీలకళా, విద్యా రూపవతుల కథ

విశాల అనే పట్నాన్ని రాజధానిగా చేసుకుని దర్మపాలు డనే రాజు ప్రజారంజకంగా పాలిస్తున్నాడు ఒకనాడు బ్రహ్మ తేజస్సుతో వెలిగి పోతున్న బ్రాహ్మణుడు ఒకడు సభకు వచ్చి అత న్నాశీర్వదించి సత్కారం పొందాక, రాజు అడగగా తన వృత్తాంతం యిలా చెప్పాడు.

" నా జన్మభూమి యిదే నాపేరు యజ్ఞదత్తుడు. చిన్నప్పుడే తల్లితండ్రులని కోల్పోయి, కాశీవెళ్ళి విద్యాభ్యాసం చేశాను. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు .. అన్నిటిలోనూ కొంచెం పాండిత్యం సంపాదించాను.

కాశీలో ఉపాధ్యాయుడి ననిపించుకున్నాను. ధర్మస్వరూపు లయిన మీరు మాదేశం పాలిస్తున్నారని విని దర్శనం చేసిపోవాలని వచ్చాను. మరేమీ పనిలేదు" అన్నాడు.

"విద్వద్వరేణ్యా. మీ విద్యా గుణాలూ జన్మదేశాభిమానమూ మెచ్చదగినది మీరాక మా అదృష్టం. నేటినుంచి మీరు నాకు విద్వాంసులై, మంత్రివై తోడునీడగా మెలగండి" అని ప్రార్థించి, కాలక్రమంలో తన పురోహితుడి పుత్రికయిన సురూప నిచ్చి వివాహం చేశాడు. యజ్ఞదత్తుడు పరమ సంతోషంగా కాలం గడపసాగాడు.

కొన్నాళ్ళ కతని కొక అమ్మాయి పుట్టింది. అత నామెకు శీలవతి అని పేరు పెట్టాడు.

ఒకనాడు ధర్మపాలుని పట్టమహిషి వారింటికి వచ్చి దీపకళికలా వెలుగుతున్న శీలవతిని కన్న తల్లి అదృష్టాన్ని ఎంతగానో ప్రశంసించి - "మా వంటి నికృష్టుల కిలాటి అదృష్టం పడుతుందా?" అని నిట్టూర్చింది.

అందుకు సురూప - "దేవీ! మేము నీవారముకామా! ఈ పిల్లని తీసుకెళ్ళి మీ యింట్లో ఉంచుకోండి. త్వరలోనే మీకు ఆ అదృష్టం కలుగుతుంది" అంది పెద్దమనసుతో.

రాజపత్ని ఆమెను బాలికతో సహావచ్చి కొన్నాళ్ళు తనయింట ఉండమని కోరింది. శీలవతిని లాలించి పెంచడం వల్ల రాణి గర్భవతి అయ్యింది.

అది తెలిసి ధర్మపాలుడనే వర్తకుడు యజ్ఞదత్తుణ్ని కుటుంబంతో సహా తన యింట కొన్నాళ్ళుండి తనకు సంతాన భాగ్యం కల్పించమని ప్రార్థించాడు. అతని కుటుంబాన్నే తన ఇంట పెట్టుకున్నాడు యజ్ఞదత్తుడు. ధర్మపాలుడి భార్య గర్భం దాల్చడంతో... అది తెలిసి వృషాంకు డనే పెద్ద రైతు యజ్ఞదత్తుడి నాశ్రయించి తన భార్యచేత శీలవతికి సేవలు చేయించాడు. అతని భార్య, కూడా గర్భం దాల్చింది. కాలక్రమంలో - రాజపత్ని, వర్తకుని భార్య వృషాంకుడి యిల్లాలు - ముగ్గురూ బాలికలను ప్రసవించారు. ముగ్గురూ శీలవతినే పోలారు. ముగ్గురికీ యజ్ఞదత్తుడే జాతకర్మ మొదలైన విధులు నిర్వర్తించి - రాజపుత్రికకు కళావతి అనీ, వైశ్యపుత్రికకు విద్యావతి అనీ, శూద్రపుత్రికకు రూపవతి అనీ పేర్లు పెట్టించాడు. వారికి యీడురాగానే ఆ నలుగురు బాలికలకీ తానే విద్య నేర్పసాగాడు. ఆ నలుగురూ అతిగాఢమైన స్నేహితులయ్యారు. ఒకరిని విడచి ఒకరు ఉండలేక పోయేవారు.

ధర్మపాలుడు వారికోసం వేత్రవతీ నదీ తీరంలో ఉద్యానవనం కట్టించి, క్రీడా సౌధాలు ఏర్పాటు చేశాడు. వారు నలుగురూ ఆ ఉద్యానవనంలో దేవకన్య కల్లా విహరించేవారు.

*శీలవతి* : ధనపాలుడు విద్యావతికి యీ సంవత్సరం పెళ్ళి చేసేస్తాడట. మా తల్లి - 'శీలవతి దానికంటె కొంచెం పెద్దదేకదా. ఇంకా

పెళ్ళి నిశ్చయించరేం?" అని మా తండ్రి నడిగింది. నాకా మాటలు సరిగా వినపడలేదు కానీ ఎవరినో నిశ్చయించినట్లే ఉన్నారు.

**కళావతి** : మీ పెళ్ళిళ్ళు చాలా విచిత్రంగా ఉన్నాయి వయసు రాకుండానే ... కన్యల యిష్టం కనుక్కోకుండానే పెళ్ళేమిటి? వచ్చిన వాళ్ళు నచ్చకపోతే?

**శీలవతి** : స్వయంవరం రాజులలోనే బ్రాహ్మణ వైశ్యులలో లేదు. తల్లితండ్రులు నిశ్చయించిన వారే అని దర్మశాస్త్రాలలో ఉందట. మనమూ చదివాం. కాని మరిచిపోయాం.

**కళావతి** : అవన్నీ అలా ఉంచుదాం. మనం నలుగురమూ ఒక్కప్రాణంలా ఉన్నాం కదా. మాకు పెళ్ళీకాకుండా మీరు పెళ్ళాడడం ధర్మమేనా?

**శీలవతి** : మే మాడతామని చెప్పామా?

**విద్యావతి** : అక్కలారా! మీ ముగ్గురి పెళ్ళీఅయ్యాక మీ అనుమతితో నేను చేసుకుంటాను.

**శీలవతి** : కళావతీ. నువ్వే మంటావు? మేమూ అలాగే శపధాలు చేస్తాం

**కళావతి** : మననలుగురమూ ఒకేసారి వివాహం చేసుకోవాలని నా అభిలాష

**రూపవతి** . మనలో ఎవరేనా వరుణ్ని వరిస్తే మిగిలిన ముగ్గురి అనుమతీ తీసుకోవాలి. ఇదే నియమం. దీనిని తప్పామో కాశీలో బ్రహ్మహత్య చేసిన పాపమే. ఇందుకు పంచభూతాలే సాక్షి.

అందరూ ఆ మాటలు కంగీకరించి శపధాలు చేసి వెళ్ళారు.

కొన్ని రోజు లయ్యాక యజ్ఞదత్తుడు పాఠశాలలో పాఠం చెప్పాక ... "మీకొక శుభవార్త. మీ సఖురాలు శీలవతికి వివాహం నిశ్చయించబడింది. విద్యావంతుడయిన వరుడు. వివాహం యిక పదిరోజులుంది" అన్నాడు.

**కళావతి** : శీలవతికి వయసురానేలేదు. అప్పుడే వివాహమా! యజ్ఞదత్తుడు వారి ప్రశ్నలకు సమాధానాలు చెప్పి "ఈ శంకలు మానండి. నిన్న శీలవతి కూడా యిలాగే వాదించిందట. బుద్ధిగా ఉండండి." అని వెళ్ళిపోయాడు.

# కాశీమజిలీ కథలు

## 64. వ మజిలీ

శీలవతి, విద్యావతుల వివాహం ఒకే ముహూర్తంలో జరపబడబోతూంది కాని పెళ్ళి కూతు ళ్ళిద్దరూ సాయంత్రం వేత్రవతీ నదిలో జలకా లాడుతూంటే మొసళ్ళు లాగేశాయనే వార్త తెలిసి పౌరులు వీధుల వెంట పరుగెత్తి పోతున్నారు. రాజు, మంత్రులు, పరివారం నది ఒడ్డున నిలబడి దీనవదనాలతో ప్రవాహం వేపు చూస్తున్నారు. ప్రవాహంలో నావలు .. దీపాలు..కొందరు వలలు వేస్తున్నారు కొందరు గొలుసులు వేస్తున్నారు. ఈతగాళ్ళు నదిలో గాలిస్తున్నారు. రాజపుత్రిక కళావతి, రూపవతి ఒడ్డున కూర్చుని విలపిస్తూంటే – రాజు వారిని బుజ్జగించి – "వాళ్ళిద్దరూ ఎక్కడ మునిగిపోయారో చెప్పండి" అని అడిగాడు.

"మేమందరమూ సఖురాళ్ళకు రాత్రి వివాహం జరుగుతుందన్న సంతోషంలో – అలంకరించడానికి పూలు కోసి కోసి చెమలు పట్టగా జలక్రీడలాడదామని వచ్చాం. పెళ్ళికూతు ళ్ళిప్పుడు జలక మాడకూడదని చెప్పినా వినకుండా వాళ్ళు నీటిలోకి దిగారు. మేము వొడ్డునే ఉన్నాం అంతలో – "అమ్మో! నా పాదమేదో పట్టుకుంది" అని అరుస్తూనే శీలవతి మునిగిపోయింది. "మొసలి ...మొసలి.." అంటూ యివతలకి రాబోయి విద్యావతి మునిగిపోయింది. మేము ప్రాణాలకు తెగించి వెదికాం. అదుగో... ఆ మూలనే వాళ్ళు మునిగారు" అని చెప్పింది రాజపుత్రిక.

యజ్ఞదత్తుడూ భార్యా కూతురి గుణాలు తలుచుకుని ఎంతగానో దుఃఖిస్తూంటే – ధర్మపాలుడు వారిని యింటికి తీసుకెళ్ళి ఎంతగానో ఓదార్చి – "కళావతే శీలవతి అనుకుని మీ యింటికి తీసుకుపో. ఎప్పటికేనా వాళ్ళు బ్రతికొస్తారేమో? ఎన్ని కథలు వినలేదు" అన్నాడు.

ఒకనాడు యజ్ఞదత్తుడు – "అమ్మా! కళావతీ. నాశోకం తగ్గించడానికి మీ తండ్రి నిన్ను నా దగ్గరుంచాడు. కాని మిమ్మల్ని

చూసినప్పుడు శీలవతి జ్ఞాపకం వస్తూ విచారం మరింత ఎక్కువౌతూంది. చదువు మానుకుని మీరిక్కడ ఉండడం వల్ల ప్రయోజనం లేదు. చదువు చెప్పడానికి నాకు నోరు రావడం లేదు. మీరు మరోగురువు వద్ద చదువు కొండి. మేము ఏ క్షేత్రానికో పోయి కాలక్షేపం చేస్తాం" అన్నాడు.

అందుకు కళావతి..."తండ్రీ! మా సఖురాళ్ళు బతికే ఉన్నారని మా మనసు చెబుతోంది" అంది. అయినా వారు ఆ బాలికలు మేలుకోకముందే ఊరువిడిచి వెళ్ళిపోయారు.

రెండురోజులకి ధర్మపాలుడు యజ్ఞదత్తుడి కోసం రాగా ఆ యింట్లో ఎవరూ లేరు. వారి గురించి చెప్పగలిగిన వారూ లేకపోయారు. అతను దుఃఖంతో మంత్రులని పిలిపించాడు.

రాజు – "యజ్ఞదత్తుని వృత్తాంతం మీకు తెలుసు. అతని దుః ఖం ఉపశమింప జేద్దామని రూపవతినీ, కళావతినీ వారింట ఉంచితే ... మనకి చెప్పకుండా వారి నత నెక్కడికో తీసుకుపోయాడు. ఇదే కర్మ?"

యజ్ఞదత్తుడి వంటి వాడు ద్రోహం చేయడు. అయినా వారి జాడ వెదికించి యిక్కడికి వచ్చేలా చేయండి. దూతలని పంపండి" అన్నాడు.

చారులు నాలుగు మూలలూ తిరిగి ఒక శివాలయంలో జపం చేసుకుంటున్న యజ్ఞదత్తుణ్ణి గుర్తుపట్టి అతనికి రాజశాసనం చూపించారు. అతనది శిరసావహించి భార్యతో కూడా విశాలపురానికి రాగా, ధర్మపాలుడు ఎదురు వచ్చి సత్కరించి పీఠం మీద కూర్చోబెట్టాడు.

"ఆర్యా, కళావతీ రూపవతులను వెంట బెట్టుకుని ఎక్కడి కెళ్ళారు? ఆ కన్యలూ మీరూ క్షేమంగా వచ్చారా? విశేషా లేమిటి?" అని అడిగాడు రాజు.

అందుకు బదులుగా యజ్ఞదత్తుడు – "మీ బాలికలను మీకు చెప్పకుండా తీసుకెళ్తానా? వాళ్ళు మా యింట్లో ఉండగానే మేము వెళ్ళిపోయాం. వాళ్ళ విషయం నా కేమీ తెలియదు" అనడంతోనే రాజు మూర్ఛపోయాడు

అప్పుడు హితవాది అనే మంత్రి కోపం నటిస్తూ – "వారిని వదిలిపోయానని చెబుతున్నావు. వాది కనిపించడంలేదు. ఎక్కడ దాచావు? నిజం చెప్పు. నీ వల్ల రాజుగారు ప్రమాదంలో పడ్డారు" అని గద్దించాడు. "శివశివా! ఎలాటి మాట విన్నాను! ఎంత పాపి నయ్యాను! కళావతీ, రూపవతులు నాకేం అపకారం చేశారని వాళ్ళకి ద్రోహం చేస్తాను? నా బిడ్డ కన్నా వారు దొడ్డ వారు కారా? అలాటిమాట అనడం కంటె నాకు శిరచ్ఛేదం చెయ్యరాదూ?" అని దుఃఖించాడు.

ఇతర మంత్రు లతను నిరపరాధి అనీ, హితవాదిఅనే మంత్రి మాత్రం అతనుఅపరాధి అనీ వాదించారు. రాజు ఏమీ చెప్పలేక విచారిస్తూ ఉండి పోయాడు."

అంతవరకూ చెప్పి ఆపి తరవాత కథను తరవాత మజిలీలో మణిసిద్ధుడు చెప్పసాగాడు.

# కృత వర్మ గుప్తవర్మల కథ

**ఒ**కనాటి మధ్యాహ్నం రూపవంతు లయిన ఇద్దరు బ్రాహ్మణ కుమారులు బ్రహ్మస్థలం అనే అగ్రహారం పరిసరాలలో నడుస్తూ ఒక బాటసారి ఎదురు పడగా – "ఇక్కడికి గ్రామం ఎంత దూరం? అక్కడ నివసింప దగిన తావు ఉందా?" అని అడిగారు

అతను వారి రూపలావణ్యాలను పొగిడి దగ్గరలోనే అగ్రహారం ఉందనీ, ఆతిధ్య మిచ్చేవారు అక్కడ అనేకు లున్నారనీ చెప్పి వారి వృత్తాంతం అడిగాడు

అందుకు వారు – "మేము బ్రాహ్మణులం. విద్యార్థులమై కాశీవెళ్తున్నాం" అన్నారు. "మీరు నిజంగా విద్యార్థులే అయితే శ్రమపడి కాశీ వెళ్ళక్కర్లేదు. బ్రహ్మస్థలంలో సోమ భట్టారకు డనే కాశీ పండితుడు విద్యార్థులను తన యింట్లో పెట్టుకుని సకల విద్యలూ చెబుతాడు. వేగం వెళ్ళండి" అని వారికి దారి చూపాడు

వారతని యింటికి వెళ్ళగా సోమభట్టారకుడు వారి రూపవిశేషాల కాశ్చర్యపడి వారి కులగోత్రాలవంటి వివరాలడిగాడు.

"ఆచార్యా! మాది దక్షిణ దేశం. ద్విజకుమారులం. విద్యార్థులమై మీవద్దకు వచ్చాం. మమ్మల్ని మీ శిష్యకోటిలో చేర్చుకొండి" అని వారతన్ని వినయంగా ప్రార్థించారు

అతను వారి విద్యలను కొంత పరీక్షించి తన శిష్యులకు గురువులుగా ఏర్పాటు చేసి తాను వారికి విద్యారహస్యాలు చెప్పసాగాడు

కొన్నాళ్ళు అలా గడిచాక ఆచార్యుడు వారినొక రహస్యస్థలానికి తీసుకెళ్ళి - "మీరు నా దగ్గరకు వచ్చి స్వల్పకాలమే అయినా మీ నైపుణ్యమూ, విద్యా, గుణాలూ, గౌరవమూ ప్రశంసింప దగినవిగా ఉన్నాయి. మిమ్మల్ని చూసిన వారు చక్రవర్తి కుమారులనే అనుకుంటారు మీరు నా దగ్గర విద్యావిశేషాలాట్టే గ్రహించక పోయినా నా శిష్యులే అయ్యారు. మీరు నాకొక ఉపకారం చెయ్యాలి. అది ఉపేక్షించానో చాలా కష్టం వస్తుంది. ఉపాయంతో తప్ప సాధించ లేనిది. అతి రహస్యమైనవి. మీరు పూసుకుని చేస్తామంటేనే చెబుతాను." అన్నాడు.

"ప్రాణాలిచ్చి అయినా చేస్తాం" అన్నారు వారు వినయ విధేయతలతోనూ, భక్తితోనూ. అప్పు డతనిలా చెప్పాడు.

## సత్యవతి కథ

"**నా** పూర్వపుణ్య మెలాటిదో కాని నాకు లేక లేక ఒక ఆడపిల్ల పుట్టింది. అది మిక్కిలి కురూపి కావడం వల్ల చింతిస్తూ - సత్యవతి అని పేరు పెట్టాను. తల్లితండ్రులకే అసహ్యం కలిగించే అంత అనాకారి అది. దానికిప్పుడు వివాహ వయసు మించి పోతూంది. దీనిని యితరులు చూడకుండా కాపాడుతూ వచ్చాను. నా గౌరవాన్ని బట్టి విద్యాభాస్కరు డనే బ్రాహ్మణ కుమారుడు దానిని పెళ్ళాడ్డాని కంగీకరించి వెళ్ళాడు. వచ్చే నెలలోనే ముహూర్తం. అతనికేం చెప్పారో, పిల్లని చూడడానికి వస్తున్నా నంటూ జాబు రాశాడు. దానిని చూస్తే అతను

పెళ్ళాడ డనేది నిశ్చయం దాని కేదేనా ప్రతిక్రియ చెయ్యాలి కదా? మీ దేశాచారాలు నాకు పనికొస్తున్నాయి. స్త్రీలవలె మీరు శిరోజాలు పెంచుకున్నారు మీ ముఖాలు ముగ్ధ మనోహరంగా ఉన్నాయి కాబట్టి – మీలో ఒకరు స్త్రీ వేషం వేసుకుంటే సత్యవతి అని చెప్పి అతనికి చూపిస్తాను. అతను సంతోషిస్తాడు తరవాత మరో మార్గంలో కార్యం సాధిస్తాను "

" ఆర్యా. మీ కార్యం సాధించడానికి మేమేమయినా చేస్తాం. సందేహించకండి పెళ్ళి చూపులకీ, పీటల మీద కూర్చోడానికీ నేను స్త్రీవేషం ధరిస్తాను. అత్తారింటి కెళ్ళాక ఆమే నేనని నమ్మించడం ఎలా?"అన్నాడు గుప్తవర్మ

"పెళ్ళయిన కొన్ని నెలలకు దానికి స్ఫోటకం వచ్చి వికృతరూపం కలిగిందని మారుమాట చెబుతాను" అంటూ అతను వారికి చేయవలసిందంతా చెప్పాడు.

పిల్ల సౌందర్యం చూసి పెళ్ళికొడుకు ఎంతో ఆనందించి వెళ్ళాడు. సోమభట్టారకుడు వైభవంగా పెళ్ళి ఏర్పాట్లు చేశాడు. కపట సత్యవతి చేత గౌరీపూజ చేయించి ... ఆ గంపని చీకటిగదిలోకి తీసుకెళ్ళడం తమ ఇంటి ఆచార మన్నాడు. పురోహితుడు ముహూర్తం వేళమించి పోతూందని తొందరపెట్టగా – చీకటి గదిలో ఏ గంపలో సత్యవతి ఉన్నదో తెలియక ఒక గంపను మోసుకుచ్చేశారు. పెళ్ళికూతురు తలవొంచుకునే కార్యక్రమాలు చేసింది.

అప్పుడు సోమభట్టారకుడు – మంగళ సూత్రం కట్టబడిన గుప్తవర్మ ముఖం చూశాడు. తల్లడిల్లి పోతూ చీకటి గదిలోకివెళ్ళి గంపలో తడిమి – "నువ్విక్కడే ఉన్నావా, తల్లీ?" అనగా, "నన్నెవరూ తీసుకుపోలేదు" అందామె.

సోమభట్టారకుడు ఆమెకు పెళ్ళి చెయ్యలేక పోయిన తన దౌర్భాగ్యానికీ ఆమె దురదృష్టానికీ విచారిస్తూనే మిగిలిన కార్యక్రమాలలో పాల్గొన్నాడు. నాలుగురోజులు జరిగా యవి. ఆ రహస్యం ఎవరికీ తెలియదు.

నాకబలి అయ్యాక అతను ఒకచోట కూర్చుని ధ్యానించు కుంటూంటే ఒక శిష్యుడు వచ్చి – "స్వామీ! యజ్ఞదత్తుడట, మీ

సహాధ్యాయుడట. కాశీకి వెళ్తూ భార్యతో వచ్చి ఉన్నాడు మిమ్మల్ని చూడాలంటున్నాడు" అన్నాడు.

అతను అంతామరచి సంతోషంతో యజ్ఞదత్తుణ్ని కౌగలించుకుని - "కాశీనుండి వచ్చాక నీ కథే తెలియలేదు. ఎక్కడుంటున్నావ్? పిల్లలెందరు? మన సహాధ్యాయుడు విద్వత్కేసరి కథేమయినా తెలిసిందా?" అంటూ పూర్వ విషయా లడిగాడు.

"ఇప్పటి నా స్థితి మానవ మాత్రుడికి కలగదు. నేను పాపాత్ముణ్ని. అదెందుకులే. నువ్వు అదృష్టవంతుడివి. నీ వృత్తాంతం చెప్పు" అన్నాడు యజ్ఞదత్తుడు.

సోమభట్టారకుడు బలవంతం చేయగా తన కథ చెప్పాడు. అది విని ఎంతో విచారించాడు. యజ్ఞదత్తుడు ఈ పెళ్ళి కూతుర్ని చూస్తా నన్నాడు. తన మిత్రుడే అనీ సిగ్గుపడక అతని ముందుకు రావచ్చుననీ కబురు పంపగా - శిష్యుడు గురువుతో రహస్యంగా "పెళ్ళి కూతు రెక్కడ దాగుందో? ఎంత వెతికినా కనపడలేదు" అన్నాడు.

గుప్తవర్మ, కృతవర్మ కూడా కనపడ్డంలేదు. భార్య నడిగితే తనకేమీ తెలియ దంది అంతలో ఏవో కేకలు వినపడగా - అదేమిటో కనుక్కురమ్మని శిష్యుణ్ని పంపాడు. అతను వెళ్ళి వచ్చి - "దేవి అమ్మగారి నావహించింది. పెళ్ళి కూతురి రూపు మారిపోయి చాలా అసహ్యంగా ఉంది." అని చెప్పడంతో వాళ్ళిద్దరూ లోపలికి పరుగెత్తాడు.

అతని భార్య తలవిరగ బోసుకుని ... శివమాడుతూ... భట్టారకుణ్ని చూసి - "ఓరీ! మూర్ఖుడా! చిరకాలం నుండి నిన్ను కాపాడుతున్న కులదేవతనే మరచిపోతావా. నీకు ప్రాయశ్చిత్తం చేశానులే. చూసుకో" అంటూ సత్యవతి నతని ముందుకు తోసింది.

"ఇదెవతె?" అంటూ అతను భయపడుతూంటే - "నీ కూతురే. కోపంతో యిలా చేశాను" అంది.

అప్పుడతను - "తల్లీ! రక్షించు. అపరాధం చేశాం. బిడ్డ మీద తల్లి కోపిస్తుందా? నా చక్కని కూతురి నివ్వు నువ్వు చెప్పినట్లు చేస్తాం" అని అనేకవిధాల బతిమాలాడు" ఆ వార్త తెలిసివచ్చిన పెళ్ళికొడుకు సత్యవతి వికృత రూపం చూసి దుఃఖిస్తూ తనుకూడా దేవిని ప్రార్థించాడు.

అప్పటికి వారి ప్రార్థనల నంగీకరించినట్లు కొంచెం శాంతించి ఆ యిల్లాలు – "మూర్ఖులారా! మీరు పండితులైనా పామరుల్లా నన్ను మరిచారు. మొదటి తప్పుగా మన్నిస్తున్నాను. జాగ్రత్తగా విని నేను చెప్పినట్లు చెయ్యండి.

ముందుగా నన్ను పూజించి సత్యవతికి మళ్ళీ పాణిగ్రహణ విధి అంతా జరిపించండి. వివాహ దీక్ష అనంతరం నీ పుత్రిక మునపటి రూపు పొందుతుంది. ఏ మాత్రం తేడా వచ్చినా సహించను" అంది.

విద్యాభాస్కరుడు – "అమ్మయ్య! అమ్మవారికి దయ కలిగింది. మామగారూ! ఇకలెండి. మళ్ళీ వివాహమహోత్సవం చేసుకుందాం" అన్నాడు సంతోషంగా.

సోమభట్టారకుడు గృహదేవతని ఆరాధించి మళ్ళీ పెళ్ళి తంతు అంతాజరిపించాడు. విద్యాభాస్కరుడు సత్యవతి మెడలో మంగళసూత్రం కట్టి భార్యగా స్వీకరించాడు.

దీక్ష అయ్యాక సత్యవతి రూపం ఎలా మారుతుందో చూద్దామని బంధువు లందరూ ఉండిపోయారు. మామా, అల్లుడూ కులదేవతను ప్రార్థిస్తూ, సత్యవతి రూపమిమ్మని ప్రార్థించారు. భట్టారకుడి భార్య మళ్ళీ శివమెత్తుతూ – "మూర్ఖుడా! పండితుడివైనా నా మహిమను తెలుసుకోలేక పోయావు. క్షుద్రదేవతలా పూజించి చాలా అనాచారాలు చేశావు. నాకు నీమీద దయ కలగదు. నీ కూతు రీ జన్మంతా యిలాగే ఉంటుంది. ఫో" అంది.

అప్పుడతను గోలుగోలున ఏడుస్తూ – "అయ్యో! నా పుత్రిక యిలా వికృతంగా ఉంటే ఎవరు భరిస్తారు? దీని బతుకెలా గడుస్తుంది? దీనికి దిక్కెవరు?" అంటూంటే – అల్లు డతని చేతులు పట్టుకుని, "మామగారూ! దుఃఖించకండి. కట్టుకున్న వాడిని కనుక దీని భారమంతా నాదే. దైవికానికి మనమేం చెయ్యగలం? దీనిని ప్రేమగా చూసుకుంటాను" అని ప్రమాణం చేశాడు.

యజ్ఞదత్తుడు – 'నేనెక్కడికి వస్తే అక్కడే కష్టాలు వస్తున్నాయి' అనుకుని భట్టారకుణ్ణిఓదార్చి తాను భార్యతో వెళ్ళిపోయాడు.

# కాశీమజిలీ కథలు

## 65. వ మజిలీ

### శశాంక మకరాంకుల కథ

"రూపవతీ! మనం యిల్లు వదిలి మూడు రోజులయింది. చాలా దూరం వచ్చాం. కాని గురువుగారు, వారిభార్య కనపడలేదు. మన సఖురాళ్ళు మనకోసం చూస్తూంటారు. మనం వస్తామన్న రోజు దాటిపోయింది. వాళ్ళేం చేస్తారో? మనం ఒకరినొకరం కలుసుకోలేక చిక్కులు పడతామేమో. వాళ్ళు పెళ్లి చేసుకోబోతూంటే వారించి యిలా చేస్తున్నాం! పుత్రికా శోకంలో ఉన్న గురువు నోదార్చలేక పోయాం. తరవాతయినా తండ్రికి చెప్పకుండా – లోక విరుద్ధంగా యిల్లు వదలి వచ్చాం. ఇదంతా దైవ మాయలా అనిపిస్తూంది. ఇంటికి పోడం మంచిదేమో" అంది కళావతి.

"మన ప్రయత్నం నిర్ధకమే అయినా యిప్పుడు పశ్చాత్తాపపడి ప్రయోజన మేమిటి? ఇప్పుడింటికి వెళ్తే ప్రజలూ బంధువులూ నిందిస్తారు. మనకలాటి బుద్ధి పుట్టించిన దేముడు నడిపించేటట్టే నడుద్దాం. తూర్పుదిశగా పోయి స్నేహితురాళ్ళని కలుసుకుని దేశాటనం చేద్దాం. పురుష వేషాలలో ఉన్నాం కనక మననెవరూ గుర్తు పట్టలేరు. నీపేరు శశాంకుడు. నాపేరు మకరాంకుడు." ఉత్సాహంగా చెప్పింది రూపవతి.

"యౌవనంలో అడుగు పెడ్తుతున్న మనల్ని అంతఃపురంలో బంధించేవారీపాటికి. దేశాలెలా చూడగలుగుతాం? ఒక విధంగా యిదీ మంచిదే. మనకిక నడకే శరణ్యం. తూర్పు వేపున అరణ్యా లెక్కుంటారు. కాని మనం ముందు అటే అని చెప్పాం కనక మనమూ అటు వెళ్ళవలసిందే. పద" అంది కళావతి.

ఇద్దరూ సాయంకాలం వరకూ నడచినా, అడవి దట్టమయిందే తప్ప గ్రామమేదీ కనిపించలేదు. రాత్రి గుండె రాయి చేసుకుని ఒక చెట్టుకింద పడుకున్నారు. అలా నాలుగు రోజులు నడచినా వాళ్ళకి అంతూదరీ కనిపించలేదు. ఆహార పదార్థా లయిపోయాయి. పాదాలు బొబ్బలెక్కాయి. వాళ్ళు చాలా అలసిపోయారు. కళావతికి అధైర్యం ఏర్పడింది. కాని రూపవతి ఆమెను ప్రోత్సహించి, పళ్ళుకోసి తినిపించింది. అంతలో –

ఒకవేపునుంచి 'కొట్టండి.. పొడవండి..' అంటూ కేకలు వినిపించాయి. ఒక పంది అటువేపు పరుగెత్తుకు వచ్చి రూపవతిని వెంట తరిమింది. అది దాని కందక ఒక మానుచుట్టూ తిరుగుతూంటే కళావతి ఒక బడిత తీసుకుని పందిని బెదిరించ సాగింది. రూపవతి అలసిపోయి నేల మీద పడిపోగా ఆ వరాహం ఆమె వీపుమీద గోళ్ళు నాటి – కళావతి బడితెతో కొట్టడంతో పారిపోయింది. రూపవతిలో చలనం లేకపోవడంతో కళావతి ఆమె మరణించిందని విలపించింది. కాని.. కొంత సేపటి కామె కళ్ళు తెరచి దాహం అని సూచించింది.

నీటికోసం ఎంతో దూరం తిరిగి తిరిగి కళావతి తాను వచ్చిన తోవ మరచిపోయింది. అటూ యిటూ తిరిగి చివర కొక చెట్టెక్కి నాలుగు మూలలా చూసింది. దూరంగా వేటగాళ్ళ సందడి వినపడింది. వెళ్ళి – వారిలో కలసి పోయింది.

విశాలమైన ఎడారిలో అనేక గుడారాలు వేయబడి ఉన్నాయి. చుట్టూ సైన్యం ఉంది. ఆమె "దాహం దాహం" అని అరవగా కిన్నరదత్తుడనే ఆ రాజు విని తనవద్దకు తీసుకు రమ్మన్నాడు. అతను – బాలుడా! ఎక్కడి వాడివి? ఇక్కడి కెందు కొచ్చావు? నీ వృత్తాంత మేమిటి?" అని అడిగాడు.

"దేవా! బ్రాహ్మణ కుమారులం యిద్దరం కాశీలో విద్యాభ్యాసం చేసి యింటికి పోతూ యీ అడవిలో పడ్డాం. నా మిత్రుడు వరాహం చేత దెబ్బతిని మూర్ఛలో ఉన్నాడు. అతనికి వెంటనే నీరివ్వకపోతే బతకడు. నాపేరు శశాంకుడు. ఒక పాత్రతో జలమిస్తే అతన్ని రక్షించుకుంటాను.

ప్రాణాలైనా వదులుతాను కానీ అతని దాహం తీర్చకుండా నే నేమీ తీసుకోను. ఆ ప్రదేశం యిక్కడికి చాలాదూరం. ఎప్పుడు పోతానో? ఎప్పుడు చూస్తానో? ..మళ్ళీ కనిపిస్తాడా?" అంటూ మూర్ఛ పోయింది.

రాజు మకరాంకుడిని వెదకడానికి యిద్దరు రౌతులను పంపాడు. కాని ఎంత వెతికినా ప్రయోజనం లేక సంధ్యవేళకి వాళ్ళు తిరిగొచ్చేశారు.

రాజు – " ఈ బ్రాహ్మణ కుమారుడు చాలా సుకుమారుడిలా ఉన్నాడు. ఎంత సేద తీర్చినా తెలివి రాలేదు. వైద్యులు పరీక్షించి చాలా రోజులనుంచి నిద్రాహారాలు లేక ఉన్నాడన్నారు. ఇతను గుణసంపన్నుడని మాటలే చెప్పాయి. మిత్రుడికోసం దాహం కూడా తీసుకోలేదు. ఇత నన్నట్లు ఆ మకరాంకుడు క్రూరజంతువుల బారిన పడి ఉంటాడు. ఇతన్ని మన పట్నం తీసుకెళ్ళి ఉన్నత దశ కల్పిద్దాం. ఇవాళ రాత్రే ప్రయాణం పెట్టించండి" అన్నాడు మంత్రులతో.

శోభావతి అనే తన రాజధానికి వెళ్ళాక శశాంకుడి పల్లకీని కూడా అంతఃపురానికి తీసుకు పోయి. కిన్నరదత్తుడు తన భార్యతో – "దేవీ! ఇతని పేరు శశాంకుడు. వీని సౌందర్యం, విద్యలు, సుగుణాలు చాలా గొప్పవి. దైవికంగా దారితప్పి మనసేనలో చేరాడు. సంతానం లేని మనకు యితనిని దైవమే యిచ్చాడు. నా రాజ్యం వీడి అధీనం చేస్తాను. నువ్వు మీ అన్న కూతురు తారావళిని పెంచుతున్నావు కదా. ఈ సుగుణవంతుడి కామె నిచ్చి పెళ్ళిచేసుకో. అన్నీ ఆలోచించే యిలా చేయదలుచుకున్నాను." అన్నాడు.

ఆమె కూడా చాలా సంతోషించింది. శశాంకుడికి ఆమె పరిచర్యలు చేస్తూంటే – "హా! రూపవతీ! సఖీ!" అని పలవరించడం విని ఆశ్చర్యపోయింది

నాలుగోనాడు శశాంకుడికి స్పృహ వచ్చింది కళ్ళు తెరిచి – ఎదురుగా ఉన్న రాజపత్నిని చూసి – "అమ్మా! మీ రెవరు? నే నిక్కడి కెలా వచ్చాను? ఇది కలా? నిజమా?" అని అడిగేసరికి – "నువ్వు

నన్ను అమ్మా అని పిలిచావు కదా. నీకు నేను అమ్మనే. నువ్వు నా కొడుకువి. ఈ తారావళి నీ భార్య. నువ్వు చాలా అలసిపోయి ఉన్నావు. తరవాత చెబుతాలే" అంటూ మధుర పదార్థా లందించింది.

అతనికి కొంచెం ఓపిక రాగానే గతం గుర్తుకొచ్చి రూపవతి కోసం పరుగెత్త బోగా ఆ తల్లి అతన్ని ఆపింది. అతను తన మిత్రుడి గురించి చెప్పగా – రాజునుంచి ముందే విన్న దవడంవలన – "నీ మిత్రుడికోసం మా దూతలను పంపారు. ఇక్కడికే వస్తాడు. విచారింపకు" అంది. అంతలోనే రాజు అక్కడికి వచ్చాడు.

శశాంకుడు అతనిని గుర్తుపట్టి – "తండ్రీ! నా సఖునకు నీళ్ళు పంపారా? అతనే మయ్యాడు?" అని ఆత్రంగా అడిగాడు.

"వత్సా! మా రౌతు అతనిని వెదకి పట్టి దప్పిక తీర్చి అతని మిత్రుడున్న చోటుకి తీసుకెళ్తానని ఎంత చెప్పినా వినకుండా మరోతోవను పోవాలని ప్రయత్నించాడట. 'నువ్వీ అడవిలో నడవలేవు. గుర్రంమీద కూర్చో. అడవిదాటిస్తాను:' అని అతన్ని అరణ్యం దాటించాడట. నువ్వు అతని కోసం చింతించనక్కరలేదు" అన్నాడు రాజు.

'స్నేహితుడు ఆపదలో ఉండగా వదిలివచ్చిన నన్ను కృతఘ్నుడిగా భావించి ఉంటాడు. మరొకరిని పంపితే సహిస్తాడా?' అనుకుని – రాజుతో 'దేవా! మీరు నాకు ప్రాణదానం చేశారు. జీవితాంతం కృతజ్ఞుడినై ఉంటాను. ఇక పోయి వస్తాను. శల విప్పించండి" అన్నాడు. అప్పుడు కిన్నెరదత్తుడు – "శశాంకా! నీ లక్షణాలన్నీ సార్వభౌమత్వం సూచిస్తున్నాయి. నాకు సంతతి లేదు. నిన్ను పుత్రుడిగా భావించి రాజ్యం యిచ్చేశాను. నేను వృద్ధుడి నవడం వల్ల రాజ్యపాలన చెయ్యలేను. నువ్వు చిన్నవాడివైనా నీ బుద్ధి బలం పెద్దది. నీ గుణాలు విని ప్రజలు నిన్ను రాజుగా కోరుకున్నారు. తారావళి నీకు పట్టమహిషి కాగలదు. స్వస్థుడవై రాజ్యం ఏలుకో" అన్నాడు. శశాంకుడెన్ని అభ్యంతరాలు చెప్పినా రాజుయుక్తిగా ఖండించి వేయడంతో – ఏ ఉపాయమూ తోచక – తరవాత చూసుకుందాం – అని శశాంకుడు తలవంచాడు.

రెండు మూడు రోజులకే ఆ రాజు పాము కరచి చనిపోతూ అందరినీ రప్పించి శశాంకుడిని రాజుగా అప్పగించి కన్నుమూశాడు.

శశాంకుడు రాజ్యభారం వహించి చక్కగా పాలిస్తూ కొద్దికాలంలోనే చాలా విఖ్యాతి సంపాదించాడు.

కిన్నరదత్తుడి భార్య - " వత్సా! శశాంకా! నువ్వు చక్కగా రాజ్యం చేస్తూ మీ తండ్రి కీర్తి పెంచావు. ప్రజలు చాలా సంతోషిస్తున్నారు. అదలా ఉండనీ. నా అన్నకూతురు తారావళిని తల్లిలేనిదని పెంచి పెద్ద చేశాను. దాని గురించి నీ కిదివరకే చెప్పాను. రాజుగారు అది నీ పట్టమహిషని చెప్పి ఉన్నారు. కనక పెళ్ళాడి గృహస్థుడివవు. నేను చాలా సంతోషిస్తాను" అని ఉత్తరం రాసి పంపగా శశాంకుడు తన గతం తలుచుకుంటూ ఆమెకు జవాబు రాసి పంపి - 'రాజ్యమదంలో ఆడదానిని మగరూపుతో రాజ్య మేలుతున్నాననే మరచి పోయాను. ఇప్పుడు పోయి స్నేహితురాళ్ళని కలుసుకుందామన్నా యీ రాజ్యబంధం కదలనివ్వదు. సరే. వారినే యిక్కడికి రప్పించేందుకు ప్రయత్నిస్తాను' అని ఒకపత్రికలో

**పిన్నపాపవలన కన్నెలు ముల్వురు**
**కలిగి రట్టివారు కన్మొరంగి**
**దెసల ౕ గొసలం దెలియ తిర్శుగుచు నున్నారు.**
**వారి జాడ తెలియవలయు మాకు**

అని పద్యం రాయించి కింకరుల కిచ్చి - "దేశదేశాలూ తిరుగుతూ ఈ పద్యం చదవండి దీని కెవరేనా స్వానుభవంగా జవాబుచెబితే సగౌరవంగా మా వద్దకు తీసుకురండి" అని పంపించింది.

# కాశీమజిలీ కథలు

## 66. వ మజిలీ

కేసరుడనే భిల్లుడు నీటితో నిండిన వెదురు బొంగును భుజానికి తగిలించుకుని, ఆ దారిన పోతూ దాహంతో కొట్టుకుంటున్న మకరాంకుణ్ని చూసి ఆశ్చర్యపడుతూ అతని నోటికి నీరందించాడు. ఆనీరుతాగి ...లేచి కూర్చుని అతను కళ్ళునులుముకున్నాడు. భిల్లు డతని వృత్తాంతం అడగగా – “మహాత్మా! నువ్వు నాకు ప్రాణదానం చేశావు” అంటూ తన వృత్తాంతం చెప్పాడు. ఆ బోయవాడు – “ఒక్కడివీ యిక్కడుండలేవు. మా యింటికి రా.. రేపు దారిచూపుతా” అంటూ అతన్ని తనింటికి తీసుకువెళ్ళాడు.

పులితోళ్ళు...మొదలయిన చర్మాలతో అలంకరించబడిన ఆ బోయపల్లె, వెదురు తడకలతో నిర్మించబడిన గుడిసెలు కలిగి చక్కగా ఉండి మకరాంకుణ్ని ఆకర్షించింది. వారికి విద్యలేక పోయినా చక్కని రూపమూ స్వభావమూ కలిగి ఉన్నారని సంతోషించాడు.

ఆ బోయవాడు తన గుడిసె ముందు నిలబడి – “పింగళికా!” అని పిలవగానే వాని భార్య తడిక తెరుచుకుని వచ్చి అతనికి నమస్కరించి – “ఈ బాలుడెవరు?” అని అడిగింది. అతనొక బాటసారని చెప్పి, “వేగంగా వెదురుబియ్యం వండిపెట్టు చాలా ఆకలిగా ఉన్నాడు” అన్నాడు బోయవాడు. ఆమె క్షణంలో వంటచేసి తేనె, పండ్లు మొదలైన వాటితో చక్కని భోజనం పెట్టడం చూసి – వాళ్ళ సంస్కారస్వభావాలను ప్రశంసించాడు. ఆ యిల్లాలు – “మమ్మల్ని పొగుడుతున్నావా! చాలుచాలు. మాకూ మృగాలకీ తేడాలేదు. నాకొక కొడుకున్నాడు, అడవికి పోయాడు” అంటూండగానే పులిపిల్లని వింటికి తగుల్చుకుని బోయపిల్లడు వచ్చాడు. ఆ తల్లి – “ఈ పిల్లనెందుకు చంపావు! దీనికోసం దీనితల్లి ఎంతవిచారిస్తూందో! మృగాలని చంపకూడదని నేను చెప్పింది మరిచావా?” అంటూ మందలించింది.

"నీ మాటలు మరుస్తానా? ఈ పులిపిల్ల తల్లితో విడిపోయి నాకడ్డంపడడం మొదలెట్టింది. నేనెంత తప్పించుకో చూసినా నా మీదకు గెంతుతూ పరాక్రమం చూపసాగింది. ప్రాణసంకటంగా పరిణమించే సరికి చంపక తప్పింది కాదు. తప్పా? చెప్పు" అన్నా డా కుర్రవాడు.

వారి మాటలు వింటున్న మకరాంకుడు – "ఈ మహారణ్య మధ్యంలో, పచ్చి మాంసం తినే కిరాతకులలో యిలాటి గుణవంతు లుండడం ఎంతాశ్చర్యం! ఈ కుర్రవాడు సార్వభౌములయింట్లో పుట్టవలసిన వాడు. చక్కని రూపవంతుడు కాని విద్యాగంధం లేనట్లు కనిపిస్తున్నాడు చూద్దాం" అంటూ వాడిని పిలిచి "నీ పేరేమిటి?" అని అడిగాడు.

తల్లి అనుమతితో – "సత్వవంతుడు." అని చెప్పాడు వాడు. "చదువుకున్నావా?" అంటే – "అదేమిటి?" అని ఆశ్చర్యంగా చూశాడు. వాడు భోజనం చేశాక మకరాంకుడు విద్యగురించి విశేషంగా చెప్పి వాడికి విద్యలో ఆసక్తి కలిగించాడు.

అదిమొదలు సత్వవంతుడతనిని విద్య చెప్పమని వేధించ సాగాడు. మకరాంకుడు బోధించ సాగాడు. ఏకసంతగ్రాహి అయిన ఆ శబర కుమారుడు గురువుకి వచ్చిన విద్యలన్నిటినీ ఏడాదిలోపే గ్రహించేశాడు. ఆవేళ మకరాంకుడు వింటూండగా – తల్లితండ్రులతో – "భూమి మీద ఎన్నో వింత లున్నాయి. మనం విద్యలేక పశుప్రాయులమై యీ అరణ్యంలో పడున్నాం. విద్యలేనివాడు కళ్ళున్నా గుడ్డివాడే. ఈ మహాత్ముడి దయ వలన నేను సకల విద్యామర్మాలూ తెలుసుకున్నాను. మనమిక యిక్కడ ఉండక్కర్లేదు. జనపదాలకి పోదాం" అన్నాడు. "నా విద్యలతో మిమ్మల్ని రాజతుల్ని చేస్తాను.

అందుకా శబర దంపతులు నవ్వుతూ – "ఆ పాడుపట్నా లొకసారి చూశాం. చాటూ, మాటూ ఉండవు. వాకిట్లో నిలబడ నివ్వక పొండి పొండి అంటారు. ఎక్కడ చూసినా మనుషులే. ఆ చికాకు కంటె యీ అడవే స్వర్గం" అన్నారు.

"నేనొకసారి పట్నం చూసివస్తాను" అని వాడంటే మకరాంకుని కప్పగించి పట్నంచూపించి రమ్మన్నారు.

మకరాంకుడు ఆనందంతో మర్నాడు సత్యవంతుడితో ఎనుబోతుల మీదెక్కి అరణ్యాలు దాటి జనపదాలు చూసుకుంటూ ఒకనాడు మధ్యాహ్నానికి శోభావతి అనే పట్నంచేరి అక్కడి బజార్లలో తిరగసాగాడు.

సత్యవంతుని విల్లమ్ములు చూసీ అతనిరూపం చూసీ ప్రజలు ఆశ్చర్యపడసాగారు. కొందరు రాజభటులు యుద్ధసన్నాహంతో వచ్చి ... సత్యవంతుణ్ని చూసి - "నువ్వెవరివి? వీరుడివా? లేక పిట్టలు కొట్టేవాడివాడివా?" అని పరిహాసంగా అడిగారు. అతను కోపగించి - "నేను వీరుడిని కాని మిమ్మల్ని పిట్టలని కొట్టినట్లు కొట్టగలను" అన్నాడు. వారు మరింత కోపంగా "నీచుడా! మేం రాజుగారి సైన్యంలో ప్రధాన వీరులం. యుద్ధానికే వెళ్తున్నాం. మాకు మొక్కు. లేకపోతే నీ శిరస్సును భూత బలిగా యిస్తాం" అని గద్దించారు.

దానితో అతనికి కోపమెచ్చి నారిసంధించి పది బాణాలు వేసి వారిని నలువైపులకూ పరుగెత్తించాడు. ఆ విషయంవిన్న రాజు - "అలాటి వీరుడు మీద కోపగించ కూడదు. అత నర్జునుడి వంటివాడు కాకపోతే ఒక్కడూ పదిమందితో ఢీ కొంటాడా?" అని మంత్రులకి చెప్పి అనునయంగా అతణ్ని తీసుకు రమ్మన్నాడు.

మంత్రులు వెళ్ళగా - "నామిత్రు డేదో పనిమీద వెళ్ళాడు. అతనొచ్చాక వస్తాను. అతని కిక్కడ జరిగింది తెలియదు" అంటూ సత్యవంతుడు వారితో మాటలలో పడ్డాడు.

ఎంత సేపటికీ మకరాంకుడు రాకపోడంతో - గౌరవనీయులు తనకోసం నిరీక్షిస్తున్నారన్న మొహమాటంతో, వేగం వచ్చేద్దామని వారివెంట రాజుగారి వద్దకు వెళ్ళాడు.

శశాంకుడతన్ని దూరంనుంచి చూసే మోహపరవశు డయ్యాడు. కాని ఆ వికారం బయటకు తెలియనివ్వక ఎదురునడిచి గౌరవిస్తూ పాణిగ్రహణం చేసి పీఠం మీద కూర్చోబెట్టి తానుఎదురుగా కూర్చున్నాడు. మంత్రులు అతని గుణగణాలని శ్లాఘించారు.

అప్పుడు శశాంకుడు "మహారాజా! ఇక్కడికి పదియోజనాల దూరంలో సౌగంధిక మనే నగరం ఉంది. దానిరాజు ప్రభాసాగరుడు

మా తండ్రి కత్యంత ప్రీతిపాత్రుడు. అతనిమీదకి చాలామంది రాజులు యుద్ధానికి రాబోతున్నారంటే మేమిప్పుడు కొంతసైన్యం పంపుతున్నాం. నువ్వు సర్వసేనానాయకుడివై అక్కడి వెళ్ళి శత్రువులని జయించి రా" అంటూ పొగిడాడు.

అతనంగీకరించేసరికి సర్వసేనాధిపత్యానికి పట్టాభిషిక్తుణ్ని చేసి, ఒక గొప్పగుర్రాన్నిచ్చాడు. సత్యవంతుడు రాజాజ్ఞతో శుభముహూర్తంలో సేనలతో సహా బయలుదేరాడు. ఆ హడావిడిలో...అతనికి మకరాంకుని మాటే గుర్తులేదు

వాళ్ళు వెళ్తుండగా సౌగంధిపురం నుంచి రాజప్రముఖులు కొంద రెదురొచ్చి – నమస్కరిస్తూ – "దేవా! మాప్రభువు మీ రాకకోసం ఎదురు చూస్తున్నారు. రాజపుత్రు లందరూ ఏకమై వచ్చి ప్రభాసాగరుడితో యుద్ధంచేస్తున్నారు. సముద్రంలా ఎగిరి పడుతున్న శత్రుసేనల నెదిరించే సైన్యం మావద్దలేదు. మిమ్మల్ని వేగంగా తీసుకురమ్మని మమ్మల్ని పంపారు. లెండి" బయలుదేరండి అన్నారు.

సత్యవంతుడు చిరునవ్వుతో – "మీరాజు కేమీ ఫరవాలేదు. నేను వచ్చి విజయం కలగజేస్తాను. కాని...మీరాజుకు అందరితో వైర మెందుకు కలిగింది?" అని అడిగాడు.

దూతలు ఆ వృత్తాంతం చెప్పసాగారు.

## సౌగంధిక కథ

మా ప్రభువుకి లేకలేక కలిగిన సంతానం సౌగంధిక. ప్రాయం వచ్చేసరికి ఆమె అత్యంత సౌందర్యవతిగా ప్రసిద్ధి చెందింది. ఎందరు రాజకుమారుల చిత్రపటాలు తెప్పించి చూపించినా పరిహాసపూర్వకంగా నిరసించేది. చివరకు ఎలాగో ఒప్పించి స్వయంవరం చాటించగా వేలకొద్దీ రాజకుమారులు తరలి వచ్చారు.

ఆమె వారి వివరాలు వింటూనే, వారిని చూస్తూనే, సభాభవనం దాటిపోయి, ఒక అశోక వృక్షం కింద ఆ స్వయంవరం వింత చూస్తూ నిలబడిన విప్రకుమారుణ్ని ఓరగా చూస్తూనే – అతని వివరాలు కూడా

అడక్కుండా అతని మెడలో చటుక్కున వరమాల వేసేసింది. లేచినవేళ మంచిదికావడం కంటె అతనిలో గొప్పతన మేమీలేదు.

అతనొక బ్రాహ్మణ కుమారుడు. విద్యార్థిగా కాశీపట్టణానికి వెళ్తున్నాడు. రాజు, జరిగిన సంఘటనకు యువరాణీని ఏమీ అనలేక పోయాడు. కాని స్వయంవరానికి వచ్చిన రాజకుమారు లందరూ కోపంతో ఏకమై నగరాన్ని ముట్టడించారు. ప్రభాసాగరుడు ఒంటరిగా అందరితో పోరాడలేక అతని సన్నిహిత మిత్రుడైన కిన్నరదత్తుని పుత్రునికీవార్త తెలిపాడు. అతను మిమ్మల్ని పంపుతున్నాడు.

అదివిని సత్వవంతుడు సేనలతో వేగంగా వెళ్ళాడు. అంతలోనే శత్రురాజులు ప్రభాసాగరుడిని ఓడించి బంధువులతో కూడా బందికానాలో పెట్టారని వార్త తెలిసింది. అతను గుర్రంమీద రెండుగడియలలో సౌగంధికనగరం ప్రవేశించి అడ్డం వచ్చిన వారందరినీ అంతమొందిస్తూ కోటలో ప్రవేశించి, అక్కడి రాజపుత్రులను కొందరిని చంపి, కొందరిని కొట్టి, కొందరిని పట్టి బంధించి ఒకపూటలో శత్రువు లందరినీ జయించి ప్రభాసాగరుణ్ని మళ్ళీ సింహాసనం మీద కూర్చో బెట్టాడు.

అంతలో బలాలు నగరంలో ప్రవేశించాయి. పౌరులు సత్వవంతుణ్ని పొగడ సాగారు. ప్రభాసాగరుడు "మహాత్మా! నువ్వు మా కిన్నరదత్తుడి కెలాటి బంధువో తెలియదుకాని మాపాలిట దైవానివే. నీ వివరాలు తెలుపు. ఇది మొదలు నా అర్థరాజ్యం నువ్వే పాలించు. నీ కేమిచ్చినా రుణం తీరదు". అన్నాడు.

"నరేంద్రా! నేను కిన్నరదత్తుడి పుత్రునకు మిత్రుడను. సత్యదేవుడిని. స్నేహితుడు చెప్పగా వచ్చాను. ఇంత పొగడాలా? నాకు మీ రాజ్యంతో పనిలేదు. నేను వెళ్తాను అనుమతించండి" అన్నాడు సత్వవంతుడు.

"ఒక్కడివి, అందర్ని జయించావంటే నువ్వు దేవ సమానుడివే. విజయాభినందనకై ఎల్లుండి సభచేయబోతున్నాను. అప్పుడు మేమిచ్చే సత్కారమూ, ఆతిధ్యం స్వీకరించి మమ్మల్ని ఆనందింప జెయ్యాలి" అని వినయంగా ప్రార్థించాడు మహారాజు.

అప్పటితో వేళమించిందని తక్కిన కధను తరవాత మజిలీలో మణిసిద్ధుడు చెప్పాడు.

# కాశీమజిలీ కథలు

## 67. వ మజిలీ

### కమల కథ

ప్రభావతీ పురంలో అతిపెద్ద దయిన విశ్వేశ్వరాలయం ఒకటుంది. అక్కడ వ్యాసమఠం పేరుతో సన్యాసులు, బైరాగులు, విరాగులు కోసం ఒక మఠం ఉంది. పక్కనే సత్రమూ ఉంది. అక్కడ రకరకాల బైరాగులుంటారు. అక్కడి కొకనాడు చాలా అందమైన – కమల అనే పేరుగల బాలయోగిని వచ్చింది.

ఆమెను చూసి – 'ఇంత చక్కనిది చిన్నతనంలోనే ఎందుకు విరక్తి చెందిందో? ఈమె ఎవరికి సేవచేస్తుందో అతనే ధన్యుడు. అనుకున్నారు.

ఆమె మఠం అంతా తిరిగి అందరిగురించీ తెలుసుకుని చిదంబర యోగి ఉత్తముడని అతనికి నమస్కరించి – అత నడగగా – "నేను విరక్తి చెంది మీపాదా లాశ్రయించాలని వచ్చాను. కొంతకాలం మీ శుశ్రూష చేస్తాను నన్ను ఉద్ధరించండి. ఈ యోగులలో మీరే అత్యుత్తములు" అని ప్రార్థించింది

అత నంగీకరించాడు. ఆమె అతని నుంచి వేదాంత తత్వవిశేషాలు తెలుసుకోసాగింది

ఆమె చేరింది మొదలు మిగిలినయోగులు జపతపాలు మాని ఆమెను చూస్తూ..ఏదో మిషతో చిదంబరస్వామి వద్దకు వచ్చి కూర్చోడం చేస్తూంటే – ఆమె ముసుగు వేసుకుని జపం చేసుకునేది.

ఒకనాడు కిన్నరదత్తుని భార్య తారావళిని తీసుకుని రహస్యంగా ఆ మఠానికి వచ్చి అందరికీ వందనాలు చేసి చిదంబరయోగి వద్దకు

వెళ్ళింది. ఆమె వృద్ధరాజుగారి భార్య అని తెలిసి అతనామెనెంతో గౌరవించి ఆ మఠం చక్కగా నడుస్తూందని, అదికట్టించిన వారి వంశాన్ని పొగిడి – ఆమె కేదేనా అభిలాష ఉంటే చెప్పమన్నాడు

ఆమె తారావళి వివరాలు చెప్పి "రాజు చేరదీసిన వాడీమె నెందుకు పరిణయం చేసుకోకుండా దాటవేస్తున్నాడో? సర్వజ్ఞులైన మీరే చెప్పాలి  అలాగే మా కార్యం సఫలమయ్యేలా చూడాలి " అంది

అప్పుడే కమల స్నానం చేసి అక్కడికి వచ్చింది  చిదంబర యోగిని ఆమె ఎవరని రాణి అడగగా తన శిష్యురాలనీ తత్వోపదేశం చేస్తున్నాననీ చెప్పాడు.

"ను వ్వెందుకు చిన్నతనంలోనే విరక్తి చెందావు? నీ తల్లితండ్రు లెవరు? నీకు పెళ్ళయిందా?" అని రాణి ఆమెనే అడిగింది.

కమల నవ్వుతూ – "వెనకటి వృత్తాంతం చెప్పకూడదు. తలుచుకోకూడదు. నా కందరూ ఉండేవారు. ఇప్పు డెవరూ లేరు. విరక్తికి వయసుతో నిమిత్తమేమిటి?" అంది

రాణి ఆమె మాటలకు సంతోషించి ఆమెమీద ప్రేమతో మంచాలు, పరుపులు మొదలైనవి పంపింది. "గురువు నేలమీద పడుకుంటే శిష్యురాలు మంచంమీద ఎలా పడుకుంటుంది?" అని ఆమె అనడంతో వ్రతవిరుద్ధమయినా ఆనాటినుంచీ ఆ యోగి మంచంమీద పడుకో సాగాడు

## స్థూల జంఘ తామ్రకేసుల కథ

స్థూలజంఘుడు, తామ్రకేశుడు – యిద్దరూ విటులు వేశ్య సొమ్ము దొంగిలించి రాజభటులచే అపరాధులుగా నిరూపించబడడంతో పారిపోయి, అవధూత వేషాలలో ఆ మఠానికి వచ్చి యోగులకు సేవలు చేయసాగారు. కమలవచ్చింది మొదలు ఆమె మీద వలపు చెంది ఆ చిదంబరయోగికి ఎక్కువగా సేవలు చేయసాగారు. ఆమె అది గ్రహించి వారి సమక్షాన్ని తప్పించుకునేది

వాళ్ళొక రాత్రి – ఆమెను మంచంతో ఎత్తుకుపోయి ఒక పాడుబడిన ఆలయంలో ఉంచి ఆమెను అనుభవించాలని పన్నాగం పన్నారు. అర్ధరాత్రి – కాషాయ వస్త్రాలలో ఉన్న యోగిని కమలగా పొరపాటుపడి మంచంతో సహా ఎత్తుకుని ఆవరణలో దూరంగా ఉన్న శూన్య శివాలయంలో ఉంచి – "నేను ముందంటే" "నేనుముందం"టూ కొంతసేపు తగవు లాడుకున్నారు. చివరకు – తామ్రకేశుడు ముందుగా పోడాని కంగీకారమైంది కాని అతను లోపలికి వెళ్ళాక స్థూలజంఘుడు మనసు మార్చుకుని – "తామ్రకేశా! తలుపు తియ్యి. మాట చెప్పాలి" అంటూ తలుపు రంధ్రంలోంచి అరిచాడు. అతనది వినిపించుకోనట్లే నటిస్తూ – చీకట్లో ఏమీ కనపడక ఊపిరిని బట్టి ఊహించి కాషాయ వస్త్రం తొలగించి ముఖంమీద దంతక్షతాలు నాటించాడు.

అప్పుడాయోగి అదిరి పడిలేచి – "ఎవడ్రా నామొహం కరుస్తున్నాడు?" అని అరిచాడు. అలా పలికింది యోగి అనిగ్రహించి తామకేశుడు మంచం క్రింద దూరి దాగున్నాడు.

అది తెలియని స్థూలజంఘుడు – "తామ్రకేశా! తలుపు తీయవేం? తలారులని తీసుకొస్తాను చూడు" అని బిగ్గరగా అరిచాడు.

అది విన్నయోగి ఆశ్చర్యంతో – ఆ మాట్లాడే దెవరు? ఏమీ కనపడడంలేదు. దీపం తెండి" అన్నాడు

ఆ కంఠధ్వని తమ గురువుదని గ్రహించిన స్థూలజంఘుడు బయట గొళ్ళెంపెట్టి పారిపోయాడు. ఆ యోగి మంచం దిగి, నాలుగు మూలలూ తడుముకుని గోడలు తగిలేసరి కది చెరసాల అనుకుని నేనిక్కడి కెలా వచ్చాను? నా బుగ్గని కరిచిన వారెవరు? ఇక్కడ భూతాలు లేవుకదా' అని సందేహిస్తూంటే, మంచం కిందనుంచి తామ్రకేశుడు హు...హు... అని మూలగసాగాడు. పిశాచభీతి భ్రాంతివలన కలుగుతుందని తెలిసిన వేదాంతే అయినా ఆ యోగి ప్రాణభయంతో మంచ మెక్కి – "ఓ పిశాచమా! నన్నిక్కడి కెందుకు తీసుకొచ్చావు? సంసారులని పీడిస్తే నీ కోరికలు తీరుతాయి కాని మాలాటి సన్యాసులవల్ల నీకేం ప్రయోజనం?" అంటూ ఆంజనేయదండకం, శివస్తుతి పఠించసాగాడు. తెల్లవారినా అక్కడ ఆ భేదమేమీ తెలిసింది కాదు

మఠంలో కమల 'అయ్యో! ఈ మహానుభావుడు నూరేళ్ళ వయసువాడు. అగ్నిశాల విడిచి ఎక్కడికీ పోనివాడు. ఇవాళ ఎక్కడికి పోయాడో!' అని విచారిస్తూ ... నలుగురినీ అడుగుతూ తిరుగుతూంటే స్థూలజంఘుడు వచ్చి – "కమలా! చిదంబరయోగి గోపురం దగ్గరున్న శూన్యశివాలయంలో ఉన్నట్లు కలవచ్చింది సుమీ!" అన్నాడు.

అప్పటి కామె అతనితో ఏమీ మాట్లాడకుండా తరవాత అక్కడికి వెళ్ళి పిలవగా ... "అమ్మా! కమలా! ఇక్క డున్నాను. తలుపులు తియ్యి?" అని అరిచాడు. ఆమె తలుపు తీసి మంచం మీదున్న యోగిని చూసి "మీరిక్క డున్నారేం?" అని అడిగింది.

"ఇది దైవమాయ. మంచంకింద ఏదో ఉండి అరుస్తూ నన్ను భయపెడుతోంది" అని సంజ్ఞ చేస్తూంటే తామ్రకేశుడు తటాలున బయట కొచ్చి తలుపులు గొళ్ళెంవేసి పరుగెత్తి స్థూలజంఘుణ్ని కలుసుకున్నాడు.

"నువ్వు మిత్రద్రోహివి. నీతో మాట్లాడకూడదు. నేను లోప లుండగా తలుపులు వేసేస్తావా! ఆ కమలవచ్చి తలుపు తెరవకపోతే నేనెంత చిక్కులో పడేవాడిని"

"ఉపకారం చేస్తే అలాగే ఉంటుంది. ఆ కమలను పంపింది నేనే. ఆ తలుపు తియ్యడంతోనే దాన్ని లోపలికి లాక్కుని ఆ సన్యాసికి నవతలికి తోసేస్తావని అలా చేశాను. దొరికిన దాన్ని వదులుకుని నన్ను నిందిస్తున్నావు. ఇంతకీ అక్కడేం జరిగింది?" అని అడిగాడు.

తామ్రకేశుడు జరిగింది పూసగుచ్చినట్లు చెప్పాడు. స్థూలజంఘుడు వాడిని మెచ్చుకుని "మంచి పనిచేశావు. రా త్రవనీ.." అంటూంటే – ఒక భటుడు వచ్చి "రాజుగారు మంత్రులతో కలసి వస్తున్నారు. సద్దుచేయకండి" అని హెచ్చరించాడు. మఠంలోని వాళ్ళు ఎక్కడివా రక్కడ నిశ్శబ్దంగా కూర్చుని జపం చేసుకోసాగారు.

రాజువారిని క్షేమ సమాచారాలడిగాడు. అంతా చక్కగా ఉన్నాయన్నారు వారు. రాజు అక్కడ తిరుగుతూంటే అంతఃపుర కావలివాడు సౌవిదల్లుడు కనిపించి – "అమ్మగారు చిదంబరయోగి నుంచి

మంత్రభస్మం తెమ్మనారని వచ్చాను. ఆ యోగి కనపడడంలేదు." అని విన్నవించాడు. రాజుభటులని ఆ యోగిని వెదకమంటూంటే - స్థూలజంఘుడు వారి నాగుడికి తీసుకువెళ్ళి తలుపు తీసి - "వీరే మా గురువులు. శిష్యురాలికి రహస్యంగా మంత్రోపదేశం చేస్తున్నారు" అని వారిద్దరినీ చూపించాడు.

మంచంమీద చిదంబరయోగి, పక్కన నిలబడిన కమలను చూసి - ఈ వృద్ధ తాపసు డేమిటి, ఈ బాలయోగి నేమిటి...అని ఆశ్చర్యపోతూ - " యోగీంద్రా! మీరిలా చిక్కుకున్నా రేమిటి?" అని పరిహాసంగా అడిగాడు. అతను జరిగింది చెప్పినా రాజుకు ఎందుకో నమ్మకం కలుగలేదు.

మంత్రులు - "ఇక్కడున్న యోగులందరూ యిలాటి వారే! ప్రతియోగికీ ఒక శిష్యురాలు. పనిపాట్లు లేక మూడుపూట్లా మెక్కి ఆబోతుల్లా బలిసి ఉన్నారు. అందర్నీ బయటకు పొమ్మని సత్రం మూయించేస్తే సరి" అన్నారు.

కాని శశాంకు డందు కంగీకరింపక "ఇది మొద లీ మఠంలో యోగిను లుండ కూడదు పదిరోజుల్లో వెళ్ళిపోవాలి." అని అక్కడికక్కడే ఆజ్ఞాపించి వెళ్ళిపోయాడు.

ఆ ఆజ్ఞ విన్న కమల - 'అయ్యో! నావలన మీ అందరికీ ముప్పొచ్చింది. నూరేళ్ళ యోగినికూడా అనుమానించారు! ఈ కపట శిష్యులే యిలాంటి పని చేశారు. నా మంచం స్థలం మార్చుకోకపోతే వీళ్ళు నన్ను మోసం చేసి ఉండేవారు. ఛీ! ఆడరూపం ధరించాను దాంతో రసాభాసమయింది. సత్వవంతు డికరాడు. నేను అన్నింటికీ చెడ్డాను. ఇక వానిని చూడలేను. గురువుగా రెలాగూ కాశీ పొమ్మన్నారు కదా! అంతే చేస్తాను' అనుకుని కమల అనే పేరుతో నున్న రూపవతి మళ్ళీ పురుష వేషం ధరించి కాశీ వెళ్ళిపోయింది.

# కాశీమజిలీ కథలు

## 68. వ మజిలీ

ఒకనాటి ప్రాతఃకాల సమయంలో - ఘటికాచలమనే నగరంలో కృతవర్మ ఒక గృహస్థుని వీధి అరుగుమీద కూర్చుని - విధి ఎంత బలమైనది! గొప్పవారింట పుట్టినా సుఖపడలేక, కన్నవారిని దుఃఖాల పాలుచేసి యిల్లు వదిలి వచ్చేశాం. ఇందుకు పెద్దకారణమూ కనపడదు. రాజపుత్రిక, రూపవతి మమ్మల్ని కలుసుకున్నారు కాదు. వాళ్ళు బయలుదేరడాని కవకాశం లభించిందో లేదో? సోమభట్టారకుని యింటికి యజ్ఞదత్తుడు వచ్చాడని విని యిద్దరం పరుగెత్తాం. ఇంటికి పోదామని నే నెంత చెప్పినా వినకుండా శీలవతి, యిలా లాక్కొచ్చింది. ఇద్దరం యిక్కడే పడుకున్నాం. ఆమె ఏమైందో? అని ఆలోచించ సాగాడు.

మేఘనాధుడనే ఆ యింటి యజమాని వచ్చి అతన్ని చూసి వివరాల డిగాడు. అతను వాటిని చెప్పి - "ఇక్కడ మృగబాధలూ లేవుకదా? రాత్రి నేనూ నా మిత్రుడూ పడుకున్నాం. అత నేమయ్యాడో తెలియదు" అన్నాడు.

"ఈ వూరికి వన్యమృగబాధలు లేవు. మీరేం చదివారు? ఏం చదువుకోవాలని కాశీ వెళ్తున్నారు?" అని అడిగాడు. కృతవర్మ వివరంగా చెప్పాడు. అతను చాలా సంతోషించి - "మేము బ్రాహ్మణులమే. మా తండ్రి చాలా సంపద సంపాదించాడు. నేనూ దానినివృద్ధి చేశాను. నేను కొన్ని నాటకాలు రాశాను. అక్కడితో తృప్తి పడక వాటిని ప్రదర్శిస్తున్నాను. ఇప్పుడు నాటక సమాజంతో దేశాటనం చెయ్యా లనుకుంటున్నాం. మాకు స్త్రీవేషధారులు కొందరు కావాలి. మీరు మా సమాజంలో చేరితే మీ సంగీతం, సాహిత్యం మాకు చాలా ఉపయోగ మౌతుంది. కాశీ, ప్రయాగ

మొదలైన పట్నాలు తిరుగుదాం మీ ఖర్చులన్నీ మేం భరిస్తాం. అంగీకరిస్తారా?" అని అడిగాడు మేఘనాథుడు.

"మాకు నాటకాలంటే యిష్టమే. కొన్నాళ్ళు మీతో తిరిగి మాకు చేతనైన సాయం చేస్తాం. నాటకాలు రచించడం ... అవసరమైతే వేషధారణ చేస్తాం. మాకు వేతనం అక్కర్లేదు. నా మిత్రుణ్ని వెదికి తెప్పించండి. అతను నాకంటే చాలా చక్కనివాడు" అన్నాడు కృతవర్మ. మేఘనాథుడు చాలా ఆనందించి అతన్ని వెదకడాని కప్పటి కప్పుడే మనుషులని పురమాయించాడు. వాళ్ళు చీకటి పడేవరకూ అనేకచోట్ల వెదికి అలాటి వాడెక్కడా కనపడలేదన్నారు.

"కాశీ రామేశ్వరాల మధ్య ఎక్కడున్నా నీ మిత్రుణ్ని వెదికి తెప్పిస్తాను " అని అతని కాతిధ్య మిచ్చాడు. నాటకాన్ని సరిచూసుకుంటూ అక్కడ వాళ్ళతో కొన్నాళ్ళుండడానికి కృతవర్మ అంగీకరించాడు.

## వినత కథ

మేఘనాధుడి కొక్కతే కూతురు వినత. ఆమెనొక సామాన్యునికిచ్చి పెళ్ళిచేసి అల్లుడిని ఇల్లరికం ఉంచుకున్నాడు. నాటకాలు, సంగీతం శృంగారరస పూరితాలు కావడం చేత వాటి నాస్వాదించే మేఘనాధుడి కూతురు సహజంగానే రసికురాలయింది. మగడు అస్వతంత్రుడు, అసమర్ధుడు కనుక ఆమె స్వతంత్రురాలయింది.

సంగీతం, సాహిత్యం, కావ్యాలంటే చెవి కోసుకునే వినత ఒకనాడు కృతవర్మ పాడుతూంటే విని, అతన్ని చూసి, ఆ క్షణమే ఆ సుందరుడి మీద మోహంలో పడింది. అప్పటి నుంచీ ఆమె రకరకాలుగా మదనచేష్టలు ప్రదర్శిస్తున్నా అతనేమీ ఎరగని వాడిలా ఉండసాగాడు.

ఒకనాడు కృతవర్మ ఒంటరిగా కూర్చుని రాసుకుంటూంటే - వినత వింత చీరకట్టుకుని, తలకి పట్టువేసుకుని, వైద్యం చేయమని

వచ్చింది. అతనిని పొగిడి చేయి చాపి పరీక్షచేయించుకుని – "నీ చేయి తగలడంతోటే నా వ్యాధి పోయింది" అంది. ఆ మధ్యపాడిన పాట పాడమని అడిగింది. తన కోరిక తీర్చమంది. తన హృదయాన్ని అతను లాక్కుపోయాడంది. అంతలో – మేఘనాధుడు వచ్చి తలుపు తీయమన్నాడు. తలుపు తీసిన ఆమెతలకున్న పట్టు చూసి "తలనొప్పిగా ఉందా, పట్టువేశావు?" అని అడిగాడు. "ఇప్పుడే తగ్గుతూంది" అందామె.

తరవాత ఆమె తరచుగా చావడిలోకి రాకూడదనీ, పెద్దది అయిందనీ తండ్రి బోధించబోగా ఆమె అమాయకత్వం నటించి – "నాకు ఆయన వద్ద సంగీతం నేర్పించవా?" అని అడిగింది. ఆమె అమాయకు రాలని అతను భావిస్తే... అత న్నమాయకుణ్ని చేశానని ఆమె నవ్వుకుంది ఆమె ప్రవర్తనకు కోపగిస్తున్న భర్త వినత కృతవర్మ గదిలోకి విసిరిందంటూ ఒక పద్యం రాసిన కాగితం మామ కిచ్చాడు.

అతను కూతురిని నిలదీయగా, "నీ అల్లుడికి పట్టిన అనుమాన పిశాచం నిన్నూ పట్టిందా? ఎవరిచేతో రాయించుకొచ్చి నీకు చూపాడు. కృతవర్మ శుకమహర్షి కంటె అధికుడు." అని బుకాయించింది.

అంతలో ప్రయాణానికి ముహూర్తం సమీపించగా మేఘనాధుడు నాటకసమాజంతో దేశాటనానికి బయలు దేరి వెళ్ళిపోయాడు. గొప్ప పట్టణాల్లో ప్రదర్శన లిస్తూ కాశీ పట్టణం చేరాడు.

అంతవరకూ చెప్పి – అక్కడ కథ ఆపాడు మణిసిద్ధుడు తక్కినకథను తరవాత మజిలీలో చెబుతానన్నాడు.

# కాశీమజిలీ కథలు

## 69 వ మజిలీ

### శబర దంపతుల కథ

"తారావళీ! చిదంబర యోగి పట్టి జారుడట. మంత్రోపదేశం చేస్తానంటూ ఆ బాలయోగినిని చేరదీశాడట. అతని మంత్ర భస్మ మేంపనిచేస్తుందిలే. చక్కగా అలంకరించుకో. నిన్ను చూశాక వాడే అంగీకరిస్తాడు" అంటూ కిన్నరదత్తుని భార్య ఆమెను శశాంకుడి దగ్గరికి తీసుకెళ్ళింది. అన్నీ చెప్పి..."ఈమెను పెళ్ళాడి మా కులం ఉద్ధరించు ఇదే నా కోరిక" అంది.

శశాంకుడు వినయంగా ... "తల్లీ! మీ మాట ప్రకారమే నడుచుకుంటాను. ఈ మధ్య ప్రభాసాగరుడికి సహాయంగా మనం పంపిన సత్వవంతుడనే దండనాయకుడు శత్రురాజు లందరినీపారద్రోలాడు. అందువల్ల మనం వారందరికీ విరోధుల మయ్యాం. ప్రభాసాగరుడు సత్వవంతుణ్ని తన దగ్గరుంచుకో దలచినట్లు వార్త వచ్చింది. అతన్ని తీసుకురావడానికి నేను వెళ్తున్నాను. అక్కడి నుంచి వచ్చాక వివాహవిషయం నిర్దేశించుకుందాం " అన్నాడు.

అప్పుడామె చాలాసంతోషించి, తారావళి కేదో సైగ చేయగా ఆమె ఒకపూలదండ అతని మెడలో వేసింది. తరవాత అంతఃపురానికి వెళ్ళాక ఆమె అత్తతో – "శశాంకుడు ఆడదికాని మగవాడిలా కనపడతాడు. అతని కంఠం ...లక్షణాలు.. అలా ఉన్నాయి" "అని చెప్పింది. ఆ విషయం పరీక్షించమని రాజపత్ని చురిక అనేదాదిని రహస్యంగా నియమించింది.

శశాంకుడు సత్యవంతుణ్ని తీసుకురావాలని పరివారంతో సౌగంధిక నగరానికి వెళ్తుంటే దారిలో ఒక బోయ జంట ఎదురుపడి

నమస్కరించారు. "అయ్యా! మేము కొండవాళ్ళం. మాకు లేకలేక సత్వవంతుడనే కొడుకు పుట్టాడు. వాడెప్పుడూ కొండదిగి ఎరగడు. వాడిని మీ ర్కెడికో పంపారని మావాళ్ళు చెప్పారు. తండ్రీ! వాడినేం చేశారు? బతికే ఉన్నాడా?" అని అడిగారు.

"సత్వవంతుడు మీ కొడుకా! అతను హాయిగా ఉన్నాడు. చాలా ఉన్నత దశ చేరుకుంటాడు" అంటూ వాని పుట్టుక గురించి అడిగాడు. వాళ్ళు అంతా చెప్పి - మకరాంకుని దగ్గర ఒక సంవత్సరంలోనే అన్నివిద్యలు నేర్చాడన్నారు. సత్వవంతుణ్ని వివరాలడిగి ఉంటే మకరాంకుడి గురించి తెలిసేదని విచారిస్తూ - "రండి నేనూ సత్వవంతుడి దగ్గరకే వెళ్తున్నాను" అని వారిని వెంట బెట్టుకు వెళ్ళాడు శశాంకుడు.

ప్రభాసాగరు డతనికి ఎదురు వచ్చి, కృతజ్ఞతలు తెలిపి ఎంతగానో సత్కరించాడు. శశాంకుడు - "సౌగంధికకు వివాహం చేశారా? సత్వవంతుడేడీ? మీ అల్లు డేడీ?" అని అడిగాడు.

అందు కతను - "శశాంకా! సౌగంధిక కింకా పెళ్ళి చెయ్యలేదు. ఆమె వరించిన గుప్తవర్మతో సత్వవంతుడికి ప్రగాఢ స్నేహం పెరిగింది. కాశీనుంచి వచ్చాక పెళ్ళి చేసుకుంటానన్నాడు గుప్తవర్మ. వాళ్ళిద్దరూ కాశీ వెళ్ళి ఇంకా రాలేదు. గుప్తవర్మ అందమైన వాడే కాని పరాక్రమహీనుడు" అన్నాడు.

అప్పుడు ఇద్దరు దూతలు వచ్చి - "దేవా! మీరిచ్చిన పద్య పటాన్ని దేశదేశాలూ తిప్పాం. చివరకి కాశీపురం వ్యాసమరంలో ఒక చిన్నవా డీ పద్యం విని కొంచెం సేపు ఆలోచించి, కన్నీరు పెట్టుకుంటూ ఈ పద్యం రాసిచ్చాడు. "ఈ పద్యం ఎవరు రాసి పంపారో వారికే దీనిని చదివి వినిపించండి." అన్నాడు. మేమెంత బతిమాలినా రాలేదు." అంటూ ఆ పద్యం అతని చేతికిచ్చారు.

**తెలిసికొంటి నీదు నెలవు నేఁడు వయస్య**
**గాశిఁ జెంది తుదకు గాశిఁ జెంది**
**తిరుగుఁ చుంటి నొకతె నెరుగఁవేమిటి కింత,**
**మొదటి చింత కష్టములకు గంత.**

అది చదివిన శశాంకుడు "అయ్యో! రాజ్యమదంలో నేనంతా మరిచిపోయాను. ఈ పద్యం రాసింది రూపవతి. ఐదేళ్ళు దాటిపోతే కాశీ చేరాలనుకున్నాం. నా స్నేహితురా ళ్ళందరూ కాశీ చేరుకుని ఉంటారు. నేనూ పోవాలి. అనుకుంటూ భిల్ల దపంతులని వెంట పెట్టుకుని కాశీ చేరుకున్నాడు. తనవారి కోసం వెదుకుతూ కొన్ని రోజులు గడిపాడు.

ఒకనాడు దివ్యరూపాలతో వచ్చిన కిరాతక దంపతులని చూసి – "పుణ్యాత్ములారా! మీరింతకుముందు మాతో వచ్చిన శబర దంపతులని అనుకుంటున్నాను. మీ రూపాలు మారి బ్రాహ్మణ తేజస్సుతో ప్రకాశిస్తున్నారు. మీరు ఆ భిల్ల దపంతులేనా? వేరొకరా? తెలియ జేయండి'' అని అడిగాడు శశాంకుడు. అప్పుడు కాసరు డిలా చెప్పసాగాడు.

# సిద్ధతీర్థం కథ

దేవా! మాకథ చాలా చిత్ర మయింది. ముగ్గురం బాలురం తోవలో కలుసుకుని యిక్కడి కొచ్చి సహాధ్యాయులమై విద్యాభ్యాసం చేశాం. స్వల్పకాలం లోనే విద్యారహస్యా లన్నీ గ్రహించిన మమ్మల్ని మెచ్చుకుంటూ మా ఉపాధ్యాయుడు – విద్వత్కేసరి అని ఒకరికీ, సోమభట్టారకు దని ఒకరికీ, యజ్ఞదత్తు డని ఒకరికీ బిరుదు లిచ్చాడు.

యౌవనమదం, విద్యామదంలో ఒళ్ళు తెలియక పెద్దపండితుల నెదిరిస్తూ వితండవాదాలు చేస్తూ గర్వంగా తిరగసాగాం ఒకనాడు మే మిక్కడ తిరుగుతూంటే ఒకపౌరాణికుడు యీ తీర్థప్రభావాన్ని – "జనుల కోరికలు సిద్ధింపజేస్తాడని సిద్ధేశ్వరుడనీ, యీ క్షేత్రం సిద్ధతీర్థ" మనీ వివరించాడు. సోమభట్టారకుడు నవ్వుతూ – "తీర్థానికి వచ్చినవాళ్ళని మోసగించి ధనం లాగడాని కేదో చెబుతారు. కోరికలన్నీ దేముడు తీర్చేస్తే ప్రజలకు కృషితో పనే ఉండదు కదా" అన్నాడు. దానిమీద మాకు వాదోపవాదాలు జరిగాయి. నా వాదాన్ని స్థిరపరచుకుందుకు

నేను సిద్ధతీర్థంలో మునిగి – "స్వామీ. సిద్ధేశ్వరుడా. నాకు అతిచక్కని భార్య దొరకాలి. ఆమెతో అడవిలో ఉన్నా స్వర్గంలో ఉన్నంత సంతోషం కలగాలి. ఒక్కడే కొడుకు పుట్టాలి వాడి కొక్క సంవత్సరంలోనే విద్యలన్నీ వంటబట్టాలి. వాడు చాలా సత్వవంతుడై నాలుగు వేపుల రాజ్యాలనీ పాలించాలి. నీ మహిమతో నా కోరికలు నిజం చెయ్యి" అని కోరాను.

నా కోరిక విని యజ్ఞదత్తుడు నవ్వుతూ – "చాలా తక్కువే కోరుకున్నావు" అని స్నానం చేసి వచ్చి స్వామికి నమస్కరించి – "స్వామీ! ఈ విద్వత్కేసరి కోరిక తీరిస్తే అతని కొడుక్కి తగిన భార్య ఉండాలి కదా! నాలుగు జాతుల అందమూ కలిగి, శీలవతి, రూపవతి, కళావతి, విద్యావతి అయిన కూతుర్ని నాకు ప్రసాదించు." అని కోరుకున్నాడు.

మా యిద్దరి కోరికలూ విని సోమభట్టారకుడు పకపక నవ్వుతూ – "సిద్ధేశ్వరా! పాషాణ రూపా! నీకు నిజంగా శక్తుంటే నాకు మసిమంగలంలాటి అసహ్యకరమైన ఆడపిల్ల నివ్వు. అప్పుడు నీ మహిమను నేను నమ్ముతాను" అని కోరాడు.

అప్పుడు నేను – "తథాస్తు. స్వామీ! వీడి కోరిక ముందే తీర్చాలి సుమీ!" అన్నాను. అందు కతను కోపగించి – నిజంగా నీకు చక్రవర్తి పుడతాడని గర్వపడుతూ నాకు కురూపి పుడుతుందని తలుస్తున్నావా? ఇలాటి రాళ్ళకే అలాటి సమర్థతుంటే లోకాలు నిలిచేనా? సరే. నేను మరో కోరిక కోరతాను చూడు. ఓ సిద్ధేశ్వరుడా! ఈ కేసరి చక్కని భార్యని పెళ్ళాడ్డంతోటే మతిచెడి, విద్యలు మరచి కొండలలో కిరాతకుడిగా బతకాలి. యజ్ఞదత్తుడి కలాటి మంచి కూతురు పుట్టినా ఆమె వలన అత ననేక కష్టాలు పడాలి. ఈ నా కోరికలు తీర్చకపోతే నువ్వు సిద్ధేశ్వరుడివే కావు" అని కోరాడు. అప్పుడు నేనతన్ని నిందిస్తూ – "దేవత ద్రోహుడివైన నీ మాటలను వేల్పులు మన్నించరు. ఒకవేళ మన్నిస్తే నేను కాశికి వచ్చి సిద్ధలింగాన్నారాధించి నా కిరాతకత్వం పోగొట్టుకుంటాలే" అన్నాను.

మా తగవును సర్దిచెబుతూ – "భట్టారకా! సిద్ధించినా మానినా మంచి కోరికలే కోరుకోవాలి. నిజంగా నువ్వు కోరుకున్న కూతురు పుడితే ఆమె పెళ్ళెలా చేస్తావు?" అన్నాడు.

"మీ కోరికలు తీరిపోయినట్లే మాట్లాడుతున్నారే! పోనీలే." అన్నా డతను. మేము కొంతసేపు కలహించుకున్నా మళ్ళీ కలసి పోయాం. కాశీనుంచి నేను ముందుగానే మా దేశం వెళ్ళిపోయాను. చక్కని పిల్లని ఎంచుకొని పెళ్ళాడాను. ఆమె కాపరానికి రావడంతోటే మాకు పూర్వస్మృతులు పోయి అడవుల పాలయ్యాం. ఆవేళ అతని తిట్లన్నీ నిజమయ్యాయి. సిద్ధేశ్వరుడి కరుణవల్ల నా కొడుకు అలాటివాడే అయి సంవత్సరంలో అన్ని విద్యలన్నీ నేర్చాడు.

మీరు చెప్పినదాని వలన అతను పరాక్రమశాలి అయినట్లు కూడా తెలిసింది. వెనుకటి ఎరుకలేకున్నా మీ దయవల్ల యీ పుణ్యక్షేత్రానికి రావడం, దైవికంగా సిద్ధతీర్థంలో స్నానం చేయడం జరిగింది. దాంతో పూర్వవృత్తాంతం, చదివిన సకల విద్యలూ స్ఫురించసాగాయి. రాజా! సిద్ధేశ్వర ప్రభావం ఎలాటిదో చూశారా.

శశాంకుడు ఆశ్చర్యపడి ... కొంచెం ఆలోచించి ... "ఆర్యా! సర్వకార్యాలూ దేముడే చక్కబెడతాడు. మీరు కోరిన ప్రకారమే అంతా జరుగుతుందనడానికి సందేహం లేదు. యజ్ఞదత్తుడీని నే నెరుగుదును. మీ కోడలు ఇప్పటికి పుట్టే ఉంటుంది. ఆ వృత్తాంతం తరవాత చెబుతాను. మీ కొడుకు సత్వవంతు డిక్కడే ఉన్నాడు. కనక వెదకండి" అన్నాడు అంతవరకూ చెప్పి మణిసిద్ధుడు తదుపరి కథను తదుపరి మజిలీలో చెప్పాడు.

# కాశీమజిలీ కథలు

## 70. వ మజిలీ

## మాయా తురగం కథ

"ఇల్లు వదిలివెళ్ళేడప్పుడు ఎవరెక్కడ ఎలా తిరిగినా అయిదేళ్ళయ్యేసరికి కాశీనగరం చేరుకోవా లనుకున్నాం. ఆ కాల పరిమితి దాటిపోయింది. అదీకాక స్త్రీ వేషంతో తిరుగుదామంటే వ్యాసమరంలోలాగ మరే నింద పడాలో! పురుషవేషం చాలా యిబ్బంది కరంగా ఉంది. ఈ క్షేత్రంలో శరీరం చాలిస్తే పుణ్యం." అనుకుని మకరాంకుడి పేరుతో ఉన్న రూపవతి మణికర్ణికా ఘట్టానికి పోయి పావనగంగలోకి దూకింది.

గంగవొడ్డున చల్లగాలి సేవిస్తూ గుప్తవర్మ, సత్వవంతుడూ విహరిస్తున్నారు. సత్వవంతుడు వెంటనే అదిచూచి ఆమెను రక్షించి "అమ్మా! నువ్వెవరివి? చావవలసిన పరిస్థితి ఏమొచ్చింది" అని అడిగాడు.

"ముక్తికోసం" అని ఆమె అనేసరికి - సత్వవంతుడు - "చాలుచాలు మా గురువు మకరాంకుడు నాకొకసారి బలవన్మరణం మహాపాపం అని చెప్పాడు. ముక్తికి మరోమార్గం లేదా?" అన్నాడు. ఆ మాట విని మకరాంకుడు - "నువ్వు సత్వవంతుడివా?" అని అడిగాడు. సత్వవంతుడు - "నా పేరు నీకెలా తెలిసింది? నువ్వెవరివి?

నీ కంఠధ్వని ఎప్పుడో విన్నట్లు ... నీతో పరిచయం ఉన్నట్లూ తోస్తోంది. నువ్వు మా గురువు మకరాంకుడివి కాదుకదా?" అన్నా డతను.

మకరాంకుడు మౌనముద్ర దాల్చడంతో - అతన్ని కౌగలించుకుని - "కృతఘ్నుడినని కాబోలు నాతో మాట్లాడడంలేదు. అప్పుడు దైవికంగా అలా విడిపోవలసి వచ్చింది. ఇప్పటిదాకా నీ కోసమే వెదుకుతూ తిరుగుతున్నాను" అన్నాడు.

గుప్తవర్మ అతన్ని రమ్మని పిలిచాడు. "మిత్రమా! ఇటురా. నా గురువు మకరాంకుడు దైవికంగా యిక్కడ కలిశాడు" అని సత్వవంతుడు

కేకవేశాడు. అతను వచ్చి - "అయ్యా! మా సత్త్వవంతుడు మిమ్మల్ని తలవని క్షణం లేదు. మిమ్మల్ని అంగడిలో వదలి వచ్చినందుకెంతో పశ్చాత్తాప పడుతూ మీ కోసం దేశ దేశాలు తిరుగుతున్నాడు" అన్నాడు.

"మీ సత్త్వవంతుడంటున్నారు, ఇతను మీకెలాటి చుట్టం? మీ రెవరు?" అని అడిగాడు మకరాంకుడు

"ఆ కథ చాలా పెద్దది ఇంటికి పోయి చెప్పుకుందాం" అంటూ సత్త్వవంతుడు మకరాంకుణ్ని లేవనెత్తి నడిపించసాగాడు. వారికి పక్కగా గుప్తవర్మ నడవసాగాడు.

"గురువర్యా! ఇతని నిమిత్తమే శశాంకుడు నన్ను సౌగంధిక నగరానికి పంపాడు. రాజపుత్రు లందరినీ వదిలి సౌగంధిక యితనినే వరించింది. నీలో లాగే యితనిలోనూ సుగుణాలెన్నో ఉన్నాయి. మేము చూసుకున్నది మొదలు ఒకరి నొకరు విడవకుండా ఉన్నాం. మిత్రులని కలుసుకుందు కతను వొస్తే నువ్వు కనపడతావేమో అనే ఆశతో నేను వచ్చాను. నాకు మిత్రుడు కనుక నీకూ మిత్రుడే" అన్నాడు సత్త్వవంతుడు ఆ రాత్రి భోజనాలు చేసి మేడమీదకు పోయి ముగ్గురూ మాట్లాడు కోసాగారు.

***సత్త్వవంతుడు*** : మకరాంకా! నీ వృత్తాంతం ఇతను తెలుసుకోవాలనుకున్నాడు కదా? అంతా చెప్పు

***మకరాంకుడు*** : నీ దగ్గర నాకు రహస్య మేముంటుంది? నా జన్మభూమి విశాలపురం. మేం నలుగురం సఖులం. దేశాలు చూడాలని తల్లితండ్రులని మాయ చేసి యిల్లు వదిలాం. తలోదారి పట్టి - వారిని కలుసుకుందుకు తిరుగుతున్నాను

***గుప్తవర్మ*** : అయ్యా. తమరిపేరు మొదటి నుంచీ ఇదేనా? (ఆమె రూపవతి అని అడిగాడు)

***మకరాంకుడు*** · (అది శీలవతేమో అని అనుమానించి) అలా అడిగావేం?

గుప్తవర్మ : బుద్ధిమంతులు కాలానుగుణంగా వేషభాషలు మార్చుకుంటారు కదా.

మకరాంకుడు : (అది శీలవతే అని ధ్రువపరచుకుని) నువ్వేమేనా అలా మార్చుకున్నావా? నీ వృత్తాంతం నేనూ కొంచెం వినాలి కదా.

గుప్తవర్మ : చెప్ప కెక్కడికి పోతాను? మొదట – మీ రీనగరం చేరుకోవాలని నియమం చేసుకున్నారా?

మకరాంకుడు : ఔను.

(అనేసరికి గుప్తవర్మ – "హా! రూపవతీ! నిజం చెప్పక నన్నింత వేధిస్తావేం?" అంటూ కౌగలించుకున్నాడు.)

మకరాంకుడు : "అయ్యో! శీలవతీ! నిన్నెరగక తొట్రుపాటు పడుతున్నాను"

(అంటూ ఆమెను కౌగలించుకున్నాడు.) ఇద్దరూ జమిలిగా దుఃఖించసాగారు.

అది చూసి సత్యవంతుడు ఆశ్చర్యపోతూ – "మీరు ఒకరికొకరు తెలిసిన వారా? రూపవతీ! అని పిలిచాడు. వారెవరు? మీరు దుఃఖిస్తారేం? మీ కథేమిటో త్వరగా చెప్పండి. అన్నాడు.

గుప్తవర్మ : "శీలవతి, కళావతి, విద్యావతి, రూప వతులని పేర్లు కల మేం నలుగురం స్నేహితురాళ్ళం. మాలో శీలవతీ విద్యావతులకు వివాహం చేయాలని తల్లితండ్రులు తలపెట్టడంతో అందు కంగీకరించక వాళ్ళని ఊరు దాటించి, నదిలోపడి పోయారని కళావతీ రూపవతీ చెప్పి అప్పులందరినీ కష్టాలపాలు చేశారు. వారిలో శీలవతిని నేను. రూపవతి ఈమె దేశాటనం చేయాలని మా అభిలాష.

నేనూ, విద్యావతీ మగవేషాలు వేసుకుని గుర్రంమీద తెల్లవారేసరికి చాలా దూరం వెళ్ళి పోయాం. తరవాత నడవడం మొదలుపెట్టాం. సాయంకాలాని కొక అగ్రహారం చేరి సోమభట్టారకు డనే పండితుడి యింట్లో విద్యాభ్యాసం నెపంతో చేరి సఖురాళ్ళ కోసం ఎదురు చూశాం. అతని కురూపి కూతురు పరిణయం మధ్యలో నా

తండ్రి యజ్ఞదత్తుడు విరక్తుడై రాగా మే మక్కడ నుంచి పారిపోయాం. పోయి పోయి ఒక గ్రామం చేరి ఒకవీధి అరుగుమీద విద్యావతి గాఢంగా నిద్రపోగా నాకు నిద్రపట్టలేదు.

అర్ధరాత్రి – ఒక గుర్రం పారిపోతూంటే 'పట్టుకొండి' అంటూ అరుపులు వినిపించాయి. నేను తటాలున లేచి అదిలించినా అది ఆగక పోడంతో కోపమొచ్చి దానివెనుక పరుగెత్తి – ఎగిరి దానిమీద ఎక్కి కూర్చున్నాను. అది శరవేగంతో పరుగెత్తింది. జీనులేని గుర్రం మీద – సౌగంధిక నగరం పొలిమేర వరకూ వచ్చాక అది విపరీతంగా చెమటలు కారుతూ ఆగింది. నేను మెల్లగా దిగి కళ్ళుతిరిగి నేలమీద పడుకున్నాను.

అది కపట ఘోటకమని భావించి, ఊళ్ళోకి వెళ్ళి వింతలు చూస్తూంటే – చిత్రశాలలో సౌగంధిక అనే రాజపుత్రిక స్వయంవరం జరుగుతోంది. నేను అక్కడున్న అశోకవృక్షం కింద నిలబడ్డాను.

ఆమె రాజకుమారుల నెవరినీ వరింపక నామెడలో పూలమాలవేసింది. రాకుమారు లందరూ కోపగించి – ఏకమై కోట ముట్టడించారు. మీ సాయంవల్ల ఆ ఆపద తీరింది. నన్ను పురుషుడని వరించి పెళ్ళాడమని నిర్బంధించిన రాజకుమారిని యాత్ర మిషతో తప్పించుకుని వచ్చాను. కృతవర్మ పేరుతో ఉన్న విద్యావతి ఏమయిందో తెలియరాలేదు" అన్నాడు.

రూపవతి కూడా తానిల్లు వదలినది మొదలు అంతవరకూ జరిగింది చెప్పింది.

ఇద్దరి కథలూ విని ఆశ్చర్యంతో – "ఆడవాళ్ళయినా దేశాలు తిరుగుతున్నారు. ఎంత గట్టివాళ్ళు! ఎంత సాహసం చేశారు!" అన్నాడు. అంతలో తూర్పు తెల్లవారి పోయింది.

అప్పుడు రూపవతి – "అక్కా! శీలవతీ! ఆమధ్య ఎవరో ఒక పద్యం తీసుకొచ్చి చదివారు. అది కళావతే రాసిందని ఆమెను రమ్మని నేను కూడా బదులు పద్యం రాసి పంపాను. మన సఖురాళ్ళు యిక్కడికి చేరుకునే ఉంటారు. ఈ పట్నం జనసంకీర్ణమయింది కనుక చాలా జాగ్రత్తగా వాళ్ళకోసం వెదకాలి. వాళ్ళు కనపడక మానరు –" అంది.

# విద్వత్కేసరి కథ

ఆ మాటకు, రూపవతితో కలసి స్నానం నెపంతో గంగా నదికి పోయారు. అక్కడ స్నానం చేస్తున్న విద్వత్కేసరి రూపవతిని గుర్తుపట్టి – దగ్గరకు వచ్చి "నువ్వు మకరాంకుడివి కావూ? నన్నెక్కడేనా చూసిన జ్ఞాపకం ఉందా?" అని అడిగాడు. రూపవతి తెల్లబోయింది.

అప్పు డతను తాను కాసరుడే అనీ యీ క్షేత్రానికి వచ్చి మునపటి రూపు పొందాడనీ ఆ వృత్తాంతం చెప్పాడు.

ఆమె – స్నానం చేస్తున్న సత్వవంతుణ్ని చూపించింది. అతను తండ్రిని పోల్చుకోలేక పోగా, ఆ బ్రాహ్మణుడు తనకథ చెప్పి – "శశాంక మహారాజు ధర్మమా అని యిక్కడికొచ్చి శాపవిముక్తి చెందాను" అన్నాడు. తాను బ్రాహ్మణు డైనందుకు సత్వవంతు డెంతో ఆనందించి తండ్రికాళ్ళకి నమస్కరించాడు. విద్వత్కేసరి వారిని వెంట బెట్టుకుని శశాంకుడి సౌధానికి వెళ్ళాడు.

రూపవతి దూరం నుంచే శశాంకుణ్ని చూసి, అతన్ని కళావతిగా గుర్తు పట్టింది. "శీలవతీ! విద్యావతి యిక్కడే ఉంటుంది. శశాంకుడు నన్ను గుర్తు పడతాడో లేదో చూద్దాం" అంటూ ఆమెతో అతని దగ్గరకు పోయింది.

అప్పుడు విద్వత్కేసరి "మహారాజా! ఇదుగో సత్వవంతుడు. గంగలో స్నానం చేస్తూ కనిపించాడు. అతనికి విద్యనేర్పిన మకరాంకు డితనే." అని అంటూంటే అతను మకరాంకుణ్ని పరీక్షగా చూసి – "స్నేహితుడా! నేనెవరి ననుకుంటున్నావు? గుర్తు పట్టలేదా? అరణ్యంలో వదిలివచ్చేశానని కోపమా? నాతప్పు మన్నించు" అంటూ రూపవతిని కౌగలించుకున్నాడు.

అతను శీలవతిని చూపించి – "ఇత నెవరో తెలుసా?" అంటూ శీలవతిని కౌగలించుకున్నాడు సత్వవంతుడంతా చూస్తూ నవ్వుతూ – "ఈ శశాంక మహారాజు మీ నలుగురిలోనూ ఒకరా? పోలిక అలాగే ఉంది. ఎంత సాహసులు! మీకు మీరే సాటి" అన్నాడు.

అప్పుడా ముగ్గురు స్త్రీలూ ఏకాంతంగా కూర్చుని తాముపడిన కష్టాలు చెప్పుకుని – 'విద్యావతి జాడే తెలియవలసి ఉంది' .. అనుకున్నారు.

# విచిత్ర నాటకం కథ

మర్నాడు వాళ్ళు నాటక ప్రకటన పత్రికను చూశారు. దానిలో .. "కృతవర్మ అనే కవిచే రచించబడింది బాగా చదువుకున్న – నలుగురు కన్యల యీ కథ – కరుణరస ప్రధానం. శీలవతికీ విద్యావతికీ తల్లితండ్రులు పెళ్ళి చేయబోగా – అదియిష్టంలేక...వాళ్ళు నదిలో మునిగిపోయారని కల్పించి కళావతీ, రూపవతులు వారిని ఊరు దాటించడం (ఆశ్చర్యం.)

శీలవతి పెళ్ళికూతురు వేషం వేసుకుని గురుపుత్రికకు పెళ్ళిచేయ బూనడం – హాస్యం" అంటూ ఉన్న కథా సంగ్రహాన్ని చదివారు.

"ఈ నాటకం రచించిన వాడు నిస్సందేహంగా మన కృతవర్మే. మనని తెలుసుకోవాలనే దీనిని ప్రదర్శిస్తున్నాడు" అని పరిచారకుణ్ణి నాటక శాలకు పంపి కృతవర్మ ఎక్కడున్నాడో తెలుసుకు రమ్మన్నారు. వాడు వెళ్ళివచ్చి – "నాటక సంఘం వారు మహారాజులకన్న గొప్పగా ఉన్నారు. నా మాటవినిపించుకోనే లేదు" అన్నాడు.

ఆ రాత్రి వాళ్ళు చక్కగా తయారై నాటకానికి ముందుగానే వెళ్ళి ముందు వరుసలో కూర్చున్నారు. ఎందరో మహారాజులూ వాళ్ళూ వచ్చారు నాటకశాల కిటకిట లాడిపోసాగింది.

విద్యావతి వేషం కృతవర్మ ధరించాడు. శీల, కళా, విద్యావతుల వేషాలు ప్రవేశించడంతోనే – ప్రేక్షకుల్లోని ఆ ముగ్గురూ తమ ప్రతిబింబాలా అనుకున్నారు. సభలోని కొందరు – "హా! పుత్రీ! శీలవతీ! కళావతీ! విద్యావతీ!" అంటూ ఆర్తనాదాలు చేస్తూ నిలబడ్డారు. రక్షక భటులు వారిని వారిస్తూ కూర్చో బెట్టారు. చక్కని సంభాషణలు, కదతో నాటకాన్ని గొప్పగా ప్రదర్శించారు నాటకం పూర్తవడంతోనే – "కృతవర్మ యీ కథ నెలా కల్పించాడో తెలుసుకోవాలి. నేనా శీలవతి తండ్రి యజ్ఞదత్తుడిని శీలవతి, విద్యావతి నదిలో ములగ లేదని రాశాడు అది తెలుసుకుందుకే వచ్చాను" అని ప్రార్థించాడు.

మరొకరు లేచి – "నేను విద్యావతి తండ్రి ధనపాలుడిని. ఈ కథలోని నిజానిజాలు తెలుసుకోవలసిన అవసరం నాకూ ఉంది" అన్నాడు

వృషాంకుడు లేచి తన గురించి వివరంగా చెప్పుకున్నాడు. ఆ సభలోనే ఉన్న ధర్మపాలుడు నిలబడి – "ఇవా ళెంత సుదినం! ఈ నాటక సమాజం వారెంత ఉపకారం చేశారని! నా మిత్రు లందరూ యిక్కడే కూడారు. ఈ నాటకంలో రాసినట్లు ఆ బాలికలు మరణించకపోతే మేము చాలా అదృష్టవంతులమే!. కృతవర్మ మాకు అసలు విషయం తెలిపి ఎంతో పుణ్యం మూట కట్టుకుంటాడని కోరుతున్నాను" అన్నాడు.

అంతలో సూత్రధారుడు వచ్చి –" కృతవర్మ యివాళ జ్వరపీడితుడు. అన్య విషయాలు తెలుసుకో గోరేవారు రేపు మధ్యాహ్నం జరగనున్న సభకి రావలసిందిగా కోరుతున్నాం" అన్నాడు.

దానితో వారు తప్ప మిగిలిన అందరూ వెళ్ళిపోయారు. తలుపులు బంధించడానికి పరిజనులు రాగా – "మేము కృతవర్మ మిత్రులం. గుప్తవర్మ వచ్చాడని అతనికి చెప్పండి. అతను పొమ్మంటే పోతాం" అన్నారు.

వాళ్ళు వెళ్ళి చెప్పేసరికి కృతవర్మ వెంటనే వచ్చి గుప్తవర్మని చూసి కౌగలించుకుని – "ఆ వేళ ఏమై పోయావు? ఎలా వచ్చావు? మనవారి జాడ ఏమైనా తెలిసిందా?" అంటూ అడిగాడు. అతను నవ్వుతూ – "వీ రెవరో చూడు" అన్నాడు. అప్పు డతను వారిని గుర్తుపట్టి ఎంతో సంతోషం ప్రకటించాడు.

అప్పుడు అందరూ శశాంకుడి నివాసానికి పోయి – మేడమీద విశ్రాంతిగా కూర్చుని ఒకరి కొకరు తమ కథలు చెప్పుకున్నారు.

***రూపవతి*** : మన నలుగురి తల్లితండ్రులూ యిక్కడే ఉన్నారని తెలిసింది కదా? రేపు మనందరిని కలుసుకోవచ్చునా?

***శీలవతి*** : ఇంకా చెప్పకుండా ఏం చేస్తాం? పడిన పాట్లు చాలవా?

**కళావతి** : మనకై మనం పోకుండా ఆ కేసరిని పంపి వారినిక్కడికి రప్పించాలి. అతను మనలను మగవారే అనుకుంటున్నాడు. కాని సత్వవంతుడికి చెప్పాం. మనం అతన్ని వరించడం అందరికీ యిష్టమే కదా?

**రూపవతి** : అంతా భగవంతుడి యిష్టం. అదుగో వస్తున్నాడు.

*సత్త్వవంతుడు* : నన్ను చూసి నవ్వుతున్నారే! మీ రహస్యాల కంతరాయం కలిగించానా?

*శీలవతి* : మీ దగ్గర రహస్యాలు లేవు. నువ్వు మాకు చేసిన ఉపకారానికి ప్రతిగా ఏం చేయాలా అని ఆలోచించాం ఇంక దాచడమెందుకు? నువ్వు ఉత్తమ బ్రాహ్మణపుత్రుడివి. నీకు మేమందరమూ పరిచారికలమై ఉంటాం

సత్త్వవంతుడు కొంచెంసేపు వారిని చిక్కులు పెట్టి – "శీలవతి విద్యాభాస్కరుడి చేత తాళికట్టించుకుంది కదా? దానికేం చెబుతారు?" అన్నాడు.

"మంగళసూత్రం కట్టేటప్పుడు అది వేలు అడ్డంపెట్టింది. అందువల్ల దోషం పోయిందని శాస్త్రం"

ఆ మాట కతను సంతోషించి వారిని వివాహం చేసుకుందుకు అంగీకరించాడు. అంతలో తెల్లవారింది. విద్వత్కేసరికి రహస్యమంతా చెప్పారు. అతను సంతోషం పట్టలేక పోతూంటే – తమ తల్లి తండ్రుల నక్కడికి తీసుకురమ్మని కొన్ని మాటలు చెప్పి పంపారు.

ఆ విద్వాంసుడు ధర్మపాలుని బస అడిగి తెలుసుకుని అక్కడికి వెళ్ళాడు. అప్పటికే యజ్ఞదత్తుడు, ధనపాలుడు, రాజు అక్కడ కూర్చుని రాత్రి జరిగిన నాటకం గురించి చర్చిస్తున్నారు. విద్వత్కేసరిని యజ్ఞదత్తుడు గుర్తుపట్టి – "ఎన్నాళ్ళకు కనిపించావు!" అంటూ కుశలప్రశ్నలు వేశాడు. అతన్ని పీఠంమీద కూర్చోబెట్టి ధర్మపాలుడితో అతని వృత్తాంతం చెప్పాడు.

విద్వత్కేసరి అందరికీ నమస్కరించి – కాశీపురంలో విద్యార్థులుగా తాముండగా జరిగింది చెప్పి "ఇప్పుడు అతని కూతురిని నాకోడలిగా చేసి వాగ్దానం నిలబెట్టుకోవలసిన సమయం వచ్చింది నా కుమారుణ్ని తీసుకువచ్చాను మీరుకూడా నచ్చజెప్పి పిల్ల నిప్పించండి" అన్నాడు.

ధర్మపాలుడు – "అయ్యో. ఇతని కూతురు నదిలో పడి చనిపోవడంవల్లనే మేమందరమూ విరక్తులమై తిరుగుతున్నాంకదా" అన్నాడు దుఃఖిస్తూ.

"అమంగళాలు పలకకండి. నేనితని కుమార్తెను చూసే వచ్చాను" అన్నాడతను. అందుకు వాళ్ళు ఆశ్చర్యం తో – "ఎక్కడున్నారు? ఎవరెవ రున్నారు?" అని అడిగారు. "మీకు సందేహంగా ఉంటే నాతో రండి, చూబిస్తాను." అని వారిని వెంటబెట్టుకుని నివాసానికి తీసుకు వెళ్ళాడు.

బాలికలు నలుగురూ పూర్వపువేషాలలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు. తల్లి తండ్రులని చూసి లేచి వారి పాదాలకు నమస్కరించి – "మా తప్పులు మన్నించండి. చిన్నతనం కొద్దీ మిమ్మల్ని చాలా చిక్కులు పెట్టాం. మునుపు మా గురువులు సిద్ధ తీర్థంలో కోరినవరాలే మా ప్రవర్తనకి కారణాలు" అంటూ తమ తమ వృత్తాంతాలు చెప్పి వారిని ఆశ్చర్యంలోనూ ఆనందంలోనూ ముంచారు.

ధర్మపాలుడు సత్వవంతుని శౌర్యసాహసాలు మునుపే విని ఉన్నాడు కనుక అప్పుడే సుమూహూర్తం నిశ్చయించి తారావళీ సౌగంధికలను కూడా రప్పించి కాశీ విశ్వేశ్వరుడి సమక్షంలో వైభవంగా వివాహాలు జరిపించాడు.

సత్వవంతుడు మొదట శీలవతికీ, తరవాత కళావతీ, తారావతీ సౌగంధికలకూ మంగళసూత్రాలు కట్టి తరవాత విద్యావతీ రూపవతులను భార్యలుగా స్వీకరించాడు. ఆ విధంగా సత్వవంతుడు వారి వారి రాజ్యాలతో ఆరుగురు భార్యలను స్వీకరించి తన భుజబలంతో మరికొన్ని దేశాలు సంపాదించి ధర్మంగా రాజ్యాన్ని పరిపాలించసాగాడు. అతని చరిత్రని విద్వాంసులు గ్రంధాలుగా రచించారు.

"గోపా! ఆ సత్వవంతుడు శీల కళా విద్యా రూపవతులతో కొంతకాలం ఈ నగరాన్ని పరిపాలించాడు. అతని భార్యలు ఈ ఉద్యానవనంలో విహరిస్తూ తమ తమ పేర్లతో మొక్కలూ లతలూ నాటించారు. అందువల్ల అవన్నీ నాలుగేసి ఉంటాయి. ఈ కథవల్ల సిద్ధతీర్థ ప్రభావం కూడా తెలిసింది కదా?" అన్నాడు మణిసిద్ధుడు. గోపాలుడా కథ విని ఎంతో సంతోషించాడు.

# కాశీమజిలీ కథలు

## 71. వ మజిలీ

"గురువర్యా! ఈ వూరి రోడ్లకూడలిలో ఒక దొమ్మరవాడు కాళీ సంచిలోంచి వెండి బంగారు నాణాలు, పాత్రలు, పళ్ళాలు తీసి విరజిమ్ముతున్నాడు. నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. తరవాత వాడు పళ్ళెం పట్టుకుని అడుక్కోడం మరీ ఆశ్చర్యం కలిగించింది. స్వామీ! వాడు స్వయంగా రూపాయలు తెప్పించుకోగలడుకదా? మళ్ళీ అడుక్కోడం ఎందుకూ? మీరు అలాగ సంచిలో చేయిపెట్టి వస్తువులు తెప్పించగలరా?" అని శౌనకు డడిగాడు. మణిసిద్ధుడు నవ్వుతూ – "గోపా! నా కలాటి సామర్థ్యం లేదు. ఇంద్రజాలం, మాయలతో తెప్పించి చూపే వస్తువులు నిలిచేవి కావు. అంతకు ముందుంచిన వస్తువులనే హస్తలాఘవంతో అలా చూబిస్తారు" అన్నాడు.

"ఆ విద్య లెలాటివో వాటి గురించి కథ లేవేనా చెప్పి యివాళ్టికి కాలక్షేపం చెయ్యండి" అని ప్రార్థించాడు, కథలంటే చెవి కోసుకునే శిష్యుడు.

## కామ గ్రీవుడి కథ

అరవయ్యేళ్ళ వయసు. పండిన వెంట్రుకలు, ముడుతలు పడుతున్న శరీరం, తేజోవంతమైన కాంతి కలిగిన ఒక బ్రాహ్మణుడు చేతికర్ర తిప్పుతూ విప్రకూటమనే అగ్రహారంలో వెళ్తున్నాడు. స్త్రీలు అటూ యిటూ తిరుగుతున్నారే తప్ప కామగ్రీవుడినెవరూ భోజనానికి పిలవకుండా వివరా లడిగి ఊరుకుంటున్నారు వీరికి భూతదయలేదని అతను నిందిస్తూ కొంచెం దూరం వెళ్ళగా –

ఒక యింటిలోనుంచి చక్కని బాలిక వచ్చింది. ఆమెని చూసి – 'దీనికి పన్నెండేళ్ళుంటాయి. పెళ్ళి చేసుకుంటే ఆరునెలలకే కాపరానికి వస్తుంది. మరో ఏడాదిలోగానే సంతానం కలుగుతుంది. దీనిని నాకిస్తారేమో అడిగేదా? తలనెరిసింది తప్ప నేను ముసిలివాడిలా కనిపించను. నా విద్యా సంపద చూసి ఆమె తండ్రి నాకివ్వక పోడు. ఈ పూట వీళ్ళింట్లో తిని స్నేహం కలిపి మెల్లగా పిల్లనిమ్మని అడుగుతాను" – అని అనుకుని ... "బాలా నాకీ పూట భోజనం పెడతావా?" అని అడిగాడు.

"రండి తాతగారూ! ఇలా విశ్రమించండి. ఒకపూటకాదు, పదిపూట లుండండి. మా తండ్రి చెరువుకి వెళ్ళాడు. వచ్చేస్తాడు" అని ఆమె అతన్ని అతిధిగా ఆదరించింది. ఆమె చెంబుతో నీళ్ళందించగా అతను దాన్ని పట్టుకు వెళ్తూంటే చేతులు వొణికి చెంబుజారి పడిపోయింది.

"తాతగారూ! మీరు పెద్దలు కదా. చెంబు జారింది. మళ్ళీ తెస్తాను" అని ఆమె అనేసరికి – అతను – "పిల్లా! నన్ను అంత పెద్దవా డనుకుంటున్నావా? ఈ మధ్య ఆరోగ్యం చెడింది. అంతే తప్ప మరేమీ కాదు. అందువల్లే తలకూడా నెరిసింది. నేనీ కర్ర విలాసానికి పట్టుకున్నాను. తప్ప, వృద్ధాప్యంవల్ల కాదు. ఒక్కటంటే ఒక్కపన్నే ఊడింది" అన్నాడు.

"పోన్లెండి. విశ్రమించండి" అంటూ ఆమె విసన కర్రతో విసరసాగింది. అతనడగగా – "నాపేరు సావిత్రి. మా తండ్రి భట్టుపాదుడు సకల శాస్త్రాలూ చదివినవాడు" అంది. "పండితుడయినా నీకింకా పెళ్ళిచేయలేదేం? పదేళ్ళు దాటిన పిల్ల రజస్వలాతుల్యురాలే. మంచిసంబంధం దొరకలేదా?"

"మీకంటికలా కనిపిస్తున్నాను కాని నాకింకా పదేళ్ళు దాటలేదు." అందామె చిరునవ్వు నవ్వుతూ.

"నాకు చత్వారం అనుకుంటున్నావా? సూదిలోదారం గుచ్చగలను. పోనీలే, మంచి సంబంధముంది. పెళ్ళాడతావా?" అనే సరి కామె లోపలికి వెళ్ళిపోయింది.

అంతలో భట్టపాదుడు విద్యార్థులతో స్నానం చేసి వచ్చి - కామగ్రీవుడిని స్నానం చేసి రమ్మని - కూతురితో - "అతిదిని స్వయంగా తెచ్చి పూజించావట. చాలా మంచి పనిచేశావు" అని మెచ్చుకున్నాడు. "తండ్రీ! ఆయనను తాతగారు అంటే కోపం వచ్చింది. తాను చిన్నవాడట" అంటూ ముందుజరిగిన మాటలు చెప్పి ఆమె నవ్వింది.

భోజనం అయ్యాక అతని వివరాలడగగా - కామగ్రీవుడు "మీకొక రహస్యం చెప్పాలి. లోపలికి పోదాం పదండి" అని - లోపలికి వెళ్ళాక - "నా కాపరం కాంచీపురం. నేను పుట్టిన కొద్దికాలానికే తల్లితండ్రులు చనిపోగా దిక్కులేక, బంధువులచే పోషించబడుతూ, చదువబ్బకుండా తిరిగాను. నాతోటి వారు వైభవంగా బతకడం చూసి - నాకు తిండి కూడా లేకపోడానికి దుఃఖిస్తూ ఒక పండితుణ్ని ఆశ్రయించి - "ధన మెలా లభిస్తుంది?" అని అడిగాను.

అతను నవ్వుతూ - "తపస్సు వల్ల అన్ని కార్యాలూ సిద్ధిస్తాయి. కాశీ కవతల హిమవత్పర్వతం ఉంది. అక్కడ ఎందరో మహాత్ములు కనపడతారు. వారి నాశ్రయిస్తే మంత్రోపదేశం అవీ చేస్తారు" అన్నాడు. విశ్వేశ్వరుడి ఆలయం వెనక జ్ఞానవాపి దగ్గర తపస్సు చేసుకుంటున్న ఒక మహాయోగి నాశ్రయించి ఆరుమాసాలు సేవ చేశాను. అతను నా కోరిక విని - "పూర్వపుణ్యం వల్ల తప్ప భాగ్యం లభించదు" అనేశాడు. నేనక్కడి నుంచి, నిరంతరం మంచు కురిసే - పుణ్యక్షేత్రం గంగోత్తరకు వెళ్ళి దిగంబరంగా తపస్సు చేసుకుంటున్న వారి నాశ్రయించాను. వారికీ నామీద కరుణ కలగలేదు.

దానితో - చనిపోదామని - శ్రీకూటమనే పర్వతమెక్కి, అక్కడ కనపడిన సాలవృక్షం ఎక్కి - "దేవతలారా! నేను సంపదల నిమిత్తం చాలా కష్టపడ్డాను. ఇలాటి నికృష్ట జీవితం కంటె మరణమే ఎంతో మంచిది. వొచ్చే జన్మలో అయినా నన్ను భాగ్యవంతుడిగా చేయండి." అని కిందకు ఉరకబోతూంటే - "వొద్దు వొద్దు సాహసం చేయకు. నువ్వెడివి?" అంటూ ఆ చెట్టు మొదలునుంచి ఒకధ్వని వినవచ్చింది.

దేముడో ఏవో అనుకుని నేను చెట్టుదిగి మొదట్లో వెదుకుతూంటే ఆ డొంకలలో జడలచే ఆవరించబడిన ఒకతపస్వి కనిపించాడు.

నే నతని పాదాలమీద పడి కరుణించమంటూ నా పేద కధంతా చెప్పుకున్నాను. అది విని అతను – "నీలాగే నేనూ సంపదల కాశించి ఇరవయ్యేళ్ళు గురుకులవాసం చేసి ఇంద్రజాల విద్య నేర్చి కోట్ల కొద్దీ ధనం సంపాదించాను.

కాని అంతటితో తృప్తి పొందక త్రికూటమనే నగరంలో దీర్ఘతముడనే మహర్షిని ఎనిమిదేళ్ళు సేవించగా అతను నాకోరి కేమిటని అడిగాడు. నేను, "ఇంద్రజాలవిద్యవలన భాగ్యవంతుడినయ్యాను తప్ప రాజుని కాలేక పోయాను. పరకాయవిద్య వలన దానిని సాధించగలనని మిమ్మ ల్నాశ్రయించాను." అన్నాను.

అతను ఫక్కున నవ్వి – "ధనం లభించే సరికి రాజ్యం కోరుకుంటున్నావు, అది కూడా లభించాక తేలికగా కనపడుతుంది. పరకాయ ప్రవేశ విద్యవల్ల రాజ్య సుఖా లెలా అనుభవిస్తావు?" అని అడిగాడు.

" ఏ రాజయినా మరణించినప్పుడు అతని శరీరంలో ప్రవేశించి రాజ్యసుఖాలు పొంతుతాను" అన్నాను.

"బుద్బుదప్రాయమైన సుఖాలు కోరుకుంటున్నావా?" అని అతను బోధించేసరికి నాకు వైరాగ్యం కలిగి – మంత్రోపదేశం పొంది యిక్కడ తపస్సు చేసుకుంటున్నాను. నువ్వుకూడా మోక్షమార్గం అవలంబించు" అన్నాడు.

"మహాత్మా! మీరు అన్ని సుఖాలూ అనుభవించేశారు కనక విరక్తి జనించింది. నాకు సంపదంటేనే తెలియదు. కొన్నాళ్ళు భాగ్యాలు అనుభవించి అప్పుడు విరక్తి చెందుతాను. ఇంద్రజాలిక విద్య నేర్పండి" అని కోరగా అతనా విద్యను ఉపదేశించాడు.

అక్కడితో తృప్తి పడక అతని అనుమతితో దీర్ఘతముడి వద్ద పదేళ్ళు శుశ్రూష చేసి – అతని ఉపదేశాలు కాదని – పరకాయ విద్యను కూడా పొందాను. కాని దీర్ఘతముడు –"నువ్వు రెండు విద్యలూ పొందావు.

ఎప్పుడు సుఖపడతావో తెలియదు. ఈ విద్యలు నీకు దంతము లున్నంత సేపే పనిచేస్తాయి. ఒక్క పన్నూడినా పని చెయ్యవు" అన్నాడు.

నే నెంతో ఆనందంగా కాశీపట్టణం వచ్చి ప్రజలను నా యింద్రజాలంతో రంజింప జెయ్యాలని, గంగానదికి స్నానం చేయాలని వచ్చాను. స్నానఘట్టంలో మెట్లు దిగుతూ కాలు తూలిపడగా ఒక పన్నూడి పోయి రక్తం వస్తూంది అక్కడివారు గాయానికే తప్ప నా దుఃఖానికి మందువెయ్యలేక ... "పన్ను విరిగితే యింత పరితపిస్తావేం! నువ్వేమీ చిన్నవాడివి కావు కదా పన్ను పారేసి స్నానం చెయ్యి" అన్నారు. ఒక్కసారేనా ఉపయోగించకుండానే చేజారిపోయిన విద్యలకోసం నే నేడుస్తూంటే - పన్నుకోసం ఏడుస్తున్నానని ప్రజలు నన్ను చూసి పెద్దపెట్టున నవ్వసాగారు.

కొన్నాళ్ళకు మనసు కూడదీసుకుని - 'తుచ్ఛ భోగాలు కోరుకున్నానని దీర్ఘతముడే శపించాడు. నేనే తెలిసికో లేకపోయాను ఇక యింటికి పోయి పెళ్ళాడి సంతానం కని నా విద్యల్ని కుమారుడి కుపదేశిస్తాను. ఇక్కడి కన్యలకూ మన బ్రాహ్మణులకీ చాలా ఆచార భేదాలున్నాయి' అని వారి కన్యల నంగీకరించక తిరిగి వస్తూ మీ అగ్రహారం చేరాను నీ కూతురిని చూడడ మేమిటి, పెళ్ళాడా లనిపించింది. నేనంత పెద్దవయసువాడిని కాను మంచు దేశంలో ఉండడం వల్ల తొందరగా పండిపోయాను. వేగిరం కొడుకుని కని నా విద్య లుపదేశిస్తాను" అన్నాడు. భట్టపాదుడు పక్కున నవ్వి - "కామగ్రీవా! నీ మాటలు వింటే నా కొక పూర్వగాద జ్ఞాపకం వస్తూంది" అంటూ చెప్పసాగాడు

## కౌశికుని కథ

"అచ్చం నీలాగే కౌశికుడనే బ్రాహ్మణుడు తల్లితండ్రులని కోల్పోయి ఆలనా పాలనాలేక స్వేచ్ఛగా తిరుగుతూ, విద్యాగంధం అంటక విటులతో కలసి జూదరులకు మొనగాడై, ఆపైన తస్కరులకి నాయకుడై, సత్రం భోజనం మఠం నిద్రగా బతికేవాడు. అలాంటి వాడికి పిల్లనెవరిస్తారు? అతనికి వార్ధక్య చిహ్నాలు కనపడసాగాయి. అప్పు డతను

వివాహం కాలేదనే చింతతో – ఒకరాత్రి అగ్రహారానికివచ్చి ఒక విప్రుని యింటి వీది అరుగుమీద పడుకుని విచారిస్తూంటే ఇంటిలోపలి నుంచి సంభాషణ వినపడింది.

బ్రాహ్మణుడు : నీ కూతురి సంబంధం గురించి నీకు పెద్ద ఆశలున్నాయి కాని అవి సాగవు. దేశమంతా తిరిగాను. ఏడాదికి ఇరవైమాడలు ఆదాయం వచ్చే వాడైనా దొరకలేదు. చివర కతనికే దాని నివ్వాలేమో.

బ్రాహ్మణి : నా బొందిలో ప్రాణముండగా వాడికివ్వనివ్వను. కట్నకానుక ల్విబడతాయిని మీరు వెనకాడుతున్నారు. నా పుస్తెలమ్మయినా నా కూతురికి మంచి సంబంధం తెస్తాను నా మనవడు రాజ్యమేలాలి.

బ్రాహ్మణుడు · మనం యిం తేలుతున్నాం. ఇక నీ మనవడు రాజ్యం ఏలుతాడు. గొంతెమ్మకోరికలకు అంతేమిటి?

బ్రాహ్మణి : దీని అదృష్టం బహు గొప్పది. చేతిలో రేఖలు చూసి మొన్న హయగ్రీవ సోమయాజి దీనికి పుట్టేవాడు రాజు అవుతాడని చెప్పాడు అందుకే – నేనా నిర్భాగ్యుడి కివ్వనుగాక యివ్వను.

బ్రాహ్మణుడు ఆ సోమయాజి ముష్టి బియ్యానికి ఆశపడి చెప్పిన మాటలు పట్టుక్కూర్చోకు

బ్రాహ్మణి . అవి ముష్టి బియ్యం మాటలు కావు ఆ సోమయాజి సాముద్రిక శాస్త్రంలో చాలా బహు దిట్ట

బ్రాహ్మణుడు : నీ మనవడు చక్రవర్తి అవాలంటే నీకూతుర్ని క్షత్రియుడి కిచ్చి పెళ్ళిచెయ్యాలి. నా మాటశ్రద్ధగావిను ఆ పెద్దన్న కొడుక్కే యిద్దాం. అతను మనకి అన్నివిధాలా సమానుడు.

బ్రాహ్మణి : పెద్దన్న భార్య గయ్యాళి. అలాటి అత్త దగ్గర నా కూతురు కాపరం చెయ్యలేదు. వాకిటకి వచ్చిన అతిధికేనా యిస్తాను కాని నా గారాల కూతుర్ని పెద్దన్న కొడుక్కివ్వను

ఆ సంభాషణంతా విన్న కౌశికుడు చాలా సంతోషించి – పొద్దున్నే విభూతి రేఖలూ అవీ పెట్టుకుని పరమ శ్రోత్రియుడిలా

తయారైవచ్చి – "అయ్యా! కర్దముడివి నువ్వేనా? నీ కోసం ఎంతో దూరం నుంచి వెదుక్కుంటూ వస్తున్నాను" అన్నాడు.

"అవును నేను కర్దముడినే. నాకోసం యింతదూరం తమరు ఎందుకు వచ్చారు? మీ రూపం చాలా తేజోవంతంగా ఉంది. మీలాటి వారికి నా మీద అనుగ్రహం కలగడానికి కారణం వినాలని ఉంది" అన్నా డతను వినయంగా.

"నీకు పెండ్లి చేయవలసిన పుత్రిక ఉందా? అది చెప్పాక మిగిలినది చెప్తాను."

కర్దముడు ఉందనడంతో – కౌశికుడు "నేను పశ్చిమ దేశస్తుడిని వేదశాస్త్రాలు చదివాను. ఇరవయ్యేళ్ళు ఘోరారణ్యంలో ఉండి తపస్సు చేయగా శంకరుడు ప్రత్యక్షమై వర మడగమన్నాడు. అప్రయత్నంగా నానోటినుంచి – 'చక్రవర్తి కాగల కొడుకు కావాలి' అని కోరాను. శంకరుడు నవ్వుతూ – 'ద్రవిడ దేశంలో తామ్రచూడం అనే అగ్రహారంలో కర్దము డనే శ్రోత్రియు డుంటున్నాడు. అతని పుత్రిక పెళ్ళీడు కొచ్చింది. నా మాటగా చెప్పి వారి నడుగు.

ఆ పిల్లని నీకిచ్చి వివాహం చేస్తారు. మును పామెకు కూడా సార్వభౌముడు దయించ గలడనే వరముంది. అందుచేత నీ కోరిక సిద్ధిస్తుంది. పెళ్ళయిన ఏడాదిలోనే నీకు కొడుకు పుడతాడు" అన్నాడు. అప్పుడు నేను తుచ్ఛమైన వరం కోరినందుకు పశ్చాత్తాపపడి – దారాపుత్రులు స్థిరులు కారు. నాకు మోక్షం ప్రసాదించు – అని వేడుకున్నా గంగాధరు డంగీకరింపక పొమ్మన్నాడు. ఆ విప్ర పుత్రిక ఉత్తమురాలు. మంచి లక్షణాలు కలది అనేసి శంకరుడు అంతర్ధానమైపోయాడు. ఏం చేయాలో తోచక మిమ్మల్నీ మీ వూరినీ వెదుక్కుంటూ వచ్చాను" అని చెప్పాడు.

కర్దముడు ఆశ్చర్యపోతూ అదంతా భార్యకి చెప్పాడు. "అమ్మాయికి సార్వభౌముడైన కొడుకు పుడతాడని శంకరులే ఆనతిచ్చారట –" అన్నాడు. ఇక ఆ దంపతుల సంతోషానికి అంతులేదు. అప్పుడు కౌశికుడు – "వివాహమైన తరవాత కాని యీ రహస్యం బట్టబయలు

చేయరాదని శంకరులు చెప్పారు. కనుక జాగ్రత్త సుమా!" అని హెచ్చరించాడు.

మర్నాడే ముహూర్తం నిర్ణయించి ఆ రాత్రే రహస్యంగా వారి పెళ్ళి జరిపించారు. బంధువులనైనా పిలవలేదు. నాలుగురోజులకి కర్దముడి అత్తగారు వచ్చింది. – "అంతమంచి పిల్లని అలాటి నిర్భాగ్యుడి కిచ్చారా! ఏం చూసి ఇచ్చారు? వయసు నలభై దాటిపోయింది. చదువు లేదు. ధనంలేదు. గుణంలేదు. ఊరంతా వీడిగురించి ఎంతనీచంగా చెప్పుకుంటున్నారో! ఉత్తరదేశంలో వీడు చెయ్యని వెధవ పనులు లేవట. దొంగ, జూదరి, విటుడు, సర్వమూ."

"ఆ మాట నీతో చెప్పిన తొత్తు కొడు కెవడో చెప్పు. జుత్తుపట్టుకుని యీడిచేస్తాను. మాకు మంచి సంబంధం వచ్చిందని వాళ్ళు అసూయతో ఏడుస్తున్నారు" అంది పిల్లతల్లి. "నీ నోటికి జడిసే వాళ్ళు నీ ముందు నిజం చెప్పలేకపోయారు. నీ అల్లుడి ఆస్తేమిటో చూపించు. వాడు మిమ్మల్ని మోసం చేసి రత్నంలాటి పిల్లని దొంగిలించాడు. వీడు రోగాల పుట్ట. వీడికి సంతానం కలుగుతుందా? అన్యాయంగా పిల్లగొంతు కోశారు." అని గొల్లుగొల్లున ఏడుస్తుంటే కౌశికు డక్కడికి వచ్చాడు.

కర్దముడు కూడా వచ్చి – "అల్లుడూ! నీకు ఈశ్వరుడు ప్రత్యక్షమయ్యా దన్నావు కదా? మీ అత్తగారికి నిదర్శనం చూబించు" అన్నాడు. అతను ఆరువేళ్ళు చూబించి – "ఆరు మాసాల్లో తెలుస్తుంది. అన్నా డతను. వాళ్ళు నెత్తీ నోరూ బాదుకున్నారు.

కొన్నాళ్ళకి కొడుకు పుట్టగా వాడికి చక్రవర్తి అని పేరు పెట్టారు. "రాజ్యమేది?" అని మామగా రడిగితే – "ఎవడింటికి వాడే చక్రవర్తి. రాజ్యంతో పనిలేదు" అన్నాడు "నీ వరమే మయింది?" అని అడిగితే "శంకరుడు నన్ను మోసం చేశాడు? అని నిందిస్తూంటాడు.

కాబట్టి ఓ బ్రాహ్మణుడా! కామగ్రీవుడా! నువ్వు కూడా కౌశికుడిలా కపటంతో వచ్చావేమో? మేము అలాటి మాయలో పడం. నీ దారిన నువ్వు పో నువ్వు చాలా వృద్ధుడివి కూడాను" అనేశాడు భట్టపాదుడు.

# కాశీమజిలీ కథలు

## 72. వ మజిలీ

### కరభ శరభుల కథ

*శరభుడు* : కరభా! ఎన్నేళ్ళయినా రామ శబ్దమే రాని మన బండబుద్ధులకి చదు వబ్బిందికాదు. కాని ... మనం చాలా ధనం సంపాదించే ఉపాయం కనపడుతోంది. అదేమిటో చెబుతా విను. ఆ విదేశీ బ్రాహ్మణుడు చాలా కాలం తపస్సు చేసి ఇంద్రజాల పరకాయ ప్రవేశ విద్యలు నేర్చినా దంతం ఊడిపోడం వల్ల అవి అతనికి పనికి రావు సంతానం కోరి సావిత్రి నడిగాడు. గురువు యివ్వననేశాడు. దాంతో కామగ్రీవుడు ఊరువదలి పోతున్నాడు.

*శరభుడు* : అయితే మనకేంటి? అతనా విద్యలు మన కిస్తాడంటావా?

*శరభుడు* : ఇవ్వ కేం చేసుకుంటాడు? వాడి కీ జన్మలో పెళ్ళవదు. మనం అతన్ని ఆశ్రయించి తిరిగామో ... రెండింటిలోనూ ఒక్క విద్య నిచ్చినా చాలు. చదువంటే మనకి తలనొప్పి. గురువుగారి సేవ కష్టంగా ఉంది. సావిత్రికి పెళ్ళి చేస్తే మనం గురువుగారికి గొడ్డు చాకిరీ చెయ్యాలి. మనం ఈ రాత్రి పోయి కామగ్రీవుణ్ని కలుసుకుందాం.

ఆ రాత్రి బయలుదేరి రెండు రోజుల కతన్ని వాళ్ళు కలుసుకున్నారు. వీళ్ళని చూసి – "మీరు భట్టపాదుడి శిష్యులు కదా? నన్ను తీసుకురమ్మని ఆయన పంపాడా?" అని ఆత్రంగా అడిగాడు. అందుకువారు – "మహాత్మా! నువ్వు వచ్చాక నీ వివాహం గురించి చాలా తగవయింది. అతని భార్య అంగీకరించలేదు మేము కూడా నీ

తరపున వాదించి విరోధుల మయ్యాం. ఇంక అక్కడ ఉండలేకనే నీ దగ్గర చదువుకుందామని వచ్చేశాం. నువ్వు మాకు విద్య చెప్పు. మేము మీకు పెళ్ళి చేస్తాం" అన్నారు.

"వత్సలారా! మీ దగ్గర దాచడం ఎందుకు! నాకు ఏ చదువూ రాదు. మరొకరి దగ్గరకి పోయి చదువుకోండి." అని కామగ్రీవుడు అన్నా, "మేము గురుపత్నితో శపదం చేసి వచ్చాం. రెండు మాసాలలో నీ పెళ్ళి చేసితీరతాం. చూద్దువుగాని" అన్నారు.

అప్పు డతను చాలా సంతోషించి వారిని వెంట బెట్టుకుని దేశాటనం చెయ్యసాగాడు. వివాహ యెగ్యమైన కన్య కనిపిస్తే - కామగ్రీవుడుండగా - ఆ పిల్ల తల్లితండ్రుల ముందు అతన్ని పొగడడం, పరోక్షంలో - "వృద్ధుడు డబ్బు కాశపడి పిల్లనిస్తారా?" అనడం.

కామగ్రీవుడికి ఆసన్నకాలం సమీపించింది కాని వివాహం కాలేదు. ఇక తనకి పెళ్ళికాదని నిశ్చయించుకుని వారిద్దరికీ చెరోవిద్యా ఉపదేశించి అతను ప్రాణాలు వదిలేశాడు. వారు అతనికి అపర కర్మలు నిర్వహించారు.

"శరభా! నీకు ఇంద్రజాలం, నాకు పరకాయ విద్య ఉపదేశించారు కదా? మనం ఏ లాభాన్నయినా సమానంగా పంచుకోవలసిందే. అయినా నాకు ఇంద్రజాల మంటే తగని సరదా. ఆవిద్యని నాకిచ్చి నా పరకాయ విద్య నువ్వు తీసుకో." అన్నాడు కరభుడు. అతనలాగే చేశాడు.

వాళ్ళొక పట్నంచేరి తమ ఇంద్రజాల విద్యతో రాజును మెప్పించా లనుకున్నారు. కాని అతనికి అస్వస్థత వల్ల వినోదం చూసే పరిస్థితి కాదని తెలిసింది. అప్పుడు శరభుడు ' ఈ రాజు రోగంతో రెండు మూడు రోజుల్లో మరణించగానే కరభుడు అతని దేహంలో ప్రవేశించి రాజ్య మేలుతాడు. నా ఇంద్రజాలం ఎందుకు పని కొస్తుంది? నేనొట్టి పశువుని' అనుకుని - "కరభా! గురువుగారు మనకెందు కలా

యిచ్చారో? మార్చుకుని తప్పు చేశాం. వారిమీద గౌరవంతో నీ విద్య నీ కిచ్చేస్తాను. నా విద్య నా కివ్వు" అని యధాపూర్వం మార్చేసుకున్నాడు.

అంతలో రాజభటులు వచ్చి – "మా రాజుగారికి స్వస్థత కుడింది. వినోదం చూస్తారట. మీ ఇంద్రజాలవిద్య వచ్చి ప్రదర్శించండి" అన్నారు. అది విని శరభుడు – "ఛీ! నే నొట్టి నిర్భాగుణ్ని. తొందరపడి సువర్ణావకాశం చేచేతులారా పాడుచేసుకున్నాను" అని పశ్చాత్తాపపడ్డాడు. కరభుడు రాజుకి ఇంద్రజాలం చూబించి చాలా పెద్ద మొత్తంలో ధనం పొంది అందులో సగభాగం శరభుడి కిచ్చాడు.

ఇంద్రజాలం చేతిలో ఉంటే నిత్యం డబ్బే ఇప్పుడంటే యిచ్చాడు కాని ముందు ముందు నాకు డబ్బిస్తాడా? నే నొట్టి మూర్ఖుణ్ని. సిరి రా మోకాలొడ్డాను. ఇప్పుడు మళ్ళీ నా విద్య నడిగితే వాడిస్తాడా?" అనుకుంటూనే మెల్లగా – "ఇది చివరిసారి ఇంకెప్పుడూ మార్చొద్దు. నాకు ఇంద్రజాల మంటే ముచ్చటగా ఉంది. ఆ విద్య యివ్వు" అని బతిమాలాడు. అత నలాగే అన్నాడు.

"ముందు నీ విద్య యివ్వు. తరవాత నా దిస్తాను" అని శరభుడనే సరికి అతని కనుమానం వచ్చి – 'మార్పులకి మూలం నువ్వే కనుక ముందు నువ్వే యివ్వు. అదీకాక మునుపు రెండుసార్లు నేనే ముందిచ్చాను" అన్నాడు.

"నువ్వివ్వకపోతే నేనేం చెయ్యాలి?" అడిగాడు శరభుడు. "మూర్ఖుడా! నీకీ బుద్ధి ఎప్పుడు పుట్టింది? మునుపే నే నలా చేస్తే ఏం చేసే వాడివి? నమ్మకముంటే యివ్వు. లేకపోతే మానెయ్" అనేశాడు కరభుడు

వాళ్ళిద్దరికీ వాదాలు జరిగాయి. పోట్లాటయింది ఇద్దరూ శత్రువులై ఒకరి నొకరు వంచించడానికి అవకాశాలు వెదుక్కోసాగారు. అయినా శరభుడు కరభుడిని వదలక వాడివెంటే తిరగసాగాడు.

ఒకనాడొక అరణ్యంలో పోతూ - కరభుడు తన ఇంద్రజాలంతో రత్న సౌధాలూ అవీ కల ఒక పట్నాన్ని సృష్టించాడు. ాజమార్గం మీద రాజభటులు వచ్చి - "అయ్యా! మీకేమైనా వైద్యం ెలుసా? మా రాజు ప్రాణాలు పోడానికి సిద్ధంగా ఉన్నాడు" అన్నారు. ుకరభుడు వారితో రాజభవనానికి వెళ్ళేసరికే రాజుగారి ప్రాణాలు ోయాయి. ఇదే సమయమని శరభుడు తన శరీరం ఎక్కడో పారేసి ాజుగారి శరీరంలో ప్రవేశించాడు. అప్పటికి కరభుడు వచ్చి వాడిని ట్టుకుని ఒక చెట్టుకి తలకిందులుగా వేలాడ కట్టాడు. ఆ మాయాజాలం క రోజుకంటె ఎక్కువ ఉండదు. కనక ఆ పట్నమంతా మటుమాయమై ోయింది. శరభుడు తన దేహంలో ప్రవేశించి కింద కురికి అది కరభుడు న్నిన ఇంద్రజాలమని గ్రహించి - 'అయ్యో! అదంతా నిజమనుకున్నాను. ద్యని కోల్పోయాను. వీడివెంట తిరగకూడదు. ఏది ఇంద్రజాలమో ది నిజమో తెలియదు. దూరంగా పోయి ఏ మహారాజు శరీరంలో యినా ప్రవేశిస్తాను' అని నిశ్చయించుకుని అక్కడినుంచి ఒక్కడూ ురోదేశం ప్రయాణమై పోయాడు. కరభుడు కూడా తన ఇంద్రజాలం ప్రదర్శించడానికి మరోరాజధానిని వెదుక్కుంటూ ఇంకోవైపుకు పోయాడు.

"గోపా! మిగిలిన కథను తరవాత చెబుతాను" అని మణిసిద్ధుడు ురో మజిలీకి ప్రయాణమయ్యాడు.

# కాశీమజిలీ కథలు

## 73. వ మజిలీ

### శంతనుడి కథ

కరభుడొకనాడు ఉదయం ఇంద్రభవనాల వంటి మేడలు కల రత్నాకరం అనే రాజధానిలో తన విద్య చూపి ధనం సంపాదించు కుందామని వెళ్తున్నాడు. ఒక సింహద్వారం మీద రాజపురోహితుని గృహమని రాయబడి ఉంది.

అతను లోపలికి వెళ్ళి తాను పరదేశి అనీ ఆ పూట కింత అన్నం పెట్టమనీ అడిగాడు. పురోహితుడు యింట్లో లేడు. ఆ యిల్లాలి కెనభై ఏళ్ళు. కొడుకులూ కోడళ్ళూ ఆమెను దేవతగా చూసుకుంటారు. ఆమె అతన్ని భోజనానికి రమ్మంది. అత నామెను చాలా పొగిడి వివరా లడిగాడు. అందుకామె – "మాకు రాజపౌరోహిత్యం ఉంది. పెద్దవాడు రాజు సమక్షంలోనూ రెండోవాడు మంత్రుల వద్దా ఉంటాడు మూడోవాడు రాజపత్నికి పంచాంగం చెబుతూంటారు. రెండుపూటలా నగరానికి వెళ్తారు" అని చెబుతూండగానే ముగ్గురు కొడుకులూ కోటనుంచి వచ్చి ఆమెకు నమస్కరించారు.

ఆమె విశేషాలు అడిగింది అందుకు వారు "అమ్మా! ఆ వేళనుంచీ మనరాజు ధర్మగుణం మాని విపరీత బుద్ధులకి లోనవుతున్నాడు పంచాంగం అక్కర్లేదట. అరవయ్యేళ్ళు దాటినా భార్య తన దగ్గరకి రాలేదని కోపించి నన్ను మరో పెళ్ళి కూతుర్ని చూడమన్నాడు. ఇతని దగ్గర కొలువు చేయడం కష్టంగా ఉంది" అన్నాడు పెద్ద కొడుకు.

"ఆ వేళ రాజు చనిపోగానే పరకాయ ప్రవేశ విద్య తెలిసిన నీచు డెవరో అతనిలో ప్రవేశించా డంటున్నాడు మంత్రి" అన్నాడు రెండో కొడుకు.

"రాజపత్ని తన భర్త ఆనాడే మరణించాడనీ, తాను విధవ నని చెబుతూంది. కూతురు పెళ్ళిమాట వదలి తనపెళ్ళి ముచ్చట్లు చెబుతున్న రాజుగురించి విచారిస్తూంది" అంటూ చెప్పాడు మూడోవాడు.

ఆ మాట లన్నీ విన్న కరభుడు – "మీ రాజు ఆనాడే మరణించాడు. శరభు డనేవాడు పరకాయ ప్రవేశం చేసి యీ కాని పనులన్నీ కావిస్తున్నాడు" అంటూ ఆ వృత్తాంత మంతా చెప్పాడు.

వాళ్ళు భోజనాలు చేశాక – పెద్దవాడైన శంతనుడు కరభుడిని రహస్యస్థలానికి తీసుకెళ్ళి..."మిత్రమా! నువ్వు కొన్ని రోజులు మా యింట్లో ఉండు. ఈ రాజు తనకి తగిన కన్యని తీసుకురమ్మని వేపుకుతింటున్నాడు. దీని కేదేనా ఉపాయం చెప్పు." అని అన్నాడు.

అప్పుడు కరభుడు ... అన్నా! నువ్వేమీ చింతించకు. ఇంద్రజాలంతో నీ రాజుని పరాభవిద్దాం" అని కర్తవ్యం బోధించాడు.

శంతనుడు నాలుగు రోజులు దాటించి రాజు వద్దకు వెళ్ళేసరికి – "పెళ్ళి కూతురిని తెచ్చేవా?" అని ఆత్రంగా అడిగాడు.

"ఒక దేవకాంతవంటి చిన్నది మన నగరానికొచ్చి వెలుపలి ఉద్యానవనంలో ఉంది. స్వయంవరంతో భర్తను వరిస్తుందట. మిమ్మల్ని చూస్తే వరించక మానదు" అన్నాడు శంతనుడు. అంటూనే అతన్ని ఉద్యానవనంలోకి తీసుకెళ్ళి అద్భుతమైన ఆ ప్రదేశంలో ఆ సుందరిని వెదికే మిషతో చాలాదూరం తిప్పాడు.

ఒక పొదరింటిలో ఆమె కనపడే సరికి రాజు ఆమె అందానికి మూర్ఛపోయాడు. లేచి చూసేసరికి ఏమీ కనపడలేదు. "దాని పరిచారికలు కాబోలు మనల్నిఇవతలకి తీసుకువచ్చి పారేశారు. ఇవాల్టికి యింటికి పోదాం" అని రాజు నంతఃపురంలో దిగవిడచి తాను ఇంటికి వచ్చాడు. కరభుణ్ని కౌగలించుకుని జరిగిన దంతా చెప్పి అతని ఇంద్రజాలాన్ని ఎంతో ప్రశంసించాడు.

మర్నాడు – "ఆ మెరుపు తీగెని చూడాలి" అంటూ రాజు శంతనుణ్ని త్వరపెట్టి తీసుకుపోయాడు. ఆవేళ వాళ్ళకి కొత్త వింతలు కనపడగా – "ఈ లతలను మనం నిన్న చూశామా?" అని సందేహం వెలిబుచ్చాడు రాజు.

శంతనుడు - "ఇది మనక్రీడా సౌధమే కదా? ఎన్నిసార్లు మీరు దీనిలో నివసించలేదు? మరచిపోయారా?" అంటూ అతని మెదడును చికాకు పరచి, ఆ మేడలోకి తీసుకు వెళ్ళాడు. ఆ సుందరిని చూసి అతను మూర్ఛపోబోతుంటే శంతను డొక్కటి చరిచి "ఇంత చాంచల్యమైతే ఆమె వరింపదు" అని చిన్నగా మందలించాడు.

అంతలో ఆమె రాజు మెడలో పూలమాలవేసి శృంగార చేష్టలు ఇష్టానుసారంగా ప్రదర్శించగా ఆమె సోయగానికి మోహంతో నేలకూలిపోయాడు.

అలాగ శంతనుడు రాజుని ఆమె వద్దకు పదిరోజులు వరుసగా తీసుకువచ్చాడు ఆమె ఒకరోజు తాంబూల మిచ్చి, ఒకరోజు గంధంపూసీ, మరోరోజు సరసమాడీ అతన్ని మోహ సముద్రంలో ముంచి తేల్చింది.

ఒకరోజు రాజు - "మన వూరి కుత్తరంగా ఉన్న ఉద్యానవనానికి కావలివారిని నియమించండి" అన్నాడు మంత్రులతో.

"అదంతా ఎడారి అక్కడ ఉద్యానవనం ఎలా ఉంటుంది?" అన్నారు వారు. "నేను ప్రతిరోజూ వెళ్ళడం లేదా? పదండి, చూబిస్తాను" అని వెళ్ళగా అక్కడేమీ కనపడలేదు.

అతను సిగ్గుపడుతూ, శంతనుడితో... "మిత్రమా! మనం చూసే తోట యివాళ కనపడలేదేం? ఎక్కడుంది? మంత్రుల ముందు భంగపడవలసి వచ్చింది" అన్నాడు.

"దేవా! దేవ రహస్యం ఒకటి చెబుతాను, వినండి. మీరు పరకాయ ప్రవేశ విద్యతో రాజు శరీరంలో ప్రవేశించా రన్న అనుమానంతో మంత్రులు, ప్రజలు మిమ్మల్ని పరీక్షిస్తున్నారు. మనం చూసే ఉద్యానవనం మీ తాతగారు దేవేంద్రుణ్ని మెప్పించి విశ్వకర్మ చేత నిర్మింప జేసుకున్నారు. దానిదివ్య శక్తివల్ల పగలు అందరికీ కనపడదు. రాత్రి అందరికీ కనపడుతుంది. మీ వంశస్తులకి మాత్రం పగలు కూడా కనపడుతుంది. నన్ను పిలవకుండా ఎందుకు వెళ్ళారు? ఇప్పుడు వారి అనుమానం మరింత ధృవపడుతుందే!" అన్నాడు శంతనుడు విచారిస్తున్నట్లు

"ఓహో! మా రాజ్యంలో ఇన్ని చిత్రాలున్నాయా?" అని రాజు అనేసరికి - శంతనుడు నవ్వుతూ, "దేవరా! మీరు పరాయివారిలా - మీ రాజ్యం అంటున్నా రేమిటి?" అని అడిగాడు.

"మాట వరస కలా అన్నాను. మంత్రులు నన్ను పరీక్షిస్తున్నారు కదా! ఈ రాత్రి మళ్ళీ ఆ వింతలు చూపించు. వారి పని రేపు చక్కజేస్తాను."

శంతనుడతన్ని ఆ సాయంకాలం తీసుకుపోయి వెనకటి విశేషాలన్నీ చూపాడు. ఆ చిన్నతదన్ని కౌగలించుకుంది. అంతలో కాలాతీతమైందని శంతను డతన్ని తీసుకువచ్చేశాడు. తనగుట్టు తెలిసిందని రాజు మంత్రులని తీసేసి కొతవారిని వేసుకున్నాడు.

మంత్రు లందరూ రాజు దుర్నీతిని శంతనుడి తమ్ముడు కామందకుడి ద్వారా రాజపత్నికి తెలియజేశారు." అమ్మా! మన ప్రభువు ఆనాడే స్వర్గస్తు డయ్యాడు. నీచు డెవడో రాజుగారి బొందెలో ప్రవేశించాడు. మిమ్మల్ని లెక్కచెయ్యక ఒక చిన్నదానిని పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నాడు. దానికి వానిద్వారా కలిగిన సంతతికే రాజ్యం సంక్రమిస్తుంది. మీ కూతురు కాంతిసేనకి పెళ్ళిచెయ్యాలి కదా? దీనికేదో ఉపాయం ఆలోచించాలి. మా యింట్లో ఒక బుద్ధిమంతుడున్నాడు. అతనితో ఆలోచిస్తే అంతా చెప్పగలడు" అని ఆమె నొప్పించి సాయంత్రం కరభుడి నక్కడికి తీసుకుపోయారు.

రాజపత్ని అతనిగురించి అంతా తెలుసుకుని సంతృప్తి చెంది – "అయితే నువ్వే ఏదో ఉపాయంతో వాడి నా బొందెలో నుంచి తొలగిపోయేలా చెయ్యి" అంది.

కరభుడికి అంతఃపురపరిచయం కలిగింది. నిత్యం వెళ్ళి రాజకుమార్తెను చూస్తూ ఏవో ఉపాయాలు చెప్పి వస్తున్నాడు.

అతనొకనాడు శంతనుడితో – "మిత్రమా! మనమధ్య దాపరికంలేదు. కాంతిసేన నా హృదయం ఆకర్షించింది. నువ్వామెను నాకిచ్చి పెళ్ళి చేస్తే నా ఇంద్రజాలవిద్య నీకు ధారపోస్తాను" అన్నాడు. కరభుడి ఇంద్రజాల మహిమ చూసినప్పటినుంచీ శంతనుడి కా విద్య గ్రహించాలని గాడమైన కోరిక కలిగింది అందువల్ల అతనా కార్యానికి ఆనందంగా అంగీకరించాడు.

రాజు చేసే పనుల వల్ల ప్రజలకు అనుమానం పెరిగి – సభలు చేసి చర్చించుకోసాగారు. ఒకనాడు శంతనుడు రాజుతో రహస్యంగా – "రాజా! నీకా ఉద్యానవనం పగలు కనపడలేదని మంత్రు

లెరుగుదురు కదా. నువ్వు పరకాయ ప్రవేశం చేశారంటున్నారు అది నిజమైతే చెప్పు. ఏదో ప్రతీకారం చేద్దాం" అని యుక్తిగా అన్నాడు రాజు అతని చెవిలో "యధార్ధమే" అన్నాడు.

"అయ్యో! నాకు ముందుగా చెబితే మంత్రులకు అనుమానం రాకుండా చేసేవాడిని. సర్లే ఇక ముందయినా నేను చెప్పినట్లుచెయ్యి" అన్నాడు. అది మొదలు రాజుగారు శంతను డేం చెప్తే అది చెయ్యసాగాడు.

ఒకనాడు శంతనుడు - "దేవా! కాంతిసేనకి పెళ్ళి చేయవలసి ఉంది. మనమిప్పుడా చిన్న దానిని ఏ రాజుకో యిచ్చి చేస్తే అతను మనరహస్యాలన్నీ తెలుసుకుని రాజ్యం వశం చేసుకుంటాడు. సామాన్యుడి కిచ్చి చేద్దాం. పెళ్ళి కొడుకు పేరు తరవాత చెబుదాం" అని సలహా యిచ్చాడు.

రాజపత్ని శంతనుణ్ని పిలిచి వరు డెవరో అని అడిగింది. తనకుతెలియదన్నాడు. "కాంతిసేనను కరభుడి కిచ్చుటకు ప్రయత్నం చేస్తున్నావట? నన్నడిగితే కాదంటానా?"

"చిత్తంచిత్తం. ఆ మధ్య వ్యాధి వచ్చినప్పుడు - తన కూతురిని బ్రాహ్మణుని కిచ్చి పెళ్ళిచేసి అర్ధరాజ్యం కూడా యిస్తానని రాజుగారు మొక్కుకున్నారట" అన్నాడు.

రాజపత్ని తరవాత కూతుర్ని పిలిచి వారికపట కృత్యాలు చెప్పింది. కాంతిసేన చక్కనిదేకాక విద్యావతి, బుద్ధివతి కూడా. ఆమె ధైర్యం కోల్పోక - "ఉపాయంతో - దేన్నయినా తప్పించుకోవచ్చు" అంటూ బుద్ధిమతిక కథ చెప్పింది.

## బుద్ధిమతిక కథ

పూర్వం బుద్ధిమతిక అనే ఒక స్త్రీ ఇద్దరు పిల్లలతో బండిమీద అరణ్యంలోంచి వెళ్తూంది. ఎద్దులు ఏదోజంతువు వాసన గ్రహించి తటాలున తాళ్ళు తెంపుకుని పారిపోయాయి. ఆమెభర్తా, బండివాడూ వాటిని పట్టుకు తేవడానికి వెళ్ళగా ఆమె పిల్లలతో ఒక చెట్టుకింద కూర్చుంది.

దగ్గరలో ఉన్న పులి వాళ్ళని చూసి మనుష్యమాంసం తన దగ్గరకే వచ్చిందే! అని ఆశ్చర్యపోతూ అంతలోనే – 'తొందరపడి దుమక కూడదు. వాళ్ళంత నిర్భయంగా వచ్చి నా పొదముందే కూర్చున్నారంటే ఏదో కారణం ఉండక పోదు. సలహా యివ్వడానికి సమయానికి మంత్రి జంబుకం కూడా లేదు. వెళ్ళి చెప్పడానికి వీలులేదు. ఆకలి ఎక్కువగా ఉంది' అనుకుంటూ పంజావిప్పి ... నాలుకబయటకి పెట్టి వారివేపు మెల్లగా అడుగులు వేయసాగింది.

పులిని ఆమె చూసి ఒక ఉపాయం ఆలోచించి నిద్రపోతున్న పిల్లలను గిల్లింది. వాళ్ళు గట్టిగా ఏడుస్తూంటే "నేనేం చేసేది? మీరేమీ తినకుండా పులిమాంసమే తెమ్మంటారు. అందుకే కదా నే నీ అడవికి వచ్చాను? పులి కనపడిందో దానిని చంపి యిద్దరికీ పెడతాను. రెండు పులులు కనిపిస్తే చెరొకటీ పెడతాను" అంటూ జోకొట్టసాగింది.

ఆ మాటలు విని గుండెలదిరి పులి పరుగెత్తి పోతూంటే – దాని మంత్రి ఎదురై – "మీరింత దూరం వచ్చారేమిటి? ఇది చాలా ప్రమాదకరమైన స్థలం. మన చోటుకి పోదాం పదండి." అంది కంగారుగా.

తపులిరాజు అటూ యిటూ చూసి – "నేను చచ్చి పుట్టాననుకో. చెప్పుకుందుకు సిగ్గేస్తూంది" అంది. "మీరిలాటి పిరికి మాటలు ఆడడ మేమిటి? సింహం తరవాత మీరే వనరాజు. మీరు చెప్పింది వింటే నవ్వొస్తూంది. ఒక మానవ స్త్రీకి భయపడి యిలా పరుగెత్తుకొచ్చి నువ్వు నీ కులానికే కళంకం తెచ్చావు. నీ సేవకుల నోట మట్టి కొట్టావు. చాలు చాలు. నా వెంటరా. ఆ గయ్యాళిని చూబించి దానినీ దాని పిల్లల్నీ కూడా నీకు ఆహారంగా సమర్పిస్తాను. నీ బలపరాక్రమాలు నీకు తెలియవు" అని నక్క మందలించింది.

అయినా పులికి ధైర్యం రాలేదు. ఇక్కడ ఎన్ని మాటలేనా ఆడొచ్చు. ఆమెను చూస్తే నోరు పెగలదు. కావాలంటే నువ్వెళ్ళు. నేను తరవాత వస్తాను" అంది

"ఇలా పిరికిగా శరీరం దాచుకుంటూ ఎన్నాళ్ళు బతుకుతావ్? దాని జిత్తులు నా దగ్గర సాగవు. లే. కావాలంటే నిన్నూ నన్నూ యీ

లతల తోనూ తీగెల తోనూ బంధించుకుందాం. ఇద్దరమూ వెళ్ళి దానిని చంపుదాం" అంటూ తమిద్దరినీ లతలతో కట్టి ఎలాగో పులిని అక్కడికి లాక్కువెళ్ళింది వాళ్ళిద్దరూ అలా రావడం చూసి బుద్ధిమతిక గుండెల్లో రాయి పడింది." నా జిత్తులు నక్క దగ్గర సాగవు పులివెళ్ళి దీనిని తీసుకొచ్చింది ... దైవమా! ఏం చేయాలి?' అంటూ మరో ఉపాయం ఆలోచించింది.

" ఓసి నక్కా! ఎంతమోసం చేశావే! ఇద్దరి పిల్లలకీ చెరో పులినీ తెచ్చిస్తానని లంచం తీసుకుని ఇంతవరకూ కనిపించావు కావు. రెండో పులేదీ? ఒక్కదాన్నే తెచ్చావేం? పిల్లలు ఆకలితో మాడుతున్నారు. ఒకపులి ఏమూలలకు చాలుతుంది? నీ భరతం పడతానుండు" అంటూ అదిలించింది.

ఆమె మాటలు విన్న బెబ్బులి – "అప్తుడ వనుకుంటే ఎంత మోసం చేశావు! ఇదా నీ కుతంత్రం! ఎంత గండం గడిచింది!" అంటూ నక్కని ఈడ్చుకుంటూ ఎంతో దూరం పరుగెత్తి అక్కడొక చెట్టుకింద నిలబడి ఆయాసం తీర్చుకుంటూ – "ఓసి నక్కా! ఇప్పుడు నా దాహాన్ని నీ రక్తంతో తీర్చుకుంటాను. నువ్వు చేసిన ద్రోహాని కిది చాలా?" అని అడిగింది.

ఆ నక్క వినయం అభినయిస్తూ – "స్వామీ! నా తప్పు కాయండి. మీ రిక్కడ నిలుచున్నారంటే ఆ స్త్రీ నా రక్తపు ఆనవాళ్ళని బట్టి వొచ్చేస్తుంది. ఈ సారి చూస్తే ఇక వదలదు. నా తప్పుకి మరోసారి శిక్షిద్దురుగాని, ఆమె రాకముందే పారిపొండి" అంది.

అదీ నిజమే అనుకుని పులి వేగంగా అడవిలోకి పారిపోయింది" అని కథ ముగించి –

"అమ్మా! ఆ బుద్ధిమతిక, నక్క, పులి బారినుంచి ఎలా తప్పించుకుందో, ఉపాయంతో నేనూ ఈ బ్రాహ్మణ మాయలను తప్పించుకుంటాను. నువ్వు చింతపడకు" అని కాంతిసేన తల్లికి ధైర్యం చెప్పింది.

తరవాత కథను మణిసిద్ధుడు తరవాయి మజిలీలో చెప్పసాగాడు.

# కాశీమజిలీ కథలు

## 74. వ మజిలీ

### కాంతిసేన కథ

"శంతనా! నీ కింత మతి పోయిందేం? కాంతిసేనని కరభుడికి నిశ్చయిస్తే నువ్వెందుకు ఊరుకున్నావ్? నువ్వు బ్రాహ్మణుడివే కదా? చిరకాలం నుంచి ఆశ్రయించుకుని ఉన్న వాడివి నువ్వు. అతను నీకంటె చక్కని వాడనా? విద్వాంసుడనా?" అని కేసరిణి అనే పరిచారిక శంతనుణ్ని అడిగేసింది.

"నువ్వు చెప్పింది నిజమే కాని, అతని ఇంద్రజాల విద్యను బట్టి రాజుగారు కరభుడి మీద ఆదరం చూపుతున్నారు. దానివల్లే మేము రాజుని వంచించ గలుగుతున్నాము. ఎవరితోనూ అనకు. ఆప్తురాలివని నీకు చెబుతున్నాను. ఆ ఇంద్రజాలం అతను నా కిచ్చేటట్లూ, కాంతిసేన నతనికిచ్చి పెళ్ళిచేయడానికీ మేము ఒప్పందాలు చేసుకున్నాం" అన్నాడతను.

"అయ్యో! వెర్రివాడా! రాజ్యభోగం కంటె ఇంద్రజాలం ఎక్కువా? తొందరపడి వాళ్ళకి పెళ్ళి జరిపించెయ్యకు. రెండురోజులు గడు వడుగు. నువ్వే పెళ్ళాడేటట్లు చేస్తాను" అని ఆమె అతను తనచుట్టూ తిరిగేటట్లు చేసుకుంది.

ఒకనాడు కరభుడు అంతఃపురానికి వెళ్తూంటే ఆమె అతనికి నమస్కరించి "దేవా. నువ్వు రాజకుమార్తెను పాణిగ్రహణం చేయబోతున్నట్లు తెలిసింది. ఆమె నీకు రహస్యంగా కొన్ని మాటలు చెప్పమంది. మీ వద్ద అద్భుతమైన ఇంద్రజాల విద్య ఉందట. దానిని శంతనుడి కివ్వాలని నిశ్చయించుకున్నావని తెలిసిందట. దాని నెవరికీ యివ్వొద్దంది. నీ కంత మొహమాటమయితే తన దగ్గర దాచమంది" అంటూ యుక్తిగా మాట్లాడింది.

"నాకింతకంటె భాగ్య మేముంటుంది? ఆమె కోసమే యీ విద్యను శంతనుడి కివ్వాలనుకున్నాను ఆమె వద్దన్న పని నేనెందుకు చేస్తాను? ఆమె నా అర్ధశరీరం కదా" అన్నా డతను. ఆమె అప్పటికప్పుడే అతన్ని వెంట బెట్టుకుపోయి అతని చేత ఆ విద్యను కాంతిసేన చేతిలో ధార పోయించేసింది.

అది మొదలు కరభుడు, శంతనుడూ ఒకరికి తెలియకుండా ఒకరువచ్చి కేసరిణితో మాట్లాడి పోతున్నారు ఒకనాడు రాజు శంతనుడితో ఉద్యానవనానికి పోవాలన్నాడు అతను కరభుణ్ని ఇంద్రజాలం ప్రయోగించ మనగా అతను రాజపుత్రికకి తెలియజేశాడు. ఆమె మనోహరమైన ఇంద్రజాలాన్ని ప్రయోగించి కరభ, శంతనులకి కొన్ని ఉపాయాలు చెప్పి పంపింది

శంతనుడు వాడుక ప్రకారం రాజుతో తోటకి వెళ్ళాడు. కరభుడు వారిని రహస్యంగా అనుసరించాడు. ఆ మాయా వనిత ప్రదర్శించిన శృంగార లీలలకు తాళలేక రాజు ఆమె చేయి పట్టుకుని మోహావేశంలో తనని పెళ్ళాడమని నిర్బంధించాడు.

అప్పుడామె – "మనోహరా! నాకొక నిక్షేపముంది ఎంతో కాలం కష్టపడి దానిని సంపాదించాను అదుండే చోటు యీ కుర్రా డెరుగును. కాని వీడు హఠాత్తుగా చచ్చిపోయాడు. వీడితో మూడు మాట లాడాలి. వీడిని బతికించి మాట్లాడిస్తే నిన్నిప్పుడే పెళ్ళి చేసుకుంటా"నని నమ్మకంగా చెప్పింది.

"ఇదెంత పని?" అంటూ రాజు తన శరీరాన్నెక్కడో దాచి ఆ బాలుడి శవంలో ప్రవేశించాడు. ఆ అవకాశం చూసి కరభుడు రాజు శరీరాన్ని వెదికి రెండు ముక్కలుగా నరికి అవతలకి పారిపోయాడు. శంతనుడు – "అయ్యో! రాజుగారినెవరో నరికేశారు చచ్చిపడున్నారు" అంటూ అవతలకి వచ్చేశాడు

బాలుడి శరీరంలోంచి శరభుడు గొల్లున ఏడుస్తూ శంతనుడితో తన గోడు చెప్పుకున్నాడు శంతనుడు – "అయ్యో ఎంతపొరపాటు చేశావు! నాతో చెప్పకుండా శరీరం వదులుతావా? సరేలే ఇప్పుడేనా నీ గుట్టు పదిలంగా కాపాడు. కాంతిసేనని నీకే యిచ్చి పెళ్ళిచేస్తాను" అని

ఆశపెట్టాడు. ఇదంతా రాజపుత్రిక పన్నిన పన్నాగమే. ఆ కుర్రవా డొక కుమ్మరి బాలుడు. పాముకరచి చనిపోయినవాడు.

రాజు దేహాన్ని అంతఃపురానికి తీసుకుపోయి - శవ సంస్కారాలన్నీ యధావిధిగా పూర్తి చేశారు. వెనకటి మంత్రు లందరినీ రప్పించి రాజపుత్రికే పట్టాభిషిక్తురాలయింది. కుమ్మరి బాలుడికి శాలివాహనుడని పేరు పెట్టి తన ఆస్థానానికి వస్తూండమని రాజపుత్రిక నియమించింది.

ఒకనాడు కేసరిణి శాలివాహనుడి చేయి పట్టుకుని - "నీ రూపం చూసి మా రాజకుమార్తె చాలా మోహిస్తూంది. శంతనుడు నీ గురించి మాటి మాటికీ చెబుతూంటాడు. నీ దగ్గర అసామాన్య మయిన విద్యేదో ఉందట. దానిని రాజపుత్రిక కిచ్చావో నిన్ను పెళ్ళాడుతుంది" అని అతనికి నచ్చ జెప్పింది.

"రాజకుమార్తే భార్యఅవుతూంటే ఆపాటి కానుక యివ్వడానికే ముంది?" అంటూ అతనామె వెంట అంతఃపురానికి నడిచి అప్పటి కప్పుడే ఆ విద్య నామెకు ధారపోసేశాడు. అది మొదలు తాను రాజని తలుస్తూ తన బంధువులు పిలిచినా కన్నెత్తి చూడడం మానేశాడు.

ఒకనాడు శాలివాహనుడు కరభుణ్ని చూసి గుర్తుపట్టి - వీడెక్కడి నుంచి వచ్చాడు. వీడే కాబోలు నా గుట్టు బయట పెట్టాడు.

నాకు రాజ్యం సంక్రమించగానే వీడిని ఖైదులో పెట్టించాలి - అనుకుంటూ నడవసాగాడు. కరభుడు వాడి ఉద్దేశం గ్రహించి వాడి ననుసరించాడు. అంతలో శంతను డెదురుగా కరభు డతనితో పరిహాసంగా మాట్లాడాడు. వాళ్ళిద్దరిస్నేహం గమనించి శాలివాహనుడు కొంచెం కోపంగా నిలబడడంతో - "శాలివాహనా! పలకరించవేం? నామీద కోపమొచ్చిందా? ఈ కరభుడి నెరుగుదువా?" అంటూ తను నవ్వాడు.

"నేను నిన్నూ ఎరుగుదును, నువ్వు చేసిన ఉపకారమూ ఎరుగుదును. మూడురోజులు గడవనీండి, నా మహిమ చూద్దురుగాని. ప్రతిఫలం అనుభవిద్దురుగాని" అంటూ మీసాలు దువ్వాడు శాలివాహనుడు. "కాంతిసేన నా భార్య అది తెలుసుకు మాట్లాడండి" అని హెచ్చరించాడు.

ఆ మాటలకు కరభుడు అంతెత్తు లేచి – "కాంతిసేన పేరెత్తితే కుమ్మర గురువుని రెండు ముక్కలు చేసేస్తాను. నే నామె చేత వరించబడిన భర్తని. కులమెరిగి మాట్లాడమను – " అని అరిచాడు

శంతనుడు ఆ మాటలకు కొంచెం కోపగించి – "అప్పుడే నీకు మాత్రం కాంతిసేన భార్య అయిందా? నేను లేకుండా ఒక్కసారి అంతఃపురానికి వెళ్ళి వచ్చినంతలోనే స్వతంత్రుడివై పోయావా? నీ ఇంద్రజాలం నాకేమీ అక్కర్లేదు. కాంతిసేన నిన్ను పెళ్ళి చేసుకుందుకు ఒప్పుకోలేదు" అన్నాడు.

"మనం వాదులాడుకోడం దేనికీ? కేసరిణినే అడుగు అంతా చెబుతుంది. నా విద్య నిప్పటికే కాంతిసేనకి కానుకగా ఇచ్చాను నిజం" అన్నాడు కరభుడు "నేనూ నా పరకాయ ప్రవేశవిద్య నిచ్చా" నన్నాడు శాలివాహనుడు.

ముగ్గురూ తగువాడుతూ కేసరిణి దగ్గరకు వెళ్ళి ముగ్గురిలో ఎవరు కాంతిసేన భర్తో చెప్పమని అడిగారు. ఆ మాటలు విని ఆమె నవ్వుతూ – 'రేపు సూర్యోదయ సమయానికి ఇక్కడికి రండి. చెబుతాను' అంది.

మర్నాడు తూరుపు తెల్లారకుండా ముగ్గురూ వచ్చి కూర్చున్నారు. సంకెళ్ళు పట్టుకున్న రాజ భటులను అక్కడికి తీసుకొచ్చిన కేసరిణి – "వీళ్ళే పెళ్ళికొడుకులు" అని వాళ్ళని చూపించింది. వాళ్ళు ఆ ముగ్గురి కాళ్ళకీ సంకెళ్ళు తగిలించి – "పదండి, పదండి మీకు పెళ్ళి చేస్తాం" అంటూ ఈడ్చుకు పోయారు.

'కాంతిసేన మన ముగ్గురినీ వంచించింది. ఇందు కొకరిని నిందించక్కరలేదు. ఈ ఉపద్రవం మనం తెచ్చి పెట్టుకున్నదే. వీళ్ళు మనని కారాగారంలో పెట్టేటట్లున్నారు. దీనిని తప్పించుకుందుకు మార్గం చూద్దాం. వెనకటి శత్రుత్వాలు మరచిపోదాం. నడమంత్రపు సిరిలా వచ్చిన విద్యలు రెండూ అలాగే పోయాయి. కనక ఇప్పుడు స్నేహంగా ఉండవచ్చు" అని నిశ్చయించుకుని – వాళ్ళు రహస్యంగా చేసిన పనులూ, కాంతిసేన మాటలూ తలుచుకుని నవ్వుకున్నారు. రాజభటులు వారిని ఓడ ఎక్కించి మరో ద్వీపంలో దింపేశారు

# కాశీమజిలీ కథలు

## 75. వ మజిలీ

### వీరసేనుడి కథ

"అయ్యో! పురోహితుడి నని అయినా రాజపుత్రిక కనికరించలేదు. అమ్మకేనా చెప్పనిచ్చింది కాదు. నేను మళ్ళీ నా జన్మభూమిని చూడగలనో లేనో ? –" అని విచారించసాగాడు శంతనుడు. "నీకేం కొరత? పంచాంగం చెప్పుకునేనా బ్రతికేయగలవు. అసామాన్యా లయిన విద్యలను పోగొట్టుకుని మేం రెక్కలు తెగిన పక్షుల మయ్యాం. బ్రాహ్మణులం కదా. ముష్టెత్తుకుని బ్రతుకుదాం. విచారించి ఏం ప్రయోజనం? అక్కడేదో పల్లె కనపడుతూంది" అని కరభశరభులు శంతనుడికి ధైర్యం చెప్పి ఆ జనపదానికి నడిపించారు.

అక్కడున్నవారు కిరాతకులు. వారు క్రూరమైన చర్యలు చేస్తూంటారు. సముద్రంలో చేపలు పట్టి జీవిస్తూంటారు.

మిట్టమధ్యాహ్నం అవడంవల్ల వీళ్ళొక యింటికి పోయి దాహం అడిగారు. భాష తెలియకపోయినా సంజ్ఞలను బట్టి గ్రహించి ఆ యింటి యజమానురాలు పాలుతెచ్చి యిచ్చింది. వాళ్ళు తాగాక వెల యిమ్మంది. వీళ్ళు తమ దగ్గర ధనంలేదని ఎంత బతిమాలినా ఆమె వినలేదు. చివరకి వీళ్ళు ఏదో మిషపెట్టి ఒకరొకరూ జారుకున్నారు. ఇంటి యజమాని వచ్చి వారిని వెదికి పట్టుకుని న్యాయసభకి తీసుకు పోయి నేరారోపణ చేశాడు. వారి దగ్గర దనం ఏమీ లేకపోడం వల్ల న్యాయాధికారి వాళ్ళని వదిలేశాడు. ఆ కారణంగా ఆ పల్లెలోని ప్రజలు రెండు వర్గాలయి ఒకరితో ఒకరు కలహించుకుంటూ ఒకరి నొకరు చంపుకోసాగారు.

ఆ సంగతి విని – కుశధ్వజుడనే పేరు కల ఆ కుశద్వీపం అధిపతి వాళ్ళని పట్టించి తన వద్దకు రప్పించుకున్నాడు. వాళ్ళని

మందలించి వాళ్ళ వృత్తాంతా లడిగాడు. వారు తామెవరో, రాజకుమార్తె కాంతిసేన తను నెలా మోసం చేసిందీ విపులంగా చెప్పి విలపించారు. కుశధ్వజుడు వారిమీద దయచూపుతూ – తనకొడుకు వీరసేనుడిని పిలిచాడు. వారి కథలు వినిపించి– "కాంతిసేన వీరికి చేసిన అన్యాయాని కామెను మందలించి, వీరి విద్యలు వీరి కిప్పించు. నీ మహేంద్రజాల విద్యముందు దాని మామూలు మాయలు చాలవు" అన్నాడు.

వీరసేనుడు సంతోషంగా ఆ ముగ్గురినీ వెంటబెట్టుకుని పరివారంతో ఓడ ఎక్కి జంబూ ద్వీపం చేరి ఆ నగరానికి వెళ్ళాడు. ఆ వూరికి రెండు యోజనాల దూరంలో ఉద్యానవనమూ మేడలూ సృష్టించుకుని పట్టణ మర్మాలు తెలుసుకు రమ్మని భటులను పంపించాడు. కరభుడు, శరభుడు, శంతనుడు గెడ్డాలు పెంచుకుని యోగుల్లా కూర్చుని జపం చేసుకోసాగారు.

చారుల వలన ఆ ఉద్యానవనం గురించి విన్న కాంతిసేన ఆ విశేషాలు తెలుసు కురమ్మని కేసరిణిని పంపింది. ఆమె అక్కడ తిరుగుతూ శంతనుణ్ని గుర్తుపట్టి – "మా పురోహితులు క్షేమంగా ఉన్నారా?" అని నమస్కరించింది.

అందు కతను –" ఇది ఇంద్రజాలం కాదు. మహేంద్రజాలం కాంతిసేనని కాసుకోమని చెప్పు" అన్నాడు కోపంగా.

"మీరింత కోపం తెచ్చుకుంటే ఎలా బతకగలం? రాజపుత్రిక తొందరపడి చేసిన అపకారానికి ఇప్పుడు పశ్చాత్తాప పడుతూంది. నిన్ను రప్పించాలని ప్రయత్నం చేస్తూంది, ఈ వన మెక్కడిది? ఇత నెవడు? ఇతను మహేంద్రజాల నిపుణుడా? నిజం చెప్పు" అని మెల్లగా అడిగింది. "కేసరిణీ. రాజపుత్రిక నా గురించి పశ్చాత్తాపం చెందుతూంది కదా? ఇతను కుశద్వీపాధిపతి కుమారుడు వీరసేనుడు. మహేంద్రజాలంలో దిట్ట. మీ రాజపుత్రిక ఆటలు ఈయన ముందు సాగవు.

మంచిగా మా మాటలు విని మా విద్యలు మాకిచ్చి ఈ రాజపుత్రుణ్ని పెళ్ళి చేసుకోమను. లేకపోతే మీ రాజ్యం అధీనం చేసుకుంటాం " అని వీరావేశంతో పలికాడు.

ఆ మాటలు వినిపించుకోనట్లే ఆమె వీరసేనుడున్న మేడకు పోయి అతనికి తనను పరిచయం చేసుకుని – "మా రాజపుత్రిక మీరాక విని సంతోషిస్తూ మీ మేడకు పంపింది. మీరు మాకు పూజనీయులు కదా!" అంది.

అతను కూడా వాళ్ళలాగే అనే సరికి "మీరు వాళ్ళు చెప్పిన మాటలే విని మా రాజకుమార్తెమీద కోపం చెందుతున్నారు. వాళ్ళలో ఒకడు కుమ్మరి. మిగిలిన ఇద్దరూ పంచాంగం చెప్పుకునే బ్రాహ్మణులు. అలాటి వాళ్ళు రాజకుమార్తెను పెళ్ళాడతామంటే ఏం చేయాలి? రత్నం ఉండవలసింది రాజుదగ్గర కదా? ఎంతో అందమైన రాజకుమార్తె మీ వంటివారికి పట్టమహిషి కావాలికాని ఆ పేదబ్రాహ్మలకి తగిందా? రాజపుత్రిక తగిన వరుడి కోసం చూస్తోంది. మా పుణ్యం బాగుంటే మీరే ఆమె భర్త కాగలరు" అంటూ తియ్యని మాటలు మాట్లాడింది. దానితో వీరసేనుడు "సరే అలాగే చూద్దాం," అన్నాడు.

మర్నాడు కాంతిసేన వారి వనానికి దగ్గరలో ఒక చిన్న వనం సృష్టించి దానిలో పూలు కోయసాగింది. అది చూసి, వీరసేను డా వనం ఇంద్రజాల కల్పితమని తెలుసుకుని మెరుపులు, పిడుగులు, వానని సృష్టించి దానిని నాశనం చేశాడు. ఆమె మళ్ళీ మాయ వన్ని క్రూరజంతువులతో కల భయంకరమైన అడవిని కల్పించింది. ఆ అడవిని చూసి శంతనుడు కరభ,శరభులు భయంతో గెంతులు వేస్తూ పరుగెత్తసాగారు. వీరసేనుడు మరునిముషంలో ఆ మాయని అంతరింప జేశాడు.

కాంతిసేన ఎన్ని మాయలు ప్రయోగించినా వీరసేనుడు వాటిని రూపు మాపుతూ ఉండడంతో ఆమె అతన్ని తన అందంతో మోహంలో ముంచి యింటికి పోయింది.

అప్పుడు కేసరిణి అతని వద్దకు వచ్చింది. "మీ దేవి నాతో మాట్లాడకుండా వెళ్ళిపోయిందేం? నా సామర్థ్యం చూసింది కదా? ఆమె చక్కనిదే నన్ను మెచ్చుకుందా?" అని అడిగాడు వీరసేనుడు.

కేసరిణి నవ్వుతూ, అతను తమ వలలో పడినట్లు గ్రహించి, "దేవా! మా రాజపుత్రిక మొదటే ఓడిపోయానని చెప్పమంది. మీ సామర్థ్యాన్నెంతగానో మెచ్చుకుంది. మిమ్మల్ని తన భర్తగా వరించింది. కాని మీరంగీకరించి నప్పుడు కదా సాఫల్యం?" అంది చాతుర్యంగా.

"ఆమె అందరిలా నన్నూ మోసం చెయ్యదుకదా? ఎందరినో యిలాగే పెళ్ళాడతానని వంచించిం దటకదా?" అని అడిగాడు

"వాళ్ళు వంచకులు కనుక తనూ వంచించింది. కన్యజీవితంలో ఎవరినో ఒకరిని పెళ్ళాడవలసిందే కదా! మీలాటి మనోహరులను వరించడం కంటె భావ్యమేముంటుంది? రత్నం వచ్చి వొళ్ళో పడతానంటూంటే వొద్దనే వెర్రి వాళ్ళెవా రుంటారు?" అందామె. "సరే. ఆమె కిష్టమే అని నువ్వు చెబుతున్నావుగా. ముహూర్తం నిర్ణయించమను" అన్నాడతను.

అంతలో కరభ, శరభ, శంతనులు వచ్చి – "దేవా! మా కోరికలు తీర్చకుండానే పెళ్ళి నిశ్చయించుకుంటున్నారా? మీరు దాని మాయలో పడిపోతున్నారు" అనేసరికి, వీరసేనుడు "మీకేలోటూ రానివ్వను. పెళ్ళాడాక ఆమె మన విధేయురాలే ఔతుంది కదా! అప్పుడు దానిచేత మీ విద్యలు మీకిప్పిస్తాను" అన్నాడు.

"గాంధర్వ వివాహానికి విధినియమాలుండవు. రేపు పొద్దున్న ఇక్కడికి దక్షిణంగా ఉన్న తోటలోకి రండి. ఇద్దరూ మాట్లాడుకుందురు" గాని" అని చెప్పి కేసరిణి వెళ్ళింది.

మర్నాడు కాంతిసేన ఒక మాయా ఉద్యాన వనం సృష్టించి అచ్చు తనలాటిదే ఒక రాజకుమార్తెను కల్పించి అక్కడే ఆమె తిరిగేటట్లూ ఆమెను కేసరిణి అనుసరించేటట్లూ నియమించింది.

అంతలో రాజకుమారుడు మంచి వేషంలో అక్కడికి వచ్చాడు. అతనికి స్వాగతం పలికి కేసరిణి ఒక గద్దెమీద కూర్చొబెట్టింది. రాజకుమార్తె సౌందర్యానికి అతనికి మతిపోయింది. కేసరిణి ఆ మాయలాడిచే అతని మెడలో పూలదండ వేయించింది. అతనామెను

పాణిగ్రహణం చేశాడు. వారిద్దరినీ ఏక శయ్యమీదకు చేర్చి ఆమె పక్కకు వెళ్ళింది. ఆమెను సుముఖురాలిని చేసుకుందుకు – "నీకేమయినా కోరికుంటే అడుగు. తప్పకుండా తీరుస్తాను." అన్నాడు వీరసేనుడు. ఆమె సందేహిస్తున్నట్లు నటించి.. అతనిని పూర్తిగా మోహంలో ముంచి – అతని మహేంద్ర జాలాన్ని కోరింది. ఒళ్ళు తెలియని మన్మథమైకంలో ఉన్నఅతను. "అలాగే ఇస్తాను. నీరు తీసుకురా." అన్నాడు. ఆమె యివతలికి రాగానే నిజమైన కాంతిసేన లోపలికి నీరు పట్టుకెళ్ళి మహేంద్రజాల విద్యను ధారపోయించుకుంది.

మరుక్షణంలో మాయాజాలాన్ని ఉపసంహరించే సరికి ఆ వనమూ అన్నీ మాయమయ్యాయి. కాంతిసేన ఏర్పాటు చేసి ఉంచిన రాజభటులు వీరసేనుణ్నీ అతనితోపాటు కరభ, శరభ, శంతనులనీ తీసుకుపోయి కారాగారంలో పడేశారు. అప్పటికి నిజం గ్రహించిన వీరసేనుడు చాలా పశ్చాత్తాపపడ్డాడు. ' చేతిలో దీపముండి కూడా చీకటిలో పడిపోయాను శంతనా! ఇప్పుడేం చేద్దాం? కోరలు తీసిన పాముల మయ్యాం. మా తండ్రి కీ వార్త ఎవరు చెబుతారు? మాకు టక్కరి టమారి అనే ఇద్దరు స్నేహితులున్నారు. వారి దగ్గర ఈ మాయలేమీ పని చెయ్యవు. వారు వస్తే మనల్ని విడిపించగలరు' అని దుఃఖిస్తున్న అతనితో –

"మిత్రమా! మా కోసం వచ్చి నువ్వు ఆపదలో చిక్కుకున్నావు. దానిని జయించేవారు భూమిమీద లేరు. టక్కరి టమారీలేకాదు వాళ్ళ అబ్బలు వచ్చినా దాన్ని జయించలేరు. ఇంక దాని జోలికి పోవద్దు. ఈ చెరసాలనుంచి తప్పించుకునే ఉపాయం చూడు. మన దారిన మనం పోదాం. ఆ తోటలో ఉన్న మీ పరిచారకులు కొందరిని పట్టుకోలేదు. వాళ్ళు పోయి చెబుతారు" అన్నాడు శంతనుడు.

వాళ్ళు ఆలోచనలలో గడుపుతూ కొన్నాళ్ళు కారాగారంలో ఉండిపోయారు.

# కాశీమజిలీ కథలు

## 76. వ మజిలీ

### టక్కరి టమారీ కథ

వృద్ధరాజుగారి సంవత్సరీకాలకు కొందరు చెరసాల నుండి విడిపించ బడ్డారు. వాళ్ళు చూసుకోకుండా వీరసేన, కరభ, శరభ, శంతనులని కూడా వదిలేశారు. ఆ రాజపుత్రుడు తన దేశానికి పోయి తండ్రితో తన అవమానం చెప్పుకుని దుఃఖించాడు. తన ఇంద్రజాల మహేంద్రజాల విద్యల కంటే ఎక్కువ మాయ నెరిగిన తన మిత్రులు టక్కరి టమారీలనే యిద్దరు దొంగలని రప్పించి – రాజపుత్రిక తనకి చేసిన అవమానం చెప్పి "ఆ రాజకుమార్తెను పట్టుకుని రెక్కలు కట్టి నా దగ్గరకి తీసుకు రావాలి. ఇదే మీరు నాకు చేయవలసిన ఉపకారం. అది చాలా మాయలమారి సుమా! పెళ్ళాడతానని వలపులు విసిరి వలలో వేసుకుంటుంది. దాని మాటలు వినకుండా ఇక్కడికి లాక్కురండి" అన్నాడు.

దానికి వాళ్ళు గాండ్రుమని అరుస్తూ – "ఇది మా కేపాటి పని? ఈ పని చెయ్యకపోతే మావిద్యలెందుకు? మీరు మమ్మ ల్నాదరించి దేశంలో ఉండనిచ్చారు. అందుకు కృతజ్ఞతగా అయినా చేసి తీరతాం" అంటూ మీసాలు దువ్వారు.

వీరసేనుడు కరభ శరభ శంతనులని వాళ్ళకి తోడుగా వెళ్ళమన్నాడు.

"దేవా! ఈ దొంగలామె నేమీ చెయ్యలేరు. ఏదో కపటం పన్ని ఆమె వీళ్ళని మోసం చేస్తుంది. మే మెక్కడికీ పోలేం. మమ్మల్నిక్కడే ఉండనివ్వండి" అని వాళ్ళు బతిమాలారు.

"మాకు ఎవరి సాయం అక్కర్లేదు. ఆ రాజకన్యను మేమే తీసుకువస్తాం" అని టక్కరి టమారీలు బయలుదేరి ఓడమీద ఆదేశం చేరుకున్నారు. తమ విద్యల వల్ల తిన్నగా కోటలోకి పోయి అంతఃపుర కాంతలను అల్లరిపెడుతూ, కేకలు వేస్తూ "రాజపుత్రిక కాంతిసేన ఎక్కడుంది? మాయలు నేర్చిందట. ఏదీ? ఇలా రమ్మనండి. టక్కరి టమారీలం వచ్చాం. మా రాజుగారు వీరసేనుడిని పరాభవించిన దానికి ఫలితం ఇప్పుడే అనుభవించగలరు" అంటూ నాలుగు మూలలా కలియ దిరగసాగారు.

రాజకుమార్తె ఒక మూలదాగుని – కొన్ని మాట లడగమని పరిచారికను పంపింది. అదివారి వద్దకు వెళ్ళి – "మీ రెవరు? ఈ అర్ధరాత్రి మీరెందు కిక్కడి కొచ్చారు? కాంతిసేనను నేనే. మీకేం కావాలి?" అని అడిగింది.

వాళ్ళు ఫక్కున నవ్వి "ఓహో! నువ్వేనా రాజకుమార్తెవి! నీరూపానికి వలచి మా రాజకుమారుడు మోసపోయాడు. పద. అతని పాదాలమీద పడి అపరాధం ఒప్పుకుందువుగాని" అంటూ ఆమెను చెరొక చేయి పట్టుకుని అంతఃపురం దాటించి వీరసేనుడి దగ్గరకు తీసుకుపోయి – "ఇదుగో కాంతిసేన. నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో" అని అతని పాదాలముందు పడేశారు.

"మీ సాహసం మెచ్చ దగిందే కాని ఈమె కాంతిసేనకాదు. ఆమెకు పరిచారిక. ఆమె ఎలాగో మీకు టోకరా వేస్తుందని చెప్పలేదా?" అన్నాడు శంతనుడు.

అప్పుడు వాళ్ళు మళ్ళీ వెళ్ళి కాంతిసేనని పట్టుకుని తీసుకొచ్చేస్తూంటే – భటులు, చతురంగ బలాలూ వారిని వెంబడించారు. కాని వాళ్ళ నేమీ చెయ్యలేకపోయారు.

ఒక మహారణ్యంలో పోతూంటే కాంతిసేన నేలమీద చతికిలపడి ప్రాణాలు వదిలింది. అదిచూసి – వారు "అయ్యో! మన రాజపుత్రుడి కోరిక తీరింది కాదు. ఈ చచ్చిన దాన్ని తీసుకుపోయి

అతని ముందు పెట్టాలా?" అని ఆలోచించ సాగారు. అంతలో కేసరిణి వచ్చి ఏడుస్తూ – "అయ్యా! మరణంతో అన్నివైరాలూ అంతమౌతాయని శాస్త్రాలు చెబుతాయి. ఈమె చనిపోయింది. శత్రువుల కోరిక తీరింది. ఇక శవంమీద కోపమెందుకు? శవాన్ని మా కివ్వండి. దహనసంస్కారాలు చేసుకుంటాం." అని దీనంగా ప్రార్థించింది.

వాళ్ళు – "ఈ శవంతో మాకు పనిలేదు. అక్కడికి తీసుకెళ్ళేసరికి ఎలాగూ కుళ్ళిపోతుంది" అంటూ మృతదేహాన్ని వదిలేసి – సముద్రం దాటిపోయి వీరసేనుడికి కాంతిసేన చనిపోయిందని ఆ వృత్తాంతం చెప్పారు.

అది విని శంతనుడు పక్కున నవ్వాడు. "రాజపుత్రా! నేను చెప్పలేదా? అది చాలా మోసగత్తె అని? దానిని జయించేవాడు ఈ ప్రపంచంలోనే లేడు. అది పరకాయ ప్రవేశ విద్య నేర్చింది కదా. తన ప్రాణా న్నెక్కడో దాచి చచ్చినట్లు నటించింది. ఈపాటికి ఎప్పటిలా రాజ్యమేలుకుంటూ ఉంటుంది".

టక్కరి టమారీలు తెల్లబోయి – "అయ్యో! ఆ కపటం మాకేమీ తెలియదు. నిజంగా చచ్చిందనే అనుకున్నాం. మీరు రాలేదు. మేమేం చేస్తాం? మా మాయ ఒకరిమీద రెండు సార్లకంటె ఎక్కువ సార్లు ప్రయోగించకూడదు. మేం పోతాం. అనుమతివ్వండి" అని వీరసేనుణ్ని ప్రార్థించారు.

రాజకుమారుడు చాలా విచారించి..."సరే, మీపేరు చెప్తేనే అది భయపడక మానదు. మొదట మీరు తీసుకు వచ్చిన పరిచారికతో మాట్లాడేను. దానిని ఆ వూరు చేర్చితే మనకెంతో సాయం చేస్తానంది. ప్రమాణాలు కూడా చేసింది. దానిని వెంట బెట్టుకు పోయి ఎలాగో ఆ రాజకుమార్తె గుట్టు తెలుసుకుని పట్టుకు తీసుకురండి. ఇది మీరు చేయక తప్పదు" అన్నాడు.

టక్కరి టమారీలు ఆ దాదితో కలసి ఆ వూరు వెళ్ళి దానింట్లోనే బసచేశారు. మర్నాడు అది రాజపుత్రిక దగ్గరకు వెళ్ళి నమస్కరించి – "టక్కరిటమారీలు మనవూరు వచ్చారు. నేనూ వాళ్ళతోనే వచ్చాను" అని

చెప్పేసరి కామె భయంతో గుండె పట్టుకుంది. అది చూసి ఆ దాది నవ్వుతూ -

"దేవీ! మీరు భయపడ నక్కరలేదు. వాళ్ళ విద్యలిక మీమీద పనిచెయ్యవని ఆ విషయం చెప్పుకుంటూండగానే విన్నాను" అంటూ ఆ విషయమంతా చెప్పింది. అప్పుడు కాంతిసేన ధైర్యం తెచ్చుకుని ఆమెకు కొన్ని మాటలు చెప్పి పంపించింది.

ఆ దాది వారి దగ్గరకు వచ్చి - "మహాత్ములారా! మీరు నన్ను కూతురిలా చూసుకుంటూ ఎంతో భద్రంగా నన్ను మా వూరు తీసుకొచ్చి బంధువులతో కలిపారు. అందుకు మీకు ఏదేనా ఉపకారం చేయాలనుకుంటున్నాను. అంతఃపురానికి వెళ్ళొచ్చాను. ఆమె పెళ్ళాడాలని చాలా ముచ్చట పడుతూంది. వీరసేనుడు తగినవరుడే కాని ఆమెను తన వూరు రమ్మనడంతో ఆమె కంగీకారం కాలేదు. పుట్టింటి మీద అభిలాష ఒకంతట పోదుకదా! ఇప్పుడు అతన్నే పెళ్ళి చేసుకుంటానని నా చేత వార్త పంపమంది. కాని నాకు మరొక ఆలోచన రావడంతో అతనిలో దోషం ఆరోపించాను. మీకున్న మాయా బల పరాక్రమాలు వీరసేనుడికి లేవు. మీ కీర్తి నేనా ద్వీపంలో విని ఉన్నాను. అందుచేత ఆమెకు మిమ్మల్నే పెళ్ళాడమని చెప్పాలనుకుంటున్నాను. మీ ఉద్దేశ మేమిటి?" అని అడిగింది

"కాంతిసేన పెళ్ళాడతానని ఎందరో మగాళ్ళని వంచించిందనీ ఆ మాట నమ్మొద్దనీ రాజకుమారుడు మాతో చాలాసార్లు చెప్పాడు. నువ్వేమో మరోలా చెబుతున్నావు. నిజమే. ఆడది ఎన్నాళ్ళు పెళ్ళాడకుండా బిగబట్టుకు కూర్చోగలదు? రాజకుమార్తె మాటలు మోసం కాక నిజమే అయితే సంతోషమే" అన్నారు టక్కరి టమారీలు.

"ఆర్యులారా! రాజపుత్రుడు మీతో అలా ఎందుకు చెప్పాడో కొంచెం జాగ్రత్తగా ఆలోచించండి. తాను వలచినది మీ పౌరుషానికి మెచ్చుకుని మిమ్ము వరిస్తే మీరు పెళ్ళాడేస్తారేమో అని అలా చెప్పి ఉంటాడు. మంచివస్తువు మీద ఎవరికి ఇష్టముండదు? రేపు పోయి

ఆమెకి చెప్పి వస్తాను. చెప్పడ మేమిటి, పెళ్ళి నిశ్చయమే అనుకోండి ” అందా దాది.

అదిమొదలు వాళ్ళామెతో – “పెళ్ళి విషయం నిశ్చయించావా? ’ అని అడగడం మొదలుపెట్టారు. నాలుగు రోజు లయ్యాక అది ఒకనాడు టక్కరితో రహస్యంగా – “నీ మాటరాజపుత్రికకు చెప్పాను. ‘ఇద్దరి నెలా చేసుకుంటాను? నీ కిష్టమైన వాడెవడో చెప్పు. అతన్నే చేసుకుంటాను’ అంది. నేను నీ మాటే ఎక్కువగా చెప్పాను ఆమె అంగీకరించింది కాని టమారే మంటాడో? ఆలోచించు” అంది.

“నిజమే ఒక ఆడది ఇద్దరి నెలా చేసుకుంటుంది? టమారి ఏమంటాడు? రాజపుత్రిక కెవరిష్టమో వారినే పెళ్ళాడమను” అన్నాడు ఆమె టమారికి కూడా అలాగే చెప్పింది. వాడూ టక్కరి లాగే అన్నాడు

ఒకనాడు వాళ్ళిద్దరినీ ఒకరికి తెలియకుండా ఒకరిని రాజపుత్రిక ఉన్న ప్రాసాదానికి తీసుకెళ్ళి చెరోచోటా కూర్చోబెట్టింది ఎవరికి వారే తా మొక్కరే అక్కడికి వచ్చామనీ రాజకుమార్తె తననే వివాహమాడుతుందనీ పొంగిపో సాగారు.

కాంతిసేన మొదట జగన్మోహన రూపంతో టక్కరి వద్దకు వచ్చి దాసితో “నువ్వు పొగిడిన పురుషుడు ఇతనేనా? ఏమి ఓలి యిప్పిస్తున్నావు? నా విద్య వీని కిస్తున్నాను. వీని విద్య నా కిమ్మని చెప్పావా?” అని అతని మీద తళుకు చూపులు ప్రసరించేసరికి అతని కిక నోరు పెగలక తన టక్కరి విద్యను ఆమెకు ధారపోసి అమె విద్య నిమ్మన్నాడు. “ఇప్పుడే వస్తాను. వివాహానికి సన్నద్ధం చేయించు” అని చెప్పి టమారి దగ్గరకు పోయి వాడి విద్యని కూడా తీసుకుంది

టక్కరి టమారీలు పెళ్ళికూతు రొస్తుందని ఎదురు చూస్తూంటే – రాజభటులు వచ్చి సంకెళ్ళు తగిలించి కారాగారంలో పారేశారు. ఆ విషయం విని ప్రజలందరూ సంతోషించారు.

కొన్నాళ్ళయ్యాక టక్కరి టమారీలు ఎలాగో కారాగార రక్షకులని వంచించి బయటపడి కుశద్వీపానికి పోయి రాజపుత్రుని కలుసుకున్నారు.

అతనక్కడి విశేషా లడిగేసరికి వాళ్ళు కన్నీరు కారుస్తూ జరిగినదంతా చెప్పారు. దాది తమను మాయమాటలు చెప్పి ఎలామోసం చేసిందో వివరించి దుఃఖించారు. తమ విద్యలు పోయినందుకు ఎంతో ఏడిచారు. అది చూసి కరభశరభ శంతనులు ఫక్కున నవ్వారు.

రాజపుత్రుడు టక్కరి టమారీల నోదార్చి - "విద్యలు పోయినా మీకేమీ భయం లేదు. మేము మిమ్మల్ని పోషిస్తాం. యథేచ్ఛగా తిరగండి" అన్నాడు. వాళ్ళిద్దరూ ఇంటికి వెళ్ళిపోయారు.

అప్పుడు రాజకుమారుడు - "శంతనా! మనమిక కాంతిసేనను జయింపలేమా? భూమ్మీద మాయాబల వేత్తలే లేరా?" అని అడిగాడు.

అందుకు శంతనుడు "రాజపుత్రా! విద్యలు నేర్చిన వారెందరో ఉంటారు. కాని కాంతిసేనని మాత్రం జయించలేరు. మనమిక దాని జోలికి పోక సుఖంగా ఇక్కడుందాం. లేకపోతే ముప్పు తప్పదు" అన్నాడు. వీరసేనుడందుకు ఒప్పుకోలేదు. ఎలాగేనా కాంతిసేనని పరాభవించాలన్న ఉద్దేశంతో శాంబరీ విద్య తెలిసిన వాళ్ళ గురించి వెదుకుతూ దేశాటనం చేశాడు.

అంతవరకూ చెప్పి తరవాత కథను తదుపరి మజిలీలో చెప్పసాగాడు మణిసిద్ధుడు.

# కాశీమజిలీ కథలు

## 77. వ మజిలీ

### కామందకుని కథ

"శంతనా! ఈ అగ్రహారంలో జలంధరుడనే బ్రాహ్మణుడు గజకర్ణ గోకర్ణాలనే మహా మాయా విద్యలను తెలిసిన వాడట. అతను మహా తపశ్శాలి అవడం వల్ల ఎవరిమీదా ప్రయోగించ డట. అతనికి కామందకుడనే కొడుకున్నాడు. వాడు సకల గుణాభిరాముడు. ఏవిద్యా రానివాడు. ఒక్కడే కొడుకు అవడం వల్ల తండ్రికి వాడంటే మహాప్రాణం. అదీకాక కొడు కెలాటి వాడైనా తండ్రి తనకొచ్చిన విద్యను ఉపదేశించక మానడు. ఆ విద్యలు మనకి స్వాధీనా లయితే ఆ రాజపుత్రిక కాంతిసేనను దాసిగా చేసుకోకపోతామా?" అన్నాడు వీరసేనుడు.

శంతనుడు సరే అనడంతో శరభ కరభ శంతన వీరసేనులు నలుగురూ ఆ అగ్రహారంలో ప్రవేశించి మెల్లగా కామందకుడితో స్నేహం చేసి పదిరోజులు కలిసి మెలసి తిరిగారు. అప్పుడు వీరసేనుడు కామందకుడిని – "నీ తండ్రి గొప్ప విద్వాంసుడు. గజకర్ణ గోకర్ణాలనే మహావిద్య నెరిగినవాడు. అలాటి వాడి కొడుకు వయిన నీకు పెళ్ళికాలేదేం? నీ కెవరూ పిల్లనివ్వలేదా?" అని అడిగాడు. "నాకు పిల్లనిస్తామని ఎందరో వచ్చారు కాని నాకు నచ్చినది దొరక్క పెళ్ళాడలేదు. మా బ్రాహ్మణులలో శృంగార కళా చాతుర్యం కలవా రుండరు – " అన్నా డతను.

"నువ్వు రసిక శేఖరుడివి. నీకు తగిన దొకతె ఉంది. ఆ సొగసు, వగలు, వయ్యారం, మాయలు, విలాసాలు ప్రపంచంలో మరొకరి కుండవు. స్వతంత్రంగా రాజ్యం చేస్తున్న ఆమె కాంతిసేన అనే క్షత్రియ

కన్యక. దానికి ఇంద్రజాల, మహేంద్రజాల టక్కుటమారీ విద్యలన్నీ తెలుసు. మీ తండ్రి దగ్గరున్న గజకర్ణ గోకర్ణ విద్యలు మాత్రం తెలియవు. నువ్వు వాటిని ఉపదేశం పొందావో నిన్ను వరిస్తుంది. దానిమాయకు లోనై నీ విద్యల నిచ్చావో మా లాగే కష్టపడతావు" అంటూ వారి వృత్తాంతాలు చెప్పారు.

అదంతా విని - కామందకుడు తండ్రి వద్దకు 'వెళ్ళి నమస్కరించి – "తండ్రీ! మీరు నాకు పెళ్ళి చేస్తానని ఎన్ని సార్లన్నా నేనే ఉపేక్షించాను. నాకు తగిన చిన్నది కాంతిసేన అనే రాజకుమార్తె. మీ వద్దనున్న విద్యలూ రెండూ నాకు ఉపదేశించండి. క్షణంలో ఆమెను పెళ్ళాడి మీ దగ్గరకు తీసుకొస్తాను" అంటూ ఆమె వృత్తాంతం చెప్పాడు.

ఆ తపస్వి నవ్వుతూ – "నీ తెలివితేటలు నే నెరుగనివికావు. టక్కరిటమారీలనే వంచించిన రాజకుమార్తెను నువ్వు వంచించ లేవు. ఇంటి దగ్గర సుఖంగా ఉండు." అని ఎంతో బోధించాడు.

కాని కొడుకు వినలేదు. చనిపోతానని బెదిరించాడు. ఒక్కడే కొడు కవడంతో ఆ తండ్రి – "నీకు గజకర్ణ విద్యమాత్రం ఉపదేశిస్తున్నాను. నువ్వు రెండింటికి తగవు. ప్రజ్ఞ ఉంటే ఆ విద్యతోనే సాధించుకోవచ్చు – " అని ఆ విద్య నుపదేశించాడు.

కామందకుడు గజకర్ణ విద్యను ఉపదేశం పొంది మిత్రులు నలుగురితోనూ కలసి రాజపుత్రిక దగ్గరకు బయలు దేరాడు. పెళ్ళాడేవరకూ దానిమాటలేమీ నమ్మవద్దనీ, పెళ్ళాడతానని విద్య లాక్కుంటుందనీ, వాళ్ళ విద్యలు వాళ్ళకిప్పించాలనీ ఎన్నో జాగ్రత్తలు చెప్పారు వారు. కామందకుడితో కొంతదూరం వచ్చి – ఆ వూరు వెళ్తే రాజకుమార్తె పట్టించి మళ్ళీ ఖైదులో పడేయిస్తుందని వాళ్ళు మరో గ్రామం వెళ్ళిపోయారు.

కామందకుడు ఆ వూరు వెళ్ళి తనతో కలహానికి రమ్మని రాజపుత్రికకు లేఖ పంపాడు. కాంతిసేన మామూలుగానే కేసరిణికి కొన్ని మాటలు చెప్పి పంపించింది.

కామందకుడికి నమస్కరించి – "ఆర్యా! నేను రాజపుత్రికకు ఆంతరంగిక దాదిని. ఆమె మీకు స్వాగతం చెప్పమంది. మీ విద్యా పాటవాని కెంతో ఆశ్చర్యపడింది. మీరు లోక పూజ్యమైన విప్రవంశంలో జన్మించారు. త్రిలోక మోహజనకమైన విద్యలు సంపాదించారు. మీకు మా రాజపుత్రిక ఎదురాడ గలదా? పూజించి అంతఃపురానికి తీసుకు రమ్మంది. వీరసేనుడనే రాజపుత్రుడి ప్రోత్సాహంతో మీరు పోట్లాటకు వచ్చారని భావిస్తున్నాం. అతను మా రాజపుత్రికను పెళ్ళాడతానని చాలా చిక్కులు పెట్టాడు" అంటూ యుక్తిగా నేరం వీరసేనుని మీదకు తోసేసింది.

"నీ మాటలు చాలా ఆశ్చర్యకరంగా ఉన్నాయి శాంతిసేన వారందరినీ పెళ్ళాడతానని చెప్పి వారి విద్యలు లాక్కుని జైలులో పెట్టించిందట కదా? ఆమె చాలా క్రూరురాలని వాళ్ళు చెప్పారు. నీ మాటలు చూస్తే ఆమె తప్పేమీ కనపడదు. ఈ మాత్రానికే అంత యిదిగా చెప్పారా!"

"అయ్యా! నీటికొద్దీ తామర అన్నట్లు మా రాజపుత్రిక క్రూరులకు క్రూరురాలే. టక్కరి టమారీలు వచ్చి చేసిన అల్లరి అంత యింతానా? వారిని వంచించడం తప్పా? మీలాటి వారిలో ఏలోపం ఉందని కపటం చెయ్యాలి? ఆమె అవివాహితగా ఉండిపోడానికి ఫలం మీవంటి వారు లభించడమే ఏమో" అని అతని నామె పొగిడేసరి కతను ఉబ్బిపోయాడు. "నేను కాంతిసేనని పెళ్ళాడడాని కంగీకరించాను. ఆమె ముందుగా నావిద్య ఇమ్మంటే ఇవ్వను సుమా. మొదటే చెబుతున్నాను. మంగళసూత్రం కట్టాకే ఆమాట ఆలోచిస్తాను. ఇందుకు ఇష్టమైతే ఆమెకు చెప్పిరా. లేకపోతే నేనంగీకరించను" అన్నాడు కామందుడు.

కేసరిణి నవ్వుతూ – "ఆర్యా! మీకీ సందేహం ఎందుకు కలిగింది? మీరు భర్తయితే చాలని మా రాజకుమార్తె కోరుకుంటూంది. మీ విద్యలు మాకేమీ అవసరంలేదు. మంగళసూత్రం కట్టాకే యివ్వొచ్చు" అని అతన్ని వెంట బెట్టుకుపోయి రాజోపచారాలు చేయించింది. రాజపుత్రిక అని చెప్పి – అలంకరించబడిన దాసీ దానితో వివాహం చేసి ఆమె మెడలో అతని చేత మంగళసూత్రం కట్టించింది. తరవాత పెళ్ళి కూతురి చేత గజకర్ణ విద్య తన కిమ్మని అడిగించింది.

పెళ్ళి జరిగిపోయింది కదా ఇంకెక్కడికి పోతుందని అతనా విద్యను భార్యకు ధారపోశాడు. అది ఆమె వెంటనే రాజపుత్రిక కిచ్చింది. శాంబరీ విద్యాబలం కోల్పోయిన కామందకుణ్ని పట్టుకుని చెరసాలలో పెట్టించింది.

ఈ వార్త గూఢచారుల వలన తెలుసుకున్న అతని మిత్రులు జలంధరుని వద్దకు వెళ్ళి – "మహాత్మా! మీ కుమారునకు కాంతిసేన తగని అవమానం చేసింది. దాసీ పుత్రికతో పెళ్ళి చేసి అతని విద్యలాక్కుని చెరసాలలో పెట్టించింది. ఉత్తమ బ్రాహ్మణ పుత్రునకు ఇలా చేయడం ఉచితమా?" అని రోషం ఎక్కించారు.

"నామాట విననందు కిలాటి ప్రాయశ్చిత్తం వాడికి జరగవలసిందే. పోనీండి" అన్నాడు ఆయన. కాని అతని భార్య – "వాడు చెరసాలలో ఉంటే ఊరుకుంటారా? వాడిని విడిపించుకొచ్చే వరకూ నేను భోంచేయను –" అంది.

ఆతపస్వి – "అయ్యో! నేనేం చేసేది? నా విద్యను పరుల పీడకి ఉపయోగించను. ఆమె నా మాటవిని వాడిని వదులుతుందా?" ఏం చేయాలి? అని ఆలోచిస్తూంటే, అతని శిష్యుడు, తిమ్మర్సు మనవడు రత్నపాదు డనేవాడు గురువుకి నమస్కరించి – "మీరీ పనికోసం విచారించడం ఎందుకు? ఆ గోకర్ణ విద్య నాకుపదేశించండి. ఆ రాజకుమార్తెను శిక్షించి మీ కొడుకుని విడిపించుకుని వస్తాను. అలా చెయ్యలేక పోతే నేను తిమ్మర్సు మనవడినే కాను" అన్నాడు.

అతని బుద్ధి బలం తెలిసిన గురువు అతనికప్పటి కప్పుడే ఆ మంత్రం ఉపదేశించాడు. "నీకు మేము ఉపాయాలు చెప్పక్కర్లేదు. ఎవరినీ నొప్పించకుండా కార్యం సాధించుకు రా" అని దీవించి పంపాడు. రత్నపాదుడు శంతనుడి నడిగి ఆ రాజపుత్రిక చరిత్రంతటినీ తెలుసుకుని వారిని వెంట పెట్టుకుని ఆ పట్నానికి బయలు దేరాడు. వాళ్ళు అతని రూపురేఖావిలాసాలూ ధైర్యసాహసాలూ చూసి – 'వీడు రాజకుమార్తెని తప్పకుండా జయిస్తాడు' అనుకున్నారు.

# రత్నపాదుడి కథ

ఇంద్రజాల విద్యలలో కెల్లా అధికమైనది గోకర్ణ విద్య దానిని మించిన మాయలులేనే లేవు. రత్నపాదుడు అలాటి గోకర్ణ విద్యతో ఆ పట్నానికి వెళ్ళి మాయాబలంతో అనేక సైన్యాలను సృష్టించి, బేరీ వాద్యాలు భూమిని దద్దరిల్ల జేస్తూంటే ఒక్కసారిగా ఆ పట్నాన్ని ముట్టడించాడు. దానితో పౌరులందరూ తల్లడిల్లి తలోపక్కకూ పారిపోయారు కాంతిసేన కూడా తన సేనలను సిద్ధంచేసింది కాని నేలయీనినట్లు శత్రుసైన్యం కనపడుతూంటే చూసి - తన ఇంద్రజాల మహిమతో అవి మాయాబలాలని తెలుసుకుని ప్రజలకు ధైర్యం చెప్పింది. అయినా సరే వారు కకావికలై పారిపోసాగారు.

రత్నపాదుడు ఎవరికీ కనిపించకుండానే ఒక సారి భూకంపం కలగజేసి ఆ ప్రాంతాన్ని బొంగరంలా గిరగిర తిప్పేస్తాడు మరోమాటు పెనుగాలులూ, మబ్బులూ సృష్టించి పిడుగుల వర్షం కలిగిస్తాడు. కలనుంచి మెలకువ వచ్చినట్లు, తరవాత మళ్ళీ ఏమీ కనపడదు.

ఒకనాడు పౌరులు రాజపుత్రిక వద్దకు పోయి - "దేవీ! నువ్వు ఉపేక్షిస్తే మేము నిలవగలమా? ఇలాటి ఉపద్రవాలు ఎన్నడూ ఎరుగం. ఈ మాయలన్నీ నీ రాజ్యంలోనే సంభవిస్తున్నాయి. ఈ విపరీతాలకు హోమాలో, యజ్ఞాలో జరిపించు" అని ప్రార్థించారు. అందుకామె "ఇది ఒక మాయాజాలం. దీనికి మీరు భయపడనక్కర్లేదు. ఇవేవీ మిమ్మల్ని బాధించవు. రెండు మూడు రోజుల్లో ప్రతిక్రియ చేస్తాను" అని - "మన పట్నానికి వింత వా రెవరేనా వచ్చారేమో చూసిరండి" అని నాలుగు మూలలకీ దూతలని పంపింది.

ఒక దేవాలయంలో వారు రత్నపాదుడిని చూసి - "మీదేవూరు? ఏదేశం?" అంటూ వివరాల దగగా అతనేమీ సరిగా చెప్పక పోపొమ్మన్నాడు ఆ వార్తను దూతలు రాజకుమార్తెకు చెప్పారు. అప్పు డామె కేసరిణిని అతని వద్దకు పంపింది. ఆమె అతనికి నమస్కరించి - యుక్తిగా అతని వివరా లడిగి - "మా రాజపుత్రిక మీ క్షేమం తెలుసుకుని రమ్మంది. మా నగర ప్రజలకు వింతలను చూబించిన వారు దేవరయే అనుకుంటాను" అంది.

అందుకతను – "మాది దక్షిణదేశం మేము బ్రాహ్మణులం. దేశాటనం చేస్తున్నాం. మీ రాజకుమార్తె మాయ విద్యలలో చాలా ప్రౌఢ అని విని యిక్కడికి వచ్చాం. మీరు చూసిన వింతలన్నీ నేను చేసిన జాలములే. మీ రాజకుమార్తె వాటికి ప్రతిక్రియలు చేసింది కాదేం?" అని అడిగాడు.

"ఆర్యా! మీ సామర్థ్యం మరెవరికేనా ఉంటుందా? మీ ప్రభావంలో వెయ్యోవంతయినా కాంతిసేనకి లేదు. మీ కెదురెలా చెప్పగలదు? ఇప్పుడామె వివాహం చేసుకునే అభిలాషతో ఉంది. విద్యలలో తననెవ రోడిస్తారో వారిని భర్తగా స్వీకరిస్తానని నియమం పట్టింది. మీముందు ఆమె ఓడింది కనక మీరే ఆమెకు భర్త. రాజ్యంతో సహా ఆమెను పాణిగ్రహణం చేయండి" అంది కేసరిణి చతురంగా "కేసరిణీ! మీ రాజపుత్రిక చరిత్రంతా మేము విన్నాం. ఇదివరకే ఎంతోమందిని పెళ్ళాడిందట నే నామె కెన్నవ భర్తని? నావిద్యను ఓలిగా యివ్వాలా? తరవాత నన్ను కారాగారంలో పెట్టిస్తుందా? మీ మాయలలో పడడానికి నేను కరభ శరభ శంతునులను కాను. టక్కరి టమారీలను కాను. మా గురు పుత్రుణ్ని చెరసాలలో పెట్టించారు. అతన్ని వదలక పోతే నా మాయా విద్యామహిమతో మీ పట్నమంతటినీ నీట కలిపేస్తాను చూడు" అని అతననేసరికి

కేసరిణి – "ఆర్యా! మేము ఎందరో వంచకులని వంచించిన మాట నిజమే. మీ దగ్గర నిజం దాచాం. మా మాయకు లోబడక మిగిలిన వానినే మా రాజపుత్రిక పెళ్ళాడుతుంది. మీరు అతీతులు కనుక మీకు చెప్పాను. దీనిలో తప్పేముంది? రండి. మా రాజపుత్రికని పెళ్ళాడండి" అంది వినయ పూర్వకంగా.

" మీ రాజపుత్రికను మేము పెళ్ళాడ దలుచుకున్నప్పుడు కదా మీరు వంచించడం? మా కలాటి అభిలాషలేదు. మా గురుపుత్రుని రప్పించమని చెప్పు" అంటూ అతనామెను మరేమీ మాట్లాడనివ్వలేదు.

కేసరిణి వెళ్ళి రాజపుత్రికకు అంతా చెప్పింది. అత నసాధ్యుడని గుర్తించి ఆమె ఎన్నో మాయెపాయాలు పన్నింది కాని అతను వాటన్నిటికీ ప్రతిక్రియ చేసి వారినే అవమాన పరిచాడు

అప్పుడు కేసరిణి వెళ్ళి రాజపుత్రికని పెళ్ళాడుదువు గాని రమ్మని కోరితుంది." వారి వలన సంగ్రహించిన విద్యలన్నీ యిస్తేనే నేను పెళ్ళాడతాను. లేక పోతే నా కక్కర్లేదు" అని సమాధానం చెప్పాడతను

ఆ మాటవిన్న కాంతిసేన అతను అనన్య సామాన్యుడని గ్రహించి, సఖులతో కూడా ఆ కోవెలకి వెళ్ళి అతని పాదాలకు నమస్కరించి – "ఆర్యా! మీరు పూజ్యమైన బ్రాహ్మణ వంశంలో జన్మించారు. మీరెరగని ధర్మా లుండవు కరభశరభులు బ్రాహ్మణులే అయినా దుర్మార్గులవడం వల్ల ఆ విద్యల కర్హులు కారు. టక్కరి టమారీల దగ్గర అలాటి మాయలుంటే లోకాని కెంత అపకారమో ఆలోచించండి. వీరసేనుడు రాజపుత్రుడే అయినా పూర్వాపరాలు తెలియనివాడు కనుక అతని దగ్గర కూడా ఆ విద్య ఉండ దగనిది. మీ గురుపుత్రుని చాపల్యం మీకు తెలియనిది కాదు. దుర్జనుల దగ్గర ఇటువంటి విద్యలు ఉండకూడదనే ఆ విద్యలను నేను లాక్కున్నాను నాకీ మాయ విద్యలతో ప్రయోజనం ఉందని కాదు. మీరు ఉత్తములు కనుక ఈ విద్యలన్నీ మీ వద్ద ఉండవచ్చును. మీ కిప్పుడే ధారపోస్తున్నాను. తీసుకోండి. మీ గురుపుత్రుణ్ని కూడా మీతో తీసుకు వెళ్ళండి" అని ఆమె ఎంతో నమ్మకంగా చెప్పింది.

ఆ మాటల కతను చాలా సంతోషించి – "నీ మాటలు చాలా చక్కగా ఉన్నాయి. ఈ విద్యలన్నీ నీ దగ్గర ఉండ దగినవే. మా గురువు చాలా తపశ్శాలీ! సకల విద్యా పారంగతుడూ. ఆయనకు లేక లేక కలిగిన కొడుకుని పట్టుకుని నువ్వు కారాగారంలో పెట్టావు అతనికోసం ఆ మహానుభావుడు చాలా పరితపిస్తున్నాడు. నువ్వు కామందకుడిని వివాహం చేసుకోవాలని నా కోరిక" అన్నాడు.

అందుకామె – "సర్వజ్ఞులయిన మీరు అలా అనడం నాకు విచారం కలిగిస్తుంది. అధముడికి ఆలి కావడం కంటె తమ్ముడికి దాసిగా ఉండడం మేలని పెద్ద లంటారు మీ గురుపుత్రుడెటువంటి వాడో మీకే

తెలుసు అదీకాక నన్నీ విద్యలో ఓడించిన వాడినే పెళ్ళాడతానని నియమం చేసుకున్నాను. అన్నిటికంటే వ్రతభంగం ఎక్కువ కదా? మీ వంటి వారికి నేను చెప్పనక్కర్లేదు" అందామె వినయంగా. "నువ్వనేదీ నిజమే. కాని నా గురువు తన కొడుకు విజయం కోసం నాకా మంత్రం ఉపదేశించాడు. ఇప్పుడు నేను మరొకలా చేస్తే అతనేమను కుంటాడు? అది నాకు సమంజసం కాదు. నువ్వు మరో మార్గం ఆలోచించుకో." అన్నాడు రత్నపాదుడు.

" మీ గురువుగారి అనుమతితోనే మిమ్మల్ని వివాహం చేసుకుంటాను. వ్రత భంగానికి ఆయన మాత్రం సమ్మతిస్తాడా?" అంటూ సీత దృష్టాంతం చెప్పి అతనింకేమీ మాటలాడకుండా చేసింది.

అప్పటి కప్పుడే దూతలని పంపి జలంధరుణ్ణి అక్కడికి రప్పించి, రత్నపాదుడి గురించి చెప్పి - "ఆర్యా! మీరే నాకు తల్లితండ్రులు. తగిన వరుడికిచ్చి పెళ్ళి చేయండి" అని ప్రార్థించింది. ఆ తపస్వి ఆమె బుద్ధి కుశలతకు చాలా సంతోషించి - రత్నపాదుడినే వివాహం చేసుకోమని అజ్ఞాపించాడు

గురువు అజ్ఞమేరకు రత్నపాదుడు కాంతిసేనని వివాహం చేసుకుని, కామందకుడు ప్రధానిగా, వీరసేనుడు సహాయకుడుగా, కరభ శరభ శంతనులు పరిహాస సఖులుగా ఆ రాజ్యాన్ని చాలా కాలం పరిపాలించాడు.

కష్టపడి సంపాదించింది ఒకరయితే సుఖంగా అనుభవించేది మరొకరనే సామెత ఈ కథ వలన తెలుస్తూంది.

గోపా! ఇంద్రజాలం మొదలయిన విద్యల ప్రభావం ఇదే" అని చెప్పి శిష్యుడితో తరవాతి మజలీకి బయలుదేరాడు మణిసిద్ధుడు.

# కాశీమజిలీ కథలు

## 78. వ మజిలీ

### కౌముదీ కళావతుల కథ

"ఇవాళ వింత లేమీ కనపడలేదు గురువుగారూ. రామలింగకవి కుమారుడి గురించి వినాలనుంది. అతని గురించి మంచి కథ ఏదయినా ఉంటే చెప్పరూ?" అని అడిగాడు గోపాలుడు.

మణిసిద్ధుడు మణిని భక్తితో పూజించి – "గోపా! నీ ప్రశ్నకు తగిన ఆశ్చర్యకరమయిన కథ ఒకటి తోస్తుంది. చెబుతాను, విను" అంటూ చెప్పసాగాడు

"తెనాలి రామలింగకవి కుమారుడు వసుంధరుడు యక్షిణీ వరప్రభావంతో రాయల వారి కూతురు కళావతిని, కుముద్వంతుని పుత్రిక కౌముదినీ పెళ్ళాడి యిద్దరు భార్యలతోనూ సుఖిస్తూ కుముద్వతీ నగరాన్ని పాలిస్తున్నా డని నీకు ఇంతకు మునుపు చెప్పాను కదా? రాయలవారి భార్య కళానిలయకు కళావతిని వసుంధరుడి కివ్వడం యిష్టంలేకపోయినా, కళావతి వరించడం చేత కూతురిమాట కాదనలేకపోయింది.

ఒకనాడు – పల్లవిక కూతురు మంజిరిక అనే పరిచారికను కళావతి పంపగా కుముద్వతీ నగరం నుంచి కళానిలయ వద్దకు వచ్చి నమస్కరించి – "కళావతి, కౌముదీ క్షేమంగా ఉన్నారు. మీ కుశలం తెలుసుకు రమ్మన్నారు" అంది.

కళానిలయ ముఖం యింత చేసుకుని – "కౌముది క్షేమం ఎవరికి కావాలి? కళావతి ఎలా ఉంది? మందారవల్లి అక్కడే ఉందా కళావతిచేత పనులు చేయించుకుంటూందా? అయ్యో! మా ఇంటి కడుపుకూటి బ్రాహ్మణ్ణి పెళ్ళాడిన ఆ భోగందానికి గర్వభంగం చెయ్యలేక

పోయాను కదా. అది నాకు చేసిన అవమానం స్వల్పమే. నా ముద్దుల కూతుర్ని దానింటికి దాసిగా చెయ్యవలసి వచ్చింది. పాడు విధీ! ఈ మానవతీ శిరోమణి కెంత అవమానం కలగజేశావు అయ్యో! నా బిడ్డ రహస్య విశేషాలేమయినా చెప్పిందా? చెప్పు" అంది.

"అమ్మా! కళానిలయా! కళావతి భర్తకు ప్రాణంలో ప్రాణంలా ఉంది. మందారవల్లి ఆమెను కన్నబిడ్డలా చూసుకుంటూంది కౌముది కామె మీద ఎంత ప్రేమో చెప్పలేను. వసుంధరుడికి పట్టమహిషి అయి రాజ్యం ఆమె పాలిస్తూంది. ఆయన ఇద్దరు భార్యల్నీ సమానంగా చూసుకుంటున్నాడు. ఇప్పుడు యిద్దరూ గర్భవతులయ్యారు మీకు మనవడు పుట్టబోతున్నాడు. ఆ శుభవార్త చెప్పాలని వచ్చాను. కళావతి కేమీ లోపం లేదు ఇంతకంటే మీతో ఏమీ చెప్పమనలేదు" అంటూ ఆమె అక్కడి కథంతా చెప్పింది.

ఆ వార్తవిని కళానిలయ మురిపెంతో –"ఏమిటీ. గర్భవతులయ్యారా. ఐతే నా కూతురు వేడుకలు చూసే దెవరు? మందారవల్లి బిడ్డలను కని ఎరగదా? నెలలు నిండిన పిల్లను పుట్టింటికి పంపక తన దగ్గర ఉంచుకుంటుందా? నీకు కడుపునిండా కూడు పెడుతూందని ఊరికే దానిని పొగుడు తున్నావు. చాలులే అయ్యగారి దగ్గరకు వెళ్ళి మందారవల్లి పెట్టే కష్టాలన్నీ చెప్పు. వెళ్ళు" అని కొన్ని మాటలు చెప్పి పంపించింది.

ఆమె ముందుగా తన తల్లి అయిన పల్లవిక వద్దకు వెళ్ళింది. "అమ్మా! కళానిలయ విద్వాంసురా లయినా సహజమయిన క్రూరగుణం వదిలింది కాదు. కళావతి అక్కడ ఎంతో సుఖపడుతూంటే అయ్యగారితో లేనిపోని నేరాలు చెప్పమంది వసుంధరుడి రెండో భార్య కౌముదికి గర్భస్రావం అయ్యేటట్లు చేయమంటూంది. అప్పుడు కాని తన కూతురు చూలుకి సంతోషించదట ఈ మాటలు నీకు చెప్పమంది. నేనీ ద్రోహం చెయ్యలేను. నువ్వే ఆలోచించుకో" అంది.

అందుకు పల్లవిక – "అమ్మాయీ! యజమాను లేం చెబితే అది చేయడమే తప్ప మంచి చెడులను విమర్శించే పని మనకి లేదు. ఆమె తండ్రి నిన్ను ఆమెతో అరణంగా పంపాడు. తరతరాలనుంచీ మనం వాళ్ళ నాశ్రయించుకుని ఉన్నాం. మన శరీరాలు వాళ్ళ తిండితో పెరిగాయి – " అంటూ ఆమె తనకూతుర్ని ఒప్పించి రాయల వారి వద్దకు పంపింది. కాని ఆమె మాటల నుంచి రాయలు ఏమీ తేల్చుకోలేక కళావతిని తీసుకురమ్మని మంజరికను పల్లకీతోపాటూ తగిన పరివారమూ యిచ్చి పంపాడు.

కౌముదీ కళావతులు అక్కచెల్లెళ్ళ కంటె ఎక్కువగా మెలుగుతూ ఇద్దరూ ఒక చోటనే ప్రసవించాలని నిశ్చయించుకుని ఉండడంతో కళావతి వచ్చిన పరివారాన్ని వెనక్కి పంపి వేసి తరవాత ఎప్పుడో వస్తానని ఉత్తరం రాసిపంపింది.

ఒకనాడు మంజరిక వచ్చి – "అక్కలారా! ఎక్కడినుంచో ఒక ఎరుకల సాని వచ్చింది. త్రికాల వృత్తాంతాలనీ మహర్షులకంటె కూడా చక్కగా చెబుతూందట మీకెలాటి సంతానం కలుగుతుందో చెప్పగలదట" అంది. వాళ్ళు పిలుచుకురమ్మన్నారు. అది వచ్చి జరిగిన వన్నీ యధాతథంగా చెప్పి వాళ్ళనాశ్చర్యంలో ముంచి తనపై నమ్మకం కలిగించుకుంది.

అది – కళావతికి గొప్పవాడు కొడుకుగా పుడతాడనీ, కౌముది గర్భంలో భూతం ఆవేశించి ఉన్నందున గర్భం కొద్దిరోజులలో విచ్ఛిన్న మౌతుందనీ చెప్పింది. అందుకు కళావతి చాలా విచారిస్తూ – "అలాటి విపరీతం జరగకుండా కాపాడ గలవా? నీకు మంచి పారితోషికం యిస్తాను" అంది.

అది ఒక వేరు తీసి – "రాబోయే గ్రహణంనాడు అది అరగదీసి కడుపు లోపలికి పుచ్చుకో"మంది. ఆ వేరుని భద్రపరచమని కౌముది పరిచారిక పాటలిక కిచ్చి "దీనికి కానుక లి"మ్మని కళావతి మంజరికకి చెప్పింది. ఆ ఎరుకలసాని ప్రసవమయ్యాక మళ్ళీ వచ్చి పాపలని దీవించి అప్పుడే కానుకలు తీసుకుంటానని వెళ్ళిపోయింది.

గ్రహణం నాడు కౌముదే జ్ఞాపకంగా మందిమ్మని పాటలిక నడిగింది. కాని – అది ఆ వేరులో ఏదో విశేషముందని, గర్భవతి అయిన తన కూతురు మాదవికకి అరగదీ సిచ్చేసి, కౌముదికి మరేదోవేరు అరగదీ సిచ్చింది. కౌముది ఆ మందుతిని పడుకుంది.

మాధవికకి ఆ మందు తిన్నప్పటి నుంచీ కడుపులో బాధకలిగి రెండు గడియలలో గర్భస్రావమయింది పాటలిక మంజరిక దగ్గరకు పరుగెత్తుకు పోయి – "ఆ ఎరకలసా నిచ్చినది దివ్యౌషధమని కపటం చేసి కౌముదికి కాక నీ మరదల కిచ్చాను దాని కడుపు చెడిపోయింది. కౌముదికి కొట్టవలసిన ముప్పు మనకి కొట్టింది" అంటూ విలపించింది.

"అయ్యో! నా తమ్ముడికి కొడుకు పుడతాడని నేను గంపెడాశ పెట్టుకున్నాను. నాతో చెప్పకుండా అలా ఎందుకు చేశావు? ఎరుకలవా ళ్ళిచ్చినవన్నీ నమ్మెయ్యడమేనా?" అంటూ మంజరిక ఏడ్చింది

రెండు రోజులకి పల్లవిక వచ్చి మంజరికని – "ఇక్కడి విశేషా లేమిటి? కౌముదికి గర్భస్రావమయిందా? కళానిలయ తెలుసుకు రమ్మంది." అంది. మంజరిక హడలిపోతూ "తల్లీ! పరులను చెడపాలనుకునే వారు తామే చెడిపోతారు. కౌముదికే లోపమూ లేదు. నువ్వు పన్నిన కత్తెర నీ నరమే నరికింది నీ కోడలి గర్భమే చెడింది" అంటూ జరిగినదంతా చెప్పింది

పల్లవిక గుండెలు బాదుకుంటూ. "అయ్యో. ముద్దుల మనవడు కలుగతాడని ఎంతో ఆశపడ్డాను. ఆ ముసిలి ముండ యిలాటి పనెందుకు చేసింది" అంటూ ఏడ్చింది.

"ఎవరిని నిందించి ఏం ప్రయోజనం! దేవుడే మనకి బుద్ధి చెప్పాడు. ఇకపై యిలాటి పనులు చేయకు" అని మంజరిక చెప్పినా – "అమ్మాయీ! నీ వేదాంతాలకు చల్లారిపోయేదాన్ని కాను నేను కళానిలయకి ప్రధాన దాసిని చెయ్యవలసింది చివర వరకూ చేసి తీరతాను" అంది అసూయతో.

ఇద్దరూ కళావతి వద్దకు వెళ్ళారు. పుట్టింటి విశేషా లడిగిన కళావతికి పల్లవిక రాయలవా రిచ్చిన ఉత్తరం అందించింది. దానినామె చదువుకొని భర్త కివ్వగా - అతను చదివి చిరునవ్వుతో - "నిన్ను పంపనందుకు మీ తండ్రి తప్పుగా తలచి ఏమేమో రాశారు. పెద్దవాళ్ళకి కోపం తెప్పించకూడదు. నువ్వొకసారి వెళ్ళి చెప్తే పురుటికి రావచ్చును" అన్నాడు.

కళావతి మర్నాడే తగిన పరివారంతో పుట్టింటికి వెళ్ళి తల్లిని కౌగలించుకుని ప్రేమని ప్రకటించింది.

"అమ్మాయీ! తల్లికి పిల్లల మీదుండే ప్రేమలో వెయ్యోవంతు కూడా పిల్లకి తల్లిమీద ఉండదు. నీకోసం నేను అనేక బాధలు పడుతూంటే నువ్వు మందారవల్లి మాయలో పడి నన్ను తలవనే తలవవు. నిన్నే మనాలి?"

"నేనక్కడ సర్వసౌఖ్యాలూ అనుభవిస్తూంటే నీకు దుఃఖ మెందుకు? అత్త ఉత్తమ గుణవిద్యావేత్త. భర్త సద్వర్తన చక్రవర్తి సవతి భూలోక మానవతి. ఇక నాకు కొద వేమిటి? ఇద్దరమూ ఒకేచోట పురుదు పోసుకోవాలని నియమం చేసుకున్నాం. దీనిలో తప్పేమిటి? కౌముది నన్ను వదలి గడియ ఉండలేదు" అంది కళావతి. అందుకు కళానిలయ" కౌముది కపటం నీకు తెలియదు. నిన్నిక్కడికి రానివ్వకుండా అక్కడే పురుదు పోసుకోమని - అది ఎందుకందో తెలుసా? నీ సంతానాన్ని చంపించి మగడికి తా నొక్కతే ప్రీతిస్థానం పొందాలని" అని యింకా ఏదో అనబోతూంటే - కళావతి "కౌముది గుణం నీకేం తెలుసని అలా అన్నావు? ఆమె భూలోకమాత. అసూయంటే ఎరగనిది. నా బిడ్డలని చంపితే ఆమెకేం లాభం? ఇదంతా నీ అసూయా, కల్పనా" అంది.

దీని కిప్పుడు ఏం చెప్పినా ప్రయోజనం ఉండదని - "కౌముదికి కొడుకుపుడితే చక్రవర్తి పుట్టాడంటారు జనులు. నీ కొడుకుని అలా అంటారా? లోకంలో ఎంత పేద వారయినా ప్రథమ ప్రసవం పుట్టింట్లో జరపరా? ఇది నీకు మాత్రం తెలియదూ? నువ్వు అక్కడికి వెళ్ళొద్దు.

ఇక్కడే ఉండు" అంది కళానిలయ కళావతి అందుకంగీకరించక – "స్త్రీలకు గౌరవం భర్తవల్లనే వస్తుంది. నాపిల్లలగౌరవం గురించి తరవాత ఆలోచించవచ్చు" అంటూ తల్లికి సమాధానాలు చెప్పి, పదిరోజులుండి మళ్ళీ అత్తవారింటికి వెళ్ళిపోయింది.

కళానిలయ మంజరికను, పల్లవికను రహస్యంగా పిలిచి – "మన కళావతి కేమీ తెలియదు. మందారవల్లి గట్టిమందు పెట్టింది. పోన్లెండి. ప్రసవం అక్కడే జరిగినా మీరిద్దరూ ఉంటారు కదా. మీరు జాగ్రత్తగా ఆలోచించండి" అంటూ కొన్ని మాటలు చెప్పింది.

అది విని మంజరిక "అమ్మా! మనం ప్రయోగించే కపటాలన్నీ మనకే తగులు తున్నాయి. ఊరికే యితరులకి అపకారం చేయడం నీతికాదు" అంది.

కాని, దానిని కాదంటూ –పల్లవిక – "నువ్వు చిన్నదానివి. నీకేమీ తెలియదు. మన యజమానురాలి పుత్రుడే చక్రవర్తి అవాలి. అందుకు ఉపాయా లాలోచించు" అని కళానిలయకి సంతోషం కలగజేసింది. తరవాత వాళ్ళిద్దరూ కళావతితో కుముద్వతీ నగరానికి వెళ్ళారు

మిగిలిన కథను మణిసిద్ధుడు తరవాత మజిలీలో చెప్పాడు.

# కాశీమజిలీ కథలు

## 79. వ మజిలీ

### ఘట దత్తుడి కథ

"అయ్యో! నాతోటి కోడలుకి కడుపునిండా పిల్లలిచ్చి నాకొక్క బిడ్డనేనా యిచ్చాడు కాడు. పక్షపాతపు దేవుడు. ఎవరేం చెప్పినా చేశాను. ఫలితం కనపడలేదు. ఆ యోగిని చెప్పినదే ఉండిపోయింది కాని ... అర్ధరాత్రి ... స్మశానం అమ్మో! తలుచుకుంటేనే వొణుకు పుడుతూందే! పోన్లే నాలాటిది బతికుండి మాత్రం ఏం లాభం? చావనైనా చావాలి, బిడ్డతల్లినైనా కావాలి" అని కుముద్వతీ నగరంలోని శారద అనే ఒక బ్రాహ్మణ యిల్లాలు నిశ్చయించుకుని – స్మశాన భూమికి వెళ్ళింది.

సగం కాలిన పీనుగులని పీక్కుతింటున్న నక్కల ఊళలు... చితిలో పేలుళ్ళ చప్పుళ్ళు..కాళ్ళకి గుచ్చుకుంటున్న ఎముకల ముక్కలు...తో నిండిన ఆ స్మశానంలో ఆమె కొంతసేపు తిరిగింది. అప్పుడామె స్నానం చేసి ఒంటినిండా పసుపు పూసుకుని తల విరబోసుకుని మండుతున్న ఒక చితి దగ్గరకు పోయింది. అక్కడ కూర్చున్న శవదహనకులు ఆమెను చూసి దెయ్యమనుకుని పారిపోయారు

ఆ చితినిప్పును ఎలా ఆర్పాలా అని ఆమె చూస్తూంటే – ఒకవేపు నుంచి నెత్తిమీద కుండతో ఒక స్త్రీ వస్తూ కనిపించింది. దానినెత్తిమీది కడవను లాక్కోవాలని ఆమె కెదురుగా వెళ్ళి గట్టిగా అరిచింది. ఆమె భయపడి కడవని నేలమీద పారేసి వెనక్కి చూడకుండా కాలికొద్దీ పరుగెత్తింది

ఆ కుండ ముక్కలు కాగా ఒక శిశువు నేలమీదపడి ఏడవసాగాడు. శారద వాడిని ఎత్తుకుని కాటి వెలుగులో వాడిని

పరిశీలించింది. చక్కని రూపంతో, అద్భుతమైన లక్షణాలతో ఉన్న ఆ పిల్లవాడిని చూసి - "ఈ బాలుడు చనిపోయా డనుకుని యిక్కడికి ఆమె తెచ్చి ఉంటుంది. నేను యోగిని చెప్పినట్లు చేయడంతో దేముడు మెచ్చి వీణ్ని బతికించి నాకిచ్చాడు. కడుపున పుడితే మాత్రం యింతకంటె ఏం ఎక్కువ శ్రమలేకుండా లభించాడు." అనుకుంటూ వాడిని యింటికి తీసుకు పోయి చూబించి జరిగినదంతా చెప్పింది.

ఆ బ్రాహ్మణుడు అపరిమి తానందపడి ఆ రహస్యం ఎవరికీ చెప్పకుండా భార్యను పుట్టింటికి పంపి ఆమె గర్భవతి అని వ్యాప్తి చేసి తరవాత కొడుకు పుట్టాడని, కొడుకుతో కూడా యింటికి తెచ్చుకున్నాడు. వాడికి ఘుటదత్తుడని పేరు పెట్టాడు.

పదేళ్ళు రాకుండానే వాడు విద్యా రూప గుణాలకు ప్రఖ్యాతి కాంచడం విని - వసుంధరుడు ఒకనాడు తండ్రితో సహా బాలుణ్ని ఆస్థానానికి రప్పించి వాడి విద్యలు పరీక్ష చేసి ఆశ్చర్యపోయాడు. ఇద్దరు భార్యలు గర్భవతు లయినా తన కిలాటి సంతానం పొందే యోగ్యత లేకపోయిందే - అనుకుని మిగిలిన విద్యలను తనదగ్గర చదువుతావా? అని అడిగాడు. ఘటదత్తుడు వినయంగా 'అలాగే' అన్నాడు.

వసుంధరుడు ఉపాధ్యాయుడై. ఘటదత్తుడికి విద్యలతోపాటు ఆయుధ సాదనము, అశ్వారోహణమూ మొదలయిన వ్యాయామ విద్యలు కూడా నేర్పించాడు. గురువుకే తప్పులు దిద్దగల అతని బుద్ధి బలానికి ఆశ్చర్యపోతూ - అతని మీది ప్రేమతో ఘటదత్తుడిని ప్రధాన మంత్రిగా చేసుకుని ఆతనిని వదిలి ఉండలేక రాజమందిరంలోనే అతను ఎక్కువకాలం గడిపేలా ఏర్పాటు చేశాడు.

ఒకనాడు అతన్ని అంతఃపురానికి తీసుకుపోయి భార్యలకు చూపగా - కళావతి కన్నీరు పెట్టుకుంది, కౌముది తల ఊపి చిరునవ్వు నవ్వింది. అందుకు కారణం అడగగా కళావతి - "నా కానుపు అలా కాకపోతే ఈ పాటి కింత వయసు కొడుకుండేవాడు కదా ఇలాటి కొడుకే ఉంటే మీరెంత ఆనందించే వారో. అని వెనకటికధ జ్ఞాపకం వచ్చి కన్నీరు పెట్టాను" అంది

"దేవా! చిన్నవిషయాలకు శంకిస్తే ఏమీ చెప్పలేను కానీ ఎంత హితుడయినా తరుణ వయస్కు డయిన రూపవంతుడిని అంతఃపురానికి తీసుకురావడం క్షత్రియు డెప్పుడూ సహించడు. మీరు బ్రాహ్మణ ప్రభువులు కనుక యిలా చేశారు. అందుకే నవ్వొచ్చింది" అంది కౌముది.

'కొడుకుతో సమానుడు కదా అని తీసుకు వచ్చాను. కాని వీడిమీద కౌముది మనసు పడినట్లుంది. మాటలలో కూడా తొణికిస ఉంది. మరోసారి పరీక్షించి కర్తవ్యం ఆలోచిస్తాను" అనుకున్నా డతను.

ఒకనాడు వసుంధరుడు రాయలవారి వద్దకు వెళ్ళవలసిన పని పడగా కళావతిని మాత్రమే వెంటపెట్టుకుని కౌముదిని ఉంచేశాడు. ఘటదత్తుడిని రమ్మనగా మొదట అంగీకరించినా ప్రయాణవేళకు శూల నొప్పిరావడంతో ఆ విషయం చెప్పి మానేశాడు. వసుంధరుడు పదిరోజులయ్యాక తిరిగి రాగా అతని మంచం తలవేపు ఒక ఉత్తరం గుచ్చబడి ఉంది.

"మహారాజా! అన్నీ తెలిసి కూడా రూపవతుడైన ఘటదత్తుడిని అంతఃపురానికి తీసుకెళ్ళావు. అదే కొంప ముంచింది. అతను కపట వ్యాధితో మొన్న మీతో రాకపోడానికి కారణం ఊహించుకోగలరు. అతను మీ అంతవాడు. అతన్ని కాదనగలిగే దెవరు?"

అది చదువుకుని వసుంధరుడు కోపంతో పళ్ళు పటపట కొరుకుతూ, "దురాత్మా! ఘటదత్త. ఎంత కృతఘ్నుడి వయ్యావు! బ్రాహ్మణుడి వైపోయావు కాని లేకపోతే ఇప్పుడే నీతల నూరుముక్కలు చేయక పోదునా?" అంటూ కత్తితీసి, మంచం మీంచి ఉరికి.. అంతలోనే ఏదో ఆలోచిస్తూ ...ఆత్రంగా అలాగే గడిపాడు.

ఘటదత్తుడు వచ్చి - "మహారాజా! ఇవాళ సూర్యోదయ మయినా నిద్ర లేవలేదేం?" అని అడిగేసరికి - "ఛీ! గురుద్రోహీ! నువ్వు మహా పాపాత్ముడివి నీ మొహం చూడకూడదు. ఈ క్షణంలోనే దేశం నుంచి ఫో .లేకపోతే నీతల కోటగుమ్మానికి కట్టిస్తాను" అని అతని ముఖం చూడకుండా అటు తిరిగిపోయాడు.

ఘటదత్తుడు నిర్ఘాంతపోయి నోరు పెగలక రాజమార్గాన పడి నడవసాగాడు. రాజభటులు, సామంతులు - ఛత్రాలు, వాహనాలతో అనుసరించబోతే వారిని మౌనంగా వారించి నడచి నడచి సమీప మహారణ్యంలో ప్రవేశించాడు.

మిట్టమధ్యాహ్నం వరకూ నడచి అలసిపోయి..ఒక చెట్టు నీడలో కూలబడి - 'ఆహా. దురదృష్టదేవత ఎంతలో వచ్చేసింది! ఉదయం వరకూ రాజవైభవం అనుభవించిన నేను గడియలోనే పరమ నిర్భాగ్యుడినై పోయాను! ఆయన నన్నెంత చక్కగా చల్లగా చూసుకునేవాడు! పొమ్మన్నప్పుడు నేను చేసిన నేర మేమిట నయినా అడగకుండా వచ్చేశానే! తల్లితండ్రులకేనా చెప్పలేదే! తలుచుకుంటూంటే గుండె పగిలిపోతూందే! ఇది నిజంకాదేమో. కలేమో నేను నిజంగానే అడవిలోకివచ్చానా? - అని విచారిస్తూ నేలమీద పడిపోయాడు.

అంతవరకూ చెప్పి మణిసిద్ధుడు గోపాలుని వెంట బెట్టుకుని తరవాత మజిలీ చేరాడు.

# కాశీమజిలీ కథలు

## 80. వ మజిలీ

### సరోజిని కథ

"అమ్మాయీ! సరోజినీ! నువ్వు నా మాట వినకుండా వేశ్యావృత్తి నీచ మంటున్నావు. సృష్టి ఆదినుంచీ వేశ్యల కద లున్నాయి. రంభ, ఊర్వశి, తిలోత్తమ మొదలయిన వారు దేవవేశ్యలే. మనమూ వారి సంతతి వారమే పౌండరీక మనే క్రతువులో వేశ్యలూ ఒక సాధనమే. దేవసంస్కృతం చదివే అర్హత మనజాతి స్త్రీలకి మాత్రమే ఉంది. కనక వేశ్యావృత్తిని నిరసించకు.

ఇప్పుడు చాలా అందమైన రాజపుత్రు డొకడు నలుగురు పరిచారకులతో వచ్చి నీ రూపగౌరవాలు విని తాంబూలం యిచ్చి వెళ్ళాడు. అతన్ని చూశాక ఎందుకో కాదనలేక పోయాను. నువ్వూ అతన్ని చూశావో మనసుని నిముషంలో మార్చుకుంటావు. నువ్వతనికి తగిన దానివి కాగలవు నిన్ను చూసి అతను రాజ్యమంతా నీ అధీనం చేయకమానడు. ఇంతవరకూ ఇంత సలక్షణమైన విటుడు దొరకక ఊరుకున్నాను. నీ శృంగార విలాసాలు చూపించవలసిన తరుణం రానే వచ్చింది. ఇప్పుడు కాదన్నావో నిన్ను శిక్షించక మానను" అంది కాళిందీపురంలోని చంద్రావతి అనే వృద్ధవేశ్య

ఆ మాటలకు సరోజిని కన్నీరు పెడుతూ – "అమ్మా! నువ్వు ఎందరినో మోసం చేసి ఎంతో ధనం సంపాదించావు. మూడు తరాల దాకా తరగ దది నువ్వెన్నాళ్ళో బతకవు. పరాని కేం సంపాదించు కుంటావు? నేను మోసంతో ధనార్జన ఏమాత్రం చేయలేను. కపట శృంగారంతో విటులను కొల్లగొట్టలేను నీచ ప్రవర్తనకు నా మనసొప్పదు. నన్నొకడి కిచ్చి పెళ్ళి చెయ్యి. అతన్నే దైవంగా చూసుకుంటూ పతివ్రతగా

పేరు ప్రఖ్యాతులు సంపాదిస్తాను. ఇష్టమైతే అలా చెయ్యి. లేకపోతే చంపేయ్" అని జవాబు చెప్పింది.

"చాలు చాలు. గడుసు దానివే. నేనెంతో కష్టపడి గడించింది – నువ్వు ఒక మగడితో కూర్చుని తింటావా! నేనే కాని పెళ్ళాడుంటే నీ గతేమయ్యేదో? పెళ్ళివల్ల మన కాంతలకి స్వేచ్ఛపోతుంది. ఎందరికో మనంకోరికలు కలిగిస్తూ ఉండాలి అంతెందుకు? ఇవాళ వచ్చే రాజపుత్రుడు నీ మనసుకు నచ్చకపోతే నా మాట ఎప్పుడూ వినొద్దు. అతన్ని చూసి వరించకుండా ఉంటే నీకు తప్పకుండా పెళ్ళి చేస్తాను" అంది తల్లి.

సరోజిని ఏమీ అనకుండా ఊరుకున్నందుకే మౌనం అంగీకారంగా భావించి సంతోషించింది ఆ సాయంత్రం ఎంత వద్దంటున్నా సరోజిని రతీదేవిలా అలంకరించింది. పడకగదిని పట్టుపానుపుతో అందంగా సర్దింది.

రాజకుమారుడు రాగానే హారతిచ్చింది. హారతి పళ్ళెంలో అతను విలాసంగా నూరుమాడలు రాల్చారు. అందుకా వేశ్యమాత ఆశ్చర్యపోయి అతనిని తనకూతురున్న గదిలోకి పంపి చప్పుడు కాకుండా తలుపు వేసింది.

అతనితో వచ్చిన దూతలు ఆమె యింటినీ ఆమె అలంకారాలనీ మెచ్చుకుంటూంటే తబ్బుబ్బిఅయిపోయి గదుల తాళాలు తీసి రహస్య గృహాలతో సహా అన్నీ చూబించి..."ఈ పట్టణ రాజకుమారుడు వస్తానన్నా నా కూతురు వొద్దంది" అని తన గొప్పతనం చెప్పకుంది. "నా మెప్పు సంపాదించడానికి అతనెంత ధనం యిస్తాడో చెప్పండి." అని అడిగింది. "ఇక నీయిల్లు కుబేరుని కోశాగారమే నీ గురించి ఎంతో విని ఇక్కడికి వచ్చాం. రేపీపాటికి నీకు మా ఔదార్యం తెలుస్తుంది." అంటూ దానిని మళ్ళీ మళ్ళీ పొగిడి వాళ్ళు నలుగురూ పడుకున్నారు.

పడకగదిలోకి ప్రవేశించిన ఆ రాజపుత్రుడు – 'ఆహా! నా కథ నాకే ఆశ్చర్యమేస్తూంది. ఉత్తమ బ్రాహ్మణ కుమారుడినై రాజాశ్రయం పొందికూడా చివరకి దొంగలతో కలసి, విటుడినై దీనింటికి వచ్చాను.

విశ్వాస ఘాతకం కంటె గొప్ప పాపం మరొక టుండదు. ఈ వేశ్య నెలా వంచించ గలను? .ఇదేమో వేశ్యా విలాసాలు చూపకుండా కటికి నేలమీద ... పడుకొని ఏడుస్తోంది!" అనుకుని – "నీ పేరేమిటి? నువ్వు వేశ్యవి కావా? ఎందుకింతగా విచారిస్తున్నావు?" అని ఆమెను అనునయిస్తూ అడిగాడు

ఆమె కళ్ళు తుడుచుకుని లేచి కూర్చుని "అన్నా! నువ్వు నన్ను తోబుట్టువుగా మన్నిస్తానంటే నా వృత్తాంతం చెబుతాను" అంది. అతను తన కామెమీద సోదరభావమే ఉందన్నాడు. అప్పుడామె – "అన్నా! నా తల్లి తండ్రులు కాని, కులంకాని నాకు తెలియదు. ఎనిమిదేళ్ళు వచ్చినప్పటి నుంచే నా కద జ్ఞాపకముంది అంతవరకూ ఒక గ్రామంనుంచి మరొక గ్రామానికీ ఒకరి దగ్గర నుంచి మరొకరి దగ్గరకీ తిరిగాను. అది కలలా ఉంటుంది. విశాల అనే పట్నంలో నేనొక నాయకుడి ఇంటిలో ఆడుకుంటూంటే ఒక ఆడదివచ్చి నన్నెత్తుకుని ముద్దాడి – "నిన్ను మేము పెంచుకుంటాం. వస్తావా?" అని అడిగింది. నేను గిలగిల కొట్టుకుని విడిపించుకున్నాను. అంతలో నా పెంపుడు తల్లి వచ్చి ఆమెతో మాట్లాడి నూరుమాడలకు నన్ను ఆమె కమ్మి వేసింది. ఆమె తీసుకొచ్చి యీ చంద్రవతి కిచ్చింది. నన్ను చూసి ఆశ్చర్యానందాలు పడుతూ చంద్రవతి నా వొళ్ళంతా బంగారం చేసి గురువుల వద్ద సంగీత సాహిత్యాలు, నృత్యం మొదలయిన విద్యలు నేర్పించింది తొందరలోనే నేను పాండిత్యం సంపాదించాను. అంతలో నాకు యౌవనం ప్రారంభమయింది.

వేశ్యగా ఉండమని ఆమె నిర్బంధిస్తూంది. నాకేమో పెళ్ళాడి పతివ్రతగా కీర్తి సంపాదించాలని అభిలాష. ఆ మూర్ఖురాలిని ఒప్పించలేక మీ పాదాల మీద పడి బతిమాలుకోడమే నయమని భావించాను. మీరు దయతో నా మాట మన్నించారు. మీకు కృతజ్ఞురాలినై ఉంటాను. మీ వృత్తాంత మేమిటో సెలవివ్వండి" అని ప్రార్థించింది.

"ఘటదత్తుడు నాపేరు నేను బ్రాహ్మణుడిని. చిన్నతనంలోనే ప్రధాని పదవినిపొందినా రాజుకి అకారణంగా కోపం కలిగి నిరాకరించడంతో అరణ్యంలోకి వచ్చేశాను ఒక చెట్టు నీడలో పడుకుని ఉండగా నలుగురు దొంగలు నన్ను చూసి – "కుట్టుకాడలేనా లేని వీడిని చంపడం అనవసరం.

వీడిక్కడ కెందుకొచ్చాడో తెలుసుకున్నాక ఏం చెయ్యాలో ఆలోచిద్దాం" అనుకుంటూ నా ముఖం మీద నీళ్ళు జల్లారు.

నేను వారిని చూసి భయపడి - క్లుప్తంగా నా కథ చెప్పి - "నన్ను చంపేసి పొండి" అన్నాను.

"మావల్ల బతికావు కనక మేం నిన్ను రక్షిస్తాం. మేం చెప్పినట్లు వింటే నీకు మా వృత్తిలో భాగం పెడతాం. మాటమీరావో చంపేస్తాం" అన్నారు వారు. నాచేత అంగీకారంగా ప్రమాణం చేయించుకున్నారు. వారు పోసిన తేనెతాగి బలంరాగా ఆచోరులవెంట తిరగసాగాను. చేసేది లేక వాళ్ళు నేర్పే - గోడలుదాటడం, కన్నాలు వెయ్యడం, గెంతడం, కళ్ళలో దుమ్ము కొట్టడం, పారిపోడం మొదలయిన చౌర్యవిద్యలన్నీ నేర్చుకుంటూ వాళ్ళతో దేశాటనం చేయసాగాను.

తరవాత కథ నీకు చెప్పకూడదు. అయినా నువ్వు చాలా మంచిదానివి కనుక చెబుతున్నాను.

మే మీవూరు వచ్చి పది రోజులయింది. ఈ వూళ్ళో కల భాగ్యవంతుల గుట్లు తెలుసుకున్నాం. నీ తల్లి సంపద గురించి విని దానినొక పట్టుపట్టాలని, చాకలివాడి యింటికి కన్నమేసి మంచి దుస్తులు దొంగిలించుకు వచ్చాం. నాకు రాజవేషం వేసి వాళ్ళు పరిచారకుల వేషాలు ధరించారు. మేమిచ్చిన తాంబూలానికీ, మా వేషాలకీ పొంగిపోయి నీ తల్లి మారాక కంగీకరించింది వాళ్ళు మీ యిల్లు కొల్లగొట్ట దలుచుకున్నారు." అని అత నంటూంటే వాళ్ళు వచ్చి తలుపుతియ్య మన్నారు. ఘటదత్తుడు తలుపుతీశాడు.

"నువ్వింత ఆలస్యం చేస్తున్నావేం? మేం అవతల పనంతా చక్కబెట్టాం. చంద్రవతిని బంధించి బంగారం అవీ వొలిచేసి మూటలు కట్టాం. ఈ గది మిగిలింది. నువ్వేం చేస్తున్నావు? దానితో క్రీడిస్తున్నావా?" అని గద్దించారు.

"లేదు లేదు. అది వొట్టిముద్దరాలు. దాని కష్టాలు చెప్పుకుంటూంటే వింటున్నాను."

వాళ్ళు - తలుపు చాటున దాగున్న సరోజినిని చూసి తల ఊపుతూ - "నువ్వెంత ద్రోహివిరా! దీనితో కులుకుతూ కూర్చున్నావా!

మనం అనుకున్న దేమిటి? నువ్వు చేసిం దేమిటి? తరవాత చూద్దాం. ముందు మూటలు కట్టు" అని . . ఒక డామెను నోరునొక్కి భుజం మీద ఎత్తుకుని వేగంగా పారిపోగా మిగిలిన వాళ్ళు మూటలతో పోయారు.

తెల్లవారకముందే ఆ నగరానికి దగ్గరలోని అడవిలో వాళ్ళు కలుసుకున్నారు. దొంగ లామె సౌందర్యం చూసి తమని పెళ్ళి చేసుకోమని చెయ్యి పట్టుకు తిరుగుతూంటే ఆమె గొల్లున ఏడుస్తూంది

ఘటదత్తుడు రావడం చూసి అతనితో మొరపెట్టుకుంది. అతను ఆమెను సోదరిగా చూశానని చెప్పినా వినక వేశ్యలకు వావివరుస లేమిటని కొట్టి పారేశారు. అతనికిక – "నన్నిది శరణు జొచ్చింది కనక నే నీమెను రక్షించక తీరదు. నన్ను మన్నించి దీనిని కాపాడండి" అనక తప్పలేదు. వాళ్ళ కా మాటలతో కోపమొచ్చి – కాసుకోమన్నారు

"మీ మీద కలవిశ్వాసం కొద్దీ ఇంత చెప్పాను. మీకు కోపం వచ్చినా వెనకంజవేయను. నాకంఠంలో ప్రాణం ఉన్నంత వరకూ దీనిని మీరు ముట్టుకోలేరు. దూరంగా పొండి" అని గద్దించాడు ఘటదత్తుడు. వాళ్ళు అతనిమీద కలబడేసరికి ఒకడి చేతిలోని గొడ్డలి లాక్కుని వేటుకొకళ్ళని కడతేర్చాడు. మిగిలిన వాళ్ళు భయపడి పారిపోయారు. ఆమె అతనికి నమస్కరించి "మీరు పరశురాముడిలా క్షాత్రతేజం కూడా కలిగినవారు నేను మళ్ళీ ఆ వేశ్యయింటికి వెళ్ళను మీ చెల్లెలిగా మీతో తీసుకుపొండి" అంది, ప్రార్థిస్తూ

"నిన్ను మొదటే చెల్లెలిగా భావించాను. నీకు తగిన వాడినిచ్చి పెళ్ళి చేస్తాను. తరవాత నీ అదృష్టం" అని అతను చెబుతూండగానే పురరక్షకులు వచ్చి చోరీ వస్తువులని చూసి అతనే దొంగ అని పట్టుకోబోయారు కాని అతను కత్తితీసుకుని వాళ్ళందరినీ తరిమివేశాడు. సూర్యోదయం అయిపోతూందనీ, ఇక అక్కడ ఉండకూడదనీ అత నామెతో కదిలి ఒక తోవను పట్టి పోసాగాడు

"గోపా! మజిలీకి వేళయింది. మిగిలిన కథ వచ్చే మజిలీలో చెబుతాను'' అన్నాడు మణిసిద్ధుడు గోపాలుడు కావడి భుజాని కెత్తుకున్నాడు

# కాశీమజిలీ కథలు

## 81. వ మజిలీ

### సుమేధుడి కథ

"చెల్లీ! సరోజినీ! మన కిప్పుడు గమ్యస్థానమంటూ ఏదీ కనపడడం లేదు. తల్లితండ్రులకి కూడా చెప్పకుండా వచ్చేశాను. వాళ్ళు నాకోసం ఎంతో విచారిస్తూంటారు. రాజుకి నామీద అంతకోపం ఎందు కొచ్చిందో తెలియదు. మనం కుముద్వతీ నగరం వెళ్ళడం ఉచితమేనా? నీకు వివాహం చెయ్యాలి. నాకు మళ్ళీ రాజాశ్రయం లభిస్తే నీ పెళ్ళి వైభవంగా చేయగలుగుతాను కదా" అన్నాడు ఘటదత్తుడు.

అప్పుడు సరోజిని – "అన్నా! నువ్వెప్పుడేనా అంతఃపురానికి వెళ్ళావా? ఆ స్త్రీలతో మాట్లాడేవా?" అని అడిగింది. అతను ఆ వివరాలు చెప్పగా విని – ఆమె నవ్వుతూ – "అలా వెళ్ళడమే నీ కీ ముప్పుతెచ్చింది. రాజులు దీర్ఘక్రోధులు. కొన్నాళ్ళు గడిస్తే కాని వాళ్ళకోపం తగ్గదు. అందుచేత మనం మరో దేశానికి పోదాం" అంది.

వాళ్ళిద్దరూ కొన్నాళ్ళు ప్రయాణం చేసి శింశుమార నగరానికి చేరుకున్నారు. దానికి రాజు చంద్రకేతుడు. మంత్రి సుమేధుడు. ఆ రాజుకు నలుగురు కొడుకులు, సుముఖ, పద్మనాభ, చారుకర్ణ, పింగళాక్షులు అనేక విద్యలలో వారు ప్రసిద్ధులు. వాళ్ళు నలుగురూ వీరిని చూశారు. "ఆమె క్షత్రియ కన్యే ఐతే నేను పెళ్ళి చేసుకుంటాను" అన్నాడు ఎందరో రాచకన్యలకు వంకలు పెట్టిన సుముఖుడు. వారి వృత్తాంతం తెలుసుకుందుకు నలుగురూ గుర్రాలమీద వారివెనుక వెళ్ళారు కానీ – అప్పటికే వాళ్ళిద్దరూ ఒక బ్రాహ్మణుని యింట్లో ప్రవేశించడం వల్ల వీరికి వారి జాడ కనిపించలేదు.

ఘటదత్తుడు భోజనం చేస్తూంటే బ్రాహ్మణులు మంత్రి వృత్తాంతం చెప్పుకుంటూంటే వివరం అడిగాడు. అందుకు వారు –

"మా రాజుకి నలుగురు కొడుకులు నలుగురూ రాజ్యాలేలగల సమర్థులే. వారిలో బుద్ధిమంతుడికే రాజ్యమిస్తా నన్నాడు రాజు. అది తేల్చి చెప్పమని మంత్రి నడిగాడు. అతను తెలిసో తెలియకో పెద్దవాడు సుముఖుడే బుద్ధిమంతుడన్నాడు మిగిలిన ముగ్గురు రాజపుత్రులూ మంత్రిమీద కోపించి – బుద్ధితారతమ్యాన్ని నిరూపించమని తగవు పెట్టారు.

మంత్రి కారణం చెప్పకుండా అతనే బుద్ధిమంతుడని వాదించాడు. అప్పుడు వాళ్ళు అతన్ని వంచించాలని బంగారం మణులు తాపితం చేయబడిన ముద్రికను దొంగిలించారు. "ఒక నెల వ్యవధిలో ఆ ముద్రిక నెవరు దొంగిలించారో చెప్పలేకపోతే, ముందువెనక లాలోచించకుండా నోటికొచ్చింది మాట్లాడేవాడు మంత్రిపదవి కనర్హుడు". కాబట్టి అతన్ని ఉద్యోగంలోంచి తీసేస్తా మన్నాడు రాజు.

ఆ ముద్రికను ఎవరు తీశారో మంత్రి ఎలా చెప్పగలడు? అతను చాలా దర్మాత్ముడు. అందుచేత ప్రజలు రాజువద్దకు వెళ్ళి –ఎవరూ చెప్పలేని విషయాల నడిగి ప్రధానిని వంచించడం రాజనీతికే కళంకం అందుచేత మంత్రి విషయంలో రాజు గారిచ్చిన ఆజ్ఞను ఉపసంహరించు కోమని విన్నపం చేశారు కాని రాజు వారి మాట ఆలకించలేదు. దానితో మంత్రి మంచం పట్టాడు. రేపటితో గడువు ముగుస్తుంది" అని చెప్పారు

"నలుగురిలో ఎవరు అపహరించారో చెప్పలేకపోతే యింకేం బుద్ధిమంతుడు? అని నవ్వింది సరోజిని.

"నువ్వు చెప్ప గలవా?" అడిగాడు ఘటదత్తుడు. అంతలో ఆ యింటి యిల్లాలు వచ్చి – "అమ్మా! నువ్వు సరస్వతీదేవిలా ఉన్నావు. ఏదేనా ఉపాయం చెప్పి పుణ్యాం కట్టుకో. ఆ మంత్రి భార్య అనసూయ వంటిది. దానధర్మాలు చేసే దొడ్డ యిల్లాలు ఆమెను నీ వద్దకు తీసుకువొచ్చేదా?" అని అడిగింది

సరోజిని ఘటదత్తుడి వేపు చూసింది. 'రాజులకు విశ్వాస ముండదు" అని గొణుక్కుంటున్న అతను అంగీకారం తెలపగా ఆ యిల్లాలు మంత్రి భార్యవద్దకు వెళ్ళి "మా యింటికి రాజకుమార్తె వంటి ఒక చిన్నది వచ్చింది మీ కథ విని – అదిగొప్పపని కాదని ఆక్షేపించింది

నువ్వొకసారి అక్కడికి వస్తే మీ ఆపద తొలుగుతుంది." అని ఆమె నెలాగో బండెక్కించి సరోజిని వద్దకు తీసుకు వచ్చింది.

"అమ్మా! నీ గురించి ఈమె చెప్పింది. మా ఆపద దాటించడానికి వచ్చిన సరస్వతివో, పార్వతివో అయ్యుండాలి నువ్వు. మరెవరూ ఆ ప్రశ్నకు జవాబు చెప్పలేరు" అని దీనంగా ప్రార్థించింది.అందుకు సరోజిని – "అమ్మా! దీనికి పెద్ద ఆలోచన అక్కర్లేదు. ఆ నలుగురినీ ఒక్క గడియ నాతో మాట్లాడేటట్లు చెయ్యి. ఆ ముద్రిక ఎవరు తీశారో చెబుతాను–" అంటూ ఆమెకు కొన్ని మాటలు చెప్పి పంపించింది.

ఆవిడ ఆ మాటలను తన భర్తకు చెప్పడంతో అతను ఆశ్చర్యంతోనూ సంతోషంతోనూ, పల్లకీ పంపి వారినప్పటి కప్పుడే తమ యింటికి రప్పించాడు. "ఎలా చెబుతావు? నీ దగ్గర ఏదయినా ప్రభావ ముందా?" అని అడగ్గా – "అప్పటికి తోచినట్లు చెబుతాను" అనేసిం దామె.

మర్నాడు మంత్రిరాజుదగ్గరకి పోయి – "దేవా! మీ రడిగిన దానికి నా కూతురు సమాధానం చెప్పగలదు. ఇవాళ సభ చేయించండి. మీ నలుగురు కొడుకులనీ రప్పించండి. తెరవెనుక ఉండి మా అమ్మాయి మీ అబ్బాయిలతో కొంచెం మాట్లాడి ముద్రిక నెవరు తీశారో చెబుతుంది" అన్నాడు.

రాజు – "అలాగే" అని మంత్రి కోరినట్లే సభ తీర్చాడు. సరోజిని పల్లకీ ఎక్కి సభా భవనానికి వచ్చి తెరమాటున కూర్చుంది. రాజపుత్రులు కూడా సభ అగ్రభాగంలో ఆసీను లయ్యారు.

"ఇక నువ్వు నీ ఉపన్యాసం ప్రారంభించవచ్చును – " అని మంత్రి సరోజినికి తెలియ జేయడంతో ఆమె ఇలా చెప్పసాగింది.

## ప్రభావతి కథ

దేవప్రస్థమనే పట్నంలో కీర్తి చంద్రుడనే రాజు ఉండేవాడు. అతనికి ముసిలి వయసులో ప్రభావతి అనే కూతురు పుట్టింది. ముల్లోకాలలోనూ అలాటి సుందరి లేదని చెప్పవచ్చు. ఆమెకు అయిదేళ్ళు రావడంతోనే ఆ రాజు సకల కళానిపుణుడయిన కళానిధి అనే బ్రాహ్మణుడి వద్ద ఆమెను చదివించసాగాడు.

ప్రభావతి ఎనిమిదేళ్ళకే పద్నాలుగు విద్యల సాంప్రదాయాలూ తెలుసుకుని విదుషీమతల్లి అని పేరు పొందింది. అప్పటి కామెలో యౌవనం పొడచూపగా - తండ్రి ఆనతిప్రకారం గురువుకి దక్షిణ యివ్వడానికి పట్టుచీర కట్టుకుని అలంకరించుకుని బంగారు పళ్ళెం నిండా దీనారాలు పోసుకుని వెళ్ళగా - గురువే గుర్తుపట్టలేక. ఆమె నలా చూస్తూంటే మనసు వికారం పొంది - 'దీనిని భార్యగా పొందనివాడికి త్రిలోకాదిపత్యం దేనికి?" అనుకున్నాడు 'నా మనోరథం వెల్లడించేదా? ఇది చాలా నీచమయిన కోరిక. దీనికి సిగ్గు, వావి వరుసలు ఉండవు. ఇది నా మరణానికే వచ్చిందేమో-' అని మోహంలో పడిపోయాడు.

ఆమె అతని దగ్గరగా వెళ్ళి - 'ఆర్యా! నీవు నాకు తండ్రిలా లాలిస్తూ సకల విద్యలూ నేర్పావు. నా జీవితం ధారపోసినా నీ రుణం తీర్చుకోలేను. విద్య అనే నేత్రమిచ్చిన గురువు తండ్రికంటే అధికు డంటారు. నీ శిష్యురాలిపై అనుగ్రహముంచి - గురుదక్షిణ స్వీకరించి అంతఃపురవాసానికి అనుజ్ఞయివ్వు" అని ప్రార్థించింది.

"రాజపుత్రీ! నువ్వు చెప్పినట్లే గురువు దైవంకన్న ఎక్కువే. భక్తి కలశిష్యుడుచేయదగినది, కూడనిది అని ఆలోచించకుండా గురువు కోరిక తీరుస్తాడు. నువ్వు అలాటిదానివని నాకు తెలుసు. నాకీదీనారాలతో పనిలేదు. నువ్వు అంతఃపురంలోకి వెళ్తానంటేనే నా గుండె పగిలిపోతూంది. ఎవరిమీదా ప్రీతి, మమకారమూ పెట్టుకోకూడదు" అన్నా డతను దీనంగా.

అందు కామె "గురువు తండ్రిలాటివాడు కనక గురుదర్శనం ఎప్పుడూ దూష్యంకాదు నేనంతఃపురం ప్రవేశించినా మీరు వొచ్చి పోవచ్చు. మీ యింట్లో ఏ కార్యం జరిగినా నేను వస్తూంటాను ఇందుకు మీరు విచారించనక్కరలేదు. గురుదక్షిణ స్వీకరించి, నన్నాశీర్వదించి పంపండి." అని ప్రార్థించింది.

అతను అస్పష్టంగా ఏదో మాట్లాడేసరికి - "నాతో సందేహంగా మాట్లాడతారేం? మీ కోరిక చెప్పండి నా తండ్రితో చెప్పి తీరుస్తాను" అందామె

ఇక అతను – "నీతో నిజం దాచడ మెందుకు? మదనుడు నీ రూపం ఎరవేసి నన్ను బాధిస్తున్నాడు. ఒకసారి నీ అధరామృతమిస్తే బతుకుతాను. లేకపోతే నాకు చావేగతి" అనేశాడు.

ఆ మాటలు విని ఆమె పళ్ళెం వదిలేసి – ఏదో ఆలోచించి – "ఆర్యా! శిష్యురాలికీ కూతురికీ ఇంత భేదముందా? ఎంత నీచుడైనా పుత్రికని మోహిస్తాడా? నాకు విద్యలు గరపిన నీకు నా మీద వలపెలా కలిగింది? చాలుచాలు. ఇంద్రియాల నదుపులో ఉంచుకో" అని తీతను సిగ్గుపడేలా చెప్పింది.

అతనొక్కసారి దీర్ఘంగా నిట్టూర్చి – "రాజపుత్రీ! నువ్వు చెప్పిన మాటలన్నీ నిజమే. ధర్మశాస్త్ర పురాణాలు చదివిన నాకు ఇలాటి నికృష్ట బుద్ధి పుట్టడం పూర్వజన్మలో చేసిన పాపమే. ఇంద్రియాలు నా అధీనంలో లేవు. నేనేం చేసేది? బ్రహ్మ తన కూతురు భారతినీ, గౌతముడు అహల్యనీ వరించిన ఉదంతాలు గ్రహించి నన్నను(గ్రహిస్తే అనుగ్రహించు. లేకపోతే నీ ఎదుటే మన్మదాగ్నిలో మాడి మరణిస్తాను. ఆ కార్యమెక్కువో, బ్రహ్మహత్యాపాతక మెక్కువో ఆలోచించుకో" అన్నాడు.

"విప్రుడా! గౌతముడు అహల్యని పెళ్ళాడి తన కోరిక తీర్చుకున్నాడు. అది తప్పుకాదు. నువ్వు మా తండ్రి నడిగినన్ను పెళ్ళాడితే నీ ఇష్టం వచ్చినట్లే ప్రవర్తిస్తాను. ఇప్పుడు నేను అస్వతంత్రురాలిని. ధర్మవిరుద్ధమైన పనులు నేను చేయను. నా కోసం అనవసరంగా మరణించకు."

"ప్రభావతీ! అన్నీ తెలిసిన నువ్వే అలా అంటే నేనేం చెప్పగలను? మీ తండ్రి నిన్ను నా కిచ్చి పెళ్ళి చేస్తాడా? నీకూ నాకూ ఎంత వ్యత్యాసముంది! సూర్యుణ్ని కుంతి కలసినట్లు నువ్వు నన్ను కూడాలి" అన్నా డతను.

"కుంతికి కల వరాలు నాకు లేవు. నేనిప్పుడు నీ యిష్టం తీరిస్తే ఉభయలోకాలకీ చెడతాను. కులటనై అందరిచేతా అసహ్యించుకో బడతాను. అనుచితమయిన పనిచేయడానికి నా అంతరంగం అంగీకరింపదు."

"మాటలతోనూ, శాస్త్రాలతోనూ నేను నీకు సమాధానం చెప్పలేను. ధర్మమో అధర్మమో నాకీబుద్ధి పుట్టింది. గురువుని బ్రాహ్మణ్ముడిని, ఆశ్రితుణ్ని, పండితుణ్ని కనికరించి నన్ను బతికించు" అంటూ అత నామె పాదాల దగ్గర చతికిలబడ్డాడు.

ఆమె ఆలోచనలో పడింది. "ఇంద్రియాలు పండితుడిని కూడా మోసం చేస్తాయనేది నిజమే. ఎలాటి పండితుడు ఎటువంటి తుచ్ఛమైన కోరికకు లొంగిపోతున్నాడు! నేను కాదంటే తప్పకుండా చచ్చిపోతాడు. ఈ ఆపద తప్పించుకోడం ఎలా?' అని యోచించి – "గురువర్యా! లే ధర్మసూత్రం విచారించాను. నీ కోరికని వేరొకలా తీరుస్తాను." అంది.

ఎలా తీరుస్తావు? ఆ మార్గమేమిటి?" అంటూ అతను తటాలున లేచి కూర్చున్నాడు

"భర్త అనుమతితో పరపురుషునితో కూడినా తప్పులేదు. నాకు వివాహమయ్యాక తొలిరేయి పతిని ప్రార్థించి నీ వద్దకు వస్తాను. అప్పుడు నీ కోరిక తీర్చుకుంటే ధర్మలోపం ఉండదు"

"రాజపుత్రీ! పతి అనుమతి అనేమాట – నా కన్నీరు తుడవడానికే. ఎవరయినా అందు కంగీకరిస్తారా? సరేలే. నువ్వింటికిపో, నేను కాటికి పోతాను" అని కన్నీరు కార్చాడు.

"ఎక్కువ మాటలతో పనిలేదు. ఆ వేళ రాత్రినేను మీ వద్దకు రాకపోతే గురుహత్యా పాతకానికి గురవుతాను. ఇంతకంటె చెప్పక్కర్లేదు" అంటూ తాను తెచ్చిన దీనారాలు యిచ్చి వెళ్ళిపోయింది.

తొందరలోనే ఆమె నొక రాజకుమారుడికిచ్చి తండ్రి వివాహం చేశాడు. మొదటి రాత్రి చాలా అందంగా అలంకరించుకుని భర్తకు ప్రీతి కలగజేస్తూ కొంచెం పరిచయం కాగానే సిగ్గును వెనక్కినెట్టి – "మనోహరా! మిమ్మల్ని భర్తగా పొందడం నా పూర్వ జన్మపుణ్యం మీ సుగుణాలు విని నాలాటి భాగ్యశాలి లేదని ఎంతో మురిసిపోతున్నాను. ఇలాటి సమయంలో నేను సిగ్గువిడిచి మాట్లాడడానికి కారణముంది. నా అభిమతం తీరుస్తానంటే చెబుతాను అన్ని ధర్మాలూ తెలిసిన మీకు నేను చెప్పక్కర్లేదు" అంది వినయంగా.

అత నామె మాటలకు చాలా ఆనందించి, ఆమెను ముద్దు పెట్టుకుని - "నీ కోరిక త్వరగా చెప్పు" అన్నాడు. " నా కోరిక మీకు చాలా కోపం తెప్పిస్తుందని తెలిసినా తెగించి అడుగుతున్నాను. ధర్మసూక్ష్మం ఆలోచించి నన్ను మన్నించండి" అంటూ ఆమె జరిగిన దంతా చెప్పింది.

అది విని అతను నివ్వెరపోయాడు. "ఇదా నీ కోరిక! మంచి జాణవే" అంటూ ఎక సక్కెంగానూ, నిష్ఠూరంగానూ మాట్లాడాడు.

"ఆర్యపుత్రా! భార్యకు భర్తకంటె దైవము లేదు. భూతదయ బోధించుటచే గురుమరణానికి వెరచి అలా అంగీకరించవలసి వచ్చింది. నన్ను కామిని అనుకుంటే ఇప్పుడే మీ పాదాల దగ్గర మరణిస్తాను. పతిమెచ్చని బతుకు కంటె సతికి నీచం మరొక టుండదు." అంటూ ఆమె విలపించింది.

"పెళ్ళికి ముందే ఇలాటి శపథం చేయడం ఆశ్చర్యంగా ఉంది. మగడు వినని వాడివైతే ఏం చేసే దానివి?" అని అడిగాడు.

"నా వ్రతానికి దైవం తోడుపడతాడనీ, త్రికరణ శుద్ధిగా భర్తను దైవంగా ఎంచే భార్యమాట భర్త వింటాడనీ నా చిత్త శుద్ధే అలాటి శపథం చేయించింది" అంది ప్రభావతి.

ఆమె మాటలకు సంతోషించి, ఆమె స్వభావాన్ని అర్థంచేసుకుని అతను - "నీ ప్రతిజ్ఞ చెల్లించుకుని రా" అని అనుమతించాడు.

ఆమె పరమ సంతోషంతో బంగారు పళ్ళెంలో ఫలహారాలు పట్టుకుని ఇల్లు వదిలి గాఢాంధకారంలో గురువు ఇంటికి బయలుదేరింది.

తోవలో భయంకరంగా ఉన్న దొంగలు కొందరు ఆమెను అడ్డగించి "నగలు వొలిచి యివ్వు" అని గద్దించాడు.

ఆమె త్రుళ్ళిపడి - "అన్నలారా! నేను గురుకార్యం మీద వెళ్తున్నాను. రెండుగడియల వ్యవ ధివ్వండి. మీ నగలన్నీ తెచ్చి మీ కిస్తాను. ఇప్పటికి నన్ను వెళ్ళనివ్వండి" అని ప్రార్థించింది.

వాళ్ళు పకపక నవ్వి "నీ మాటలు విచిత్రంగా వున్నాయి. మేం వాటిని నమ్మం. దొంగలం మాకు దయేమిటి? గురువుగారి పనికి నగ లెందుకు?" అంటూ ఆక్షేపించారు.

ఆమె తన వృత్తాంతం చెప్పింది వాళ్ళు మరింత నవ్వి –"చిల్లర పనులకు పోయే నిన్ను అసలు నమ్మం" అన్నారు, నగలు వలి చిమ్మని గద్దిస్తూ

ఆమె పంచభూతాల మీదా ఒట్టువేసి . తాను కామాభిలాషతో వెళ్ళడం లేదనీ, నగలు లేకుండా వెడితే గురువు మరోలా భావించవచ్చనీ... తనమాటనిలుపుకుందుకు సాయంచెయ్యమనీ అనేకవిధాలుగా మొరపెట్టుకునేసరికి వాళ్ళకి దయకలిగి – "వేగంగా వెళ్ళిరా. రాకపోయావంటే నీ పని పట్టకమానం" అని హెచ్చరించి వదిలారు.

"ఆమె వెళ్ళేసరికి గురువు గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. అతనిని మేలుకొలిపే సరికి ప్రభావతిని చూసి గుర్తుపట్టలేక భూతమో, కామినో అని ప్రాణభయంతో పారిపోబోతుంటే అతనిని పట్టుకుని.. "నేను ప్రభావతిని. పతి అనుమతితో వచ్చాను మీ యిష్టం తీర్చుకొండి" అంది.

అతను ఉలిక్కిపడి ఆమె పాదాలకు నమస్కరిస్తూ – " తల్లీ! నువ్వు త్రిలోకమాతవి. మహా పతివ్రతవి నేను మదాంధుడినయి, వివేకం కోల్పోయి ఆనాడు అలా కోరాను. నిన్ను ముట్టుకుని నేను బతకగలనా? నీ పాదరేణువు నా శిరసున దాల్చినా పాపాలను పటాపంచలు చేసుకుంటాను" అంటూ ఆమెను స్తుతించి – ఆమె కానుకల నంగీకరింపక, తానే కొత్త బట్టలు పెట్టి ఆమెను బతిమాలి పంపి వేశాడు.

ప్రభావతి దొంగలున్న చోటుకి వచ్చి – "అన్నలారా! నేను వచ్చాను. మీ నగలను వేగంగా తీసుకొండి. మీ దయవలన నా కార్యం మరోలా ముగిసింది. నేను వేగంగా యింటికి పోవాలి" అంది. వాళ్ళు– "అమ్మా! నువ్వు లక్ష్మివో, పార్వతివో. నీ దర్శనం వల్ల మాకు చాలాధనం దొరికింది. నీ సత్యానికి మెచ్చుకుంటున్నాం. నీ నగలు మాకొద్దు. నువ్వు మా తోబుట్టువ్వి. మేమే నీకు కానుకలిస్తాం. తీసుకెళ్ళు" అన్నారు.

"అన్నలారా! చోరుల కుండని దయా దాక్షిణ్యాలు చూపి నాకెంతో ఉపకారం చేశారు. అదే నాకు పదివేలు ఉపకారం చేసిన

సోదరులకు ఈ పాటి సొమ్ము లివ్వడం అబ్బురం కాదు" అంటూ నగలివ్వబోయినా వారు తీసుకోక, బలవంతంగా కొన్ని నగల నామె కొంగున ముడివేసి యింటివరకూ సాగనంపి వెళ్ళారు.

భార్యని రహస్యంగా అనుసరించి అన్నీ చూసి ... ఆమె పవిత్రతకు సంతోషిస్తూ..ఏమీ ఎరగని వాడిలా నిద్రనటిస్తున్న భర్తని మేల్కొలపడాని కామె వీణ తీసుకుని సంగీతం పాడసాగింది.

అతను కళ్ళు తెరచి – "పోయి వచ్చావా? గురుదక్షిణ సొంతం ముట్ట జెప్పావా? గురువుని సంతోష పెట్టావా?" అని అడిగాడు. ఆమె – జరిగినదంతా చెప్పింది.

అత నామె మాటలు నమ్మనట్లు – "ఆడవాళ్ళు అబద్ధాలకు నిలయాలు – అనేది నిజమయింది. చేసిన పని చెబితే తప్పేమిటి? నీకు దొంగలు ఊరికే నగలిచ్చి పంపారంటే నమ్ముతానా? మొదట వలచిన గురువు ఇంతలోనే వృద్ధుడైపోయాడా? నీ మాట లెలా నమ్మేది? నువ్వు భూత దయ కలదానివి కదా! అడిగిన వారి కోరికలను తీరుస్తూంటావు.." అంటూ ఆక్షేపించాడు.

ఆమె – నీళ్ళు నిండిన కళ్ళతో తలెత్తి – "ప్రాణేశ్వరా! నేను చెప్పినది నిజమని అగ్ని పరీక్షలో తేల్చుకోండి. ఊరికే నన్ను సూటిపోటి మాటలతో బాధించకండి. మొదట చూపిన దయను మరింతగా చూపండి." అని దీనంగా ప్రార్థించింది.

అత నామెను కౌగలించుకుని – "ప్రేయసీ! చింతవదులు. నీ వెంటే తిరిగి నీ శీలాన్ని పరీక్షించాను. నీలాటి సత్యసంధురాలిని పెళ్ళాడి నేను ధన్యుణ్ణయ్యాను. మా వంశం పావనమయింది" అన్నాడు.

అత నామెతో కలసి చిరకాలం భూమిమీద సుఖించాడు" అని చెప్పి – "రాజపుత్రులారా! ఈ కథంతా విన్నారు కదా? ప్రభావతి, భర్త, ఉపాధ్యాయుడు, దొంగలు...వీరిలో ఎవరో ఉత్తములో గుణదోషాలు విమర్శించి చెప్పండి. మీ బుద్ధి కౌశలం చూస్తాను" అంది సరోజిని.

అప్పుడు సుముఖుడు – "ప్రభావతే అత్యుత్తమురాలు. సత్యవ్రతంలో హరిశ్చంద్రుణ్ని మించి పోయింది" అన్నాడు. రెండవవాడు

– "ప్రబావతి లాటి పతివ్రతలు చాలామంది ఉంటారు కానీ ఆమె భర్తలాటి శాంతమూర్తి మరెవరూ ఉండరు" అంటూ అతన్ని పొగిడాడు.

మూడవవాడు – "మన్మధుని కూడా జయించి ఆ సమయంలో ఎంతో ధర్మ బుద్ధిని ప్రదర్శించిన గురువే ఉత్తముడు" అన్నాడు.

"అన్నలారా! మీరు ఆలోచించకుండా మాట్లాడుతున్నారు. రాజపుత్రిక, బర్త, ఉపాధ్యాయుడు విద్యావంతులు కనక వారి నీతి ప్రవర్తన వింతేమీ కాదు. ధర్మాధర్మ వివక్షలేకుండా, దోపిడీ చేసుకునే వారు అలా దయగా ప్రవర్తించారు. వారికంటె ఉత్తము లెవరు?" అన్నాడు ఆఖరివాడు.

నలుగురూ యీ విషయం మీద చాలా సేపు వాదించు కున్నారు. అదంతా వింటున్న సరోజిని – వారిని ఆపి – "పింగలాక్షుడా! నువ్వే ఆ ముద్రికను తీశావు. వేగం తెచ్చివ్వు" అంది.

మా మాట కతను తెల్లబోతూ అన్నల మొహాల్లోకి చూశాడు.

"నువ్వు నిజంగా తీస్తే దాచకూడదు. మంత్రిపుత్రిక చాలా తెలివైనదని సంతోషించ వలసిందే" అన్నారు వాళ్ళు

"దేవీ! నేను ముద్రిక తీశానన్నావు. అందుకు నిదర్శన మేమిటో చెప్పాలి' అన్నా డతను.

"రాజపుత్రా! సూక్ష్మవిషయాలు విచారించి బుద్ధిమంతులు దోషవిమర్శనం చేస్తారు. దాని కారణాలు హృదయానికే తెలుస్తాయి. మా తండ్రి మీలో సుముఖుణ్ని బుద్ధిమంతుడని చెప్పినట్లే నేనూ నిన్ను నిరూపించాను. దానిలో నిజానిజాలు మీకే తెలుసు–" అంది. అందుకతను – "దేవీ! ఆ ముద్రికని నేనే తీశాను. నీ బుద్ధిబలానికి చాలా మెచ్చుకుంటున్నాను కాని . ఆ రహస్యం ఎలా తెలుసుకున్నావో వినాలని కుతూహలంగా ఉంది. చెప్పు" అని బతిమాలాడు

"నేనిది ఎలా చెప్పానో మీరే ఆలోచించి చెప్పాలి. అలా చెప్పిన వాడే బుద్ధిమంతుడు" అంది సరోజిని. పద్మనాభ, చారుకర్ణ, పింగళాక్షులు ఆలోచించి తమ కేమీ తెలియలే దన్నారు అప్పుడు సుముఖుడు బాగా ఆలోచించి –

"పింగళాక్షుడు నువ్వు చెప్పిన కథలోని దొంగలను మంచి వాళ్ళనడం వల్లనే అతనీ దొంగతనం చేసి ఉంటాడని ఊహించావేమో" అన్నాడు.

"ఔను. అదే నిజం ఏపని చేసేవారికి దానిమీదకి మనసు పోతూంటుంది. అందుకే పింగళాక్షుడు దొంగలు మంచివాళ్ళన్నాడు. సుముఖుడా సూక్ష్మాన్ని గ్రహించాడు. అలాగే మా తండ్రి సుముఖుడు బుద్ధిమంతుడని చెప్పాడు. ఇప్పుడేనా మీరు సమ్మతిస్తారా?" అని అడిగింది సరోజిని. ఆ ముగ్గురు రాజపుత్రులూ సిగ్గుపడి ఊరుకున్నారు.

అప్పుడు చంద్రకేతుడు మంత్రిని కౌగలించుకుని – "నీ బుద్ధిబలం తెలిసే – వీళ్ళకి తెలిసిరావాలని అలాటి కట్టడి చేశాను.నువ్వూ, నీ కూతురూ వీళ్ళకి చక్కగా బుద్ధి చెప్పారు. ఒకవేళ నువ్వు అలా చెయ్యలేకపోయినా నిన్ను శిక్షిస్తాననుకున్నావా?" అని మంత్రిని ఓదార్చి, అప్పటి కప్పుడే సుముఖుణ్ని రాజ్యపట్టాభిషిక్తుణ్ని చేయడానికి నిశ్చయించాడు. అంతటితో ఆనాటి సభ ముగిసింది. సరోజిని పల్లకీ ఎక్కి మంత్రిగా రింటికి వెళ్ళిపోయింది.

అని కథను అప్పటికి అక్కడ నిలిపాడు మణిసిద్ధుడు.

## సుముఖుడి కథ

పూబోణి : మొన్న మనమంత్రి కూతురని చెప్పుకుని, రాజపుత్రులలో పింగళాక్షుడే మణిముద్రికని తీశాడని చెప్పిన చిన్నది నిజంగా మంత్రి పుత్రిక కాదట. కాని ఆమె బుద్ధి కుశలతకీ, సౌందర్యానికీ వలచి మన సుముఖు డామెను వివాహమాడాలని నిశ్చయించుకున్నాడట.

చకోరాక్షి : ఆ చిన్నది క్షత్రియ-కన్యకా? అది చాలా అందమైనది సుమా. బ్రాహ్మణ కన్యా?

పూబోణి : ఎవతో చెబుతాను విను. ఘటదత్తుడనే చిన్నవాడూ, ఆ చిన్నదీ యీ వూరు వచ్చి బ్రాహ్మణులమనీ, అన్నా చెల్లెళ్ళమనీ చెప్పి యీ వీధిలో ఉంటూ మన ప్రధాని గారికి వచ్చిన ఆపద దాటించింది.

సుముఖుడు ఆమె అద్భుత కళను చూసి మోహించి ఆమె వెంట తిరుగుతూ మంత్రిని ఆశ్రయించి - నీకు సంతానం లేదని విన్నామే, ఆమె నీ కుమార్తె ఎలా అయిందని వినయంగా అడిగాడు.

చకోరాక్షి : తరవాత?

పూబోణి : మంత్రి నిజం చెప్పాడు. అత నామె పట్ల విరహంతో ఆమెను పెళ్ళాడితే తప్ప జీవించలేనని చెప్పాడు. ప్రధాని, ఆమె అన్నతో సుముఖుని చరిత్ర చెప్పి అతనిని ఒప్పించి ఆమెను సుముఖుని కిచ్చి వివాహం చేయడానికి నిశ్చయించాడు.

చకోరాక్షి : బ్రాహ్మణ కన్యను క్షత్రియు డెలా పెళ్ళి చేసుకుంటాడు? అందుకు ఆమె అన్న ఎలా అంగీకరించాడు?

పూబోణి : పూర్తిగా విను. ఆమె విప్రకన్యక కాదు. వెలయాలు చంద్రవతి అనే దాని కూతురట. ఘటదత్తుడు దాని అన్నకాదట. ఇక్కడే ఉంది విచిత్రం అతను ఏ కులంవాడో తెలియదు కాని దొంగలకి నాయకుడట. సరోజిని తల్లి చాలా ధనవంతురాలట. ఘటదత్తుడు రాజకుమారుడినని చెప్పి నలుగురు దొంగలతో విటుడిగా చంద్రవతి ఇంట్లో ప్రవేశించి, దానిని బంధించి, ద్రవ్యమంతా దోచుకుని, యీ చిన్నదాన్నెత్తుకుని పారిపోయి వచ్చాడట.

చకోరాక్షి · ఇదంతా ఎలా తెలిసిందీ?

పూబోణి : చంద్రవతి ఆ దేశపు రాజుతో చెప్పుకోగా రాజు గుర్తులు చెప్పి దూతలని పంపాడు జాడలు తీస్తూ వచ్చి మొన్న రాజభటులు ఘటదత్తుడిని పట్టుకున్నారు.

చకోరాక్షి : అయ్యో. మంచి సమయంలో అంతరాయం కలిగిందే! తరవాత? ఏమయింది?

పూబోణి : పత్రికవలన మంత్రి వారి చరిత్ర తెలుసుకుని అక్కడి రాజశాసనానికి భయపడి దూతలకి లంచమిచ్చి ఆ యిద్దరినీ ఎక్కడికో రహస్యంగా పంపేశాడు

చకోరాక్షి : తనకి చేసిన ఉపకారానికి ప్రధాని చక్కని ప్రత్యుపకారమే చేశాడు తరవాత?

పూబోణి : ఆమె వేశ్యాపుత్రిక అనీ పెళ్ళాడ దగినది కాదనీ.. వాళ్ళిద్దరూ ఎక్కడికో వెళ్ళిపోయారనీ మంత్రి సుముఖుడికి చెప్పేశాడు. అయినా సుముఖుడు మనసు మరల్చుకోలేదు. సరోజిని వేశ్యాపుత్రిక అని విని చాలా విచారిస్తూ వారిని వెదుకుతూ పోయాడు.

చకోరాక్షి : కులస్త్రీలకంటె భోగం స్త్రీల హావ భావ లీలలు అధికంగా ఉంటాయి. అందుకే ఆమె అంత అందంగా ఉంది. తరవాత?

పూబోడి : అమ్మగారు పెద్దకుమారుడి కోసం పరితపిస్తోంది.

చకోరాక్షి : అది సహజమే. కాని.. ఘటదత్తుడు ఆమెను వలచి తీసుకొస్తే చెల్లెలని ఎందుకు చెప్పాడు? సుముఖునితో వివాహాని కెందు కంగీకరించాడు?

పూబోడి : గడుసు ప్రశ్నే. చెల్లెలని చెబితేకాని సుముఖుడు పెళ్ళాడడాని కంగీకరించడు. సుముఖుడు పట్టాభిషిక్తుడై ఆమె పట్టమహిషి అయితే ఆమె అతనికి తగిన ఉపకారం చేయకపోతుందా? ఇవన్నీ ఆలోచించే, వారు ఆ వ్యూహం పన్నారు. అదుగో అమ్మగారు విచారంగా వొస్తున్నారు పోదాం, పద.

ఘటదత్తుడు, సరోజిని, సుమేధుడి వలన రాజభటులకి పట్టుపడకుండా కాపాడబడి ఆ వూరు వదిలి ఎక్కడికో పోసాగారు. నడుస్తూ.. “చెల్లెలా! నీకు అనుకూలవరుడు లభించాడనీ నీ పెళ్ళయితే నా భారం తొలగిపోతుందనీ భావించాను. కాని అంతరాయం కలిగింది. నువ్వు వేశ్యాపుత్రికవని తెలిశాక నిన్ను భోగినీ కళత్రంగా సుముఖుడు అంగీకరించగలడని సుమేధుడు నాతో చెప్పాడు. కాని నే నందు కొప్పుకోలేదు. పోన్లే. మరో తోవ ఆలోచిద్దాం” అన్నాడతను.

“అన్నా! నా గురించి నువ్వు శ్రమపడుతున్నావు. దురదృష్ట దేవత నా నెత్తిమీద తాండవ మాడుతూంటే నువ్వేం చెయ్యగలవు? ఏదేనా ఉద్యోగం సంపాదించి చక్కని కన్యని పెళ్ళాడు. మీ దగ్గర దాసిగా జీవితం కడతేర్చేస్తాను” అందామె.

“నీకంత కర్మేమిటి? నీ విద్యకీ, బుద్ధికీ రూపానికీ, తగిన వరుణ్ని పెళ్ళి చేసి తీరతాను. పట్టమహిషి కాదగిన లక్షణాలు నీలో

ఉన్నాయి. చింతించకు" అన్నాడతను కొన్నాళ్ళకు వారు కమల అనే పట్నం చేరుకున్నారు. ఎరిగిన వారు కూడా గుర్తు పట్టలేకుండా వాళ్ళు తమ ముఖాల కేదో బూడిద పులుముకున్నారు వాళ్ళు సుమతి అనే వర్తకు డింట్లో బస చేశారు ఘటదత్తుడి వికృత రూపం చూసి మొదట అతన్ని సామాన్యు డనుకున్నా, అతనితో మాట్లాడాక అతని విద్యా విశేషాలకు మెచ్చుకుని తనయింట కొన్నాళ్ళుండమని సుమతి ఘటదత్తుణ్ని కోరుకున్నాడు. ఘటదత్తుడు పగలంతా రాజధాని నాలుగు వీధులూ తిరిగి వింతలు చూసి, రాత్రివేళ పురాణగాదలు చెబుతూండేవాడు. ఒకనాడతను సరోజినితో పురవిశేషాలు చెప్పసాగాడు

## ఇంద్ర దత్త కథ

" ఈ నగరానికి రాజు విజయదేవుడు రాణి శర్వాణి. అతను మహేంద్రయాగం చేసినా కుమార్తె కలిగింది కాని పుత్రుణ్ని పొందలేక పోయాడు. ఆమె పేరు ఇంద్రదత్త ఆమె అతిచక్కనిది నొసటి తీరు..చెక్కుల సొగసు..."

సరోజిని నవ్వి – "దాని నంతగా వర్ణిస్తున్నావే. పెళ్ళాడాలనుందా, చెప్పు" అంది.

"మానవుల యౌవనం అస్థిరం కనక అది మనుషులని పెళ్ళాడదట. వసంతుడో జయంతుడో..నలకూబరుడో.. అటువంటి వారినే చేసుకుంటుందట. భూలోక చక్రవర్తులని పెళ్ళాడమని తండ్రి ఎంత బతిమాలినా దేవతల కోసమే ఎదురు చూస్తూందట. అలాటి దాన్ని చేపడతానని ఎలా చెప్పేది? అందని ఫలాలకు అర్రులు చాచకూడదు కదా?"

"అన్నా! నీ సహోదరి బుద్ధి సామర్థ్యం తెలుసుండీ అలా అనొచ్చా? నీ కలాటి కోరికే ఉంటే తొందరలోనే ఆమెను నీ పాదాల దగ్గర చేరుస్తా చూడు" అందామె.

"సరే నీ ఇష్టం" అనేశా డతను. సరోజిని ఒకనాడు చిత్రలేఖన సామగ్రి పట్టుకుని .మలిన వస్త్రాలలో వికృతవేషంతోనే ఇంద్రదత్త ప్రాసాదానికి పోయి పరిచారికలద్వారా తన రాకను రాజకుమార్తెకి

తెలిపింది. ఆమెను వెంటనే ప్రవేశపెట్టమని అజ్ఞ యిచ్చిన ఇంద్రదత్త – ఆమె రూపాన్ని చూసి " ఈ మాత్రానికేనా ఇంత శ్రమపెట్టారు? దీని కళని దీని రూపమే చెబుతూంది. ఇంకేమీ చూడక్కర్లేదు. పంపెయ్యండి." అంటూంటే – ఆమెకు దగ్గరగా పోయి – "అమ్మా! నేను అందంగా ఉండడానికి భోగం స్త్రీని కాను. చిత్రలేఖన విద్యలో భూమ్మీద నన్ను మించిన వారు లేరని నా గర్వం పరీక్షించి చూడండి" అంది.

రాజకుమార్తె సరే అని అక్కడున్న కంతు, వసంతు, జయంత, నలకూ బరుల చిత్ర ఫలకాల నందించింది.

సరోజిని అతి తొందరగా ఆ చిత్రాలను అచ్చు గుద్దినట్లు మరో చిత్రాలను రాసి చూపింది. ఆ రాత శక్తికి రాజకుమార్తె ఆశ్చర్యపోయి ఆమెను పరిశీలనగా చూసి – "నీ మొహానికేదో రంగు పులుముకున్నట్లుందేమిటి? నీ పలువరుస చక్కగా ఉన్నదే?" అంది.

"తరచుగా బొమ్మలు రాస్తాను కదా, రంగులు అంటుకుని ఉంటాయి. నా అందంతో ఏం పనిలే. ఈ చిత్ర ఫలకా లెవరివి?" అని అడిగిందామె. "వీరినే తెలియకుండా చిత్రలేఖనంలో నా అంతవారు లేరని విర్రవీగావా?" అని ఆక్షేపించిం దామె.

"తెలుసు. కాని – మీరంత ప్రత్యేకంగా ఉంచితేనూ.." అంది సరోజిని.

*రాజపుత్రి* : "వీరు అలా చూడదగిన వారు కారూ? సౌందర్య నిధులు కారూ? వీరి నెంతసేపు చూసినా తనివి తీరుతుందా?"

*సరోజిని* : దేవతలు మనుషులకంటె చక్కని వారని, పురాణాలు చదివి అనుకుంటున్నావు. అది వట్టి మాట సుమీ!

*రాజపుత్రి* : ఏం చదివి అలా చెబుతున్నావు?

*సరోజిని* : పధ్నాలుగు విద్యలూ కొంత కొంత చదివాను. అందుకే మనుషుల కంటె దేవతలు రూపహీను లంటున్నాను. పీనుగు కళ్ళల్లా దేవతల కళ్ళు రెప్పపడవు. బొల్లివ్యాధి పీడితుల్లా శరీరమంతా ఒకటే తెలుపు. మనపెద్దలు దేవతలయందుకల గౌరవం, భక్తికొద్దీ సుందరులని

వర్ణించారు తప్ప నిజంగా వాళ్ళల్లో అంత సౌందర్యం లేదు. సుందరులయిన మన రాజపుత్రులని చూస్తే దేవకన్యలు స్వర్గంలో ఉండనే ఉండరు. ఒక్కసారి చూడగానే ఊర్వశి అర్జునుణ్ని వరించింది తిలోత్తమ – రుచికుడనే సుందరుణ్ని వరించిన వృత్తాంతం నువ్వు విన్నావో లేదో? మహాశ్వేత, కాదంబరి దేవతలలో చక్కని వారే ఉంటే పుండరీకుడి కోసమూ చంద్రాపీడుడి కోసమూ, అన్ని బాధలెందుకు పడతారు? ...రాజపుత్రీ! నీవు కోరితే ఇలాటి ఉదాహరణలు కోకొల్లలు చూపించగలను.

*రాజపుత్రి* : నీ ఉపన్యాసం అమోఘంగా ఉంది. కాని.. మరి మనవాళ్ళు సుందరులని వర్ణించేటప్పుడు కంతుడు, వసంతుడు, జయంతుడు, నలకూబరుడు – అంటారేం?

*సరోజిని* : వాళ్ళు ఏనాటివారు? అతివృద్ధులు. పైకి వృద్ధాప్య చిహ్నాలు కనిపించవు. వయసు కాంద్రులా కనిపిస్తారు. కాని..లోపల లోటారమే సుమా!

అంటూ యుక్తిగా మాట్లాడి సరోజిని ఇంద్రదత్తకు వేల్పుల మీదుండే ఆరాధ నంతటినీ చెదరగొట్టేసింది. ఇంద్రదత్త ఆమెతో ఏ విషయంలోనూ వాదించలేక పోయింది. "నీ ఆకారం చూసి సామాన్యురా లనుకున్నాను కానీ నువ్వు అఖండురాలివి. ఇన్ని విద్యలు చదివి చిత్రాలు రాయడంలోనే అధికురాలినని చెప్పావేం? సరస్వతేనా నీ ఎదురు నిల్చి మాట్లాడ గలదా?" అని పొగిడింది.

"అమ్మా! ఆడది విద్వాంసురాలినని చెప్పుకోకూడదు. ఏదో వృత్తి కల్పించుకుని ఉండాలి. మగవారిలా సభలకెళ్ళి వాదించం కదా?"

"నువ్వు పెళ్ళి చేసుకున్నావా? నీ భర్తెక్కడున్నాడు? నీకు తగిన జీతమిస్తాను, నా దగ్గరుండి నీ విద్యలు నేర్పుతావా?"

" నా మాటలలో నీకు విశ్వాసం కలిగి దేవతలు మానవుల కన్నా అల్పులు అని ఒప్పుకుంటే నేను నీ దగ్గరుంటాను" అంది సరోజిని.

"నీతో పంతాలాడా లనేమిటి? పురాణాలు చదవడం వల్ల వారి నలా భావించాను. నీ మాటలతో అదంతా పోయింది." అంది ఇంద్రదత్త.

"ఇప్పుడు నువ్వు ఉపదేశానికి అర్హత పొందావు. ఇక నీకు కావలసిన విద్యలన్నీ నేర్పుతాను" అంటూ ఒక చిత్రఫలకం తీసి - "నీ దేవ పురుషులు యితని ముందు నిలబడగలరేమో చూడు" అంటూ - ఇచ్చింది. ఆమె ఆ చిత్రాన్ని ఆశ్చర్యంగా చూస్తూ - "ఇది నిజంగా ప్రతిరూప మేనా? కాదు. ఊహించి రాసి ఉంటావు. భూమ్మీద ఇలాటి అందగా డుంటే దేవత లందరూ అతని పాదసేవ చేయవలసిందే. సౌందర్యమంటే యిలా ఉండాలి. బ్రహ్మ సృష్టించే టప్పుడు నిన్ను పక్కన ఉంచుకుంటే యిలాటి సుందర పురుషులని సృష్టించేదానివి" అని పరిహాస మాడింది.

సరోజిని నవ్వుతూ - "నువ్వు విద్వాంసురాలివి కదా. ప్రతిరూపమంటూ ఎక్కువ కల్పన ఎలా చేయగల ననుకున్నావు? మనుషులలో ఎంతెంత అందమైన వాళ్ళున్నారో! ఈ మహానుభావుడి చరిత్ర చాలా అద్భుతమయింది" అంటూ అతన్ని పొగిడి - "అమ్మా! నేను వెళ్ళొస్తాను" అంది.

"ఈ చిత్రఫలకం ఇక్కడుంచు - రేపు తప్పకుండా రా. నీతో మాట్లాడాలి" అని శలవిచ్చిం దామె.

"నేను సుమతి అనే వర్తకుడింట్లో బసచేశాను. మళ్ళీ నీ దర్శనానికి వస్తాను." అని చెప్పి - సరోజిని ఇంటికి వచ్చేసింది.

ఘటదత్తుడు ఆత్రంగా ఎదురెళ్ళి - "చెల్లీ! ఏం జరిగింది? ఆమె కనపడిందా? మాట్లాడావా?" అని అడిగాడు.

"అన్నా! తొందరపడకు. కనపడకా, మాట్లాడకా ఏం చేయగలదు. నువ్వన్నట్లే ఆమె చాలా అద్భుత సౌందర్యవతే" అంటూ ఇంద్రదత్త దగ్గర జరిగిన దంతా వివరంగా చెప్పింది. అతను ఆనందం పట్టలేక పొంగిపోయాడు.

మర్నాడు సరోజిని వెళ్ళేసరికి ఇంద్రదత్త ఆ చిత్రపటాన్నే చూస్తోంది. ఆమెను చూసి వచ్చి చెయ్యందించి పీఠం మీద కూర్చో బెట్టి - "నాకిది చెప్పు. నిజంగా ఇతన్ని చూసే రాసేవా? లేక ఎవరేనా చెబితే రాశావా? ఇంత చక్కని పురుషు డున్నాడంటే నా కింకా నమ్మకం చాలడం లేదు" అంది.

"ఇంద్రదత్తా! అధికంగానూ కల్పించి రాయవలసిన అవసరం నాకు లేదని ఎన్నిసార్లు చెప్పాలి? అత నీ వూళ్ళోనే ఉన్నాడు కావాలంటే చూడు" అంది సరోజిని.

"ఇత నిక్కడి కెందుకు వచ్చాడు? ఏ దేశపు రాజకుమారుడు? అతని పేరేమిటి? అతన్ని నే నెలా చూడగలను?" అని ఆమె కుతూహలంగా అడిగింది.

"అతని వివరాలు నాకు తెలియవు ఒక యింట్లో ఉంటే చూసి అతని సొగసుకు మెచ్చుకుని ఈ చిత్రం గీశాను. నువ్వు కోరితే దౌత్యం జరిపి అతన్ని నీకు చూబిస్తాను."

ఆ మాటలకు ఇంద్రదత్త ఒకంత ఆలోచించి - "సరోజినీ! ఎల్లుండి శుక్రవారం సాయంకాలం దుర్గాదేవి ఆలయానికి వస్తాను. అప్పటి కతని నక్కడికి తీసుకురాగలవా?" అని అడిగింది.

"నాకూ కొత్తవాడే కదా ప్రయత్నించి చూస్తాను" అని ఆశపురికొలిపి ఇంటికి వచ్చి ఘటదత్తుడికి చెప్పింది అత నెలాగో ఆ రెండురోజులూ గడిపి - శుక్రవారం నాడు మనోహరంగా అలంకరించుకుని దుర్గాలయానికి పోయి ఇంద్రదత్త ఎప్పుడొస్తుందా అని ఎదురు చూడసాగాడు. సరోజిని అంతకు ముందే రాజకుమార్తె దగ్గరకు వెళ్ళింది.

"అతను కనపడ్డాడా? మాట్లాడావా? రమ్మని చెప్పావా?" అనిఆమె అడగ్గా - "అతనికోసం ఊరంతా తిరిగి చాలా శ్రమపడి ఎలాగైతేనేం పట్టుకున్నాను. అతను సామాన్యంగా నాతో మాట్లాడతాడా? అతనొక మహా దేవేంద్రుడి కుమారుడట. ఎలాగో ఒప్పించాను. నీ అదృష్టం పండిందిలే. నీ గురించి చాలా ఎక్కువ చేసి చెప్పాను. లేలే. ఆలస్యం చేస్తే మర్కెడి కేనా పోతాడు" అంది.

అతి చక్కగా అలంకరించుకుని ఇంద్రదత్త సరోజినితో కూడా రథమెక్కి కోవెలకు వెళ్ళింది రాజభటులు - పురుషు లెవరూ యిక్కడ ఉండకూడదంటూ అక్కడున్న వారిని తరిమేశారు.

ఘటదత్తుడు అంతకుముందే ఆ ఆవరణలో ఉన్న భైరవాలయంలో చేరి తలుపులు చేరవేసుకుని విగ్రహం దగ్గర కూర్చున్నాడు. ఇంద్రదత్త వాడుక ప్రకారం సహస్ర నామార్చన చేస్తూంటే ఘటదత్తుడు కిటికీ కన్నంలోంచి ఆమెను ప్రదక్షిణ చేస్తూండగా చూస్తూ పరితపించసాగాడు.

ఇంద్రదత్త అమ్మవారి నర్చించి ప్రసాదం తీసుకున్నాక సరోజిని "ఆవరణ విశేషాలు చూద్దాం, రా" అంటూ ఆమెను తీసుకెళ్ళింది. "దేవీ! ఇది భైరవాలయంలా ఉంది. దీనిలో మహేశ్వరుడి కుమారు డున్నాడు. ఈ బలశాలిని చూడకపోతే, తలచినపని నెరవేరదు. చూద్దాం రా" అంటూ లోపలికి తీసుకు పోయింది.

అక్కడ అద్భుత సుందరు డయిన ఘటదత్తుని చూసి మోహ పరవశంలో మునిగిపోయి ఇంద్రదత్త ఏదో ఆలోచించ సాగింది. అంతలో చెలికత్తెలు సమీపించ బోతూంటే సరోజిని ఆమె కేదో సూచించింది. ఆమె మరేమీ మాట్లాడక దేవుడికోసం తెచ్చిన పూలమాలని ఘటదత్తుడి మెడలోవేసి నమస్కరించి యివతలకి వచ్చింది. పరిచారికులు తొందర చేయగా రథ మెక్కుతూ – "సరోజినీ! రేపు వేగం రా. నీతో చాలా మాట్లాడాలి" అని అంతఃపురానికి వెళ్ళిపోయింది.

సరోజిని ఘటదత్తుని వద్దకు వచ్చి – "రాజపుత్రిక ఇంటికి వెళ్ళిపోయింది. చీకటి పడిపోయింది." అని ఆలయం బయటికి తీసుకొచ్చింది.

"ఆమె ఏమంది? అంగీకరించిందా?" అని అతను కుతూహలంగా అడిగాడు. "నీ మెడలోని దండ నడుగు. అంతా అదే చెబుతుంది" అని నర్మగర్భంగా నవ్విందామె.

మర్నాడు సరోజిని వెళ్ళేసరి కామె ఘటదత్తుని చిత్రపటాన్నే తదేకంగా చూస్తూ కౌగిటిలో పెట్టుకుని ముద్దిస్తూంది. అప్పుడు సరోజినిని చూసి – "దొంగలా ఎప్పు డొచ్చావు?" అంది.

"నీ ఆనందాని కంతరాయం కలిగించడ మెందుకని పలకరించలేదు."

" ఈ పురుష సింహుడు నాకు తగిన వాడే అని భావిస్తున్నావా? ఇతన్ని పెళ్ళాడేదా? కులం, రూపం, విద్య అసాధారణమైనవని నువ్వే చెప్పావు. మా తండ్రి రాజ్యాని కతనే అధిపతి ఔతాడు. నీ ఉద్దేశ మేమిటి?" అని అడిగింది ఇంద్రదత్త.

సరోజిని ముసిముసి నవ్వులు నవ్వుతూ – "నన్నడిగే నువ్వతని మెడలో పూలదండ వేశావా? ఇప్పుడు నేను వొద్దంటే మాత్రం మానేస్తావా? అతన్ని ప్రత్యక్షంగా చూశావు కదా? ఇప్పటికేనా ఒప్పుకుంటావా నా చిత్రం నిజమే అని?" అంది.

"నీకు శతవందనాలు. నువ్వు రాసిన చిత్రం యదార్థమే. ఇంక దాచడ మెందుకు? తరవాత పని కూడా నువ్వే చెయ్యాలి. మా తల్లి తండ్రులతో నేనే పెళ్ళి విషయం చెప్పడం ధర్మం కాదు. ఈ సారి వారు అడగగానే ఇతని గురించి చెప్పి ఒప్పిస్తాను అంతవరకూ ఇతనీ వూరిలో ఉండేటట్లు చెయ్యి. నిన్ను ప్రార్థిస్తున్నాను."

"దేవీ! అతని దృష్టి నీ మీద తగులుకుంది. ఎక్కడికి పోగలడు? ఇక్కడే ఉంటాడు" అని ఆమె ఇంటికి వచ్చేసరికి విచారంగా ఉన్న ఘటదత్తుడు కనిపించాడు. "అన్నా! నీ మొహం అలా ఉందేం? నీకు పెళ్ళి నిశ్చయించాను. పదిరోజుల్లో నువ్వే ఈ దేశానికి రాజు వౌతావు. నీకంటె ఆమెకు ఎక్కువ తొందరగా ఉంది "

అతను నిట్టూర్చి – "చెల్లీ! మనకింకా మంచి రోజులు రాలేదు. కాళిందీపురం నుంచి మనని వెదుకుతూ రాజభటు లిక్కడికి వచ్చి – వేశ్యాపుత్రికను తీసుకుని దొంగ ఒకడు పారిపోయి వచ్చాడు. పట్టియిచ్చిన వారికి పారితోషికం.' అని వీధుల్లో చాటింపు వేస్తున్నారు. నువ్వు వేశ్యవనీ, నేను దొంగననీ యీ వూళ్ళో తెలిస్తే మనగౌరవానికి భంగ మేర్పడుతుంది. రాజపుత్రికకి తెలిస్తే మనలని నీచులుగా భావిస్తుంది. అపకీర్తి రాకుండానే మనం ఈ నగరం నుంచి వెళ్ళిపోడం మంచిది. ఏమంటావ్? అన్నాడు.

"అయ్యో! ఒట్టుపెట్టినట్లు రాజకింకరులు మనతోటే వచ్చి శుభకార్యాలకు విఘ్నం కలగ జేస్తున్నారే! పదిరోజుల్లో నువ్వు చక్రవర్తివయ్యే వాడివి. మనం చెప్పకుండా వెళ్ళిపోతే రాజపుత్రిక పరితపిస్తుంది. చెబితే

సమ్మతించదు. నిజం చెబితే మొదటికే కార్యహాని. రాజభటులకు చిక్కామో ప్రమాదం. ఎలా చూసినా మనం ఇక్కడి నుంచి వెళ్ళిపోడమే మంచిది" అందామె.

తెల్లవారు ఝామున వాళ్ళిద్దరూ ఊరు వదలి ఒక అడవి మార్గంలో వెళ్ళసాగారు.

"చెల్లీ! మన పురాకృతం చాలా విపరీతమయింది. ఇద్దరికీ సిద్ధమైన వివాహాలు చెడిపోయాయి. ఎంతకాలం యిలా పారిపోతూ ఉంటాం? భూమంతటినీ ఏలడానికి నీ బుద్ధిబలంచాలు. అలాటి దానివి అడవుల వెంట తిరుగుతూ కష్టాలు పడుతున్నావు. ఇంతకంటె ఆశ్చర్య మేం కావాలి? దేముడు నాకు దొంగనీ, జారుడనీ ఎందుకు నింద కలగ చేశాడో? వందమంది వచ్చినా కత్తితో జయించగల నేను పిరికి వాడిలా పారిపోతున్నాను. ఇదేం కర్మమో" అని వాపోయాడతను.

"అన్నా! మన మెంతవారం? మనకీ మంచి సమయం రాకపోదు" అని ఆమె ఊరడించింది.

వారొకనాడు మిట్ట మధ్యాహ్నం మఱ్ఱిచెట్టు నీడలో పడుకుని అలాగ తమ చరిత్ర చెప్పుకుంటూంటే ఆ చెట్టుమీద దాగున్న నూరుగురు రాజభటులు - "వీడే ఆ గజదొంగ వేశ్యాపుత్రికని వెంట పెట్టుకు తిరుగుతున్నాడు. పట్టుకోండి పట్టుకోండి." అంటూ నేలమీద కురికి నాలుగువేపులా చుట్టుముట్టారు.

అతను సరోజినికి అపాయం కలగకుండా ఎలాగో అవతలకి దాటించి నిరాయుధుడిగానే వారిలో ముప్ఫయి మందిని చంపాడు. మిగిలిన వాళ్ళు అతని కాళ్ళకీ, చేతులకీ సంకెళ్ళు తగిలించి, సరోజిని జాడ తెలుసుకోలేక కాళిందీపురం వేపు బయలుదేరారు."

అంతవరకూ చెప్పి, మణిసిద్ధుడు మజిలీకి వేళయిందని కథ ఆపి తరవాత చెప్పసాగాడు.

# కాశీమజిలీ కథలు

## 82. వ మజిలీ

**ఇంద్రదత్త** : సఖీ, మురళీ! నా మనసు దేవ కుమారుల మీదనుంచి మరలింది. నేనొక సుందర పురుషుణ్ని వరించాను. నీకు చెప్పకపోతే కోపిస్తావు కదా.

**మురళి** : నువ్వు వరింపదగిన పుణ్యశాలి ఎక్కడినుంచి వచ్చాడు? అతని పేరేమిటి? ఎప్పుడు వరించావు? మాకు చెప్పనేలేదే. అతనిప్పు డెక్కడున్నాడు?

**ఇంద్రదత్త** : అతనిపేరు ఘటదత్తుడు. ఈ వూళ్ళోనే ఉన్నాడు. సరోజిని అనే చిత్రలేఖకురాలు మాకు సంబంధం కలిపింది ఆమె సుమతి అనే వర్తకుని యింట్లో ఉంది. ఆమెను కలుసుకుంటే అంతా చెబుతుంది. ఇదుగో అతని చిత్రపటం

**మురళి** : నేనిప్పుడే పోయి సరోజినిని కలుసుకు వస్తాను. అంటూ సుమతి ఇంటికి వెళ్ళింది. ఎక్కడా కనపడక విసిగిపోయి రాజపుత్రిక వద్దకు తిరిగివచ్చి "దేవీ! నాకు సరోజిని ఎక్కడా కనపడలేదు. ఎంత వెదికినా ఆమె జాడ కనిపించక ఘటదత్తుడి గురించి కూడా అడుగుతూంటే ఎవడో – "ఘటదత్తుడిని పట్టుకున్న వాడికి మూడు గ్రామాలు కానుకగా యిస్తానని కాళిందీపుర ప్రభువు ప్రకటించాడే. అతనిక్క డెందు కుంటాడు?" అన్నాడు. నేను తిరిగి వచ్చేశాను అంది.

**ఇంద్రదత్త** : "నువ్వు సరిగా చూసి ఉండవు ఘటదత్తుడిని పట్టి యిమ్మనడానికి కాళిందీపుర ప్రభువుకి కారణమేమిటో? అతను మరొక ఘటదత్తుడు అయి వుండవచ్చును సరోజిని ఘటదత్తుని వద్దకు వెళ్ళిందేమో" అంది.

"సరోజిని ఇంట్లో మాత్రం లేదు అతని వద్దకు వెళ్ళిందేమో మళ్ళీ వెదుకుతాను" అని వెళ్ళిపోయింది. నాలుగు రోజులయ్యాక వచ్చి వాళ్ళు వూరిలో లేరని నిశ్చయంగా చెప్పింది

అప్పుడు రాజపుత్రి – 'ఇదేమి కర్మ? ఉన్నదాన్ని ఉండక లేని గొడవ తెచ్చి పెట్టుకున్నాను. ఇది కల కాదు కదా? కలయితే ఈ చిత్రపటం ఎలా వస్తుంది? సరోజిని నన్ను నమ్మించి రాకపోతుందా? పదిరోజు లుండమన్నాను కదా. ఇంతలో వాళ్ళవూరు వెళ్ళివస్తారేమో' అని విచారిస్తూంటే, ఆమె తల్లి శర్వాణి అక్కడికి వచ్చింది.

"అమ్మాయీ! నువ్వు వరించిన వాని గురించి నీ తండ్రితో చెప్పాను. అతని పేరు విని – 'ఛీ.ఛీ! వాడు దొంగల ముఠా నాయకుడు. వాడిని పట్టుకుందుకు నాలుగుదేశాల రాజభటులు తిరుగుతున్నారు. మాకు కూడా ఇదివరకే సమాచారం వచ్చింది. మొన్న వాడిక్కడికి వచ్చాడని కాళిందీపుర భర్త ప్రత్యేకంగా వందమంది భటుల నిక్కడికి పంపాడు.' అంటూ అతని మీద ఆరోపించబడిన నేరాలు చెప్పి – మనమ్మాయి ఆ దొంగ నెలా వరించింది? పో ... అంటూ నన్ను తూలనాడారు" అని తల్లి చెప్పగా ఇంద్రదత్త కళ్ళు మూసుకుని, బరువుగా నిట్టూర్చి –

"అమ్మా! నేను బాల్య చాపల్యం కొద్దీ తప్పు చేశాను. ఇప్పుడే మనుకున్నా ప్రయోజనం లేదు. అతని అందానికి పరవశించి నేనతన్ని వరించాను. సరోజిని ఆ కాళిందీ పుర వారాకాంత కూతురయి ఉంటుంది. దాని మూలానే నేను వలలో పడ్డాను" అంటూ జరిగిందంతా వివరించింది.

"మెడలో మాలవేసినంత మాత్రానే మగడౌతాడా? దేవుని మెడలో, బ్రాహ్మణుని మెడలో దండలు వేయమా? ఇదీ అంతే అని వొదిలేయ్."

"అమ్మా! మనసుచేత వరించడం కంటె క్రియ ఎక్కువా? పోనీలే. నా భర్త దొంగే అవనీ దొంగ పెళ్ళాం దొరసాని అనే వాక్య ముంది కదా. నేను మరొకరిని పెళ్ళాడను. నా ప్రారబ్ధానికి మీరేం చేస్తారు?" అంటూ ఏడ్చింది. తల్లి ఎంత చెప్పినా మనసు మరల్చుకోలేదు. తన నిర్ణయం మార్చుకోలేదు. ఆమె భర్తకు చెప్పడానికి వెళ్ళిపోయింది.

ఇంద్రద్త మురళిని పిలిచి – "ప్రియసఖీ! నీ కంటె నాకు ఆప్తులు ఎవరూ లేరు. నువ్వు లేకపోడం వల్లనే ఇలాటి ప్రమాదం జరిగింది అతను దొంగల రాయుడంటే నాకు నమ్మకం చాలడం లేదు. ఎలాగేనా సరే నువ్వు పోయి వాళ్ళని వెతికి తీసుకురావాలి." అంది.

మురళి ఆమెనుంచి వారి గుర్తులన్నీ తెలుసుకుని అప్పుడే బయలుదేరి ప్రతిగ్రామమూ తిరుగుతూ వారి పేర్లూ గుర్తులూ చెప్పి వెదకసాగింది.

ఒకపల్లెటూరిలో ఒకింటివద్ద కూర్చుని కదలు చెబుతున్న ఒకామెను చూసి – "చిన్నదానా! సరోజిని అనే చిన్నదీ, ఘటదత్తుడూ ఈ వూరు రాలేదు కద?" అని అడుగుతూ గుర్తులు చెప్పింది.

"వారి అవసరం నీకేమిటి? నీదేవూరు? ఏం పేరు?" అని అడిగిం దామె.

"మాది కమలాపురం. నాపేరు మురళి. ఇంద్రదత్త అనే రాజపుత్రిక పంపగా తిరుగుతున్నాను. వారు మాకు మిత్రులు.

"వాళ్ళ జాడ నాకు కొంచెం తెలుసు. ఇటురా" అని ఏకాంతానికి తీసుకెళ్ళి – "ఇంద్రదత్త ఎందుకు వెదకమంది?' అని అడిగింది.

"ఇలా అడగడం వారిక్షేమంకోరే" అందామె

అపుడు సరోజిని "ఘటదత్తుడు శత్రువుల చేత చాలా చిక్కులు పెట్టబడుతున్నాడు నేనూ అతని కోసమే తిరుగుతున్నాను." అంది.

"అతను దొంగలకు నాయకుడట, నిజమేనా? వెలయాలి యిల్లు కొల్లగొట్టి దానికూతురు' సరోజినిని వెంట పెట్టుకు తిరుగుతున్నాడట? ఇది తెలిసి మా రాజపుత్రిక చాలా విచారిస్తూంది.

అంటూ మురళి అక్కడ అంతఃపురంలో జరిగినది అంతా పూసగుచ్చినట్లు చెప్పింది.

"చెలీ! నువ్వు అడిగావు కనుక నిజం చెబుతున్నాను. ఘటదత్తుడు ఉత్తమ కుల సంజాతుడు" అంటూ మొదలుపెట్టి అతని కథంతా వివరించి – "ఇందులో అతని తప్పేముందో చెప్పు" అని అడిగింది.

అది విన్న మురళి ఆశ్చర్యపోయి "అయ్యో నిష్కారణంగా అతను అపనింద మోస్తున్నాడు. కాళిందీపురం పోయి ఆ మాట చెప్పరాదూ? సరోజిని ఏమైంది? నిజం చెప్పు" అని మళ్ళీ అడిగింది. "నువ్వు స్నేహితురాలి వయ్యావు కనుక నిజం చెప్పేస్తున్నాను. నేనే సరోజినిని. మేము మీ వూరి నుంచి వొచ్చేస్తూంటే అడవిలో రాజభటులు ఎదుర్కొన్నారు. ఘటదత్తుడు నన్ను వారినుంచి తప్పించి తాను ముప్ఫయిమంది భటులని చంపాడు. మిగిలిన వారతనికి సంకెళ్ళు వేశారు. నేను మాత్రం వారికంట పడకుండా మారు వేషంలో అనుసరించాను. అతను విడిపించబడడం కళ్ళారా చూసినా నేనతన్ని కలుసుకోలేక పోయాను. నేనక్కడే ఉన్నట్లు అతను ఎరగడు. అతను మిత్రుడితో ఎక్కడికో పోయాడు. నేనక్కడి నుంచి బయలుదేరి అతనిని వెదుక్కుంటూ మొన్న ఈ పల్లెకి వచ్చాను. ఇది నాలుగు దేశాల కూడలి మార్గంలో ఉంది. అందుచేత ఏదారినేనా యిక్కడికి వొస్తాడేమో అనే ఆశతో, యీ బ్రాహ్మణ గృహంలో ఉంటూ వారికి వినోదం కోసం కథలు చెబుతున్నాను. దైవవశాన నిన్ను కలుసుకున్నాను. ఈ రహస్యం యింతవరకూ నేనేవరికీ చెప్పలేదు.

ఘటదత్తుడు భూలోక మంతా ఏలదగిన బలశాలి. ధర్మరాజును మించిన గుణవంతుడు. అతని కింకా మంచిరోజులు రాలేదు." అంది సరోజిని.

"సరోజినీ! ఘటదత్తుడికి ఇంద్రదత్తమీద అనురాగం కనక అక్కడికే రాగలడు. మన మక్కడికి పోదాం రా. ఇంద్రదత్త స్వచ్ఛమైన మీ చరిత్ర విని విచారం విడచిపెడుతుంది" అని మురళి ఆమెను తీసుకుని కొన్నాళ్ళ కా వూరు చేరింది.

అక్కడితో నిలిపి తరవాత మజిలీలో మణిసిద్ధుడు మళ్ళీ చెప్పసాగాడు.

# కాశీమజిలీ కథలు

## 83. వ మజిలీ

## మంజరి కథ

**పాటలిక** : మంజరికా! ఇప్పుడు మహారాజు కౌముది మీద ఎందుకో అలిగి ఆమె అంతఃపురానికి వెళ్ళడం లేదట. అందు కామె పరితపిస్తూ - మీరేవో కొండేలు చెప్పి మానిపించారని తలుస్తూ ఆ కారణం తెలుసుకు రమ్మని నన్ను నియమించింది. మనలో మనకు అంతరాలు లేవు కదా? నిజం తెలిస్తే చెప్పు

**మంజరిక** : అత్తా! నీకు చెప్పకుండా ఉంటానా? మునుపు మనం చెప్పుకున్న రహస్యాలకంటె ఇవేమయినా గొప్పవా? కౌముది తల్లి - నీకు బహుమానం ఇచ్చిందా?

**పాటలిక** : లేదు లేదు తన కూతురు శిశువు కూడా కడతేరింది కదా. అందుకు జాగుచేస్తూంది

**మంజరిక** . కౌముదికి పుట్టింది ఆడబిడ్డా? దాని నెలా మార్చావు?

**పాటలిక** : నువ్వు చెప్పినట్లే చేశాను. ప్రసవసమయంలో అక్కడ నేనూ నా కూతురూ మాత్రమే ఉన్నాం. ఆమె తల్లి దూరంగా ఉంది. పిల్ల భూమిమీద పడడంతోటే - అంతకు ముందే సిద్ధంచేసి ఉంచిన మృతశిశువు నక్కడుంచి పుట్టిన బాలిక ఏడవకుండా పట్టుకుని నా కూతురి వొడిలో వేసి అవతలికి తీసుకుపొమ్మని పంపేశాను. ప్రసవవేదనలో మునిగిన కౌముది అదేమీ చూడలేదు. పిల్ల చచ్చేపుట్టిందని చూబించాను. కౌముది తల్లి లోపలికి వచ్చి దుఃఖిస్తూ - కళావతికి కలిగే సంతతి నెలాగయినా కడతేర్చి రమ్మని మళ్ళీ బోధించింది

**మంజరిక** : నీ కూతురు ఆ పసి బిడ్డ నేం చేసిందీ?

*పాటలిక* : విను. అప్పటి కప్పుడే ఇల్లు వదిలి నడివీధిన పడి స్మశాన భూమికి తీసుకు పోతూంటే ఒక ఆబోతు దానిని వెంట తరిమిందట. అది జడుసుకుని పరుగెడుతూంటే వొడిలో బిడ్డ నేలజారిపోయింది. ఆ శిశువుని తీసుకుందు కవకాశం చిక్కనివ్వలేదు. ఆబోతు. దాని ప్రాణం మాత్రం దక్కించుకుని పారిపోయింది.

*మంజరిక* : ఆ బాలిక నెవరేనా రక్షించి తీసుకుపోయారేమో చూసిందా?

*పాటలిక* : నా కూతురు కొంతసేపు ఆ ప్రాంతంలో దాగుని ఆబోతు వెళ్ళిపోయాక మళ్ళీ అక్కడికొచ్చి చూసిందట. కాని ఆ పాప కనపడలేదట.

*మంజరిక* : మరేమైంది?

*పాటలిక* : సగం మేమే చంపాం. ఆబోతు తొక్కేసి మిగిలిన సగం చంపేసి ఉంటుంది. మృతశిశువుని తీసుకుపోయి తలారులు ఏ కందకం లోనో పారేసి ఉంటారని చెప్పింది.

*పాటలిక* : ఎలాగేనా మనం చేయవలసిన పని మనం చేశాం కదా. నువ్వా బాలుణ్నేం చేశావు?

*మంజరిక* : కళావతి మగశిశువుని ప్రసవించగానే వాడిని వెంటనే గొంతు నులిమి నా తల్లి చేతికిచ్చాను. దానిని కుండలో పెట్టుకుని అర్ధరాత్రి స్మశానం మీదుగా కందకానికి వెళ్తుంటే పిశాచం మీద పడిందట. కుండని నేలమీద పారేసి పారిపోయి వచ్చింది తరవాత ఏమయిందో తెలియదు.

*పాటలిక* : సరిసరి. రెండూ ఒకలాగే ఉన్నాయి. కళానిలయనీ కానుకలిచ్చిందా?

*మంజరిక* : ఎలాటి వారికేనా మొదట ఉండే ఆసక్తి తరవాత ఉండదు. ఆమె కోరిక తన కూతురు సంతతి నిలచి కౌముది సంతతి నశించాలని. కాని అలా జరగ లేదు ఇద్దరి కానుకలూ సమానంగా పంచుకోవాలని మన మిద్దరమూ ఆ పనులు చేసి యిద్దరికీ దుఃఖం కలిగించాం. అంచేత ఇద్దరి కానుకలకీ వాళ్ళు సున్నా చుట్టారు. ఈ సారి మాత్రం మాకు కానుకలు వొస్తాయి. నీ అల్లుడు గ్రామాధికారి అవుతాడు.

**పాటలిక** : ఎలా!?

**మంజరిక** : మొన్న కళావతితో నేను వెళ్ళినప్పుడు - నీకు చెప్పిన పని ఒక్కటీ సవ్యంగా చెయ్యలేదు - అని కళానిలయ కోపించింది. అందుకు నేను - 'అమ్మా! నేను నీ కోసమే కదా శిశుహత్య చేశాను? దైవం మనకి అపకారం చేశాడు.

అందువల్ల నేను చేసినది నీకు కనిపించలేదు - అన్నాను. అందుకామె - ఆ మాటనే నెరుగుదును. నువ్వూ నీ తల్లీ గట్టివాళ్ళు కదా! కౌముది మీద రాజుకి విరోధం కలగ జెయ్యలేరా? - అని అడిగింది. అలా చేస్తే - మీరు మా కిస్తామన్న మూడు గ్రామాలూ దయచేస్తారా? - అని నే నడిగాను. వసుంధరుడికి కౌముదిమీద ప్రబల విరోధం పుట్టించి దానింటికితను పోకుండా చేస్తే మీరు కోరిన గ్రామాలు తప్పకుండా రాసిస్తాను - అందామె.

నేను చాలా సంతోషించి, ఘటదత్తుడిని చూసి కౌముది నవ్విందని అనుమానంతో వసుంధర్ను డామె నా సంగతి తరచి తరచి అడిగాడని నేను విని ఉన్నాను. కనక అదే అవకాశంగా తీసుకుని, యింటికి వచ్చిన మర్నాడే ఒక ఉత్తరం రాసి అతని మంచం తలదిక్కున గుచ్చాను. అది చదువుకునే అతను ఘటదత్తుడిని ఊరునుంచి వెళ్ళగొట్టి తాను కౌముది ముఖం చూడడం మానేశాడు ఈ రహస్యం నీకు చెబుతున్నాను. కళావతికి ఇదేమీ తెలియదు పదిరోజుల్లో కళానిలయ దగ్గరకు పోయి, చేసినపని చెప్పి, ఆ గ్రామాలు నీ అల్లుడి పేర రాయించి పుచ్చుకుంటాను

**పాటలిక** :- చాలా సంతోషం మంజరికా! మనం ముందు చేసిన పనులు నిష్ఫలా లయినా ఇది బాగా సాగింది. నా అల్లుడికి రావడమంటే నాకు రావడమే ఈ శత్రుత్వం చల్లారి పోకుండా ఎగసెన తోస్తూ కళానిలయకు నీ మీద కల దయను వృద్ధి చేస్తానులే.

అంటూంటే ఎవరో వచ్చి - "మంజరికా! నిన్ను అమ్మగారు వేగం రమ్మంటున్నారు" అని పిలిచింది. మంజరిక అత్తని వెళ్ళిపొమ్మని

తాను కళావతి వద్దకు వెళ్ళింది. "ఎవరో ముత్తయిదువ వచ్చిందట. ఎదురెళ్ళి తీసుకురా" అని కళావతి చెప్పగా, ఆమె అర్ఘ్యపాద్యాదులతో వెళ్ళి ఆమెను సాదరంగా తీసుకొచ్చి పీఠం మీద కూర్చో బెట్టింది. కళావతి ఆమె వృత్తాంతం అడగ్గా - ఆవిడ - "దేవీ! నా పేరు శారద. మేము మీ పురా న్నాశ్రయించుకునే ఉన్నాం. నా భర్త కొంచెమే చదివారు. మీ ఆ స్థానానికి రాగలిగిన సమర్థత లేదు. నాకు లేక లేక ఒక్కడే కుమారుడు కలిగాడు వాడిని మీ భర్తగారే పెంచి పెద్ద చేశారు. వాడు మీ గుణాలను పొగుడుతూంటే ఎన్నిసార్లో విన్నాను. మావాడు కొన్ని రోజులుగా యింటికి రావడం లేదు. ఎంత పని ఉన్నా రాత్రయినా వచ్చి చూసి పోయేవాడు. అతని జాడ తెలియక, తానిక్కడికి రాలేక అతని తండ్రి నన్నిక్కడికి పంపారు. దయ ఉంచి ఘటదత్తుడి నెక్కడికేనా పంపారేమో మీ భర్తగారి నడిగి చెప్పరూ? అందుకే నేనిక్కడికి వచ్చాను" అని దీనంగా ప్రార్థించింది "ఘటదత్తుడు మీ కుమారుడా! ఎంతపుణ్యం చేసుకున్నావో. అతను మీ కడుపున పుట్టాడా? పెంచుకున్నావా? నిజం చెప్పు" అంది కళావతి.

నా కడుపులో పుట్టాడు" అని ఆమె చెప్పడంలో స్వరభేదం గమనించి - "ఘటదత్తుడు నీ కడుపున పుట్టలేదని నేను కచ్చితంగా చెప్పగలను" అని గద్దించింది.

"దేవీ! నీకామాట ఎవరు చెప్పారో చెప్పు. తరవాత నేను నిజం చెబుతాను. ఔరా! ఈ రహస్యం నాకూ నా భర్తకూ కాక బ్రహ్మకి కూడా తెలియదనుకున్నాను. నీ కెలా తెలిసిందో! చిత్రంగా ఉంది"

"నువ్వు నిజం చెబితే నాకెవరు చెప్పారో చెబుతాను. దీన్లో నీకు తప్పేముందని? చెప్పు చెప్పు" అని కళావతి వొత్తిడి చేయగా ఆమె చెప్పసాగింది.

"నాకు వాడు పెంపుడు కొడుకున్న మాటే కాని కన్నకొడుకు కంటే ఎంతో ఎక్కువ." అంటూ తాను యోగినివలన మంత్రోపదేశమై అర్ధరాత్రి స్మశానానికి వెళ్ళడం..కుండకోసం ఎవతెనో బెదిరించడం ఆ కుండ ముక్కలలో శిశువు దొరకడం. వాటికి ఘటదత్తుడని పేరు పెట్టి పెంచుకోడం. ... అంతా చెప్పింది శారద.

ఆ కథవిని కళావతి మంజరిక మొహంచూస్తూ – "అలాటి రత్నంలాటి బిడ్డని కని పారవేసింది యీ వూరిలో ఎవరున్నారు? కారణమేమయి ఉంటుంది? ఈమె చెప్పినట్లు మృతుడైన శిశువు యోగిని వరం వల్ల బ్రతికేడా? ఊహించు" అని అడగగా –

ఆమె గద్గదికస్వరంతో – "ఆ మాటే నిజంకావచ్చు. ఈమె యోగిని చెప్పినట్లు నియమం పాటించింది కదా. దేవతా ప్రసాదం వల్ల ఆ బాలుడు జీవించి ఉంటాడు. అందుకే అంతవాడయ్యాడు" అంది.

"కావచ్చును. కాని అంత చక్కని పిల్లవాడిని కన్న సుందరి ఎవరో, దాని భర్త ఎంతటి వాడో తెలుసుకోవలసి ఉంది. ఆ రోజు ... బాలుడు దొరికిన రోజు శారద చెప్పింది కదా. ఆ వేళ మనవూరిలో ప్రసవించిన వారి పేర్లు తెలుసుకుంటే సరి. అవి రాయబడే వుంటాయి. నువ్వు వెళ్ళి కనుక్కురా" అని మంజరికకి చెప్పి శారదతో – "ఈ రాత్రి భర్తగారి నడిగి రేపు మీకు కబురు పంపుతాను. మీరు చింతించకండి. ఘటదత్తుడు మా భర్తకు ప్రాణం వంటివాడు." అని ఓదార్పుగా చెప్పి ఆమెను పంపింది.

"అమ్మా! ఘటదత్తుడిపై అయ్యగారికి ఎందుకో తగని కోపం వచ్చింది. అతణ్ని ఊరొదిలి పొమ్మన్నారు. ఇది మీరెరగరు కాబోలు" అంది మంజరిక.

"ఆ! ఘటదత్తునిమీద అయ్యగారు అలగడమా! నేను నమ్మను. నువ్వు పొరపాటుగా విన్నావేమో. ఐనా అతనంత అపరాధం ఏం చేశాడూ?"

"అమ్మా! మీరు మరో విశేషం కూడా వినాలి. అయ్యగారు కౌముదిమీద అలిగి ఆమె మేడకి పోవడంలేదు"

"వింతలు చెబుతున్నావే! ఆమె ఏం నేరం చేసిందని కోపగించారు?" అడిగింది కళావతి.

"నా కంత బాగా తెలియదు. ఎవరో చెప్పుకుంటూండగా విన్నాను. మీరే వారి నడగండి" అంది జంకుతూ.

ఆ రాత్రి - "మనోహరా! ఘటదత్తుని తల్లి వచ్చి తన కుమారుడు యింటికి రాలేదని వగస్తూ మీరెక్కడికేనా పంపారేమో అడగమని అతి దీనంగా ప్రార్థించింది. ఈ మధ్య మీరు అతని గురించి ప్రస్తావించడం మానేశారు. ఇప్పు డతను ఎక్కడున్నాడు?" అని మెల్లగా అడిగింది కళావతి.

అందుకు వసుంధరుడు - "నా హృదయంలోని కోపాగ్నిని ప్రజ్వరిల్ల జేయకు. వాడేమయ్యాడో నాకు తెలియదు ఊరుకో" అనేశాడు. కాని ఆమె అతని మనసు కరిగేటట్లు ప్రార్థించగా - "కౌముది ఇల్లా లనుకుని మోసపోయాను. ఘటదత్తుడు కృతఘ్నుడని తెలియక ఆవేళ మీ యిద్దరి వద్దకూ తీసుకు వచ్చాను కదా. అతన్ని చూసి ఆమె నిర్భయంగా వెర్రిచేష్టలు చేసి జవాబు చెప్పింది. తరవాత మనం వూరు వెళ్ళినప్పుడు చేసిన చర్యలు ఈ ఉత్తరం ద్వారా తెలుస్తాయి. చూసుకో" అంటూ ఆ ఉత్తరం ఆమె చేతి కందించాడు.

ఆమె దాన్ని చదివి - "మనోహరా! మీరు విద్వాంసులయినా జాగ్రత్తగా ఆలోచించ లేదు. కౌముది ఉత్తమురాలని నేను శపథం చేయగలను. ఆమె ఏ మాత్రం దోషం చేసినా మీముందు అలా నిర్భయంగా వాదించదు. అంతఃపుర పరిచారిక లెవరో యిలా కల్పించారు. పైవాళ్ళకి ఉత్తరం రాసి మీ శయ్యకి తగిలించడం శక్యమా? వ్రాతను బట్టి వారిని పట్టుకుంటాను చూడండి. ఘటదత్తుని మీద మీరు ఊరికే అనుమాన పడుతున్నారు. ఉత్తమ కులంలో పుట్టిన అతను ద్రోహకృత్యాలు చెయ్యడు" అంటూ అతని జన్మవృత్తాంతంతో దృష్టాంతాలు చెప్పి అతని మనసు పశ్చాత్తాపపడేటట్లు చేసింది.

అప్పుడతను - 'అయ్యో! తొందరపడి నిరపరాధిని తూలనాడానే. అతనెంత బాధపడ్డాడో? అతన్ని దేశాంతరం పొమ్మని శాసించాను. ఈ మాటవింటే అతని తల్లి తండ్రు లెంత విలపిస్తారో అని విచారించ సాగాడు.

"ప్రాణేశ్వరా! నవనీతంలాటి మీ హృదయం ఇంత పరుషంకావడం చిత్రమే. గతం తలుచుకుని వగచడ మెందుకు? అతన్ని వెదికి రప్పించండి. చాలు" అంది కళావతి. అతనందుకంగీకరించాడు.

ఆ సంభాషణంతా చాటునుండి విన్న మంజరిక భయపడుతూ పాటలిక వద్దకు పరుగెత్తింది. "అత్తా! మనకొంప మునిగింది. మన రహస్యాలన్నీ బయట పడక మానవు. ఘటదత్తుడు కళావతి కుమారుడు. వానిని పెంచుకున్న తల్లి వచ్చి చెప్పింది. మొన్న రాసిన ఉత్తరం నాచేతి దస్తూరితో రాశాను. అది ఆమె చేతిలో చిక్కింది. కళావతి ఆ విషయం తర్కింపక మానదు. తీగె లాగితే డొంకంతా కదలక మానదు. మనం ఇక్కడుంటే పరాభవం తప్పదు. అందుచేత ఎక్కడికేనా పారిపోవడం మంచిది" అని చెప్పడంతో అత్త కూడా భయపడింది.

ఇద్దరూ ఆలోచించుకుని ఆ రాత్రే ఎవరికీ చెప్పకుండా ఆ ప్రాంతం వదిలి చాలాదేశాలు తిరిగారు. చివరికి కమలాపురం చేరి అక్కడ విజయదేవ భూపాలుడి భార్య శర్వాణిని ఆశ్రయించి – "అమ్మా! మేము బర్బర దేశాధీశ్వరుని భార్య ఇందుమతీదేవి పరిచారికలం. ఆమె స్వర్గస్తురాలవడంతో చింతిస్తూ విరక్తి చెంది కాశీపురం వెళ్ళి మళ్ళీ దేశానికి పోతున్నాం. ఇందుమతి లేని ఆ వూరు తల్లి లేని పుట్టిల్లే. అక్కడికి వెళ్ళడానికి మాకు మనసు ఒప్పడం లేదు. అంతఃపుర పరిచారికలమై రాజభార్యలవద్దా, రాజపుత్రికల వద్దా నమ్మకంగా ఉపచారాలు చేయగలం. నువ్వు చాలా దయామయివని – నీ వద్ద సేవ చేయాలని ఉత్సాహపడుతున్నాం. మమ్మల్ని నీ బిడ్డల్లా చూసుకుని కాపాడు. నీ పాదసేవా, భగవత్ చింతనా తప్ప మాకు మరేమీ అక్కర్లేదు" అని ప్రార్థించారు.

ఆమె వారి సేవల కంగీకరించి అప్పుడే వారిద్దరినీ తన పుత్రిక ఇంద్రదత్త వద్దకు పంపింది. ఆమె కూడా వారిమాటలు నమ్మి, నమ్మకమైనవారని, పనులకు ఉంచుకుంది.

పై కథ తరవాత మజిలీలో చెబుతాను" అన్నాడు మణిసిద్ధుడు.

# కాశీమజిలీ కథలు

## 84. వ మజిలీ

### కవికంఠ కాక్షేయుకుని కథ

"రాజపుత్రా! నువ్వు మంచి సమయానికి వచ్చి నాకు ఉపకారం చేశావు. నీ మెలెన్నటికీ మరవను. వీళ్ళు నన్ను పట్టుకోడమా! నా చెల్లెలు సరోజినికి అపాయం వస్తుందని దానిని దాటిస్తూ చూసుకోలేక పోయాను. ఈ కత్తే నా చేతిలో ఉంటే ఎంతమంది వచ్చినా పీచమడిచే వాడినే. ఇక ఏమరకుండా ఈ కత్తిని దగ్గరుంచు కుంటాను. ఎందరు రాజభటులు వస్తారో చూస్తాను.

నువ్వు సరోజినిని పెళ్ళాడతానని ఒప్పుకుని మానేశావు. అలాటి బుద్ధిమంతురాలు, గుణవంతురాలు, రూపవంతురాలూ భూమ్మీద మరొకరున్నారా! ఎవరో భోగం స్త్రీ అనేసరికి నమ్మేస్తావా? ఉత్తమ వంశంలో పుట్టిందని దాని రూపమే చెబుతుంది. దాని పుట్టుక గురించి తెలుసుకొనవలసి ఉంది" అంటూ ఘటదత్తుడు సుముఖుడితో తన కథా సరోజిని కథా చెప్పాడు.

అది విని సుముఖుడు - "బావా! వేశ్యాంగను పెళ్ళాడకూడదని సుమేధుడు చెప్పాడు. మాకేం తెలుస్తుంది? అయినా నేను సరోజిని యందు మనసు మరల్చుకోలేక కాళిందీ పురం పోయి చంద్రవతితో మాట్లాడాను. అది నీ కడుపున పుట్టిందా?- అని అడిగాను. మొదట ఔనంది కాని..చివరకి - 'నా కూతురే అయితే నా దగ్గరకి రాకపోయేదా? దానిని తెచ్చుకున్నాను. దాని కెప్పుడూ యిక్కడి నుంచి పోవాలనే ఉండేది. అది మళ్ళీవొస్తే ఎంతో సంపాదించుకోగలను. డబ్బుతోపాటు దొంగలు దాన్ని కూడా ఎత్తుకు పోయారని ఏడిచింది.

అక్కడినుంచి మళ్ళీ దేశాటనం బయలుదేరి అనేక జనపదాలు వెదుకుతూ ఇప్పటికి నిన్నిక్కడ చూడగలిగాను. నువ్వు అర్జును దంతటి అసహాయ శూరుడివి. నీచేతి సంకెళ్ళు విప్పినందుకే నా పట్ల ఎంతో విశ్వాసం చూపుతున్నావు. నీ సుగుణాలలాటివి. ఇది మొదలు నీవు చెప్పినట్లు నడుచుకుంటూ నిన్ను మా మంత్రిని చేసుకుంటాను. మా వూరురా. సరోజినిది ఏకులమయినా పెళ్ళి చేసుకుంటానని శపథం చేస్తున్నాను." అన్నాడు సుముఖుడు చాలా ఆవేశంగా.

"నువ్వు చాలా బుద్ధిమంతుడివని సరోజిని చెప్పింది. మీ యిద్దరినీ కూర్చితేనే విధాతకు పేరు. సరోజినిని ఒక్కతెనీ అడవిలో వదలి వచ్చాను. ఏమైందో చూడాలి. తెలివైనది కనక ఎలాగేనా తప్పించుకుని జనపదం చేరగలదు. కాని ఏ క్రూరమృగాలేనా అపాయం కలిగించా యేమో? వేగంగా పద" అంటూ అతనితో కలసి ఆ చోటుకి వచ్చి ఆమెకోసం వెదికాడు. ఆమె కనిపింపకపోడంతో పరిపరివిధాల విచారించాడు.

"మిత్రమా! నువ్వు శోకిస్తూంటే నా గుండె పగిలిపోతూంది. సరోజిని బతికుంటే యీ అరణ్యంలో ఎందుకుంటుంది? ఇన్నాళ్ళయింది. ఏ జనపదమో చేరుకుని ఉంటుంది. దగ్గరలోని గ్రామాలు వెదుకుదాం పద" అంటూ సమీపంలోని గ్రామాలకు తీసుకెళ్ళి వెదికాడు. ఆ పేరుకల ఆమె వచ్చినట్లు ఎవరూ చెప్పలేదు.

అప్పుడు ఘటదత్తుడు కోపం పట్టలేక – "శరణుజొచ్చిన తరుణిని కాపాడ లేకపోయాను. ఇంక నా జన్మదేనికి? కాళిందీపుర రాజెవడో మాకు పూర్వజన్మ విరోధి అయివుండాలి. మాకు మంచి జరగబోయేముందల్లా వాళ్ళ భటులు వచ్చి విఘ్నం కలగజేశారు. నేను వాళ్ళకి వెరచి దొంగలా పారిపోయాను. ఇక – యశస్సో, మృత్యువో ఏదో ఒకటి తేల్చుకోవాలి. అందుచేత ఇప్పుడే పోయి కాళిందీ నగర రాజుని పరాభవించి నాకసి తీర్చుకుంటాను. నువ్వు సహాయం చెయ్యి" అన్నాడు

సుముఖుడు – "దొంగలచే పీడించబడే ప్రజలని రాజులు కాపాడాలికదా? నువ్వు వెళ్ళి నీ వృత్తాంతం చెప్పి బయట పడడం మంచిది. ఆరాజుపేరు కీర్తిసేనుడు. వసుంధరుడి మామ కుమద్వంతుడికి పినతండ్రి కొడుకు. వారిసేన అపారం. పోరులో గెలవడం కష్టం. శాంతంగానే పరిష్కరించుకుని తరవాత సరోజినిని వెదుకుదాం" అన్నాడు.

వాళ్ళామెను వెదుకుతూ గ్రామాలు తిరుగుతూంటే ఒకచోట సైన్యం కనిపించింది. దాని గురించి వారు అడగగా – "అయ్యా! ఘటదత్తుడనే గజదొంగ గ్రామాలలో తిరుగుతున్నాడు. రెండుమూడుసార్లు దొరికి కూడా తప్పించుకుపోయాడు. ఈ సేన కీర్తిసేనుడనే మహారాజుది. అతన్ని పట్టుకోకుండా తిరిగి రావద్దని తనసేనలన్నిటినీ పంపాడు. ఆ బలాలు దేశమంతా తిరుగుతున్నాయి. అతన్ని పట్టుకోడానికే మేమూ పోతున్నాం" అన్నారు వారు.

ఆ మాట వినడంతోటే ఘటదత్తుడు సైన్యంలోని ఒక గుర్రాన్ని లాక్కుపోయి దాని మీదెక్కి కత్తి పట్టుకుని తనపేరు చెబుతూ వారి తలలు నరుకుతూ స్వల్ప వ్యవధిలో సైన్యాన్ని పీనుగులపెంటని చేసి వదిలాడు. కొద్దిమంది ప్రాణాలు దక్కించుకుని పారిపోయారు.

అది చూసి ఆశ్చర్యంతోనూ ఆనందంతోనూ సుముఖుడు అతన్ని కౌగలించుకుని – "మిత్రమా! నువ్వు మనుష్యమాత్రుడివి కావు. నీలో ఈశ్వరాంశ ఉంది. కసితీరా కీర్తిసేనుని సేనలను శిక్షించావు కదా? ఇక మా పట్నం పోదాం పద. నీకు మంత్రి పదవి ఇప్పిస్తాను." అన్నాడు ప్రేమగా.

"సరోజిని జాడ తెలుసుకోకుండా ఎక్కడికీ రాను. ఇంకా వెదుకుతాను. నువ్వు సుకుమారుడివి. చాలా అలసిపోయావు. ఇంటికెళ్ళి సుఖంగా ఉండు" అన్నాడు ఘటదత్తుడు.

"నేను అందుకనలేదు. సరే పద. సరోజినిని వెదుకుదాం" అని అతనితో బయలుదేరాడు. వాళ్ళు తిరుగుతూంటే – ఒక గ్రామంలో దేవాలయ గోపురపు గోడకు మూడు ప్రకటన పత్రికలు కనిపించాయి.

మొదటిది :- ఘటదత్తుడిని పట్టుకుని కట్టి తీసుకువచ్చిన వారికి

మూడు గ్రామాలు కానుకగా ఇవ్వబడతాయి - కాళిందీ నగరరాజు, కీర్తిసేనుడు.

**రెండవది** :- ఘటదత్తుడనే బ్రాహ్మణ కుమారుడిని తీసుకువచ్చిన వారికి అపారమైన పారితోషికా లివ్వబడతాయి - కుముద్వతీ పురపాలకుడు. వసుంధరుడు.

**మూడవది** :- ఘటదత్తుడనే చిన్న వాడిని తీసుకొచ్చిన వారికి వెయ్యిదీనారాలు కట్నమివ్వగలను - ఇట్లు కమలా పురాధీశ్వరుడు, విజయదేవ భూపాలుడు.

ఆ మూడు ప్రకటనలు చదివిన ఘటదత్తుడు - 'ఆహా! దైవం నా కిప్పుడు కొంచెం అనుకూలు డౌతున్నట్లు తోస్తూంది. నా మీద కోపగించిన నా గురువు వసుంధరుడు నా రాకని కోరుతున్నాడు. ఇది శుభసూచకమే. ఇంద్రదత్త తండ్రి కూతురు ప్రోత్సాహంతోఇది ప్రకటించి ఉంటాడు. ఇలాంటి సంతోష సమయంలో నువ్వుంటే ఎంత బాగుండేదో సరోజినీ!

కీర్తిసేనుడా! నీది పాము పగకన్న ఎక్కువ. నా కోసం మూడుగ్రామాలు దానం చేస్తావా! అని నవ్వుతూ, సుముఖుడితో "మిత్రమా! నాకోసం ముగ్గురు వార్తలు పంపారు. ముందు ఎవరిపని చక్కబెట్టి వొద్దాం? ఒకవేళ సరోజిని తల్లివద్దకు వెళ్ళిందేమో. అదీ చూడొచ్చు ముందుగా కీర్తిసేనుడి కోరిక తీరుద్దాం" అంటూ ఆ పురానికి దారితీశాడు.

దారిలో ఒక అగ్రహారంలో ఒక బ్రాహ్మణు నింట్లో బసచేసి భోజనం చేస్తూండగా - అక్కడ మరి కొందరు బ్రాహ్మణులు తారసపడ్డారు. సుముఖు డా గృహ యజమానిని వారి గురించి అడిగాడు.

"వీరిది కాళిందీపురం కీర్తిసేనుడనే ఆ రాజు పండితులంటే చెవికోసుకుంటాడు. ఆ మహారాజు దండయాత్రకి కూడా పండితులని వెంట బెట్టుకు తిరుగుతున్నాడు. ఈ అగ్రహారంలో - పండిత వేదండ కంఠీరవుడనీ, సూరిభైరవుడనీ బిరుదాలు కల ఇద్దరు పండితు లున్నారు.

వారికీ ఆస్థాన పండితులకీ రేపు ఇక్కడ ప్రసంగం జరుగుతుంది. గెలిచిన వారికి రాజుగారు గొప్ప పారితోషికమిస్తారు. కాని మధ్యస్తుడు దొరకలేదు. రాజుగారే ఉండవచ్చు" అని చెప్పా డతను.

" ఆ మహారాజుగా రెవరి మీదకు దండయాత్రకు వెళ్ళారో తెలియరాలేదు. ఆ విషయం కొంచెం చెబుతారా?" అని అడగ్గా ఆ పండితులు – "ఘటదత్తు డనే దొంగ మా పురం వచ్చి వేశ్యాగృహంలో ప్రవేశించి విత్తమంతా ఎత్తుకుపోయాడు. వాడిని పట్టుకుందుకు ఎన్ని సేనలను పంపినా కాందిశీకులని చేసేస్తున్నాడట. మొన్న – పదివేల మందిని ఒక్కడూ తరిమికొట్టాడట. అందుకని మా రాజు స్వయంగా తనే వాడిని పట్టుకుందుకు బయలు దేరాడు" అన్నారు.

"ఔను ఘటదత్తుడి గురించి తరచుగా వింటూ ఉన్నాం. ఎంతయినా ఒక్కడికోసం రాజుగా రింత ప్రయత్నం చేయడం ఆశ్చర్యమే. రాజుగారు పండిత ప్రియుడే కాని దీర్ఘ క్రోధుడు కూడా నటకదా?" అన్నాడు ఇంటి యజమాని.

భోజనాలయ్యాక సుముఖుడు ఆ పండితులతో – "మధ్యవర్తి దొరక్కపోతే ఇతను తగినవాడే. ఈయన పేరు కవికంఠ కౌక్షేయుకుడు. మీ రాజుగారితో చెప్పండి" అన్నాడు.

ఆ మాట విని వారు అడగగా "మాది కాశీపురం. ఏదో కొంచెం పాండిత్యం ముంది. అవసరమైతే ఆ పని కంగీకరిస్తాను" అన్నాడు.

వారు పోయి రాజుకి చెప్పగా, వెంటనే అతన్ని తీసుకు రమ్మన్నాడు. పండితవేషాలు దరించి ఘటదత్తుడు, సుముఖుడు వెళ్ళారు. వారి రూపాలు, తేజం చూసి కీర్తిసేనుడు ఆశ్చర్యపడి – "మీలో పెద్దపండితు డెవరు?" అని అడిగాడు. వారేమీ మాట్లాడకపోడంతో – "మీకు మాటలురావా? మీలో మధ్యవర్తిగా ఉండే పండితు డెవరు?" అని అడిగాడు.

అప్పుడు – "నేను, అయ్యా! మీరు మొదటే ఇలా అడిగితే చెప్పేవాడినే. మీ ప్రశ్న సమంజసంగా లేదని ఊరుకున్నాను. నేను పెద్ద

పండితుడినని చెప్పుకుంటే రెండవ వాని కవమానం, చెప్పుకున్న వాడికి ఆత్మస్తుతి దోషం కలుగుతాయి. ఆ వాక్యానికి నూరు దోషాలు పట్టాయి." అన్నాడు. అతని మాటలకు రాజు చాలా సంతోషించి తన పండితులని ఆ మాటలను ఖండించ మన్నాడు వారు తమకి తోచిన వాదాలు చేయగా అతను తన వాదాన్ని స్థిరపరుచుకుంటూ తనకి పద్నాలుగు విద్యలలోనూ కల పాండిత్యాన్ని తెలియ జేశాడు.

వారు అతని పాదాలమీద పడి – "మహాత్మా! నువ్వు సరస్వతి అవతారానివి భూలోకంలో ఏ పండితుడూ నీతో ప్రసంగించలేడు. వ్యాసుడో, శంకరుడో మాత్రమే వాదించగలరు" అని స్తుతించారు కీర్తిసేనుడు అప్పుడు అగ్రహారంలోని వేదండ సింహుణ్నీ, సూరి భైరవుణ్నీ రప్పించి వాదించగలరు." అని స్తుతించారు.

కీర్తిసేనుడు అప్పుడు అగ్రహారంలోని వేదండసింహుణ్నీ, సూరిభైరవుణ్నీ రప్పించి అతనితో వాదించ మన్నాడు. వారి కొక్కొక్క విద్యయందే పాండిత్యముండగా అతనికి పధ్నాలుగు విద్యలలోనూ పాండిత్య ముంది. వారెంత సేపు వాదించ గలరు? స్వల్ప సమయంలోనే పాదాక్రాంతు లయిపోయారు. రాజు అతని పాండిత్యానికి కెంతో సంతోషించి – అతన్ని కౌగలించుకుని, "నేనెంతో పుణ్యం చేసుకోబట్టి నీ వంటి పండితుని దర్శనం లభించింది. నీ కోరి కేమిటో చెప్పు. తీర్చి ధన్యుడినౌతాను" అని ప్రార్థించాడు.

అందు కతను – "దేవా! నీ త్యాగం మునుపే నేను విన్నాను. ఒక దొంగను పట్టుకుంటే మూడు గ్రామా లిస్తానన్న వదాన్యుడివి. నీ సంతోషం కంటె ఏం కావాలి నాకు? అయినా కోరమన్నావు కనుక ... నువ్వా ఘటదత్తుడి విషయమై చేస్తున్న ప్రయత్నాన్ని విరమించుకో చాలు ఊరికే సేనలను వాడి కెందుకు బలిస్తావు? వాడు నీకు వశమయ్యేవాడు కాదు" అన్నాడు.

రాజు తెల్లబోయి – "నీ కోరిక చాలా విచిత్రంగా ఉంది ఆ ఘటదత్తుడి నెరుగుదువా ఏం? ఒక ఆడదాని సర్వస్వాన్నీ దొంగిలించిన వాడిని శిక్షించక వదిలేయడం న్యాయమా? వాడి కోసమే ఈ దండయాత్ర.

నీకు వాడిమీద ఇలాటి దయ ఎందుకు?" అని అడిగాడు

"నాకు వాడి మీద దయమీ లేదు మీ సేవలు అనవసరంగా నాశన మౌతున్నాయని చెప్పాను. వాడిని మీరు పట్టుకోలేరు వెనక్కి వెళ్ళిపోడమే శ్రేయస్కరం" అన్నా డతను.

రాజు పదే పదే ఒత్తిడి చేయగా - అతన్ని అనేక విధాల వేగించి - "నేనేఘటదత్తుణ్ని" అన్నాడు.

రాజు ఆశ్చర్యానికి మేరలేదు. "ఏమిటీ! నువ్వు ఘటదత్తుడివా! ఇంత పాండిత్యం, పరాక్రమం కలిగిఉండి వారకాంత ధన మెందుకు దోచుకున్నావు? ప్రాజ్ఞుడివై పాపకార్యాలు చెయ్యవచ్చునా?" అని అడిగాడు.

అప్పుడు సుముఖుడే కలుగజేసుకుని అతని వృత్తాంతమంతా చెప్పేసరికి రాజు మరింత ఆశ్చర్యపోయి పశ్చాత్తాపపడుతూ, "మహాత్మా! నీ వృత్తాంతం తెలియక నిన్ను బాధించినందుకు నన్ను మన్నించు. వసుంధరుడి పాండిత్య ప్రకర్ష మేం విన్నాం. అతను లోక ప్రసిద్ధుడు నువ్వు వాని శిష్యుడివీ, రామలింగకవి కుమారుడివీ. నువ్వు అంతకంటే అధికుడి వయ్యావు. నీకు కొన్ని అగ్రహారా లివ్వ దలచుకున్నాను. నావద్ద పండితుడిగా ఉండు" అని కోరాడు.

ఆ పైన జరిగినది మణిసిద్ధుడు పై మజిలీలో కొనసాగించాడు

# కాశీమజిలీ కథలు

## 85. వ మజిలీ

"మంజరికా! ఈ సరోజిని కౌముది పోలికతో ఉంది చూశావా? ఈ చిన్నది ఇంద్రదత్త కేమౌతుందో? ఒకవేళ ఆ బాలిక బతికి ఇక్కడికి రాలేదు కదా?" అని అడిగింది పాటలిక. "ఔను. నాకూ అనుమానంగానే ఉంది. నడక అచ్చంగా అలాగే ఉంది ఇప్పుడు రాజపుత్రికతో మాట్లాడుతూంది. విందాం పద –" అంటూ ఆమెను తీసుకుని అక్కడికి వెళ్ళింది.

"దేవీ! నేను అబద్ధాలాడే దాన్ని కాను. ఘటదత్తుడు ఉత్తమ వంశంలో పుట్టాడు" అంటూ సరోజిని అతని వృత్తాంతమంతా వివరించింది. "ఇంద్రదత్తా! అతనే నీకు తగినవాడు. ఈ విషయంలో నువ్వు చింతింపవలసిన పనిలేదు" అని నొక్కి వక్కాణించింది.

ఆ వృత్తాంతం విని మంజరిక, పాటలిక గుండెలమీద చేతులు వేసుకున్నారు." అమ్మయ్యో! ఘటదత్తుడు ఇక్కడికి వచ్చేడా! ఈ రాజపుత్రిక అతన్ని వలచినట్లుంది అతను రాజపుత్రుడని చెబితే చాలా సంతోషిస్తుంది. చెబుదామా?...చెబితే...మనద్రోహం బయట పడుతుంది మనకేం పని? ఈ చిన్నది కౌముది కూతురే. ఇద్దరినీ ఒక చోటుకే చేర్చాడు!"

"ఈ వృత్తాంతం చెప్పేవరకూ నాకు నోరు నిలవడం లేదు. ఎలా చెప్పాలో..."

" ఈ కథ చెబితే మనకి శిరచ్ఛేదమే. మనం ఇద్దరి శిశువులని చంపబోయాం. దైవమే వాళ్ళని కాపాడాడు. నువ్వూ మాతల్లీ ఇంత చేశారు. మనం చేసింది మననే కొట్టి స్థానభ్రష్టులని చేసింది నిజం తెలిస్తే వీళ్ళు మాత్రం యిక్కడుండ నిస్తారా? అంచేత మౌనంగా ఉండు" అని మంజరిక ఆమె నోరు నొక్కింది.

కాని పాటలిక ఎక్కువకాలం ఆ రహస్యం భరించలేక ఒకనాడు ఇంద్రదత్తతో రహస్యంగా – "ఘటదత్తుడు కృష్ణదేవరాయల దౌహిత్రుడు వసుంధరుని కొడుకు అతను పుట్టినప్పుడు దాది కుట్ర చేసి కందకంలో పారెయ్యాలని తీసుకుపోతూంటే శారద అనే బ్రాహ్మణ పత్నికి ఆ బిడ్డ దక్కితే ఆమె ప్రేమతో పెంచుకుంది. ఆ రహస్యం తరవాత నాకు దాదివల్ల తెలిసింది. ఈ సరోజినే కౌముది కూతురు. ఈ కపటం కూడా దాసే చేసింది" అని చెప్పేసింది.

ఇంద్రదత్త సంతోషం పట్టలేక – "నువ్వు చెప్పిన కథ నిజమైతే నాలాటి ధన్యురాలు భూమీ్మదే ఉండదు. ఏదీ, మళ్ళీ చెప్పు.. ఇతను కొడుకని వసుంధరుడికి తెలియదు కాబోలు! ఎంతవింత! సరోజిని నిజంగా అతని చెల్లెలే అని ఘటదత్తుడికీ తెలియదు! అసలు...ఇదంతా నీ కెలా తెలిసింది?" అంటూ ఆమె దానితో మాట్లాడుతూంటే ... విజయదేవు దక్కడికి వచ్చి భార్యని కూడా రప్పించి –

"మన ఇంద్రదత్త వరించిన ఘటదత్తుడు దొంగ అనుకున్నాం. కాని అతను బ్రాహ్మణు డట. భూలోకంలోనే అతనిలాంటి పండితుడూ పరాక్రమవంతుడూ లేడట. మునుపు అతన్ని దొంగ అన్న కీర్తిసేనుడే – తన రాజ్యంలో అర్ధభాగం ఇచ్చానని తెలియ జేశాడు. సుముఖుడనే వాడు అతనికి మంత్రిత్వాధికారం ఇచ్చాడట.

నేను.. నా రాజ్యానికే అధికారిని చేస్తున్నానని తెలియ జేస్తాను. వెంటనే రమ్మని లేఖ పంపుతాను". అని ఎంతో ఆనందంగా చెప్పాడు.

అప్పుడు రాజపుత్రిక –"తండ్రీ! నువ్వు నీ అల్లుడు బ్రాహ్మణుడంటేనే ఇంతసంతోషిస్తున్నావు. యదార్థ చరిత్ర వింటే ఇంకెంత ఆనందిస్తావో విను. ఆ వీరుడు కృష్ణదేవరాయల దౌహిత్రుడు. తెనాలి రామలింగకవి పౌత్రుడు. వసుంధరుని పుత్రుడు మనం భోగం స్త్రీ అని వినిన సరోజిని నిజంగా అతనికి చెల్లెలే! కుముద్వంతుని దౌహిత్రి. వాళ్ళిద్దరూ గ్రహచారం వల్ల తల్లితండ్రులకి దూరమై కష్టాలు పడుతున్నారు. సరోజిని రాజపుత్రికే అనడంలో సందేహం ఏమీ లేదు " అంటూ తను పాటలిక ద్వారా విన్న కథంతా చెప్పింది.

అది విని విజయదేవ భూపాలుడు – "ఓహో! మన భాగ్యమే మని పొగడాలి? మహాత్ములతో సంబంధం కలుపుకున్నాం. సరోజిని ఎక్కడుంది? ఘటదత్తుడిని తీసుకురమ్మని ఇప్పుడే కీర్తిసేనుడి దగ్గరకు దూతలను పంపుతున్నాను" అన్నాడు

వారి మాటలను చాటునుంచి విన్న సరోజిని పాటలికను పిలిచి – "నీకు మా వృత్తాంతం ఎలా తెలుసు? నువ్వు చెప్పిన దాది ఎవరు? నీకూ దానికీ సంబంధం ఏమిటి?" అని తర్కించి అడిగింది. అది సమాధానాలు చెప్పిన తీరుని బట్టి ఆ పనులు చేసింది వారే అని సందేహించింది.

"నీ కథ తెలియక నిన్ను తూలనాడి నందుకు నా తప్పు మన్నించు. నువ్వు నాకు ఆడబిడ్డ వయ్యావు" అంది ఇంద్రదత్త సరోజినితో. రెండురోజులకి దూతల వల్ల సరోజిని అక్కడుందని విని ఘటదత్తుడు, సుముఖుడు, కీర్తిసేనుడు వారివారూ కమలాపురం వచ్చారు. విజయదేవ భూపాలుడు వారందరికీ స్వాగత సత్కారాలు చేశాడు. అప్పుడు ఘటదత్తుడు సరోజినిని చూడడానికి అంతఃపురానికి వెళ్ళాడు ఆమె అతనికి ఎదురొచ్చింది. ఇద్దరూ కొంతసేపు దుఃఖించి తాము పడిన బాధలు ఒకరికొకరు చెప్పుకున్నారు.

అప్పుడే మంజరిక ఎందుకో అక్కడికి వచ్చింది. దానిని చూసి గురుతుపట్టిన ఘటదత్తుడు – "ఓసీ! నువ్వు మంజరికవి కావూ? కళావతి సఖురాలివి ఇక్కడి కెందుకు వచ్చావు?" అని అడిగాడు. "దేవా! మేమిప్పు డక్కడ పని మానేశాం. కాశీ పోయి వస్తూ ఈ దివాణాన్ని ఆశ్రయించాం" అం దది.

సరోజిని – "అన్నా! వీరిని నువ్వు ఎరుగుదువా? వీళ్ళు ఇందుమతి పరిచారికులమని చెప్పారే? కళావతి నెలా ఎరుగుదురు?" అని అడిగేసరికి "కళావతి పరిచారికలే" అని చెప్పా డతను. ఆమె దానిని అడుగగా ఒక మాటకు వేరొక మాట చెప్పింది. ముందే అనుమానించిన సరోజిని దానితో ఆ పనులు చేసిన వారు వాళ్ళే అని ధ్రువ పరచుకుంది.

తరవాత సరోజిని తమ కథంతా ఘటదత్తుడికి చెప్పి.- "అన్నా! నువ్వు కళావతి కుమారుడివట. నేను కౌముది పుత్రికనట. వసుంధరుడే మన తండ్రట. ఈ దాదులు చెప్పారు. ఈ కపటపు పనులు చేసింది వీరే" అని అతనిని ఆనందంలో ముంచింది.

విజయదేవ భూపాలుడు ఘటదత్తుడు వసుంధరుడి కుమారుడని కీర్తిసేనుడికి తెలియజేసి, తన కూతురు ఇంద్రదత్త అతనిని వరించిన కథ చెప్పి అతని అనుమతితో ఆ చరిత్రంతా పత్రికలు రాయించి దూతలకిచ్చి వివాహ శుభలేఖలతో కూడా వసుంధరుడికి పంపాడు.

కళావతి – మంజరిక, పాటలిక పారిపోయారని విని అంతఃపుర పరిచారిక లందరినీ రప్పించి, తర్కించి, "ఈ ఉత్తరం రాజు గారి శయ్యపై ఉంచిన వారెవరు?" అని నిలదీయగా వారు "దేవీ! మా కిదేమీ తెలియదు. పాటలిక కూతురు మాధవిక కంతా తెలుసు." అంటూ ఒక్కమాటగా చెప్పారు.

మాధవికను గట్టిగా దండించగా అది – "మంజరికా, మా తల్లీ దొరికిన కానుకలు సమంగా పంచుకునే తలపుతో ఇద్దరకు పుట్టిన బిడ్డలనీ తీసుకుపోయారు. ఘటదత్తుడు కళావతి కుమారుడే.

ఆ చీటిని మంజరిక రాసి పరుపు మీద పెట్టింది" అంటూ జరిగినదంతా పూస గుచ్చినట్లు చెప్పేసింది.

ఆ కథ విన్న వసుంధరుడు సంతోషమూ, శోకమూ కూడా ముంచెత్తగా అక్కడి వారిని పిలిపించి ఆ బాలిక వృత్తాంతం అడిగాడు. ఒక కుమ్మరిస్త్రీ – "వీధిలో ఆ పిల్ల నాకు దొరికింది. నేను నెల్లాళ్ళు పెంచి, సంతతిలేని నా మేనత్త కూతురి కిచ్చాను. దానిది ఉజ్జయినీపురం. మూడేళ్ళు పెంచాక అది స్వర్గస్తురా లయిందట. తరవాత దాని బంధువు లెవరో ఆ పిల్లని తీసుకుపోయారని తెలిసింది" అని చెప్పింది.

అప్పు డతను ఉజ్జయిని వెళ్ళి ఆ కులస్థుల నందరినీ రప్పించి ఆ చిన్నదాని గురించి అడగగా పెంపుడుతల్లి చనిపోయాక ఆ పిల్లను సాలెకులంవారికి పెంచుకుందు కిచ్చినట్లు తెలిసింది. చివరకు కాళిందీ

పురంలో చంద్రవతి అనే వేశ్య తీసుకుపోయి పెంచిందని తెలిసి వసుంధరుడు ఇద్దరి భార్యలతోనూ దాని యింటికి పోయాడు.

అది - "ఘటదత్తుడనే చోరుడు నా బంగారాన్నీ పిల్లనీ కూడా కాజేశాడు" అంటూ భోరున ఏడ్చింది

ఆ దేశరాజు కీర్తి సేనుడు తనబంధువే అవడం వల్ల అక్కడికి పోయి అడగగా - "ఘటదత్తుడిని పట్టుకుందుకు ఆదేశం పోయారు" అని చెప్పారు. చెల్లెలని తెలియక సరోజినిని ఘటదత్తుడు తీసుకు పోయాడని విచారిస్తూ వసుంధరు డతని కోసం తిరుగుతూంటే విజయదేవ భూపాలుని దూత లతనిని తోవలో కలుసుకుని శుభలేఖ లిచ్చారు.

ఆ పత్రికలు చదువుకుని వసుంధరుడు పరమానంద భరితుడై తన భార్యలకి చూపి వారు పడిన కష్టాలకు విచారించి, వారి సుగుణాలను మెచ్చుకుని వారి నేర్పరితనానికి ఆనందిస్తూ కమలాపురం చేరుకున్నాడు. వారి రాకవిని రాజు ఎదురేగి వారికి స్వాగతం పలికి తన ప్రాసాదంలో విడిది ఏర్పాటు చేశాడు.

కౌముదీ కళావతులు తమ సంతానాన్ని చూడాలని తొందర పడుతూంటే శర్వాణి వారిని అంతఃపురానికి తీసుకుపోయింది ఆమెతో వసుంధరుడు కూడా వెళ్ళి ఎదురొచ్చిన ఘటదత్తుణ్ని కౌగలించుకుని - "చేతికిఅందిన రత్నాన్ని తెలియక రాయనుకుని పారేసినట్లు నిన్ను దూరం చేసి ఎన్నో కష్టాలు పెట్టాను. నీ పరాక్రమం, సౌశీల్యం లోకాలు కొనియాడుతున్నవి". అన్నాడు. తరవాత ఘటదత్తుడిని తల్లులు లాలించారు. సరోజిని తనని అన్న ఎలా కాపాడాడో వివరించి చెప్పింది.

ఈ లోగానే పాటలిక, మంజరిక ఎక్కడికో పారిపోయారు.

వారంతా ఆనందంగా మాట్లాడు కున్నారు.

విజయదేవ భూపాలుడు ఇంద్రదత్తను ఘటదత్తుడి కిచ్చి వైభవంగా వివాహం చేశాడు. ఆ పెళ్ళివారి నందరినీ వసుంధరుడు తనపురం తీసుకువెళ్ళి సరోజినిని సుముఖుని కిచ్చి మహావైభవంగా పెళ్ళి చేశాడు

ఘటదత్తుడు, చంద్రవతికి - దొంగిలించబడిన ధనమంతా ఇప్పించి సంతోష పెట్టాడు. తనని పెంచిన తల్లితండ్రులు శారద, ఆమె భర్తలకు కృతజ్ఞుడై ఉండి ఉత్తమ గుణవంతునిగా పేరు పొందాడు.

మనవడి చరిత్రంతా విని కృష్ణదేవరాయలు, రామలింగకవి సపరివారంగా సౌగంధిక నగరానికి వచ్చి వసుంధరుడిని గౌరవించి, తమకు నమస్కరిస్తున్న ఘటదత్తుణ్ని కౌగలించుకుని మన్నించారు. రామలింగకవి - "నీ వృత్తాంత మంతా విన్నాను. బ్రాహ్మ క్షాత్ర తేజాలు రెండూ నీలో పొందుపరచబడ్డాయి. నీ పరాక్రమాన్ని క్షత్రియులు, పాండిత్యాన్ని విద్వాంసులు పొగుడుతున్నారు. నీ వల్ల మా వంశం పవిత్రమయింది" అని ప్రశంసిస్తూ కొన్ని శాస్త్రాలలోని విషయాల్ని ప్రశ్నించి పరీక్షించాడు.

ఘటదత్తుడు యుక్తి యుక్తంగా సమాధానాలు చెప్పి అతన్ని ఆశ్చర్యపరిచాడు. కృష్ణదేవరాయలు కూడా పరమానంద భరితు డయ్యాడు.

మంజరిక, పాటలిక చేసిన క్రూరకృత్యాలకి రాయలు వారిని శిక్షించడానికి బంధించి తెమ్మనగా రామలింగకవి - "అదికేవలం వారి దోషమే కాదు. విది చేసిన దానికి మరెవరినో అనడం దేనికి? పోనీండి, దేశసంచారం వల్ల వీరి శీల ప్రబావాలు వెల్లడయ్యాయి" అని అతన్ని వారించాడు.

సరోజిని రామలింగకవినే మించిన యుక్తి యుక్తులతో సంబాషించగా - "నిన్ను జనమందారవల్లి అని పిలవవచ్చును" అన్నాడు.

ఘటదత్త, ఇంద్రదత్తులు, సరోజినీ సుముఖులు సర్వసౌఖ్యాలూ పొందుతూ చాలాకాలం భూలోకాన్ని జనరంజకంగా పాలించారు.

గోపా! నువ్వడిగిన ప్రశ్నకు సమాధానం దొరికింది కదా?" అని అడిగాడు మణిసిద్ధుడు.

గోపాలుడు సంతృప్తిగా ఓ నవ్వు నవ్వాడు.

# కాశీమజిలీ కథలు

## 86. వ మజిలీ

"యతీంద్రా. ఈ నగర బజారు వీధిలో వెళ్తూంటే ఒకచోట కొందరు బ్రాహ్మణులు కూర్చుని భోజుడనే రాజు కధలు చెప్పు కుంటున్నారు. కొంచెంసేపు నిలబడి విన్నాను.ఎంత చోద్యంగా ఉన్నాయని ఆ కధలు. మీరెప్పుడూ ఆ మహారాజు చరిత్ర నాకు చెప్పారు కారేం? ఇవాళ సుదినం. ఆ పుణ్యాత్ముడి వృత్తాంతం చెప్పండి" అని ప్రార్ధించాడు కధాకుతూహలుడు గోపాలుడు.

అతని సమయోచిత వివేకం క్రమ క్రమంగా పెరగడం గమనించి మణిసిద్ధుడు చాలా సంతోషించి రత్నమహిమతో ఆ కథంతా తెలుసుకుని - సావధానంగా చెప్పసాగాడు.

## మంజుడి కథ

ధారారాజ్యం భూమండలానికే అనుపమానమైన అలంకారం. దానిని సింధుడనే రాజు పరిపాలిస్తూ ఉండే వాడు. అతని మంత్రి బుద్ధిసాగరుడు. అతనెంతో తెలివి తేటలతో రాచకార్యాలన్నిటినీ స్వతంత్రంగా చక్కబెడుతూ రాజుకి ఏ మాత్రం పరిపాలనా క్లేశం లేకుండా చూసుకునేవాడు

రాజుకి చాలాకాలం వరకూ సంతానం కలగలేదు. బుద్ధిసాగరుడు వృద్ధ పండితుల సలహాతో రాజుచేత బృహస్పతి సవనమనే యజ్ఞం చేయించాడు ఆ యజ్ఞ పలితంగా ఆ రాజుకి ఒక కుమారుడు కలిగాడు ఆ కుర్రవాడు మన్మధుడిని మించిన అతిలోక సుందరుడు. అతనే భోజుడు.

బాలుడికి ఏడేళ్ళు వచ్చాక సింధుడు బుద్ధిసాగరుణ్ని పిలిచి ఏకాంతంలో ఇలా అన్నాడు. "నీ బుద్ధి బలంవల్ల ఇంతవరకూ రాజ్యభారం నిర్వహించ గలిగాను. ఇప్పుడు ఇంద్రియ పటుత్వం సన్నగిల్లిపోయింది. ఇంక నేను రాజ్యపాలన చెయ్యలేను. నా సోదరుడు మంజుడు రాజ్యం చేయడానికి సమర్థుడై ఉన్నాడు. అలాటి వాడిని మాని కొడుక్కే రాజ్యమిస్తే లోకులు నన్ను నిందింపక మానరు. రాజ్యలోభం వలన మంజుడు బాలుడైన భోజుణ్ణి చంపించక మానడు. దానివలన పుత్రహానీ,రాజ్యహానీ కూడా ఏకకాలంలో కలుగుతాయి. ఇప్పుడు నేనేం చెయ్యాలి? తక్షణ కర్తవ్యం సూచించు."

అందుకు బుద్ధిసాగరుడు – "దేవా! నీ సోదరునకు నీ మీద ప్రేమానురాగా లున్నాయి. ఇంతవరకూ దర్మాత్ముడనే పేరుపొందాడు. అలాటివాడు పాపకృత్యాలు చెయ్యడు. రాజ్యభారం అతనిమీదే ఉంచండి. నేను కూడా చూస్తూ ఉంటాను" అన్నాడు.

సింధుడు మంజుడిని పిలిచి – "తమ్ముడా! వీడు నీకు కూడా కొడుకే. వీడిని పెంచి పెద్దవాడిని చేసి విద్యాబుద్ధులు చెప్పించి రాజ్యానికి పట్టభద్రుణ్ని చెయ్యి. అంతవరకూ ఈ రాజ్యాన్ని నువ్వు ఆపద్ధర్మంగా పరిపాలించు. ధర్మం మాత్రం మరవకు" అంటూ తన రాజ్యాన్ని అతని ఆధీనం చేశాడు. అలాగే కుమారుణ్నీ అతని కప్పగించాడు.

కాలగమనంలో సింధుడు స్వర్గస్తుడయ్యాడు. మంజుడు సింహాసనం ఎక్కాడు. తన కుమారుడు జయంతునితో భోజుణ్ని కలిపి చదివిస్తూ – కొంతకాలం పాటు అన్నలాగే ధర్మంగా రాజ్యపాలన చేశాడు. ఒకనాడు పండితు డొకడు వచ్చి – ఆశీర్వదించి – "రాజా! నాకు సమస్త శాస్త్రవిద్యలూ వచ్చు. నువ్వు నన్ను పరీక్షించు. అన్నిటికీ సమాధానాలు చెబుతాను" అన్నాడు.

మంజుడు చిరునవ్వు నవ్వుతూ, "నేను జన్మించినది మొదలు ఇంతవరకూ జరిగినవన్నీ చెప్పు. అప్పుడే నువ్వు సర్వజ్ఞుడివని ఒప్పుకుంటాను" అన్నాడు.

ఆ బ్రాహ్మణుడు లగ్నం మెదలయినవి గుణించి అతని జీవితంలోని కొన్ని రహస్యాలను కూడా చెప్పేసరికి మంజుడు చాలా సంతోషిస్తూ అతని పాదాలకు నమస్కరించి, నవరత్నఖచితమైన తన సింహాసనం మీద కూర్చోబెట్టి - "నువ్వు అసామాన్యుడివి. త్రిలోక పూజ్యుడివి" అంటూ గొప్ప జాతి గుర్రాలు పదింటి నిచ్చి సంతోష పరిచాడు.

అప్పుడు బుద్ధిసాగరుడు ..."దేవా! బోజకుమారుడి జన్మపత్రిక చూబించరాదా?" అన్నాడు.

దైవజ్ఞుడు దానిని చూసి "రాజపుత్రుడి నిక్కడికి రప్పించండి" అన్నాడు. విద్యామందిరం నుండి రప్పించబడిన భోజుడు రెండో తండ్రిలాటి మంజుని పాదాలకు నమస్కరించాక ఆ బ్రాహ్మణు డతని శారీరక లక్షణాలు క్షుణ్ణంగా పరిశీలించాడు.

"రాజా! భోజకుమారుడు అవతారపురుషుడు ఇంతటి అదృష్టవంతుణ్ని, ఇంత చక్కని జాతకుణ్ని నా జీవితంలో చూసి ఎరుగను. ఈ జాతకుడు ఈ గౌడదేశాన్ని ఏభైఐదు సంవత్సరాల ఏడుమాసాల మూడురోజులు ఏకచ్ఛత్రంగా పాలిస్తాడు. అరవైనాలుగు విద్యలూ ఇతనికి కరతలామలకాలౌతాయి. ఈ బృహత్‌జాతకుడు దాతృత్వంలో శిబినీ, బలినీ, కర్ణుడినీ కూడా మించిన కీర్తి ప్రతిష్ఠలు పొందుతాడు." అంటూ చెప్పాడు ఆ జ్యోతిష పండితుడు.

అతనికి అమూల్యమైన కానుకలిచ్చి పంపివేసి తాను ఎప్పటిలాగే ఏకాంత గృహానికి వెళ్ళిపోయాడు మంజుడు.

'అయ్యో! ఈ రాజ్యం భోజుడిపాలై పోతుంది. అప్పుడు నేను బతికున్నా చచ్చిన వాడితోనే సమానం రాబోయే అనర్థానికి ముందుగానే ప్రతీకారం చెయ్యాలి. ఎలాగేనా కార్యం సాధించుకునే వాడే ప్రాజ్ఞుడు. శత్రువునీ, వ్యాధినీ - పుట్టీపుట్టిన వెంటనే నాశనం చెయ్యాలి' అంటూ ఆ రాత్రంతా ఆలోచిస్తూనే నిద్రలేకుండా ఉండిపోయాడు.

"వంగదేశా ధీశ్వరుడు వత్సరాజుని వెంటనే తీసుకురా." అని అంగరక్షకుడిని పంపాడు. అతను వచ్చాక, అక్క దెవరూ లేకుండా చూసి,

ఏకాంతం కల్పించి – "వత్సరాజా! భృత్యులు ప్రభువులకే ప్రాణా లర్పిస్తారు. రాజ్యాలు నమ్మకమైన భృత్యులమీద ఆధారపడతాయి. ఇప్పుడు నువ్వు చెయ్యవలసిన పని ఒకటుంది. నువ్వు భోజకుమారుణ్ని నీవెంట తీసుకుపోయి అరణ్యంలోని భువనేశ్వరీదేవి ఆలయంలో చంపేసి అతని తలను మాత్రం తీసుకురావాలి. ఇందుకే నిన్ను రప్పించాను" అన్నాడు.

వత్సరాజు తెల్లబోతూ – "దేవా! మీ ఆదేశం పాటించడానికి బద్ధులమే. మీ వద్ద నాకున్న చనవూ, స్నేహంకొద్దీ ఒక మాట చెబుతున్నాను అది తప్పయితే క్షమించండి"

"భోజకుమారుడు ఇప్పుడు విద్యార్థిదశలో ఉన్నాడు. గుణవంతుడు. కోశం కాని సేనలుకాని అతని అధీనంలో లేనే లేవు. మిమ్మల్ని స్వంత తండ్రికంటె ఎక్కువ భక్తితో సేవిస్తాడు. ఎన్నో సుగుణాలకుగని. అలాటి కుమారుణ్ని చంపించడానికి తగిన కారణ మేమిటి?" అని మంజుని దురాలోచనకు అదిరి పడుతూ ప్రశ్న అడిగాడు.

మంజుడు ఆనాటి సభలో దైవజ్ఞుడు భోజుడి జాతకం గురించి చెప్పిన దంతా వత్సరాజుకి తెలిపాడు అది విని –

వత్సరాజు ఫక్కున నవ్వి – "దేవా! ఉదరపోషణ కోసం ఊరూరా తిరిగే ఒక పేద బ్రాహ్మణుని మాటలు నమ్మి మన్మథుడి లాంటి కొడుకు నెందుకు చంపిస్తావు? బ్రహ్మపుత్రు డయిన వశిష్ఠుడు శ్రీరాముడి పట్టాభిషేకానికి పెట్టిన ముహూర్తానికే రాముడు పద్నాలుగేళ్ళపాటు అడవులకు వెళ్ళవలసి వచ్చింది. వశిష్ఠుని దైవజ్ఞత్వం ఏమైంది?

తొందరపడి చేసిన పనులు తరవాత బాధిస్తాయి. ఈ భోజకుమారుణ్ని చంపించావో వృద్ధరాజుమీద అభిమానం కల సైన్యాలు తిరగబడి పట్నాన్ని అల్లకల్లోలం చేయక మానవు. పాలించేది నువ్వే అయినా ప్రజలు భోజకుమారుణ్నే రాజుగా తలుస్తున్నారు. పుత్రవధ ఎప్పటికీ హితం కానే కాదు. దేవర నా మాట విని యీ ఆలోచనను ఇక్కడే విరమించుకోండి." అని ప్రార్థించాడు.

"సేవకుడు ఎప్పుడూ తన అధికారికి తగిన మాటలే చెప్పాలి. ఇది నిక్కచ్చిగా ప్రభుతిరస్కారమే. చెప్పిన పని చెయ్యని భృత్యుణ్ని పోషించడం నిరర్ధకమే" అని రాజు కళ్ళెర్రజేసి కోపంగా అనేసరికి

"మహాప్రసాదం" అంటూ ఆ పనికి ఒప్పుకుని అప్పటి కప్పుడే బయలుదేరి వెళ్ళాడు. ఎవరు పలుకరించినా మాట్లాడక ... వత్సరాజు రథమెక్కి పాఠశాలకు పోయి, వీధిలోనే నిలబడి ఉపాధ్యాయుణ్ని తీసుకురమ్మని ఒక భటుడిని పంపాడు. అతను రాగానే నమస్కరించి, "తాతా! పండిత ప్రవరా! కూర్చో జయంతుడేం చేస్తున్నాడు. ఒకసారి పిలిపించు" అన్నాడు. అతను రాగానే ఏదో మాట్లాడి పంపి భోజకుమారుణ్ని కూడా పిలిపించమన్నాడు.

అది విని – భోజుడు కోపంతో కళ్ళెర్ర జేస్తూ – కోపంగా వచ్చి "నన్నిక్కడికి రప్పించడానికి నువ్వెవడివి? నేను రాజపుత్రుడినని ఎరుగవా?" అంటూ ఎడమ కాలి జోడుతో అతన్ని తలమీద కొట్టాడు.

ఆ దండనాయకుడు – "రాజపుత్రా! నేనలా పిలిపించలేదు. ఇదుగో రాజశాసనం. చూడు" అన్నాడు.

భోజుడు ఆ శాసనం చూసి– "మంచిది. పోదాం, పద" అంటూ ఆ రథం ఎక్కాడు.

వత్సరాజు చేతిలో కత్తిపట్టుకుని...అతని వెనుక రథమెక్కి భువనేశ్వరీ దేవి ఆలయం వున్న అరణ్యంవేపు రథాన్ని తోలించాడు.

అప్పుడు ప్రజలు – "రాజ్యలోభంతో పినతండ్రి భోజుణ్ని చంపిస్తున్నాడు." అంటూ వీధుల్లో కోలాహలంగా చెప్పుకోసాగారు. రాజమార్గంలో పౌరులు గుమిగూడి ఏమి టేమిటని అడగసాగారు. "ఇలాటి ఘోరకృత్యం రాజు చేస్తూంటే ప్రజలు ఊరుకోకూడదు." అంటూ పరుగెత్తసాగారు. "ఉత్తముడైన భోజుణ్ని చంపి మంజుడు రాజ్యం చేయగలడా?" అని హుంకరించారు కొందరు. వీరభటులు గజశాలలకీ, గుర్రాల సాలలకీ పోయి అల్లరి చేయసాగారు. సిందుడిమీద అభిమానం

కల దాసీజనం దుఃఖించసాగారు. భోజకుమారుడి తల్లి సావిత్రి కీ వార్త దాసీ ద్వారా తెలిసి - గుండెలు బాదుకుంటూ, "తండ్రీ! నువ్వు నీ పినతండ్రి కేం అపకారం చేశావు? నిష్కారణంగా అతను నిన్నెందుకు చంపుతున్నాడు? అయ్యో! నువ్వెప్పుడు పట్టాభిషిక్తుడి వౌతావా అని రోజులు లెక్కపెట్టుకుంటున్నానే! ఇంతలోనే నీ ఆయువు అంతమైపోతూందా? నీకు చక్కని కన్యని చూస్తున్నానే నాకు చెప్పకుండా పోయావా! అంటూ ఏడుస్తూంటే - ఆమెను ఒక దాది వారించింది.

"అమ్మా! ఆ మాట సత్యమో, అసత్యమో? ఊరికే వీధులవెంట చెప్పుకోడమేకాని చూసినవారు లేరు. సత్యం తెలిసిన వారెవరూ చెప్పలేదు" అని ఊరడించింది.

"నీమాట నిజమైతే మంచి కానుక లిస్తాను. వెళ్ళి నిజం తెలుసుకురా. నీ కోసం ఎదురు చూస్తుంటాను" అని ఆ పరిచారికని పంపి దైవానికి నమస్కారాలు చేయసాగింది సావిత్రి.

అని చెప్పి ఆ పైకదను తరువాత మజిలీలో చెప్పాడు మణిసిద్ధుడు.

# కాశీమజిలీ కథలు

## 87. వ మజిలీ

### జయంతుడి కథ

**శో**భావతి : ప్రాణేశ్వరా! మీ కుమారుడు జయంతుడు మిమ్మల్నేదో అడగాలని వచ్చి సందేహిస్తున్నాడు. పిలవండి.

*మంజుడు* : వత్సా! రా. నా దగ్గర నీకు సందేహ మెందుకూ? నేను చేసేదంతా నీ కోసమే కదా? నీకేం కావాలో అడుగు. ఇప్పుడే యిస్తాను.

*జయంతుడు* : (కళ్ళు తుడుచుకుంటూ) నాకేమీ అక్కర్లేదు. మా అన్న భోజకుమారుడిని భువనేశ్వరీ కాంతారానికి పంపి చంపించావట. అతనంత అపరాధ మేం చేశాడు?

*మంజుడు* : నువ్వు చిన్నవాడివి. ఇలాటి ప్రశ్నలడక్కూడదు. నేరం చెయ్యబట్టే అలాటి శిక్షవేశాను.

*జయంతుడు* : అతను చేసిన నేర మేమిటో కొంచెం వినాలనుకుంటున్నాను.

*మంజుడు* : నేనెవరికోసం చేశానో వాళ్ళే యిలా అంటూంటే పై వాళ్ళననుకోడం దేనికి?

*జయంతుడు* : నా నిమిత్తం సకలగుణనిధి అయిన భోజ కుమారుణ్ని చంపించారా! అయ్యో నేను పుట్టక పోయినా ఆ దయాశాలి బతికి ఉండేవాడు కదా. (గుండెబాదుకుని దుఃఖించాడు).

*శోభావతి* : జయంతా! వారి అన్న బిడ్డ యందు వారికిలేని ప్రీతి నీకెందుకు? మనం అంతకంటే దూరంవారంకదా. ఊరుకో.

*జయంతుడు* : అతని గుణాలు నీకేం తెలుసు? తల్లీ! నన్నతను కన్నబిడ్డ కంటె ఎక్కువగా చూసేవాడు. 'మాతండ్రి నెరుగను. మంజుడే మా తండ్రి.' అని చెప్పేవాడు. అలాటి పుణ్యాత్ముణ్ని చంపిరమ్మనడానికి నోరెలా వచ్చిందో? ఒకనాడు వేటకు పోయినప్పుడు ఒక వరాహం నాతొడ చీరి పారిపోగా రక్తం బొటబొట కారసాగింది. నా బాధే తన బాధగా నా కతను ఎన్ని ఉపచారాలు చేసి ఎంత ఆదుర్దా చెందాడని!

*శోభావతి* : ఔను భోజుడు చాలా గుణవంతుడని నేనూ చాలాసార్లు విన్నాను. కాని – గతించి పోయినదానికి మనమిప్పుడేం చేయగలం?

*జయంతుడు* : నేనొకనాడు 'అన్నా నువ్వు రాజయ్యాక కూడా నా మీద యీ అనురాగం చూపుతావా? అని అడిగాను. అతను నవ్వుతూ – "తమ్ముడా! ఈ రాజ్యం నువ్వే పాలించు. నేను విద్వాంసుల గోష్ఠిలో కాలక్షేపం చేస్తాను' అన్నాడు. తలుచుకుంటే గుండె పగిలిపోతూంది.

*మంజుడు* : ప్రేయసీ. వాడిమాటలు నమ్మి నువ్వలా అంటావేం? ఎలాటివాడికేనా రాజ్యం వచ్చాక వెనకటి మాటలు నిలవవు. వాడెందుకు అలా అన్నాడో వీడెరుగునా?

*జయంతుడు* : అన్నా! భోజకుమారా! నిన్ను చూసి ఎన్నాళ్ళో అయిపోయినట్లుంది. నన్ను వదిలి నిముషమేనా ఉండేవాడివి కావు. నేను నీ వెంటరాలేకపోయిన కృతఘ్నుడిని కదా. అంటూ మూర్ఛ పోయినట్లు పడుకోగా తల్లి అతనిని సేద తీర్చసాగింది.

అంతలో ఒక పరిజనుడు వచ్చి – "బాహ్లీకుని వద్దనుంచి నలుగురు బ్రాహ్మణులు వచ్చి మీ దర్శనం. కోరుతున్నారు. మీతో మాట్లాడడానికి సుమూహూర్తం మించిపోతూందట" అన్నారు.

మంజుడు వేగంగా సభకి వెళ్ళాడు అక్కడ ఎదురు చూస్తున్న బ్రాహ్మణులు అతన్ని ఆశీర్వదిస్తూ తాము తెచ్చిన శుభలేఖ నతని కందించారు.

"స్వస్తిశ్రీ మంజు మహారాజు వారి సన్నిధికి బాహ్లీకుడు వ్రాయు శుభలేఖార్థములు.

మీరంపిన మీ పుత్రుని చిత్ర ఫలకం చూసి చాలా ఆనందించాం. నా పుత్రిక లీలావతిని మీకుమారునికివ్వడానికి ఆమోదించాము. ముహూర్తం నిశ్చయించి తరలి రావలెను. బాహ్లీకుడు.

ఆ వార్త విన్న సభాసదులు – "పుత్రుడంటే భోజుడా? జయంతుడా?" అని సందేహం చెందారు. భోజుడని భావించిన వారు కన్నీరు పెట్టుకున్నారు.

మంజుడు ఆలోచనలో పడ్డాడు. 'వీరికి నే నెవరి చిత్రపటం పంపానో కొంచెమయినా జ్ఞాపకం లేదు. బాహ్లీకుడి కూతురు లీలావతి చాలా చక్కనిదని విన్నాను. భోజుడు వరించి తన చిత్రపటం పంపాడేమో? దీనిలో నీ పుత్రుడనే రాశాడు కాని పేరు రాయలేదు కదా? జయంతుడికే లీలావతిని చేసుకుంటాను. బాహ్లీకుడు మా కన్న ఎక్కువవాడు." అనుకుంటూ ముహూర్తం అప్పుడే నిశ్చయింపజేసి బ్రాహ్మణులకి కానుకలిచ్చి పంపాడు.

తరవాత ఆ చిత్రపటం భార్యకు చూబించి జరిగింది చెప్పి ముహూర్తం నిర్ణయించినట్లు కూడా చెప్పాడు.

"భోజకుమారుడిని చంపారని నగర మంతా అల్లకల్లోలంగా చెప్పుకున్నారట. ఇంతలో యీ శుభముహూర్తం నిశ్చయిస్తే ప్రజలు ఊరుకుంటారా? ముఖం మీదే అంటారు. అంతేకాక మీ కుమారుడు అతని కోసం ఎంతగానో దుఃఖిస్తున్నాడు. ఇప్పుడు యీ పెళ్ళి కంగీకరిస్తాడా? కొన్నాళ్ళు పోనివ్వండి" అని సలహా ఇచ్చింది భార్య.

అంతలో సాయం కాలమయింది. వత్సరాజు బోజకుమారుడి శిరస్సు చేతితో పట్టుకుని రాజమందిరానికి వచ్చి చూబించాడు. రాజుకోరగా వివరాలు చెప్పాడు "దేవా! తమ అనుజ్ఞతో పారశాలకు పోయి భోజకుమారుడికి శాసనం చూబించగా అతను రథమెక్కి కూర్చున్నాడు అప్పటికే ఆ వార్తపురమంతా వ్యాపించి పౌరులు నా

రధాని కడ్డం వచ్చి ఆటంకాలు కల్పించసాగారు. భోజకుమారుడు సానునయంగా వారిని వారిస్తూ – రాజశాసనం ఎవరూ మీరకూడదనీ, మంచి చెడ్డలు విమర్శించే అదికారం ప్రజలకి లేదనీ అలా అయితే రాజ్యపాలనే సాగదనీ బోధిస్తూ, ఆటంకాలు తొలగించాడు.

కొంత పొద్దు పోయాక మేము అడవికి చేరుకున్నాం. 'నన్నెందుకిలా తీసుకువచ్చారు? రాజశాసనం నాకేం శిక్ష విధిస్తూంది' అని అత నడిగాడు.

నేనేమీ చెప్పలేక – 'నిన్ను చంపడానికే ఇక్కడికి పంపారు' అంటూ రెండో శాసనం చూబించాను.

'దీనికంత చింత పడడం దేనికి? పినతండ్రికి ప్రీతి చేయడం నాకెంతో సంతోషం వేగం మీ పని కానిచ్చుకుని వెళ్ళండి. చీకట్లో ఇంటికి పోలేరు" అని అతను అనేసరికి మేము నివ్వెరపోయాం.

'నా శిరం నరకండి" అని అతను తలవంచగా – 'మీ తల్లికి కాని పినతండ్రికి కాని చెప్పవలసిన మాటలేమైనా ఉన్నాయా? చెప్పు " అన్నాను.

అప్పుడతను తొడచీరి మర్రి ఆకుల మీద రక్తంతో ఏవో రాసి – ఒకటి మీకూ, ఒకటి జయంతుడికీ ఇమ్మన్నాడు. తరవాత అతను దేవుణ్ణి ధ్యానిస్తూ కళ్ళు మూసుకుని శిరస్సు వంచగా నిర్దయులమై తల నరికి తీసుకువచ్చాం."

మంజుడు ముందుగా జయంతుడికి రాసిన పద్యం చదివాడు. దానిలో తమ్ముడికి హితోక్తులూ, తనకోసం విచారించ వద్దనీ ఉంది. అప్పుడు తనకి రాసిన పద్యం చదివాడు. 'కృతయుగంలో మాంధాత, త్రేతాయుగంలో శ్రీరాముడు, ద్వాపరయుగంలో ధర్మరాజు, మొదలయిన మహారాజు లందరూ ఎక్కువ కాలమే భూమిని పాలించినా దీని నిక్కడవదిలి మరోలోకానికి వెళ్ళి పోయారు. నువ్వు మాత్రం ఈ భూమి నిక్కడ వదలకుండా వెంట పెట్టుకునేపోతావు! అంత ఆశ లేకపోతే

క్షణభంగురమైన శరీరాన్నినమ్మి నిరపరాధి అయిన అన్నకొడుకు నెందుకు చంపుతావు?'

ఆ పద్యం చదువుకుని మంజుడు తాత్కాలిక వైరాగ్యంతో మూర్ఛపోయాడు. సేద తీర్చడానికి భార్య తనను ముట్టుకోబోగా ' నేను ఛండాలుణ్ని. అన్న కిచ్చిన మాట నిలబెట్టుకోలేక పోయాను. నాకు నిష్కృతి లేదు' అంటూ విలపించాడు.

అతని భార్య జయంతుడితో – ' మీ తండ్రికి భోజుడి విషయంలో ఇప్పటికి పశ్చాత్తాపం కలిగింది నీకేదో పద్యంరాసి పంపాడట. అందుకు దుఃఖిస్తున్నాడు' అనగా జయంతు డా పద్యం చదివి గుండె బాదుకుంటూ విలపించసాగాడు.

"పుత్రా! నీపాటి ధర్మం నాకు లేకపోయింది. నిష్కారణంగా మంచి కొడుకుని చంపించాను" అని పరిచారకుల చేత పండితులను రప్పించి పుత్రుణ్ని చంపినవాడికి నిష్కృతి ఏమని అడగ్గా – "అగ్నిప్రవేశమే" అన్నారు వారు దర్మశాస్త్రాలు చూసి. ఆ రాజు అగ్నిప్రవేశం చెయ్యడానికి నిశ్చయించుకున్నాడు.

తరవాత మజిలీలో మణిసిద్ధుడు కదను కొనసాగించాడు.

# కాశీమజిలీ కథలు

## 88. వ మజిలీ

### లీలావతి కథ

"సఖీ. సంశయించక చెప్పు నువ్వక్కడి కెప్పుడు పోయావు? ఈ వార్త ఎవరు చెప్పారు? వివరంగా చెప్పు" లీలావతి చామంతిక అనే సఖురాలి నడిగింది.

"నీవు చెప్పగా ధారానగరానికి వెళ్ళాను. పట్నమంతా ఏదో విచారంతో ఉన్నట్లు కనపడింది. పదిమం దొక చోటకూర్చుని భోజకుమారుడి గురించి దీనంగా మాట్లాడుకుంటూంటే నేను వారి వద్దకు పోయి "భోజుడి నివాస మెక్కడ?" - అని అడిగాను.

వారు - 'ఇంకెక్కడి భోజుడు? పినతండ్రిచే బలవన్మరణం పొందాడు' అన్నారు. మరోచోట విచారించగా - 'పినతండ్రి రాజ్యలోభంతో భువనేశ్వరీ అరణ్యానికి పంపి చంపించాడు' అని తెలిసి మనసు వికలమై వచ్చేశాను."

"ఆ! ఎలాటి మాట విన్నాను! విధి. ఎంత క్రూరం!" అని విలపిస్తూ రాజపుత్రిక పీఠంమీద పడుకుంది. తల్లి వచ్చి - "చామంతికా! నీ సఖురాలికి కోరిన వరుడి తోనే తండ్రిగారు వివాహం నిశ్చయించారట. బ్రాహ్మణులు ధారానగరం వెళ్ళి ముహూర్తం నిశ్చయించు కొచ్చారు" అనగానే లీలావతి లేచివచ్చి - "పెళ్ళి ఎవరికి నిశ్చయించారు? నేను కోరినవాడు పరలోకానికి వెళ్ళిపోయాడు నీ మాటలు వింతగా ఉన్నాయి" అంది. అశుభం పలకవొద్దని తల్లి వారించి - శుభలేఖలు తెప్పించి చూపించింది.

లీలావతి వాటిని జాగ్రత్తగా చదివి - "నేను కోరుకున్నది భోజుడిని. ఈ లేఖలో అతని పేరు లేదు. అతనికి మరో కుమారు

డున్నాడేమో. అతనికోసం అంగీకరించాడేమో. అమ్మా. బతికుంటే భోజుణ్ని పెళ్ళిచేసుకుంటాను. లేదా ఇలా బ్రహ్మచారిణిగానే ఉంటాను కాని మరెవరినీ వరించను" అని కచ్చితంగా చెప్పేసింది ఆ వార్త ఆమె భర్తకి తెలిసింది.

బాహ్లీకుడు వార్తాహరులందరినీ దారానగరం పోయి బోజుని విషయం తెలుసుకురమ్మని పంపాడు. వాళ్ళు వెళ్ళి వచ్చి "దేవా! భోజకుమారుణ్ని చంపించి మంజుడు పశ్చాత్తాపంతో అగ్నిప్రవేశం చేయడానికి సిద్ధంగా ఉన్నాడు" అని చెప్పారు.

అదే ముహూర్తానికి పుత్రికకి చెప్పకుండానే మరో సంబంధం నిశ్చయించి పెళ్ళి చేసేటట్లు అత నేర్పాటు చేశాడు.

ఆ వార్త దాసీద్వారా విని మరొకరిని పెళ్ళాడ్డం ఇష్టంలేని లీలావతి ముహూర్తం రెండు మూడు రోజులుందనగా ఎవరికీ చెప్పకుండా కోటదాటి చురుకైన గుర్రమెక్కి అరణ్యామార్గంలో వెళ్ళిపోసాగింది.

ఆమెకు గుర్రపుస్వారి, ఆయుధధారణం మొదలైన విద్యలు చిన్నతనం నుంచీ అలవాటే. ఏకరీతిగా ఆమె పోతూండగా ఒక కొండవద్ద గుర్రం తోవతప్పింది. కొంతదూరం వెళ్ళాక మరి తోవ కనిపించక వచ్చినదారి తెలియక తిరిగిన చోటే తిరుగుతూ – ఒక చోట గుర్రాన్ని నిలిపి చెట్టెక్కి చూసింది. దూరంగా కనపడిన జలాశయం చూసి గుర్తుంచుకుని అక్కడికి చేరుకుంది.

అక్కడ నీరుతాగి సేద తీరాక ఒక దేవళాన్ని చూసి దాని దగ్గరకు పోయింది. దానికి తలుపులు లేవు. అప్పుడప్పు డెవరో వచ్చి పూజిస్తున్న గుర్తులు కొన్ని ఉన్నాయి. అక్కడ చూసి వచ్చి సరస్సులో స్నానం చేస్తూంటే – "ఓ పుణ్యాత్మురాలా! నేను ధారా నగర వాసిని. వర్తకుడిని. దొంగలు తరుముకుని రాగా దారి తప్పి యీ అడవిలో చిక్కుకున్నాను. రక్షించండి." అని కేకలు వినపడ్డాయి. దిగంబరంగా ఉన్న ఆమె పరులు చూస్తారని ముఖం మాత్రం పద్మంలా పైకి ఉంచి నీటిలో మునిగింది దొంగ లక్కడ వెదికి లీలావతి బట్టలు కనపడడంతో వాటిని పట్టుకుపోయారు.

'అయ్యో. దినమొలతో నేనెక్కడికి పోగలను? భోజుడు హతుడయ్యాడని విన్నాక ధారానగరం పోవాలనే సాహసం నే నెందుకు చెయ్యాలి? దైవమా. నాకీ ఆపద ఎందుకు తెచ్చావు?" అని విచారించి, అప్పుడొక ఉపాయం తట్టగా తామరాకులు శరీరానికి చుట్టుకుని తూళ్ళతో వాటిని బిగించి ఒడ్డుకి వచ్చి కూర్చుంది అప్పటికి సూర్యాస్తమయం అవుతూంది.

గంధర్వకన్యలు స్నానం చేయడానికి రాగా ఆమె మెల్లగా పాకుతూ పోయి వారి వస్త్రాలను కట్టుకుని కత్తి తీసుకుని భైరవాలయం చేరి విగ్రహంచాటున కూర్చుంది.

అంతలో చీకటి పడింది. ఘంటానాదం వినపడింది. ఒక కాపాలికుడు ఆ గుడిలోకి వచ్చి విగ్రహం దగ్గర హోమం చేస్తూంటే ఆ హోమకుండం నుంచి ఒక దేవత బయటకు వచ్చి "కాపాలికా! నీకోరి కేమిటి?" అని అడిగాడు.

"స్వామీ! నేటికి నీ అనుగ్రహం కలిగింది. నా కోరిక విను. చిత్రాంగదుని కూతురు చంద్రముఖి సౌందర్యం వర్ణనాతీతం. దాని నిక్కడికి తీసుకురావాలి. ఆమెను వివాహం చేసుకోవాలనే నిన్ను ఆరాధించాను" అన్నా డతను. ఆమె నక్కడకు తీసుకువచ్చి భైరవుడు అంతర్థాన మయిపోయాడు.

ఆ కాపాలికుడు అగ్నిని ప్రజ్వరిల్లజేసి ఆమె చేయి పట్టుకుని – "నన్ను గుర్తుపట్టావా? ఆవేళ మీ యింటి కొచ్చిన కాపాలికుణ్ణి నా కోరిక చెబితే భటులచేత తోయించేశావు కదా? నా మహిమ ఎరగక పరాభవించావు. ఇక ఇష్టంతో పెళ్ళాడు. ఇది మీయిల్లు కాదు, మహారణ్య మధ్యంలో భైరవాలయం. ఇప్పుడు నీతో బలవంతంగా క్రీడించినా ఎవరూ అడ్డపడరు" అని క్రూరంగా నవ్వాడు.

ఆమె – "దురాత్మా! ప్రాణమేనా వదులతా కాని నిన్ను మాత్రం పెళ్ళాడను" అంది. ఆ కాపాలికు డామెను బలవంతం చేస్తూంటే ఆమె పెద్ద కంఠంతో ఏడవసాగింది.

అప్పుడు విగ్రహం చాటునున్న లీలావతి అంతా చూస్తూ సరయిన సమయంలో కత్తి ఝళిపిస్తూ – "ఓరీ! కాపాలికా! మంత్రాలతో అక్రమంగా బంధించి యీమెను వేదిస్తున్న నిన్ను చంపినా పాపం లేదు." అంటూ వాడితల నరికి భైరవుడికి నైవేద్యం పెట్టింది

భైరవుడు ప్రత్యక్షమై – "ఓ కాంతా! నీ సాహసానికి మెచ్చుకున్నాను. ఏదేనా కోరుకో" అన్నాడు. "ఈమెను ఎక్కడినుంచి తీసుకువచ్చావో అక్కడ విడచి రా. ఇదే నా కోరిక" అంది లీలావతి.

అంతలో తెల్లవారింది దేవతా కన్యల కోసం వెదికినా వారి జాడ కనపడలేదు. తనని చూసి సకిలిస్తున్న గుర్రాన్ని దువ్వి – దానినెక్కి నడిపించసాగింది. ఒకచోట వర్తకుణ్ని పట్టుకుని దొంగలు – "మూటచూపు" అంటూ చెట్టుకి కట్టి కొడుతూంటే వారిని తరిమేసి అతన్ని రక్షించింది.

అతని వృత్తాంతం అడగగా – "నా కాపరం ధారాపురం. నేను రత్నపాలుడనే రత్నవర్తకుణ్ని. దారితెలియక యీ అడవిలో పడగా ఆ దొంగలు నన్నడ్డగించారు. వారికి తెలియకుండా రత్నాలను మూటకట్టి ఒక వృక్షం మొదట పాతిపెట్టాను. గుర్రం వదిలి పారిపోయాను. గుర్రం మీది మూటలో ఏమీ లేకపోడంతో నన్ను పట్టుకుందుకు వచ్చారు. ముందే రత్నాల మూట దాచాను కనక దక్కింది. ప్రాణాలయినా యివ్వడానికి సిద్ధపడ్డాను కాని మూటజాడ చెప్పలేదు" అన్నాడు.

లీలావతి నవ్వుతూ – "వర్తకుల లక్షణం యిలాగే ఉంటుంది ఆ మూటెక్కడుందో చూపించగలవా?" అని అడిగింది.

అతన్ని పురుషుడిగా భావిస్తున్న వర్తకుడు – "నువ్వు పక్కన ఉంటే దొంగల భయంఉండదు" అంటూ తీసుకెళ్ళాడు. ఆ మూటని గుర్రంమీద పెట్టుకుని అతను తనతోనడుస్తూంటే – "నువ్వు దారానగరం వదలి ఎన్నాళ్ళయింది? మీ రాజు కుశలమేనా?" అని అడిగిం దామె.

"నే నిల్లు వదలి ఇరవై రోజులయింది మా రాజు చాలా క్రూరుడు అన్నకుమారుణ్ని రాజ్యలోభంతో చంపించి పశ్చాత్తాపంతో

అగ్నిప్రవేశానికి సిద్ధపడ్డాడు. ఎవడో సిద్ధుడు వచ్చి భోజకుమారుణ్ని ఆరునెలల్లో బతికించి తీసుకొస్తానని చెప్పడంతో ఆ ఆశకొద్దీ చావకుండా ఉన్నాడు. నేను తరచుగా తిరుగుతూండడంతో పురవిశేషా లంతగా తెలియవు" అన్నాడతను.

ఆ మాటలు లీలావతి కి అమృతంలాగే అనిపించాయి వాళ్ళు మాట్లాడుకుంటూ సాయంత్రానికి ఒక పల్లె చేరుకున్నారు. గుర్రాన్నొక చోట కట్టి ఒకింట్లో పడుకుని పొద్దున్న లేచేసరికి గుర్రం కనపడలేదు. ఎవరో దొంగిలించి ఉంటారనుకుని, ఎలా వెళ్ళాలా అని ఆలోచిస్తూంటే ఇద్దరు కూలివాళ్ళు వచ్చి – "మేం పేదవాళ్ళం. మూటలు మోసుకుని మీ వెంబడి వస్తాం బత్తెం పెడితే చాలు" అన్నారు

వారి మాటలు నమ్మి. "మాకు మూటలులేవు దారి చూపితే చాలు" అని వారి వెంటనడిచారు. వాళ్ళని అరణ్యంలో ప్రవేశపెట్టారు. అప్పుడు కొందరు కోయవాళ్ళెదురై వారి నడ్డగించి – "మీ వద్ద సొమ్ములున్నాయి అక్కడ పెట్టి పొండి" అన్నారు.

లీలావతి వారందరినీ ఎదిరించి కొందరిని నరికెయ్యడంతో మిగిలినవారందరూ పారిపోయారు. ఆమె పౌరుషానికీ, సాహసానికీ వర్తకుడు ఆశ్చర్యపోయడు అప్పుడు వారెటుపోవాలా అని ఆలోచించ సాగారు.

మిగతా కథ పైమజిలీలో చెబుతాను" అని ఆపాడు మణిసిద్ధుడు.

# కాశీమజిలీ కథలు

## 89. వ మజిలీ

### భోజకుమారుని కథ

"రాజపుత్రా! వత్సరాజు మీ తండ్రికి అంతరంగిక సఖుడవడం వల్ల నేను చెప్పినట్లు చేయడానికి అంగీకరించాడు. ఈ దండనాథుడు మీ పట్ల చాలా కృతజ్ఞతతో స్నేహ ధర్మం ఆలోచించాడు. నువ్వు యీ యిద్దరి పరిజనులతోనూ నీ మేనమామ కుంతలేశ్వరుని వద్దకు వెళ్ళు. సమయం చూసి నేను నిన్ను రప్పిస్తాను అన్యాయార్జితమైన రాజ్యం మీ పినతండ్రి అనుభవించ లేడు ప్రజలలో అతని మీద శతృత్వభావం కలిగిస్తాను" అని బుద్ధిసాగరుడు భోజకుమారుణ్ని పంపించేశాడు.

ఎంతదూరం ప్రయాణించినా అలకాపురం కనపడలేదు. వారు అరణ్యంలో ప్రయాణిస్తున్నారు. చీకటి పడుతూండడంతో వారు ఒక చెట్టుకింద విశ్రాంతి తీసుకోసాగారు. ఆ రాత్రి ఒక వెలుగుని చూసి - అది కొరివిదెయ్యమని సేవకులు భయపడుతూంటే - భోజరాజు - "పిశాచమనేది లేదు. అది భ్రాంతి మాత్రమే" అంటూ అందుకొక కథ చెప్పాడు.

### సులోచన కథ

కాళిందీనది తీరంలో బుంజిక అనే పట్నంలో ప్రజ్ఞావంతుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు అతనికి చదువు సంధ్యలు లేవు. అతని భార్య సులోచన రూపవతి. భర్తమీద ఇష్టం లేకపోయినా ఆ విషయంలో బయట పడక విధిలేని కాపరం చేసేది

ఒకనాడు పొద్దుట నీటికి ఏటికోసం వెళ్ళినప్పు డక్కడ చాలా చక్కని వాడూ, భాగ్యవంతుడూ అయిన వర్తకుణ్ణి చూసి ఆమె మనసు వికారం చెందింది. అతగాడు ఆమె పట్ల ఆకర్షింపబడ్డాడు అతను సాహసించి ఆమె వివరా లడిగి తెలుసుకుని - "నేనే నీభర్తనైతే నీలాటి అంతగత్తెను ఇలా కష్టపెట్టక పువ్వుల్లో పెట్టి పూజించుకునేవాడిని. నువ్వు నాతో వొచ్చేయ్. రాజభోగా లందిస్తాను" అన్నాడు.

"ఇప్పటి మాటలు తరవాత నిలవవు నీ కిష్టమైనా నీ భార్య కిష్టం ఔతుందా? ఎందుకు నాకాశలు చూపుతావు? నీదారిన నువ్వుపో" అందామె.

"నా భార్య చనిపోయింది మళ్ళీ పెళ్ళాడాలని తగిన కన్యని వెదుకుతూ తిరుగుతున్నాను. ఈ గంగ సాక్షిగా నిన్ను భార్యగా స్వీకరించి నీ వల్ల కలిగిన సంతతికే నా ఐశ్వర్యమంతా ఇస్తాను" అని అతను అనేసరికి ఆమె అంగీకరించి అతని గుఱ్ఱమెక్కి అతని దేశం వెళ్ళిపోయింది.

వాళ్ళు వెళ్ళిపోయిన కొంతసేపటికి ఎవరో వచ్చి బిందె తప్ప మనిషెవరూ లేకపోడంతో "ఎవరో నీటిలో మునిగారు" అని కేకలు వేశారు. ప్రజ్ఞావంతుడు తన భార్య ఇంట్లో లేకపోడమూ ఆ బిందె తమదే అవడం చూసి 'నా భార్యే నీటిలో పడింది' అని గుండె బాదుకుంటూ వెదికించాడు. కాని ఏ జాడా దొరకలేదు.

ప్రజ్ఞావంతుడి బంధువులు అతనికి ఇన్నాళ్ళయ్యాక మళ్ళీ పెళ్ళి చేశారు. ఆమె కాపరానికి వచ్చి తొందరలోనే గర్భవతి అయింది. ఆమెకు ఒకనాడు అస్వస్థత రాగా - పొరుగింటి ఆమె వచ్చి "నీ సవతి బలవన్మరణం పొంది పిశాచ మవడంతో గర్భవతులు ఏటికి పోడానికి భయపడుతున్నారు. అది పిశాచమై గర్భాలు చెడగొడుతూంది. సోదెకు పోయి ఏం కావాలో అడిగి రక్షరేఖ కట్టు" అంది

ఆ మాట వినగానే రాధిక భయపడి - "నువ్వన్నది నిజమే. మొన్న ఎండవేళ ఏటికి పోగా ఏదో ఆవేశించి నట్లయింది. నా భర్తకు శకునానికి పొమ్మని నువ్వే చెప్పాలి. అతను నా మాట వినడు" అని బతిమాలుకుంది.

అంతలో ప్రజ్ఞావంతుడు వచ్చాడు. పొరుగింటామె అతనికి చెప్పిమందలించగా – అతను సోదె చెప్పేదాని వద్దకు రావదాని కామె సహాయమే కోరాడు ఆమె అతనితో వెళ్ళి సోదె చెప్పే దానితో విషయం చెప్పగా అది గ్రహించి – "నేను సులోచనకి సవతిని చూడలేక పట్టుకున్నాను. రాధిక గర్భం చెడగొడతాను. నాకు దిగదుడుపు పెట్టి . . . పుట్టబోయేవాడికి నాపేరుపెడితే వెళ్ళిపోతాను" అంది.

ప్రజ్ఞావంతుడు ఆమె కోరినకంటే ఎక్కువే యిస్తానని, అది చెప్పిన విధులన్నీ భార్యకు చెప్పి చేయించాడు.

దైవికంగా – రాధిక ప్రసవించిన శిశువు వెంటనే చచ్చి పోయింది. అందుకామె సవతి సులోచననీ, ఆమె బంధువులనీ ఎత్తిపొడుస్తూ మగడితో తగవాడింది. అప్పుడప్పుడు సులోచన రాధిక నావహించి చిక్కులు పెట్టేస్తూంది ప్రజ్ఞావంతుడు జపాలు మొదలైనవి చేయిస్తూ నానా యిబ్బందులూ పడేవాడు.

రాధిక మళ్ళీ గర్భవతి అయింది. ప్రజ్ఞావంతుడు మంత్రశాస్త్రజ్ఞులనీ, సన్యాసులనీ, బైరాగులనీ ఆశ్రయించి రక్షరేకులూ, విభూతులూ ఎన్నో పెట్టించాడు. అయినా ఆమెకు గర్భస్రావమయింది. ఎక్కడికి పోయి అడిగినా సులోచనే ఆవహించి రాధికని బతకనివ్వనని చెబుతూండేది. రాధికకి ఆరోగ్యం చెడి కృంగిపోయింది. వొళ్ళంతా రక్షరేకులే. చివరకెక్కడో సులోచన సోదెలో కనపడి – "సేతుస్నానం చేస్తే కాని వదలను" అంటే ప్రజ్ఞావంతుడు బార్యతో యాత్రలకి బయలుదేరి ఒకనాటి సాయంకాలానికి కుంభకోణం చేరాడు – ఆ రాత్రి సత్రంలో పడుకోగా దొంగలెవరో వారి మూట దొంగిలించుకు పోయారు.

ఆ వూరిలోని విత్తకర్మ అనేవర్తకుడు చాలా ధర్మాతుడనీ యాత్రికులకి సాయం చేస్తాడనీ విని – రామేశ్వరం రాకపోకలకు సాయం అడగాలని భార్యతో అతని వద్దకు వెళ్ళాడు.

ఆ యిల్లు దేవేంద్ర బవనంలాగే ఉంది. రాధికని పెరటితోవన యజమానురాలి వద్దకు పంపి సాయం కోరమన్నాడు. వొంటినిండా

రేకులతో ఉన్న ఆమెని చూసి వర్తకుడి భార్య ఆశ్చర్యపోతూ ఆమె వృత్తాంతం అడిగింది. రాధిక సులోచన పిశాచమై పెడుతున్న ఇదుములన్నీ చెప్పుకుని - యాత్రకు వెళ్తుండగా తమకు సంభవించిన కష్టం చెప్పుకుని సాయం కోరింది

అంతావిని, ఆవిడ పక్కున నవ్వి భర్తవద్దకు వెళ్ళి రాధిక చెప్పిన కధంతా చెప్పింది అతను రాధిక భర్తను తీసుకు రమ్మన్నాడు. ఇద్దరినీ పీఠాలమీద కూర్చోబెట్టి వారి వృత్తాంతం అడిగాడు.

ప్రజ్ఞావంతుడు వివరంగాచెప్పాడు. అప్పుడు వర్తకుడి భార్య నగలన్నీ తీసేసి అతని ముందు నిలుచుని - "నేనెవరో ఎరుగుదురా?" అని అడిగింది ప్రజ్ఞావంతుడు తెల్లబోతూంటే - "ఫరవాలేదు. తెలిస్తే చెప్పు" అని అభయ మిచ్చాడు విత్తకర్మ.

"నాభార్య సులోచన లాగే ఉంది" అన్నా దతను.

"సులోచనలా ఉందా? సులోచనేనా?" అని రెట్టించగా - "సులోచనే" అన్నాడు ప్రజ్ఞావంతుడు

"నీ భార్య పిశాచ మయింది కదా? ఇక్కడి కెలా వచ్చింది?" అని విత్తకర్మ అడిగేసరికి అతనేమీ అనలేకపోయాడు.

అప్పుడు సులోచన - "నేను నీభార్య సులోచననే" అంటూ తన వృత్తాంతం చెప్పి - "నా కళంకం బాధిస్తూనే ఉంది. మీరు కనిపించినందుకు సంతోషంగా ఉంది. నరకానికి పోకుండా ఉండేటట్లు నన్ను దీవించండి. మీకు కావలసినంత ద్రవ్యమిస్తాను. ఈమెకి శరీరానికి పుట్టిన రోగాన్ని పిశాచమనీ, ప్రయోగమనీ వెర్రిచికిత్సలు చేయిస్తున్నారు. నేను బతికే ఉన్నానుకదా, ఈమె నెలా పట్టుకుంటాను? ఇప్పటికైనా మీ భ్రాంతి వదిలిందా? భూమిమీద చాలామందికి ఈ వెర్రుంది. మీరిక్కడే ఉండండి. రాదికకి మందులిప్పించి రోగం నయం చేయిస్తాను" అంది.

రాధిక ఆశ్చర్యపోయి - "అక్కా! నిన్ను నిందించినందుకు నన్ను క్షమించు. ఎక్కడికి పోయినా సవతి బాధిస్తూందనే అనేవారు. అయితే నిజంగా పిశాచమనేది లేదు కాబోలు. భ్రాంతే అన్నమాట" అంది.

విత్తవర్మ ప్రజ్ఞావంతుడికి క్షమాపణలు చెప్పుకుని నివసించడాని కొక దివ్యభవనం యిచ్చాడు భ్రాంతి వదలడంతోటే, రాధికకి కొన్ని రోజుల్లోనే రోగం తగ్గింది కనుక పిశాచమనేది లేదు.

ఆ వెలుగు పిశాచమో కొరివి దయ్యమోకాదు. మీకు భయమైతే పడుకొండి నేను కాపలాగా ఉంటాను' అన్నాడు భోజకుమారుడు. కత్తిపట్టుకుని మేలుకుని ఉన్నాడు కొంతసేపటికి తెల్లవారింది. భోజుడు దాని దగ్గరగా వెళ్ళి చూశాడు

ఒక తపస్వి చెట్టుకొమ్మకి తలకిందులుగా వేలాడుతూ తపస్సు చేసుకుంటున్నాడు భోజు దతనికి నమస్కరించి – ఓహో! తపస్సు ప్రభావం వల్ల ఇతని శరీరం లోంచి కాంతి వెలువడుతూంటే దానిని చూసి నా సేవకులు కొరివి దయ్యమనుకున్నారు! ఈ ముని నాతో మాట్లాడితే నాలాటి ధన్యుడు మరెవరూ ఉండరు అనుకుంటూంటే, అతను కళ్ళు తెరచి – "నువ్వెవరివి? ఈ భయంకర అరణ్యంలోకి ఎందుకు వచ్చావు? నీ వృత్తాంతం ఏమిటి?" అని అడిగాడు

భోజుడు తన వృత్తాంతం చెప్పి – 'మహాత్మా! ఒక్కొక్కప్పుడు కీడు కూడా మేలుకే దారితీస్తుంది మా పినతండ్రి అలా చేయబట్టే నాకు తమ దర్శనమై నా పాపాలు పటాపంచ లయ్యాయి నేనిక ఎక్కడికీ పోక మీ పాదాల నాశ్రయించుకుని ఉంటాను. ముక్తి మార్గం ఉపదేశించండి" అని ప్రార్థించాడు "దయచేసి మీ నామాక్షరాలను సెలవిచ్చి అనుగ్రహించండి."

"రాజపుత్రా నీ ఆకార చిహ్నాలే నీ సుగుణాలని వెల్లడిస్తున్నాయి దైవజ్ఞుడు చెప్పినట్లు మహా వైభవంగా భూమిని పాలిస్తావు. తపస్సుకు నీ కిది సమయం కాదు

నా పేరు – 'సర్పటి'. మోక్షం కోరి తపస్సు చేస్తున్నాను. నాకు నీమీద అనుగ్రహం కలిగింది నీకు 'ధూమవేది' అనే విద్యను ఉపదేశిస్తాను ఒక ఓషధిని దీపం మీద వేస్తే దానివెలుగు తగిలిన నీచ లోహాలన్నీ బంగారమౌతాయి ఈ సిద్ధి వలన లోక విఖ్యాతి చెందుతావు" అని ఆ విద్యనిచ్చి మళ్ళీ తపస్సులో మునిగి పోయాడు.

ఈ సిద్ధి వల్ల లోకంలో దరిద్రులు లేకుండా చేస్తాను - అనుకుంటూ భోజుడు చెట్టుదగ్గరకి వెళ్ళి - "ఆ కాంతి ఓషధి విశేషం" అని చెప్పి మళ్ళీ ప్రయాణం సాగించాడు. కొంతదూరం పోయి తోవ వెదుక్కుంటూంటే - "మమ్మ ల్నీ అడవివాళ్ళు చంపుతున్నారు. ఎవరేనా పుణ్యాత్ములు వచ్చి రక్షించరూ? అంటూ ఆర్తనాదం వినపడింది. భోజుడు వెంటనే అటు వైపు వెళ్ళాడు.

అక్కడొక కొండదేవత గుడిముందు ఒక స్త్రీనీ, పురుషుణ్నీ తీగెలతో బంధించి బలియివ్వడానికి కొందరు ప్రయత్నిస్తున్నారు. ఆ సమయంలో వచ్చిన ముగ్గురు వీరులనీ చూసి ఆటవికులు తలోదిక్కుకీ పారిపోయారు.

భోజకుమారుడు తనయిద్దరు సేవకుల చేతా వారికట్లు విప్పించి - "మీరెవరు? ఈ మహారణ్యాని కెందుకు వచ్చారు? మీ వృత్తాంత మేమిటి?" అని అడిగాడు.

"మహాత్మా! మీరు మా ప్రాణదాతలు. నాకాపరం ధారానగరం. నేనొక వర్తకుణ్ని ఈమె ఎవరో నాకు తెలియదు. రాజకుమార్తె అనుకుంటున్నాను. పురుష వేషంలో గుర్రంమీద ఎక్కడికో వెళ్తూ నన్ను దొంగలబారినుంచి రక్షించి ఎందరినో తన కరారితో చంపి ...మేము కలసి వస్తూండగా మాటి మాటికీ మానగర ప్రభువయిన భోజకుమారుడి గురించి అడుగుతూ..ఆయన చంపబడ్డాడని విని ఎంతో చింతించింది. బహుశా అతని కీమె బంధువేమో. ఒక పల్లెలో దొంగలామె గుర్రాన్ని దొంగిలించుకుపోయారు. పాద చారులమైన మమ్మల్ని కొందరు కొండవాళ్ళు అడ్డుకోగా ఈమె వారిని చంపింది. కొందరు మాకు తెలియకుండా మమ్మల్ని వెంబడించి నూరుగు రేకమై ఈమె చేతిలోని కత్తి లాక్కుని మమ్మల్ని ఈ కొండదేవతకి బలివ్వడానికి తీసుకొచ్చారు. అప్పుడే స్త్రీ అని తెలిసింది" అని ఆ వర్తకుడు చెప్పాడు.

వివశువై పడున్న ఆమె - "హా! భోజనరేంద్రా! నేనుకూడా వచ్చి ఇంద్రలోకంలో నిన్ను కలుసుకుంటాను. కొంచెం తాళు" అని పలవరించింది.

ఆమె కట్టుకున్న చీరను చూస్తున్న భోజుడు 'ఈమె నన్నెందుకిలా స్మరిస్తూందో? ఈమెతో పరిచయమున్న జ్ఞాపకం లేదే!" అంటూ ఆమెకు స్పృహ తెప్పించమని వర్తకుడికి చెప్పాడు.

అప్పుడు రత్నపాలుడు "అమ్మా, లే,లే, మన కష్టాన్ని ఈ పుణ్యాత్ముడు తొలగించాడు. శత్రువులు పారిపోయారు" అంటూ బిగ్గరగా చెప్పడంతో ఆమె లేచి కూర్చుని అతనెవరో? అని ఆలోచించసాగింది. భోజుడు – "సాధ్వీ! నీపేరేమిటి? నీ తల్లి తండ్రు లెవరు? ఎక్కడికి వెళ్తున్నావు? భోజు డంటూ పలవరించావు, అతను నీకేమౌతాడు?" అంటూ అడిగాడు.

ఆమె ఏమీ దాచకుండా తన వృత్తాంతం చెప్పింది.

భోజుడు ఆశ్చర్యపోయి – 'నాచిత్ర పటాన్ని బుద్ధిసాగరుడే పంపి ఉంటాడు. ఈ చిన్నది ఎంత సాహసం చేసింది! ఈమెను పట్టమహిషిగా చేసుకోకపోతే నేను నరకానికే పోవాలి. ఇలాటి పతివ్రత భార్యఅయితే వంశమే పవిత్రమవుతుంది" అని మనసులో భావిస్తూ –

"మా కాపరం ధారాపురమే. భోజకుమారుడి వార్త నేనూ విన్నాను. అతనిని వదిలి – మాటలచే నిశ్చయించిబడిన మరొకరిని పెళ్ళాడడం నీకు దోషం కాజాలదు. తండ్రి మాట అతిక్రమించి రావడమే దోషం" అన్నాడు.

అందుకామె – "ఆర్యా! మనసుచే నిశ్చయించబడిన వానిని కాక మరొకరిని వివాహమాడడం తప్పని శాస్త్రాలు చెబుతున్నాయి. మీది ధారానగరమన్నారు. భోజకుమారుడు నిజంగా చంపబడ్డాడా? అలాటి అక్రమం జరుగుతూంటే సామంతులెందుకు ఊరుకున్నారు? మంజుడు పశ్చాత్తాపం చెందాడని విన్నామే. అది మీకు తెలియదా?" అని అడిగింది.

అతను చిరునవ్వుతో – "తెలియదు. చేయడం అయిపోయాక పశ్చాత్తాపపడి ఏం లాభం?" అన్నాడు.

వర్తకుడు అతని వివరా లడగ బోతే అతను ప్రసంగం మార్చేశాడు.

లీలావతి – "వారి గొప్పతనం దాచినాదాగదు. ఎవరైతే మనకేం. మనప్రాణాలు కాపాడారు కనక ప్రాణబంధువులు. ఆయనకు

సేవకులుగా వారెక్కడికి పోతే మనం అక్కడికే పోదాం. వారు మననొకదారికి చేర్చకపోరు." అంది. అతనే భోజ కుమారుడని ఆమె మనసులో నిశ్చయించుకుంది.

చీకటి పడకముందే వాళ్ళందరూ వెనకటి పల్లెకు వెళ్ళగా తమను పట్టుకుందుకు వచ్చారని వాళ్ళందరూ పారిపోయారు. లీలావతి గుర్రం అక్కడే ఉంది.

వాళ్ళందరూ అక్కడే నిద్రించారు. మర్నాడు ఉదయం - భోజుడు లీలావతితో, "నువ్వీ గుర్రమెక్కి పుట్టింటికి వెళ్ళు. తోడు పంపుతాను" అన్నాడు

"పుట్టింటికి వెళ్ళేదానినైతే ఇల్లువదలి ఎందుకొస్తాను?"

అతను నవ్వుతూ "భోజకుమారుడి గురించి బయలుదేరిన దానివి ఇప్పుడు నాతో ఎలావస్తావు?" అన్నాడు.

"మీదీ ఆవూరే కదా. మీకూ వారికీ సంబంధం ఉండకపోదు. మీరే వారని బావిస్తున్నాను" అనేసింది

అప్పుడు భోజుడు - "నిన్నింకా వేధించడం న్యాయంకాదు నేను భోజుడునని నువ్వు గ్రహించావు నా నిమిత్తం ఎన్నో కష్టాలు పడ్డావు. ఇప్పుడు ఇంటికి వెళ్ళు నిన్ను పట్టమహిషిగా స్వీకరిస్తాను. నేను మా మేనమామ గారింటికి వెళ్తున్నాను" అన్నాడు.

ఆమె లజ్జతో తలవంచుకుని - 'ఆర్యా! సకల విద్యాపారంగతుడు, సుందరాకారుడు, దానభోజుడు అయిన భర్త లభిస్తాడని మా తల్లితో ఒక సన్యాసి నా చిన్నతనంలో చెయ్యి చూసి చెప్పాడు. ఆ లక్షణాలన్నీ మీలో ఉండబట్టి మీరే నా భర్త ఔతారని ఇట్లు వదలి వచ్చేశాను. నా నోములు ఫలించాయి. ఇక మిమ్ము వదిలి నిముషమయినా ఉండలేను. నన్ను కూడా మీతో తీసుకుపొండి" అని ప్రార్థించిం దావె అతనంగీకరించి పరిజనులను కూడా వెంటబెట్టుకుని అలకాపురం వేపు బయలుదేరాడు

మణిసిద్ధుడు మరో మజిలీ ప్రారంభించడానికి కథ అక్కడ కాపాడు.

# కాశీమజిలీ కథలు

## 90. వ మజిలీ

### చంద్రముఖి కథ

"అమ్మా. అది కలకాదు. నా కళ్ళారా ఆ సన్యాసిని చూశాను భిక్షకు వచ్చినప్పుడు నన్ను పెళ్ళాడమంటే ఆ నీచుణ్ని భటుల చేత వెళ్ళ గొట్టించామన్నాడు. వాడు నన్ను నిర్బంధిస్తూంటే ఎవరో పుణ్యాత్ముడు వాడి కంఠం నరికేశాడు. అప్పుడేవేలుపో వచ్చి వరం కోరుకో అనగా - నన్ను యింటివద్ద విడువమన్నాడు. ఇదంతా రెండు గడియలలో జరిగి పోయింది. నన్ను రక్షించిన వాని చిత్తరువు రాయగలను" అంటూ ఆమె ఎంత చెప్పినా అదంతా కలగా కొట్టిపారేసింది చంద్రముఖి తల్లి.

"నే నతన్నే తప్ప మరెవరీని పెళ్ళాడను. ఆ గుడిలో చూసినవాడిని వెదికి తెప్పించు" అంది చంద్రముఖి.

"రెండు గడియలలో ఎక్కడికో పోయి వచ్చాననంటే ఎవరు నమ్ముతారు? పేరు పొందిన రాజపుత్రులలో ఎవరు ఎక్కువ బంగారం తెస్తారో వానికి నిన్నిస్తానని స్వయంవరం చాటించాడు మీ తండ్రి."

"స్వయంవరాని కిది ఆచారం కాదు. నేనొక ప్రశ్న అడుగుతాను. దానికి జవాబు చెప్పిన వారినే పెళ్ళాడతాను ఇదే నా శపథం" అని ఆమె తండ్రికి ఉత్తరం రాసింది.

"పది శకటాల బంగారం తెమ్మంటే తక్కువ మందే రాగలుగుతారు. వాళ్ళనే నీ ప్రశ్న అడుగు. నీ ఇష్టం వచ్చిన వారిని ఎన్నుకో" అని జవాబు రాశాడు తండ్రి

ఆమె తన ప్రశ్నని శ్లోకరూపంలో రాసి ఉంచుకుంది

రాజకుమారులు తగినంత బంగారం తేగా ఆ లెక్కలు రాసుకుని ప్రధానులు వారిని చిత్రాంగదుడి వద్దకు పంపసాగారు.

భోజుడు, లీలావతి అలకాపురం వెళ్తూ తోవలో అక్కడ ఆగారు. ఆ వింత స్వయంవరం చూసి పోదామా? – అని అత నడిగితే అతనిష్టమే అంది.

"బంగారం మా యింటి నుంచి తేవచ్చు. ప్రశ్నకు మీరెలాగూ జవాబు చెప్పగలరు. బంగారం తేడానికి వ్యవధి అడగండి. ఐనా ఇదేం స్వయం వరం? నేను కూడా సభకి రావచ్చునా?" అంది.

"నీ మనసు తెలుసుకోవాలని అడిగాను. కావలసినంత బంగారం తెప్పిస్తాను చూడు" అంటూ భోజుడు ఇనపకొట్ల వద్దకు వెళ్ళి నిలవున్న లోహాన్నంతటినీ రాశిగా వేయించి ఓషధీ ప్రభావంతో బంగారంగా మార్చి కోశాగారానికి తరలించాడు.

గొడ్డళ్ళు గునపాలు మొదలయినవి కూడా బంగారంవి కావడం చూసి మంత్రులు ఈ రాజకుమారుడెవరో ఇంద్రజాలికుడిలా ఉన్నాడనుకున్నారు. వాటికి లెక్కలు రాయలేక చిత్రాంగదుడికి తెలిపారు. చిత్రాంగదు డతన్ని చూడాలని భోజుడి నివాసానికి రాగా అతన్ని సాదరంగా ఆహ్వానించాడు. భోజుడి రూపరేఖావిలాసాలు చూసి – 'ఇతను దేవలోకం వాడు కాని భూలోకవాసి కాదు. ఇతనికి స్వయంవర మెందుకు? కోరాలేకాని తక్షణం చంద్రముఖి నిచ్చి వివాహం చెయ్యనా?' అనుకున్నాడు.

"ఇంత బంగారం తేవడం మానవ మాత్రుడికి సాధ్యమేనా?" అంటే – భోజుడు నవ్వి – "బంగారం ఖనిజం. భూమిలోనే పుడుతుంది. మా దేశంలో గనులెక్కువ" అన్నాడు. భోజుడి బంగారానికి బళ్ళుదొరక్క రాసులుగా వీధులలో పడుంది

భోజుడితో పాటు, స్త్రీ పురుష వివక్ష తెలియని వేషంలో లీలావతి కూడా సభకు వెళ్ళింది. రాజపుత్రిక

– "భైరవాలయంలో జరిగింది నీకు తెలిస్తే చెప్పు" అని రాసి ఉన్న పత్రికని చూపింది.

ఎవరూ చెప్పలేక పోడంతో, భోజకుమారుడి వద్దకు వచ్చి అతన్ని చూసి అలాటి శపథం చేసినందుకు పశ్చాత్తాప పడింది.

భోజుడది చదివి – లీలావతి ద్వారా ఆ కథ విన్నవాడే కనుక

జవాబు రాశాడు.

అది అందించేలోగానే – ఆమె లీలావతి మెడలో దండవేయబోతూంటే – భోజుడు ఆమెను వారించి, "నా సమాధానం చూడకుండానే వేరొకరి మెడలో దండవేస్తున్నావే! ఇదెక్కడి ధర్మం?" అని అడిగాడు.

చంద్రముఖి ఆ జవాబు నందుకుని చదివి అమితంగా ఆశ్చర్యపోయింది. ఇప్పు డెవరిని వరించాలో ఆమె కర్థం కాలేదు. భోజుడికి నమస్కరిస్తూ "మహాత్మా! నువ్వు దివ్యరూప సంపన్నుడివి. నిన్ను వరించడంకంటే అదృష్టంలేదు. కాని ఇతను ఒకరాత్రి భైరవాలయంలో కాపాలికుడిని చంపి నన్ను కాపాడాడు. అప్పటి నుంచీ అతన్నే భర్తగా తలుస్తూ...అందుకే ఈ ప్రశ్నవేశాను. ఇది మీరెలా గ్రహించారో నా ఊహ కందనిది. మీ అనుమతి తోనే ఆయనని వరిస్తాను" అని ప్రార్థించింది.

సభలోని రాజపుత్రులు.."అలా చెయ్యకూడదు. ధర్మవిరుద్ధం" అని గోల చేశారు.

భోజుడు వారిని వారించి – "ఈ రాజకుమార్తె దృఢవ్రత సత్యసంపన్నురాలు. ఇప్పుడు ధర్మ విరుద్ధ మేమీలేదు ఆమె పురుషుడని భ్రాంతి పడుతున్న స్త్రీ నాకు కళత్రం కనుక భార్యద్వారా సంపాదించినది భర్తకి చెందుతుంది కనుక ఈమె నాకు కళత్రమయింది." అన్నాడు యుక్తిగా.

అది విని చంద్రముఖి అతని మెడలో దండవేసింది. చిత్రాంగదుడు పట్టలేని ఆనందంతో వారిని పల్లకీ మీద ఊరేగించి కోటలోకి తీసుకు పోయాడు

రాజపుత్రు లందరూ ఏకమై చిత్రాంగదుణ్ని యుద్ధానికి రమ్మన్నారు. అంగరాజు బలాలు తక్కువ అవడం వల్ల ఓడిపోతూంటే - భోజుడు గుర్రంమీద రణరంగంలో ప్రవేశించి రెండు గడియలలో ఆ రాజపుత్రులందరినీ తరిమి కొట్టాడు. చిత్రాంగదు డతన్ని కౌగలించుకుని సంతోషం ప్రకటించి అప్పుడే వివాహ ఏర్పాట్లు చేయించాడు.

భోజుడు చంద్రముఖిని పెళ్ళాడి ఇద్దరు భార్యలతోనూ కొన్నాళ్ళు అక్కడుండి తరవాత లీలావతితో అలకాపురం వెళ్ళాడు.

అంతకుమునుపే భోజుని తల్లి బుద్ధిసాగరుడి చేత పుట్టింటికి పంపబడి భోజుడి కోసం ఎదురు చూస్తూంది. అతను తల్లిని ఊరడించి జరిగిన కథంతా చెప్పి.. "లీలావతి..నీ పెద్దకోడలు.." అని పరిచయం చేశాడు. సావిత్రి ఆమెను దీవించి - "నీ మేనమామ కూతురు పద్మావతి యౌవనవతి అయింది. మా సోదరుడు నీకోసం నాలుగు మూలలకీ దూతలని పంపాడు. ఎప్పుడు ఒస్తావని అడుగుతున్నాడు. నువ్వు అప్పుడే ఇద్దరిని పెళ్ళాడి వచ్చావు. పద్మావతిని కూడా పెళ్ళాడక తప్పదు" అంది.

భోజుడు ఆమెను కూడా పెళ్ళిచేసుకున్నాడు. అంతలో బుద్ధిసాగరుడు పంపిన దూతలు వచ్చారు. "భోజకుమారా! నువ్వు రాసిన శ్లోకం చదివి నీ పినతండ్రి పశ్చాత్తాపంతో మరణించ బోతూంటే మే మొక బైరాగిని రప్పించి చచ్చిన వానిని బతికిస్తానని వాడి చేత చెప్పించాం. అతను విధించిన గడువు అయిపోతూంది. కనుక రథం ఎక్కి వచ్చెయ్యి" అన్నారు.

బుద్ధిసాగరుడి స్వామి భక్తికి మెచ్చుకుంటూ ముగ్గురు భార్యలతోనూ, తల్లితోనూ, చతురంగ బలాలతోనూ భోజుడు మళ్ళీ ధారానగరం ప్రవేశించాడు.

# కాశీమజిలీ కథలు

## 91. వ మజిలీ

### కమల కథ

"అమ్మా! నే నీమధ్య సఖులతో భూలోకానికి వెళ్ళి జలకా లాడుతూంటే గట్టున పెట్టిన బట్టలెవరో ఎత్తుకుపోయారు. ఎంత వెదికినా చోరుడు కనపడలేదు. చీర తీసుకుపోయిన వానికి భార్యవై భూలోకంలో ఉండవలసిందే అంటూ సఖులు పరిహాసం చేస్తున్నారు. ఒక సఖి చివరకు సగం చీర చింపి ఇవ్వగా చుట్టబెట్టుకు వచ్చాను. వారి మాటలు నిజం కావు కద?" అంటూ కమల అనే గంధర్వ కన్యక తన తల్లి ప్రజ్ఞావతితో చెప్పుకుని విచారించింది.

ఆ మాటవిని ఆమె తల్లి "అయ్యో! ఆ మాట సత్యమే! నీ వివాహం మీద నేను పెట్టుకున్న ఆశ నెరవేర దేమో? నేను మహాలక్ష్మి సేవనిమిత్తం వైకుంఠానికి వెళ్ళాలి. నువ్వు కూడా నాతో రా. ఆ మహాదేవి నడిగి మన సందేహం తీర్చుకుందాం. ఆమె పేరే నీకు పెట్టాను'' అంది.

ప్రజ్ఞావతి చామర సేవతో ఆ దేవిని ప్రసన్నురాలిని చేసుకుని తన పుత్రిక నామె పాదాల మీద పడవేసి, జరిగింది చెప్పుకుని - "దాసురాలిపై కృపతో నిజం తెలియజెప్పు" అని ప్రార్థించింది.

ఆమె - "కమలా. నీకు తగినవరుడు గంధర్వులలో లేకపోతే బ్రహ్మతో చెప్పి చక్కనివాడిని సృష్టించమంటాలే" అని పరిహాసమాడి - "ప్రజ్ఞావతీ! నీ కూతురికి మంచి పనే జరిగింది. చీర దాచిన వాడే భర్త అనే వాడుక సత్యమే. ఇందుకు నువ్వు చింతించక్కరలేదు. నేను చెప్పదలచుకున్న వాడి దగ్గరకే నీ పుత్రిక చేరుంది. అతను దైవాంశ సంభూతుడు. సరస్వతీదేవి శాపంవల్ల బృహస్పతి ఇప్పటికే భూమిమీద

జన్మించి ఉన్నాడు. నీ కూతురి నతనికే యిచ్చి పెళ్ళి చెయ్యి, వెళ్ళు" అంది.

"బృహస్పతికి శాప మెందుకు కలిగింది?" అని ప్రజ్ఞావతి అడగ్గా మహాదేవి ఆ వృత్తాంతం ఇలాచెప్పింది.

ఒకనాడు మహేంద్రుడు బృహస్పతితో పాటు ముప్పయిమూడు కోట్ల వేల్పులు, దిక్పాలురుతో బ్రహ్మ వద్దకు వెళ్ళగా - అతను వారి క్షేమ సమాచారాలు తెలిసికొని కూర్చుండ బెట్టాడు. బృహస్పతి బ్రహ్మకు దగ్గరలోని పీఠం అలంకరించాడు. అప్పుడు శారదుడనే వీణా వాహకుడిచేత తన వీణ పట్టించుకుని సరస్వతి సభకు రాగా అందరూ లేచి ఆమెకు వందనాలు చేశారు.

బృహస్పతి మాత్రం కూర్చునే అభినందించగా ఆమె కోపంగా - "ఓరీ! మాకు దాసానుదాసుడైన ఇంద్రుని యింట్లో వంటవాడిగా ఉండే నువ్వు నన్ను యిలా అవమానపరుస్తావా! లేచి నిలుచున్న వారందరూ నీ పాటి బుద్ధిలేనివారు కాబోలు. నువ్వు దేవలోకంలో ఉండడానికి అర్హుడివి కావు. భూమిపై జన్మించి తాపత్రయం పడితే నీకు బుద్ధొస్తుంది" అని శపించింది.

అందుకు బృహస్పతి కోపగించి - " బ్రహ్మ భార్యవి అయినంత మాత్రాన యింత కన్ను మిన్ను కానకుండా ఉంటావా? చిన్న పెద్ద తారతమ్యం అక్కరలేదా? పూజ్యులయిన బ్రాహ్మణుల్ని, నీకు లేచి నమస్కారం చెయ్యాలా? లక్ష్మికి, పార్వతికి చెల్లుతుంది. కాని నీకు చెల్లదు. నీకు నేను ప్రతిశాపమిస్తున్నాను. చూసుకో. నువ్వు మనుష్య యోని యందు జన్మించు-" అని శాపోదకం చేతిలోనికి తీసుకుంటూంటే, బ్రహ్మ అతని చెయ్యి పట్టుకుని ఆపి - "నీ కిది తగునా? ఆడవాళ్ళ తప్పులు పదివరకూ మన్నించాలని తెలియదా? సరస్వతి ముందువెనక లాలోచించకుండా శపించింది. కాని, నువ్వు భూమ్మీద మహేంద్రుడికంటే ఎక్కువ వైభవం అనుభవిస్తావు. నీ కీర్తి ఆ చంద్ర తారార్కమై వెలుగుతుంది. నీ శాపం ఉపసంహరించు" అన్నాడు.

"దేవా! నేను నీ ఆనతి నతిక్రమించే వాడిని కాను. కాని నా శాపం తిరుగులేనిది. దీనిని ధరించే వారి నెవరి నయినా చూపు" అన్నాడు బృహస్పతి.

అప్పుడు వీణావాహకుడు శారదుడు ముందుకు రాగా తన శాపాన్నతని మీదకు మళ్ళించాడు. బ్రహ్మ శారదుడిని చూసి, "నువ్వు ఇందుకు చింతింపకు. భూమిమీద జన్మించి మహాకవివై లోక ప్రఖ్యాతిని పొందుతావు. మీరిద్దరూ ఒకచోట నివసించి ఏకకాలమందే శాపవిముక్తు లౌతారు." అన్నాడు.

అందుచేత బృహస్పతే భూమిమీద భోజుడనే పేరుతో విరాజిల్లుతున్నాడు. అతనే నీ పుత్రికకు తగిన మగడు. వీణావాహకుడైన శారదుడు కాళిదాసనే పేరుకల మహాకవీ, ఆ రాజు ఆస్థాన విద్వాంసుడూ" అని వారిద్దరినీ పంపివేసింది.

ప్రజ్ఞావతి దేవి అనుమతితో భూలోకానికి వచ్చి భోజకుమారుడితో సంబంధ మెలా కలుపుకోవాలా అని ఆలోచిస్తూ ధారా నగర ప్రాంతంలోని ఒక ఉద్యానవనానికి వెళ్ళింది. దానిని అలంకరించడం చూసి కారణ మడగగా – "ఈ తోట భోజమహారాజు గారిది. వారిప్పుడు భార్యలతో విహరించడానికి వస్తున్నారు" అని చెప్పారు. ఆ తోట మాలుల ద్వారా భోజరాజు గురించి సమాచారం సేకరించింది.

"ఆయనకు ఇప్పటికే ముగ్గురు భార్య లున్నారు. ఇక నే నెందుకు? నాకేమీ ఇష్టంలేదు. ఇలాగే ఉండిపోతాను" అంది కమల.

"ఎలాగూ ఇంతదూరం రానేవచ్చాం కదా, వారినీ వారి భార్యలనీ చూసే పోదాం" అని ప్రజ్ఞావతి కూతురిని ఒప్పించింది. తిరస్కరణీ విద్యచేత వారు ఇతరులకు కనపడకుండా తోటలో విహరిస్తూంటే గుర్రంమీద భోజుడూ, రథంలో భార్యలూ వచ్చారు. వారిని చూసిన కమల, తల్లితో – "మనుష్యకాంతలు కూడా ఎంతో చక్కగానే ఉంటారు సుమా! వీరిని చూడు. ఏం లావణ్యం! ఏమి సోయగం!.. అదుగో చీర. చూశావా? ఆ రాజకుమారుడు అక్కడికొచ్చి ఎత్తుకుని పోయి భార్యకిచ్చాడు కాబోలు ఈ కారణంగా ఇతనికి భార్య నౌతానా?

బహు భార్యలను కలిగిన వాడిని పెళ్ళాడితే సుఖ ముండదు. దైవ సంకల్పం ఎలా ఉందో..." అని నిట్టూర్చింది.

అంతలో భోజుడు అక్కడికి వచ్చాడు. అతని సౌందర్య విలాసాలకు ముగ్ధురాలై మెచ్చుకుంటూ అతని మీదనుంచి దృష్టి మరల్చలేక వివశురాలై ఉండిపోయింది,కమల.

"చూశాం కదా..ఇక పోదాం" అంది ప్రజ్ఞావతి.

మోహంలో మునిగిన కమల – "అమ్మా! దేవి అన్నీ తెలిసే మనని ఇక్కడికి పొమ్మంది. ఇంత సుందరుడు లోకంలో ఎక్కడా ఉండడు. నా మనసు వీనియందు లగ్నమై పోయింది. నేనిక్కడి నుంచి కదలిరాలేను. నన్ను వీనికే ఇచ్చి పెళ్ళి చేయి. అతను దక్షిణ నాయకుడే కానీ. అతనితో సుఖించే ఒక్క నిముషం చాలు జీవితానికి" అంది.

ప్రజ్ఞావతి ఉపాయం ఆలోచించింది. తోటకు దగ్గరలో ఉన్న బాట మీద నిలబడి – "దుర్మార్గులు, మమ్మల్ని బాధిస్తున్నారు. పుణ్యాత్ములెవరేనా ఇక్కడేవుంటే రక్షించండి –" అంటూ బిగ్గరగా అరిచింది.

అది విని భోజుడు – "వస్తున్నాను. భయపడకండి "అంటూ కత్తి పట్టుకుని అక్కడికి పరుగెత్తాడు. కమల అతన్ని క్రీగంటి చూపులతో చూస్తూ ఉండి పోయింది ప్రజ్ఞావతి ఎదురువెళ్ళి నమస్కరించి – "అయ్యా! పరోపకార పారీణులయిన మీరు మా ఆపద దాటించారు. మీరు రావడం చూసి దొంగలు పారిపోయారు. మీకు చాల కృతజ్ఞులం" అంది.

"మీ రెవరు? ఎక్కడికి పోతున్నారు? ఈ చిన్నది నీకే మౌతుంది?" అని భోజుడామెను ప్రశ్నించాడు.

"దేవా! ఇది నా కూతురు కమల. దానికి వరుణ్ని వెదుకుతూ దేశాలు తిరుగుతున్నాను. ఇక్కడ దొంగలు మమ్మల్ని అడ్డగించారు. మీరు వచ్చి రక్షించారు. ఇక్కడికి గ్రామ మెంత దూరంలో ఉంది? బంధుత్వం ఏర్పడినట్లే కనుక మీ కులశీలనామాలు తెలుసుకోవాలను కుంటున్నాను" అందామె వినయంగా.

అంతలో కమల తన తళుకు చూపుల నాతని మీదకు ప్రసరింప జేయగా అతని చూపులతో పెనవేసుకున్నాయి. అతని హృదయంలో మదన వికారం జనించింది.

"ఈమె నీ కూతురా! వరుని కొరకు తిరుగుతున్నావా! ఎవరేనా రత్నాన్ని వెదుకుతారు కాని రత్నం వెదుక్కుంటుందా? ఈమెను ఏ రాజు అంగీకరించడు? ఈ రాజ్యానికి నేనే అధిపతిని. మాది ధారానగరం. నా పేరు భోజుడు. మీరు మా దేశానికతిధులు కనుక మిమ్మల్ని సత్కరించాలి. మాయింటికి రండి" అని అతను వారి నాహ్వానించాడు.

"ఓహో! భోజకుమారులు మీరేనా? మా జన్మధన్యమయింది. మీ పేరు జగద్విఖ్యాతం. మీ దగ్గర దాచడ మెందుకు? ఈ కన్యను భరించడానికి మీరే సమర్ధులు. దీనిని భార్యగా స్వీకరిస్తామంటే మీ ఆతిథ్యం అందుకుంటాం. లేదంటే మా దారిన మేము పోతాం" అంది ప్రజ్ఞావతి.

"దీని కింత మనవి ఎందుకు? రత్నాలను రాజే భరిస్తాడు. నీ మాట ప్రకారమే ఈమెను పెళ్ళాడతాను. ఇంటికి రండి" అన్నాడు భోజుడు.

"ఇంటికి వెళ్ళాక అంతమందిలో మన మొహం చూసేది ఎప్పటికో?" అంది కమల తనతల్లి నుద్దేశించినట్లు.

"సరే. నీ చెయ్యి యివ్వు. గాంధర్వ వివాహం చేసుకుంటాను. మన్మథుడే మనకి పురోహితుడు" అన్నాడు భోజుడు.

అందుకు ప్రజ్ఞావతి ఎంతో సంతోషిస్తూ – "దేవా! ఇది దైవ లిఖితం. మేము గంధర్వులం" అంటూ తమ వృత్తాంతం అంతా చెప్పింది. అప్పుడు భోజుడు చాలా సంతోషించి కమలను గాంధర్వ వివాహం చేసుకుని, చేయి పట్టుకుని ఉద్యాన సౌధానికి తీసుకువెళ్ళి ఆమెని చూబించి ఆమె వృత్తాంత మంతా వారికి చెప్పాడు.

వారు కూడా కమలను ఎంతో సాదరంగా గౌరవించారు. లీలావతి తాను కట్టుకున్న చీర కమలదని విని విధివిలాసం గురించి ఎంతో చెప్పింది.

ఆ విధంగా భోజరాజు నలుగురు లోకైక సుందరీమణులను వివాహం చేసుకుని వైభవంగా రాజ్యాన్ని పాలించసాగాడు.

అక్కడి వరకూ చెప్పి ఆ పై కథను మణిసిద్ధుడు తరవాత మజిలీలో చెప్పసాగాడు.

# కాశీమజిలీ కథలు

## 92. వ మజిలి

### భోజుని రాజ్యపాలన

ఒకనాడు ప్రభాతవేళ భోజుడు క్రీడావనానికి వెళ్తూంటే రాజమార్గంలో ఒక పండితుడు అతనికి ఎదురుపడి – కళ్ళుమూసుకుని నడవసాగాడు. అది గమనించిన భోజుడు –

"ఓ బ్రాహ్మణుడా! చూడబోతే నువ్వు విద్వాంసుడిలా ఉన్నావు. నన్ను చూసి ఆశీర్వదింపక కళ్ళు మూసుకుని వెళ్ళిపోతావేం! ఇదెక్కడి సంప్రదాయం?" అని అడిగాడు.

అందు కా విప్రుడు "దేవా! నువ్వు విష్ణుభక్తుడివి కనక విప్రుల కపకారం చెయ్యవు. కనుక నీనుంచి భయం లేదు. నువ్వు ఎవరికీ ఏమీ యియ్యవు. కనక నీ వల్ల లాభమూ లేదు. అందువల్ల ఆశీర్వదించలేదు. నిద్ర లేస్తూనే లోభిమొహంచూస్తే ఆ వేళ ఏమీ పుట్టదంటారు. అందుకని కళ్ళుమూసుకున్నాను. లోభివాడి ధనం పిరికివాడి బలం వ్యర్థం.

మా తండ్రి వృద్ధుడై కాశీకి పోతూ – "వత్సా! నీ కెలాటి ఆపద వచ్చినా ఆడవాళ్ళనీ, చెడ్డమంత్రులు కల రాజునీ, ఆశ్రయించకు. దాతకాని వానికి దాక్షిణ్యం ఉండదు" అని లోకరీతిని చెప్పాడు.

అది అలా ఉంచు. నీ బాల్యం నాటి సుగుణాలు చక్కగా చెప్పుకుంటారు. కాని నువ్వు పట్టాభిషిక్తుడి వయ్యాక దాన గుణం ఎన్నడూ ప్రదర్శించలేదు. పండితులని ఆదరించలేదు. స్త్రీలోలుడి వైపోయావు. భూమిమీద నిలచేది కీర్తి మాత్రమే శిబి, కర్ణుడు, దధీచి మొదలయిన దాతల పేర్లే భూమిమీద నిలిచాయి" అంటూ అతనికి కర్తవ్యం బోధించాడు.

భోజుడు అతన్ని కౌగలించుకుని – "అప్రియములు, హితవు చేసేవీ మాటలు చెప్పే వారు దొరకడం దుర్లభం. మహాత్మా! మీరు నాకు హితోపదేశం చేశారు. ఇది మొదలు పండిత గోష్ఠితోనే కాలక్షేపం చేస్తాను. మీరు ప్రతిరోజూ వచ్చి యీ ఉపదేశమే చేయండి మీ పేరేమిటి? మీ నివాసమేది?" అని అడిగాడు.

తనపేరు గోవిందకవి అని రాసి చూపి తానా గ్రామవాసినే అని అతను చెప్పాడు.

భోజుడతనిని ఆ స్థానానికి తీసుకువెళ్ళి మంత్రు లందరినీ పిలిచి – "అమాత్యులారా! రాజ్యమదం కలిగించే విపరీతపు మైకంలో నే నే సుకృతమూ చేయలేదు. ఇవాళ ఈ కవి నాకు మంచి ఉపదేశం చేశాడు. నా తమ్ముడు జయంతుడు రాజ్య వ్యవహారాలు చక్క బెడుతూంటాడు నేనిక పండిత గోష్ఠిలోనే మునిగి తేలుతాను. ఇది మొదలు విద్వాంసులు, కవీంద్రులు మన ఆస్థానానికి వచ్చేటట్లు దేశమంతా చాటింపు వేయండి. మహాకవికి లక్ష,పండితుడికి అరలక్ష, సామాన్య పండితుడికి పావులక్ష, యాచకులకు వారి వారి అర్హతనుబట్టి ఇవ్వండి. లుబ్ధులు నా దివాణంలో ఉండవద్దు." అన్నాడు.

ఆ ప్రకటన పత్రికలు నాలుగు దేశాలకూ పంపారు. దాంతో ఎక్క డెక్కడి పండితులూ రాజదర్శనానికి రావడం మొదలుపెట్టారు. భోజుడికి రాజ్యాంగం విషయాలు చూడడానికి సమయం మిగలక పోయింది.

అప్పుడు బుద్ధిసాగరు డాలోచించి..అప్పటి ఆస్థాన కవులలో ప్రసిద్ధులయిన దండి, భవభూతి, శంకరులను పరీక్షకులుగా నియమించి వారు పరీక్షించి పంపిన వారినే రాజదర్శనానికి కనుమతించ సాగారు.

తన వద్దకు వచ్చే పండితులు తగ్గిపోడంతో ఒకరోజు భోజుడు వారిని – "ఆర్యులారా. మంచి విద్వాంసు డెవరూ నావద్దకు రావడం లేదేం? మన ప్రకటనలు దేశాలన్నీ వెళ్ళాయా? లేక భూమ్మీద పండితులే కరవయ్యారా?" అని అడిగాడు.

దండి, భవభూతి, శంకరులు - "దేవా. దేవరవారి దానసముద్రంలో మునిగి యాచకులు వలచబడ్డారు'' అని చమత్కరించారు. "మమ్మల్ని మించిన పండితు లెవరూ లేరు.

ఆ మాటలకు భోజుడు - "భూమండలం అంతగొడ్డు పోయిందా? వెదికి ఎవరినైనా మంచి విద్వాంసుణ్ని తీసుకురండి" అని ఆజ్ఞాపించాడు

వారు - అలాటి వాడెవరని ఆలోచిస్తూంటే - మర్నాడు దైవికంగా వారి దగ్గరకొక తేజోపురుషుడు వచ్చి రాజదర్శనం చేయించమని కోరాడు.

## కాళిదాసు కథ

విశాల నేత్రాలు, చక్కని ముఖము కలిగి దివ్య తేజస్సుతో వెలిగిపోతున్న అతనిని నిశితంగా పరిశీలించి - నువ్వేపాటి చదువుకున్నావు? రాజదర్శనం ఎందుకు కోరుతున్నావు? కవిత్వం ఏమైనా చెప్పగలవా?" అని అడిగితే వారి కతను -

"నే నేమీ పెద్దగా చదువుకోలేదు. ఆయనపై శ్లోకం రచించాను" అంటూ - 'ఓ భోజుడా! నీ కీర్తి ఎముకలా, కొంగలా, మజ్జిగలా, తెల్లకుక్కలా, సన్యాసిదంతాల్లా ప్రకాశిస్తూంది ' అని అర్థమొచ్చే

శ్లో॥ అస్తి వద్ధుకవచ్చైవ చల్లవ ద్వెల్లకుక్కవత్
రాజతే భోజ తే కీర్తిః పున స్సన్యాసి దంతవత్.

శ్లోకం చదివాడు. వాళ్ళు పకపకా నవ్వుతూ - 'ఇదీ మంచిదే. ఇంతకన్న మంచి పండితుడు లేడని చెప్పొచ్చు' అనుకుంటూ అతన్ని రాజసభకి తీసుకుపోయి పైకి కనిపించని పరిహాసంతో అతన్ని పొగిడారు రాజు నిజమే అనుకుని అతనికి దర్శన మిచ్చాడు. అప్పుడు అతను అద్భుతమైన

శ్లో॥ మహారాజ శ్రీమాన్ జగతి యశసా తే ధవళితే
పయః పారావారం పరమ పురుషోయం మృగయతే
కపర్దీ కైలాసం కరివర భౌమం కులిశభృత్
కహా నాథం రాహుః కమల భవనో హంస మధునా.

శ్లోకం చదవగా తూర్పునుంచి దక్షిణానికి తిరిగాడు. అతను మళ్ళీ భోజుడి కీర్తిని ప్రశంసించే మరో అద్భుతశ్లోకం

శ్లో॥ నీరక్షీరే గృహిత్వా నిఖిల ఖగతతీ ర్యాతి నాళీక జన్మా
రర్వా నుత్తుంగ శైలాన్ దహతి పశుపతిః ఫాలనేత్రేణ పశ్యన్
తక్రం ధృత్వాతు సర్వా నటతి జలనిధిన్ చక్రపాణి ర్ముకుందః
వ్యాప్తా త్వ త్కీర్తి కాంతా త్రిజగతి నృపతే భోజరాజ క్షితీంద్ర.

చదివాడు. అలాగ భోజుణ్ని ముగ్ధుణ్ని చేసే శ్లోకాలు చదివాక – పశ్చిమముఖంగా ఉన్న భోజుడుని మెప్పించేందుకు నారదుడికీ గొల్లవాడికీ జరిగిన సంవాదంలో

శ్లో॥ స్వర్గా ద్గోపాల కుత్రవ్రజసి సురమునేధ భూతలే కామధేనో
ర్వత్స స్యానేతు కామ స్తృణచయ మధునాముగ్ధ దుగ్ధ నతుస్యాః
శ్రుత్వాశ్రీభోజరాజ ప్రచుర వితరణం వ్రీడశుష్క స్తనీ స్మాత్
వ్యర్థో హిస్యా త్ప్రయాస స్తదపి తరిభిశ్చర్విితం సర్వ ముర్వ్యాం.

– భోజుడి శత్రువులందరూ గడ్డికరవడంతో కామధేనువుకి గడ్డిపరక మిగల్లేదనే అర్థం వొచ్చే శ్లోకం చదివాడు

శ్లో॥ విద్వద్రాజ శిఖామణే తులయితుం ధాతా దత్వదీయం యశః
కైలాసం చ నిరీక్ష్య తత్ర లఘుతాం నిక్షిప్తవాన్ పూర్తయే
ఉక్షాణం తదుపర్యుమా సహచరం తన్మూర్ధ్ని గంగాధురం
తస్యాగ్రే ఫణిపుంగవం తదుపరి స్ఫారం సుధాదీధితిమ్.

"భోజరాజా. నీ కీర్తిని తూచాలని త్రాసులో ఒకవేపు వేసి, రెండోవేపు కైలాసాన్నీ, వృషభాన్నీ, శంకరుణ్నీ, గంగనీ, చంద్రుణ్నీ ఎన్నివేసినా బరువు చాలలేదు. అందుకే అవన్నీ పైన ఉన్నాయి" అనే అర్థం వొచ్చే అద్భుత శ్లోకాన్నీ చదివేసరికి భోజుడు సంతోషం పట్టలేక

అతని పాదాలకు నమస్కరించి "నీకు రాజ్యమంతా యిచ్చేస్తున్నాను. పాలించుకో. నేను అడవికి పోతాను" అన్నాడు.

అందుకా పండితుడు వినయంగా – "నేను రాజ్యాని కాశపడి నీ వద్దకు రాలేదు. ఆ సామర్థ్యం నాకులేదు. నాపై నీ దయచాలు." అన్నాడు.

రాజు చేసిన ప్రమాదానికి భయపడిన బుద్ధిసాగరుడు పండితుడి చేత రాజ్యాన్ని మళ్ళీ భోజుడికి ధారపోయించాడు.

"కవీంద్రా! నీ పేరేమిటి? ఎక్కడినుంచి వచ్చావు? ఇకనుంచి నువ్వు నా ఆస్థానకవిగా ఉండి కావలసినంత ధనం తీసుకో" అన్నాడు భోజరాజు.

ఆ కవి తనపేరు – "కాళిదాసు" అని రాసి చూపించాడు.

అప్పుడు దండి, భవభూతి, శంకరులు – "ఇతనీ శ్లోకాలు రచించాడని మీరు చాలా సంతోషిస్తున్నారు. కొత్త పండితుణ్ని తీసుకు రమ్మన్నారని, యితని కీ శ్లోకాలు మేమే రచించి యిచ్చి మీ వద్ద చదవమన్నాం. అతను వాటిని చదివాడు. అంతే తప్ప ఇతనికి కవిత్వం చెప్పే విద్యరాదు. వట్టి పిచ్చివాడు. కావాలంటే పరీక్షించండి. మేం సరదాగా ఇతను గొప్పవాడని చెప్పాం" అంటూ ఏకసంతగ్రాహి దండి, ద్విసంతగ్రాహి భవభూతి, త్రిసంతగ్రాహి శంకరుడు ఆ శ్లోకాలను చదివి వినిపించారు.

"ఈ విషయం రేపు చూస్తాను." అని భోజుడు సభను చాలించి వెళ్ళిపోయాడు.

ముగ్గురు కవులూ కాళిదాసుతో వెళ్ళి – "మాతో ఒకటి చెప్పి అక్కడ వేరొక రకంగా స్తుతి చేశావే! నిజం చెప్పు. ఈ శ్లోకాలు నీ కెవరు రచించి ఇచ్చారు?" అని అడిగారు.

అతను సమాధానం చెప్పక వెర్రివాడిలా ఓ నవ్వు నవ్వాడు.

"సరే, నువ్వు మేం చెప్పినట్లు వింటే మళ్ళీ నిన్ను సభకు తీసుకుపోయి విలువైన కానుకలిప్పిస్తాం. రాజుగారు మామాట కాదని గుడ్డి గవ్వయినా ఇవ్వడు సుమీ! మరి నువ్వు అలా చెబుతావా?"

కాళిదాసు తన అంగీకారం సూచించాడు  మన్నాడు సభలో – "దేవా! ఆ శ్లోకాలు మేము రాసిచ్చినవి కావేమో అడగండి" అన్నారు వారు.

"ఆ విషయం తరవాత చూస్తాను. ఇప్పుడు నేనొక సమస్య ఇస్తాను. పూరించండి  మీ ప్రజ్ఞ చూస్తాను." అంటూ 'అప్రతిపత్తి మూఢ మనసా ద్విత్రాస్థి స్సతా నాడికాః' శ్లోకపాదం యిచ్చాడు  వాళ్ళ ముగ్గురికీ అది అసలు అర్థమేకాక తెల్లమొహం వేశారు.

భోజుడు సంధించిన సమస్యను కాళిదాసు అలవోకగా ఇలా పూరించాడు.

శ్లో॥ స్నాతా తిష్ఠతి కుంతలేశ్వరసుతా వారాంగరాజస్వసుః
ద్యూతే రాత్రి రియం జితా కమలయా దేవీ ప్రహద్యాధునా
ఇత్యంతః పుర సుందరీ జనగుణే మ్యానాధికం ద్యాయతా
దేవేనా ప్రతిపత్తి మూఢ మనసా ద్విత్రాస్థి స్సతా నాడికాః

భోజుడు సంధించిన సమస్యను కాళిదాసు అలవోకగా ఇలా పూరించాడు.

శ్లో॥ స్నాతా తిష్ఠతి కుంతలేశ్వరసుతా వారాంగరాజస్వసుః
ద్యూతే రాత్రి రియం జితా కమలయా దేవీ ప్రహద్యాధునా
ఇత్యంతః పుర సుందరీ జనగుణే మ్యానాధికం ద్యాయతా
దేవేనా ప్రతిపత్తి మూఢ మనసా ద్విత్రాస్థి స్సతా నాడికాః

భోజుడు సంధించిన సమస్యను కాళిదాసు అలవోకగా ఇలా పూరించాడు.

శ్లో॥ స్నాతా తిష్ఠతి కుంతలేశ్వరసుతా వారాంగరాజస్వసుః
ద్యూతే రాత్రి రియం జితా కమలయా దేవీ ప్రహద్యాధునా
ఇత్యంతః పుర సుందరీ జనగుణే మ్యానాధికం ద్యాయతా
దేవేనా ప్రతిపత్తి మూఢ మనసా ద్విత్రాస్థి స్సతా నాడికాః

"మూడవభార్య పద్మావతి రుతుస్నానం చేసింది. అదేరోజు రెండవ భార్య చంద్రముఖింటికి వెళ్ళవలసిన రాత్రి. కమలతో జూదమాడి

ఓడిపోడం వల్ల ఆ రాత్రి ఆమెతో గడపాలి. దైవజ్ఞులచే ముహూర్తం నిర్ణయించుకుని ఆ రాత్రి రమ్మని కబురు పంపింది. ఇలాగ ఒకేరాత్రి నలుగురి భార్యల దగ్గరకీ వెళ్ళవలసి రావడంతో ఏం చేయాలో తోచక రెండు గడియలు ఆలోచించి – భోజుడు ఎవరింటికీ వెళ్ళక తన ఇంట్లోనే పడుకుని నిద్రపోయాడు." అని కాళిదాసు పూరించడంతో భోజుడు ఆశ్చర్య, ఆనందాలతో అతన్ని కౌగలించుకుని – "ఇది మొదలు నువ్వు నాకు గురువ్వి, సఖుడివి, మంత్రివి, పండితుడివి, కవివి అన్నీ అయి నా ఆస్థానం అలంకరించి ఉండాలి. నేనూ, నా రాజ్యం నీవి. నీలాటి పండితుడు భూమ్మీద లేడు. ఉండడు. దండి, భవభూతి, శంకరులు నువ్వు రచించిన శ్లోకాలను వారే రచించినట్లు బొంకారు. వారికి నీ సమర్థత తెలియదు" అన్నాడు, అనేక విధాల స్తుతిస్తూ.

ముగ్గురు కవులూ, కాళిదాసు కవితాధోరణికి సిగ్గుపడి తలలు వంచుకుని అసూయతో సభలోంచి అవతలికి పోయారు.

కాళిదాసు భోజుడి కత్యంత ఆప్తుడై రాజదర్శనానికి తన నాశ్రయించే యాచకులకి కానుకలిప్పిస్తుండేవాడు. అతనికి భార్య, పిల్లలు లేరు కనుక విలాసవతి అనే వేశ్య ఇంట్లో ఉండేవాడు.

ఒకరోజు అతను నిద్రలేచేనరికి కుంభుడనేవాడు పాదాలొత్తుతూంటే – "నువ్వెవరివి? ఏం కావాలి?" అని అడిగాడు.

"అయ్యా! నే నతి దరిద్రుడిని. పదిమంది పిల్ల లున్నారు. విద్య ఏమీరాదు. వంటచేసీ, నీళ్ళు మోసీ బతుకుతున్నాను. అయినా కుటుంబ పోషణ జరగడం లేదు. ఒక మిత్రుడు మీ పేరు చెప్పి నిన్నాశ్రయించ మన్నాడు. మీ ఔదార్యం గురించి ఎంతగానో చెప్పుకుంటున్నారు. మీరు ఉపకారం చెయ్యకపోతే పిల్లలతో కూడా బలవన్మరణమే గతి" అని మొరపెట్టుకున్నాడు.

కాళిదాసు – "నీ దీనాలాపాలు వింటే జాలేస్తూంది. కాని కవిత్వం చెప్పే విద్వాంసుడికి కాని రాజు దర్శనమివ్వడు – సరే. నీ అదృష్టం ఎలా ఉందో? నాకు తోచిన సాయం చేస్తాను" అని విలాసవతికి

చెప్పి మంచి బట్టలు యిప్పించి – "బజారులో ఏవైనా పళ్ళు కొనితెమ్మ"ని రెండు కాసు లిచ్చాడు. అతను చెరకు ముక్కలు తేవడం చూసి – "రాజదర్శనాని కిలాటివి ఎవరూ తీసుకు పోలేదు. సరే ఈ చావడిలో కూర్చో. నేను పిలిచినప్పుడురా" అన్నాడు

చాలాసేపటివరకూ అతణ్ణి పిలిచే అవకాశం దొరకలేదు. అప్పుడు కాళిదాసు – "దేవా! ఇవాళ ఒక మహావిద్వాంసుడు మీ దర్శనం కోసం వచ్చాడు. అలాటి పండితుణ్ని నేనింతవరకూ చూడలేదు. అతను సంవత్సరంనుంచీ మౌనవ్రతం పూనాడు" అనగా అతన్ని వెంటనే పిలిపించ మన్నాడు భోజుడు.

అక్కడ చావడిలో కుంభుడు ఎక్కువ సేపు కూర్చోలేక చెరకు ముక్కల కట్టమీద తలపెట్టుకుని పడుకున్నాడు. అక్కడ తిరిగే వాళ్ళెవరో సగం కాలిన కట్టెలను మూటకట్టి అతని తలకింద పెట్టి ఆ చెరకు ముక్కలు తీసుకుపోయారు.

అది గమనించకుండా – ద్వారపాలకులు పిలిచే సరికి కళ్ళు నులుముకుంటూ కుంభుడు కంగారుగా సభలోకి వెళ్ళాడు. రాజు అతన్ని కూర్చోమని సంజ్ఞచేయగా అతను తాను తెచ్చిన మూటవిప్పి కాలిన చితుకులను బల్లమీద ఉంచాడు. అవి ఎలా వచ్చాయో తెలియక యిక తన పని పడతారని కుంభుడు భయపడసాగాడు.

భోజరాజు – "కాళిదాసా! ఈ పండితుడు బొగ్గులు తెచ్చాడు. ఇదెక్కడి ఆచారం?" అని అడిగాడు

"మహాకవుల కల్పనలు సులభంగా అర్థంకావుకదా.." అంటూ –

శ్లో॥ దగ్ధం ఖాండవ మర్జునేనతు వృథా దివ్యద్రుమైః ర్భూషితం
దగ్ధా వాయుసుతేన హేమరచితా లంకా వృథా స్వర్గభూః
దగ్ధ సర్వసుఖాదస్పదశ్చ మదనో హా! హా! వృథా శంభువా
దారిద్ర్యం జనతాపకం భువి పునః కేనాపినో దహ్యతే.

"అర్జునుడు ఖాండవవనాన్నీ, హనుమంతుడు లంకనీ, శంకరుడు మన్మధుణ్నీ కాల్చారు. కాని జనులందరినీ పీడించే దరిద్రదేవత నెవరూ కాల్చలేక పోయారు. కనుక దేవా! నువ్వు నా దారిద్ర్యాన్ని ఈ కట్టెలతో కాల్చెయ్యి - అని చెప్పడానికి ఇలాటి కట్టెలు తెచ్చాడు." అన్నాడు.

"అతని ఉద్దేశం ఏమయినాకానీ నీ సమర్థన మాత్రం అత్యద్భుతం" అంటూ భోజుడా శ్లోకానికి అక్షర లక్షలు కానుకగా యిచ్చాడు. కాళిదాసు ఆ సొమ్ముని కుంభుడి కిచ్చి - "నువ్వు బొగ్గు లెందుకు తెచ్చావు? సమయానికి ఆ యుక్తి తట్టకపోతే చాలా అవమానం వచ్చేది. సరేలే. పోయి నీ కుటుంబంతో సుఖంగా జీవించు" అని అతన్ని పంపివేశాడు.

అలాగ ఎందరికో ఉపకారాలు చేస్తూ కాళిదాసు భోజుని కంటె ఎక్కువ ప్రసిద్ధి చెందాడు.

మణిసిద్ధుడు మజిలీకి వేళవడంతో అక్కడకా కథ అపాడు.

# కాశీమజిలీ కథలు

## 93. వ మజిలీ

### యజ్ఞశర్మ కథ

"ఈ పేదరికం నేను ఎంతమాత్రం భరించలేను. మీ తోటి వారందరూ రాజదర్శనం చేసుకుని మేడలూ, మిద్దెలూ కట్టుకుని సుఖంగా ఉంటూంటే విద్య ఉండి కూడా పండిత సభకు పోవడానికి మీ కింత పిరికితన మేమిటి? ఈ వూళ్ళో పేదరికం అనుభవించే బ్రాహ్మణులే లేరు. మీరు ఇవాళ సభకు వెళ్ళి రాజుగారిని దర్శించుకుంటే అన్నం ఉంటుంది. లేకపోతే ఉపవాసమే ఎంత ప్రయత్నించినా నూకలు కూడా బదులు దొరకలేదు-" అంది సోమిదేవి తన భర్తతో.

"రాజద్రవ్యం పాపవిత్తం. అస్థిరమయిన శరీరాన్ని పోషించుకుందుకు పాపం చేయలేను. ఇన్ని రోజులు గట్టెక్కించిన దేముడు తరవాత మాత్రం ఎందుకొదిలేస్తాడు సర్వధర్మాలు తెలిసిన నా మనస్సు అకార్యం చేయడానికి అంగీకరించడం లేదు. రాజు వద్దకు పొమ్మని నన్ను వేధించకు" అన్నాడు యజ్ఞశర్మ.

"ఔనౌను. ప్రతిరోజూ నేను ఎన్నో చిక్కులు పడి యిల్లు గడుపుతూంటే - భగవంతుడు గడుపుతున్నా డంటారా! మన రాజు దగ్గర ద్రవ్యం తీసుకోని దెవరు? ఇలాటి వేదాంతులు పెళ్ళి - పిల్లలూ తలపెట్టకూడదు. భార్యా పుత్రులను పోషించలేని వాడు మహాపాపి అని శాస్త్రంలో ఉంది. నేను ఇలాగే పడుకుంటాను. మీ దైవం ఎలా తెస్తాడో చూస్తాను" అని ఆమె పడుకుండిపోయింది అతను చాలా పరితపిస్తూ - "ఓసి నిర్భాగ్యురాలా! రాక్షసిలా పీడిస్తున్నావు కదే. ఆ పెట్టెలో శాలువా ఉంది. ఇటివ్వు." అని దాన్ని తీసుకున్నాడు. ఎన్ని మడతలు పెట్టినా

దానితూట్లు కప్పబడ్డాయి కావు. అలాగే ఆ శాలువాను కప్పుకుని అతను ఆస్థానానికి వెళ్ళాడు.

ద్వారపాలకులు అతన్ని చూసి నవ్వుతూ రాజువద్దకు తీసుకుపోయారు. భోజు డతన్ని చూసి ఆశ్చర్యంతో నమస్కరిస్తూ అతనిని వివరా లడిగాడు.

"దేవా! నా కాపురం ఈ పురమే. నేను దరిద్రుడినే. కాని శాస్త్రవిద్యలన్నీ పూర్తిచేశాను. అగ్ని ష్టోమంచేశాను. అగ్నిగృహం ఆశ్రయించుకోడం తప్ప వేరొక వృత్తి లేదు. "అనగానే భోజుడు చెవులు మూసుకుని – "మా వూళ్ళో దారిద్ర్యపీడితుడైన బ్రాహ్మణుడు ఉన్నాడంటే మాకు అపఖ్యాతి కాదా! ఇన్నాళ్ళూ నా దగ్గర కెందుకు రాలేదు?" అంటూ కోశాధికారిని పిలిచి ఆ బ్రాహ్మణుడు కోరినంత ధనమిమ్మన్నాడు.

అప్పుడా తపస్వి – "దేవా! నేనిన్నాళ్ళు తమ వద్దకు రాక పోడానికి కారణం ఇదే. మీ కష్టార్జిత మేమయినా ఉంటే ఇవ్వండి! ఇతరమైనది నేను భరించలేను. కొంచెమయినా ఫరవాలేదు" అని ప్రార్థించాడు.

భోజుడు కొంచెం ఆలోచించి – "అయ్యా! నన్ను పరీక్షించడానికి ఇలా అన్నావేమో! నా దగ్గర కష్టార్జిత మేమీ లేదు. రాజ్యంనాది కదా దానిలోని ధనం నాది కాదా? ఊరికే నన్ను బాధించకుండా కావలసినంత ద్రవ్యం తీసుకుపో" అన్నాడు.

"రాజా! నేను ఉపవాసాలేనా చేస్తాను కాని పాపద్రవ్యం తీసుకోలేను. అలాటి కష్టార్జితం లేకుంటే, అనుమతివ్వండి. నేను వెనుతిరిగి పోతాను. మరొకప్పుడు సత్కరిద్దురుగాని "

భోజుడు నివ్వెరపోయాడు. "ఇంతవరకూ ఏ పండితుడూ ఖాళీ చేతులతో వెళ్ళిపోలేదు. ఇతను అతి దరిద్రుడైనా కష్టార్జితం కానిది వద్దని పోతున్నాడు. నా దగ్గర కష్టార్జిత మేముంది? ఇతని దరిద్రాన్ని ఎలా పోగొట్టగలను?' అని ఆలోచించి –

"ఆర్యా! రే పీపాటి వేళకు దయచేయండి. ఏదేనా చూసి ఇస్తాను" అన్నాడు.

పొద్దు కుంకగానే రహస్య మార్గంలో కోట దాటి కూలివాని వేషంలో సమ్మెట కొట్టేపని కంగీకరించాడు. చేతకాని పనికి లోహకారకుడిచే చివాట్లు తింటూ సూర్యోదయం వరకూ పనిచేసి పదహారు రాగి డబ్బులు సంపాదించాడు. చేతులు బొబ్బలెక్కి రక్తాలు కారుతూండగా – 'కూలివాళ్ళు కొంచెం డబ్బుకోసం కూడా ఎంత కష్టపడతారు! ఆ విప్రుడి దరిద్రం యీ స్వల్పధనంతో ఎలా తీరుతుంది? ఒక రాత్రికే నా పని సరయిపోయింది. ఇంతకంటె నాతరం కాదని చెప్పవలసి వస్తూంది!' అనుకుంటూ రహస్యంగా యింటికి చేరుకున్నాడు. జపమందిరంలో కూర్చుని ఎదురు చూస్తూండగా ఆ విప్రుడు రానే వచ్చాడు.

అతనికి తన రెండు చేతులూ చూబించి – "మహాత్మా! నన్ను ఇలా బాధపెట్టడానికే అలా కోరావు. రాత్రంతా సమ్మెట బాదితే పదహారు డబ్బులిచ్చారు. ఇంత స్వల్ప ద్రవ్యం మీ కివ్వడానికి సిగ్గేస్తూంది. ఇది మీకు ఒక పూటకయినా చాలదు. ఈ నియమం వదలి రాజకీయ ద్రవ్యం తీసుకుపొండి. నన్ను ఆశ్రయించి కూడా దరిద్రంతో పీడించబడు తున్నారంటే నా మనసు చాలా పరితపిస్తూంది" అని భోజుడు వేడుకున్నాడు.

"దేవా! నా జీవితం సగం గడిచిపోయింది. ఇంతవరకూ పాపపుసొమ్ము తీసుకోలేదు. భార్యాపుత్రుల ఇబ్బంది వల్ల ఇందుకు సిద్ధపడవలసి వచ్చింది. ఇదే నాకు పదివేలు. ఈ పాడు పొట్టకోసం మిమ్మల్ని ఎంత కష్టపెట్టాను! నా పాపం ఇంతా అంతాకాదు. అయ్యో! మీరు నాకోసం రాత్రంతా ఎంత కష్టపడ్డారో. మీ ఔదార్యం మెచ్చదగినది. దీనివల్ల మీకు చాలాపుణ్యం, నాకు చాలాపాపం" అని విచారిస్తున్న అతనికి భోజుడు సాష్టాంగ నమస్కారం చేశాడు.

యజ్ఞశర్మ ఆ రొక్కం పట్టుకుని ఇంటికి వెళ్ళిపోయాడు.

సోమిదేవి ఎదురొచ్చి- “ఏనుగులా? గుఱ్ఱాలా? వేటిమీద ద్రవ్యం తెస్తున్నారు?” అని అడగగా – “అ పాడుద్రవ్యం నేను భరించలేను. రాజు తన కష్టార్జితమైన రొక్కం ఇచ్చాడు చూడు ఇదుగో” అంటూ అతనా డబ్బులు ఆమె చేతిలో పెట్టాడు. ఆమె వాటిని కోపంతో అగ్నిహోత్రంలో పారేసి రాజునీ, అతన్నీ కూడా నిందించింది.

“ఛో! నేను ఇంతకంటె సంపాదించ లేను. చెడుదానం పట్టి యముని సమ్మెట పోటులు పడలేను. నాకు అగ్నిదేవతే శరణ్యం” అంటూ అతను అగ్నికుండాన్ని సరిచేశాడు.

దానిలో, సోమిదేవిచే పడవేయబడిన రాగిడబ్బులు బంగారు నాణాల్లా మెరుస్తూంటే వాటిని పట్టుకుని చూసి లెక్కించి ‘ ఈ బంగారు ముద్రల నెవరు వేశారు? భోజుడిచ్చిన డబ్బులిలా అయ్యాయా! ఆ మహారాజు నా కోసం కూలిపని చేసి సంపాదించి తెచ్చిన విత్తం ఊరికే పోతుందా? ద్రవ్యశుద్ధి..” అనుకుంటూ భార్యని పిలిచి “ఇవేమిటి? చెప్పుకో..” అన్నాడు.

“భోజుడు మీకిస్తే దాచి తెచ్చారు కాబోలు. మీ చేతిలో పడికూడా బంగారంగానే ఉన్నాయే!” అని పరిహసించింది.

“దానానికి ద్రవ్యశుద్ధీ పాత్రశుద్ధీ కలిగితే అణువైనా బంగార మౌతుంది.” అని అతనెంత చెప్పినా వినక – “ఎలా అయితే ఏం? కొన్నాళ్ళు గడిచిపోతాయి” అందామె.

మర్నాడు అవసరం పడి ఒక నాణాన్ని అమ్మినా, మళ్ళీ లెక్కచూస్తే మునపటిలాగే ఉన్నాయి! అప్పుడు సోమిదేవి – “మీరన్నది నిజమే. నిన్న వీటిలో ఒకదానిని అమ్మినా మళ్ళీ అన్నీ ఉన్నాయి. ఇవి అక్షయాలు కాబోలు” అంది.

వాళ్ళు ఆనాణాల బంగారం అమ్ముతూ మేడలుకట్టి, భూములు కొని తోటలు వేసి మహా వైభవంగా జీవించసాగారు.

ఒకనాడు భోజుడు ఆదారిన వెళ్తూ ఆ మేడలను చూసి ఎవరివని అడగ్గా – యజ్ఞశర్మ అనే బ్రాహ్మణుడి వన్నారు భోజునికి

పేదవాడైన యజ్ఞశర్మ గుర్తుకు వచ్చి, 'అతను కడుపేదవాడే ఇంత భాగ్యం ఎలా కలిగింది?

అతను చాలా ధనవంతుడై ఉండే అబద్ధమాడి తనచేత నిష్కారణంగా ఆ రాత్రంతా కూలిపనిచేయించాడా?' అనుకుంటూ అతన్ని పిలిపించాడు. అతను తనముందుకు రాగానే "ఈ సంపదంతా నీకెక్కడిది?" అని అడిగాడు.

"దేవరవారు దానంచేసిన ద్రవ్యం వల్ల వచ్చిందే. ద్రవ్యశుద్ధి, పాత్రశుద్ధి కలసి అక్షయమయ్యాయి" అన్నాడు.

భోజుడు నమ్మకపోడంతో లోపలికి తీసుకుపోయి అగ్నికుండంలోని బంగారు నాణాలను చూపించి, వాటిని ఖండించినా ఎప్పటిలాగే అన్నే ఉండడం నిరూపించాడు. భోజుడు మరింత ఆశ్చర్యపోయాడు. "ఆహా. దానానికి ద్రవ్యశుద్ధి కావలసి ఉంది. నేను లక్షలకొద్దీ దానం చేస్తున్నా దానిపలమంతా యీ డబ్బుల పలానికి సరిపడదు. పాత్రశుద్ధి కూడా అలాటిదే" అని ఆ విప్రుడి ఇంటి నుంచి బయలుదేరి తోవలో ఉన్న ఒక శివాలయంలోకి వెళ్ళాడు. అక్కడ - పక్కనున్న మంటపంలో ఒక యోగిని పిల్లవాణ్ని ముద్దాడుతూంది!.

## దుర్గ కథ

భోజుడు ఆదృశ్యాన్ని ఆశ్చర్యంగా చూసి - ఈ యోగిని సర్వసంగ పరిత్యాగిని అయినా ఈ బాలుణ్ని ఎందుకు ప్రేమగా ముద్దాడుతూంది? బ్రహ్మచారిణికి పుత్రుడెలా జన్మించాడు?' అనుకుంటూ ఆమెకు దగ్గరగా వెళ్ళి - "దేవీ! నీకీ బాలుడు ఏమౌతాడు?" అని అడిగాడు.

ఆమె - "దేవా! నాకీ బాలుడు సోదరుడు, మేనల్లుడు, మామకొడుకు, మనవడు, పినతండ్రి, మరది ఔతాడు" అంది.

భోజుడు ఆశ్చర్యపోయి - "ఇన్ని వరస లెలా కలిగాయో చెప్పు." అన్నాడు.

"నేను చెప్పలేను రాజా. దైవమే చెప్పాలి" అందామె.

బోజుడు మర్నాడు సభలో పండితులముందు ఆ వావివరుసలన్నీ వొచ్చేలా శ్లోకపాదం

చదివి - మిగిలిన పాదాలు పూరించమన్నాడు.

పండితు లందరూ దిక్కులు చూస్తూంటే - కాళిదాసు యిలా అర్థమొచ్చేలా పూరించాడు

శ్లో॥ జారోత్పన్నో విసృష్టో తనయ దుహిత రోదంపతీ దైవయోగాత్
యోగినాగహిన్ తాసా తదను గమన శాద్యోగినీత్వం ప్రపేదే
పశ్చా ద్భార్యా కృతాంబా జనితమధ శిశుంలాలయంత్య బ్రవీత్సా
భ్రాతః భ్రాతృవ్య పౌత్రశ్వశురర సుత పితృ వ్యేతితం దేవరేతి.

ఒక వూరిలో దుర్గ అనే స్త్రీ ఉంది అమె చిన్నతనంలోనే జారిణి అయి భర్తని వదలి మరొక గ్రామం పోయి, మిండగానితో కాపరం చేస్తూంటే ఆమెకు ఒక కొడుకు పుట్టాడు.

వాడిని పెంచితే తన యౌవనానికి భంగం కలుగుతుందని వాడిని అనాధగా వదలి మరోవూరు పోయి మరొకడితో కాపురం చేసింది అప్పుడామెకు ఒక ఆడపిల్ల పుట్టింది. ఆ పాపనక్కడవదలి, ఇంకో పట్నం చేరి వేశ్యలతో కలసి ఆ వృత్తిలోనే జీవించసాగింది

దాని కొడుకు నొకరూ కూతురి నింకొకరూ పెంచుకుని వావివరుసలు తెలియక వారిద్దరికీ వివాహం చేశారు ఒకనాడు త్రికాలవేది అయిన ఒక యోగిని వారి గ్రామానికి రాగా వారి తల్లితండ్రులు ఆ వధూవరుల అదృష్టం ఎలా ఉందో చెప్పమని వారిని చూపించి అడిగారు.

"ఛీ! ఛీ ఈ జంట వివాహానికి తగిందికాదు. వీళ్ళు అన్నాచెల్లెళ్ళు " అంటూ వారిపుట్టుక వెనుక కథ చెప్పింది.

ఆ కథవిని - ఆ బాలిక వివేకంతో అప్పుడే సన్యసించి కాషాయ వస్త్రం దరించి కపర్ది అని పేరు పెట్టుకుని ఆ యోగిని తోన్నే తిరగసాగింది.

దుర్గ కొడుకు దుర్వ్యసనాలపాలై యౌవన గర్వంలో కన్నుకానకుండా తిరుగుతూ, ఒకచోట వేశ్య అయిన తల్లితోనే సుఖించాడు. ఆమెకు అతనివలన మగశిశువు జన్మించాడు.

దుర్గ – మునపటిలాగే ఆ శిశువును వీధిలో పారేయించింది. ఏడుస్తున్న ఆ డింభకుణ్ని ఉప్పరివాళ్ళు కావడిలో పెట్టుకుని ఎక్కడికో పోతుంటే – దైవికంగా యోగిని కపర్ది ఆ బాలుణ్ని చూసి – దివ్యదృష్టితో అంతా గ్రహించి వాడిని తొడమీద పెట్టుకుని ముద్దులాడింది జాగ్రత్తగా ఆలోచిస్తే ఆ బాలుడితో ఆమెకు అన్ని వావులూ (వరసలూ) ఉన్నాయి.

తనతల్లి (దుర్గ) కొడుకే కనుక – సోదరుడు.

తన అన్నకొడుకు కనుక – మేనల్లుడు.

భర్తకు భార్య కనుక తనకు సవతి.

సవతి కొడుకు కనుక – తనకొడుకు. వాడికొడు కవడంవల్ల –పౌత్రుడు.

భర్తకి తల్లి అయిన తన తల్లి – తనకి అత్త అయింది.

అత్త మగనికి తమ్ముడు కనుక – మామ.

తన భర్త కొడు కవడం వల్ల – పుత్రుడు. తనతల్లి మగని తమ్ముడు కనక – పినతండ్రి మగని తమ్ముడవడం వల్ల – మరిది.

ఇంత కథనీ మూడు పాదాలలో ఇమిడ్చి చెప్పిన కాళిదాసు కవితా వైచిత్ర్యం ఎంతో చెప్పడానికి ఎవరికీ శక్యం కాదని పొగుడుతూ భోజుడు అతన్ని పల్లకీ ఎక్కించి ఊరేగించాడు.

గోపాలా. భోజుడు అలాగ కాళిదాసు మొదలైన తొమ్మిదిమంది మహాకవులతో విద్యాగోష్ఠి చేస్తూ మహా వైభవంగా చాలాకాలం రాజ్యం చేశాడు.

మన మజిలీకి వేళవుతూంది. బయలు దేరదామా?" అని మణిసిద్ధుడు లేచాడు.

(6వ భాగం సమాప్తం)

